శ్రీరస్తు.

# విషయసూచిక.

## సంజ్ఞాధ్యాయము. 1



## గ్రహయోనిభేదాధ్యాయము. 2

## వియోనిజన్మాధ్యాయము. 3



## విషేకాధ్యాయము. 4

## జననకాలలక్షణాధ్యాయము. 5



## బాలారిష్టాధ్యాయము. 6.



## ఆయుర్దాయాధ్యాయము 7.

## అష్టకవర్గాధ్యాయము. 9.



## కర్మజీవాధ్యాయము. 10.

విషయసూచిక.

## ప్రవ్రజ్యాయోగాధ్యాయము. 15.



## ఋక్షశీలాధ్యాయము. 16.



## రాశిశీలాధ్యాయము. 17.



## దృష్టిఫలాధ్యాయము. 18.

## భావఫలాధ్యాయము. 19.



## ఆశ్రియోగాధ్యాయము. 20.



## ప్రకీర్ణాధ్యాయము. 21



## అరిష్టాధ్యాయము. 22.



## స్త్రీజాతకాధ్యాయము. 23.

నైర్యాణికాధ్యాయము. 24.



నష్టజాతకాధ్యాయము 25



ద్రేక్కాణాధ్యాయము. 26.



ఉపసంహారాధ్యాయము. 27.



విషయసూచిక - సంపూర్ణము.





శ్రీవేణుగోపాల కృష్ణ పరబ్రహ్మణేనమః.

# బృహజ్జాతకము

## సాంధ్రతాత్పర్యము.

### సంజ్ఞాధ్యాయము:—1.

శ్లో. మూర్తిత్వే పరికల్పిత శ్శశిభృతో వర్త్మా పునర్జన్మనా
మాత్మే త్యాత్మవిదాం క్రతుశ్చ యజతాం భర్తామరజ్యోతిషామ్
లోకానాం ప్రళయోద్భవస్థితివిభుశ్చా నేకధాయశ్శ్రుతౌ
వాచంనస్సద దాత్వనేక కిరణ స్త్రైలోక్యదీపోరవిః. 1

తా. శ్రీమత్సూర్యాంశ సంభూతుండగు వరాహ మిహిరాచార్యుఁడు ప్రపంచంబున హోరాశాస్త్రంబును వెల్లడింపబూని తద్గ్రంథమునకు బృహజ్జాతకమను నామమిడి ప్రారంభించునట్టి దానికెట్టి భంగమును గల్గకుండునట్లు ముల్లోకముల ప్రకాశమానుఁడగు సూర్యుని "మూర్తిత్వే" అను శ్లోకముచేత నాదియందు బ్రార్థించుచున్నాడు. మూర్తిత్వే అను శ్లోకమువలన శివుని యష్టమూర్తులయందు బ్రథమమూర్తియైయొప్పువాఁడును. పునర్జన్మంబు లేకుండంగోరి పోవువారికి మార్గంబై యుండువాఁడును, ఆత్మవేత్తలగు యోగీశ్వరులకు సచ్చిదానందరూపుడు. ఆత్మయునై యొప్పువాడును, ఉదితహోమములగు సోమయాజులకు యజ్ఞస్వరూపుండగు వాడును, అనేక కిరణములచే ముల్లోకములను బ్రకాశింపజేయుచు దేవగ్రహ నక్షత్రంబుల ప్రభువైన వాడును భూర్భువాది లోకముల నాశోత్పత్తి స్థితులకు కర్తయైనవాఁడును, వేదములం దనేక ప్రకారంబుల చెప్పబడువాఁడును అగు సూర్యుడు మాకు వాగ్విభూతి నొసంగుగాతయనియే బ్రార్థించుచున్నాడు. 1

శ్లో. భూయోభిః పటుబుద్ధిభిః పటుధియాం హోరాఫలజ్ఞప్తయే
శబ్దన్యాయ సమన్వితేషు బహుశ శ్శాస్త్రేషు దృష్టేష్వపి
హోరాతంత్రమహార్ణవ ప్రతరణే భగ్నోద్యమానామహం
స్వల్పం వృత్తవిచిత్ర మర్థబహుళం శాస్త్రప్లవం ప్రారభే. 2

తా. చతురప్రజ్ఞులగు ననేకులు వ్యాకరణ తర్కములతోగూడిన శాస్త్రంబులు పలుమారు చూచుచుండినను, ఈ హోరాశాస్త్రమను గొప్పసంద్రమును దాటుటకై తమబుద్ధి కుశలతనంతయు వినియోగపరచి భగ్నమనోరథులైనవారికి పూర్వఫలవ్యంజకంబైన హోరాఫలములను దెలిసికొనుటకై పూర్వము యవనేశ్వరుఁడు మొదలగు హోరాశాస్త్రజ్ఞులు రచించిన గ్రంథముల బాహుళ్యమును గల్గనీయక, అర్థబాహుళ్యముగల్గి శార్దూలవిక్రీడితాది నానావిధ వృత్తంబులచే విచిత్రంబుగా నొప్పు బృహజ్జాతకంబును జెప్పనుజేయ నారంభించుచున్నాను. 2

శ్లో. హోరేత్య హోరాత్ర వికల్పమేకే
వాంఛంతి పూర్వా పరవర్ణ లోపాత్
కర్మార్జితం పూర్వభవే సదాది
యత్తస్య పంక్తిం సమభివ్యనక్తి. 3

తా. అహోరాత్ర జనితఫల వికల్పము హోరయనఁబడును. ఎట్లనగ, అహోరాత్ర శబ్దముయొక్క పూర్వవర్ణమైన అకారమును పరవర్ణమైన తకారంబును లోపించుటవలన శేషించియుండు యత్శరద్వయము హోరాయగుచున్నది. గనుక నిది హోరాశాస్త్రమని పేర్కొనబడినది. ఈ శాస్త్రంబునకు ప్రయోజనమేమనిన పూర్వజన్మ సంచితంబగు శుభాశుభ మిశ్రరూపమైన పాపకర్మంబును దెలియజేయుటయై యున్నది. ఇందుకు లఘుజాతక ప్రమాణము యదుపచిత మన్యజన్మని శుభాశుభంతస్య జన్మనః పత్తింవ్యంజ యత్తిశాస్త్రమే తత్తమసి ద్రవ్యాణి దీప ఇవ:— 3

శ్లో. కాలాంగాని వరాంగమాననమురో హృత్క్రోడ వాసోభృతో
వస్తిర్వ్యం జనమూరుజాను యుగళె జంఘే తతోంఘ్రిద్వయమ్
మేషాశ్వి ప్రథమానవర్క్ష చరణా శ్చక్రస్థితా రాశయో
రాశిక్షేత్ర గృహర్క్ష భానిభవనం చైకార్థ సంప్రత్యయాః. 4

తా. మేషాదిరాసులకు కాలపురుషుని శిరస్సు మొదలగు అంగవిభాగము జేయబడియున్నది. అశ్విని మొదలు 27 నక్షత్రములకును నక్షత్రమొకటికి నాలుగు పాదము లగుటవలన మొత్తము 108 పాదము లగుచున్నవి. ఈపాదములను మేషాది ద్వాదశ రాసులకు పంచిపెట్టగా ఒకరాశికి 9 పాదము లగుచున్నవి. ప్రథమమున అశ్విని, భరణి, కృత్తికా,

పాదం మేషమను వాక్యప్రకారము మేషరాశి యగుచున్నది. ఇట్లే పండ్రెండురాసు లేర్పడుచున్నవి. ఆరాసులందు కాలపురుషుని శిరస్సు మేషరాశిగను, ముఖము వృషభము గను, ఉదరము మిథునముగను, హృదయము కర్కాటకముగను, కడుపు సింహముగను, నడుము కన్యగను, నాభి లింగమధ్య ప్రదేశములు తులారాశిగను, లింగము వృశ్చికముగను, తొడలు ధనస్సుగను, మోకాళ్లు మకరముగను, పిక్కలు కుంభముగను, పాదంబులు మీనముగను, యేర్పరుపబడి యుండుటచేతను, ఇందులకు తార్కాణముగ సారావళియందు "కాలనరస్యా వయవాన్ పురుషాణాం కల్పయేత్ప్రసవకాలే, సదసద్గ్రహసంయోగా త్పుష్టాస్సోపద్రవాశ్చేతి." యను శ్లోకమురీతి జన్మకాలమునందు పాపగ్రహాక్రాంతమైన రాశి కాలపురుషునియొక్క యే యంగమునందుండునో ఆ యంగంబున నుపఘాతంబును శుభగ్రహాక్రాంత రాశి యేయంగమునందుండునో ఆ యంగంబునకు పుష్టియు గలుగునను ఫలంబులు చెప్పదగినది. రాశి, క్షేత్రము, గృహము, ఋక్షము, భము, భవనము, ఈ యాఱుశబ్దములు ఏకార్థజ్ఞాపకరాశీ సంజ్ఞలని తెలియదగినది. 4

## రాసులస్వరూపములు.

శ్లో. మత్స్యౌఘటీ నృమిథునం సగదం సవీణం
చాపీనరోశ్వ జఘనోమకరో మృగాస్యః
తౌలీ ససస్య దహనాప్లవగాచకన్యా
శేషాస్స్వనామ సదృశాస్స్వచరాశ్చ సర్వే. 5



తా. రాశులస్వరూపములు:— ఒకదాని పుచ్ఛమును మరియొకటి చూచు చేపల జతే మీనరాశి, ఉత్తమండను భుజమునదాల్చిన పురుషుడు కుంభరాశి. పురుషుడు గదను ధరించియు, స్త్రీ వీణనుధరించియు, అభిముఖముగ గల ద్వంద్వము మిధునరాశి. గుఱ్ఱపు పిరుదులు వంటి పిరుదులుగలిగి విల్లునుదాల్చిన మనుష్యుడు ధనుస్సు. మృగ ముఖమునబోలిన ముఖము గల మొసలి మకరరాశి. త్రాసునుధరించిన పురుషుడు తులారాశి. సస్యమును దీపమును చేత ధరించి తెప్పపైనుండునది కన్యారాశి. మేకవంటి రూపముగలది మేషము. వృషభాకారముననుండునది వృషభము. ఎండ్రకాయవంటి ఆకారముగలది కర్కాటకము. సింహమువంటి యాకారమును గలిగినది సింహరాశి. తేలువంటి రూపునగలది వృశ్చికము. ఈ రూపములతో తమ తమ విహార స్థానములయందు సంచరించుచున్నవి. ఇందులకు యవనేశ్వరుండును, జీవశర్మయు నుదాహరణము లిచ్చియున్నారు. 5

శ్లో. క్షితిజసితజ్ఞచంద్ర రవిసౌమ్య సితావనిజా
స్సురగురు మందసౌరి గురవశ్చ గృహాంశకపాం
అజమృగ తౌళిచంద్రభవ నాదిసనవాంశ విధిర్భవన
సమాంశ కాధిపతయః స్వగృహాత్ క్రమశః. 6

తా. క్రమాలంకార యుక్తనగు శ్లోకంబున మేషాది ద్వాదశరాసులకు అంగారకాది గ్రహంబు లధిపతులగు చున్నారనుటచే మేషరాశి కంగారకుడు. వృషభమునకు శుక్రుడు. మిథునమునకు బుధుడు. కర్కాటకమునకు చంద్రుడు. సింహమునకు సూర్యుడు. కన్యకు బుధుడు. తులకు శుక్రుడు. వృశ్చికమునకు అంగారకుడు ధనుస్సుకు గురుడు, మకర కుంభములకు శనియు. మీనమునకు గురువును వరుసగా నధిపతు లగుచున్నారు. 6

నవాంశములు:— జన్మరాశిని తొమ్మిదిభాగములుజేసి జననకాల మెన్నవ భాగముగ నేర్పడునో యాభాగమున కేర్పడియుండు రాశ్యధిపతి యేగ్రహముగునో ఆగ్రహమే నవాంశాధిపతి యగుచున్నాడు:—

"అజమృగ తౌళిచంద్ర భవనాద నవాంశ విధిః" అని యుండుటవలనను ఆదిశబ్దము మేషరాశి కర్థకగుటవలనను మేషము, మకరము, తుల, కర్కాటకము, ఈ నాలుగురాసులు నవాంశకు మొదటిరాసులు గనుక. "శ్లో. మేషసింహ ధనుషిష్వ జాదయస్త్వౌళికుంభ మిధు నే తులాదయః కన్యకా వృషవృషే మృగాదయః మీనకర్కలిషు కర్కటాదయః" అను శ్లోకము రీతి మేష సింహ ధనుస్సులకు మేషాదిగను, తులా కుంభ మిధునములకు తులాదిగను, కన్యా మకర వృషభంబులకు మకరాదిగను, మీన కర్కట వృశ్చికంబులకు కర్కటాదిగను గణన చేయవలయును. ఉదాహరణము:— ఒక శిశువు మేషలగ్నమునందు జనించగా ఆలగ్నమున జననకాలమున చెల్లిన ఘడియలుగాక తక్కిన ఘడియల ఆదిచెరింగి లగ్నమును తొమ్మిదిభాగములుచేయగా యేభాగమునకా జననకాల ఘడియ నిలుచుచున్నదో ఆభాగము మొదటిదిన్నైన

మేష. కుజ నవాంశయనియు. 2. వృషభ శుక్ర నవాంశ. 3. మిథున బుధనవాంశ. 4. కటక చంద్రనవాంశ. 5. సింహ సూర్య నవాంశ. 6. కన్యా బుధ నవాంశ. 7. తులా శుక్రనవాంశ. 8. వృశ్చిక కుజనవాంశ. 9. ధనుర్గురు నవాంశ యనియు దెలియవలెను. జననలగ్నము వృషభమైనయెడల నవాంశాది రాశి మకరము గనుక మకర శని నవాంశయని యారంభించవలెను. జననలగ్నము మిథునమగునెడల శ్లోకము రీతిగ తులా శుక్ర నవాంశయని యారంభింప వలయును. జన్మలగ్నము కర్కాటకమైనచో కర్కాటక చంద్ర నవాంశయని యారంభించి ఏర్పరుపవలసిన భాగరాశికి అధిపతిని నవాంశాధిపతిగ నెన్నుకొన వలయును. ఇదియుగాక, "శ్లో. మేషకే సరి ధన్వినాం మేషాద్యా అంశకాస్స్మృతాః। వృషకన్యా మృగాణాంచ మకరాద్యా నవస్మృతాః । తులామిథున కుంభానాం తులాద్యా నవకీర్తితాః । కర్కాటాళి ఝషాణాంచ కర్కాటాద్యా నవాంశకాః. " అను శ్లోకమురీతి సులభముగ గ్రహింపనగును.

"భవన సమాంశకాధిపతయః" అని యుండుటవలన జన్మలగ్నమును 12 భాగములు చేయగా జననకాల మేభాగమునకు జేరునో యాభాగమును జననలగ్నము మొదలు ఆ భాగసంఖ్యరాశియే ద్వాదశాంశయనియు ఆరాశ్యధిపతి ద్వాదశాంశాధిపతియనియు యెరుంగవలెను. మేషరాశికి మేషము మొదలు మీనమువరకును, వృషభమునకు, వృషభము మొదలు మేషమువరకును, ఇట్లు ద్వాదశాధిపతులను యెఱుగవలెను. (మేషకుజ ద్వాదశాంశ, వృషభ శుక్ర ద్వాదశాంశ, మిథున బుధద్వాదశాంశ) యీరీతిగ నెరుంగవలెను.                    6

శ్లో. కుజరవిజ గురుజ్ఞ శుక్ర భాగాః పవనసమీరణ కౌర్పి జూక లేయాః
అయుజి యుజితు భే విపర్యయస్థాః శశిభవనాళి ఝషాంత మృక్షసంధిః.

తా. లగ్నమును ముప్పదిభాగములుచేసి యేభాగమునకు జననకాల మేర్పడునో యా భాగమున కధిపతిని త్రింశాంశాధిపతియని యెరుంగవలయును. విషమరాసులగు మేష, మిథున, సింహ, తులా, ధనుః, కుంభములయందు. మొదట అంగారకునకు 5 భాగములును, శనైశ్చరునకు 5 భాగములును, గురువునకు 8 భాగములును, బుధునికి 7 భాగములును, శుక్రునికి 5 భాగములును, గల్గుటవలనను, సమరాసులగు, వృషభ, కర్కాట, కన్యా, వృశ్చిక, మకర, మీనములందు, పైకనిన వరుసక్రమమునకు వ్యత్యస్తముగ ఆదియందు శుక్రునకు 5 భాగములును, బుధునకు 7 భాగములును, గురునకు 8 భాగములును, శనైశ్చరునకు 5 భాగములును, కడపట అంగారకునకు 5 భాగములును గలుగుటవలనను, భాగక్రమముగ త్రింశాంశాధిపతుల నెరుంగవలెను. ఇందు సంకేత సూచకములుగ పవన 5, సమీరణ 5, కౌర్పి 8, జూక 7, లేయ 5, అను భాగవరుసను, విషమరాసులకు కుజాది శుక్రునిపర్యంతమును సమరాసులకు అపసవ్యముగ శుక్రుని మొదలు అంగారకుని వరకును సూక్ష్మముగ భాగములు చేర్పరుపబడి యున్నవి. శ్లోకమున నాల్గవపాదమున కర్కాటక రాశ్యంత నవాంశమును వృశ్చిక రాశ్యంత నవాంశమును, మీనాంతనవాంశమును రాశిసంధులు నక్షత్ర సంధులని తెలియదగినవి. కర్కాట కాంత్యమైన ఆశ్లేషాంతమును వృశ్చికాంతమైన జ్యేష్ఠాంతమును,

మీనాంతమైన రేవత్యంతమున్ను నక్షత్రసంధులు ఈ రాశ్యంతనక్షత్రములు గండాంతము లనంబడును. ఇందులకు నారదీయమునందు. శ్లో. కులీరసింహయోఃకీట చాపయోర్మీనమే షయోః గండాంత మంతరాళంస్యా ద్ఘటికార్థం మృతిప్రదం. అనియు, లఘుజాతకము నందు. శ్లో. భూపాశ్విన్యా స్సంధా వురగ మఘాజ్యేష్ఠ మూలయోస్సంధా ఘటికాగండా న్యాష్టౌచ తత్ర ఇహాపరే పఠితాః ॥ అనియు ఉదాహరణములు:— 7

శ్లో. క్రియ తాబురి జితుమకులీర లేయ పాథోనజూక కౌర్పాఖ్యాః
తౌక్షిక ఆకోకే రోహృద్రోగశ్చాంత్యభం చేత్థమ్. 8

తా. వ్యవహారార్థముగ. (1) క్రియ. (2) తాబురి. (3) జితుమ. (4) కులీర. (5) లేయ. (6) పాథోన. (7) జూక. (8) కౌర్పి. (9) తౌక్షిక. (10) ఆకోకేరి. (11) హృద్రోగ. (12) అంత్యభం అను సంజ్ఞల మేషాది ద్వాదశరాసులకు నామములుగ నేర్పరుపబడినవి. 8

శ్లో. ద్రేక్కాణహోరా నవభాగసంజ్ఞా స్త్రింశాంశక ద్వాదశ సంజ్ఞితాశ్చ
క్షేత్రంచ యద్యస్య సతస్యవర్గో హోరేతిలగ్నంభవనస్య చార్థమ్. 9

తా. గ్రహముల రాశ్యాది షడ్వర్గసంకేతక్రమము:—లగ్నమును రెండు భాగములు చేయగ హోర. లగ్నమును మూడు భాగములుచేయగ ద్రేక్కాణ. లగ్నమును తొమ్మిది భాగములుచేయగ నవాంశ. లగ్నమును పండ్రెండు భాగములుచేయగ ద్వాదశాంశ. లగ్నమును ముప్పది భాగములుచేయగ త్రింశాంశ. లగుటచే లగ్నము, హోర, ద్రేక్కాణము, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశ, అనునవి రాశ్యాది షడ్వర్గసంజ్ఞలు. ఏరాశి ఏగ్రహ సంబంధమో యారాశి ఆగ్రహవర్గమగుచున్నది. 9

గ్రంథాంతరశ్లోకము:— త్ర్యాద్యేష్వేషు ఏకత్వేషు గ్రహ స్త్విష్ట సవర్గగః । పరవర్గ గతో ప్యేవం గ్రహోభవతినాన్యదా॥ లగ్నమును రాశిలోసగమును హోరయని చెప్పబడును.

శ్లో. గోజాశ్వికర్కి మిథునాస్స మృగానిశాఖ్యాః
పృష్ఠోదయా విమిథునాః కథితా స్తఏవ
శీర్షోదయాదిన బలాశ్చ భవంతి శేషా
లగ్నం సమేత్యుభయతః పృథురోమ యుగ్మం. 10

తా. మేషము, వృషభము, మిథునము, కటకము, ధనుస్సు, మకరము అను 6 రాసులు రాత్రి బలరాసులు ఈ రాసులందు మిథునముతక్క తక్కినవి పృష్టోదయరాసులు సింహము, కన్య, తుల, వృశ్చికము, కుంభము అను 5 రాసులు పగటికాల బలరాసులు 5 న్ను మిథునమును చేరి యారురాసులు శీర్షోదయరాసులు. పండ్రెండవ రాశియగు మీనము ఉభయోదయమనియు తెలియదగినది. 10

శ్లో. క్రూరస్సౌమ్యః పురుషవనితే తేచరాగద్విదేహాః
ప్రాగాదీశాః క్రియవృషనృయుక్కర్కటాస్స త్రికోణాః
మార్తండేంద్వోరయుజిసమభే చంద్రభాన్వోశ్చహోరే
ద్రేక్కాణాస్స్యుస్స్వభవనసుత త్రిత్రికోణాధిపానామ్. 11

తా. మేషము, మిథునము, సింహము, తుల, ధనుస్సు, కుంభము అను విషమరాసు లారును క్రూరరాసులనియు. వృషభము, కటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనము అను సమరాసులు ఆరును సౌమ్యరాసులనియు దెలియదగినది. విషమరాసులయందు జననమందినవారు పై సంజ్ఞాక్రమముగ క్రూరస్వభావులనియు సమరాసులయందు బుట్టినవారు సౌమ్యస్వభావులనియు జెప్పదగును. ఇందులకు సత్యాచార్యులవారు ఓజేషూర్ధ్వాః క్రూరాస్సౌమ్యాః యుగ్మేషు భవనేషు. అని చెప్పియున్నారు. 11

మఱియు మేషాది విషమరాసులు 6ను పురుషరాసులనియు సమరాసులు 6ను స్త్రీరాసులనియు దెలియదగినది. ఇందుకు ప్రయోజనము:— పురుషరాసులయందు జననమందినవారు తేజోవంతులగుదురనియు స్త్రీరాసులయందుబుట్టినవారు తేజోహీనులగుదురనియు తెలియుట.

మేషము, చరము. వృషభము, స్థిరము. మిథునము, ద్విస్స్వభావము. ఈక్రమంబున మేష, కర్కాట, తులా, మకరములు, చరములు. వృషభ, కుంభ, వృశ్చిక, సింహములు, స్థిరములు, మిథున కన్యా, ధనుర్మీనములు ద్విస్స్వభావములు. ఇందుకు ప్రయోజనము:— ఏరాశియందు బుట్టినవారి స్వభావము. ఆరాశిస్వభావమునకు సమానముగా నుండునని తెలియదగినది:— ఇందులకు సత్యాచార్యుల వచనము. "రాశిస్వభావతుల్యా జాయంతే ప్రకృతయః ప్రసూతానామ్. అని యున్నది.

దిక్పతులు:—కోణంబులగు పంచమ నవమ రాసులతోగూడి క్రమముగా తూర్పుదిశ మొదలు అనగా మేషసింహధనుస్సులు పూర్వదిక్పతులు, వృషభ కన్యా మకరములు. దక్షిణ దిక్పతులు. మిథున తులా కుంభములు పశ్చిమదిక్పతులు. కర్కాట వృశ్చిక మీనములు ఉత్తర దిక్పతులు. హోరవిభాగక్రమము:—విషమరాసులకు ప్రథమహోర సూర్యహోర, ద్వితీయహోర చంద్రహోరయనియు. సమరాసులకు ప్రథమహోర చంద్రహోర, ద్వితీయహోర సూర్యహోరయని దెలియదగినది.

ద్రేక్కాణాధిపతులు:—లగ్నాధిపతియు, పంచమాధిపతియు, నవమాధిపతియు వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ ద్రేక్కాణములకు అధిపతులగుదురు గాన మేష ప్రథమ ద్రేక్కాణమునకు మేషాధిపతియైన కుజుఁడును, మేషద్వితీయ ద్రేక్కాణమునకు మేషము మొదలుకొని 5 వ రాశి సింహము గనుక యా రాశ్యధిపతియైన సూర్యుడును. మేష తృతీయ ద్రేక్కాణమునకు మేషము మొదలుకొని 9 వ రాశి ధనుస్సుగనుక ధనురధిపతియగు గురువును అధిపతు లగుదురు. ఇట్లే యీ క్రిందిచక్రమున ద్రేక్కాణములును తదధి పతులును తెలియదగును,

## ద్రేక్కాణములు - ద్రేక్కాణాధిపతులు.

| | లగ్నములు | ప్రథమ ద్రేక్కాణము | అధిపతి | ద్వితీయ ద్రేక్కాణము | అధిపతి | తృతీయ ద్రేక్కాణము | అధిపతి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషము | మేషము | కుజుఁడు | సింహము | సూర్యుఁడు | ధనుస్సు | గురువు |
| 2 | వృషభము | వృషభము | శుక్రుఁడు | కన్య | బుధుఁడు | మకరము | శని |
| 3 | మిథునము | మిథునము | బుధుఁడు | తుల | శుక్రుఁడు | కుంభము | శని |
| 4 | కటకము | కర్కటము | చంద్రుఁడు | వృశ్చికము | కుజుఁడు | మీనము | గురువు |
| 5 | సింహము | సింహము | సూర్యుఁడు | ధనుస్సు | గురువు | మేషము | కుజుఁడు |
| 6 | కన్య | కన్య | బుధుఁడు | మకరము | శని | వృషభము | శుక్రుఁడు |
| 7 | తుల | తుల | శుక్రుఁడు | కుంభము | శని | మిథునము | బుధుఁడు |
| 8 | వృశ్చికము | వృశ్చికము | కుజుఁడు | మీనము | గురువు | కర్కటము | చంద్రుఁడు |
| 9 | ధనుస్సు | ధనుస్సు | గురువు | మేషము | కుజుఁడు | సింహము | సూర్యుఁడు |
| 10 | మకరము | మకరము | శని | వృషభము | శుక్రుఁడు | కన్య | బుధుఁడు |
| 11 | కుంభము | కుంభము | శని | మిథునము | బుధుఁడు | తుల | శుక్రుఁడు |
| 12 | మీనము | మీనము | గురువు | కర్కటము | చంద్రుఁడు | వృశ్చికము | కుజుఁడు |

ఇందులకు ఫలము:—స్వద్రేక్కాణమునందున్న గ్రహములు బలవంతులనియు, నాయుర్భావాది బలము లొసంగుదురనియు, యోగప్రదులనియు నెఱుంగ దగినది.

శ్లో. కేచిత్తు హోరాం ప్రథమాంభ పస్య
వాంఛంతి లాభాధిపతే ర్ద్వితీయామ్
ద్రేక్కాణ సంజ్ఞామపి వర్ణయంతి
స్వద్వాదశై కాదశ రాశిపానామ్. 12

తా. మఱియు మతాంతరమునందు యవనాదులగు కొందరు మేష ప్రథమహోరకు అంగారకుండును, మేషద్వితీయహోరకు మేషమునకు లాభస్థానమగు కుంభాధిపతియగు శనైశ్చరుఁడును అధిపతు లగుచున్నారనియు, ఈప్రకారము తక్కిన రాసులకును తెలియ దగినదనియు స్వరాశ్యధిపతియే ప్రథమ ద్రేక్కాణాధిపతియనియు, ద్వాదశరాశ్యధిపతి, ద్వితీయద్రేక్కాణాధిపతి యనియు, లాభాధిపతి తృతీయ ద్రేక్కాణాధిపతి యనియు, చెప్పుచున్నారు. ఇందుకు యవనేశ్వరుడు "శ్లో. ఆద్యాచహోరా భవనస్వపత్యు రేకాదశ క్షేత్ర పతేర్ద్వితీయా, స్వద్వాదశైకా దశరాశిపానాం ద్రేక్కాణసంజ్ఞాః క్రమశోత్ర చోక్తాః." అని వచించియుండినను వరాహ మిహిరాచార్యులు ఈ హోరాద్రేక్కాణములు సరిగావనియు సమ్మతించ లేదనుదురు. 12

శ్లో. అజవృషభమృగాంగనా కుళీరాఝషవణిజౌచ దివాకరాది తుంగాః
దశశిఖిమనుయుక్తిథీంద్రియాంశై స్త్రినవక వింశతిభిశ్చ తేస్తనీచాః. 13

తా. ఈ శ్లోకమున ఉచ్చనీచస్థానములును పరమోచ్చ పరమనీచభాగములును జెప్ప బడినవి:—గ్రహములకు ఉచ్చరాసులయందు యీ క్రింది భాగములయందు మాత్రము పర మోచ్చమనియు, ఉచ్చరాసులకు నేడవరాసులు నీచరాసులనియు, తద్భాగక్రమము పరమ నీచమని నెఱుంగవలయును. 13

| | గ్రహములు | ఉచ్చరాసులు | పరమోచ్చ భాగములు | నీచరాసులు | పరమ నీచ భాగములు |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యుఁడు | మేషము | 10 | తుల | 10 |
| 2 | చంద్రుఁడు | వృషభము | 3 | వృశ్చికము | 3 |
| 3 | అంగారకుడు | మకరము | 28 | కటకము | 28 |
| 4 | బుధుఁడు | కన్య | 15 | మీనము | 15 |
| 5 | గురువు | కర్కాటకు | 5 | మకరము | 5 |
| 6 | శుక్రుఁడు | మీనము | 27 | కన్య | 27 |
| 7 | శనైశ్చరుడు | తుల | 20 | మేషము | 20 |

ఫలము:— ఉచ్చపరమోచ్చ స్థానములుగల గ్రహములకు షష్ఠాష్టద్వాదశ లాభ స్థానాధిపత్య దోషములు రాకుండిన పక్షమున నుత్తమఫలము లిత్తురు. ఇందులకు గార్గి "శ్లో. స్వోచ్చగౌరలి శీతాంశూ జనయేతాం నరాధిపం, ఉచ్చస్థో ధనినంఖ్యాతం స్వత్రికోణ గతోపి." అని చెప్పియున్నారు. నీచ, పరమ నీచస్థానములను బొంది గ్రహములు పాపా

త్రాంశుగా యుండిరేని గ్రుడ్డి, కుంటి, మూఢత ఇత్యాది లక్షణములతో జాతకులుందురనుట. ఇందులకు గార్గి "శ్లో. అంధందిగంబరం మూఢం పరపిండోప జీవనం, కురుతా పతి నీచస్థౌ పురుషం శశిభాస్కరౌ." అని చెప్పియున్నారు.

(*N. B.*) దశ = 10, శిఖి = 3, మనుయుక్ = 28, తిథి = 15, ఇంద్రియ = 5, త్రిణవకీ = 27, వింశతిభిః = 20 అని తెలియదగినది.

శ్లో. వర్గోత్తమాశ్చ రగృహాదిషు పూర్వమధ్య
పర్యంతగా శ్శుభఫలా నవభాగసంజ్ఞాః
సింహోవృషః ప్రథమషష్ఠ హయాఙ్గతౌళి
కుంభా స్త్రికోణ భవనాని భవంతి సూర్యాత్. 14

తా. వర్గోత్తమాంశలు ఫలము:— చరరాసులైన మేష కర్కాటక తులా మకరముల యందు ప్రథమనవాంశ వర్గోత్తమాంశయనియు, స్థిరరాసులైన వృషభ, సింహ, వృశ్చిక, కుంభములయందు మధ్య నవాంశమైన 5 వ నవాంశ వర్గోత్తమాంశయనియు, ద్విస్స్వభావ రాసులైన మిథున, కన్యా, ధనుర్మీనములయందు, అంత్యనవాంశమైన 9 వ నవాంశ వర్గోత్తమాంశయనియు, ఈ వర్గోత్తమాంశలయందు జాతకునకు శుభఫలము జరుగుననుట.

మూలత్రికోణములు:— సూర్యునకు సింహము, చంద్రునకు వృషభము, అంగారకునకు మేషము, బుధునకు కన్య, గురువునకు ధనుస్సు, శుక్రునకు తుల, శనికి కుంభరాశియు మూలత్రికోణములు. ఈ త్రికోణరాసులు ఉచ్చ స్వక్షేత్రములుగూడ నగుచున్నవి.

ఆ విషయము యీ గ్రంథమున విభజించి చెప్పలేదు. కాబట్టి లఘుజాతకోక్త ప్రకారము రాసులయందు ఉచ్చ స్వక్షేత్రాది విభాగము నెరుంగ వలయును.

| | గ్రహములు | మూలత్రికోణములు | త్రికోణములు | ఉచ్చ | స్వక్షేత్రము |
|---|---|---|---|---|---|
| 1 | సూర్యుఁడు | సింహమునందు | మే. 20 భా | | తక్కిన 10 భా |
| 2 | చంద్రుఁడు | వృషభమునందు | తక్కిన. 27 భా | మే 3 భాగ | |
| 3 | అంగారకుఁడు | మేషమునందు | మే. 18 భా | (ములు | తక్కిన 12 భా |
| 4 | బుధుఁడు | కన్యయందు | తక్కిన. 5 భా | మే 15 భా | మిగత 10 భా |
| 5 | గురువు | ధనుస్సునందు | మే. 13 భా | | తక్కిన 17 భా |
| 6 | శుక్రుఁడు | తులయందు | మే. 10 భా | | తక్కిన 20 భా |
| 7 | శనైశ్చరుఁడు | కుంభమునందు | మే. 20 భా | | తక్కిన 10 భా |

ఇదియుగాక మరికొందరి మతభేదములు వేరుగనున్నవి. మేషమునందు అంగారకునకు 12 భాగములు త్రికోణమనియు. మిగత 18 భాగములు స్వక్షేత్రమనియు, ధనుస్సునందు గురువునకు 10 భాగములు త్రికోణమనియు, మిగత 20 భాగములు స్వక్షేత్రమనియు, శుక్రునకు తులయందు 15 భాగములు. త్రికోణమనియు, మిగత 15 భాగములు స్వక్షేత్రమనియు,

చెప్పబడినది. శుక్రునకుమాత్ర మొక గ్రంథమున తులయందు 5 భాగములుమాత్రము మూల త్రికోణమనియు, మిగత 25 భాగములు స్వక్షేత్రమనియు మాధవవచనము గానబడుచున్నది.

ఫలము:— గ్రహములు స్వక్షేత్రమూల త్రికోణోచ్చ రాసులయందు దోషరహితులై శుభగ్రహ సమాయుక్తులై యుండిరేని వారి దశాభుక్తులయందు గాని ఇతర గ్రహదశల యందు గాని, విశేష శుభఫల మిచ్చుచున్నారనియు జాతకునకు నిరంతర శుభదాయకులై యుందురనియు తెలియదగినది.

శ్లో. హోరాదయ స్తను కుటుంబ సహోత్థబంధు
పుత్రారిపత్ని మరణాని శుభాస్పదాయాః
రిఃఫాఖ్యమిత్యు పచయాన్యరి కర్మలాభ
దుశ్చిక్య సంజ్ఞిత గృహాణి ననిత్యమేకే. 15

తా. లగ్నాదిద్వాదశరాసులకు దన్వాదిభావసంజ్ఞలు:— 1. లగ్నమునకు దనుస్థానము, ద్వితీయమునకు కుటుంబము, తృతీయమునకు భ్రాతృస్థానము, చతుర్థమునకు బంధుమాతృస్థానములనియు, పంచమమునకు బుత్రస్థానము, షష్టమునకు శత్రుస్థానము, సప్తమమునకు గళత్రస్థానము, అష్టమమునకు మరణము, నవమమునకు శుభభాగ్య స్థానమనియు, దశమ మునకు ఆస్పదము, ఏకాదశమునకు ఆయము, ద్వాదశమునకు రిష్ఫము, అను పర్యాయనామంబులు తెలియదగినవి. ఈ స్థానములకు ననేక పర్యాయపదములు నిఘంటువులయందు జూడ నగును. మరియు 3,6,10,11, స్థానములు ఉపచయములనియు, తక్కిన 1, 2, 4, 5, 7, 8, 9, 12, స్థానములు అపచయములనియు తెలియదగినది. కొందఱు యీఉపచయములు నిత్యమై నవికావని చెప్పుదురు. ఇందులకు బ్రయోజనము:— ఉపచయస్థానములు గ్రహముల మిత్ర స్వోచ్చక్షేత్రమ్ములైన శుభఫలితమును తక్కిన స్థానముల శుభాశుభమిశ్రఫలితము లగుననుట.

లగ్నాది ద్వాదశ భావంబులకు మఱికొన్ని సంజ్ఞల జెప్పుచున్నాడు:—

శ్లో. కల్యస్వవిక్రమ గృహ ప్రతిభాక్షతాని
చిత్తోత్థరంధ్ర గురుమాన భవవ్యయాని
లగ్నాచ్చతుర్థ నిధనేచతురస్ర సంజ్ఞే
ద్యూనంచ సప్తమ గృహందశ మర్క్ష మాజ్ఞా. 16

తా. లగ్నమునకు కల్యము, ద్వితీయమునకు స్వము, తృతీయమునకు విక్రమము, చతుర్థమునకు గృహము, పంచమమునకు ప్రతిభ, షష్టమునకు క్షతము, సప్తమమునకు జిత్తోత్థము, అష్టమమునకు రంధ్రము, నవమమునకు గురువు, దశమమునకు మానము, ఏకాదశమునకు భవము, ద్వాదశమునకు వ్యయమనియు సంజ్ఞలు. లగ్నము మొదలు చతుర్థాష్టమములకు చతురస్రములనియు, సప్తమమునకు ద్యూనమనియు, దశమమునకు నాజ్ఞాయనియు, నాయాస్థానములకు వ్యవహార నామములని తెలియదగినది.

శ్లో. కంటక కేంద్ర చతుష్టయసంజ్ఞా స్సప్తమలగ్న చతుర్థఖ భానాం,
తేషుయథా భిహితేషు బలాఢ్యాః కీటనరాంబుచ రాఃపశవశ్చ. 17

తా. లగ్నము, చతుర్థము, సప్తమము, దశమము అను నీనాల్గుస్థానంబులకు కంటకంబులనియు, కేంద్రములనియు, చతుష్టయములనియు, త్రివిధసంజ్ఞలుకలవు. ఈచెప్పబడిన సప్తమ లగ్న, చతుర్థ, దశమములు వరుసగా కీట, నర, అంబుచర, పశువులైనయెడ బలాఢ్యములగును. ఎట్లనగ, కీటకరాశియైన వృశ్చికను సప్తమ స్థానమైన బలవంతము, నరరాసులైన మిథున, కన్యాతులాధనుః, పూర్వార్థకుంభములు లగ్నములైతే బలాఢ్యములు, జలచరరాసులైన కర్కాటి మకరోత్తరార్థ మీనములు చతుర్థస్థానములైన యెడల బలవంతములు, చతుష్పద రాసులైన మేష వృష సింహ ధను రపరార్థ మకర పూర్వార్థములు దశమస్థానములైనయెడల బలవంతములు. ఇందులకు గార్గి. "నృయుక్తులా ఘటౌకన్యా పూర్వార్థం చైవధన్వినః, లగ్నస్థా బలినోనిత్యం ఏతేహి నతీరాశయః. చతుర్థే కర్కటో మీనో్య మకరార్థంచ పశ్చిమం, విజ్ఞేయా బలినోనిత్యం ఏతేహి జలరాశియః, సప్తమే వృశ్చికః.కీటో బలవాన్ పరికీర్తితః, ధన్వంతార్థాజ గోసింహాః బలిన స్స్వ చతుష్పదాః." అని చెప్పియున్నారు. 17

శ్లో. కేంద్రాత్పరం పణఫరం పరతస్తు సర్వమా
పోక్లిమం హిబుకమంబు సుఖంచవేశ్మ
జామిత్ర మస్తభవనం సుతభంత్రికోణం
మేషూరణం దశమ మత్రచకర్మ విద్యాత్. 18

తా. కేంద్రములగు. 1, 4, 7, 10. యీ రాసులకు పరంబగురాసులనగా. 2, 5, 8, 11. యీ రాసులు పణఫరములనియు, ఈ పణఫరములకు మీదటి రాసులు అనగా 3, 6, 9, 12. యీ రాసులు ఆపోక్లీమములనియు తెలియదగినది. చతుర్థభావమునకు 1. హిబుకం. 2. అంబు. 3. సుఖం. 4. వేశ్మ. అను నాలుగుపేళ్లును. సప్తమభావమునకు. 1. జామిత్రం. 2. అస్తభవనం. అను రెండుపేళ్లును. పంచమభావమునకు. 1. సుతభం. 2. త్రికోణము అను రెండుపేళ్లును. దశమమునకు. 1. మేషూరణం. 2. కర్మము. అను రెండుపేళ్లును గలవని తెలియదగినది. 18

శ్లో. హోరాస్వామి గురుజ్ఞవీక్షితయుతా నాన్యైశ్చ వీర్యోత్కటా
కేంద్రస్థా ద్విపదాదయోహ్ని నిశిచ ప్రాప్తైచ సంధ్యాద్వయే
పూర్వార్థే విషయాదయః కృతగుణా మానం ప్రతీపంచతత
ద్దుశ్చిక్యం సహిజం తపశ్చనవమం త్ర్యాద్యంత్రి కోణంచతత్. 19

తా. లగ్నము లగ్నాధిపతిచేనైనను, గురు బుధులచేనైనను, వీక్షింపబడిగాని, కూడుకొనినగాని, తక్కినగ్రహములచేత జూడబడక, గూడకయుండినయెడల బలాధికమగుచున్నది. లగ్నము లగ్నాధిప గురుబుధులచే జూడబడుచు తక్కిన గ్రహములచే జూడబడుచున్నగాని

గూడుకొనినగాని యుండినయెడల మధ్యమ బలయుతంబై యుండును. లగ్నాధిప గురు బుధ వీక్షితయుతముగాక ఇతరగ్రహ వీక్షితయుతమై యుండునెడల ఆ లగ్నము దుర్బలమైనది. ఇందులకు బాదరాయణులు:—“జీవస్వనాథ శశిజైర్యుక్తా దృష్టాబలవతీ భవతి, శేషైర్బల హీనాస్యా దేవంమిశ్రైస్తు మధ్యబలా బలహీనాయది సర్వైర్గ్న వీక్షితా, నైవయుక్తావా కేంద్రస్థా తిబలాస్సు ర్మధ్యబలాః పణఫరాశ్రితాక్షేయాః ఆపోక్లిమగాస్సర్వే హీనబలాః రాశయః కథితాః. అని చెప్పియున్నారు. కేంద్రస్థాన గతగ్రహములు బలాధికులనియు, పణ ఫరములయందుండు గ్రహములు మధ్యమబలులనియు, ఆపోక్లిమములందుండు గ్రహములు బలహీనులనియు, మఱియు పగటికాలమున ద్విపదరాసులును, రాత్రియందు చతుష్పద రాసులును సంధ్యాద్వయమున కీటరాశియైన వృశ్చికంబును జలచరరాసులును బలాఢ్యము లైనవి పూర్వార్ధేయనగా చక్రపూర్వార్థమైన మేషాదిషట్కమునందు 5, 6, 7, 8, 9, 10. అను సంఖ్యలు నాలుగింట గుణింపబడినవై మేషాదిరాశి షట్కముయొక్క హ్రస్వదీర్ఘ ప్రమాణ నగుచున్నది. ఎట్లన, మేషమునకు 20, వృషభమునకు 24, మిథునమునకు 28, కట కమునకు 32, సింహమునకు 36, కన్యకు 40, యీ సంఖ్యలను 10 చే గుణించగ విఘడియ లగును. ఆ మేషాది షట్కమునకు చెప్పబడిన సంఖ్యాక్రమము వ్యత్యస్తమైనదై తులాది మీనాంతములకు విఘడియ లగుచున్నవి. ఇట్లు గుణించగా యేర్పడిన విఘడియలు. మీన మేషములు రెంటికి 200, వృషభ కుంభములకు 240, మకర మిథునములకు 280, ధనుః కర్క టములకు 320, సింహ వృశ్చికములకు 360, తులా కన్యలకు 400, వీనిని 60 యింట భాగిం చినయెడల ఘడియలగును. ఇందులకు ప్రయోజనము. “ కానివి లగ్న విభక్తభగాత్రః,” అని యుండుటవలన కాలపురుషునియొక్క అంగమునందు లగ్నము మొదలుకొని యెంచగ దీర్ఘ రాశి యుండిన యంగము దీర్ఘమైయుండును. హ్రస్వరాశియుండిన యంగము, హ్రస్వ మగును. సమరాశియుండిన యంగము సమమగును. చోరప్రశ్నయందు గూడ చోరుడు పోయినమార్గము దెలియుటకు నుపయోగమనియు దెలియదగినది. ఇందులకు యవనేశ్వరుండు “ఏవంప్రమాణాని గృహాణిబుధ్వా హ్రస్వానిమధ్యాని తథాయతాని, చక్రాంగభేదై స్సదృశీకృతాని మార్గప్రమాణాని వికల్పయంతి.” అని చెప్పియున్నారు.

శ్లో. రక్తశ్శ్వేత శ్శుకతనునిభః పాటలోధూమ్ర పాండుశ్చిత్రః
కృష్ణః కనకసదృశః పింగళః కర్బురశ్చ బభ్రుస్స్వచ్ఛః
ప్రథమ భవనాద్యేషువర్ణాః ప్లవత్వం స్వేశాశాఖ్యం
దినకరయుతా ద్భాద్ద్వితీయంచ వేశిః. 20

తా. మేషాది రాసుల వర్ణములు:— మేషము రక్తవర్ణము. వృషభము శ్వేతవర్ణము. మిథునము శుకవర్ణము, అనగా ఆకుపచ్చవన్నెగలది. కటకము పాటలవర్ణము, అనగా శ్వేత రక్తవర్ణము. సింహము ధూమ్రపాండువర్ణము, అనగా బొగవన్నెతోగూడిన తెల్లువన్నెగల ది. కన్య చిత్రవర్ణము. తుల నీలవర్ణము. వృశ్చికము బంగరువంటి వన్నెగలది. ధనుస్సు కపిల

వర్ణము. మకరము శుక్లకపిల మిశ్రవర్ణము. కుంభము నలుపుగూడిన తెలుపువన్నెగలది. మీనము స్వచ్ఛవర్ణమని యనియు దెలియదగినది. మరియు నేరాశి యధిపతికి యేదిక్కు చెప్పబడి యున్నదో యారాశికి నాదిక్కున ప్లవసంజ్ఞ (అనగా నిమ్నత్వము) జెప్పబడియున్నది. మేష వృశ్చికములకు అంగారకుఁడు అధిపతి గనుకను, ఆకుజునకు దిక్కు దక్షిణమైనందునను ఆదక్షిణమునందు మేషవృశ్చికములు ప్లవసంజ్ఞలనియు, శుక్రునిదిక్కగు నాగ్నేయమునందు శుక్రస్థానములగు వృషభతులలకు ప్లవసంజ్ఞయనియు, బుధగ్రహదిశయగు నుత్తరమున బుధునిస్థానములగు మిథున కన్యల ప్లవసంజ్ఞయనియు, చంద్రునిరాశియగు కర్కటకమునకు ఆచంద్రుని దిక్కగు వాయువ్యమున ప్లవమనియు, ధనుర్మీనంబులకు గురుడధిపతి గనుక ఆగురునిదిక్కగు నీశాన్యమునందు ధనుర్మీనములకు ప్లవసంజ్ఞలనియు, మకరకుంభములకు శన్యధిపతియనియు, అతనిదిక్కగు పశ్చిమమున మకరకుంభములకు ప్లవత్వమనియు దెలియదగినది. హృతనష్టాది ప్రశ్నలయందు ప్లవత్వయుతరాశి దిగ్గమనము చోరాదులకు చెప్పవలయుననుట. మరియు సూర్యునితోగూడిన రాశికి రెండవరాశికి లేశియనబడును. ఇందుకు ప్రయోజనము. యాత్రా ప్రకరణమునందు "వేశిర్వ్యలగ్నేప గతోపినోసౌ వేశిస్థానేపి సద్గ్రహః." అనియున్నది:—

ఈ సంజ్ఞాధ్యాయమునందు జెప్పబడిన సంజ్ఞలు ద్వివిధంబులు. 1. సంజ్ఞామాత్ర ప్రయోజనములు. సంజ్ఞానురూపఫల నిర్దేశ ప్రయోజనంబులు అనునవి. సంజ్ఞామాత్ర ప్రయోజనములు:— లగ్నమునకు హోరయనియు, తృతీయమునకు దుశ్చిక్యము, చతుర్థమునకు హిబుకము, పంచమమునకు త్రికోణము, సప్తమమునకు ద్యూనము, నవమమునకు త్రికోణము, దశమమునకు మేషూరణము, ద్వాదశమునకు రిఃఫము, చతుర్థాష్టమములకు చతురస్రము, లగ్న, చతుర్థ, సప్తమ దశమములకు కంటకము, కేంద్రము, చతుష్టము, అను మూడుసంజ్ఞలును, ద్వితీయ పంచ మాష్టమైకాదశములకు పణఫరసంజ్ఞ, తృతీయ షష్ఠ నవమ ద్వాదశములకు ఆపోక్లిమసంజ్ఞ. ఇవి సంజ్ఞామాత్ర ప్రయోజనములు. సంజ్ఞానురూపఫల నిర్దేశ ప్రయోజనములు:—

తనువు. కల్యములను నామద్వయము లగ్నమున కేర్పరచియుండుటబట్టి తదర్థసూచకముగ శరీరవృద్ధిని ఆరోగ్యమును వెదుకవలయును. కుటుంబస్వములను నామద్వయము ద్వితీయస్థానమున కేర్పరుపబడి యుండుటచే కుటుంబ ధనవిషయంబుల నాస్థానబలిమిచే యోచింపదగును. తృతీయమునకు సహజము, విక్రమము. అను నామములుగను కీర్తద్బలా బలములను సరణముగ భ్రాతలను విక్రమమునుం దెలిసికొనవలయును. చతుర్థస్థానమునకు బంధు, వేశ్మ, సుఖ, సంజ్ఞలు. గనుక నాచతుర్థస్థానబలము ననుసరించి బంధుగృహ సౌకర్యములను దెలిసికొనవలయును. పంచమమునకు బుద్ధి పుత్రసంజ్ఞలు. గాన పంచమమునుబట్టి బుద్ధి సంతానముల జూడవలయును. షష్ఠమునకు శత్రు వ్రణ సంజ్ఞలు. గనుక 6.వ స్థానముగ శత్రు వ్రణసంబంధ విషయముల నాలోచించవలయును. జామిత్ర దార. సంజ్ఞలు 7.వ స్థానము పేర్లు. జామిత్రమనగా వివాహము గనుక సప్తమమునుబట్టి భార్యా, కామ, వివాహముల విషయముల గమనించనగును. అష్టమమునకు మరణ, రంధ్రసంజ్ఞలుగాన, అష్టమస్థానమునుబట్టి మృత్యుపాప

ముల నాలోచించనగును. శుభ, గురు, తపస్సంజ్ఞలు, నవమమునకుగాన, ధర్మ, ప్రత, మాతాపిత్రాదుల ననుసరించిన విషయముల నీనవమస్థానమునుబట్టి నన్వేషింపవలయును. దశమమునకు కర్మ, ఆస్పదము, ఆజ్ఞలను నామములు. గనుక 10వ స్థానమునుబట్టి కర్మస్థాన ఆజ్ఞలను గమనించవలయును. ఏకాదశమునకు భవము, ఆయము, అను నామములుగాన విద్యాగుణ సంపత్ప్రాప్తిని అర్థమును ఏకాదశమున గ్రహింపదగును. వ్యయనామము ద్వాదశమునకైనందున వ్యయవిషయమును ద్వాదశస్థానబలమును దెలిసికొనవలయును. 3, 6, 10, 11, ఈస్థానములు ఉపచయములు. గనుక యిందుల ననుసరించి యభివృద్ధి చెప్పవలయును. స్థానముల బలాబలములను గ్రహముల యనుకూలత ననుసరించి ఫలనిరూపణ జేయవలెను.

బృహజ్జాతకాంధ్ర తాత్పర్యమునందు

ప్రథమాధ్యాయము.



శ్రీరస్తు.

శ్రీవేణుగోపాల కృష్ణ పరబ్రహ్మణేనమః.

# బృహజ్జాతకము - ద్వితీయాధ్యాయము.



## గ్రహయోనిభేదాధ్యాయము:—2.

శ్లో. కాలాత్మాదినకృన్మన స్తుహినగు స్సత్వం కుజోజ్ఞోవచో
జీవోజ్ఞాన సుఖేసితశ్చ మదనో దుఃఖందినే శాత్మజః
రాజానౌ రవిశీతగూక్షితిసుతో నేతాకుమారో బుధః
సూరిర్భా నవ పూజితశ్చ సచివౌ ప్రేష్య స్సహస్రాంశుజః. 1

గ్రహయోని భేదాధ్యాయము.

తా. ఈగ్రంథమున ప్రథమాధ్యాయమగు సంజ్ఞాధ్యాయమునందు "కాలాంగానివరాంగమనెడు" శ్లోకమునందు, కాలపురుషుని యంగవిభాగము, రాశి, నక్షత్రయుక్తముగ విశదీకరింపబడియున్నది. ఈద్వితీయాధ్యాయమున, పూర్వాధ్యాయమున గనబరుపబడియుండు రాసులయధిపతులైన గ్రహములను కాలపురుషుని యాత్మాదులుగను జగత్పాలకులగు రాజా

దులు గ్రహమయములనియు జెప్పుచున్నాడు. కాలపురుషునిఆత్మ సూర్యుఁడు, మనస్సు చంద్రుఁడు, బలము కుజుఁడు, బుధుఁడు వాక్కు, గురువు జ్ఞానసుఖములు, శుక్రుఁడు మదనుఁడు, శని దుఃఖము, అనురీతిగా విశదీకరించియుండుటచే ప్రపంచమున కంతటికిని జెప్పినటులయ్యె గనుక జనన కాలమునందు గాలపురుషుని ఆత్మాదులుగ జెప్పబడిన గ్రహములు బలవంతులైయుండిరేని జాతకునకు నాత్మాదులు బలవంతములై యుండుననియు తద్గ్రహములు బలహీనులైయుండిరేని జాతకునియాత్మాదులు బలహీనముగానుండుననియు దెలియదగినది. మఱియు సూర్యచంద్రులు రాజులు, అంగారకుఁడు సేనానాయకుఁడు, బుధుఁడుయువరాజు, గురుశుక్రులుమంత్రులు, శనైశ్చరుఁడు సేవకుఁడు, గనుక జనన కాలమునందైనను, ప్రశ్నకాలమునందైనను, రాజాదులైన సూర్యాదులు బలవంతులైయుండునెడల తమదమ సంజ్ఞకుదగినట్లు కార్యసాధకులగుదురు. బలహీనులైయుండిరేని కార్యవిఘ్నాయత్తులగుదు రనుటను దెలియదగినది. 1

నవగ్రహములయొక్క లోక వ్యవహారార్థమగు పర్యాయనామములు.

శ్లో. హేళి స్సూర్య శ్చంద్రమా శ్శీతరశ్మి
ర్హేమ్నో విడ్జ్ఞో బోధన శ్చేందుపుత్రః
ఆరోవక్రః క్రూరదృ క్చావనేయః
కోణోమంద స్సూర్య పుత్రోసితశ్చ. 2

1. సూర్యునకు=హేళిః, సూర్యః, అను 2 నామములు.
2. చంద్రునకు=చంద్రమాః, శీతరశ్మి, అను 2 నామములు.
3. అంగారకునకు=ఆరః, వక్రః, క్రూరదృక్, ఆవనేయః, అను 4 నామములు.
4. బుధునకు=హేమ్నః, విట్, జ్ఞః, బోధనః, ఇందుపుత్రః, అను 5 నామములు.

శ్లో. జీవోంగిరా స్సురగురుర్వచసాంపతిర్జ్యో
శుక్రో భృగుర్భృగు సుతస్సిత ఆస్ఫుజిచ్చ
రాహు స్తమోగుర సురశ్చ శిఖితి కేతుః
పర్యాయమన్య ముపలభ్య వదేచ్చ లోకాత్. 3

5. గురువునకు=జీవః, అంగిరాః, సురగురుః, వచసాంపతిః, ఇజ్యః, అను 5 నామములు.
6. శుక్రునకు=శుక్రః, భృగుః, భృగుసుతః, సితః, ఆస్ఫుజిత్, అను 5 నామములు.
7. శనైశ్చరునకు= కోణః, మందః, సూర్యపుత్రః, అసితః, అను 4 నామములు.
8. రాహువునకు=రాహుః, తమః, అగుః, అసురః, అను 4 నామములు.
9. కేతువునకు=శిఖీ, కేతుః, అను 2 నామములు గలవు.

తక్కిన పర్యాయ నామంబుల లోకవ్యవహార సిద్ధములైన నిఘంటువుల వలన దెలిసి కొనవలయును.

## గ్రహముల రక్తశ్యామాది వర్ణములు.

శ్లో. రక్తశ్యామో భాస్కరో గౌర ఇందు
ర్నాత్యుచ్చాంగో రక్తగౌరశ్చవక్రః
దూర్వాశ్యామో జ్ఞో గురుర్గౌరగాత్రః
శ్యామశ్శుక్రో భాస్కరిః కృష్ణదేహః. 4

టీ. భాస్కరః = సూర్యుఁడు, రక్తశ్యామః = రక్తశ్యామ మిశ్రవర్ణుఁడు, అనఁగా కలిగొట్టు పువ్వువర్ణముగలవాఁడు. ఇందుః = చంద్రుఁడు, గౌరః = శ్వేతవర్ణుఁడు, నాత్యుచ్చాంగః = మిక్కిలి ఉన్నతశరీరుఁడుగాక యున్న, వక్రః = అంగారకుఁడు, రక్తగౌరః = రక్తగౌరవర్ణుఁడు, అనఁగా దీప్తాగ్ని సమానవర్ణుఁడు. జ్ఞః = బుధుఁడు, దూర్వాశ్యామః = గరికవన్నెగలవాఁడు, అనఁగా ఆకుపచ్చ వర్ణముగలవాఁడు. గురుః = బృహస్పతి, గౌరగాత్రః = పసుపువర్ణముగలవాఁడు, అనఁగా తప్తకాంచనవర్ణుఁడు. శుక్రః = శుక్రుఁడు, శ్వేతః = తెల్లనివాఁడు, భాస్కరిః = శని, కృష్ణదేహః = నీలవర్ణుఁడు.

తా. సూర్యుఁడు రక్తశ్యామ మిశ్రవర్ణముగలవాఁడు. అనగా పాటల పువ్వువర్ణము గలవాఁడు. చంద్రుఁడు శ్వేతవర్ణముగలవాఁడు. ఉన్నతశరీరుఁడు కాని అంగారకుఁడు రక్తగౌరవర్ణుఁడు. అనగా మండునట్టి యగ్నివర్ణము గలవాఁడు. బుధుఁడు గరికవంటి ఆకుపచ్చ వర్ణము గలవాఁడు. బృహస్పతి పసుపువర్ణముగలవాఁడు. అనగా తప్తకాంచనవర్ణుఁడు. శుక్రుఁడు తెల్లనివాఁడు. శని నీలవర్ణము గలవాఁడు. ఇందులకు ప్రయోజనము:—జనన కాలమునందు బలాధిక గ్రహవర్ణ సమానుఁడు జాతకుఁడగునని యూహింపదగును. మరియు హృతనష్టాది ప్రశ్నలయందు బలవద్గ్రహ వర్ణసమానవర్ణమును చోరాదులకు జెప్పవలయును. 4

## గ్రహములకు తామ్రాది వర్ణాధిపత్యములు అధిదేవతలు దిశాధిపత్యములు సౌమ్యపాపత్వములు.

శ్లో. వర్ణాస్తామ్ర సితాతిరక్తహరిత వ్యాపీత చిత్రాసితా
వహ్న్యంబ్వగ్నిజ కేశవేంద్ర శచికా స్సూర్యాదినాథా క్రమాత్
ప్రాగాద్యా రవిశుక్రలోహితతమ స్సౌరీందు విత్సూరయః
క్షీణేంద్వర్కమహీసు తార్కతనయాః పాపాబుధస్తైర్యుతః. 5

టీ. తామ్రసితాతి రక్తహరిత వ్యాపీత చిత్రాసితాః = తామ్రాదివర్ణములు, సూర్యాదినాథాః = సూర్యాదిగ్రహములే అధిపతులుగాఁగలవి. అదియెట్లనిన:—తామ్రవర్ణమునకు సూర్యుఁడు. శ్వేతవర్ణమునకు చంద్రుఁడు. అతిరక్త = అత్యంతరక్తవర్ణమునకు కుజుఁడు. హరిత = పచ్చవర్ణమునకు బుధుఁడు. వ్యాపీత = పసుపుచాయకు బృహస్పతి. చిత్ర = నానావర్ణము నకు శుక్రుఁడు. అసిత = నీలవర్ణమునకు శని. ఈప్రకారముగా అధిపతులగుదురు. వహ్న్యంబ్వ

గ్నిజకేశవేంద్రశచికాః = వహ్న్యాదులు (వరుసగా) సూర్యాదినాథాః = సూర్యాదిగ్రహము లకు అధిదేవతలగుదురు. అదియెట్లనిన:— వహ్ని=అగ్నిహోత్రుఁడు సూర్యునికి, అంబు=ఉదకము, చంద్రునికి. అగ్నిజ = కుమారస్వామి, కుజునికి. కేశవ = విష్ణువు, బుధునికి. ఇంద్ర = దేవేంద్రుఁడు, బృహస్పతికి. శచీ = శచీదేవి, శుక్రునికి. కః = బ్రహ్మ, శనికి. అధిదేవతలు. రవిశుక్రలోహిత తమ స్సౌరీందువిట్సూరయః = రవ్యాది గ్రహములు, (వరుసగా) ప్రాగాద్యాః = ప్రాగాది దిశాధిపతు లగుచున్నారు. అదియెట్లనిన:—రవి తూర్పునకు. శుక్రుఁడు ఆగ్నేయమునకు. లోహిత=కుజుఁడు, దక్షిణమునకు. తమః=రాహువు, నైరృతమునకు. సౌరి = శని, పశ్చిమమునకు. ఇందు= చంద్రుఁడు వాయవ్యమునకు. విట్ = బుధుఁడు, ఉత్తరమునకు. సూరి = బృహస్పతి, ఈశాన్యమునకును అధిపతులగుదురు. క్షీణేంద్వర్క మహీసుతార్కతనయాః—క్షీణేందు= క్షీణచంద్రుఁడు, అర్కః = సూర్యుఁడు, మహీసుతః= అంగారకుడు, అర్కతనయః = శని. వీరలు పాపాః = పాపగ్రహములు, తైః = ఆపాపగ్రహములతో, యుతః= కూడిన, బుధః = బుధుఁడును, పాపగ్రహము. పూర్ణచంద్రుఁడు, పాపయుతుఁడు గాని బుధుఁడు, గురువు శుక్రుఁడు వీరలు శుభగ్రహములు.

తా. సూర్యుఁడు తామ్రవర్ణమునకును, చంద్రుడు శ్వేతవర్ణమునకును, అంగారకుఁ డత్యంత రక్తవర్ణమునకును, బుధుఁడు పసరువన్నెకును, బృహస్పతి పసుపుచాయకును, శుక్రుడు నానావర్ణములకును, శని నీలవర్ణమునకును అధిపతులు. 5

గ్రహముల అధిదేవతలు.—సూర్యునకు అగ్నిహోత్రుఁడు, చంద్రునకు ఉదకము, అంగారకునకు కుమారస్వామి, బుధునకు విష్ణువు, బృహస్పతికి దేవేంద్రుఁడు, శుక్రునకు శచీదేవి, శనికి బ్రహ్మయు అధిదేవతలు. ఇందుకు ప్రయోజనము:— నవగ్రహ పూజాదుల యందు గ్రహముల అధిదేవతల పూజజేయుట మొదలగునవి. ఇందులకుదాహరణముగ సారావళి "శ్లో. తామ్రసితాతిరక్త హరితవ్యాపీత విచిత్రా సితా ఇనాదీనాం, పావకజల గుహ కేశవ శక్ర శచీ వేధసః పతయః, పూర్వాది గ్రహదేవాం స్తన్మంత్రై స్సమభి పూజ్యతామాశాం, కనక గజ వాహనాదీన్ ప్రాప్నోతి నృపో రితశ్చిఘ్రం." అని యున్నది.

గ్రహముల దిశాధి పత్యములు.—సూర్యుఁడు తూర్పునకు, శుక్రుడు ఆగ్నేయమునకు, అంగారకుఁడు దక్షిణమునకు, రాహువు నిఋతికిని, శని పశ్చిమమునకు, చంద్రుడు వాయవ్యమునకు, బుధుఁడు ఉత్తరమునకు, బృహస్పతి ఈశాన్యమునకును అధిపతు లగుదురు.

ఇందుల కుపయోగము:—కేంద్రమునందు ఏగ్రహముండునో ఆగ్రహమునకు చెప్పఁబడిన దిక్కున ప్రసవించిన గృహద్వారము నిర్ణయించుటకును, చోరాదులగమన దిశ నెరుంగుటకును వీలుగానున్నది. ఇదియు, కృష్ణపక్షపు చంద్రుఁడును, సూర్యుఁడును, అంగారకుఁడును, శనియు పాపగ్రహములు. ఈగ్రహముల నాల్గింటిని గూడిన బుధుడును పాపగ్రహము. సంపూర్ణ చంద్రుఁడును, పాపగ్రహయుతుడుగాని బుధుఁడును, గురువు, శుక్రుడు, వీరలు శుభగ్రహములు. చంద్రుడు శుక్లపక్ష ప్రతిపదాగత్య 10 దినములు మధ్యమబలుఁడు,

శుక్లపక్ష ఏకాదశి మొదలు కృష్ణపక్ష పంచమివరకు 10 దినములు పూర్ణబలుడు, కృష్ణపక్ష షష్ఠి మొదలు అమావాస్యవరకు 10 దినములు దుర్బలుడు, అయినను శుభగ్రహ వీక్షణ గల్గియుండిన పక్షమున యెల్లప్పుడును బలవంతుడే యగును. ఇందుల కుదాహరణము:—యవనేశ్వరుడు "శ్లో. మాసేతు శుక్ల ప్రతిపత్ప్రవృత్తేః పూర్వే శశీ మధ్యబలో దశాహే, శ్రేష్ఠో ద్వితీయే ల్పబలస్తృతీయే, సౌమ్యైశ్చ దృష్టో బలవాన్ సదైవ." అని చెప్పియున్నాడు. మరియు, కాలామృతము ప్రథమబిందువున చంద్రునియొక్క పూర్ణత్వక్షీణత్వములను జూడఁగ దెలియును. గ్రహసౌమ్య పాపత్వ ప్రయోజనము:—జననకాలమునందు పాపగ్రహములు బలవంతులై యుండిరేని, జాతకుడు పాపచిత్తుడగుననియు, సౌమ్యగ్రహములు బలవంతులై యుండుగాని వారిస్వభావము ననుసరించి జాతకునకు సౌమ్యస్వభావము గలిగియుండుననియు దెలియదగినది.

## గ్రహములకు పుం స్త్రీ నపుంసక సంజ్ఞలు పంచభూతాధిపత్యములు.




శ్లో. బుధసూర్యసుతౌ నపుంసకాఖ్యౌ శశిశుక్రౌ యువతీ నరాశ్చ శేషాః
శిఖిభూఖపయోమరుద్గణానాం వశినో భూమిసుతాదయః క్రమేణ. 6

టీ. బుధసూర్యసుతౌ = బుధశనులు, నపుంసకాఖ్యౌ = నపుంసకులనెడు సంజ్ఞగలవారు, శశిశుక్రౌ = చంద్రశుక్రులు, యువతీ = స్త్రీసంజ్ఞగలవారు, శేషాః = రవికుజగురువులు, నరాః = పురుషగ్రహములు. శిఖిభూఖపయోమరుద్గణానాం = అగ్న్యాది భూతములకు, క్రమేణ = వరుసగా, భూమిసుతాదయః = అంగారకాది గ్రహములు, అధిపాః = అధిపతులు,

అది యెట్లనిన:— శిఖి = అగ్నికి, కుజుఁడు. భూ = భూమికిబుధుఁడు, ఖ = ఆకాశమునకు, బృహస్పతి. పయః = జలమునకు, శుక్రుఁడు. మరుద్గణ = వాయువునకు శని, పూర్వమందు అగ్నికి సూర్యుఁడును, జలమునకు చంద్రుఁడును చెప్పఁబడెను. కనుక ఇక్కడ చెప్పలేదు.

తా. బుధశనులు, నపుంసకగ్రహములు, చంద్రశుక్రులు స్త్రీగ్రహములు, సూర్యకుజగురులు, పురుషగ్రహములు, ఇందుకలన జననకాలమున బలవంతులగు గ్రహములం దెవ్వరు అమితబలుఁడో ఆగ్రహసంజ్ఞాను రూపప్రకృతిని జాతకునకు చెప్పవలెను. ఇతరగ్రంథములందు రాహువు స్త్రీగ్రహమనియు కేతువు నపుంసక గ్రహమనియు దెలియజేసి యున్నారు. మరియు శిఖిభూఖపయో మరుద్గణములకు వరుసగా భూసుతాదులు అధిపతులనుటవలన అగ్నికి అంగారకుఁడు, భూమికి, బుధుఁడు, ఆకాశమునకు బృహస్పతి. జలమునకు శుక్రుఁడు, వాయువునకు శనియు అధిపతులగుచున్నారు. పూర్వమే, అగ్నికి, సూర్యుడును, జలమునకు చంద్రుఁడును అధిపతులని చెప్పియుండుటవలన యీశ్లోకపాదమున పంచభూతాధి పత్యమును జెప్పుచు సూర్యచంద్రుల ఆధిపత్యమును చెప్పలేదు. ఇందులకు ప్రమాణము, "ఛాయాం మహాభూత కృతాంచసర్వే భివ్యంజయంతి స్వగుణానువాప్య" అని దశాఫలమను గ్రంథమునందున్నది. 6

## గ్రహములకు బ్రాహ్మణాది వర్ణాధిపత్యములు సత్వరజ స్తమోగుణ విభాగములు.

శ్లో. విప్రాదితశ్శుక్ర గురూకుజార్కౌ శశీబుధశ్చేత్య సితోంత్యజానాం
చంద్రార్కజీవాజ్ఞసితౌ కుజార్కీ యథాక్రమం సత్త్వరజ స్తమాంసి. 7

టీ. విప్రాదితః=బ్రాహ్మణ వర్ణము మొదలుగాఁగల నాలుగు వర్ణములకును శుక్రబృహస్పత్యాదు లధిపతులగుదురు. అదియెట్లనిన:— శుక్ర గురూః=శుక్రబృహస్పతులు బ్రాహ్మణవర్ణమునకును, కుజార్కౌ=అంగారకసూర్యులు క్షత్రియవర్ణ మునకును, శశీ = చంద్రుఁడు వైశ్య వర్ణమునకును, బుధః = బుధుండు శూద్ర వర్ణమునకును, అసితః = శనైశ్చరుఁడు, అంత్యజానాం = సంకరజాతులైన చండాలమాగధాదులకును అధిపతులగుదురు. చంద్రార్కజీవాః = చంద్రరవిగురులును, జ్ఞసితౌ = బుధ శుక్రులును, కుజార్కీ = కుజశనైశ్చరులును, యథాక్రమం = వరుసగా. సత్త్వరజస్తమాంసి= సత్త్వరజస్తమోగుణాధిపతులౌదురు.

తా. శుక్ర బృహస్పతులు, బ్రాహ్మణ వర్ణమునకు, అంగారక సూర్యులు, క్షత్రియ వర్ణమునకు, చంద్రుఁడు వైశ్యవర్ణమునకు, బుధుఁడు శూద్రవర్ణమునకు, శనైశ్చరుఁడు సంకర జాతులగు చండాలాది మాగధాదులకును అధిపతులగు చున్నారు. ఇది గ్రహబలము ననుసరించి ప్రశ్నకాలమున చోరాదులవర్ణమును గ్రహింప నుపయుక్తమగుచున్నది. 7

గ్రహముల సత్వరజస్తమోగుణములు. చంద్రసూర్యగురులు సత్వగుణముగలవారు,బుధశుక్రులు రజోగుణముగలవారు, శనిఅంగారకులు తమోగుణము గలవారు,జననకాలమునత్రింశాంశాధి పత్యమువహించినగ్రహగుణము జాతకునకు గల్గుననియు, "శ్లో. బలవద్భిస్తగ్గుణో

భవేజ్జ్ఞాతః." అను శ్రీదేవకీర్తి వచనాను సారముగ బలాధికులగు గ్రహముల గుణములు జాతకునకు జెప్పవలయుననుట ప్రయోజనముగానున్నది. యవనేశ్వరుడు :— "శ్లో. సత్త్వాధికా భాస్కరభౌమజీవాః ప్రగ్వాత్మజో రాజసికశ్శశీచ, శనైశ్చరస్తామసికో బుధస్తు, సంగాద్గుణాన్ లభతే విశేషాత్." అను శ్లోకమున, కుజునకు సత్త్వగుణమును జెప్పియున్నాడు. అయినను, సత్యాచార్యులవారు:—"శ్లో. తామసికౌ కుజసౌరీ రాజసికౌ భార్గవశ్శశిసుతశ్చ, జీవశశిభాస్కరాస్సాత్త్వికాగ్రహ ప్రకృతయో న్యూనాం." అని చెప్పియుండుటవలన వరాహమిహిరాచార్యులవారు సత్యాచార్యులవారి మతమునే సమ్మతించియున్నారు. కుజునకు తామసగుణమును జెప్పియుండగా "సత్త్వంకుజః" అని కుజునకు సత్త్వగుణాధిపత్యమును జెప్పుటవలన సత్త్వశబ్దార్థము శౌర్యమని యూహింపదగి యున్నది.

సత్త్వాదిగుణ స్వరూపము:— "శ్లో. యస్యాన్తిర్వాకస్తస్య దయాస్థైర్యం సత్త్వర్జితి బ్రాహ్మణదేవభక్తిం, రజోధిక కావ్యకళావ్రతి స్త్రీ సంసక్తచిత్తః పురుషోతి శూరః తమోధికో వంచయితాం పరేషాం మూర్ఖోలసః క్రోధపరోతి నిద్రః." అనియున్నది.

## గ్రహ స్వరూపములు.

### సూర్యచంద్రుల స్వరూపములు.

శ్లో. మధుపింగళదృక్ చతురశ్రతనుః పిత్తప్రకృతి స్సవితాల్పకచః
తనువృత్తతను ర్బహువాతకఫః ప్రాజ్ఞశ్చశశీమృదువాక్ శుభదృక్. 8

టీ. సవితా=సూర్యుడు, మధుపింగళదృక్=తేనెవలె పింగళవర్ణమైన కన్నులుగలవాడును, చతురశ్రతనుః = చతుష్కోణమై, ప్రసారిత భుజద్వయప్రమాణ సమోన్నత శరీరముగలవాడును, పిత్తప్రకృతిః=పిత్తాధికస్వభావము గలవాడను, అల్పకచః=స్వల్పకేశములుగలవాడును అని తెలియునది. శశీ=చంద్రుడు, తను= కృశమై, వృత్త=వర్తులమైన, తనుః= దేహముగలవాడును. బహువాతకఫః=అధికవాతశ్లేష్మవ్యామిశ్రదేహుడును, ప్రాజ్ఞశ్చ=మంచిమేధగలవాడును, మృదువాక్=మధురమైన వాక్కుగలవాడును, శుభదృక్=శ్రేష్ఠమైన దృష్టిగలవాడను.

తా. సూర్యచంద్రుల స్వరూపములు:—

సూర్యుడు:— తేనెవంటి కన్నులుగలవాడు, చతుష్కోణమై ప్రసారిత భుజద్వయ ప్రమాణసమోన్నత శరీరముగలవాడు, స్వల్పకేశములుగలవాడు, అని తెలియునది.

చంద్రుడు:— కృశమై వర్తులమగు దేహముగలవాడు, అధికవాతశ్లేష్మ వ్యామిశ్రదేహుడు, మంచిమేధస్సును, మధురవాక్కును, శ్రేష్ఠమగు దృష్టియును గలవాడ. 8

### అంగారక బుధుల స్వరూపములు.

శ్లో. క్రూరదృక్తరుణమూర్తిరుదారః పైత్తికస్సుచపలః కృశమధ్యః
శ్లిష్టవాక్సతతహాస్యరుచి ర్జ్ఞః పిత్తమారుత కఫప్రకృతిశ్చ. 9

టీ. క్రూరదృక్ = అంగారకుడు, తరుణమూర్తిః = నిత్యయౌవనయుక్త శరీరము గలవాడును, ఉదారః = ఈవిగలవాడును, పైత్తికః = పైత్యాధిక స్వభావము గలవాడును, సుచపలః = మిక్కిలి అస్థిరచిత్తుండును, తనుమధ్యః = సన్నమైన నడుము గలవాడును. జ్ఞః = బుధుండు, శ్లిష్టవాక్ = గద్గదభాషియును, సతతహాస్యరుచిః = ఎల్లప్పుడు పరిహాసమందు ప్రీతి గలవాడును, పిత్తమారుతకఫప్రకృతిః = పైత్యవాతశ్లేష్మములనెడు మూడుదోషములతోఁ గూడినస్వభావము గలవాడును అగుదురు.

తా. అంగారకబుధుల స్వరూపములు.

అంగారకుఁడు:—నిత్యయౌవనయుత శరీరముగలవాఁడు, ఉదారుడు, పిత్తాధిక స్వభావముగలవాఁడు, చపలచిత్తుఁడు, సన్నమగు నడుముగలవాడు నని తెలియదగినది.

బుధుడు:—గద్గదభాషి, ఎల్లప్పుడును పరిహాసమునందు ప్రీతిగలవాఁడు, పిత్త వాత శ్లేష్మములనెడు వాటితో గూడిన స్వభావముగలవాడని యెఱుంగునది.

## గురు శుక్రుల స్వరూపములు.

శ్లో. బృహత్తనుః పింగళమూర్ధజేక్షణో బృహస్పతిః శ్రేష్ఠమతిః కఫాత్మకః
భృగుస్సుఖీకాంత వపుస్సులోచనః కఫానిలాత్మాసితవక్రమూర్ధజః. 10

టీ. బృహస్పతిః = గురువు, బృహత్తనుః= స్థూలశరీరుడును, పింగళమూర్ధజేక్షణః=స్వర్ణవర్ణమైన వెండ్రుకలును కన్నులునుగలవాఁడును, శ్రేష్ఠమతిః = శ్రేష్ఠమైన బుద్ధిగలవాఁడును, కఫాత్మకః=శ్లేష్మాధికస్వభావుండును. భృగుః = శుక్రుడు, సుఖీ=నిత్యసుఖాసక్తుండును, కాంతవపుః= సుందరశరీరుండును, సులోచనః = మంచికన్నులు గలవాఁడును, కఫానిలాత్మా=శ్లేష్మవాతాధిక స్వభావుండును, అసితవక్రమూర్ధజః=నల్లనై వక్రములైన తలవెండ్రుకలు గలవాఁడును.

తా. గురుశుక్రుల స్వరూపములు. 10

గురువు.—స్థూలశరీరుఁడు, బంగారువర్ణపు వెండ్రుకలను, కన్నులనుగలవాఁడు, ధర్మబుద్ధిగలవాఁడు, అధికమగు శ్లేష్మస్వభావుఁడు, అని తెలియదగినది.

శుక్రుఁడు:—నిత్యసుఖమునం దాసక్తిగలవాఁడు, సౌందర్యమగు శరీరముగలవాఁడు. మంచికన్నులుగలవాఁడు, శ్లేష్మవాతాధిక స్వభావుఁడు, నల్లనివై, వక్రములగు తలవెండ్రుకలు గలవాడు. అని యెఱుంగవలయును.

## శని స్వరూపమును గ్రహముల శల్యరక్తాధి కారములు.

శ్లో. మందోలసః కపిలదృక్కృశదీర్ఘగాత్రః
స్థూలద్విజః పరుషరోమకచోనిలాత్మా
స్నాయ్వస్థ్యసృక్త్వగథ శుక్లవసాస్సమజ్జా
మందార్క చంద్రబుధ శుక్రసురేజ్యభౌమాః. 11

**టీ.** మంద = శనైశ్చరుఁడు, అలసః = పనులయందు త్వరలేనివాఁడును, కపిలదృక్ = కపిల వర్ణమైన కన్నులుగలవాఁడును, కృశదీర్ఘగాత్రః = కృశించి పొడవైన శరీరముగల వాఁడును, స్థూలద్విజః = గొప్పదంతములు గలవాఁడును, పరుషరోమకచః = ముండ్లవలె తీక్ష్ణములైన తలవెంట్రుకలు గలవాఁడును, అనిలాత్మా = వాతప్రకృతి గలవాఁడును. మందాదిగ్రహములకు క్రమముగా స్నాయ్వాదులు సారవంతంబులైయుండును, అదియెట్లనినః—స్నాయు = నరము, మంద = శనికి, అస్థి = యెముక, అర్క = సూర్యునికి, అసృక్ = నెత్తురు, చంద్ర = చంద్రునికి, త్వక్ = చర్మము. బుధః = బుధునికి, శుక్ల = రేతస్సు, శుక్రః = శుక్రునికి, వసా = మెదడు, సురేజ్య = గురువునకు, మజ్జా = ఎముకలోనుండెడు ధాతువిశేషము, భౌమ = కుజునకును, బలమై యుండును.

**తా.** శనైశ్చరుఁడు:—కార్యములనన్నిటిని ఆలస్యముగ జక్కబెట్టుకొనువాఁడు, కపిల వర్ణపు కన్నులుగలవాఁడు, కృశించి పొడవైన శరీరముగలవాఁడు, గొప్పవగు దంతములు గల వాఁడు, ముండ్లవలె తీక్ష్ణమగు వెండ్రుకలను దేహమునందును తలయందును గలవాఁడు, వాత, పిత్త, స్వభావుఁడు అని యెఱుంగునది. 11

గ్రహములకు శల్యరక్తాదుల అధికారము.— శనికి నరములు, డొంకలు. సూర్యునకు, ఎముకలు. చంద్రునకు, రక్తము. బుధునకు, చర్మము. శుక్రునకు, రేతస్సు. గురువునకు, స్రవించు మేధస్సు. అంగారకునకు, ఎముకలలోనుండెడు ధాతువిశేషములు అధికారత గొప్పను.

గ్రహముల స్వరూప ధాతువిశేషముల ప్రయోజనము:—జనన కాలమున యేగ్రహము బలవంతమైయుండునో ఆగ్రహస్వరూపమును తదుక్తమగు ధాతువిశేషమును జాతకునకు జెప్పవలయును. హృతనష్టాది ప్రశ్నలయందు చోరాదులు బలవంతులగు గ్రహముల స్వరూప ధాతుసారంబుగల వారనియు, వ్యాధిసంబంధములగు ప్రశ్నలయందు ప్రశ్నకాలలగ్న నవాంశాధిపుల బలాబలముల ననుసరించి ఆగ్రహములకు జెప్పబడియుండు వాత పిత్త శ్లేష్మాదిదోషములచేత వ్యాధి పీడగలిగినదని జెప్పుటకు వీలగుచున్నది.

### గ్రహములకు స్థానవస్త్ర ద్రవ్యములును లగ్నగతగ్రహవశంబున ఋతునిర్ణయములు.

శ్లో. దేవాంబ్వగ్ని విహారకోశ శయనక్షిత్యుత్కరేశాః క్రమా
ద్వస్త్రంస్థూల మభుక్త మగ్నికహతం మధ్యాదృఢం స్ఫాటితం
తామ్రంస్యాన్మణి హేమయుక్తి రజతాన్యర్కాచ్చముక్తాయసీ
ద్రేక్కాణైః శ్శిశిరాదయ శ్శశిరుచజ్ఞ గ్వాదిష్వ ద్యత్సువా. 12

**టీ.** అర్కాత్ = సూర్యుడు మొదలుకొని సప్తగ్రహములును, క్రమాత్ = వరుసగా దేవాదిస్థానములకు అధిపతులగుదురు. అదియెట్లనిన.— దేవ = దేవస్థానమునకును, దేవపూజా గృహమునకును సూర్యుఁడు, అంబు = జలసమీపమునకును స్నానశాలకును చంద్రుఁడు, అగ్ని = అగ్నిసమీపమునకును పాకశాలకును కుజుఁడు, విహార = క్రీడాగృహమునకు బుధుఁడు, కోశ =

బొక్కసపు గృహమునకు బృహస్పతి, శయన=శయనమునకు శుక్రుఁడు, క్షిత్యుత్కర=భూప రాగరాశికి శనైశ్చరుఁడు. ఈరీతిగా వీరలీ చెప్పంబడిన స్థానములకు, ఈశాః = అధిపతులు. స్థూలం = ముదుఱైన, వస్త్రం = వస్త్రము సూర్యునికి, అభుక్తం = క్రొత్తవస్త్రము చంద్రునికి, అగ్నిహతం = ఒకతట్టు కాలినవస్త్రము కుజునికి, జలాహతం = నీళ్లచేతపికిలినవస్త్రము బుధునికి. (తడిసినవలువయని కొందఱు.) మధ్యం = నడివయస్సుగల వస్త్రము గురునికి, దృఢంగట్టి వస్త్రము శుక్రునికి. స్ఫాటితం = చినిగినవస్త్రము శనికి. 12

తా. గ్రహములకు స్థానాధిపత్యములు:— సూర్యుఁడు దేవపూజా గృహంబునకును, చంద్రుఁడు జలసమీపమునకును, స్నానశాలకును, కుజుఁడు అగ్నిసమీపమునకును, పాకశాలకును, బుధుఁడు క్రీడాగృహమునకును, బృహస్పతి ధనాగారంబునకును, శుక్రుఁడు శయనమందిరమునకును, శనైశ్చరుఁడు భూపరాగరాశికిని అధిపతులగుదురు. ఇందులకు ప్రయోజనము:—జననకాలమునందు బలవద్గ్రహవశంబున నాయా గ్రహంబునకుం జెప్పబడిన స్థానమునందు జననస్థానమును నిర్ణయించుటకును, చోరాదులవిషయము నెఱుంగువిషయమున చోరుఁడుగాని, చోరుఁడపహరించిన ద్రవ్యముగాని, బలవద్గ్రహస్థానమం దుండుననియు తెలియును. 12

గ్రహాయుక్త వస్త్రములు:— సూర్యునకు ముదిరినవస్త్రము, చంద్రునకు క్రొత్తవస్త్రము అంగారకునకు, ఒకతట్టు కాలిన వస్త్రము బుధునకు, నీళ్లచేత పికిలినవస్త్రమును (తడివస్త్రమనుట కొందరి యుద్దేశము.) గురువునకు నడివయస్సుగల వస్త్రమును, శుక్రునకు గట్టివస్త్రమును, శనైశ్చరునకు చినిగిన వస్త్రమును, యుపయోగము. ఇందుకు ప్రయోజనము:— బలవద్గ్రహ వశంబున సూతికావస్త్రంబును, హృతనష్టాది చింతయందు చోరాగుల వస్త్రమును, దెలియుట.

సూర్యాదులకు తామ్రాదులు, ద్రవ్యంబులు:— సూర్యునకు తామ్రము, చంద్రునకు మణులు, అంగారకునకు బంగారము, బుధునకు పిత్తళి, కంచు మొదలగునవి. బృహస్పతికి వెండి. శుక్రునకు ముత్యములు. శనికి ఇనుము, సీసము. ఇది గాక స్వస్థానగతుఁడైన బృహస్పతికి స్వర్ణమనియు ఈగ్రంథకర్తచేతనే లఘుజాతమునందు చెప్పబడియున్నది. "శ్లో. అర్కాది తామ్ర మణి హేమయుక్తి రజతానిమౌక్తికం, లోహం చ నిర్వ్యం బలవద్భిః స్వస్థానే హేమ జీవేపి." అనియు. అట్లే బాదరాయణుఁడును. "అర్కస్య తామ్రం మణయోహిమాంశో, ర్భౌమస్య హేమేంగుసుతస్యయుక్తిః, జీవస్యరౌప్యం స్వగృహేస్థితస్య, తస్యైవహేమో శనస్సమ్ముక్తాః, తీక్ష్ణాంశుదేవ ప్రభవస్యసీసం, కృష్ణాయసంచ ప్రవదంతిసంతః."అనియున్నది. ప్రయోజనము:—జననకాలమున బలవద్గ్రహవశంబున సూతికాగృహమందు దీపభాజనాది పరిజ్ఞానము, జన్మకాలమునందు కేంద్రనవాంశాది స్థితిబలీయ గ్రహములయొక్క దశ అంతర్దశలయందు తదుక్తద్రవ్యలాభము. శత్రుక్షేత్ర, నీచగాశిస్థితియుతమై హీనబలగ్రహ దశయందు తదుక్త ద్రవ్యక్షయము మొదలగునవి తెలియదగినది. మఱియు. "శశుకుచజ్ఞగ్వాదిషు." అనగా, శ, శు, కు, చ, జ్ఞ, గు. అను నాద్యక్షరములు గల్గిన శని, శుక్ర, అంగారక, చంద్ర,

బుధ, గురులు, లగ్నగతు లగుచుండగా శిశిరాదిషడృతువులు తెలియదగినవి. మరియు ద్రేక్కాణముల బలీయము ననుసరించియైనను శిశిరాదిషడృతువుల నిర్ణయింపనగును. లగ్నమున గ్రహమున్నయెడల తదుక్తమగు ఋతువును జెప్పవలయుననియు, లగ్నము గ్రహయుక్తము గాకయుండిన ద్రేక్కాణముల యందున్న గ్రహముల వరుసగా బలీయాదులను వరుసక్రమము ననుసరించి ఋతునిర్ణయము చేయవలయుననియు, లగ్నమునందు బహుగ్రహము లున్నయెడల బలవద్గ్రహము ననుసరించి యని కొందరును, ద్రేక్కాణాధిపు ననుసరించియే ఋతునిర్ణయము చేయవలెనని మతికొందరును చెప్పుచున్నారు. లగ్నయుక్త గ్రహముగాని ద్రేక్కాణాధిపతిగగాని శనియయినయెడల, శిశిరఋతువనియు, శుక్రుడగునెడల వసంతఋతువనియు, అంగారకుడయ్యేనేని గ్రీష్మఋతువనియు, చంద్రుడగునెడల వర్షఋతువనియు, బుధుడైనయెడల శరదృతువనియు, గురువాయెనేని హేమంతఋతువనియు నిర్ణయింపవలయును. ఇదియుగాక, "శ్లో. గ్రీష్మరుధ ప్రవదంతిరుజాన్క్కా—." అను బాదరాయణాని వచనము ననుసరించి లగ్న ద్రేక్కాణగతుండైన సూర్యుడుండినను గ్రీష్మఋతువు జెప్పదగినది. ఇందుల ప్రయోజనము:—నష్టజాతకము గుణించుకాలము నేఋతువునందు జేరియున్నదని తెలిసికొనుటకును, ఆరూఢ ప్రశ్నలయందు లాభాలాభ జయాపజయాది కాల పరిజ్ఞానము నష్టవస్తుకాలము నెరుంగుటకును యుపయోగము. ఈ బృహజ్జాతక గ్రంథకర్తయగు శ్రీవరాహ మిహిరాచార్యులవారు రచియించిన లఘుజాతకమునందు మాత్రము. "ఋగధర్వ సామయజుషామధిపాగురు సౌమ్యభౌమసితాః." అని చెప్పియుండుటవలన యీ గ్రంథమునందు గ్రహములకు జెప్పబడియుండు ఆధిపత్యములుగాక, ఋగ్వేదమునకు గురువు, అధర్వణవేదమునకు బుధుడు, సామవేదమునకు కుజుడు, యజుర్వేదమునకు శుక్రుడును అధిపతు లగుదురని తెలియదగినది. ప్రయోజనము:—అనిష్టస్థానగత గ్రహములకును, క్రూరదృష్టిగల గ్రహములకును, తదుక్త శాఖామంత్రములచేత గ్రహశాంతి చేయుటకును, బ్రాహ్మణాదుల జననకాలమునందు బలవంత గ్రహోక్తశాఖాధ్యయనశీలుడగునని జాతకునకు జెప్పుట కుపయోగము.

## గ్రహములకు అన్యోన్య దృష్టిస్థానములు: నైసర్గిక దృష్టిబలములు.

శ్లో. త్రిదశ త్రికోణ చతురశ్ర సప్తమా నవలోకయంతి చరణాభి వృద్ధితః
రవిజామరేజ్యరుధిరాః పరేచయే క్రమశోభవంతి కిలవీక్షణేధికాః. 13

టీ. త్రిదశ = తృతీయ దశమ స్థానములను అక్కడనున్న గ్రహములను పాదదృష్టిచేతను, త్రికోణ = పంచమ నవమములను అక్కడనున్న గ్రహములను అర్ధదృష్టిచేతను, చతురశ్ర = అష్టమ చతుర్థములను అక్కడనున్న గ్రహములను త్రిపాద దృష్టిచేతను, సప్తమ = సప్తమమును అక్కడనున్న గ్రహములను సంపూర్ణదృష్టిచేతను, చూతురనుట. రవిజామరేజ్యరుధిరాః = శనిగురుకుజులును, అపరేచ = ఇతరగ్రహములును, ( త్రిదశాది స్థానక్రమముగా )

వీక్షణే = చూచుటయందు, అధికాః = సంపూర్ణదృష్టిగలవారలు, భవంతికిల = అవుచున్నారు. అని చెప్పఁబడియున్నది. సర్వగ్రహములకును సప్తమస్థానమందు సంపూర్ణదృష్టి అర్థసిద్ధమై యున్నప్పటికిని మరల సూర్యచంద్రబుధశుక్రులకు సప్తమమందు సంపూర్ణదృష్టి చెప్పుటవలన, సంపూర్ణదృష్టియందు ఇతర గ్రహములకంటెను సూర్యచంద్ర బుధ శుక్రులు అధిక ఫలప్రదులని తెలియఁదగినది. ఈ తెలియఁజేయఁబడిన అర్థము, అనేక గ్రంథకర్తల సమ్మతముగానున్నది. శనిగురుకుజులును. అపరే= ఇతర గ్రహములును, (క్రమముగా) వీక్షణే= చూచుటయందు, చరణాభివృద్ధితః = పాదాభివృద్ధివలన, అధికాః = అధికఫలప్రదులు, అనఁగా వీక్షణముగలన శనైశ్చరుఁడు పాదఫలప్రదుఁడు. బృహస్పతి అర్థఫలప్రదుఁడు, అంగారకుఁడు త్రిపాద ఫలప్రదుఁడు, సూర్యచంద్రబుధశుక్రులు సంపూర్ణ ఫలప్రదులు. ఇది గ్రహముల నైసర్గికదృష్టి ఫలము. ఆయా స్థానబలమువలన విశేష దృష్టిఫలంబు గ్రహింపఁదగినదియని చెప్పుదురు.

తా. సూర్యాది గ్రహములు తామున్నస్థానము మొదలు తృతీయ దశమ స్థానములను, అక్కడను న్న గ్రహములను పాదదృష్టిచేతను, పంచమ, నవమములను, అక్కడనున్న గ్రహములను అర్ధదృష్టిచేతను, అష్టమ చతుర్థములను, అచ్చోటులయందుండు గ్రహములను త్రిపాదదృష్టిచేతను, సప్తమమును అచ్చటనున్న గ్రహములను పూర్ణదృష్టిచేతను, చూతురనుటను దెలియవలయును. ప్రయోజనము:— గ్రహములు యెంతమాత్రపుదృష్టిచేత జూతురో అంత మాత్రపు ఫలితములను ఇత్తురనుటను గ్రహింపవలయును. ఈరీతినే, లఘుజాతకమునందు. "శ్లో. దశమతృతీయౌ నవమం పంచమ చతురష్టమాన్, కళత్రంచ పశ్యంతి పాదవృద్ధ్యా ఫలానిచైవంప్రయచ్ఛంతి." అనియు, సారావళియందు. "శ్లో. సర్వంపశ్యంతి సదా గ్రహాశ్చరణ వృద్ధితస్సర్వే, త్రిదశత్రికోణ చతురశ్ర సప్తమగతాన్, ఫలంక్రమేణైవ." అనియు,యవనేశ్వరుడు "శ్లో. ద్వ్యుపశ్చిమౌవష్టమథ ద్వితీయం, సంస్థానరాశేః పరమాన్యరాశిం, శేషాన్ గ్రహాఃపశ్యంతి సర్వకాలమిష్టేషుచైషాం విహితాదృగిష్టా నామిత్రభేదృష్టిఫలం సమగ్రం స్వపాదహీనం చతురశ్రయోశ్చ, త్రికోణయోర్దృష్టి ఫలార్ధమాహుస్తృశ్చిక్య సంజ్ఞేదశమేచపాదం" అనియును చెప్పియున్నారు. గణియు, శని తృతీయదశమములను, బృహస్పతి పంచమ నవమములను, అంగారకుఁడు చతుర్థాష్టమములను, సూర్యచంద్రబుధశుక్రులు సప్తమమును, సంపూర్ణదృష్టిచే చూచుటగాక, సారావళియందు. "శ్లో. పూర్ణంపశ్యతి రవిజాస్తృతీయ దశమేత్రికోణ మపిజీవః, చతురశ్రంభూమిసుతః సితార్కబుధ హిమకరాః కళత్రంచ." అనియు, మాధవాచార్యులవారు:—"సౌరిస్తృతీయదశమౌ గురుస్త్రికోణం, కుజస్తుచతురశ్రం పశ్యతి సమగ్రమితరే, చరణవృద్ధ్యాథ సప్తమంసర్వే." అనియు, గార్గి:—"దుశ్చిక్యస్వగతాన్ సౌరిస్త్రికోణస్థాన్ బృహస్పతిః చతుర్థాష్టమగాన్ భౌమ శ్శేషా సప్తమసంస్థితాన్, భవంతి వీక్షణే నిత్యముక్తాధిక ఫలాగ్రహాః." అనియు చెప్పియుండుట బట్టి సూర్యేందు బుధ శుక్రులు సంపూర్ణదృష్టియందు అత్యంతఫలము నిచ్చువారనియు దెలియదగినది.

## గ్రహములకు కాలములు, రసములు.

శ్లో. అయనక్షణ వాసరర్తవో మాసోర్ధంచ సమాశ్చభాస్కరమ్
కటుకలవణ తిక్తమిశ్రితా మధురామ్లౌచ కషాయఇత్యపి. 14

టీ. అయన = ఆఱు నెలలు రవికి, క్షణ = ఒకముహూర్తముచంద్రునికి, వాసర=ఒక దినము కుజునికి, ఋతు = రెండు నెలలు బుధునికి, మాస = ఒక నెల గురునికి, మాసార్ధం= ఒక పక్షముశుక్రునికి, సమాః = ఒకసంవత్సరము శనికి, కటుక = కారముసూర్యునికి, లవణ = లవణము చంద్రునికి, తిక్త= చేదు కుజునికి, మిశ్రిత = షడ్రసములకూడిక బుధునికి, మధుర= తీపిగురునికి, ఆమ్ల=పులుసు శుక్రునికి, కషాయ = వగరు శనికి.

తా. సూర్యునకు ఆఱు మాసములు, చంద్రున కొకముహూర్తము, అంగారకున కొక్కదినము, బుధునకు రెండు నెలలు, గురువునకు ఒకమాసము, శుక్రునకు ఒకపక్షము, (15 దినములు) శనికి ఒకసంవత్సరమును కాలపరిమాణముగ జెప్పబడి యున్నది. ఇందుకు ప్రయోజనము:—ప్రశ్నకాల లగ్నమునందు జననసమయ లగ్నమునందు ఏగ్రహములగూడిన నవాంశోదయము గల్గుచున్నదో ఆ గ్రహముల కెంతకాలము జెప్పబడియున్నదో ఆకాలము ననుసరించి శుభాశుభ ఫలితముల జాతకునకుఁ జెప్పవలయును. మఱికొందఱు లగ్నమువలన నుదయించు నవాంశాధిపతి కాలపరిమాణము ననుసరించియే ఫలితములను జెప్పవలయు నందురు. ఇందులకు మణిత్థుఁడు:—"శ్లో. లగ్నాంశకపతితుల్యః కాలోలగ్నోదితాంశ పతితుల్యః, నష్ట ప్రోర్యరిపు విజయే గర్భాధానేథ కార్యసంయోగే." అను ప్రయోజనమును జెప్పియున్నాఁడు.

గ్రహములకు రసములు:—సూర్యగ్రహమునకు కారము, చంద్రునకు లవణము, అంగారకునకుఁ జేదు, బుధునకు షడ్రసముల మిశ్రణము, బృహస్పతికిఁ దీపు, శుక్రునకు పులుసు, శనైశ్చరునకు వగరును, చెప్పబడియున్నవి. కొన్ని ఇతరగ్రంథములయందు:— "శ్లో. తిక్తం శనైశ్చరాహ్వోశ్చ మధురంతు బృహస్పతేః, ఆమ్లంభృగో ర్విధోః క్షారం కుజస్య క్షారజోరసః, తువరస్సోమ పుత్రస్య భాస్కరస్య కటుర్భవేత్." అని యుండుటవలన శని రాహువులకు చేదును, అంగారకునకు క్షారరసము, బుధునకు వగరును చెప్పుదురు. ఇందులకుఁ బ్రయోజనము:—భోజనవిషయికమగు ప్రశ్నలయందుఁ బ్రశ్నకాల లగ్నమునుండు గ్రహమునకు గాని ఆలగ్నకాలము ననుసరించిన నవాంశాధిపతికిగాని జెప్పబడియుండు రసయుక్తమగు భోజనాదులని తెలియుటకు వీలుగానున్నది.

## గ్రహములకు మిత్ర, శత్రు, సమత్వములు.

శ్లో. జీవోజీవ బుధౌసితేందుతనయౌ వ్యర్కా విభౌమాః క్రమా
ద్వీంద్వర్కా వికుజేంద్వినాశ్చసుహృదః కేషాంచిదేవంమతమ్

సత్యోక్తే సుహృదస్త్రికోణ భవనాత్స్వాత్స్వాం త్యధీధర్మపాః
స్వోచ్చాయుస్సుఖపాః స్వలక్షణవిధే ర్నాన్యే విరోధాదితి. 15

టీ. జీవః = బృహస్పతి సూర్యునికి, జీవబుధౌ = గురుబుధులు చంద్రునికి, సితేందు తనయౌ = శుక్ర బుధులు కుజునికి, వ్యర్కాః = సూర్యవర్జితములైన అయిదు గ్రహములు బుధునికి, విభౌమాః = కుజేతరములైన అయిదుగ్రహములు గురునికి, వీంద్వర్కాః = చంద్ర సూర్యవర్జితములైన నాలుగు గ్రహములు శుక్రునికిని, వికుజేంద్వినాః = కుజ చంద్ర సూర్య వర్జితములైన మూండు గ్రహములు శనికని, సుహృదః = మిత్రములు; ఇతరగ్రహములు శత్రువులు. ఏవం = ఈప్రకారముగా, కేషాంచిత్ = కొందఱియొక్క, మతం = మతము. సత్యోక్తే = సత్యాచార్యోక్త హోరాశాస్త్రమందు గ్రహములకు స్వాత్ = తనసంబంధమైన, త్రికోణభవనాత్ = మూలత్రికోణరాశి మొదలుకొని, స్వాంత్యధీధర్మపాః = ద్వితీయద్వాదశపంచమ నవమాధిపతులును, స్వోచ్చాయుస్సుఖపాశ్చ = స్వకీయోచ్చరాశ్యధిపతియు, ఆయుస్థానాధిపతి యనఁగా అష్టమాధిపతియు, సుఖస్థానాధిపతి యనఁగా చతుర్థాధిపతియు, సుహృదః = మిత్రులు. స్వలక్షణవిధేః = ఈచెప్పఁబడిన మిత్రలక్షణవిధికి, విరోధాత్ = విరోధమౌటవలన, అన్యే = ఉక్తవ్యతిరిక్తగ్రహములు, నసుహృదః = మిత్రములుకావు. ఇతి= ఈప్రకారముగా చెప్పఁబడెను.

తా. సూర్యునకు బృహస్పతి, చంద్రునకు గురు బుధులు, అంగారకునకు బుధ శుక్రులు, బుధునకు సూర్యుఁడుతప్ప తక్కిన గ్రహములైదును, గురునకు కుజేతరములైన అయిదుగ్రహములును, శుక్రునకు సూర్య చంద్రులుగాక తక్కిన నాల్గుగ్రహములును, శనైశ్చరునకు సూర్యచంద్ర అంగారకులుగాక తక్కిన గ్రహత్రయము మిత్రులనియు, తక్కినగ్రహములు శత్రువులనియు తెలియఁదగినది. యవనేశ్వరాదులు కొందఱుమాత్రమే ఈమతము ననుసరించియున్నారు. అందు యవనేశ్వరుఁడు "రవేర్గురుస్త్రి శతోన్యథాన్యే గురోస్తుభౌమం ... సుహృదః ప్రదిష్టాః, భౌమస్యశుక్ర శ్శశిజశ్చమిత్ర మిందోస్సుధం దేవగురుంచ విందాత్, సౌరస్యమిత్రాణ్య కుజేందుసూర్యా శ్శేషా రిపూ ... ." అని చెప్పియున్నాడు. ఈ పక్షమునందు మిత్రశత్రుత్వ నియమమేకాని సమత్వ వ్యవహారములేదు. సత్యాచార్యుల వారిచే రచింపబడిన హోరాశాస్త్రమునందు గ్రహములకుఁ దనసంబంధమగు మూలత్రికోణ రాశిమొదలుకొని ద్వితీయ, ద్వాదశ, పంచమ, నవమాధిపతులును, స్వకీయోచ్చరాశ్యధిపతియు, ఆయుస్థానమునకు అనగా అష్టమస్థానమునకు అధిపతియు, సుఖస్థానమగు చతుర్థస్థానమునకు అధిపతియు, మిత్రులనబడుదురు ఈమిత్రలక్షణపద్ధతికి విరోధముగానుండుటవలన ఏస్థానాధిపతులకు మిత్రత్వము చెప్పబడలేదో తదితర స్థానాధిపతులు మిత్రులు కారనుట, ఇందులకు సత్యాచార్యుడే "సుహృత్త్రికోణ భవనాద్గ్రహస్య సుఖేశ్వరోథ ధనభవనే స్వజనే నిధనేధర్మే

స్వోచ్చేచ భవంతినో శేషాః." అని చెప్పియుండుటచే ద్విరాశ్యధిపతి మిత్రుడు, ఏకరాశ్యధిపతి సముడనియు, అనుక్తరాశ్యధిపతి శత్రువనియు, నెఱుంగవలయును. ఇందు స్వజనమనుటకు చతుర్థస్థానమని యర్థము. ఈరీతిగనే వక్ష్యమాణ గ్రంథమునందు. "ద్వ్యేకానుక్తభపాః సుహృత్సమరిపూః సంచింత్య నైసర్గికాః," అనిచెప్పియుండుటవలన, ఏకరాశ్యధిపతి సముడని చెప్పుట సూర్యచంద్రవ్యతిరిక్తవిషయము. అనగా, సూర్యచంద్రులకు రాశిద్వయాధిపత్యములేదు గనుక, వారు ఏకరాశ్యధిపతులైనను, మిత్రులేయని యెఱుంగదగినది. మఱియు, రాశిద్వయమున కధిపతియగు గ్రహము ఉచ్చరాశికి అధిపతియగుటవలన త్రిరాశ్యాధిపత్యము నొందినప్పటికిని అట్టిగ్రహము ద్విరాశ్యధిపతివలెనే మిత్రసంజ్ఞను బొందును. ఎట్లనగ, సూర్యునకు సింహము మూలత్రికోణము. ఈసింహమునకు ద్వాదశరాశి కర్కాటకము. ఈ కటకమునకు అధిపతియగు చంద్రుడు యేకరాశ్యధిపతియైనను, రాశ్యంతరాధిపత్యము లేనివాడు గనుక సూర్యునకు మిత్రుడు. సింహమునకు నాల్గవరాశి వృశ్చికము. నవమరాశి మేషము. సూర్యునకు ఉచ్చస్థానమును మేషరాశియే యగుచున్నది. ఈ ఉక్తస్థానములు మూటికి అధిపతి కుజుడైనను మేషరాశి యొక్కటే గనుక కుజుడు రాశిద్వయాధిపతియై సూర్యునకు మిత్రుడగుచున్నాడు. సింహరాశికి పంచమాష్టమములు ధనుర్మీనములు. ఈరాశిద్వయాధిపతియగు గురువు ఉక్తరాశి ద్వయాధిపతి యగుటవలన సూర్యునకు మిత్రుడగుచున్నాడు. సింహమునకు ద్వితీయైకాదశములు కన్యామిథునములు. ఈ రెంటికి అధిపతిబుధుడైనను ద్వితీయరాశి ఉక్తస్థానము. ఏకాదశము ఉక్తస్థానము గాదుగనుక ఉక్తైకరాశ్యధిపతియగు బుధుడు సూర్యునకు సముడు. సింహమునకు షష్ఠసప్తమములు. మకరకుంభములు అవి ఉక్తస్థానములు గావు గనుక తదధిపతియగు శనైశ్చరుడు సూర్యునకు శత్రువు. సింహమునకు దశమతృతీయములు వృషభతులలు. అవియును యుక్తస్థానములు గావుగాన తదధిపతియగు శుక్రుడు సూర్యునకు శత్రువగుచున్నాడు. ఇట్లు సూర్యునకు మిత్రశత్రుసమత్వములు వివరింపబడెను. చంద్రునకు త్రికోణము వృషభము. దానికి 4-వ రాశి సింహము. తదధిపతియగు సూర్యుడు ఏకరాశ్యధిపతియైనను రాశ్యంతరాధిపత్యము లేనందున మిత్రుడగుచున్నాడు. వృషభమునకు ద్వితీయము మిథునము. పంచమము కన్య, ఈ ఉక్తస్థానద్వయమునకు అధిపతియగుటవలన బుధుడు చంద్రునకు మిత్రుడగుచున్నాడు. వృషభమునకు సప్తమము వృశ్చికము, ద్వాదశము మేషము. ఈరాశిద్వయమున కంగారకుడధిపతియగుచున్నాడు. అందు ఏడవయిల్లు అనుక్తస్థానముగను, పండ్రెండవయిల్లుఉక్తస్థానముగ నుండుటవలన ఉక్తైకరాశ్యధిపతియగు అంగారకుడు చంద్రునకు సముడగుచున్నాడు. వృషభమునకు అష్టమఏకాదశములు ధనుర్మీనములు. తదధిపతి గురువు. అందు అష్టమముమాత్రమే ఉక్తస్థానముగనుక ఉక్తైకరాశ్యధిపతియగు గురువు చంద్రునకు సముడగుచున్నాడు. చంద్రునకు వృషభము ఉచ్చము. ఈ వృషభరాశికి 6-వ రాశి తుల. ఈవృషభతులలకు శుక్రుడధిపతి. అందు 6-వ రాశి అనుక్తస్థానమై ఉచ్చము. ఉక్తస్థానముగా నుండుటవలన పతితైకరాశ్యధిపతియగు శుక్రుడు చం

ద్రునకు సముఁడగుచున్నాఁడు. మఱియు వృషభమునకు నవమదశమములు మకరకుంభము లగుచున్నవి. ఆరాసులకధిపతి శనైశ్చరుఁడు. అందు దశమము అనుక్తస్థానముగనుక పతిత్రైక రాశ్యధిపతియగు శని చంద్రునకు సముఁడగుచున్నాఁడు. ఇట్లే తక్కినగ్రహములకు మిత్ర శత్రు సమము లూహింపదగినవి. 15

పూర్వ శ్లోకోక్తముగ గ్రహముల మిత్ర శత్రు సమత్వములు.

శ్లో. శత్రూ మందసితౌ సమశ్చ శశిజో మిత్రాణి శేషారవే
స్తీక్ష్ణాంశు ర్హిమరశ్మిజశ్చ సుహృదౌ శేషాస్సమాః శ్శీతగోః
జీవేందూష్ణకరాః కుజస్య సుహృదో జ్ఞోరి స్సితార్కిసమౌ
మిత్రే సూర్యసితౌ బుధస్య హిమగు శ్శత్రు స్సమాశ్చాపరే. 16

టీ. రవేః = సూర్యునికి, మందసితౌ = శనిశుక్రులు, శత్రూ = శత్రువులు, శశిజః = బుధుఁడు, సమః = సముఁడు, శేషాః = తక్కిన చంద్రకుజగురులు, మిత్రాణి = మిత్రులు, శీతగోః = చంద్రునికి, తీక్ష్ణాంశుః = సూర్యుఁడును, హిమగశ్మిజశ్చ = బుధుఁడును, సుహృదౌ = మిత్రులు, శేషాః = తక్కిన భౌమగురుశుక్రశనులు, సమాః = సములు, శత్రువు లులేరు. కుజస్య = అంగారకునికి, జీవేందూష్ణకరాః = గురుచంద్రసూర్యులు, సుహృదః = మిత్రులు, జ్ఞః = బుధుఁడు, అరిః = శత్రువు, సితార్కి = శుక్రశనైశ్చరులు, సమౌ = సములు, బుధస్య = బుధునికి, సూర్యసితౌ = రవిశుక్రులు, మిత్రే = మిత్రులు, హిమగుః = చంద్రుఁడు, శత్రుః = శత్రువు, అపరే = కుజగురుశనులు, సమాః = సములు.

శ్లో. సూరేస్సౌమ్య సితావరీ రవిసుతో మధ్యోపరే త్వన్యథా
సౌమ్యార్కీ సుహృదౌ సమౌ కుజగురూ శుక్రస్య శేషావరీ
శుక్రజ్ఞౌ సుహృదౌ సమస్సురగురు స్సౌరస్యచాన్యేరయో
యేప్రోక్తా స్స్వత్రికోణ భాదిషుపున స్తేమీమయాకీర్తితాః. 17

టీ. సూరేః = బృహస్పతికి, సౌమ్యసితౌ = బుధశుక్రులు, అరీ = శత్రువులు, రవిసుతః = శని, మధ్యః = సముఁడు, అపరే తక్కిన సూర్యచంద్రకుజులు, అన్యథా = మిత్రులు, శుక్రస్య = శుక్రునికి, సౌమ్యార్కీ = బుధశనులు, సుహృదౌ = మిత్రులు, కుజగురూ = భౌమ బృహస్పతులు, సమౌ = సములు, శేషా = సూర్యచంద్రులు, అరీ = శత్రువులు, సౌరేః = శనికి, శుక్రజ్ఞౌ = శుక్రబుధులు, సుహృదౌ = మిత్రులు, సురగురుః = బృహస్పతి, సమః = సముఁడు, అన్యే = తక్కిన సూర్యచంద్రాంగారకులు, అరయః = శత్రువులు, యే = ఏగ్రహములు, మయా = నాచేతను, స్వత్రికోణభాదిషు = ("సత్యోక్తే సుహృదస్త్రికోణ భవనాత్స్వాత్స్వాంత్యధీధర్మపాః" అను నిత్యాదిగ్రంథముచేత) స్వత్రికోణ రాశ్యాదులయందు, ప్రోక్తాః = సమశత్రుమిత్రములుగాఁ జెప్పఁబడినవో, తేమీ = అయాగ్రహములే, పునః = మఱల, కీర్తితాః = విభజించి చెప్పఁబడినవి.

| | గ్రహములు. | మిత్రులు. | శత్రువులు. | సములు. |
|---|---|---|---|---|
| 1 | సూర్యునకు | చంద్ర, కుజ, గురులు, | శని, శుక్రులు, | బుధుఁడు. |
| 2 | చంద్రునకు | సూర్యుఁడు, బుధుఁడు, | లేరు. | కుజ,గురు,శుక్ర,శనులు, |
| 3 | కుజునకు | గురు, చంద్ర,సూర్యులు, | బుధుఁడు. | శుక్ర, శనులు. |
| 4 | బుధునకు | రవి, శుక్రులు, | చంద్రుఁడు. | కుజ, గురు, శనులు. |
| 5 | గురువునకు | రవి, చంద్ర, కుజులు, | శుక్ర, బుధులు. | శని. |
| 6 | శుక్రునకు | శని, బుధులు, | చంద్ర, సూర్యులు. | కుజ, గురులు, |
| 7 | శనికి- | బుధ, శుక్రులు, | సూర్య, చంద్ర,కుజులు, | గురువు. |

ఏ గ్రహములు స్వత్రికోణ రాశ్యాదులయందు సమశత్రు మిత్రములుగ జెప్పబడినవో ఆగ్రహములు మరల జెప్పబడినవి.

## గ్రహముల తాత్కాలిక మిత్ర, శత్రు, సమత్వములు.

శ్లో. అన్యోన్యస్య ధనవ్యయాయ సహజ వ్యాపార బంధుస్థితా
స్తత్కాలే సుహృదస్స్వతుంగ భవనే ప్యేకేరయస్త్వన్యథా
ద్వ్యేకానుక్త భపాః సుహృత్సమరిపూః సంచింత్యనైసర్గికాం
స్తత్కాలేచ పునస్తుతా నధిసుహృన్మిత్రాదిభిః కల్పయేత్. 18

టీ. అన్యోన్యస్య = ఒకరికొకరికి, ధనవ్యయాయ సహజవ్యాపార బంధుస్థితాః— 2,12, 11, 3, 10, 4, ఈ స్థానములయందున్న గ్రహములు, తత్కాలే= ఆయాకాలములయందు అనఁగా జన్మవివాహ యాత్రాది కాలములయందు, సుహృదః = మిత్రములౌచున్నవి, ఏకే = (యవనేశ్వరుఁడు, మొదలుగాగల) కొందఱు, స్వతుంగభవనే = ఏగ్రహముయొక్క ఉచ్ఛమందు ఏగ్రహముఉన్నదో ఆగ్రహములు రెంటను అన్యోన్యమిత్రములని చెప్పుదురు. అన్యథా = ఉక్తవ్యతిరిక్తముగా నున్న గ్రహములు, అరయః = తాత్కాలికశత్రులగుచున్నారు. ద్వ్యేకానుక్తభపాః = పూర్వోక్తప్రకారముగా ద్విరాశ్యధిపులును, ఏకరాశ్యధిపులును, అనుక్తరాశ్యధిపులును నను, నైసర్గికాః = స్వభావసిద్ధులైన, సుహృత్సమరిపూః = మిత్ర, సమ, శత్రులను సంచింత్య తెలిసికొని, తత్కాలే = తాత్కాలిక మిత్ర శత్రులందెలిసికొని, పునశ్చ = రెండియు, తానేవ = ఆగ్రహములనే, అధిసుహృన్మిత్రాదిభిః = అధిమిత్ర మిత్రాది సంజ్ఞలతోఁగూడిన వారినిగాను, కల్పయేత్ = చేయవలయునది.

తా. ఒకరికొకరికి, 2, 12, 11, 3, 10, 4, ఈ 6 స్థానములందుండు గ్రహములు జన్మవివాహ యాత్రాదికాలములందు మిత్రులగుచున్నారు. యవనేశ్వరాదులు కొందఱు
శ్లో॥ "మూలత్రికోణా ద్ధనధర్మబంధు మిత్రవ్యయస్థానగతా గ్రహేంద్రాః। తాత్కాలికాస్తే

సుహృదో భవంతి స్వోచ్చేవ గేహాయస్య నికృష్టపీఠస్య॥" అనిచెప్పియుండుటచే, ఏగ్రహముయొక్క ఉచ్చరాశియందు యేగ్రహమున్నదో, ఆగ్రహములురెండును అన్యోన్యమిత్రులని చెప్పదగును. అయినను యీవిషయమును వరాహమిహిరాచార్యులవారు స్మరింపలేదు. లఘుజాతకమునందు. శ్లో॥ "తత్కాలేన దశాయబంధుసహజస్వాంత్యేషు మిత్రంస్థితః" అనిచెప్పబడియుండుటచే ఏకరాశియందున్నను పంచమషష్ఠ సప్తమాష్టమ నవమస్థానములయందునున్న గ్రహములు తాత్కాలిక శత్రులగుచున్నారు. పూర్వోక్తప్రకారము ద్విరాశ్యధిపతులును, ఏకరాశ్యధిపతులును అగు స్వభావసిద్ధులగు మిత్రసమశత్రులను "శత్రూ మందసితౌ" అనుశ్లోకద్వయప్రకారము దెలిసికొని "అన్యోన్యస్వధనవ్యయాయ సహజవ్యాపారబంధుస్థితాః." అని యీశ్లోకమునందు చెప్పబడిన ప్రకారముగ తాత్కాలికమిత్రశత్రులందెలిసికొని, యీగ్రహముల అధిమిత్రమిత్రాది సంజ్ఞలతోగూడిన వారిగజేయదగినది. నైసర్గికమిత్రుడు తాత్కాలికమిత్రుడయ్యెనేని అధిమిత్రుడు, నైసర్గికశత్రువు తాత్కాలిక శత్రువయ్యెనేని అధిశత్రువగును. ఒకవిధమునశత్రువై, మరియొకవిధమున మిత్రుడగునెడల సముండగును, ఒకవిధంబునశత్రువై మరియొకవిధంబున సముడయ్యెనేని శత్రువేయగును ఇందులకుదాహరణముగ లఘుజాతకమునందు శ్లో॥ "శత్రుర్మిత్రస్సమశ్చోక్తః సాంశత్రూన్ ప్రపృచ్ఛవేత్, మిత్రమిత్రోధిమిత్రంస్యాచ్ఛత్రుశ్శత్రోధిశత్రుతా" అని చెప్పబడియున్నది. 18

## గ్రహములకు స్థాన, దిగ్బలంబులు.

శ్లో. స్వోచ్చసుహృత్స్వత్రికోణనవాంశైః స్థానబలంస్వగృహోపగతేచ
దిక్షుబుధాంగిరసౌ రవిభౌమౌ సూర్యసుతస్సిత శీతకరౌచ. 19

టీ. స్వోచ్చ= తనఉచ్చస్థానమందున్నగ్రహమును, సుహృత్ = తనమిత్రక్షేత్రమందున్న గ్రహమును, స్వత్రికోణ = తనమూలత్రికోణమందున్న గ్రహమును, స్వనవాంశ = తననవాంశయందున్నగ్రహమును, స్వగృహోపగతేచ = స్వక్షేత్రమందున్న గ్రహమును, ఈ గ్రహములు స్థానబలయుక్తములు. దిక్షు= తూర్పుదిక్కునందు, బుధాంగిరసౌ=బుధ బృహస్పతులు, దక్షిణమందు, రవిభౌమౌ = రవికుజులు, పశ్చిమమందు, సూర్యసుతః = శని, ఉత్తరపుదిక్కునందు, సితశీతకరౌ= శుక్రచంద్రులు బలవంతులగుదురు. ఇది గ్రహములదిగ్బలము.

తా. తనఉచ్చస్థానమందుండు గ్రహమును, తనమిత్రక్షేత్రంబున నున్నగ్రహంబును. మూలత్రికోణమునందుండు గ్రహమును, స్వనవాంశయందుండు గ్రహమును, స్వక్షేత్రమునందుండు గ్రహమును, స్థానబలయుక్తగ్రహములనబడును. సూర్యునకు సింహము మూలత్రికోణ స్వక్షేత్రము, వృషభము చంద్రునకు ఉచ్చత్రికోణము, కుజునకు స్వక్షేత్ర త్రికోణము మేషము, బుధునకు కన్యమూల త్రికోణోచ్చ స్వక్షేత్రము, ధనుస్సు గురువునకు మూలత్రికోణ స్వక్షేత్రము, శుక్రునకు తులస్వక్షేత్ర మూలత్రికోణము, శనికి కుంభము మూలత్రికోణ స్వక్షేత్రమగుచున్నది. ఈ శ్లోకమున వీని అంశవిభాగము చెప్పబడియుండలేదు. గనుక

ప్రథమాధ్యాయమునందలి 14-వ శ్లోక తాత్పర్యమునందు గ్రంథాంతర శ్లోకముల ననుసరించి అంశావిభాగము చెప్పబడియుండుటచే నాప్రకారముగ నాయా రాసులయందు అంశభేదము తెలియంగవలయును: బుధ గురువులు లగ్నమునందున్నవారై తూర్పుదిక్కున బలవంతులగుచున్నారు. దశమకేంద్రస్థితులయిన సూర్యాంగారకులు దక్షిణదిక్కునందు బలవంతులగుచున్నారు. సప్తమస్థానమును బొందిన శని పశ్చిమదిక్కునందు బలవంతుఁడగుచున్నాడు. శుక్రచంద్రులు చతుర్థమునందుండువారై యుత్తరపు దిక్కునందు బలవంతులగుచున్నారు. ఏగ్రహము ఏరాశియందు బలవంతము అని తెలియదగునో ఆరాశికి ఏడవరాశియందా గ్రహము బలహీనమైనదని తెలియదగినది. జ్యోతిషమునందు గ్రహముల ఉచ్చ నీచ సంజ్ఞావిషయమునను, రాసులదిగ్బల విభాగమునందును గల పరిభాషయేయిది. ఇందులకు యవనేశ్వరుఁడు.— "శ్లో. గుర్వైన్దవౌ పూర్వ విలగ్నసంస్థౌ నభస్థలస్థౌ దివాకరారౌ సౌరోస్తగశ్శుక్రనిశాకరౌతు, జలేస్థితావగ్రబలౌ భవేతామ్." అని దిగ్బలము ననుసరించి చెప్పియున్నారు. 19

## గ్రహములకు చేష్టాబలములు.

శ్లో. ఉదగయనేరవి శీతమయూఖౌ వక్రసమాగమగాః పరిశేషాః
విపులకరాయుధిచోత్తర సంస్థాశ్చేష్టిత వీర్యయుతాః పరికల్ప్యాః. 20

టీ. ఉదయనే = ఉత్తరాయణమైన మకరాదిషట్కమందు, రవిశీతమయూఖౌ = సూర్యచంద్రులు బలవంతులు, పరిశేషా = కుజ, బుధ, గురు, శుక్ర, శనులు, వక్రసమాగమాః = వక్రగతులైన చంద్రునితోఁ గూడినవారైనను బలవంతులు, విపులకరాః = విస్తృతములైన కిరణములు గలిగినవారును బలవంతులు, యుధి = గ్రహయుద్ధమందు, ఉత్తరసంస్థాః = ఉత్తరమందున్న గ్రహములు, చేష్టితవీర్యయుతాః = చేష్టాబలయుక్తములని, పరికల్ప్యాః = కల్పింపదగినవి.

తా. ఉత్తరాయణమున, మకరము, కుంభము, మీనము, మేషము, వృషభము, మిథునము అను రాశిషట్కమునందు సూర్యచంద్రులు బలవంతులు. కుజ, బుధ, గురు, శుక్ర, శనులు వక్రగతులైనను, చంద్రునితోఁగూడినవారైన బలవంతులు. గ్రహములసమాగమమనగా:— చంద్రునితోఁగూడుట అస్తమయమనగా సూర్యునితోఁగూడుట భౌమాదులు పరస్పరము గూడినయెడల యుద్ధము. ఇందులకు విష్ణుచంద్రుని "శ్లో. దినకర రేణాస్తమయః సమాగమశ్శీతగశ్మి సహితానామ్, కుసుతాదీనాం యుద్ధం నిర్దిష్టోన్యోన్య యుక్తానామ్." వక్రీయు విస్తృతములైన కిరణములుగలవారు బలవంతులు. ఈశ్లోకమునకు శీఘ్రోచ్చము, ద్వితీయ తృతీయ పాదములయందు చెప్పబడిన గ్రహములకు వర్తించుచున్నది. గ్రహయుద్ధమునందు ఉత్తరమునందుండు గ్రహములు బలవంతములు. బాధిత గ్రహములకు యుద్ధమున జయముసిద్ధము. జయాపజయ లక్షణము:—"శ్లో. దక్షిణాదిక్స్థః పరుషో వేపథురప్రాప్త సన్నికృష్టోణుః, అధిరూఢో వికృతో నిష్ప్రభోవివర్ణశ్చ యస్సజితః, ఉక్తవిపరీత లక్షణసంప

న్నే జయగతో వినిర్దిష్టః, విపులస్స్నిగ్ధో ధృతిమాఞ్ దక్షిణదిక్స్థోపి జయయుక్తః." అనియుండుటచే దక్షిణదిక్కున నుండునపుడుగూడ శుక్రుడు జయమును బొందునుగాని ఇతరగ్రహములు బొందజాలవు. ఇందులకు "సర్వేఽయిన ఉదక్స్థా దక్షిణదిక్స్థో జయీశుక్రః" అని పులిశాచార్యునివచనము. ఈరీతిగానుండు గ్రహములు చేష్టాబలయుక్తములుగా నగుచున్నవి. 20

## ⟵ గ్రహకాల నైసర్గిక బలములు. ⟶

శ్లో. నిశి శశి కుజ సౌరా స్సర్వదా జ్ఞోఽహ్ని చాన్యే
బహుళ సిత గతాస్స్యుః క్రూర సౌమ్యాః క్రమేణ
ద్వ్యయన దివస హోరా మాసపైః కాలవీర్యం
శ,కు,బు,గు,శు,చ, రాద్యా వృద్ధితో వీర్యవంతః. 21

టీ. నిశి = రాత్రియందు, శశికుజసౌరాః = చంద్రాంగారకశనులు, వీర్యవంతః = బలవంతులు, జ్ఞః = బుధుడు, సర్వదా = అహోరాత్రములయందు బలవంతుడు, అన్యే = రవిగురుశుక్రులు, అహ్ని = పగటియందు బలవంతులు, బహుళసితగతాః = కృష్ణశుక్లపక్షములయందు, క్రూరసౌమ్యాః = పాపగ్రహ శుభగ్రహములును, బలవంతములు, స్యుః = అగును. ద్వ్యయనప = సంవత్సరాధిపతిచేతను, దివసప = దినవారాధిపతిచేతను, హోరాప = హోరాధిపతిచేతను, మాసప = మాసాధిపతిచేతను. కాలవీర్యం = కాలబలము, జ్ఞేయం = తెలియదగినది, ఇది కాలబలము. శ, కు, బు, గు, శు, చ, రాద్యాః = శాదివర్ణములు ఆదియందుగల గ్రహములు, అనగా:—శని, కుజ, బుధ, గురు, శుక్ర, చంద్ర, రవులు, వృద్ధితః = ఉత్తరోత్తర వృద్ధిక్రమంబున, వీర్యవంతః = బలవంతులు.

తా. చంద్రాంగారక శనైశ్చరులు రాత్రికాలమునందు వీర్యవంతులు. బుధుడు దివారాత్రముల రెండింటియందును బలవంతుడు. రవి, గురు, శుక్రులు పగటికాలమునందు బలవంతులు. కృష్ణపక్షమునందు పాపగ్రహములును, శుక్లపక్షమునందు శుభగ్రహములును, బలవంతులు. సంవత్సరాధిపతియు, మాసాధిపతియు, వారాధిపతియు, హోరాధిపతియు, వీరు నలుగురును బలవంతులు. ఇది కాలబలము. శని,కుజ,బుధ,గురు,శుక్ర,చంద్ర,రవులు, ఉత్తరోత్తరవృద్ధిక్రమంబున బలవంతులగుచున్నారు. అనగా శనికంటె కుజుడు, కుజునికంటె బుధుడు, బుధునికంటె గురువు, గురువుకంటె శుక్రుడు, శుక్రునకంటె చంద్రుడు, చంద్రునికన్న సూర్యుడును బలవంతులని తెలియదగినది. ఇట్లు నైసర్గిక బలము చెప్పబడినది. ఈప్రకారమే లఘుజాతక గ్రంథమునందు "మందారసౌమ్య వాక్పతి సిత చంద్రార్కా యథోత్తరంబలినః, నైసర్గికబల మేతద్బలసామ్యే స్యాదధికచింతా." అని చెప్పబడియున్నది. ఈప్రకారముగ స్థానదిక్చేష్టా కాలనైసర్గిక బలములు పూర్వము "త్రిదశత్రికోణ చతురశ్రసప్తగా నవలోకయన్తి చరణాభివృద్ధితః." అను శ్లోకమునందు చెప్పబడిన దృగ్బలములతోడ షడ్బలములును చెప్పబడియున్నవి. ఈబలములకు వరాహమిహిరాచార్యులవారు ప్రతిఫలమును జెప్పలేదు.

"శ్లో. బలవాన్మిత్ర స్వగృహోచ్చ నవాంశకేక్షిత శ్శుభైశ్చాపి, చంద్రసితౌ స్త్రీక్షేత్రే పురుషక్షేత్రోపగాశ్చేషాః. తత్ర శుభదృష్టి ఫలంతావత్. శుభవర్గస్థ బలసహితః పురుషం కుర్యాద్ధనాన్వితం ఖ్యాతం, సుభగం ప్రధానముఖిలం సురూపదేహం చ సౌభాగ్యంచ, పుంస్త్రీభవనబలేన చ కరోతి జనపూజితం కలాకుశలం, పురుషం ప్రసన్న చిత్తం కల్యం పరలోకభీతంచ. ఆశా బలసమవేతో నయతి స్వదిశంనభశ్చరః పురుషం, నీత్వావస్త్రవిభూషణ వాహన సౌఖ్యాన్వితం కురుతే, క్వచిద్రాజ్యం క్వచిత్పూజాం క్వచిద్ద్రవ్యం క్వచిద్యశః, దదాతివిహగశ్చిత్రం చేష్టావీర్య సమన్వితః. వక్రిణస్తు మహావీర్యాః శుభరాజ్య ప్రదాగ్రహాః. పాపావ్యసనదాః పుంసాంకుర్వంతిచ వృథాటనం. స్వస్థశరీర సమాగమ సుఖమాహార జయబలేనవిదధాతి, శుభమతులం విహగేంద్రో రాజ్యంచ వినిర్జితారాతి, రాత్రిదివాబల పూర్ణైర్మ్యాగజ లాభేన శౌర్యపరిష్వధ్వా, పలినయతి శత్రుపక్షం భుంక్తే లక్ష్మీం నభశ్చరః పురుషః, ద్విగుణం ద్విగుణందద్యుర్వర్షాధిపమాస దివసహోరేశాః, కుర్యుర్వర్ధ్యాః సౌఖ్యం స్వదశాసు ధనంచ కీర్తించ. పత్తిబలాద్రిపునాశం రత్నాంబర హస్తి సంపదందద్యుః, స్త్రీ కనక భూమిలాభం కీర్తించ శశాంకభవ శతరాం, సకలబలభార భరితా నిర్మల కరజాల భాసురాస్సతతం, రాజ్యం గ్రహా విదద్యుస్సౌఖ్యంచ మనోరథాతీతం. ఆచార సౌఖ్య శుభ శౌచ యుతాస్సురూపాస్తే జస్వినః కృతవిదో ద్విజ దేవభక్తాః, సద్వస్త్రమాల్యభవ భూషణసంయుతాశ్చ సౌమ్యగ్రహైర్బలయుతైః పురుషా భవంతి. లుబ్ధాః కుకర్మనిరతా నిజకార్యనిష్ఠాః పాపగ్రహైర్బలయుతైః పిశునాః కురూపాః, పుంరాశిషు గ్రహేంద్రైర్వీర్యా స్సంగ్రామకాంక్షిణో బలినః, నిస్స్నేహా బహురోగాః క్రూరా మూర్ఖాశ్చ జాయంతే, యువతిభవనస్థితేషు చ మృదవస్సంగ్రామ భీరవః పురుషాః, జలకుసుమ వస్త్రనిరతాః సౌమ్యాః కలహైస్సుసంయుక్తాః." అని లఘుజాతకమునందు మాత్రమిట్లు దెలుపబడెను.　　21

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

గ్రహయోనిభేదాధ్యాయ నామక

ద్వితీయాధ్యాయము.





# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### వి యో ని జ న్మా ధ్యా య ము.— 3.

శ్లో. క్రూరగ్రహై స్సుబలిభిర్విబలైశ్చ సౌమ్యైః
క్లీబే చతుష్టయగతే తదవేక్షణాద్వా
చంద్రోపగ ద్విరసభాగ సమానరూపం
సత్త్వం వదేద్యది భవేత్స వియోని సంజ్ఞః. 1

టీ. చంద్రోపగ = చంద్రుడున్న, ద్విరసభాగ = ద్వాదశాంశకు, సమాన = సరియైన, రూపం = ఆకారముగల, సత్త్వం = జంతువును, వదేత్ = చెప్పవలెను, సః= ఆ చంద్రుడున్న ద్వాదశాంశ, వియోనిసంజ్ఞోయది = తిర్యగ్జంతునామముగలిగినదైన వియోనిజన్మము, క్రూరగ్రహైస్సుబలిభిః = పాపగ్రహములు బలవంతములై, విబలైశ్చసౌమ్యైః = సౌమ్య గ్రహములు దుర్బలములైయుండగ, క్లీబే = నపుంసకగ్రహములు, చతుష్టయగతే = కేంద్రములయందుండిరేని వియోనిజన్మమును చెప్పవలయు. తదవేక్షణాద్వా = చంద్రుడు ద్వాదశాంశమందుండగ పాపగ్రహములు బలవంతములై శుభగ్రహములు బలహీనములై ఏస్థానమందైనను౦డు బుధునిచే గాని, శనిచే గాని, లగ్నము చూడబడుచుండెనేని వియోనిజన్మమును జెప్పవలెను.

తా. ఈ అధ్యాయము, నానావిధములగు ఉత్పత్తిస్థానములుగల తిర్య, కపక్షి, మృగ, అశ్వ, మహిష, వృషభ, శునక, మార్జార, అహి స్థావరాదుల యుత్పత్తివిశేషములును, తత్సంబంధములగు గ్రహవిభాగములను దెలియజేయుచున్నది. జ్యోతిష్కులను బరీక్షించువిషయమునగాని, ఉత్పన్నజంతుక్షేమాది పరిజ్ఞానార్థమైగాని, ప్రశ్నలుగలుగుట లోకసహజము. కనుక ప్రశ్న సేయువారివలన జననకాలము నెఱింగి వక్ష్యమాణక్రమమున విచారింపగ, వియోనిజన్మనిశ్చయజ్ఞానము గలుగుచున్నది. చంద్రుడున్న ద్వాదశాంశకు సమానమైన ఆకారముగల జంతువు జనించినదని జెప్పవలయును. అయినను ఆ చంద్రుడున్న ద్వాదశాంశ మృగమేషాది తిర్యగ్జంతునామము గల్గినదయ్యెనేని అనగా మేషద్వాదశాంశ యగునెడల మేక, గొఱ్ఱె, మొదలైనవాని జననమును, వృషభద్వాదశాంశ యయ్యెనేని, వృషభము, మహిషము మొదలగువాని జన్మమనియు, కర్కాటక ద్వాదశాంశయందుండెనేని, ఎండ్రకాయ మొదలగువాని జననము

ఉదయించుచున్నదో ఆరాశికిగాని చెప్పినవర్ణములను, వియోనౌ = వియోనిజంతువునందు వదేత్ = చెప్పవలయును, బలయుక్తాత్ = బలవద్గ్రహ వర్ణములనుగాని, దృష్ట్యాసమానాన్ ప్రవదేత్స్వసంఖ్యయా = లగ్నమును ఎన్నిగ్రహములు జూచుచున్నవో అన్నివర్ణములనుగాని వియోనిజంతువునందు జెప్పవలయు. స్మరసంస్థైః = సప్తమస్థానమందున్న గ్రహములనుపట్టి, పృష్ఠే = వీపునందు, రేఖాః = రేఖలను, వదేత్ = చెప్పవలయును.

తా. లగ్నమునందుండు గ్రహమును దెలిసికొని, ద్వితీయాధ్యాయమున పంచమ శ్లోకంబున చెప్పబడియుండునట్లు, "తామ్రసితాతిరక్త హరితవ్యాపీత చిత్రాసితా." అనువర్ణముల సూర్యాది గ్రహములకు క్రమముగా జెప్పవలయును. లగ్నమున గ్రహము లేకున్నయెడల నాలగ్నము నేగ్రహముజూచుచున్నదో, ఆగ్రహవర్ణంబును వియోనిజంతువునకు జెప్పవలయును. అట్లులగ్నమును జూచుగ్రహములేవియు లేకున్నయెడల లగ్నమునందుదయించుచున్న నవాంశరాశియొక్క వర్ణమును ప్రథమాధ్యాయమున 20.వ శ్లోకమగు, "రక్తశ్వేతశుకనిభః" అనుదానియందు జెప్పబడిన ప్రకారము రాశివర్ణమును గ్రహించి, వియోనిజంతువునకు జెప్పవలయును. అనేకగ్రహములు లగ్నమునందుండునెడల, బలవంతమైన గ్రహవర్ణమును అధికముగాను, బలహీనమగు గ్రహవర్ణమును దక్కువగాను వియోనిజంతువు గలిగియుండునని జెప్పవలయును. ఇదియుగాక, ఎన్నిగ్రహములచేత లగ్నమువీక్షింపబడుచున్నదో, అన్నిగ్రహములకు గల వర్ణములను వియోనిజంతువు గలిగియున్నదనియు జెప్పదగును. మఱియు లగ్నముగాని, లగ్ననవాంశగాని తన్నాథునిబొందియుండినను, తన్నాథునిచే జూడబడుచుండినను, ఆగ్రహమునకు దగినవర్ణమును వియోనిజంతువునకు జెప్పవలయును. ఇదియంగాక వియోనిజంతువునకు అంగవిభాగముజేయుచు పూర్వోక్తశ్లోకంబున జెప్పినట్లు, రాసులస్థిరపరిచి, యందుండు గ్రహముల వర్ణము నాయాయంగమున వియోనిజంతువు గలిగియున్నదని జెప్పవలయును. సప్తమస్థానమునందుండు గ్రహముల ననుసరించి వీపునందు గల రేఖలను వచింపవలయును. ఈవిషయముల కన్నిటికిని ఉదాహరణముగ సారావళియందు:—
"మేషాదిభిరుదయస్థైరంశైర్వా గ్రహయుతైశ్చదృష్టైర్వా, స్వంస్వంవర్ణంబ్రూయాద్గాత్రే చిహ్నంవ్రణంచాపి, స్వగృహాంశక సంయోగాద్విద్యాద్వర్ణాన్ పరాంశకేనూతౌ, సప్తమ సంస్థాకుర్యుః, పృష్ఠే రేఖాస్స్వవర్ణసమాః, వీక్షంతేయావంతో వియోనివర్ణాశ్చతావంతః. బలహీనోగగనచరః, కరోతివర్ణం వియోనిజంహీనం, పుష్టింకరోతి, జీవశ్శశీస్సితంభర్గవో, విచిత్రంచ రక్తం ధనకర రుధిరా, రవిసుతకృష్ణం, బుధశ్చబలం. స్వేరాశౌపరభాగే, పరరాశౌ, స్వేనవాంశకే, తిష్ఠన్, పశ్యన్ గ్రహోవిలగ్నం, స్వావర్ణవర్ణం, విగాకురుతే" అని వివరించియున్నది. 4

## పక్షిజన్మజ్ఞానమునకు సాధనము.

శ్లో. ఖగేదృక్కాణే బల సంయుతేన వా
గ్రహేణయుక్తేచ రథాంశ కోదయే

బుధాంశకేవా విహగాః స్థలాంబుజాః
శనైశ్చరేంద్వీక్షణ యోగసంభవాః. 5

టీ. ఖగేద్రేకాణే = పక్షిద్రేక్కాణమందు, శనైశ్చరేంద్వీక్షణయోగసంభవాః= శని చంద్ర వీక్షణమందుగాని, వీరలఁగూడుటయందుగాని పుట్టినవి. స్థలాంబుజాః = స్థలమందైనను జలమందును బుట్టిన, విహగాః = పక్షులు భవంతి = అగుచున్నవి. బలసంయుతేన = బలయుక్తమగు, గ్రహేణ = గ్రహముతోడ, యుక్తే = కూడిన, చరభాంశకోదయే = చరరాశిగాని చరనవాంశగాని, బుధాంశకేవా = బుధనవాంశలలో నొకనవాంశయైగాని యుండిన, విహగ = జలస్థలపక్షులు, భవంతి = అగుచున్నవి.

తా. పక్షిద్రేక్కాణములగు, మిథున ద్వితీయద్రేక్కాణము, సింహప్రథమద్రేక్కాణము, తులాద్వితీయద్రేక్కాణము, కుంభప్రథమద్రేక్కాణములను నాల్గుద్రేక్కాణములలో నొందేని శనిచంద్రులుండినగాని, చూచినగాని స్థలజలములందు పుట్టినపక్షులని యెరుంగదగినది. అనగా శనిచే (జూడఁబడినను శనియుక్తమైనను, మెట్టయందుండెడు పక్షిజననము, చంద్రునిచే కూడికొనిగాని, చంద్రదృష్టికలిగిగాని యుండినయెడల, జలపక్షులజననమని యెరుంగదగినది) జననకాలలగ్నమునందు బుధనవాంశలగు మిథున కన్యానవాంశలలో నొక్కటి యుదయమయి యందు బలవద్గ్రహములుండి, శనియుతిసందృష్టములై యుండినయెడల స్థలపక్షిజననమును చెప్పవలయును. చంద్రయుతి దృష్టమైయుండెనేని జలపక్షిజననమని చెప్పవలయును. ఇందులకు సారావళియందు "విహగోదితద్రేక్కాణే, గ్రహేణబలినాయుతే ధరభాంశే, బౌధాంశేవా, విహగా, స్థలాంబుజాశ్చ శశీక్షణాద్యోగాత్" అని చెప్పబడియున్నది.

## వృక్షోత్పత్తి దెలియుటకు సాధనములు

శ్లో. హోరేందు సూరి రవిభి ర్విబలై స్తరూణాం
తోయేస్థలే తరుభవోంశ కృతః ప్రభేదః
లగ్నాద్గ్రహః స్థలజలర్క్ష పతిస్తు యావాం
స్తావంత ఏవ తరవః స్థలతోయజాతా. 6

టీ. హోరా = లగ్నము, ఇందు = చంద్రుఁడు, సూరి = గురువు, రవి = సూర్యుఁడు, వీరలు విబలైః = బలహీనులై యుండిరేని, వృక్షజన్మప్రశ్న తరుభవః = వృక్షములు మొలచుట, తోయ = జలప్రదేశమందా. స్థలేవా = నిర్జలప్రదేశమందా అనెడు, ప్రభేదః = భేదము, అంశకృతః = నవాంశలవలనఁ తెలియును, స్థలజలర్క్షపతిః = స్థలరాశిగాని జలరాశిగాని తదధిపతియైనగ్రహము, లగ్నాత్ = లగ్నము మొదలుకొని, యావాన్ = ఎన్నియవరాశియందున్నదో, తావంతఏవతరవః = అన్నివృక్షములే, స్థలతోయజాతాః = స్థలమందుగాని జలమందుగాని మొలచినవగును.

తా. జన్మలగ్నసమయమునను, ప్రశ్నలగ్నకాలమునను, చంద్ర,గురు,సూర్యులు,బలహీనులై యుండునెడల, పృచ్ఛకుఁడు వృక్షజన్మప్రశ్న జేయుచున్నాఁడని చెప్పదగినది. అందు వృక్షములు, జలప్రదేశమునందు మొలచునా, నిర్జలప్రదేశములందు మొలచునా యనువివయముల నవాంశలవలన నెఱుంగవలెనుచున్నది. జలరాసులగు, కర్కాటక, మకర పశ్చిమార్ధ, మీనరాసులయం దొకరాశి నవాంశయగునెడల జలప్రాయప్రదేశమునందు వృక్షోత్పత్తియని యు, ఇతరరాశి నవాంశోదయమగునెడల మెట్టయందలి వృక్షజననమని యెఱుంగవలయును. అందు సంఖ్యానిర్ణయము:—లగ్ననవాంశాధిపతి, లగ్నమునకెన్నవరాశి యందుండునో యన్ని వృక్షములని చెప్పవలయును. మఱియు స్థలరాశి నవాంశ ననుసరించి స్థలవృక్షములను, జలరాసుల నవాంశననుసరించి జలప్రదేశమందలి వృక్షములనియు జెప్పదగినది. ఇక్కడ నవాంశాధిపతి వశంబున వక్ష్యమాణంబగు ఆయుర్దాయవిధానముచేత ద్విత్రిగుణత్వము జెప్పదగినది. ఈప్రకారమే సారావళియందు, "లగ్నార్క-జీవ చంద్రైరబలైశ్శ్చైశ్చమూలయోనిస్స్యాత్ స్థల జలభవనవిభాగా, వృక్షాణాం ప్రభేదకరాః, స్థలజలనాంశో లగ్నాద్యావతి, రాశౌతు తేపి తావంతః, ద్విత్రిగుణత్వం తేషా మాయుర్దాయప్రకారోక్తం" అని యున్నది. 6

వృక్షవిశేషంబుల నవాంశాధిపతుల వలన నెఱుంగుట.

శ్లో. అంతస్సారాన్ జనయతి రవిర్దుర్భగాన్ సూర్యసూనుః<br>
క్షీరోపేతాన్ తుహినకిరణః కంటకాఢ్యాంశ్చ భౌమః<br>
వాగీశజ్ఞౌ సఫలవిఫలాన్ పుష్ప వృక్షాంశ్చ శుక్ర<br>
స్స్నిగ్ధానిందుః కటుకవిటపాన్ భూమి పుత్రశ్చ భూయః. 7

టీ. రవిః = సూర్యుఁడు నవాంశాధిపతియయ్యెనేని, అంతస్సారాన్ = మధ్యదృఢంబులగు వృక్షములను, జనయతి = పుట్టించును. సూర్యసూనుః = శని నవాంశాధిపతియయ్యెనేని, దుర్భగాన్ = అప్రియమైన వృక్షములను, తుహినకిరణః = చంద్రుఁడు నవాంశాధిపతియయ్యెనేని, క్షీరోపేతాన్ = పాలతోఁగూడిన వానిని, భౌమః = కుజుఁడు నవాంశాధిపుఁడయ్యెనేని, కంటకాఢ్యాన్ = ముండ్లతోఁగూడిన వృక్షములను, వాగీశజ్ఞౌ = గురుబుధులు నవాంశాధిపతులైరేని, సఫలవిఫలాన్ = సఫలవిఫలవృక్షములను, శుక్రః = శుక్రుఁడునవాంశపతియైన, పుష్పవృక్షాన్ = పుష్పవృక్షములను, భూయః = మఱల, ఇందుః = చంద్రుఁడు, స్నిగ్ధాన్ = నున్నగానుండెడు వృక్షములను, భూమిపుత్రః = కుజుఁడు, కటుకవిటపాన్ = జీడి మొదలయిన చెట్లులను పుట్టించును.

తా. సూర్యుఁడు నవాంశాధిపతి యగునెడల, మధ్యదృఢముగల అనగా చేవగలశింశుపాదివృక్షముల బుట్టించును, సూర్యపుత్రుఁడగు, శనినవాంశాధిపతి యగునెడల మనశ్చక్షుస్సులకు అప్రియములగు వృక్షముల జనింపజేయును, చంద్రుఁడు, నవాంశాధిపతి యయ్యెనేని, పాలతోఁగూడిన జిల్లేడు మొదలగువానిని బుట్టించును. అంగారకుఁడు నవాంశాధిపతిగ

నొప్పినయెడల ముండ్లతోఁగూడిన చంద్ర మొదలగు వృక్షముల నుత్పత్తిజేయును. బృహస్పతి నవాంశాధిపతి యగునెడల ఫలించువృక్షములను, బుధుఁడు నవాంశాధిపతి యగునెడల ఫలహీనములగు వృక్షములను జనింపజేయఁదురు. శుక్రుఁడు నవాంశాధిపతి యగునెడల, మల్లె సంపంగి, చేమంతి, మొదలగు, పుష్పలతాదులను జనింపజేయును, గుఱియును, చంద్రుఁడు స్నిగ్ధములగు దేవదారు, వృక్షాదుల నుదయింపజేయుననియు, అంగారకుఁడు జీడిచెట్టు మొదలగువానిని బుట్టించుననియు నుండుటచే, చంద్రాంగారకులకు, రెండువిధముల చెట్లనుబుట్టించు నధికారముగలదు. గనుక చంద్రుఁడు, పాలతోఁగూడిన వృక్షములను, స్నిగ్ధవృక్షములను జనింపజేయుననియు, కుజుఁడు, ముండ్లచెట్లను, కటుకవృక్షములను జనింపజేయునని యెరుంగవలెను. ఇందులకు సారావళియందు, "అంతస్సారాన్, వృక్షాన్, భానుర్దుర్గోద్భవాన్, కరోతిభృశం, క్షీరస్నేహసమేతాన్, శశీగురుః ఫలసమేతాంశ్చ, కటుకంటికినో రుధిరస్సుదుర్భగాం, స్తగణిజ, స్తతిశ్శుక్రః, కుసుమ ఫలస్నేహయుతాన్, బుధస్తుపరివర్జితాన్ జనయేత్" అని యుదాహరణమున్నది. 7

<-- సదసద్వృక్ష విజ్ఞాన వృక్షసంఖ్యలు. -->

శ్లో. శుభోఽశుభర్క్షే రుచిరంకుభూమిజం
కరోతి వృక్షం విపరీత మన్యథా
పరాంశకే యావతి విచ్యుత స్స్వకా
ద్భవంతి తుల్యా స్తరవ స్తథా విధాః. 8

టీ. శుభః = శుభగ్రహము, అశుభర్క్షే = పాపగ్రహ రాశియందుండెనేని, రుచిరం= మనోహరమయిన (వృక్షమును), కుభూమిజం = అశుభస్థానములందు బుట్టినదానిని, కరోతి= చేయుచున్నాఁడు, అన్యథా = అటుగాకయుండెనేని, విపరీతం = వికారముగా, కరోతి=చేయుచున్నాఁడు. స్వకాత్ = స్వనవాంశమునుండి, విచ్యుతః = చలించినవాఁడై, యావతి = ఎన్నవదైన, పరాంశకే = పరనవాంశయందున్నదో, తత్తుల్యాః = అన్నిసంఖ్యలుగల, తథావిధాః = అనేకములయిన, తరవః = వృక్షములు, భవంతి = అగుచున్నవి.

తా. లగ్ననవాంశాధిపతి, శుభగ్రహమై తత్కాలంబున పాపగ్రహరాశి యందుండినచో, మనోహరములగు వృక్షములు, అశుభస్థలములగు స్మశానాదులయందు బుట్టెననియు, అట్లుగానియెడల చెప్పుటకుగాని యట్లుసేయుననియు, ఆనవాంశాధిపతి, అశుభగ్రహమై తత్కాలమున శుభగ్రహరాశి యందుండునెడల చెడుగగుచెట్లు, ఉద్యానవనాదులందు బుట్టెననియు జెప్పదగినది, నవాంశాధిపతి శుభగ్రహమై శుభగ్రహరాశి యందుండునెడల, సారవంతమగు భూమియందు, ఫలకుసుమయుక్తంబయి శ్రేష్ఠమగువృక్షము, జననమని జెప్పవలెను, ఆనవాంశాధిపతి అశుభగ్రహమై, అశుభగ్రహరాశియందుండునెడల, చెడ్డచెట్టు, చెడ్డభూమియందుద యంచెనని జెప్పవలెను. నవాంశాధిపతియైన గ్రహము తననవాంశనువిడిచి, పరనవాంశయం

దుండినయెడల స్వనవాంశ మొదలు తత్కాలస్థిత పరనవాంశవరకు లెక్కించిన రాశిసంఖ్యలు గల యన్ని వృక్షములు నవాంశతుల్యముగా స్థలమునగాని, జలమునగాని మొలచినవని తెలియ వలయును. పూర్వము నవాంశాధిపతి లగ్నమున కెన్నవయింటనుండునో యాసంఖ్యవృక్ష సంఖ్యయనియు, ప్రస్తుతము, స్వనవాంశ మొదలు తత్కాలస్థిత పరనవాంశ వరకగుసంఖ్య వృక్ష సంఖ్యయనియు ద్వివిధములుగా జెప్పబడియుండుటచే యీ రెండువిధములననుసరించి జెప్పదగును. ఇదిగాక ఇందులకుదాహరణము, సారావళియందు:—"స్వాంశా త్పరాంశగామిషు యావత్సంఖ్యా భవంతి, తావంతః, స్థలజావా జలజావాతరవః ప్రాక్సంఖ్యయా ప్రవదేత్." అని ప్రయోగము. 8

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
వియోనిజన్మ నామక
తృతీయాధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### నిషేకాధ్యాయము.—4.



శ్లో. కుజేందుహేతు ప్రతిమాస మార్తవం గతేతుపీడర్క్ష మనుష్ణదీధితౌ
అతోన్యథాస్థే శుభపుంగ్రహేక్షితే నరేణసంయోగ ముపైతికామినీ. 1

టీ. ప్రతిమాసం = ప్రతి నెలయందును, ఆర్తవం = (స్త్రీలకు) రజోదర్శనమునకు, కుజేందుహేతుః = అంగారక చంద్రులే కారణభూతులు, అనుష్ణదీధితౌ = చంద్రుడు, పీడర్క్షం = స్త్రీల అనుపచయస్థానమును, గతేసతి = పొందుచుండగా, చంద్రుడు కుజునిచేత జూడంబడెనేని స్త్రీలకు రజోదర్శనమగుచున్నది. అతోన్యథాస్థే= ఈ చెప్పంబడినదానికి, శుభపుంగ్రహేక్షితే= శుభుండును పురుషగ్రహంబునునైన వానిచేత జూడంబడెనేని, కామినీ = స్త్రీ, నరేణ = పురుషునితోడ, సంయోగం = సంగమమును, ఉపైతి = పొందుచున్నది.

తా. ప్రపంచమున స్త్రీ పురుషుల సంయోగము గర్భాధాన కారణభూతము. ఇందు లకు పర్వకాలము స్త్రీలయొక్క ఋతుకాలముగాన వరాహమిహిరాచార్యులు దన బృహజ్జా తకమునందు చతుర్థాధ్యాయమగు నిషేకాధ్యాయమును జెప్పబూని, ఇందు గర్భాధాన కార ణభూతంబగు స్త్రీలఋతువును, ఆఋతుకాలమున స్త్రీ పురుష సంయోగాసంయోగములను జెప్పుచున్నాఁడు. ప్రతిమాసమునందును స్త్రీలకు రజోదర్శనమగుటకు, అంగారక చంద్రులు కారణభూతులు. వంధ్యాతుర వృద్ధావ్యతిరిక్తలగు స్త్రీల జననరాశిమొదలు, అనుపచయస్థా నములగు 1, 2, 4, 5, 7, 8, 9, 12, యీ యేనిమిదిస్థానంబులయందుఁ జంద్రుఁడుండి అంగా రకునిచేఁ జూడబడుచుండెనేని ఆస్త్రీలకు గర్భధారణహేతువగు నార్తవము సంభవించుచు న్నది ఇకదుకు బాదరాయణవచనము:—స్త్రీణాంగతో నుపచయర్క్షం మనుష్ణరశ్మి స్సందృశ్యతే యదిధరాతనయేనతాసాం గర్భగ్రహార్తవముశంతి తదానవంధ్యా, వృద్ధాతురాల్పవయసా మ పిచైతదిష్టమ్." అని ఇదియునుగాక, సారావళియందు "అనుపచయరాశిసంస్థే కుముదాకరబాం ధవే, యదిగదృష్టే ప్రతిమాసం యువతీనాం భవతీహ రజోధ్వంసంత్యేకమ్ ఇందుర్జలం, కుజో స్త్వగ్ధలమిశ్రం త్వగ్ని రేవ పిత్తంస్యాత్. ఏవంరక్తేశుభితేపిత్తేన రజఃప్రవర్తతేస్త్రీషు, ఏవంయ ద్గ్రావతి రజోగర్భస్య నిమిత్తమేవ కథితంతత్. ఉపచయసంస్థే విఫలం ప్రతిమాసం దర్శనం తస్యాః." అని యున్నది.

స్త్రీ పురుషుల సంయోగా సంయోగముల నెఱుఁగువిధము:— పైచెప్పబడిన క్రమ మునకు వ్యత్యస్తముగా చంద్రుఁడు పురుషుని జన్మరాశిమొదలు ఉపచయరాసులగు 3, 6, 10, 11, ఇండ్లయందుండి శుభుండును, బురుషగ్రహమున్నైన గురువుచే జూడబడుచుండెనేని స్త్రీ పురుషులకు సంగమముగలుగునని జెప్పదగినది. ఇంగులకు వ్యత్యస్తముగానుండెనేని స్త్రీపురు షసంగమము గలుగదని యెఱుంగవలయును. ఇందులకుదాహరణముగ. "పురుషోపచయ గృ హస్థో గురుణాయదిదృశ్యతే హిమమయూఖః స్త్రీపూరుష సంయోగం తదావదే దన్యథా నైవమ్." అని బాదరాయణులు వచించియున్నారు. మఱియు సారావళియందు:—"ఉపచయ భవనే శశభృద్దృష్టో గురుణా సుహృద్భిరథవాసౌ, పుంసాకరోతియోగం విశేషతః శుక్రసం దృష్టః." అనియును జెప్పబడియున్నది. ఈవిచారము ఋతుస్నానమైన పిదప జేయదగినది. ఈ విషయమునకై మణిత్థుఁడు, "ఋతువిరమే స్నాతాయాం యద్యుపచయసంస్థిత శ్శశిభవ తి బలినా గురుణాదృష్టో భర్తారసమాసంగమశ్చ తదారాజపురుషేణ రవిణావిరేన భామేనవీక్షి తేచంద్రే సౌమ్యేన చపలమతినా భృగుణాకాంతేన రూపవతా భృత్యేన సూర్యపుత్రేణా యాతిస్త్రీమసంయోగం ఏకైకేనఫలంస్యా ద్దృష్టేనాన్యైః కుజాదిభిః పాపైః సర్వైస్సన్న గృహత్యక్త్వాగచ్ఛతి వేశ్యాపదం యువతీ." అని వచించియున్నాఁడు. 1

### క్రీడాప్రకారము నెఱుంగువిధము.

శ్లో. యథాస్తరాశి ర్మిథునం సమేతి తథైవవాచ్యో మిథునప్రయోగః
అసద్గ్రహాలోకిత సంయుతేస్తే సరోషఇష్టైః స్సవిలాసహాసః. 2

టీ. అస్తరాశిః = సప్తమరాశి సంజ్ఞగలజంతువు, యథా = ఏ ప్రకారముగా, మిథునం = మిథునకర్మను, సమేతి = పొందుచున్నదో, తథైవ = అటులే, మిథునప్రయోగః = స్త్రీపురుషుల సంగమము, వాచ్యః = చెప్పందగును. అస్తే = సప్తమస్థానము, అసద్గ్రహాలోకితసంయుతే = పాపగ్రహదృష్టమైకాని యుక్తమైకాని ఉండెనేని, సరోషః = కలహముతోఁగూడిన సురతము, ఇష్టైః = శుభగ్రహవీక్షణ యుక్తములలో నొక్కటయ్యెనేని, సవిలాసహాసః = విలాస పరిహాసాదులతోఁ గూడిన సురతము.

తా. జననలగ్నమునకుగాని, ఆధానలగ్నమునకుగాని, ప్రశ్నలగ్నమునకుగాని, సప్తమరాశి అస్తరాశియనఁబడును. ఆ అస్తరాశిపేరుగల జంతువు యేప్రకారము క్రీడించునో ఆవిధముగ తత్సంబధులగు స్త్రీపురుషులు క్రీడించుదురని జెప్పదగినది. లగ్నమునకు సప్తమరాశి మేషమగునెడల మేషము లెట్లు క్రీడించునో యట్లు క్రీడించుదురనియు వృషభము లగ్నము సప్తమస్థానమగునెడల గోవృషభము లెట్లు మిథునకర్మసలుపునో యా ప్రకారము ద్విపదచతుష్పదాది రాశ్యనుసారముగ ద్విపద చతుష్పదాది క్రీడలను స్త్రీపురుషులకుఁ జెప్పవలయును మఱియు నాసప్తమస్థానము పాపగ్రహములచేఁ జూడబడిగాని, పాపగ్రహ యుక్తమయిగాని, ఉండునెడల కలహములతోఁగూడిన సంగమముగలుగుననియు, శుభగ్రహ దృష్టమైగాని శుభగ్రహయుక్తమైగాని, యుండునెడల విలాస పరిహాసాదులతోఁగూడిన సురతము గలుగుననియు, గ్రహయుక్తముగాకయుఁ వీక్షితముగాకయు, నుండినయెడల గలహవిలాసాదులులేని సంగమము గల్గుననియు, శుభాశుభగ్రహ యుక్తమైగాని దృష్టమైగాని యుండునెడల కించిత్ కలహసహితమైన సవిలాసహాస సురతము జెప్పదగినది. ఈవిషయమై సారావళియందు:—
"ద్విపదాదయోవిలగ్నాత్సురతం కుర్వంతి సప్తమేయద్వత్, తద్వత్ స్త్రీపురుషాణాం గర్భాధానం సమాదేశ్యం, అస్తేశుభయుతదృష్టే సరోషకలహంవదే, ద్గ్రాహ్యం సౌమ్యై స్సౌహాస్యం సురతం వాత్స్యాయన సంప్రయోగికం వాచ్యం." అని కలదు. 2

## గర్భసంభవాసంభవములు.

శ్లో. రవీందు శుక్రావనిజైః స్వభాగగైర్గురౌ త్రికోణోదయ సంస్థితేపివా
భవత్యపత్యం హి విబీజినామిమే కరా హిమాంశోర్విదృశామివాఫలాః. 3

టీ. స్వభాగగైః = స్వనవాంశలను పొందియున్న, రవీందుశుక్రావనిజైః = సూర్యచంద్ర శుక్రాంగారకులచేతను, అపత్యం = గర్భోత్పత్తి, భవతి = అగుచున్నది. గురౌ = బృహస్పతి, త్రికోణోదయ సంస్థితేపివా = నవమపంచమములయందుగాని లగ్నమందుగాని యుండెనేని గర్భోత్పత్తియగును. ఇమే = ఈ చెప్పంబడిన గర్భసంయోగములు, విబీజినాం = నపుంసకులకు, హిమాంశోః = చంద్రునియొక్క, కరాః = కిరణములు, విదృశామివ = అంధులకువలెనే, విఫలాహి = నిష్ఫలంబులుగదా.

తా. ఆధానకాలమందైనను, ప్రశ్నకాలమందైనను, సూర్యచంద్రాంగారక శుక్రులు ఏకరాశియందైనను, స్వనవాంశగతులైగాని యుండినయెడల గర్భముగలుగునని తెలియదగినది.

మఱియు, "బలయుక్తౌ స్వగృహాంశే ష్వర్క సితా వుపచయర్క్ష గౌ, పుంసాం స్త్రీణాంవా కుజచంద్రౌ యదాతదా సంభవతిగర్భః." అని లఘుజాతకమున జెప్పబడియుండుటవలన సూర్య చంద్రశుక్రకుజులు బల్యులును స్వనవాంశగతులు గాకున్నను, పురుషోపచయ రాశిగతులగు సూర్యశుక్రులైనను స్త్రీలగ్నవుపచయ రాశిగతులగు చంద్రాంగారకులైనను స్వనవాంశగతులైయుండిరేని గర్భముగలుగునని దెలియదగినది. మఱియు గురువు త్రికోణస్థానములగు నవమ పంచమములయందుగాని, లగ్నమునందుగాని యుండునెడల గర్భముగలుగును. ఈ చెప్పఁబడిన గర్భసంయోగములు చంద్రుని కిరణములు గ్రుడ్డివారికి నిష్ఫలంబగునట్లే వీర్యహీనులగు స్త్రీ పురుషులకు యుపయోగపడవుగాన గర్భముగలుగదని జెప్పవలెను. 3

## ఆధానకాలము మొదలు ప్రసవపర్యంతము దంపతులకుఁ గల్గెడు అశుభఫలములు.

శ్లో. దివాకరేంద్వోః స్మరగౌ కుజార్కజౌ
గదప్రదౌ పుంగవయోషితో స్తదా
వ్యయస్వగౌ మృత్యుకరౌ యుత
స్తథా తదేకదృష్టో మరణాయ కల్పతే. 4

టీ. దివాకరేంద్వోః = సూర్యచంద్రులకు, కుజార్కజౌ=అంగారకశనులు, స్మరగౌ= సప్తమస్థానగతులైరేని, తదా = అప్పుడు, పుంగవయోషితోః = దంపతులకు, గదప్రదౌ = రోగమును గలుగఁజేయుదురు. తయోః = ఆసూర్యచంద్రులకు, వ్యయస్వగౌ = కుజశనుల లోనొకఁడు ద్వాదశమందును ఒకఁడు ద్వితీయమందునుండిరేని, మృత్యుకరౌ= ఆలుమగలకు మరణము గలుగంజేయుదురు. తథా = ఆప్రకారమే, యుతః = సూర్యుండు, (కుజశనులలో నొకనితో) కూడినవాఁడై, తదేకదృష్టః = మఱియొకనిచేఁ జూడంబడెనేని, మరణాయకల్పతే = మరణమునుజేయును.

తా. ఆధానకాలమున సూర్యుడుండురాశికి సప్తమస్థానమునందు గర్భ ద్వితీయమాసమున కధిపతియగు అంగారకుఁడుండెనేని ద్వితీయ మాసమునందును ఆరవమాసమున కధిపతి యగు శనియుండెనేని ఆరవమాసమునను బురుషునకు రోగముగలుగునని దెలియదగినది. అదే ప్రకారముగ చంద్రుఁడుండురాశికి సప్తమస్థానమున పైజెప్పబడినరీతిగా అంగారక శనైశ్చరులు యుండునెడల వారివారికి జెప్పబడిన మాసములయందు స్త్రీకి రోగముగల్గునని దెలియదగినది. మఱియు సూర్యునకు పండ్రెండవయింట కుజశనులలో నొకడును. రెండవయింట మఱియొకఁడును యుండునెడల వారిలో తత్కాలమున బలవంతములైనవారి మాసమున పురుషునకు మరణము జెప్పదగినది. అట్లే ఆకుజశనులలో నొకఁడు చంద్రునకు వ్యయస్థానమునందును మరియొకఁడు ద్వితీయస్థానమునందును యుండునెడల పైజెప్పినప్రకారము బలాబలముల ననుసరించి స్త్రీకి ఫలము జెప్పదగినది. ఇదియుగాక సూర్యుడు కుజశనులలో నొక్కనితోఁడి

మఱొకనిచేఁ జూడబడుచుండినను ఆ కుజశనులలో తత్కాలమున బలవంతుని మాసమున బురుషునకు మరణమును, చంద్రుఁడు ఆకుజశనులలో నొకనితో సంబంధపడి మఱొకనిచే వీక్షణకలిగి యుండునెడల తత్కాలమున ఆశన్యంగారకులయందు బలవంతుడగువాని మాసమున స్త్రీకి మరణమును జెప్పదగినది. 4

## ఆధాన లగ్నమువలన శిశువుయొక్క పితృ మాతృ పితృవ్య మాతృష్వసలకు గలుగు శుభాశుభములు.

శ్లో. దివార్క శుక్రౌ పితృమాతృసంజ్ఞితౌ
శనైశ్చరేందూ నిశితద్విపర్యయాత్
పితృవ్య మాతృష్వసృసంజ్ఞితౌ చ తౌ
వధౌజ యుగ్మర్క్ష గతౌ తయోశ్శుభౌ. 5

టీ. దివా = పగటియందు, అర్కశుక్రౌ = రవిశుక్రులు, పితృమాతృసంజ్ఞితౌ = పితృమాతృసంజ్ఞలగుదురు, నిశి = రాత్రియందు, శనైశ్చరేందూ = శనిచంద్రులు పితృమాతృసంజ్ఞితులు, తద్విపర్యయాత్ = ఆ దివారాత్రి వ్యత్యయమువలన, తావేవ = ఆరెండుగ్రహములే, పితృవ్యమాతృష్వసృసంజ్ఞితౌ = పితృవ్యమాతృష్వసృసంజ్ఞములగును, తౌ = ఆచెప్పంబడిన రెండేసిగ్రహములు, ఓజయుగ్మర్క్షగతౌ = విషమసమరాసులనుబొందినవై, తయోః = ఆపితృమాతలకును, పితృవ్యమాతృష్వసలకును, శుభౌ = శుభఫలప్రదములగును.

తా. పగటికాలమునందు ఆధానముగాని జననముగాని యగునెడల పితృకారకుఁడు సూర్యుండనియు, మాతృకారకుఁడు శుక్రుఁడనియు, నెఱుంగదగినది. రాత్రికాలమునందు నాధానముగాని జననముగాని యగునెడల పితృకారకుఁడు శనియు, మాతృకారకుఁడు చంద్రుఁడు నగుచున్నారు. ఇందులకు వ్యత్యస్తముగా పితృవ్యమాతృష్వసకారకు లగుచున్నారు. అధానలగ్నముగాని జననకాలలగ్నముగాని, పగటియందైనయెడల పితృవ్యకారకుఁడు శనియు, మాతృష్వసకారకుఁడు చంద్రుఁడును నగుచున్నారు. రాత్రికాలము ఆధానలగ్నమయినను జననకాలలగ్నమయిన యెడల పితృవ్యకారకుఁడు సూర్యుఁడును మాతృష్వసకారకుఁడు శుక్రుఁడును అగుచున్నారు. (పితృవ్యులు = పెదతండ్రియు, పినతండ్రియు, మాతృష్వసలు= పెదతల్లి, పినతల్లి) ఇందులకు ప్రయోజనము;—సూర్యుఁడు విషమరాసులైన, మేష, మిథున, సింహ, తులా, ధనుః, కుంభ రాసులయం దున్నపక్షమున నాధానముగాని, జననలగ్నముగాని, పగటియందగునెడల శిశువు యొక్కతండ్రికిని, రాత్రియందగునెడల పెదతండ్రి, పినతండ్రులకును, శుభపలములనిచ్చును. శుక్రుఁడు సమరాసులగు వృషభ, కటక, కన్యా, వృశ్చిక, మకర, మీనములయందుండి ఆధానజన్మలగ్నములు పగటి యందైన. శిశువుయొక్క తల్లికిని, రాత్రియందగునెడల వానిపినతల్లి పెదతల్లులకును శుభఫలముల నిచ్చువాఁడగుచున్నాఁడు. శనైశ్చరుఁడు విషమరాసులయందున్నవాఁడై, ఆధానజననలగ్నములు రాత్రియందైనశిశువు

తండ్రికిని పగటియందైన ఆశిశువు పెదతండ్రి, పినతండ్రులకును శుభకరుం డగుచున్నాఁడు. చంద్రుఁడు విషమరాసులయందుండగా. ఆధానజననలగ్నములు. రాత్రియందైన శిశువుయొక్క తల్లికిని, పగటియందగు నెడల, పినతల్లి పెదతల్లులకును శుభప్రదుం డగుచున్నాఁడు. పైనచెప్ప బడిన నాలుగు గ్రహములు ఉక్తవైపరీత్యముగ నున్నయెడల మాతాపితరులకు అశుభఫలముల నొసంగువారగుచున్నారు. ఎట్లనగ సమరాసులయందుండు సూర్యుఁడు పగటికాలము ఆధానజననలగ్నములగు నెడల తండ్రికిని, రాత్రియందగు నెడల, పెదతండ్రి, పినతండ్రుల కును అశుభకరుఁడగుచున్నాఁడు విషమరాసులను బొందిన శుక్రుఁడు, పగటియందుతల్లికిని, రాత్రియందు పెదతల్లి,పినతల్లులకును అశుభప్రదుఁడగుచున్నాఁడు. శనిసమరాశిగతుఁడైయుండ ఆధానజనన లగ్నములు రాత్రియందైన తండ్రికిని, పగటియందైన శిశువుయొక్క పితృవ్యుల కును అశుభఫలములనిచ్చు వాఁడగుచున్నాఁడు. చంద్రుఁడు విషమరాశిగతుఁడై ఆధానాదులు రాత్రియందైన తల్లికిని, పగటికాలమునందైన పెదతల్లి పినతల్లులకును అశుభకరుండగుచు న్నాఁడు. లోకవ్యవహారమును గూర్చి తెలిసికొని ఫలముల చెప్పవలయును. 5

ఆధాన సమయమువలన స్త్రీలకుగల్గు మరణయోగములు

శ్లో. అభిలషద్భి రుదయర్క్ష మసద్భిర్మరణ మేతి శుభదృష్టిమయాతే
ఉదయరాశి సహితే చ యమే స్త్రీ విగళితోడుపతిభూసుతదృష్టే. 6

టీ. లగ్నే = ఆధానలగ్నము, శుభదృష్టిం = శుభగ్రహదృష్టిని, అయాతేసతి = పొందకయుండగా, ఉదయర్క్షం = (అధాన) లగ్నమును, అభిలషద్భిః = కోరుచున్న, అసద్భిః = పాపగ్రహములచే, స్త్రీ = గర్భిణియైన స్త్రీ, మరణం = మృతిని, ఏతి = పొందుచున్నది. ఉదయరాశిసహితే = లగ్నగతుండైన, యమే = శని, విగళితోడుపతిభూసు తదృష్టే = క్షీణచంద్ర, కుజులచేత చూడఁబడి యుండఁగా గర్భిణియైన స్త్రీ, మరణమేతి = మృతిబొందుచున్నది.

తా. ఆధానలగ్నము శుభగ్రహములచే చూడబడకయుండి ఆలగ్నమునకు ద్వాదశలగ్నమున పాపగ్రహములున్నయెడల, గర్భిణిస్త్రీ మృతిబొందునని దెలియదగినది. ఇందులకు "అశుభైర్ద్వాదశగ్నస్థైశ్శుభదృష్టివివర్జితే ఆధానలగ్నే మరణంయోషితః ప్రవదేద్బుధః" అనిగార్గి చెప్పియున్నాఁడు (ఈబృహజ్జాతకశ్లోకమున "ఉదయర్క్షమభిలషద్భిః" అని చెప్పియుండుటవలన, లగ్నమునకు ద్వితీయమునందున్న పాపగ్రహములని కొందరుచెప్పుదురుగాని యిచ్చోటుమాత్రము. అట్లుతెలపరాదు.) శనైశ్చరుఁడు లగ్నమునందుండి క్షీణచంద్రునిచేనైనను, అంగారకునిచేనైనను జూడబడ చుండినయెడల గర్భిణియగుస్త్రీ మృతినొందును. 6

ఆధానలగ్నమునననుసరించు గర్భిణికి మఱియొక మరణయోగము.

శ్లో. పాపద్వయమధ్యసంస్థితే లగ్నేచంద్రే న చ సౌమ్యవీక్షితే
యుగపత్పృథగేవనావదేన్నారీ గర్భయుతావిపద్యతే. 7

టీ. లగ్నేందూ = ఆధానలగ్నమును చంద్రుండును, యుగపత్ = ఏకకాలమందు, పాపద్వయ మధ్యసంస్థితౌ = రెండు పాపగ్రహముల నడుమనుండి, సౌమ్యగ్రహావీక్షితౌ = శుభగ్రహావీక్షితులు, నభవతః = కాకుండిరేని, గర్భయుతా = గర్భముతోగూడిన, నారీ = స్త్రీ, విపద్యతే = మృతిబొందుచున్నది, పృథగేకశావాదేత్ = లగ్నము, ఒకరాశి చంద్రుడున్నరాశి మఱియొకటి.

తా. ఆధానలగ్నమునందు చంద్రుఁడుండి ద్వాదశమున నొక పాపగ్రహమును, ద్వితీయమున నొక పాపగ్రహమునుండి ఆ లగ్న చంద్రులకు శుభగ్రహ వీక్షణ్యము లేక యుండినచో గర్భిణి మృతినొందును. ఇదిగాక లగ్నము ఒకరాశియై, చంద్రుఁడు మఱియొక రాశియందుండి లగ్నముగాని, చంద్రుడుగాని పాపగ్రహముల మధ్యను శుభగ్రహములచే జూడబడకయు నుండునెడల గర్భిణి మరణించునని దెలియదగినది. లగ్నచంద్రులు పృథగ్రాశిగతులై అనగా లగ్నమునకు తృతీయమున చంద్రుడుండి, ద్వాదశ ద్వితీయ చతుర్థముల యందు పాపగ్రహములుండగా, లగ్నముగాని, చంద్రుడుగాని, శుభగ్రహములచే జూడబడకుండునెడల గర్భిణి మృతిజెందును. మఱియు ఈ యోగముల గలుగజేసెడి గ్రహములయందు బలాధికమగు గ్రహమునకుఁ జెప్పబడిన గర్భమాసమునందు గర్భిణీ మృతిని జెప్పదగినది. మఱియు లగ్నచంద్రులు పాపగ్రహముల మధ్యనున్నను బలయుక్తములగు శుభగ్రహములచే జూడఁబడుచుండునెడల గర్భిణి రోగపీడితురాలగునని జెప్పవలయునేగాని మృతిజెందునని చెప్పగూడదు. కొందరు యీ యోగమునకే గర్భిణి రోగపీడితురాలుగ నుండి తరువాత మృతి బొందుననియు జెప్పుదురు. ఇందులకు నారదులవారు "పాపమధ్య గతౌస్యాతాం నచసద్గ్రిహ వీక్షితౌ, ఏకస్థౌవా పృథక్‌స్థౌవా మృతిమాగాతి గర్భిణీ, సౌమ్యైస్తు బలిభిర్ద్రుష్టౌ రోగిణీ లగ్నశీతగూ ॥ అని వచించియున్నారు. 7

శ్లో॥ క్రూరేశశినశ్చతుర్థగే లగ్నాద్వానిధానాశ్రితే కుజే
బంధ్వాంత్యగయోః కుజార్కయోః క్షీణేందౌనిధనాయ పూర్వవత్.

టీ. శశినః = చంద్రుడున్న రాశిమొదలు, క్రూరే = పాపగ్రహము, చతుర్థగేసతి = చతుర్థమందుండఁగాను, కుజే = అంగారకుండు, నిధానాశ్రితే = అష్టమమందుండినను, లగ్నాద్వా = లగ్నముమొదలు చతుర్థమందొక పాపగ్రహంబును అష్టమందు కుజుఁడును ఉండినను, కుజార్కయోః = కుజసూర్యులు, బంధ్వంత్యగయోః = చతుర్థ ద్వాదశముల యందుండఁగా, క్షీణేందౌ = చంద్రుడు క్షీణుండై యేరాశియందైన నుండినను, పూర్వవత్ = ముందు చెప్పినప్రకారముగా, నిధనాయ = గర్భిణీమరణము కొఱకు, (భవతి = అగుచున్నవి.)

తా. ఆధానలగ్న చక్రమునందు చంద్రుఁడుండు రాశిమొదలు నాలుగవరాశియందొక పాపగ్రహముండగ అంగారకుఁ డష్టమస్థానముననుండినచో గర్భిణీస్త్రీకి మరణయోగము. అట్లుగాక లగ్నముమొదలు నాల్గవరాశియందొక పాపగ్రహముండి అష్టమమున అంగారకుఁ డుండునెడల గర్భిణీస్త్రీకి మరణయోగము. మఱియు అంగారకుఁడు చతుర్థమందును,

సూర్యుడు ద్వాదశమునందునుండి చంద్రుఁడు క్షీణుఁడై యాకాలమున నేరాశియందు నుండినను గర్భిణిస్త్రీకి మరణయోగమని యెఱుఁగవలయును. ఈమూఁడు మరణయోగములు. ఆధాన లగ్నము ననుసరించియు, తత్కాలమున చంద్రుఁడుండు రాశి ననుసరించియు యోచింపదగినవి.

శ్లో. ఉదయాస్తగయోః కుజార్కయోర్నిధనం శస్త్రకృతంవదేత్తదా
మాసాధిపతౌ నిపీడితే తత్కాలం స్రవణంసమాదిశేత్. 9

టీ. కుజార్కయోః = కుజసూర్యులు, ఉదయాస్తగయోః = లగ్న సప్తమములయం దుండఁగా, తదా = అప్పుడు, శస్త్రకృతం = శస్త్రహేతుకమైన, నిధనం = మరణమును, వదేత్ = చెప్పవలయును, మాసాధిపతౌ = గర్భమాసాధిపతి, నిపీడితే = నిషేకకాలమందు నిపీడితుఁడై యుండెనేని, స్రవణం = గర్భస్రావమును, సమాదిశేత్ = చెప్పవలయును.

తా. ఆధానలగ్నము నెఱింగి ఆలగ్నమున అంగారకుఁడును, ఆరాశికి సప్తమస్థానమున సూర్యుఁడును యుండునెడల గర్భిణికి శస్త్రనిమిత్తమరణమును జెప్పదగినది. మఱియు నిషేకకాలమున నిపీడితుఁడై యుండు గ్రహ మధిపతిగాఁగల గర్భమాసమునందు గర్భిణికి గర్భస్రావమును జెప్పదగినది.

అంగారకాదులు, గ్రహయుద్ధమున జయింపబడిన వారైనను, సూర్యచంద్రులు పాపులతోఁ గూడినను, పాపవీక్షణ్యము గలిగినవారైనను రాహుగ్రస్తులైనను నిపీడితు లనంబడుదురు.

## గర్భపుష్టి నెఱుంగు విధము.

శ్లో. శశాంకలగ్నోపగతైశ్శుభగ్రహైస్త్రికోణజాయార్థసుఖాస్పదస్థితైః
తృతీయలాభర్క్షగతైరశోభనైస్సుఖీతు గర్భో రవిణానిరీక్షితః. 10

టీ. శశాంకలగ్నోపగతైః = చంద్రునిగాని లగ్నమునుగాని పొందియున్న, శుభైః = శుభగ్రహములచేతనైనను, త్రికోణజాయార్థ సుఖాస్పదస్థితైః = నవమ పంచమ సప్తమ ద్వితీయ చతుర్థ దశమ స్థానములయందున్న శుభగ్రహములచేతనైనను, తృతీయలాభర్క్షగతైః =చంద్రునికిగాని లగ్నమునకుగాని తృతీయైకాదశములయందుండెడు, అశోభనైః=పాపగ్రహములచేతనైనను, గర్భః = గర్భము, సుఖీ = పుష్టిగలది, (భవేత్)= అగును, చంద్రుండుగాని లగ్నముగాని, రవిణా = సూర్యునిచేత, నిరీక్షితః=చూడఁబడెనేనియు, గర్భము పుష్టిగలది యగును.

తా. సౌమ్యగ్రహములు లగ్నమందున్నను, చంద్రుని గూడియున్నను, లగ్నమునకుఁగాని చంద్రుఁడున్న రాశికిగాని, నవమ, పంచమ, సప్తమ, ద్వితీయ, చతుర్థ, దశమస్థానములనగా. 9, 5, 7, 2, 4, 10, యీ స్థానములయందు శుభగ్రహములున్నను, లగ్న చంద్రుల తృతీయైకాదశములయందనగా, 3, 11, యిండ్లయందు పాపగ్రహములున్నను, లగ్నమైనను, చంద్రుఁడైనను సూర్యునిచే జూడఁబడుచుండినను, గర్భము పుష్టిగలిగి యుండునని దెలియదగినది. ఇందు “రవిణానిరీక్షితః.” అనుచోట, “గురుణానిరీక్షితః.” యని యుండవలయునని కొందఱి యభిప్రాయముగాని వరాహమిహిరాచార్యుల మతమును సారావళి శ్లోక ఉదాహర

ణమును సమముగానున్నవి. "ఘోరేందుగతైసౌమ్యై స్త్రీకోణజాయార్థ సుఖాస్పదస్థైర్వా పాపైస్త్రీలాభ యాతైస్సుశేతు గర్భోనిరీక్షితోరవిణా." అని సారావళి. ఇదిగాక ఇతర గ్రంధములయందు రవిగురుల దృష్టమైన పుష్టికలిగిన గర్భమనియు, శుక్రుడు జూచుచున్న సంపూర్ణముగ పాలు గలిగియుండునవియు, బుధుడు చూచుచున్న గర్భము ధరించుకాలమున సుఖకరముగనుండి స్త్రీ ప్రజను బ్రసవించుననియు వ్రాయబడియున్నది.

## స్త్రీ, పురుష, జననము నెరుంగువిధము.

శ్లో. ఓజర్క్షే పురుషాంశ కేషుబలిభి ర్లగ్నార్క గుర్విందుభిః
పుంజన్మ ప్రవదే త్సమాంశక గతై ర్యుగ్మేషు తై ర్యోషితః
గుర్వర్కౌ విషమే నరం శశి సితౌ వక్రశ్చ యుగ్మే స్త్రియం
ద్వ్యంగస్థా బుధ వీక్షణాచ్చ యమళౌ కుర్వంతి పక్షేస్వకే. 11

టీ. ఓజర్క్షే= బేసిరాసులయందు, పురుషాంశకేషు = విషమరాశినవాంశములయందు, బలిభిః = బలయుక్తులయిన, లగ్నార్క గుర్విందుభిః = లగ్నరవిగురు చంద్రులచేతను, పుంజన్మ = పురుషజననమును, ప్రవదేత్ = చెప్పవలెను, యుగ్మేషు = సమరాసులయందు, సమాంశకగతైః = సమరాశి నవాంశలందున్న, బలిభిః = బలయుక్తులైన, తైః = ఆలగ్నార్క గురు చంద్రులచేత, యోషితః = స్త్రీజననము జెప్పవలెను, గుర్వర్కౌ = బలవంతులగు గురు సూర్యులు, విషమే = బేసిరాశియందు, నరం = పురుషునిజనింపఁ జేయుదురు, శశిసితౌ = చంద్రశుక్రులును, వక్రశ్చ = కుజుఁడును, యుగ్మే = సమరాశియందు, స్త్రియం = స్త్రీనిజనింపఁజేయుదురు, ద్వ్యంగస్థాః = ద్విస్వభావరాసులయందున్నవై, బుధవీక్షణాత్ = బుధదృష్టివలన, స్వకేపక్షే=తనపక్షమందు యమళౌ = అవుడలను, కుర్వంతి = చేయుచున్నారు.

తా. బేశిరాసులగు మేషమిధున, సింహ, తులా, ధనుఃకుంభములయందు, విషమరాశి నవాంశలయందు బలీయులగు లగ్న రవి, గురు, చంద్రులచేత పురుషజననమును జెప్పదగును, సమరాసులగు, వృషభ, కర్కాటక, కన్యా,వృశ్చిక, మకర, మీనములయందు, సమరాశి నవాంశలయందు బలాధికులగు, లగ్న,రవి, గురు,చంద్రులచేత, స్త్రీజననమును జెప్పదగును, పైనజెప్పబడినలగ్న, గురు, చంద్రులు, పైరెండురీతులగాక, విషమరాసులయందు కొన్ని, సమరాసుల యందు కొన్నియుండు నెడల, ఏరాసులయందు అధికముగా గ్రహములుండునో, అందుగ్రహబలాధిక్యత ననుసరించి, పుంస్త్రీజననముల నిర్ధారణజేయదగును, మఱియు, బేసిరాసులలో, ఏనవాంశయందుగాని, గురుసూర్యులు బలయుతులైయుండు నెడల, పురుషజననమును గలిగించుదురు. సమరాసులయం దేనవాంశయందైనను, చంద్రశుక్రాంగారకులు, బలీయులైయుండు నెడల స్త్రీనిజనింపజేయుదురు. సమరాసులగు, మిధున, కన్యా, ధను, మీనంబులు, నాల్గింటియందు, మిధునధనుస్సులు పురుషస్వభావరాసులుగను, కన్యామీనంబులు స్త్రీస్వభావరాసులుగనుండుటవలన, పురుష స్వభావరాసులగు మిధునధనుస్సులయం దుదయించు నవాంశలయందుండు,

గురు, సూర్యులు, బుధునిచే జూడబడుచుండిరేని, పురుషశిశువులు, అవుడలు, (జతగ) బుట్టుదురు, స్త్రీస్వభావరాసులగు, కన్యా మీనములం దుదయించు నవాంశలయందు, చంద్రశుక్రాంగారకులు, బుధవీక్షణము గలిగియుండిన యెడ స్త్రీశిశువు, లవుడలుగ జనింతురని దెలియదగినది, ఇచ్చట ద్విస్వభావరాసులు మాత్రము పేర్కొనబడియున్నదిగాని, నవాంశ నిర్ణయము లేదు, అయినను వరాహమిహిరాచార్యులే తన లఘుజాతకమునందు బలినౌవిషమేర్క్ష గురూనరం స్త్రీయం, సమగృహేందుజేందుసితాః (?), యమళౌ ద్విశరీరాంశేష్విందుజ దృష్టాస్స్వపక్షసమమ్'' అనిచెప్పియుండుటవలన, ద్విస్వభావరాశి నవాంశలనియే యెఱుంగవలయును. **11**

శ్లో. విహాయలగ్నం విషమర్క్షసంస్థ స్సౌరోపిపుం జన్మకరోవిలగ్నాత్
ప్రోక్తగ్రహాణామవలోక్యవీర్యం వాచ్యః ప్రసూతౌ పురుషాంగనావా.

టీ. సౌరః=శనైశ్చరుఁడు, లగ్నం=నిషేకలగ్నముగాని ప్రశ్నలగ్నముగాని, విహాయ=విడిచి, విషమర్క్షసంస్థః=బెక్కైనవిషమస్థానములయందు, పుంజన్మకరః=పురుషజననమును జేయువాఁడగును. ప్రోక్తగ్రహాణాం = ఈచెప్పఁబడిన గ్రహములయొక్క, వీర్యం = బలమును, అవలోక్య = విచారించి, ప్రసూతౌ = ప్రసవమందు, పురుషః = పురుషుఁడుగాని, అంగనావా = స్త్రీగాని, వాచ్యః = (పుట్టునని) చెప్పఁదగినది.

తా. పూర్వము జెప్పబడిన యోగములు లేనప్పుడు శనైశ్చరుఁడు ఆధానలగ్నముగాని ప్రశ్న లగ్నముగాని విడిచి తక్కిన విషమస్థానములగు తృతీయ, పంచమ, సప్త, నవ, మైకాదశములయందనగా. 3, 5, 7, 9, 11, యిండ్లయందుండిన యెడల పురుషజననమును గలిగించునని యెఱుంగవలయును. ఈయోగములన్నిటిని గలుగజేయు గ్రహములస్థితియు బలాధిక్యమును చక్కగవిచారించి తదనుగుణ్యముగ ప్రసవకాలమున గలుగబోవు పుం, స్త్రీ జనన వివరమును దెలుపదగినది. ఒకవేళ, పురుషజననయోగమును స్త్రీ జనన యోగమును ద్వంద్వముగా గానబడునెడల, ఏయోగమున బలాధిక్యములగు గ్రహములున్నవో ఆయోగము ననుసరించి జనన స్వరూపమును జెప్పదగినది. **12**

## నపుంసక జనన యోగములు.

శ్లో. అన్యోన్యం యదిపశ్యతశ్శశిరవీ యద్వార్కిసౌమ్యావపి
వక్రోవాసమగందినేశ మసమే చంద్రోదయాచ్చేత్ సితౌ
యుగ్మౌజర్క్షగతావపీందు శశిజౌ భూమ్యాత్మజేనేక్షితౌ
పుంభాగే సితలగ్నశీతకిరణా షట్క్లీబయోగాః స్మృతాః. **13**

టీ. శశిరవీ=చంద్రసూర్యులు,యుగ్మౌజర్క్షగతౌ=సమవిషమరాసులయందున్న వారలై, అన్యోన్యం=ఒకరినొకరు, పశ్యతోయది=చూచుచుండిరేనియు, అర్కిసౌమ్యౌ=శనిబుధులు, క్రమముగసమవిషమములందుండి యొకరినొకరు వీక్షించుచుండినను, వక్రః=కుజుఁడు విషమరాశిగతుఁడై, సమగం=సమరాశిగతుఁడైన, దినేశం=రవినిజూచుచుండినను, చంద్రోదయా=చంద్ర

లగ్నములు, అసమే = విషమరాశియందు, సంస్థితౌ = ఉన్నవై, భూమ్యాత్మజేన = కుజుని చేత, ఈక్షితౌయది = చూడఁబడెనేనియు, ఇందుశశిజౌ = చంద్రబుధులు, యుగ్మౌజర్క్ష గతౌ = చంద్రుఁడు సమరాశియందును బుధుఁడు విషమరాశియందు నున్నవారలై, భూమ్యాత్మజేన = కుజునిచేత, ఈక్షితౌ = చూడఁబడిరేనియు సితలగ్నశీతకిరణాః = శుక్రలగ్నచంద్రులు, పుంభాగే = పురుషనవాంశయందుండిరేనియు, షట్ = ఈఆరుయోగములును, క్లీబయోగాః = నపుంసకజననయోగములని, స్మృతాః = చెప్పఁబడినవి.

తా. (1) చంద్రుఁడు సమరాశియందును సూర్యుఁడు విషమరాశియందును నుండి యొకరినొకరు చూచుచుండునెడల నొకనపుంసక జన్మయోగము.

(2) శనైశ్చరుఁడు, సమరాశియందును, బుధుఁడువిషమరాశియందును నుండి యొకరినొకరుచూచుచుండిరేని యొకనపుంసక జననయోగము.

(3) అంగారకుఁడు విషమరాశిగతుఁడై. సమరాశియందుండు సూర్యునిజూచుచుండినను సూర్యుఁడు అంగారకుని జూచుచుండినను ఒకనపుంసక జననయోగము.

(4) జననలగ్నము, చంద్రలగ్నము ఈరెండును విషమరాసులై యుండి, సమరాశిగతుడైన అంగారకునిచే జూడబడినచో నొక నపుంసకజన్మయోగము.

(5) సమరాశిస్థిత చంద్రుండును విషమరాశిస్థిత బుధుండును అంగారకవీక్షణ్యము గలిగి యుండిన ఒకనపుంసకయోగము.

(6) శుక్రలగ్నచంద్రులు యేరాశియందైనను పురుషనవాంశయందుండిరేని యొక నపుంసక జననయోగము.

ఈ యాఱుయోగములు నపుంసకజనన యోగములు ఇందులకుదాహరణముగ, "అన్యోన్యం రవిశశినౌ విషమర్క్ష సమర్క్షగౌ నిరీక్షేతే, ఇందుశనిపుత్రౌవా శిఖైన గర్భం నపుంసకంకురుతః. వక్రోవిషమే సూర్య స్సమః స్త్వేనంపరాస్పరాలోకాత్, విషమర్క్షే లగ్నేందూసమరాశిగః కుజోవలోకయతి. బుధచంద్రౌకుజదృష్టౌవిషమర్క్ష సమర్క్షగౌతథైవోక్తాః ఓజనవాంశక సంస్థాలగ్నేం దుసితా స్తథైవోక్తాః" అని బాదరాయణులు వచించియున్నారు జననకాలాదిచక్రములయందు స్త్రీ పురుషజననయోగములు కనంబడని యెడల ఈక్లీబయోగముల నారింటిని యోచింపవలయును. ఇదిగాక స్త్రీ పురుషజనన యోగములును, నపుంసక జననయోగములును యున్నయెడల, నపుంసక జననయోగములకన్న, స్త్రీపురుష జనన యోగములే బలాధికములుగాన క్లీబయోగముల నిర్ణయింపదగదు.

## స్త్రీపురుషద్వయమును గలుగజేసెడి యోగములు.

శ్లో. యుగ్మేచంద్రసితౌ తథౌజ భవనేస్యుర్జ్ఞార జీవోదయా
లగ్నేందూనృ నిరీక్షితౌచ సమగౌ యుగ్మేషువాప్రాణినః,
కుర్యుస్తే మిథునం గ్రహోదయగతా ద్వ్యంగాంశకాః పశ్యతి
స్వాంశేజ్ఞే త్రితయంజ్ఞ గాంశక వశాద్యుగ్మంత్వమిశ్రైస్సమమ్. 14

టీ. చంద్రసితౌ = చంద్రశుక్రులు, యుగ్మే = సమరాశియందును, తథా = ఆప్రకారమే, జ్ఞారజీవోదయాః = బుధకుజగురులగ్నములు, ఓజభవనే = విషమరాశియందును, స్యుః = ఉండిరేని, మిథునం = ఒక ఆడశిశువును ఒకమగశిశువును అవుడలుగా, కుర్యుః = జనింపఁజేయుదురు, లగ్నేందూ = లగ్నచంద్రులు, సమగౌసమరాశియందున్నవారలై, నృనిరీక్షితౌ = పురుషగ్రహములచేతచూడఁబడినవారలై, స్త్రీపురుషద్వంద్వమును జనింపఁజేయుదురు. వా = వికల్పంబున, తఏవ = అబుధకుజగురులగ్నములే, యుగ్మేషు = సమరాసులయందు, ప్రాణినః = బలవంతులయియుండిరేని, మిథునం = స్త్రీపురుషద్వయమును, కుర్యుః = జనింపజేయుదురు. గ్రహోదయగతాః — గ్రహా = సకలగ్రహములును, ఉదయ = లగ్నమును, గతాః = పొందిన, ద్వ్యంగాంశకాః = ద్విస్వభావరాశి నవాంశలను, అనఁగాద్విస్వభావరాశి నవాంశలయందున్న గ్రహములను లగ్నములను, స్వాంశే = స్వనవాంశయందున్న, జ్ఞే = బుధుఁడు, పశ్యతిసతి = చూచుచుండఁగా, త్రితయం = మూఁడుశిశువులుపుట్టును, యుగ్మం = రెండుశిశువులు, జ్ఞగాంశకవశాత్ = బుధుఁడున్ననవాంశనుబట్టి, స్త్రీలనిగాని పురుషులనిగాని జెప్పవలయును, అమిశ్రైస్సమం - గ్రహంలగ్నములును బుధుఁడును ద్విస్వభావ, స్త్రీ, పురుష, రాసులనుగాని తన్నవాంశలనుగాని, పొందియుండక అందరును సమానరాశి నవాంశలయందుండిరేని, మూఁడు శిశువులు సమచిహ్నముగా జనింతురు. యిట్లని చెప్పఁబడియున్నది.

తా. (1) చంద్రశుక్రులు సమరాశియందును,కుజ బుధ గురులగ్నములు విషమరాశియందునుగూడియుండిన, ఒకమగబిడ్డయు, నొకయాఁడుబిడ్డయు గలుగునట్టియోగము.

(2) సమరాశిస్థితలగ్నచంద్రులు, పురుషగ్రహములచే జూడబడుచుండునెడ, స్త్రీపురుషద్వంద్వ జననయోగము.

(3) బుధాంగారక లగ్నగురువులు సమరాసులయందు బలవంతులగునెడల, అవుడలగు స్త్రీపురుష శిశువుల జననయోగము.

ఈ మూఁడుయోగములుగాక మువ్వురుబిడ్డలు అవుడలుగఁబుట్టుయోగములు:— ద్విస్వభావ రాశి నవాంశలయందున్న గ్రహములను లగ్నమును స్వనవాంశయందుండు బుధుఁడు చూచిన పక్షమున ముప్పురుబిడ్డలు అవుడలుగాబుట్టుదురు. ఇందు నాల్గువిధములగు భేదములను గమనించి స్త్రీ పురుష శిశువుల సంఖ్య నెఱుంగవలయును.

(1) పురుషస్వభావరాశియు, స్వనవాంశయునగు మిథుననవాంశయందున్న బుధుఁడు, ద్విస్స్వభావరాశి నవాంశలయందుండు గ్రహములను లగ్నమునుజూచిన నిద్దరుపురుషశిశువులు, ఒక ఆడశిశువును జనించుదురు.

(2) మిథున నవాంశయందున్నబుధుఁడు బురుషస్వభావరాసులగు మిథున, ధనుర్నవాంశలయందున్న గ్రహాలగ్నముల వీక్షించెనేని మూవురును పురుషశిశువులై జనన మొందుదురు.

(3) స్త్రీస్వభావరాశియు, స్వనవాంశయునగు కన్యానవాంశయందున్న బుధుఁడు ద్విస్స్వభావరాశినవాంశలయందుండు గ్రహాలగ్నముల జూచుచుండునెడల, నిద్దరు కన్యకలును ఒకపురుషుడును, బుట్టుదురు.

(4) ఆకన్యానవాంశయందున్న బుధుఁడే స్త్రీస్వభావరాసులగు కన్యామీనవాంశల యందుండు గ్రహలగ్నములను జూచుచుండునెడ మూవురును స్త్రీశిశువులై యపడలుగా జనింతురు.

ఈ విషయమునకు సారావళియందు, "సమరాశౌశశిసితయో ర్విషమేగురు వక్రసౌమ్యలగ్నేషు యోగేస్మిక్ గర్భగతం నూనంమిధునంతువిజ్ఞేయం, లగ్నేందూవా సమగౌపుంగ్రహదృష్టౌచమిధునజన్మకరౌ, ఉదయజ్ఞవక్రగురవో బలినస్సమరాశి గాస్తథైవోక్తాః ద్వికశరీరాంశకయుక్తాక్ గ్రహాక్ విలగ్నంచ పశ్యతీందుసుతం, కన్యాంశేద్వేకన్యే పురుషశ్చనిషిచ్యతేగర్భే, మిధునాంశేకన్యేకాద్వౌ పురుషౌత్రితయమేవస్యాత్, మిధునధనరంశకగతాక్ గ్రహాక్ విలగ్నంచపశ్యతీందుసుతః, మిధునాంశస్థశ్చయధా పురుషంత్రితయంతదాగర్భే, కన్యామీనాంశస్థాక్ విహగానుదయం యువతిభాగగతః, పశ్యతిశీతగుతనయః కన్యాత్రితయంతదాగర్భే" అనియున్నది.

## అనేక పిండములను గలుగజేయు యోగము.

శ్లో. ధనుర్ధర స్యాంత్యగతే విలగ్నే గ్రహైస్తదంశోపగతైర్బలిష్ఠైః
జ్ఞేనార్కిణావీర్యయుతేన దృష్టే సంతి ప్రభూతా అపికోశసంస్థాః. 15

టీ. ధనుర్ధరస్య=ధనూరాశియొక్క, అంత్యగతే=అంత్యనవాంశము, విలగ్నే=లగ్నమగుచుండఁగాను, తదంశోపగతైః=ధనుర్నవాంశయందున్న, బలిష్ఠైః = బలవంతులైన, గ్రహైః=గ్రహములచేతను, వీర్యయుతేన = బలవంతుడైన, జ్ఞేన = బుధునిచేతను, అర్కిణా = శనిచేతను, దృష్టే = లగ్నముచూడఁబడు చుండెనేని, ప్రభూతాః = అనేకములైన, కోశసంస్థాః = జరాయువేష్టితశరీరములు, గర్భగతములై యున్నవని తెలసికొనవచ్చును.

తా. ధనురాశియొక్కయంత్య నవాంశము లగ్నమయి ఆధనుర్నవాంశల యందెందైననుండు బలీయులగు గ్రహములచేతను, బలవంతులగు బుధశనులచేతను లగ్నముచూడబడినచో అనేకములగు జరాయువేష్టిత శరీరములు గర్భగతములయి యున్నవవి తెలియదగినది. 15

## గర్భమాస స్వభావ మాసాధిపతులు.

శ్లో. కలిల ఘనాంకురాస్థి చర్మాంగజ చేతనతాః
సితకుజ సూర్య చంద్రార్కి బుధాః పరతేరి
ఉదయప చంద్ర సూర్య నాధాః క్రమశో గదితా
భవతి శుభాశుభంచ మాసాధిపతే స్సదృశమ్. 16

వ. రా:—పై శ్లోకమునకు టీకాతాత్పర్యము యీదిగువ కనపరచిన పట్టికవలన తెలియును.

| గర్భ మాసములు. | మాసములయందు గలుగుస్వభావములు. | మాసముల అధిపతులు. |
|---|---|---|
| 1 | శుక్లశోణిత సంయోగమున బుద్బుదాకారమగును. | శుక్రుఁడు. |
| 2 | కఠినమగు మాంసమయమగును. | అంగారకుఁడు. |
| 3 | అవయ వాంకురములగును. | బృహస్పతి. |
| 4 | ఎముకలు గలుగును. | సూర్యుఁడు. |
| 5 | చర్మము గలుగును. | చంద్రుఁడు. |
| 6 | రోమములు మొలచును అంగములు బాగుగ నేర్పడును. | శనైశ్చరుఁడు |
| 7 | జ్ఞానేంద్రియములు గలుగును. | బుధుఁడు. |
| 8 | గర్భమునందుండు జీవుడు తల్లిభుజించిన యన్నాదులచే దృప్తినొందును. | గర్భాధాన లగ్నాధిపతి. |
| 9 | ప్రసవోద్వేగము గలుగును. | చంద్రుఁడు. |
| 10 | ప్రసూతియగును. | సూర్యుఁడు. |

లఘుజాతకమునందు — "అశనోద్వేగ ప్రసవాః పరతో లగ్నేశ చంద్రసూర్యాణామ్" అని యున్నది మాసములయందు గలుగుస్వభావములను మాసాధిపతులను క్రమాలంకారముగ యుక్తమగు శ్లోకరూపమున వచించియుండుటచే సులభముగ జూచుకొనదగును. అయినను యీశ్లోకమున తృతీయమాసమునకు అధిపతిగురుఁడని చెప్పబడియుండలేదు. ఈశ్లోకమునకుదాహరణముగనుండు యీ క్రింది హోరాసారమునందు చెప్పబడియుండు శ్లోకములలోగల తృతీయమాసాధిపతినే యిచ్చటనూహింపదగినది "కలిలం ప్రథమే మాసి తన్మాసాధిపతిర్భృగుః ద్వితీయమాసపో భౌమః, గర్భపింగాక్ష బీజవత్, గర్భాంకురం తృతీయే స్యాత్ తన్మాసాధిపతిర్గురుః, చతుర్థే భాస్కరోధిపః పంచమేమాసి సోమేశే త్వక్తేద్రోరక్తసంభవః, సర్వాంగసంధివష్షే తన్మాసాధిపతిశ్శనిః జ్ఞానేంద్రియయుతః పశ్చాత్సప్తమే బుధ ఈశ్వరః, భవనేశోష్టమేమాసి తుష్ట్యప్లాసంభ్రమోభవేత్ ఉద్వేగీగర్భసంస్థంశ్శ సేశోనవమే శశీ ప్రసూతిర్దశమే మాసి మాసేశో భాస్కరస్మృతః"। ఇదియుగాక లఘుజాతకమునందు "కలిలఘనాం కురాస్థిత్వగ్రోమ స్మృతి సముద్భవా క్రమశః, మాసేషు శుక్రకుజజీవసూర్యచంద్రార్కి సౌమ్యానాం అశనోద్వేగ ప్రసవాః పరతో లగ్నేశ చంద్రసూర్యాణాం" అనియుదాహరణమున్నది యవనేశ్వరుఁడు మాత్రము "కుజాస్ఫుజిజ్జీవ రవీందు సౌర శశాంక లగ్నేందు దివాకరాణాం" అనివచించియుండుటవలన ప్రథమమాసాధిపతి అంగారకుడనియు ద్వితీయమాసమునకధిపతి శుక్రుండనియు నేర్పడుటచే వరాహమిహిరాచార్యుల యభిప్రాయమునకు ఇది వ్యతిరిక్తముగనున్నది గర్భాధానకాలమున నేగ్రహము ఉల్కాదులచేత బీడింపబడునో యాగ్రహమాసమున గర్భపతనమగును ఆమాసాధిపతులు నిర్దోషులై యుండునెడల గర్భమునకు బుష్టి గలుగును ఇందులకు "కలుషైః పీడాపతనం నిపీడితై ర్నిర్మలైః పుష్టిః" అని లఘుజాతకమున జెప్పబడియున్నది.

### అథికాంగ మూకాద్యుత్పత్తి యోగములు.

శ్లో. త్రికోణగే జ్ఞే విబలైస్తథా పరై ర్ముఖాంఘ్రిహస్తైర్ద్విగుణస్తదా భవేత్
అవాగ్గవీందా వశుభైర్భ సంధిగై శ్శుభేక్షితశ్చే త్కురుతే గిరంచిరాత్.

టీ. జ్ఞే=బుధుఁడు, త్రికోణగే=లగ్నమునకు నవమ పంచమములయందుండఁగా, తతః=ఆబుధునికంటె, విబలైః=బలహీనులైన, అపరైః=తక్కిన గ్రహములచేత గర్భస్థుఁడు, ముఖాంఘ్రిహస్తైః=ముఖపాదహస్తులచేత, ద్విగుణః=ఇబ్బడియైనవాఁడును ఏకోదరుండును, భవేత్=అగును, గవి=వృషభమందు, ఇందౌ=చంద్రుఁడుండఁగా, భసంధిగైః=కర్కాటక వృశ్చిక మీనములయొక్క అంత్యనవాంశలయందున్న, అశుభైః=పాపగ్రహములచేతను, అవాక్=గర్భస్థుఁడు మూగవాఁడగును. శుభేక్షితశ్చేత్=చంద్రుఁడు శుభగ్రహములచేత చూడఁబడెనేని, చిరాత్=బహుకాలమునకు, గిరం=వాక్కును, కురుతే=చేయుచున్నాఁడు.

తా. లగ్నమునకు త్రికోణస్థానములగు నవమ పంచమ స్థానములయందు బుధుడుండి తక్కిన గ్రహములన్నియు బుధునికంటె బలహీనములై యుండునెడల గర్భస్థుఁడు ద్విగుణిత ముఖ పాద హస్తుండును, ఏకోదరుండును అగునని యెఱుంగదగినది. ఇందులకు గార్గివచనము:—"బలహీనై గ్రహైస్సర్వై ర్నవపంచమగే బుధే, ద్విగుణాంఘ్రి శిరోహస్తో భవత్యేకోదరస్తథా." మఱియు, వృషభమున చంద్రుడుండి పాపగ్రహములు, కటక, వృశ్చిక, మీనరాసుల అంత్య నవాంశలందుండిన యెడల గర్భస్థుడు మూగవాఁడగును. ఆచంద్రుఁడు శుభగ్రహవీక్షితుండగు నెడల కొంతకాలమునకు మాటలువచ్చును. బలాధికులగు పాపగ్రహ దృష్టుఁడగు నెడల గర్భస్థుడు మూగవాఁడనుటకు సందేహములేదు. శుభాశుభగ్రహ దృష్టియగు నెడల శుభగ్రహదృష్టి ననుసరించియే ఫలితమును జెప్పవలయును. ఇందులకు:—"శ్లో. కుళీ రాళి ఝషాంశస్థై పాపైశ్చంద్రే వృషోపగే, మూకఃపాపేక్షితేసౌమ్యై శ్చిరేణ లభతేగిరం, మిశ్రదృష్టై ర్యథాధిక్యం, ఫలంబోధ్య మనీషిణా." అని గార్గి చెప్పియున్నారు. 17

### శిశువులు దంతసహితముగ జన్మించు యోగము.

శ్లో. సౌమ్యర్క్షాంశే రవిజ రుధిరౌ చేత్సదంతో౽త్ర జాతః
కుబ్జస్స్వర్క్షే శశిని తనుగే మందమాహేయ దృష్టే
పంగుర్మీనే యమ శశికుజై ర్వీక్షితే లగ్నసంస్థే
సంధౌ పాపే శశినిచ జడస్స్యాన్న చేత్సౌమ్య దృష్టాః. 18

టీ. రవిజరుధిరౌ=శనికుజులు, సౌమ్యర్క్షాంశేచేత్=బుధరాసులైన నవాంశలయందుగాని యీరాసులయందుగాని యుండిరేని, అత్ర=ఈయోగమందు, జాతః=పుట్టినవాఁడు, సదంతః=దంతములతోఁ గూడినవాఁడగును. శశిని=చంద్రుఁడు, స్వర్క్షే=స్వక్షేత్రమైన కర్కాటకమునందుండి, తనుగే=ఆకర్కాటక మేలగ్నమై అందున్న చంద్రుఁడు, మందమాహేయదృష్టే=శనికుజులచేత చూడఁబడెనేని, కుబ్జః=కుబ్జుఁడగును, మీనే=మీనములగ్నమై, యమశశికుజైః=

శనిచంద్ర కుజులచేతను, వీక్షితే=చూడఁబడుచుండినను, లగ్నసంస్థైః=ఆశని శశికుజులు లగ్నగతులై యుండినను, పంగుః=(గర్భస్థుడు) కుంటివాఁడగును, పాపే=పాపగ్రహంబును, శశిని = చంద్రుఁడును, సంధౌ=భసంధులయిన కర్కాటక వృశ్చిక మీనాంత్య నవాంశలయం దుండిరేని, జడః=జడుండగును, నచేత్ సౌమ్యదృష్టాః=ఈ యోగములను గలుగఁజేయు గ్రహంబులు శుభగ్రహములచేత చూడఁబడకుండెనేని ఈఫలములు సంపూర్ణముగా నగుననియు.

తా. అంగారకుఁడును, శనియు ఏరాశియందైనను బుధనవాంశలగు మిధున కన్యా నవాంశలయందుగాని, బుధక్షేత్రములగు మిధున కన్యా రాసులయందైన నుండినచో గర్భస్థుడు దంతములుగలిగి పుట్టుననుట నెఱుంగదగినది. బలీయులగు శుభగ్రహముల వీక్షణగలిగినపై యోగమునకు భంగమగును. 18

## శిశువులు కుబ్జరూపులుగ జనించు యోగము.

చంద్రుఁడు స్వక్షేత్రమును, తత్కాలలగ్నము నగు కర్కాటక లగ్నమునందుండి శని, అంగారకులచే జూడబడినచో పొట్టివగు చేతులు, కాళ్లు గల మరుగుజ్జువాడగును. శుభగ్రహదృష్టి యీ యోగమునకు భంగము గలిగించును.

## శిశువు పంగువుగా జనించు యోగము.

మీనము లగ్నమై, శనైశ్చర చంద్రాంగారక వీక్షణ గల్గియుండినను, ఆ మీనరాశియందే శని శశి కుజులుండినను గర్భస్థుఁడు కుంటివాఁడగునని జెప్పదగినది. ఆలగ్నమును శుభగ్రహములు జూచిన శుభఫలము.

## గర్భస్థ జడ జన్మ యోగము.

చంద్రుఁడు, పాపగ్రహమునుగూడి, కర్కాటక వృశ్చిక మీన రాసుల అంత్య నవాంశలయం దుండెనేని గర్భస్థుఁడు చెవిటివాఁ డగుననియు జెప్పదగినది. ఆలగ్నములు సౌమ్యగ్రహములచే జూడబడు చుండునెడల పైయోగము జరుగదని దెలియదగినది.

## హీనాంగ జనన యోగములు.

శ్లో. సౌర శశాంక దివాకర దృష్టే వామనకో మకరాంత్య విలగ్నే
ధీనవమోదయ గైశ్చదృకాణైః పాపయుతైరభు జాంఘ్రిశిరాస్స్యాత్.

టీ. మకరాంత్యవిలగ్నే=మకరరాశియొక్క అంత్యనవాంశమున లగ్నమై, సౌరశశాంక దివాకరదృష్టే=శనిచంద్రసూర్యులచేత చూడఁబడెనేని, వామనకః = (గర్భమందున్న వాఁడు) పొట్టివాఁడగును. ధీనవమోదయగైశ్చదృకాణైః=ధీద్రేక్కాణమనఁగా ద్వితియద్రేక్కాణము గర్భాదాన లగ్నమందలి ద్వితీయద్రేక్కాణము, పాపయుతైః=రవిశని వ్యతిరిక్తమైన పాప గ్రహము కుజుఁడుగనుక వానితోఁగూడినదై, సౌరశశాంకదివాకరదృష్టే = శని చంద్ర సూర్యులచేత చూఁడబడెనేని, గర్భమందుఅభుజః=భుజహీనుఁడుజనించును. తృతీయద్రేక్కాణము నవమరాశి సంబంధమైనది కాఁబట్టి నవమద్రేక్కాణమనఁగా తృతీయద్రేక్కాణ

ము, అందు కుజుఁడుండి శనిచంద్రసూర్యులచేత చూడఁబడెనేని, గర్భమందు, అనంఘ్రిః=పాదహీనుఁడు జనించును లగ్న ప్రథమద్రేక్కాణము లగ్నరాశి సంబంధమైనది కాఁబట్టి, ఆ లగ్న ప్రథమ ద్రేక్కాణమందు కుజుఁడుండి శని చంద్రసూర్యులచేత చూడఁబడెనేని గర్భమందు, అశిరాః=శిరస్సులేని కబంధుఁడు జనించును.

తా. మకరరాశ్యంత నవాంశము లగ్నమై, శని చంద్ర సూర్యులచే జూడబడుచుండిన గర్భమందున్నవాఁడు పొట్టివాఁడుగ బుట్టును. 19

మఱియు "ధీనవమోదయగైశ్చ దృకాణైః."అనియుండుటచేత "ద్రేక్కాణాః ప్రథమ పంచమ నవమానాం" అనుటనుబట్టి లగ్నమునందు ద్వితీయ ద్రేక్కాణము పంచమస్థానముగనుక, ధీద్రేక్కాణమనగా ద్వితీయద్రేక్కాణము ఈద్రేక్కాణము ఆధానలగ్నమయి, రవి శని వ్యతిరిక్తపాపగ్రహముగు. అంగారకుం డారాశియందుండి శనైశ్చర చంద్రసూర్యులచే జూడబడినచో గర్భమునుండి బుట్టువాఁడు భుజహీనుడుగ నుండునని దెలియదగుననియు నవమద్రేక్కాణమనగాఁ దృతీయద్రేక్కాణమున అంగారకుడుండి పైరీతిగ శని చంద్రసూర్యులచేఁ జూడబడినచో శిశువుపాదములులేకుండ జనించునని చెప్పదగినదనియు లగ్నద్రేక్కాణమనగా ప్రథమద్రేక్కాణమునందు అంగారకుఁడుండి శని చంద్రరవులచేఁ జూడబడినయెడల శిరోహీనుఁడు జనింపగలడనియు కొందఱు జ్యోతిష్కులు వ్యాఖ్యానము జేసియున్నారు.

కొందఱు పైజెప్పబడిన ద్వితీయ, తృతీయ, ప్రథమద్రేక్కాణములు పాపగ్రహయుక్తములై శని చంద్రార్కులచే జూడబడినను, చూడబడకుండినను పూర్వోక్తప్రకారముగ, భుజ, పాద, శిరోహీనులు జనింతురని చెప్పుచున్నారు.

ఇదిగాక, పైద్రేక్కాణములు మూడింటియందును యేద్రేక్కాణమైనను పాపగ్రహయుక్తమై శని చంద్ర రవి దృష్టమైనయెడల తద్గ్రహానుసక్రమము ననుసరించి పూర్వము చెప్పిన రీతిగ భుజ, పాద, శిరోహీనులగు శిశువులు జనింతురని జెప్పుచున్నారు.

మఱికొందఱు లగ్న పంచమ నవమరాసులు మూటియందు నుదయించు ప్రథమద్రేక్కాణములు మూడును, పాపగ్రహ సంబంధములయి యుండునెడల భుజహీనులును, పై మూడురాసుల ద్వితీయద్రేక్కాణములు మూడును క్రూరగ్రహ యుక్తములయి యుండునెడ పాదహీనులును, వాటియొక్క తృతీయద్రేక్కాణములు మూడును పాపగ్రహ యుక్తములై యుండెనేని శిరోహీనులును జనింతురని జెప్పుచున్నారు.

మఱియుకొందఱు:—ఈ క్రిందియుదాహరణ శ్లోకము ననుసరించి ఆధానలగ్నమునకు బంచమరాశియందుదయించు నేద్రేక్కాణమైనను అంగారకయుక్తమై, శని చంద్ర రవులచే జూడబడుచుండెనేని భుజహీనులు జనింతురనియు, నవమరాశియందుదయించు నేద్రేక్కాణమైనను కుజసంయుక్తమై, శనైశ్చర, చంద్ర, సూర్య దృష్టమగునెడల పాదహీనులు జనింతురనియు, లగ్నమునందే ద్రేక్కాణమైనను అంగారకయుక్తమై, శని, చంద్ర, సూర్యులచే జూడబడుచుండునెడల శిరోహీనులు జనింతురనియు జెప్పుచున్నారు

ఉదాహరణములు:—(1) "లగ్నే ద్రేక్కాణగో భౌమః సౌర సూర్యేందు వీక్షితః, కుర్యాద్వి శిరసంతద్వ త్పంచమే బాహువర్జితం, విపదం నవమస్థానే యదిసౌమ్యై ర్నవీక్షితః" అని గార్గియు.

(2) భౌమయుతో ద్రేక్కాణ త్రికోణలగ్నేషు భేషు సందృష్టః, విభుజాంఘ్రి మస్తక స్సౌమ్య ర్నచ రవి చంద్రై ర్వ్యదేగ్గర్భే అని సారావళియందును చెప్పబడియున్నవి. ఇందు పాప గ్రహ యుక్తమైనను, పాపగ్రహదృష్టమైనను ఉండునెడల పైయోగములు గల్గునేగాని శుభ గ్రహ సంబంధమైనను, శుభగ్రహ వీక్షణ గల్గినను. పై యోగములకు భంగము గలుగుటకు సందియము లేదు, గనుక యోచింపదగినది.

## —అంధాది జనన యోగములు.—

శ్లో. రవి శశి యుతే సింహేలగ్నే కుజార్కి నిరీక్షితే
నయన రహిత స్సౌమ్యా సౌమ్యైస్సబుద్బుద లోచనః ।
వ్యయ గృహగత శ్చంద్రో వామో హీన స్త్వ పరం రవి
స్త్వశుభగదితా యోగాయాప్యా భవంతి శుభేక్షితాః. 20

టీ. సింహే=సింహము, లగ్నే=(నిషేక)లగ్నమై, రవిశశియుతే=సూర్యచంద్రులతోఁ గూడి, కుజార్కినిరీక్షితే=కుజశనులచేత చూడఁబడెనేని, నయనరహితః = కన్నులులేనివాఁడు పుట్టును, సః=ఆసింహము సూర్యచంద్రులతోఁగూడి, సౌమ్యాసౌమ్యైః=శుభపాపగ్రహము లచేత చూడఁబడెనేని, సబుద్బుదలోచనః=పూవుఁ డ్లవాఁడగును, చంద్రః=చంద్రుఁడు. (ఆధాన) లగ్నమునకుగాని (జన్మలగ్నమునకుగాని,) వ్యయగృహగతః = ద్వాదశమందున్నవాఁడై, వామః=ఎడమకన్నును, హీనస్తి=చెరుచును, రవిః=సూర్యుఁడు, పరం=కుడికన్నును, హీనస్తి= చెరుచును, అశుభగదితాః=అశుభ గ్రహసంయోగవీక్షణ జనితములయిన, యోగాః= యోగములు, శుభేక్షితాః = శుభగ్రహములచేత చూడఁబడినవై, యాప్యాః = ఫలములు కాలాంతరమున కొంచెముగా గలుగును.

తా. ఆధానకాలలగ్నము సింహమై, సూర్యచంద్ర సంయుక్తమై, అంగారక శనైశ్చరులచే జూడబడినచో రెండు కన్నులు లేనివాఁడుగ బుట్టును.

ఆ సింహము సూర్యగ్రహ యుక్తమై అంగారక శనైశ్చరులచేఁ జూడఁబడునెడల కుడికన్ను లేనివాఁడగును.

ఆ సింహరాశి చంద్రయుక్తమై కుజశనుల వీక్షణగల్గి యుండినయెడల నెడమకన్ను లేనివాఁడగును.

ఆ సింహలగ్నము రవి శశి సంయుక్తమై శుభగ్రహములచేతను పాపగ్రహములచేతను జూడబడుచుండు నెడల పూగన్నులుగల వాఁడగును.

అందు రవి యొక్కఁడుండి శుభపాపగ్రహములచే జూడబడిన కుడికన్నును, చంద్రుఁ డొక్కఁడు మాత్రముండి పైరీతిగ సౌమ్య క్రూరగ్రహ వీక్షణ గల్గియుండిన ఎడమకన్నును పూగన్ను లగును.

జన్మలగ్నమునకుఁగాని ఆధాన లగ్నమునకుగాని పండ్రెండవయింట చంద్రుఁడుండిన యెడల ఎడమకన్ను చెడిపోవును. రవి యుండినచో కుడికన్ను చెడిపోవును.

ఇందులకు నవనీతారిష్టమున "వక్రశ్శనిర్వా వ్యయగోఽక్షిహంతా వామం కుజో దక్షిణమక్షి సౌరిః, వ్యయే గవీందూ యుగపత్పృథగ్వా నేత్రాపహర్తా ఉపసవ్యసవ్యే" అని ఉదాహరణము.— అశుభగ్రహ సంయోగ వీక్షణ సంభూతములగు యోగములయందు ఆ అశుభగ్రహములు శుభగ్రహములచేత జూడబడు నెడల తదనుగుణ్యమగు ఫలములు. ఉక్తకాలంబున గాక కాలాంతరంబున కొంచెముగా గలుగునని తెలియదగినవి. అనగా శుభగ్రహ వీక్షణచే పాపగ్రహ సంబంధములగు యోగములకు భంగము గలుగుననుట. 20

## ప్రసవకాలము నెఱుంగు విధము.

శ్లో॥ తత్కాల మిందు సహితో ద్విరసాంశకో య
స్తత్తుల్య రాశి సహితే పురతశ్శశాంకే
యావాను దేతి దినరాత్రి సమానభాగే
తావద్గతే దిన నిశోః ప్రవదంతి జన్మ. 21

టీ. తత్కాలే = గర్భాధాన కాలమందైనను, ప్రశ్నకాలమందైనను, యోద్విరసాంశకః = ఏద్వాదశాంశము, ఇందుసహితః = చంద్రునితోఁ గూడినది యగునో, చంద్రే = చంద్రుఁడు, తత్తుల్యరాశిసహితే = ఆ రాశికి సమానరాశిలోఁ గూడిన వాఁడగుచుండ, పురతః = ముందరగ, జన్మ = జననమును, ప్రవదంతి = చెప్పుదురు. ప్రాజ్ఞాః = అని చెప్పఁబడియున్నది. దినరాత్రిసమానభాగేః = అహోరాత్రములకు సమానమైన రాసులయొక్క త్రింశద్భాగము, యావాన్ = ఎన్నవదో, ఉదేతి = ఉదయించుచున్నదో, దిననిశోః = దివారాత్రులందు, తావద్గతే = అన్నిగడియలు పోవుచుండగా, జన్మ = ప్రసవమును, ప్రవదంతి = చెప్పుదురు.

తా. ప్రశ్నకాలమునందైనను, గర్భాధాన కాలమునందైనను, చంద్రుడు తానుండు రాశియం దెన్నవ ద్వాదశాంశయం దుండునో ఆ యంశాసంఖ్య నెరింగి మేషరాశి మొదలు యన్నవ రాశియందు చంద్రుఁ డుండు సమయమున, గర్భదశమ మాసమునందు, ప్రసవకాలమని చెప్పవలయును. ఇందులకు సారావళిలో "యస్మిన్ ద్వాదశభాగే గర్భాధానే వ్యవస్థితశ్చంద్రః తత్తుల్యగతే ప్రసవో గర్భస్య సమాదిశేత్" అని చెప్పబడియున్నది.

మఱియు కొందఱు, ప్రశ్న గర్భాధాన కాలములయందు చంద్రుఁడు తానుండు రాశియం దెన్నవ ద్వాదశాంశయం దుండునో అది మొదలు అన్నవ సంఖ్యగల పైరాశి యేదియో, ఆ రాశియందు చంద్రుఁడుండు కాలమున బ్రసవము జెప్పదగినదను చున్నారు గాన నిదియు నాలోచింపదగినది. ఇందుల కుదాహరణముగ "యావత్సంఖ్యే ద్వాదశాంశే శీతరశ్మి ర్వ్యవస్థితం తత్సంఖ్యే చ తతో రాశిగ్రస్తేందౌ తద్గతే వదేత్" అని గార్గి చెప్పియున్నాడు.

మఱియు మేష, వృషభ, మిథున, కర్కాటక, ధనుర్మకర రాసులు రాత్రి బలరాసులనియు, తక్కినవి పగలుబలరాసులనియు జెప్పబడియుండుటచే ప్రశ్నలగ్నముగాని, ఆధాన

లగ్నముగాని రాత్రి బలరాశియైనచో రాత్రి ప్రసవమగుననియు, దివా బలరాశియైన యెడ పగటికాలమున బ్రసవమగుననియు, ఆలగ్నమున గతించిన త్రింశాంశభాగముల సంఖ్య నెరింగి, ఆరాశి బలకాలమున, నన్నిఘడియలు చెల్లినవెనుక బ్రసవమనియు జెప్పదగినది.

ఇందులకు ఉదాహరణముగ— "తత్కాలే దివస నిశాసంజ్ఞే సముదేతిరాశి భాగోదయః, యావా నుదయస్స్యాం శస్తావాన్యాచ్యో దినస్యరాత్రేర్వా, ఇత్యాధానా త్ప్రథమం సూతేః కాలం సునిశ్చితం కృత్వాజాతక విహితంగ విధిం విచింతయే త్తత్రగణితజ్ఞః" అని సారావళియందు కలదు.

### గర్భము ధరించినపిదప దీర్ఘకాల ప్రసవయోగములు.

శ్లో. ఉదయతి మృదుభాంశే సప్తమస్థేచ మందే
యదిభవతి నిషేక స్సూతిరబ్దత్రయేణ
శశిని తు విధరేష ద్వాదశేబ్దే ప్రకుర్యా
న్నిగదిత మిహ చింత్యా సూతి కాలేపి యుక్త్యా. 22

టీ. మృదుభాంశే—మృదు = శనియొక్క, భాంశే = (రాశి) నవాంశము, ఉదయతి సతి = లగ్నగతమై యుండగా, మందే = శనైశ్చరుడు, సప్తమస్థే = (లగ్నమునకు) సప్తమమందుండగా, నిషేకః = గర్భాధానము, భవతియది = అయ్యెనేని, అబ్దత్రయేణ = మూడేండ్లకు, సూతిః = ప్రసవమౌను, ఏషవిధిః = ఈవిధానమే, శశిని = చంద్రునియందు (గలిగిన) ద్వాదశేబ్దే = పండ్రెండవసంవత్సరమందు ప్రసవమౌనని, విద్యాత్ = తెలియవలయును, ఇహ = ఈనిషేకాధ్యాయమందు, నిగదితం = చెప్పబడిన యోగములు, సూతికాలేపి = జన్మకాలమందును, యుక్త్యా = యుక్తిచేతను, చింత్యం = విచారింపదగినది.

తా. ఏలగ్నమునందైనను శనైశ్చరాంశలగు మకరకుంభనవాంశలలో నొకదానియందు గర్భాధానమై ఆలగ్నమునకు సప్తమస్థానమున శనియుండినయెడల మూడేండ్లకు బ్రసవమగును.

ఏలగ్నమునందైనను చంద్రాంశయగు కర్కాటక నవాంశయందు గర్భాధానమై ఆలగ్నమునకు సప్తమస్థానమున జంద్రుడుండినయెడల పండ్రెండు సంవత్సరములకు బ్రసవమగును. ఈ లగ్నములకు ఇతర శుభాశుభగ్రహయుక్తములుగాని, వీక్షణ్యములుగాని యుండినచో నీయోగమునకు భంగముకలుగును. ఈఅధ్యాయమునందు జెప్పబడిన ఫలములన్నియు జన్మకాల లగ్నము, ఆధానలగ్నము, ప్రశ్నలగ్నము, అను మూడింటిని, తదనుసరణములగు గ్రహముల బలాబలముల యోచించి ఫలముల జెప్పవలెను.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
నిషేకాధ్యాయ నామక
చతుర్థాధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### జననకాల లక్షణాధ్యాయము.—౫.

జననకాలమును చక్కఁగ కనుగొనుటచే లగ్నమును స్థిరపరచుటకును, తదంశలను గనుగొను ఫలితము లనుభవయోగ్యములుగ జెప్పుటకును వీలగును. ప్రపంచమునగల మానవులందు చాలమంది జననకాలమును గమారమిగ జేర్కొనుటచే లగ్నముభేదించుట సహజమైయున్నది. కావుననే జ్యోతిష్కులందరు ప్రథమమున లగ్నస్ఫుటముగావించుట వాడుకగ నున్నది. ఇదియుగాక జననకాలమున జాతకునితండ్రియునికియు, సూతికాగృహసంబంధములను ఎఱింగి, తదనుగుణ్యముగ రాశిచక్రమునందు గ్రహస్థితులనుబట్టి లగ్నమును నిర్ణయించవలెను. కావున హోరాశాస్త్రజ్ఞుడగు వరాహమిహిరాచార్యుడు బృహజ్జాతకమునందు జననకాల లక్షణాదుల నెరుంగువిధమును, పంచమాధ్యాయమగు నీ జన్మకాల లక్షణాధ్యాయమున జెప్పుచున్నాఁడు.

#### పితృపరోక్ష జననకాల యోగములు.

శ్లో. పితుర్జాతః పరోక్షస్య లగ్నమిందావపశ్యతి,
విదేశస్థస్య చరభే మధ్యాద్భ్రష్టే దివాకరే. 1

శ్లో. ఉదయస్థేపి వా మందే కుజే వాస్తం సమాగతే,
స్థితే వాంతః క్షపానాథే శశాంకసుతశుక్రయోః. 2

టీ. ఇందౌ = చంద్రుఁడు, లగ్నం = (ప్రసవ) లగ్నమును, అపశ్యతిసతి = చూడకుండఁగా, జాతః = పుట్టినవాఁడు, పితుఃపరోక్షస్య = తండ్రిదగ్గఱలేనపుడు పుట్టెనని చెప్పఁదగినది, దివాకరే = సూర్యుఁడు, మధ్యాత్ = దశమస్థానమునకంటె, భ్రష్టే = క్రిందనున్న, చరభే = చరరాశియందు, పితుర్విదేశస్థస్య = తండ్రిదేశాంతరమందుండఁగా, జాతః = పుట్టినవాఁడని తెలియఁదగినది. 1

టీ. మందే = శనైశ్చరుఁడు, ఉదయస్థే = లగ్నమందుండినను, అథవా = అటుగాకపోయిన. కుజే = అంగారకుఁడు. అస్తం = సప్తమరాశిని, సమాగతే = పొందియుండఁగను, క్షపానాథే =

చంద్రుండు, శశాంకసుతశుక్రయోః=బుధశుక్రులయొక్క, అంతః=మధ్యమందు, స్థితేసతి = ఉండినను జనించినవానితండ్రి పరోక్షుండుండెనని చెప్పవలయును. 2

(1) చంద్రుఁడు ప్రసవ లగ్నమును జూడకుండినచో నాజాతకుఁడు తండ్రి దగ్గర లేని కాలమున బుట్టెనని తెలియదగినది.

(2) (మధ్యమమను సంజ్ఞ దశమ స్థానమునకుండుటచే దశమస్థానమునకు క్రింద నున్న చరరాసులనగా నవమాష్టమములని తెలియదగినని.)

లగ్నమును చంద్రుఁడు చూడక ఆలగ్నమునకు నవమస్థానముగాని, అష్టమస్థానముగాని చరరాశియైయుండి అందు సూర్యుండుండినచో తండ్రి విదేశగతుఁడై యుండుకాలమున జాతకునిజననమని తెలియదగినది.

(3) జననలగ్నమును చంద్రుఁడుచూడక, ఆలగ్నమునకు నవమస్థానముగాని, అష్టమస్థానముగాని స్థిరరాశియై అందు సూర్యుండుండినచో జాతకునితండ్రి, స్వదేశమునందే స్థలాంతరుఁడై యున్నపుడు జననమని తెలియందగును.

(4) లగ్నమును చంద్రుఁడుచూడక, ఆలగ్నమునకు, తొమ్మిదవరాశిగాని, ఎనిమిదవ రాశిగాని ద్విస్వభావరాశియైయుండు సూర్యుఁడుండిన జాతకునితండ్రి, పరదేశముల మధ్యమార్గమున నుండుకాలమున జననమును నిశ్చయింపఁదగును.

(5) లగ్నమున శనైశ్చరుండుండినచో జాతకునితండ్రి దగ్గఱలేనికాలమున జననము చెప్పవలెను.

(6) అంగారకుండు లగ్నమునకు సప్తమస్థానమునం దుండునెడల జాతకునితండ్రి పరోక్షమున నుండఁగా జననమును చెప్పఁదగినది.

(7) బుధశుక్రుల నడుమ చంద్రుఁడుండఁగా బుట్టిన వానితండ్రి దగ్గఱలేనికాలమున జననమును జెప్పఁదగును. (చంద్రునకు పండ్రెండవయింట బుధశుక్రులలో నొక్కఁడును, రెండవయింట నొక్కఁడునుండినను, ఒకరాశియందే రాశ్యాద్యంతములయందు బుధశుక్రులుండి యారాశిమధ్యమున చంద్రుఁడుండినను, చంద్రుఁడు బుధశుక్రమధ్యస్థుఁడగును). పై యోగములలో 5-6-7- యోగములయందును చంద్రుఁడు లగ్నమును జూడక యుండవలయును.

ఇందులకుదాహరణము:— "హోరామవీక్షమాణేపి తరిపరోక్షస్థితే శశినిజాతః, మేషూరణచ్యుతేవాచ తేరభేభౌ నావిదేశగతః." అని సారావళియందును. "చంద్రోలగ్నమపశ్యతిమధ్యేవా, సౌమ్యశుక్రయోశ్చంద్రో, జన్మపరోక్షస్య పితుర్యమోదయేవా కుజేచాస్తే" అని లఘుజాతకమునందును ఉన్నది.

## సర్పజననయోగము.

శ్లో. శశాంకే పాపలగ్నేవా వృశ్చికేశత్రిభాగగే
శుభైస్స్వాయస్థితైర్జాత స్సర్పస్తద్వేష్టితోపివా॥ 3

టీ. శశాంకే = చంద్రుడు, వృశ్చికేశత్రిభాగగే = కుజుని ద్రేక్కాణమందుండగా, స్వాయస్థితైః = ద్వితీయైకాదశములయందుండు, శుభైః = శుభగ్రహములచేత, సర్పః = సర్పము పుట్టును. పాపలగ్నే = పాపగ్రహ లగ్నమందు, వృశ్చికేశత్రిభాగగే = కుజ ద్రేక్కాణమగుచుండగా, జనించిన శిశువు సర్పముచేత చుట్టబడినదై యుండును.

తా. అంగారకుని ద్రేక్కాణములగు (1) మేష ప్రథమ ద్రేక్కాణము (2) కర్కాటక ద్వితీయ ద్రేక్కాణము, (3) సింహ తృతీయద్రేక్కాణము, (4) వృశ్చిక ప్రథమద్రేక్కాణము, (5) ధనుర్ద్వితీయ ద్రేక్కాణము, (6) మీన తృతీయ ద్రేక్కాణము, అను వారింటిలో నొక ద్రేక్కాణమునందు చంద్రుడుండి లగ్నమునకు, 2-11 ఇండ్లయందు శుభగ్రహములుండెనేని సర్పము పుట్టును. 3

సర్పవేష్టిత జంతుజనన యోగములు:— పాపగ్రహ లగ్నములును అంగారక ద్రేక్కాణములునగు, (1) మేష ప్రథమద్రేక్కాణము, (2) చంద్రుడు క్షీణత్వమును బొందియుండునపుడు కర్కాటక ద్వితీయ ద్రేక్కాణము, (3) సింహ తృతీయద్రేక్కాణము, (4) వృశ్చిక ప్రథమద్రేక్కాణము, అను నాల్గింటియందు నొక ద్రేక్కాణము లగ్నగతమై, ఆలగ్నమునకు ద్వితీయైకాదశములయందు శుభగ్రహములుండగా జనించిన శిశువు సర్పముచేత జుట్టబడినదై యుండును. ఇందులకు గార్గివచనము:— "భౌమద్రేక్కాణ భాగేచ సౌమ్యరాయాదవస్థితైః, సర్పస్తద్వేష్టితస్తద్వ త్పాపలగ్నే వినిర్దిశేత్."

## ఏకకోశ వేష్టిత జంతుద్వయ జననయోగము.

శ్లో. చతుష్పదగతేభానౌ శేషైర్వీర్య సమన్వితైః
ద్వితనుస్థైశ్చ యమళౌ భవతః కోశ వేష్టితౌ. 4

టీ. భానౌ = సూర్యుడు, చతుష్పదగతే = చతుష్పదరాసులందుండగా, శేషైః = తక్కిన గ్రహములు, వీర్యసమన్వితైః = బలవంతులై, ద్వితనుస్థైః = ద్విస్వభావరాసుల యందుండెనేని, కోశవేష్టితౌ = ఏకజరాయు వేష్టితములైన, యమళౌ = రెండుజంతువులు, భవతః = పుట్టుచున్నవి.

తా. చతుష్పదరాసులగు మేష, సింహ, వృషభ, ధనురపరార్థ మకర పూర్వార్థములలో నొకదానియందు సూర్యుండుండి తక్కినగ్రహములు బలయుతులై ద్విస్వభావరాసులయందుండిరేని ఒకకోశముచేత జుట్టబడిన జంతుద్వయ జననమును జెప్పదగినది. 4

## నాళవేష్టిత జననయోగము.

శ్లో. ఛాగసింహ వృషే లగ్నే తత్స్థే సౌరేథవా కుజే
రాశ్యంశ సదృశే గాత్రే జాయతే నాళవేష్టితః. 5

టీ. ఛాగసింహవృషే= మేష సింహ వృషభములలో నొకరాశి, లగ్నే= (జన్మ) లగ్నమగుచుండగా, సౌరే=శనియైనను, కుజేవా=అంగారకుడైనను, తత్స్థే= ఆలగ్నమందుండెనేని,

రాశ్యంశసదృశే = రాశిలగ్నమందు, అంశే = ఆరాశికి, సదృశే = సమానమైన, గాత్రే = అవయవమందు, నాళవేష్టితః = నాభినాళముచేత చుట్టఁబడినదై, జాయతే = పుట్టుచున్నది.

తా. మేష, సింహ, వృషభములను రాసులలో నొక్కటి లగ్నమై అందు శనైశ్చరుండుగాని అంగారకుండుగాని యుండగా జనించిన శిశువుయొక్క జననకాల నవాంశ సంబంధమైన రాశి "కాలాంగానివరాంగ" మనెడు శ్లోకోక్తప్రకారము కాలపురుషుని యే యంగముగా నేర్పడుచున్నదో ఆ యవయవమునందు నాభినాళము చుట్టఁబడియుండునని తెలియదగినది. ఇందుల కుదాహరణముగ:— "సింహాజగోభిరుదయే సూతౌ నాళేన వేష్టితౌ జంతుః, లగ్నే కుజే థ సౌరీ రాశ్యంశ సమానగాత్రేషు." అని సారావళియందున్నది. 5

## జారజ యోగములు.

శ్లో. నలగ్నమిందుంచ గురుర్నిరీక్షతే నవాశశాంకం రవిణాసమాగతమ్
సపాపకోర్కేణయుతోథవాశశీ పరేణజాతం ప్రవదంతినిశ్చయాత్. 6

టీ. గురుః = బృహస్పతి, లగ్నం = జన్మలగ్నమునుగాని, ఇందుం = చంద్రునిగాని, ననిరీక్షతే = చూడకుండెనేని, నిశ్చయాత్ = నిర్ణయముగాను, పరేణ = జారునిచేత, జాత ఇతి = పుట్టినవాఁడని, ప్రవదంతి = చెప్పుదురు. రవిణా = సూర్యునితోడ, సమాగతం = కూడియున్న, శశాంకం = చంద్రుని జూడకుండినను జనించినవాఁడు జారజుఁడగును. అథవా = అటుగాకపోయినను, శశీ = చంద్రుఁడు, సపాపకం = పాపులలో నొకనితోగూడినవాఁడై, అర్కేణ = సూర్యునితోడను, యుక్తః = కూడినవాఁడయ్యెనేని (జారజాతుఁడగును).

తా. (1) జాతకుని జన్మలగ్నముగాని చంద్రుఁడుగాని బృహస్పతిచే జూడబడకుండు నెడల నిశ్చయముగ నా జాతకుఁడు జారునివలన బుట్టినవాఁడని దెలియదగినది. అయినను జనన లగ్నముగాని చంద్రుఁడుగాని గురునవాంశలందుండినచో జాతకుఁడు జారజుడని చెప్పదగదు. ఈవిషయమై యవనేశ్వరుండు "అజీవభాగేష్వి నవీక్షితేవా జీవేధచంద్రేణ విలగ్నభేవా వాచ్యం పరోద్భూత మితిబ్రువంతి వాచోయ్యజనేనాథ బలావలోకాత్." అని చెప్పియున్నాడు.

(2) సూర్యచంద్రులిరువురును ఏరాశియందైనను ఒకరాశియందుండగా బృహస్పతి వారిని చూడక యుండెనేని జాతకుఁడు జారునివలన బుట్టినవాడని యెఱుఁగఁదగినది.

(3) చంద్రుఁడు, పాపులగు అంగారకశనైశ్చరులలో నొక్కరిని, సూర్యుని, గూడియుండినను జాతకుఁడు జారజుఁడని దెలియఁదగినది. అయినను ఆచంద్రుఁడు, గురుక్షేత్రములయందుగాని, తద్ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలయందుగాని, యుండినను ఇతరరాసులయందు, గురుయుక్తుడైనను, జాతకుఁడు జారునికి బుట్టినవాఁడుగాదని జెప్పదగినది. కొందఱు, గురుదృష్టియున్నంతమాత్రమున జారజయోగమును వచింపగూడదందురు. ఇదియును యోచింపదగినది. ఇందులకు, "గురుక్షేత్రగతేచంద్రే తద్యుక్తే వాన్యరాశిగే, తద్ద్రేక్కాణే తదంశేవా నపరైర్జాతయిష్యతే." అని గార్గివాక్యము.

మఱియు సారావళియందు.—"పశ్యతిన గురుశ్శశినం లగ్నంచ దివాకరం సేందుం, పాప యుతేవా సూర్యాచంద్ర మసౌచ యదిజారగజాతస్స్యాత్." అనియు చెప్పబడియున్నది. సూర్యచంద్రు లిరువురును ఏకరాశిగతులై పాపగ్రహయుక్తులై యుండి, బృహస్పతిచే జూడ బడినవారైనను, జారయోగమును జెప్పదగునని భట్టోత్పలుడను వ్యాఖ్యాతపల్కియున్నాడు.

## సుతజననకాల పితృబంధనయోగము.

శ్లో. క్రూరర్క్షగతా వశోభనా సూర్యాద్ద్యూన నవాత్మజస్థితౌ
బద్ధస్తు పితా విదేశగః స్వేవారాశి వశా దథోపథి. 7

టీ. క్రూరర్క్షగతౌ=పాపరాశులందుండు, అశోభనౌ = పాపగ్రహములు, సూర్యాత్ = సూర్యుడున్నస్థానమునకు, ద్యూననవాత్మజస్థితౌ=సప్తమ నవమ పంచమగతులై యుండిరేని, పితా=తండ్రి, రాశివశాత్ =సూర్యాధిష్ఠిత రాశివలన, విదేశగః=దేశాంతరస్థుడైకాని, స్వేవా= స్వదేశమందుగాని, పథివా=మార్గమందుగాని, బద్ధః=కట్టబడినవాడగును.

తా. జాతకుని జనన కాలమునుబట్టి వానితండ్రికి ప్రాప్తించు బంధనయోగము క్రూరరాసులగు, మేష, సింహ, వృశ్చిక, మకర కుంభములయందు క్షీణచంద్రుడుండి, బుధుడు కర్కాటకమున పాపగ్రహయుక్తుడై యుండి, కన్యా మిథునములయందు పాపులగు శన్యంగారకులుండి ఆ కన్యా మిథునరాసులు, తత్కాలమున సూర్యుడుండు రాశికి 7 - 9 - 5- వ, రాసులై యుప్పెనేని ఆకాలముల జననమందిన వానితండ్రి సూర్యస్థితరాశి కనుగుణ్యముగ విదేశ, స్వదేశ, మధ్యమార్గములయందు బంధన ప్రాప్తుడగును. అనగా. సూర్యుడు చరరాశియం దుండిన విదేశమున, స్థిరరాశియందుండిన స్వదేశమున, ద్విస్వభావరాశియందుండిన మధ్యమార్గమునను కట్టబడిన వాడగునని దెలియదగును. 7

## నావికా ప్రసవయోగములు.

శ్లో. పూర్ణే శశని స్వరాశిగే సౌమ్యే లగ్న గతే సుభేసుఖే
లగ్నే జలజేస్తగేపివా చంద్రే పోతగతా ప్రసూయతే. 8

టీ. పూర్ణే=సంపూర్ణుడైన, శశని=చంద్రుడు, స్వరాశిగే = తనరాశియం దుండగా, సౌమ్యే=బుధుడు, లగ్నగతే=లగ్నమందుండగా, శుభే=శుభగ్రహము, సుఖే=చతుర్థమందుండగా, (గర్భిణి) పోతగతా=ఓడయందున్నదై, ప్రసూయతే = ప్రసవించుచున్నది. 1. జలజే= జలరాసులలో నొకరాశి, లగ్నే=లగ్నమగుచుండగా, చంద్రే=చంద్రుడు, అస్తగే=సప్తమమందుండెనేని, ఓడయందు ప్రసవము చెప్పదగినది. 8.

తా. (1) చంద్రుడు సంపూర్ణుడై స్వక్షేత్రమగు కర్కాటకమునం దుండగా, బుధుడు లగ్నమునను, చతుర్థ కేంద్రంబున బృహస్పతియు నుండిరేని ఓడయందు ప్రసవమని చెప్పదగును. [బాధునకు నాల్గవయింట శుక్రుడుండడు గనుక, ఈచోట శుభుడనగా గురువని యర్థమగుచున్నది.] 8

(2) కర్కాటక, మకరోత్తరార్ధ, మీనములు జలరాసులుగాన ఆ జలరాసులలో నొకటి లగ్నమై ఆలగ్నమునకు 7, 9, యిండ్లయందు చంద్రుఁడుండినయెడల ఓడయందు ప్రసవమని చెప్పవలయును.

## ఉదకసమీప ప్రసవయోగములు.

శ్లో. ఆప్యోదయ మాప్యగ శ్శశీ సంపూర్ణ స్తమవేక్ష తేథవా
మేషూరణ బంధు లగ్నగః స్యాత్సూతి స్సలిలే నసంశయః. 9

టీ. ఆప్యోదయం=జలరాశిలగ్నమై, శశీ=చంద్రుఁడు, ఆప్యగః=జలరాశియం దుండెనేని, సలిలే=ఉదక సమీపమందు, సూతిః=ప్రసవము, స్యాత్=అగును, నసంశయః=సందేహములేదు. 1. అథవా=అటుగాకపోయినను, సంపూర్ణశశీ=పూర్ణచంద్రుఁడు, తం=ఆ జలరాశియైనలగ్నమును, అవేక్షతే=చూచెనేని, ఉదకసమీపమందు ప్రసవము చెప్పఁదగినది. 2. జలరాశిలగ్నమై చంద్రుఁడు, మేషూరణ బంధులగ్నగః=దశమ చతుర్థస్థానములలో నొకచోట నుండెనేని జల సమీపంబున ప్రసవము చెప్పఁదగినది. 3.

తా. (1) జలరాసులలో నొక్కటి లగ్నమై, అందుగాని, తదితర జలరాసులందుగాని చంద్రుడుండెనేని నిస్సందేహముగ ఉదకసమీపమున ప్రసవమని చెప్పవలయును. 9

(2) చంద్రుడేరాశియందైన నుండి జలరాశియగు లగ్నమును జూచుచున్నయెడల ఉదకసమీపమున ప్రసవమును చెప్పదగినది.

(3) జలరాశిలగ్నమై ఆ లగ్నమునకు దశమ, చతుర్థస్థానములలో నొకచోట చంద్రుఁడుండెనేని గర్భిణి జలసమీపమున ప్రసవించినదని చెప్పదగినది.

ఇందులకు:—"సలిలభలగ్నే చంద్రో జలరాశిం వీక్షతే థవాపూర్ణః, ప్రసవం సలిలే వింద్యా ద్వంధూభయ దశమగశ్చయదా." అని సారావళి ప్రయోగముకలదు.

## కారాగృహమందు ప్రసవయోగము.

శ్లో. ఉదయోడుపయో ర్వ్యయస్థితే గుప్త్యాం పాప నిరీక్షితే యమే
అళికర్కియుతే విలగ్నగే సౌరే శీతకరేక్షితే వటే. 10

టీ. ఉదయోడుపయోః=లగ్నచంద్రులకు, వ్యయస్థితే=ద్వాదశమందున్న, యమే=శనైశ్చరుఁడు, పాపనిరీక్షితే=పాపగ్రహములచేత చూడఁబడెనేని, గుప్త్యాం = చెరసాలయందు ప్రసవము, సౌరే=శనైశ్చరుఁడు, అళికర్కియుతే=వృశ్చిక కర్కాటక రాసులతోఁ గూడినవాడై, విలగ్నగే=జన్మలగ్నమందుండి, శీతకరేక్షితే=చంద్రునిచేత చూడఁబడెనేని, అవటే=గుంటయందు, ప్రసవము చెప్పఁదగినది.

తా. జనన లగ్నమునకైనను, చంద్రునకైనను పండ్రెండవయింట నుండు శనైశ్చరుఁడు పాపగ్రహములచే చూడబడుచుండెనేని జాతకుని జననమును కారాగృహమందని నిశ్చయించవలెను. 10

భూరంధ్రిమునందలి ప్రసవయోగము:—వృశ్చిక, కర్కాటక రాశులయందైనను, లగ్నమునందైన నుండు శనైశ్చరుని, చంద్రుడు చూచుచుండెనేని గుంటయందు ప్రసవమును జెప్పదగినది. ఈ యోగములు హృతనష్టాది ప్రశ్నలయందు నుపయుక్తము లగుచున్నవి.

### క్రీడాగృహ దేవాలయ ఉషర భూ ప్రదేశములందు ప్రసవయోగము.

శ్లో. మందేబ్జగతే విలగ్నగే బుధసూర్యేందునిరీక్షితే క్రమాత్
క్రీడా భవనం సురాలయం ప్రసవే సోషర భూమి మాదిశేత్. 11

టీ. అబ్జగతే=జలరాశిగతుడైన, మందే=శనైశ్చరుడు, విలగ్నగే = లగ్నమును బొందిన వాడై, క్రమాత్=వరుసగా, బుధసూర్యేందునిరీక్షితే=బుధరవిచంద్రులచేత చూడబడెనేని, క్రీడాభవనాది స్థలములను, ఆదిశేత్=చెప్పవలయును.

తా. జలరాశిలగ్నమై అందు శనైశ్చరుడుండి బుధునిచే జూడబడెనేని క్రీడాగృహమునందును, సూర్యునిచే జూడబడెనేని దేవాలయమునందును, చంద్రునిచే జూడబడెనేని చవిటినేలయందును ప్రసవమును జెప్పదగినది. చోరాది ప్రశ్నలయందును, సురతప్రశ్నయందును యీ యోగమును యోచింపదగును. 11

### శ్మశాన, రమ్యప్రదేశ, వహ్నిశాలాదులయందు ప్రసవయోగము.

శ్లో. నృలగ్నగం ప్రేక్ష్యకుజః శ్మశానే రమ్యేసితేందూ గురురగ్నిహోత్రే
రవిర్నరేంద్రామరగోకులేషు శిల్పాలయేజ్ఞః ప్రసవం కరోతి 12

టీ. పూర్వశ్లోకమందున్న మందశబ్దంబనువర్తించి వచ్చుచున్నది. నృలగ్నగం=నరరాసులలో నొకలగ్నమును పొందియున్న శనిని, కుజః=అంగారకుడు, ప్రేక్ష్య=చూచి,శ్మశానే=శ్మశానమందు, ప్రసవం=ప్రసూతిని,కరోతి=చేయుచున్నాడు, సితేందూ=శుక్రచంద్రులు చూచిరేని, రమ్యే=రమణీయగృహమందును, గురుః=బృహస్పతి (చూచెనేని), అగ్నిహోత్రే=అగ్నిశాలయందును,రవిః=సూర్యుడు(చూచెనేని), నరేంద్రామరగోకులేషు=రాజగృహదేవాలయ గోశాలలందును,జ్ఞః=బుధుడు(చూచెనేని), శిల్పాలయే=శిల్పిశాలయందును, ప్రసవమును జేయుచుండు.

తా. [ఇందు పూర్వశ్లోకమునందున్న " మంద " శబ్దము అనువర్తించుచున్నది.] నరరాసులగు మిథున, కన్యా, తులా, ధనస్సు పూర్వార్థకుంభములలో నొకలగ్నమందు శనైశ్చరుడుండి అంగారకునిచే జూడబడుచుండెనేని శ్మశానమునందు ప్రసవమనదగును. ఆ నరరాశియందుండు శనిని, శుక్రచంద్రులు, చూచిరేని రమణీయమందిరంబున ప్రసవ మనదగును. బృహస్పతిజూచెనేని అగ్నిశాలయందు ప్రసవమనదగును. సూర్యుడు చూచినయెడల రాజగృహమందైనను, దేవాలయమునందైనను, గోశాలయందైనను, ప్రసవమని జెప్పదగును. బుధుడు చూచెనేని దృఢదారుకృతమై చిత్ర ప్రతిమాది యుక్తమైన గృహమున ప్రసవమని జెప్పవలయును. ఈ విషయమై.—"కుజేనదృష్టే రవిజేశ్మశానం, బుధేనశిల్పాలయ మిత్యుశంతి, సూర్యేక్షితే గోనృప దేవవాసే, శుక్రేందుజాభ్యాం రమణీయదేశే, సురేజ్యదృష్టే ద్విజవహ్ని

హోత్రే నరోదయే సంప్రవదంతిసూతం". అని గ్రంథాంతరములందు జెప్పబడియున్నది. ఇదియు హృతినష్టాది ప్రశ్నలయందును, సూతప్రశ్నలయందును, ఉపయుక్తముగ నున్నది 12

—⊰ ప్రసవదేశము నెఱుగు యోగము ⊱—

శ్లో. రాశ్యంశ సమాన గోచరే మార్గే జన్మ చరే స్థిరే గృహే
స్వర్క్షాంశ గతేస్వమందిరే బల యోగాత్ఫలమంశ కర్క్షయోః. 13

టీ. రాశ్యంశసమానగోచరే—రాశి=లగ్నమునకు, అంశ=నవాంశకును, సమానగోచరే=సమానవిషయమైన, దారుల యందు ప్రసవము చెప్పదగినది. లగ్నరాశిగాని తన్నవాంశ రాశిగాని, చరే=చరమైయుండెనేని, మార్గే=మార్గమందును, స్థిరే=స్థిరమైయుండెనేని, గృహమందును, ద్విస్వభావమైయుండెనేని గృహబహిర్వేదికయందును ప్రసవము చెప్పదగినది. స్వర్క్షాంశగతేస్వమందిరే=అనగా, చరరాశిలగ్నమై ఆలగ్నరాశినవాంశమే యుదయించెనేని స్వగృహమార్గమందును, ప్రసవము చెప్పదగినది. అంశకర్క్షయోః—అంశక = నవాంశయొక్కయు, ఋక్ష=రాశియొక్కయు, బలయోగాత్ = బలయోగముపలన, ఫలం=ప్రసవస్థానజ్ఞాన రూప ఫలంబు గలుగును.

తా. లగ్ననవాంశలకు సమానవిషయమైన మార్గాదులందు ప్రసవమును జెప్పదగినది. ఇందు రాసుల సంచార ప్రదేశంబులు జెప్పబడియుండలేదు గాన యవనేశ్వరునిచే జెప్పబడిన శ్లోకములవలన ద్వాదశరాసుల సంచార ప్రదేశంబు లెఱుంగదగును. 13

(1) ఆద్యఃస్మృతో మేష సమానమూర్తిః కాలస్యమూర్ధా గదిత పుగాణై.
సోఽజావికాసం చరకందరాద్రి, స్తేనాగ్నిధాత్వా కరరత్నభూమిః.

(2) వృషాకృతిస్తు ప్రథితో ద్వితీయ సవక్త్రకంధాయ మనస్య ధాతుః,
వనాద్రిసాను ద్విపగోకులానాం కృషీవలానా మధివాసభూమిః.

(3) వీణాగదాభృ న్మిథునంతృతీయ ప్రజాపతేస్కంధ భుజాంసదేశః,
ప్రణర్తకోద్గాయక శిల్పకస్త్రీ క్రీడారతిద్యూత విహారభూమిః.

(4) కర్కః కులీరాకృతరంబుసంస్థో వక్షః ప్రదేశో ఽహితశ్చధాతుః,
కేదారవాపీ పులినాని తస్య దేవాంగనాగస్య విహారభూమిః.

(5) సింహశ్చశైలే హృదయప్రదేశం ప్రజాపతేః పంచమ మాహురార్యాః,
తస్యాటవీ దుర్గగుహావనాద్రి, వ్యాధావనీదుర్గ వనప్రదేశః.

(6) ప్రదీపికాం గృహ్యక రేణకన్యా నౌస్థాజలేషష్ఠ మితిబ్రువంతి,
కలార్ధధీరా జఠరంవిధాతుః సశాద్వలస్త్రీ రతిశిల్పభూమిః.

(7) వీధ్యాంతులాపణ్య ధరోమనుష్యః స్థితస్యనాభీ కటివస్తిదేశే,
తులాఽర్ధవీధ్యా పణపత్తనాధ్వ సార్గాదివాసో న్నతసస్యభూమిః.

(8) శ్వభ్రోష్టమో వృశ్చికవిగ్రహస్తు ప్రోక్తః ప్రభో ర్మేఢ్రగుదప్రదేశః,
గుహాబిలశ్వభ్రదివాత్మగుప్తి ర్వల్మీకకీటా జగరాహిభూమిః.

(9) ధన్వీమనుష్యో హయపశ్చిమార్ధ స్తమాహురూరూ భువనప్రణేతుః,
సమస్థితన్యస్త సమిస్తవాజి శూరాస్త్రభృద్య జ్ఞరథాశ్వభూమిః.

(10) మృగార్ధపూర్వో మకరోంబుచారీ జానుప్రదేశంత ముశంతిధాతుః,
నదీవనారణ్య సరస్యనూప శ్వభ్రాదివాసో దశమః ప్రదిష్టః.

(11) స్కంధేతురిక్తః పురుషస్యకుంభో జంఘేతమేకాదశ మాహురార్యాః,
తస్యోదకాధార కుసస్యపక్షీ స్త్రీశౌండికద్యూత నివాసభూమిః.

(12) జలేతుమీన ద్వయమత్స్యరాశిః కాలస్యపాదౌ లిఖితౌవరిష్ఠౌ,
సపుణ్యదేవ ద్వింతీర్థభూమిః నదీసముద్రాం బుధరాధివాసః.

పై శ్లోకములందు ఏయేరాశికి యేసంచారప్రదేశములు జెప్పబడియున్నవో ఆయా లగ్న నవాంశలవలన నాయాప్రదేశములందు ప్రసవము జెప్పదగినది. లగ్నముగాని తన్నవాంశ గాని చరరాశియైన యెడల ఆరాశి సంచారప్రదేశముననున్న మార్గమునను, స్థిరరాశి యయ్యెనేని ఆరాశి సంచారప్రదేశమున నున్న గృహమందును, ద్విస్వభావరాశి యగునెడల ఆరాశి సంచారప్రదేశముననున్న గృహ బహిర్వేదికయందును ప్రసవమును జెప్పదగినది. మఱియు చరరాశిలగ్నమై నవాంశయు చరరాశియే యయ్యెనేని స్వగృహమార్గమునను, స్థిరరాశి లగ్నమై నవాంశయు ఆ స్థిరరాశియే యగునెడల యింటియందును. ద్విస్వభావరాశి లగ్నమై నవాంశయు ఆద్విస్వభావరాశియే యగునెడల ఇంటివాకిటి తిన్నెమీదను ప్రసవమును జెప్పదగినది. ఇందు "రాశ్యంశ సమానగోచరే" అని యున్నందున లగ్నరాశి ననుసరించి ఫలితమును జెప్పవలయునా ? నవాంశరాశి ననుసరించి ఫలితమును జెప్పవలయునా ? యను సందేహమును నివర్తించుకొనుటకై, "బలయోగాత్ఫలమంశకర్క్షయోః" అనగా లగ్నరాశి నవాంశరాసులలో నేది బలయుక్తమైయున్నదో ఆరాశి సంచారప్రదేశమునందు ప్రసవమును జెప్పదగినదని యున్నది. ఈ విషయమై, "భవనాంశ సదృశదేశే ప్రసవోజ్ఞేయ స్సదాత్రయువతీనాం, మిశ్రగృహాంశే వర్త్మని స్థిరరాశ్యంసే తథాస్వగృహే, స్వాధిపయుతే విలగ్నే స్వగృహే న్యస్మిన్ తథాన్యథాప్రసవః. ఇంతకు పూర్వమున జెప్పబడియుండు యోగములేవియు లేనప్పుడు మాత్రమే ఈ "రాశ్యంశ సమానగోచరే" అను యోగమును సూచింపదగినది.

## తల్లిచే విడువబడి అన్యులచే పెంపబడు శిశుయోగము.

శ్లో. ఆరార్కజయో స్త్రికోణగే చంద్రే ర్కేచవిసృజ్యతేంబయా
దృష్టే మరరాజ మంత్రిణా దీర్ఘాయుస్సుఖభాక్చ సస్మృతః. 14

టీ. చంద్రే=చంద్రుడైనను, అర్కేవా=సూర్యుడైనను, ఆరార్కజయోః=ఏకరాశిగతులైనకుజశనులకు, త్రికోణగే=త్రికోణములందుండగా, అంబయా=తల్లిచేత, విసృజ్యతే=విడువ

బడును. అమరరాజమంత్రిణా=గురునిచేత, దృష్టేసతి=చూడఁబడుచుండగా, (ఇతరులచే పెంపబడి), దీర్ఘాయుః=దీర్ఘాయుష్మంతుండును,సుఖభాక్చ=భోగవంతుండునని, స్మృతః=చెప్పఁబడెను.

తా. చంద్రుడైనను, సూర్యుడైనను ఏకరాశిగతులగు అంగారక శనైశ్చరులకు త్రికోణస్థానములం దనగా నవమ పంచమములయందు నెందేని యుండునెడల ఆకాలమున బుట్టిన శిశువు తల్లిచే విడువబడినదగును. ఈ యోగమునందు చంద్రుఁడుగాని,సూర్యుఁడుగాని బృహస్పతిచే జూడబడుచుండె నేని ఆకాలమున బుట్టిన శిశువు తల్లిచే విడువబడియు అన్యులపోషణయందు దీర్ఘాయుష్మంతుఁడుగను, భోగవంతుడుగను, అగుననుట నిశ్చయము. ఈ విషయమున కొందఱు. "చంద్రస్తేచ విసృజ్యతేంబయా." అని పఠించి చంద్రుఁడు ఏకరాశిగత కుజశనులకు నవమ పంచమములయందుగాని సప్తమమందుగాని యుండెనేని శిశువు తల్లిచే విడువబడునని చెప్పుచున్నారు. ఇదియు యోచింపదగినది. 14

## శిశువు తల్లిచే విడువబడియు నశించు యోగములు.

శ్లో. పాపేక్షితే తుహినగా వుదయే కుజేస్తే
త్యక్తోవినశ్యతి కుజార్కజయో స్తథాయే
సౌమ్యేపి పశ్యతి తథావిధ హస్తమేతి
సౌమ్యేతరేషు పరహస్తగతో ప్యనాయుః. 15

టీ. పాపేక్షితే=కుజశనులలో నొకనిచేఁ జూడఁబడియున్న, తుహినగౌ=చంద్రుఁడు, ఉదయే=లగ్నమందుండఁగా, కుజే=అంగారకుఁడు, అస్తే=సప్తమమందుండెనేని, త్యక్తః=తల్లిచేత విడువఁబడినవాడై, వినశ్యతి=మృతిబొందును, తథా=ఆప్రకారమే, లగ్నమందున్న చంద్రుడు, పాపేక్షితే=సూర్యుడుచూడబడు చుండఁగా, ఆయే=ఏకాదశస్థానమందు కుజార్కజయోః=కుజశనులుండిరేని, శిశువు తల్లిచేత విడువఁబడి నశించును. సౌమ్యేపి=శుభుడు, పశ్యతి=జూచెనేని, తథావిధహస్తమేతి=ఆ చూచుచుండెడు శుభగ్రహము నేవర్ణముగలదో, ఆ వర్ణము గలవారిచే చిక్కి బ్రతుకును, ఈ చెప్పఁబడిన యోగమందు చంద్రుని, సౌమ్యేతరేషు = శుభపాపగ్రహంబులునుంగూడ చూచుచుండెనేని ఆ గ్రహములలో బలయుక్తగ్రహము ఏజాతిగలదో ఆజాతిగల వారిచేతి జిక్కి, అనాయుః=హీనాయువై నశించును.

తా. లగ్నమునందుండు చంద్రుఁడు, పాపులగు శన్యంగారకులలో నొకనిచే జూడబడుచు, ఆలగ్నమునకు సప్తమమున అంగారకుడుండు యోగమున బుట్టిన శిశువు తల్లిచేత విడువబడియు మృతినొందును.

మఱియు లగ్నమునందుండు చంద్రుఁడు సూర్యునిచే జూడబడుచు, లగ్నమునకు ఏకాదశమున అనగా పదునొకండవ యింటియందు అంగారక శనైశ్చరులుండు కాలమున బుట్టిన శిశువు తల్లిచే విడుపబడి మృతినొందును.

ఈప్రకారము చంద్రుఁడు లగ్నమునను, అంగారకుఁడు సప్తమమున నుండగా ఆ లగ్నగతుడగు చంద్రుని నొక శుభగ్రహము చూచుచుండు కాలమున బుట్టిన శిశువు తల్లిచే

విడువబడియు చంద్రుని చూచుచుండు శుభగ్రహమునకు "విప్రాదితశ్శుక్రగురూ" అను శ్లోకమురీతి బ్రాహ్మణాదివర్ణములలో నేవర్ణమగునో ఆ జాతివారిచ్వేత జిక్కి సుఖముగ బ్రతికి యుండుననియు, ఆలగ్నచంద్రుని శుభగ్రహములును, పాపగ్రహములును చూచుచుండు నెడ ఆ గ్రహములయందు బలయుక్తమగు గ్రహమునకు జెప్పబడిన జాతివారిచేత ఆ శిశువు జిక్కబడియు, ఆయుర్హీనమై నశించుననియు దెలియదగినది.

ఈ యోగములంగను పూర్వశ్లోకమున "దృష్టే మరరాజు స్త్రిణా దీర్ఘాయు స్సుఖ భాక్చ సస్మృతః." అని చెప్పయుండెడు ప్రకారము బలయుక్తుడగు బృహస్పతి లగ్నమును చూచు చుండునెడ ఆశిశువు ఏజాతివారిచేతనైనను చిక్కి దీర్ఘాయుష్మంతుడై యుండునని దెలియ దగినది. ఈ విషయమై, "మ్రియతేపాపై ర్దృష్ట శ్శశినివిలగ్నే, శుభేస్తగేత్యక్తః, లగ్నాచ్చ లాభగతసౌగ్యసుధాసుత మందయోరేవం, పశ్యతి సౌమ్యేబలవాన్ యాదృగ్గ్రహోతితా దృశోజాతం, శుభపాపగ్రహదృష్టే పరైర్గృహీతో ప్యసౌమ్రియతే, సర్వేషే తేషుయదా యోగేషు శశీ సురేజ్యసందృష్టః, భవతి తదాదీర్ఘాయుర్హస్తగతస్సర్వేషు" అని సారావళి యందు జెప్పబడియున్నది.

—పితృమాత్రాది గృహమందు ప్రసవయోగము.—

శ్లో. పితృమాతృగృహేషు తద్బలాత్తరు వాలాదిషు నీచగై శ్శుభైః
యది నైకగతైస్తు వీక్షితౌ లగ్నేందూవిజనే ప్రసూయతే. 16

టీ. పితృమాతృగృహేషు = తల్లిదండ్రులు మొదలైనవారి యిండ్లయందు. ప్రసవము చెప్పదగినది, తద్బలాత్=అనగా పగలు సూర్యుడుగాని రాత్రి శనైశ్చరుడుగాని బలవంతుడై యుండెనేని పితృగృహమందును, పగలు శుక్రుడుగాని రాత్రి చంద్రుడుగాని బలవంతుడైయుండెనేని మాతృగృహమందును ప్రసవము చెప్పదగినది. శుభైః=శుభగ్రహంబులు, నీచగైః=నీచస్థానములగాయుండెనేని, తరుసాలాదిషు=వృక్షప్రాకార నదీకూపాది ప్రదేశముల యందును, ప్రసవము చెప్పదగినది. ఏకగతైః=ఏకరాశిగతములైన గ్రహములచేత,లగ్నేందూ= లగ్నచంద్రులు, నవీక్షితౌయని=చూడబడకుండినేని, విజనే=జనశూన్యమైన చోట, ప్రసూయతే=ప్రసవించును.

తా. పితృమాత్రాది గృహములందు ప్రసవము చతుర్థాధ్యాయమగు నిషేకాధ్యాయమున "దివార్కశుక్రౌ పితృమాతృసంజ్ఞితౌ" అను శ్లోకమున చెప్పియున్నరీతి పితృమాత్రాది సంజ్ఞలుగల గ్రహములచేత తల్లిదండ్రుల యిండ్లయందును, యీ శ్లోకమున "పితృమాతృ గృహేషు" అని బహువచనముగా నుండుటచే పితృవ్యమాతృ వ్యసాది గృహములయందును ప్రసవము చెప్పదగినది. పగలు సూర్యుడును, రాత్రి శనైశ్చరుడును బలవంతులై యుండి రేని పితృగృహమందును, పగలు శనైశ్చరుడును, రాత్రి సూర్యుడును బలవంతులై యుండి రేని పినతండ్రి, పెదతండ్రి, మేనత్త మొదలగు పితృసంబంధులైన వారి యిండ్లయందును, ప్రసవమును జెప్పదగినది. 16

పగలు శుక్రుడును రాత్రి చంద్రుడును బలవంతులై యుండిరేని, మాతృగృహము నను పగలు చంద్రుడును రాత్రి శుక్రుడును బలవంతులై యుండిరేని పినతల్లి, పెద తల్లి, మేనమామ మొదలగు మాతృసంబంధమైన వారియిండ్లయందును బ్రసవమును జెప్పదగినది.

శుభగ్రహములు తమతమ నీచస్థానములయందుండిరేని వృక్షప్రాకార సమీపముల యందును, ఆదిశబ్దముచేత నదీ కూపాది సమీప ప్రదేశములయందును బ్రసవమును జెప్పదగినది. మఱియు నీచత్వము నొందిన శుభగ్రహములు ఏకరాశిగతులై లగ్నచంద్రుల జూడకుండినయెడల జనశూన్యమైన యడవియందును, ఏకరాశిగతులగు బహు శుభగ్రహములు లగ్నచంద్రుల జూచుచుండిరేని జనయుక్త ప్రదేశమందును ప్రసవమును జెప్పదగినది.

ఇందులకు, "పితృమాతృగృహ ఇలతస్తత్స్వజన గృహేషు బలయోగాత్, ప్రాకార తరు నదీషు చనూతి ర్నీచాశ్రితైః స్యాత్సౌమ్యైః, నైకస్థే లగ్నేందూ యద్యేకస్థా గ్రహాస్థదాట వ్యామ్" అని సారావళియందు చెప్పబడియున్నది.

## అంధకారానంధకారములయందు బ్రసవయోగములు.

శ్లో. మందర్‍క్షాంశే శశిని హిబుకే మందదృష్టేబ్జగే వా
తద్యుక్తే వా తమసి శయనం నీచ సంస్థైశ్చ భూమౌ
యద్వద్రాశి ర్వ్రజతి హరిజం గర్భమోక్షస్తు తద్వ
త్పాపై శ్చంద్రాత్ స్మరసుఖగతైః క్లేశ మాహు ర్జనన్యాః. 17

టీ. శశిని=చంద్రుడు, మందర్‍క్షాంశే = నవాంశలయందుండెనేని, తమసి = అంధకారమందు, శయనం = సూతికాశయనము చెప్పవలెను. హిబుకే = లగ్నచతుర్థమందు చంద్రుండున్నను, మందదృష్టే=చంద్రుండు ఏరాశియందైనను నుండి శనిచేత చూడబడెనేనియు అంధకారమందు సూతికాశయనము, అబ్జగే=కర్కాటక మీనములలో నొక్కటియందు చంద్రుడుండిన, తద్యుక్తేవా=చంద్రుడు శనితోగూడియున్నను అంధకారమందు శయనమును జెప్పవలయును. నీచసంస్థైః=నీచస్థానమందుండు గ్రహములచేత, భూమౌ=తృణావృతమైన భూమియందు సూతికాశయనమగును. రాశిః=ప్రసవలగ్నరాశి, యద్వత్=ఏప్రకారముగా, హరిజం=ఉదయమును, వ్రజతి=పొందుచున్నదో, తద్వత్=ఆప్రకారముగ, గర్భమోక్షః=ప్రసవము చెప్పదగినది, చంద్రాత్ = (తత్కాలమందు) చంద్రుడున్న స్థానము మొదలుకొని, స్మరసుఖగతైః = సప్తమ చతుర్థములయందున్న, పాపైః=పాపగ్రహములచేత, జనన్యాః=తల్లికి, క్లేశం = కష్టమును, ఆహుః=చెప్పిరి.

తా. (1) చంద్రుడు ఏరాశియందైనను శనైశ్చర నవాంశములగు మకర కుంభ నవాంశలందుండెనేని అంధకారమునందు సూతికాశయనమును వచింపవలెను.

(2) లగ్నమునకు చతుర్థస్థానమున అనగా నాల్గవయింటను చంద్రుడున్నయెడల అంధకారమునందు సూతికాశయనమును జెప్పదగినది.

(3) చంద్రుఁడు ఏరాశియందైన నుండి శనిచేత చూడబడుచుండెనేని అంధకారమునందు సూతికాశయనమును జెప్పదగినది.

(4) అబ్జరాసులగు కర్కాటక, మీనరాసులం దేరాశియందైన కర్కాటక నవాంశయందుగాని, మీననవాంశయందుగాని చంద్రుఁడుండెనేని అంధకారమునందు సూతికాశయనమును జెప్పదగినది.

(5) చంద్రుఁడు శనితోఁ గూడియుండినను అంధకారమునందు సూతికాశయనమనియు జెప్పదగినది.

ఈ ఐదుయోగములలో నేయోగముగాని ఆధానలగ్న చక్రమునందుండెనేని అంధకారమునందు శయనమును జెప్పదగినది.

ఈ యోగములు జెప్పినను అనుభవమునుబట్టి, చంద్రుఁడు సూర్యునిచే జూడబడుచుండెనచో అంధకారమునందుగాదని జెప్పుదురు. ఈ విషయమై "సౌరాంశకస్థే శశిని ప్రలగ్నే గతే వాఽబ్జాంశక మాశ్రితేన, స్వాంశస్థితే కేంద్రగతే ఽథజీవా జాతోస్తమితే యది వార్కదృష్టః." అని భువనేశ్వరుఁడు రచించియున్నాఁడుగాన నీ యోగముల బాగుగ యోచింపదగియున్నది.

బలవంతుఁడగు సూర్యుఁడు అంగారకునిచే జూడబడుచుండెనేని దీపముండునట్టి యింటియందు ప్రసవమని జెప్పదగినది. సూతికాశయనమును ఆచోటనే యని దెలియదగినది. ఇందులకు, "బలవతిసూర్యేదృష్టే బహుప్రదీపాధరాకు పుత్రేణ, అన్యైశ్వర్యపగత వీర్యైస్సూతాంశేస్పృష్టే గృహపతి, సౌమ్యాంశే జలాంశే చంద్రేగ్రహసంయుతే ధవా హిబుకే, తద్దృష్టే వా కుర్యాత్ప్రసవమ్, ప్రసవం నసందేహః." అని సారావళియందు జెప్పబడియున్నది.

రెంటికంటె నతిశయించిన గ్రహములు నీచస్థానగతులై యుండెనేని తృణాస్తృతమైన భూమియందు సూతికాశయనమని దెలియదగినది.

మఱికొందఱు, లగ్నమందైనను, చతుర్థమందనగా లగ్నమునకు నాల్గవయింటయైనను, నీచస్థానమునందైనను చంద్రుఁడుండెనేని భూమియందు శయనమని జెప్పుదురు. ఇందులకు, "నీచస్థైర్భూశయనం చంద్రే వ్యథవా సుఖేవిలగ్నేవా." అని సారావళియందు జెప్పబడియున్నది.

జననకాలమున శీర్షాద్యుదయ ప్రకారము:—ప్రసవలగ్నము శీర్షోదయరాశి యయ్యెనేని ప్రథమమున శిరసోదయమగును. ప్రసవలగ్నము పృష్ఠోదయరాశి యయ్యెనేని శిశువు అధోముఖుఁడై పాదపురస్సరమై పృష్ఠమును జూపుచు నుదయమగును. ప్రసవలగ్నము ఉభయోదయరాశి యయ్యెనేని శిశువు హస్తపురస్సరమై యుదయించును. ఈ యోగములయందు ప్రసవలగ్నోదయ రాశిభేదమును బాగుగ నెఱింగి ఫలితము జెప్పదగినది. ఈ విషయమై, "శీర్షోదయే విలగ్నే మూర్ధ్నా ప్రసవో న్యథోదయేచరణైః, ఉభయోదయే చహస్తే, శుభదృష్టే శోభనోన్యథాకష్టః." అని సారావళియందు జెప్పబడియున్నది.

అనుభవమునుబట్టి కొందఱు లగ్నాధిపతిగాని, నవాంశాధిపతిగాని తత్కాలమున లగ్నమునందుండు గ్రహముగాని వక్రించియుండునెడల తత్కాలమున ప్రసవము ఉత్క్రమమై పరీత్యముగా నగునని చెప్పుదురు.

ఇందులకు మణిత్థుడు చెప్పిన యుదాహరణము:— "లగ్నాధిపేంశకపతౌ, లగ్నస్థే వక్రితే గ్రహేప్యథవా, విపరీతగతో యోనౌ వాచ్యో గర్భస్య సంక్లేశః" అని ప్రసవకాలంబున మాతకు కష్టము కలుగుననుటను దలియువిధము:—తత్కాలమున అనగా ప్రసవకాలమున చంద్రుడున్న స్థానముమొదలుకొని సప్తమ చతుర్థములయందుండు పాపగ్రహముల వలన ప్రసవకాలమున మాతకు గష్ట మధికమనుట నూహింపదగినది. ఇందులకు, "క్లేశో మాతుః క్రూరైర్బంధ్వస్తగతైశ్శశాంకయుక్తైర్వా." అని సారావళియందును జెప్పబడి యుండుటచే చంద్రునకు పాపగ్రహ వీక్షణ యధికముగ నుండునెడల, స్త్రీ ప్రసవకాలమున జాల గష్టపడినదని జెప్పదగినది. 17

## సూతికాగృహ దీప పాత్రయందలి తైల పూర్ణా పూర్ణత్వ యోగము.

శ్లో. స్నేహశ్శశాంకా దుదయాచ్చవర్తి ర్దీపోర్కయుక్తర్క్ష వశాచ్చరాద్యైః
ద్వారంచతద్వాస్తు నికేంద్రసంస్థైః జ్ఞేయంగ్రహైర్వీర్య సమన్వితైర్వా.

టీ ఇచ్చట స్నేహమనగా ఘృతతైలాదులు, శశాంకాత్=చంద్రునివలన, స్నేహః= ఘృతతైలాదులు నిర్ణయింపదగినవి. ఉదయాత్=లగ్నమువలన, వర్తిః=వత్తి, నిర్ణయింపదగినది. అర్కయుక్తర్క్షవశాత్=సూర్యుడున్న రాశివలన, దీపః=దీపము చెప్పదగినది. తద్వాస్తుని = ఆ సూతికాగృహమందు, ద్వారం=వాకిలి, కేంద్రస్థితైః=కేంద్రస్థానములయందున్న, వీర్య సమన్వితైః=బలయుక్తములైన, గ్రహైః=గ్రహములచేత, జ్ఞేయం=తెలియదగినది.

తా. సూతికాగృహ దీప తైల పూర్ణాపూర్ణత్వము ఈ శ్లోకమునగల స్నేహ మనుపదమునకు, ఘృతతైలాదులని నూహింపందగును. జననకాలంబున చంద్రుడున్న రాశిని మూడు భాగములు జేసి ప్రథమభాగమున చంద్రుడుండెనేని సూతికాగృహమునం దుంచబడిన దీప భాజనమున తైలము నిండియుండెననియు, రాశిమధ్యమమగు ద్వితీయభాగమున చంద్రుడుండెనేని ఆ సూతికాగృహమం దుంచబడిన దీపపాత్ర యందు తైలము సగము మిగిలియుండెననియు, ఆ రాశ్యంతమగు తృతీయభాగమున చంద్రుడుండెనేని ఆ దీపభాజనమున తైలము లేదనియు జెప్పదగినది. కొందఱు. "దీపః పూర్ణః పూర్ణే శశిని క్షీణేక్షయస్తు తైలస్య" అను సారావళి శ్లోకోక్తముగా చంద్రుని పూర్ణ, మధ్యమ క్షీణత్వముల కాలమును విభజించగా శుక్లపక్ష ప్రతిపత్ మొదలు శుక్లపక్ష దశమిపర్యంతము ఆ శశిమధ్యముడనియు, శుక్లపక్ష ఏకాదశి మొదలు కృష్ణపక్ష పంచమివరకు పూర్ణుడనియు, కృష్ణ షష్టి మొదలు అమావాస్య వరకు క్షీణుడనియు, జెప్పబడియుండుటచే పూర్ణుడైయుండు కాలమున దీపభాజనమున తైల

ము పూర్తిగను, మధ్యముడైనప్పుడు తైలము అర్ధావశిష్టముగను, క్షీణుడైయుండు దినములలో జననమగునెడల తైలము క్షీణమైయుండెననియు జెప్పదగునని యందురుగాని ఈ వెనుకటి పద్ధతి ననుసరించినయెడల చంద్రునికి క్షీణత్వము కలిగియుండుకాలమున ప్రసూతిగలిగిన చోటులనెల్ల దీపము లేకుండెనని చెప్పవలయునుగాన ఈపద్ధతి అప్రసిద్ధము ప్రథమమున జెప్పిన మార్గముననే తైలపూర్ణాపూర్ణత్వముల నూహింపదగినది. దీపపువత్తియొక్క దీర్ఘహ్రస్వత్వంబును గ్ణమును దెలియువిధము:—

ప్రసవకాలలగ్నమును మూడుభాగములు చేయగా అందు లగ్నారంభమగు కాలమున ప్రసవమగునేని వత్తి అప్పుడే వేసియుండెననియు, ఆలగ్నమధ్యమున జననమైనయెడ వత్తి సగము కాలినదనియు, ఆ లగ్నఅంత్యమందగు నెడల వత్తి గ్రముపోయినదనియు జెప్పదగినది. ఈ విషయమే, “యావల్లగ్న మతీతం వర్తిర్దగ్ధాతు తావతీభవతి” అని సారావళియందు జెప్పబడియున్నది. కొందఱు ఆలగ్నమున శేవర్ణము చెప్పబడియున్నదో అవర్ణమును ఆదీప భాజనములో యుండు వత్తికి జెప్పుదురు. ఇందులకు, “లగ్నస్యయోన్యత వర్ణోనిర్దిష్టస్తే నవర్తి రాదేశ్యా.” అని మణిత్థప్రయోగోదాహరణము.

సూతికాగృహవిషస్థితియు దీపముండుదిక్కులును జననకాలమున సూర్యుడు చర రాశియం దుండెనేని దీపము కదలుచుండెననియు, స్థిరరాశియందుండిన ఆ సూతికాగృహమున నున్న దీపము కదలకయుండెననియు, ఆ సూర్యుడు ద్విస్వభావరాశి స్థితుడైయుండెనేని ఆ సూతికాగృహమందున్న దీపము డోలాయమానముగ నుండెననియు జెప్పదగును. సూర్యుడు ఏరాశియందుండునో ఆరాశికి “ప్రాగాదిశా క్రియవృష నృయుక్కర్కటా స్సత్రికోణాః” అను శ్లోకమునందేదిక్కు చెప్పబడియున్నదో ఆ దిక్కున దీపముండెనని చెప్పదగునని కొందఱును, మఱికొందఱు సూర్యుడు భ్రమణవశంబున 8 యామములయందును 8 దిక్కుల యందు సంచరించుచుండుగాన అద్దాని ననుసరించి సూర్యుండేదిక్కుననుండునో ఆదిక్కున దీపముండెనని జెప్పదగునందురు. ఇదిగాక, సారావళియందు జెప్పబడియుండు “ద్వాదశభాగ విభక్తే, వాసగృహే వ్యవస్థితే సహస్రాంశౌ, దీపశ్చరస్థిరాదిషు తద్వైవవాచ్యః.” అను శ్లోకము ననుసరించి సూతికాగృహమును పండ్రెండు భాగములుగ విభజించి మేషము మొదలు గణన చేయగా సూర్యుని స్వక్షేత్రమగు సింహ మేభాగమున నగునో యచ్చోట దీపముండెనని జెప్పదగునని కొందఱందురు.

మఱియు, లఘుజాతిక శ్లోకమగు “బలినాద్రుష్టే భావాభావౌ ప్రదీపాస్వాదే తుక్షపుత్రేణ, అనైర్వర్వ్యపగతవీక్షైర్య స్సూతౌ జ్యోతిస్తృషైర్భవతి.” అను దాని ననుసరించి, సూర్యుడు బలవంతుడగుచు అనగా స్వక్షేత్రమగు సింహమందైనను, ఉచ్చక్షేత్రమగు మేషమునందైన నుండగా, అంగారకుండా సూర్యుని జూచుచుండెనేని ఆసూతికాగృహమున ననేకదీపము లుండెననియు, ఆసూర్యుడు కుజ వ్యతిరిక్త బలహీనగ్రహములచే జూడబడు చుండెనేని అందు తృణజ్యోతి యుండెననియు జెప్పదగినది.

సూతికా గృహద్వార దిగ్భాగములు గృహద్వారసంఖ్య కేంద్రస్థానంబులందుండు బల యుక్తములగు గ్రహములచే సూతికా గృహద్వార దిశాదుల నెరుంగదగినది.

"ప్రాగాద్యాం రవిశుక్రలోహిత తమస్సౌరేందు విట్సూరయః." అను శ్లోకమునందు ప్రాగాద్యష్టదిక్కులకును క్రమముగా రవిశుక్రులు అధిపతులని చెప్పబడియుండుట ననుస రించి కేంద్రమందుండు గ్రహమున కేదిక్కగుచున్నదో ఆదిక్కున సూతికాగృహద్వారమని తెలియదగినది. కేంద్రములం దనేక గ్రహములుండెనేని ఆ గ్రహములలో బలాధికమగు గ్రహమున కేర్పరుపబడిన దిక్కున సూతికాగృహద్వారమును నిర్ణయింపదగినది. మఱియు ఎన్ని గ్రహములు కేంద్రములందు బలయుక్తములై యుండునో యన్ని ద్వారముల నా సూతి కాగృహమున కని చెప్పదగును. కేంద్రములయందు గ్రహములు లేకుండెనేని "ప్రాగాది గృహాః క్రియాదయో ద్వౌద్వౌకోణ గతాద్విమూర్తయః." అను ప్రకారము లగ్నరాశి దిక్కు న సూతికాగృహ ద్వారం బెఱుంగదగినది ఈ విషయమై లఘుజాతకమునందు. "ద్వారం వాస్తుని కేంద్రోపగతా ద్గ్రహాద్వ సత్వాపిలగ్నర్క్షాత్." అని చెప్పబడియున్నది. మఱికొందఱు. "వీర్యసమన్వితైర్వా." అని వేరుగ వ్యాఖ్యానముజేసి కేంద్రస్థానములు గ్రహశూన్యములై యుండునెడల లత్కాలంబున సకల గ్రహంబులలో నేగ్రహము బలాధికమై యుండునో ఆ గ్రహమున కేదిక్కు జెప్పబడియున్నదో యాదిక్కున సూతికాగృహద్వార మును నిర్ణయింపవలయు నని యనుచున్నారు. 18

—సూతికాగృహ లక్షణమును దెలియు యోగము.—

శ్లో. జీర్ణం సంస్కృతమర్కజే క్షితిసుతే దగ్ధం నవం శీతగౌ
కాష్ఠాఢ్యం నదృఢం రవౌ శశిసుతే తన్నైకశిల్ప్యుద్భవం
రమ్యం చిత్రయుతం నవం చ భృగుజే జీవే దృఢం మందిరం
చక్రస్థైశ్చ యథోపదేశ రచనం సామంత పూర్వాం వదేత్. 19

టీ. అర్కజే=శని, వీర్యసమన్వితే=బలవంతుడై యుండెనేని, తన్మందిరం = సూతికా గృహము, జీర్ణం=మిక్కిలి శిథిలమయినదై, సంస్కృతం=మఱల చక్కగా గట్టబడినదనియు, క్షితిసుతే=కుజుండు (బలవంతుడై) యుండెనేని, దగ్ధం = వొకతట్టు కాలినదియు, శీతగౌ= చంద్రుండు (బలవంతుడై యుండెనేని, నవం = క్రొత్తదియు. రవౌ = సూర్యుడు (బలవంతుడై) యుండెనేని, కాష్ఠాఢ్యం=కొయ్యలు మెండుగాగలదైనను, నదృఢం=దృఢమైన ది గాదనియు, శశిసుతే=బుధుడు (బలవంతుడై) యుండిన, నైకశిల్ప్యుద్భవం=అనేక శిల్ప కారులచే రచియింపబడినదియు, భృగుజే=శుక్రుడు (బలవంతుడై) యుండెనేని, రమ్యం= సుందరమై, చిత్రయుతం=చిత్తరువులతో గూడిన, నవం=క్రొత్తయిల్లనియు, జీవే = గురుడు (బలవంతుడై) యుండెనేని, దృఢం=గట్టియిల్లనియు, వదేత్=చెప్పవలయు. చక్రస్థైః=రాశి

చక్రారూఢములై, సామంతపూర్వాత్=సూతికాగృహమునకు చుట్టుప్రక్కలనుండెడు గృహములను, యథోపదేశగచనం=సూతికాగృహలక్షణము లేవిధముగ చెప్పబడియున్నవో ఆప్రకారముగానే, వదేత్=చెప్పవలయును.

తా. పూర్వశ్లోకమునగల "వీర్యసమన్వితః" శబ్దమును యీ శ్లోకమునందు జేర్చుకొని యర్థము నూహింపవలయును. గ్రహము లన్నిటియందును శనైశ్చరుండు బలవంతుండై యుండెనేని సూతికాగృహము మిక్కిలి ప్రాఁతదియగుటచే శిథిలమై నుఱల జక్కగ గట్టబడినదని యెఱుంగదగును. గ్రహము లన్నిటియందును అంగారకుండు బలాధికుండగునెడల నా సూతికాగృహ మొకభాగమున కాలినదని నెఱుంగదగినది. 19

చంద్రుండు వీర్యసమన్వితుండై యుండునెడల ఆ సూతికాగృహము క్రొత్తదని నెఱుంగదగినది. మఱియు "సంవర్ధంతా చంద్రమసోపలిప్తం" అని యవనేశ్వరుండు వచించి యుండుటవలన శుక్లపక్షమునందు చంద్రుండు బలాన్వితుడై యుండెనేని ఆ సూతికా గృహము పూయబడినదని నూహింపదగినది.

సూర్యుండు బలాధికుండగునెడల కొయ్య లధికముగజేర్చి దృఢముగా గట్టబడిన గృహమని దెలియవలెను.

బుధుండు బలవంతుడయ్యెనేని బహువిధశిల్పులచేగట్టబడిన మందిరమనియెఱుంగదగినది.

శుక్రుడు గ్రహములన్నిటియందును వీర్యసమన్వితుండగు నెడల బహువిధ చిత్రములతో గూడిన నవీన సుందరమందిరము సూతికాగృహమని నూహింపదగినది.

బృహస్పతి బలవంతుడైన, చాల కాలమునకు గట్టిగా నుండగలగృహమని చెప్పదగినది.

సూతికా గృహలక్షణమును దెలుపు బలాధికగ్రహస్థిత రాశి మొదలు ద్వాదశ రాశ్యాత్మకమైన రాశిచక్రమును, చతుర్భాగములుగా విభజించి ప్రథమ భాగమునందల యితర గ్రహములచేత తూర్పుటిల్లును, ద్వితీయభాగమందున్న యితర గ్రహములచే దక్షిణపుటిల్లును, తృతీయ భాగస్థిత గ్రహములవలన పడమటిల్లును, చతుర్థభాగగత గ్రహములవలన నుత్తరపుటిల్లును, "జీర్ణంసంస్కృతమర్కజే." అను శ్లోకక్రమము ననుసరించిన లక్షణము గలదని చెప్పదగినది. ఈ విషయమునకు సారావళి ప్రమాణము, "భవనగ్రహసంయోగైః ప్రతివేశ్మానిచింతనీయాని। దేవాలయాంబుపావక కోశవిహారా ద్యవస్కరస్థానం। నిద్రాగృహంచ భాస్కరశశి కుజగురుభార్గవార్కి బుధయోగాత్." అని యున్నది.

మఱియు ఇందు జెప్పబడక లఘుజాతకమునందు మాత్రము జెప్పబడియుండు "గురురుచ్చే దశమస్థో ద్విత్రిచతుర్భూమికం కరోతి గృహం ధనుషి సిబలే త్రిశాలం ద్విశాలమన్యేషు యత్ శేషు." అను శ్లోకోక్తముగ లగ్నమునకు దశమస్థానము కర్కాటకమై అందు గురువు తన పరమోచ్ఛభాగమున వదలినవాడై యుండెనేని సూతికాగృహము రెండంతస్తులుగల ఇల్లనియు, పరమోచ్ఛభాగమును జెందబోవువాడగుచుండెనేని యా సూతికాగృహము మూడంతస్తులు గలదనియు, పరమోచ్ఛభాగస్థితుడై యుండునెడల నాలుగంతస్తుల గృహమనియు,

స్వక్షేత్రమగు ధనుర్లగ్నమునందు బలయుక్తుడై యుండెనేని మూడుశాలలు గలదనియు, ద్విస్వభావరాసులగు మిథునకన్యా మీనములలో నేదైన నొకరాశి లగ్నమునకు దశమస్థానమై యందు గురువు బలయుక్తుడై యుండునెడల సూతికాగృహము రెండుశాలలుగలదనియు, జెప్పదగును. 19

### వాసువునందు సూతికాగృహ దిశ నెరుగు యోగము.

శ్లో. మేషకుళీర తులాళిఘటైః ప్రాగుత్తరతో గురు సౌమ్యగృహేషు
పశ్చిమతశ్చ వృషేణ నివాసో దక్షిణభాగ కరౌ మృగ సింహా. 20

టీ. మేషకుళీరతులాళిఘటైః=మేష కర్కాట తులా వృశ్చిక కుంభములలో నొకటి (జన్మలగ్నమైనయెడల, ప్రాక్=తూర్పున పురిటిల్లనియు, గురుసౌమ్యగృహేశ్చ=గురు బుధ రాసులలో నొకటి జన్మలగ్న మాయెనేని, ఉత్తరతః=ఉత్తరదిక్కున పురిటిల్లనియు,వృషేణ= వృషభము జన్మలగ్నంబయ్యెనేని, పశ్చిమతశ్చ=పడమరదిక్కున, నివాసః=పురిటిల్లనియు,మృగ సింహౌ=మకరసింహములలో నొకటి జన్మలగ్నంబైన, దక్షిణభాగకరౌ = దక్షిణపుదిక్కున పురిటింటిని గలుగంజేయుదురని చెప్పవలయును.

తా. మేష కర్కాట తులా వృశ్చిక కుంభరాసులలో నొకటి లగ్నమైనయెడల ఆ ఇంటియందు తూర్పున పురిటిల్లనియు, గురుక్షేత్రములగు ధనుర్మీనములు, బుధునిరాసులగు కన్యామిథునములు, ఈ నాల్గింటియం దొకరాశి జననలగ్న మగునెడల ఉత్తరపుదిక్కున బురుటిల్లనియు, శుక్రునిరాశియగు వృషభము జననలగ్నమైనచో పడమరదిక్కున పురుటిల్లనియు, మకర సింహరాసులలో నొకటి జన్మలగ్నమైన ఆయింటియొక్క దక్షిణదిశయందు బురుటిల్లనియు నెరుంగదగినది. 20

మఱియు, నాగాశ్యంశలయందు జననమైనను నైరీతిగనే నూహింపదగినది.

### సూతికాగృహమున శయనస్థలము నెరుగు యోగము.

శ్లో. ప్రాచ్యాదిగృహే క్రియాదయో ద్వౌ ద్వౌ కోణ గతా ద్విమూర్తయః
శయ్యాస్వపి వాస్తు వద్వదే త్పాదైష్షట్ త్రినవాంత్యసంస్థితైః. 21

టీ. గృహే=(సూతికా) గృహమున, ప్రాచ్యాది=తూర్పు మొదలగు దిక్కులయందును క్రియాదయః=మేషాదిరాసులు, ద్వౌద్వౌ=రెండేసి చరస్థిరరాసులు, ద్విమూర్తయః=ద్విస్వభావరాసులు, కోణగతాః=ఆగ్నేయనైరృతాది దిగ్గతంబులును అగుచున్నవి, శయ్యాస్వపి=మంచములయందు, వాస్తువత్=శయనగృహమునకు చెప్పినట్లు, వదేత్ = చెప్పవలయును, అయితే, పాదైష్షట్ త్రినవాంత్యసంస్థితైః=౬,౩,౯,౧౨, ఈ స్థానముల రాసులచేత మంచపుకోళ్లనుజెప్పుట.

తా. చరస్థిరరాసులు ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరములుగను ద్విస్వభావరాసులు ఆగ్నేయ నైరృతి వాయువ్య ఈశాన్యములుగను విభజింపబడుటచే యీ క్రిందివిధమున శయనస్థల దిశ నెరుంగునది.

| జ న న ల గ్న ము. | ది శ. |
| --- | --- |
| మేష వృషభములలో నొకటి | తూర్పు |
| మిథునము | ఆగ్నేయము. |
| కర్కాటక సింహములలో నొకటి | దక్షిణము. |
| కన్య | నైరృతము. |
| తులా వృశ్చికములలో నొకటి | పశ్చిమము. |
| ధనుస్సు | వాయువ్యము. |
| మకర కుంభములలో నొకటి | ఉత్తరము. |
| మీనరాశి | ఈశాన్యము. |

"పాదైష్షట్ త్రినవాంత్యా సంస్థితైః." అని యుండుటవలన 6, 3, 9, 12, రాసుల ననుసరించి మంచమునకు పాదముల జెప్పవలయును. జననకాలరాశి దిశను శిరోభాగంబుగ నూహించి, లగ్న తృతీయము పూర్వపాదములలో దక్షిణపాదముగను, ద్వాదశము వామ పాదముగను, లగ్నషష్ఠమును మంచముయొక్క పశ్చిమపాదములలో దక్షిణపాదముగను, నవమము వామపాదముగను, నెరుంగదగినది. మఱియు, లగ్నద్వితీయములు మంచముయొక్క శిరోభాగములుగను, చతుర్థ పంచమములు దక్షిణభాగముగను, సప్తమాష్టమములు పాదాంత భాగంబులుగను, దశమ, ఏకాదశములు, వామభాగముగను విభజింపదగును.

ప్రయోజనము:—శుభగ్రహయుక్తము గాకయు శుభగ్రహవీక్షణ కల్గియు నుండు నట్టి ద్విస్వభావరాసులు మంచముయొక్క యేభాగమునం దుండునో ఆభాగము కొంచము వంగియుండు ననియు, శుభగ్రహసంయోగ వీక్షణాదుల గల్గియుండిన వంగియుండదనియు, పాపగ్రహయుతమగు రాసుల భాగములయం దుపఘాతముగలిగి యుండుననియు, ఆ పాప గ్రహములు స్వోచ్ఛ, స్వత్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్రాది స్థానములం దుండునెడల ఉప ఘాతము గల్గకయుండుననియు, దెలియదగినది. ఇందులకు లఘుజాతక ఉదాహరణము:— "వినతత్వం యమళర్క్షైః, క్రూరైస్తత్తుల్య ఉపఘాతః, షట్త్రినవాంత్యాః పాదాః పర్యంకాం గాదిరాశయశ్శేషాః, పర్యంకస్థిత భవనే యుతనిహగసమాని తత్ర చిహ్నాని, అస్తగణానిచ వింద్యాచ్ఛుభదృష్టియుతాని దైవజ్ఞం." అని యున్నది. సురతప్రశ్నయందు మంచపు పాద లక్షణమును, స్త్రీపురుషుల నఖదంతక్షతాది చిహ్నముల నూహించువిషయమునకు యీ శ్లోకము ఉపయోగపడుచున్నది. 21

## ప్రసూత సంరక్షణ వనితా సంఖ్యాయోగము.

శ్లో. చంద్రలగ్నాంతరగతై గ్రహైః స్స్యు రుపసూతికాః
బహి రంతశ్చ చక్రార్థే దృశ్యాదృశ్యే న్యథాపరే. 22

టీ. చంద్రలగ్నాంతరగతైః=జన్మలగ్నమునకును చంద్రునికిని నడుమనున్న, గ్రహైః= గ్రహములచేత, ఉపసూతికాః = సూతికా సమీపమందుండెడు స్త్రీలు, స్యుః = అగుదురు,

బహిరంతశ్చ చక్రార్థే=దృశ్యాదృశ్యచక్రార్థమందు ఎన్నిగ్రహంబులుండునో క్రమముగ అందరు స్త్రీలు సూతికా గృహబాహ్య ప్రదేశమందును గృహములోపలను నుందురని తెలియవలెను. అన్యథాపరే=అనఁగా కొందరు ఉక్తవ్యతిరిక్తముగా చెప్పుదురు

తా. జననలగ్నమునకును, చంద్రునకును, నడుమనున్న గ్రహసంఖ్యచే సూతిక సమీపమందున్న స్త్రీల సంఖ్య నెరుంగదగును. మఱియు, "విప్రాదితశ్శుక్రగురూ" అను శ్లోకము వలన వారి జాతిని, "బాలాబుధ శశిభౌమాః." అను వాక్యములచే వారి వయస్సును, "రక్త శ్యామో భాస్కరో గౌరఇందుః." అను వాక్యములవలన వారి వర్ణములను, "మధుపింగళ దృక్." అను వాక్యములచే వారి రూపాదులను దెలియదగును. ఈ విషయమై "శశిలగ్న వివర యుక్తాగ్రహాతుర్యశ్చోప సూతికావాచ్యాః అనుదిత చక్రార్ధయుతై రంతర్బహిరన్యథాత్వేకే, లక్షణరూప విభూషణరోగా స్తాసాంశుభై ర్యోగాత్, క్రూరై ర్విరూపదేహా లక్షణహీనా స్సరోద్రమలినాశ్చ, మిశ్రై ర్మధ్య మరూపా బలసహితై స్సర్వమే తదవధార్యం." అను సాగావళీ ప్రయోగము విశదముగానున్నది. ఇదియుగాక, "లగ్నచంద్రాంతరగత గ్రహసంఖ్యోపసూతికాః, శుభైపుణ్య స్త్రియోవాచ్యాః క్రూరైశ్చ విధరా స్తథా." అను లఘుజాతక వచనోక్తముగా లగ్నమునకును చంద్రునకును మధ్యగల గ్రహములయందు శుభగ్రహసంఖ్య ననుసరించి పుణ్యస్త్రీలసంఖ్యను, క్రూరగ్రహసంఖ్య ననుసరించి విధవస్త్రీలసంఖ్యను దెలియదగినది. ఇందు "బహిరంతశ్చ చక్రార్ధే." అని యుండుటవలన దృశ్య చక్రార్ధమునగల గ్రహసంఖ్యయే సూతికాగృహమున గల స్త్రీలు సంఖ్యగా జెప్పుదురు. కొందరు దృశ్యచక్రార్ధగత గ్రహసంఖ్య సూతికాగృహమందుగల స్త్రీలసంఖ్యయనియు, అదృశ్య చక్రార్ధమునందుండు గ్రహసంఖ్య పురిటింటి బయటనుండు స్త్రీల సంఖ్యయనియు జెప్పుదురు. ఈ విషయమై "ఉదయోడుప మధ్యస్థై ర్గ్రహైస్స్యు రుపసూతికా స్తత్ర, ఉదగర్థస్థై ర్బాహ్యాదక్షిణ గైరంతరే జ్ఞేయాః." అని జీవశర్మయు, "శశిలగ్నాంతర సంస్థగ్రహతుల్యాశ్చో పసూతికా వాచ్యాః, ఉదగర్ధస్థైః ర్భ్యంతరగాబాహ్యా శ్చక్రస్య దృశ్యార్థే." అని వరాహమిహిరాచార్యులు లఘుజాతకమునందును జెప్పియున్నారు. **22**

## శిశుస్వరూపాగలయోగము.

శ్లో. లగ్న నవాంశపతుల్య తనుస్స్యా ద్వీర్యయుత గ్రహతుల్య తనుర్వా
చంద్రసమేత నవాంశసవర్ణః కాదివిలగ్న విభక్తభ గాత్రః. **23**

టీ. లగ్ననవాంశపతుల్యతనుః, లగ్ననవాంశప=జన్మలగ్నమం దుదయించు నవాంశాధిపతికి, తుల్య=సమానమైన, తనుః=శరీరముగలవాఁడు, స్యాత్=అగును, వా=అటుగానియెడల, వీర్యయుత గ్రహతుల్యతనుః=జన్మకాలమందు లగ్ననవాంశరాశి బలయుక్తమైయుండిన తదధిపతి గ్రహసమాన శరీరుండును, చంద్రసమేత నవాంశకవర్ణః=జన్మకాలమందు చంద్రుం డేనవాంశ యందుండునో ఆ నవాంశరాశ్యధిపతియైన గ్రహమునకు సమానవర్ణము గలవాఁ డగుననియు,

చెప్పవలయును. కాదివిలగ్న విభక్తభగాత్రః-కాది=శిరస్సు మొదలు, విలగ్న=లగ్నాది ద్వాదశ భావములచేత, విభక్త=ఏర్పఱుపఁబడిన, గాత్రః=అవయవాదులు గలవాఁడును.

తా. జాతకుని జననలగ్న నవాంశరాశి బలయుతమై యుండునెడల తదధిపతికి సమానమైన శరీరముగలవాడు జాతకుఁడనియు, ఆ నవాంశరాశి బలహీనమై యుండునేని గ్రహము లన్నిటియందు నే గ్రహము బలాధికమైయుండునో ఆగ్రహ సమానశరీరుఁడు జాతకుడనియు ద్వితీయాధ్యాయమున గల "మధుపింగళ దృక్చతురశ్రతనుః." అను శ్లోకములందుగల గ్రహ స్వరూపముల ననుసరించి చెప్పవలయును. ఇందు "చంద్రసమేత నవాంశకవర్ణః." అని యుండుటవలన జననకాలమున చంద్రుఁడుండు నవాంశాధిపతియగు గ్రహమునకు "రక్తశ్యామో భాస్కరో గౌర ఇందుః." అను శ్లోకమున నేవర్ణము జెప్పబడియున్నదో యావర్ణమును జాతకునకు జెప్పవలయును. మఱియు గ్రంథాంతరవచనము. "బలినస్సదృశీమూర్తి ర్బుధ్వాజాతి కులదేశాన్." అని యుండుటవలన, జాతి, కుల, దేశముల ననుసరించి పైవర్ణాదుల జెప్పవలయును.

## అవయవ నిర్ణయము.

ప్రథమాధ్యాయమున "కాలాంగాని వరాంగ" మను శ్లోకమున మేషాదిక్రమముగ అంగ విభాగము గావించియుండురీతిగా ఇందు, "కాదివిలగ్న విభక్తభగాత్రః." అని యుండుటవలన లగ్నాది ద్వాదశభావములచే నంగ విభాగమును పూర్వ శ్లోకక్రమమున గావింపవలయును. మఱియు, "పూర్వార్ధే విషమాదయః కృతగుణాః." అను శ్లోకమురీతిగా ఏయంగము దీర్ఘరాశిగా నుండునో యాయంగము నిడుపుగానుండుననియు, హ్రస్వరాశియం దేదైను యంగము పొట్టిగ నుండుననియు, దీర్ఘరాశియందు తదధిపతిగాని యితర దీర్ఘరాశ్యధిపతిగాని యుండునెడల ఆ యంగము మిక్కిలి పొడుగుగ నుండుననియు, హ్రస్వరాశియందు, తదధిపతిగాని యితర హ్రస్వరాశ్యధిపతిగాని యుండునెడల ఆ యంగము మిక్కిలి హ్రస్వముగా నుండుననియు, దీర్ఘరాశియందు హ్రస్వరాశ్యధిపతి యుండినను, హ్రస్వరాశియందు దీర్ఘరాశ్యధిపతి యుండినను, ఆ యంగము సమమైయుండుననియు, రాశియం దనేకగ్రహము లుండునెడల. బలయుక్తగ్రహము ననుసరించియు, గ్రహములే లేకుండునెడ రాశ్యను గుణ్యముగను, అంగముల దీర్ఘహ్రస్వ సమత్వముల నిర్ణయింప వలయును. ఇందులకు, "దీర్ఘాధిపతి ర్దీర్ఘో గ్రహః స్థితోవయ దీర్ఘకృద్భవతి." అను సత్యాచార్యుల వచనము ఉదాహరణముగ నున్నది. 23

## ప్రణమశకాది యోగములు.

శ్లో. కం దృక్ఛ్రోత్ర నసాకపోల హనవో వక్త్రంచ హోరాదయ
స్తేకం ఠాంసక బాహుపార్శ్వ హృదయ క్రోడాని నాభి స్తతః
వస్తిశ్శిశ్న గుదే తతశ్చ వృషణా ఊరూ తతో జానునీ
జంఘేంఘ్రీ త్యుభయత్ర వామ ముదితై ర్ద్రేక్కాణ భాగై స్త్రిధా.24

టీ. ద్రేక్కాణభాగైః = జన్మలగ్నమం దుదయించెడు మూడు ద్రేక్కాణములను, త్రిధా = మూడువిధములుగ విభాగము చేయఁదగినది. ఉదితైః = లగ్నమునకు వెనుకనుండెడు రాసులచేత, వామం = ఎడమప్రక్కనున్న అవయవములును దెలియదగినవి. దృక్=కన్నులు, శ్రోత్ర = చెవులు, నస్ = నాసాపుటములు, కపోల = చెక్కిళ్లు: హను = చెక్కిళ్ళపై ప్రదేశము, వక్త్రం = నోరు, తేహోరాదయః = ఆలగ్నాదులు కంఠాద్యవయవములుగ విభజింపఁదగినవి. (లగ్నము) కంఠ = కంఠము, అంసక = భుజశిరస్సులు, బాహు = చేతులు, పార్శ్వ = ఇరుప్రక్కలు, హృదయ = హృదయప్రదేశము, క్రోడ = కడుపు, నాభి= బొడ్డు, (లగ్నము) వస్తిః = నాభిశిశ్న మధ్యప్రదేశము, శిశ్నగుదే= మేఢ్రగుదప్రదేశములు, ఊరు= తొడలు, జానునీ = మోకాళ్ళు, జంఘే = పిక్కలు, అంఘ్రిద్వయం = రెండుపాదములు. ఈ ప్రకారము అవయవవిభాగము చేయఁదగినది.

తా. జాతకుని యంగములలో ఏ యంగములందు వ్రణవశకాదులుండునదియు నెరుగుట కనుగుణ్యముగ, లగ్నమునందుదయించు ప్రథమ ద్రేక్కాణమునకు శిరస్సు మొదలు కంఠ పర్యంతముగల యంగములును, ద్వితీయ ద్రేక్కాణమునకు కంఠము మొదలు నాభి పర్యంతము గల అంగములును, తృతీయ ద్రేక్కాణమునకు నాభి క్రిందనుండు అంగములును ఉదితరాసులచేత నెడమప్రక్కనున్న యవయవములును, అనుదిత రాసులచేత కుడిప్రక్కనున్న యవయవములును దెలియదగినవి. అనగా.

| లగ్నరాశి | లగ్న<br>ప్రథమ ద్రేక్కాణమున<br>శిరస్సు | లగ్న<br>ద్వితీయ ద్రేక్కాణమున<br>కంఠము | లగ్న<br>తృతీయ ద్రేక్కాణమున<br>నాభి మేఢ్రముల మధ్య ప్రదేశము |
|---|---|---|---|
| 2 | కుడికన్ను | కుడిభుజము శిరస్సు | శిశ్న గుదముల కుడిభాగము |
| 12 | ఎడమకన్ను | ఎడమభుజము శిరస్సు | శిశ్న గుదములఎడమభాగము |
| 3 | కుడిచెవ్వు | కుడిచేయి | కుడివృషణము |
| 11 | ఎడమచెవి | ఎడమచేయి | ఎడమవృషణము |
| 4 | దక్షిణ నాసాపుటము | కుడిపార్శ్వము | కుడితొడ |
| 10 | వామ నాసాపుటము | ఎడమపార్శ్వము | ఎడమతొడ |
| 5 | కుడిచెక్కిలి | హృదయమునదక్షిణభాగం | కుడిమోకాలు |
| 9 | ఎడమచెక్కిలి | హృదయమునవామభాగం | ఎడమమోకాలు |
| 6 | దక్షిణహానువు | కుడికడుపు | కుడిపిక్క |
| 8 | వామహానువు | ఎడమకడుపు | ఎడమపిక్క |
| 7 | నోరు | నాభి | పాదములు |

ఈ విషయమునకు:—“ కగ్రీనవస్తి ప్రముఖాః కులాద్రిశైలాగ సంఖ్యాస్త్రివిధా దృకాద్యైః క్రమేణ కాల్యావయవాః ప్రదిష్టాః సవ్యాపసవ్యే స్వహోలగ్నభాగాత్ ముఖ్ఖాలో

చన కర్ణగంధవహానా గండౌహనూచాననం గ్రీవాస్కంధ భుజంతు పార్శ్వహృదయ క్రోడాని నాభిః పునః వస్తిర్లింగ గుదేచ ముష్కయుగళం చోరద్వయం జానునీ జంఘేపాదయుగం విలగ్న భవనాత్ పార్శ్వద్వయే కల్పితాః" అని గ్రంథాంతర వచనమున్నది.

* ఉదితరాసులు:—లగ్నమునకు 12, 11, 10, 9. 8, రాసులును లగ్న శేషము యెన్ని భాగములో అన్ని భాగములు 7-వ రాశియందును ఉదితరాసులు.

అనుదితరాసులు:—2, 3, 4, 5, 6, రాసులును ఆ జన్మలగ్నభుక్తి యెన్ని భాగములో యన్ని భాగములు 7-వ రాశియందును, అనుదిత రాసులు.

లగ్నమునకు వెనుకటి అర్థభాగపు రాసులు ఉదితరాసులు. పూర్వార్థభాగ రాసులు అనుదితరాసులు. **24**

## —: పూర్వశ్లోకోక్త అంగ విభాగ ప్రయోగము. :—

శ్లో. తస్మిన్ పాప యుతే వ్రణం శుభయుతే దృష్టేచ లక్ష్మాదిశే
త్స్వర్క్షాంశే స్థిర సంయుతేచ సహజస్స్యాదన్యథా గంతుకః
మందే శ్మానిల జోగ్ని శస్త్ర విషజో భౌమే బుధే భూ భవ
స్సూర్యేకాష్ఠ చతుష్పదేన హిమగౌ శృగ్వబ్జజో న్యైశ్శుభమ్. 25

టీ. తస్మిన్=ఆరాశి, పాపయుతే=క్రూరగ్రహయుక్తమై యుండెనేని, ఆయంగమందు, వ్రణం=కురుపును, ఆదిశేత్=చెప్పవలయును. శుభయుతే=శుభగ్రహయుక్తమైకాని,దృష్టే = శుభగ్రదృష్టమైకాని, యుండిన, లక్ష్మ=పచ్చను, ఆదిశేత్=చెప్పవలయు, స్వర్క్షాంశే=స్వక్షేత్రమందైనను స్వనవాంశయందైననుండి, స్థిరసంయుతేచ=ఆరాశి స్థిరరాశియైయుండెనేని, వ్రణాదులు, సహజః=పుట్టునపుడే కూడియుండును, అన్యథా=అటుగాక, ఆగంతుకః=ముందర క్రూరగ్రహ దశాకాలములయందు సంభవించును. మందే=శనైశ్చరుడయ్యెనేని, అశ్మానిలజః=రాతిపెట్టునగాని వాతవ్యాధివలనగాని (వ్రణాదులు) గలుగును, భౌమే=కుజుడయ్యెనేని, అగ్నిశస్త్రవిషజః=నిప్పుకత్తి సర్పాది విషములవలనగాని వ్రణమశకాదులు సంభవించును, బుధే=బుధుడు పాపగ్రహయుక్తుడైన, భూభవః=మిట్టనుండి గుంటలోబడుట, నేలయందు జారిపడుట, మంటిగడ్డ దెబ్బ తగులుట, మొదలైనవానివలన (వ్రణాదులు) సంభవించును, సూర్యే=సూర్యుడయ్యెనేని, కాష్ఠచతుష్పదేన=కట్టె నాలుగుకాళ్ల జంతువులు మొదలైన వానివలనగాని వ్రణాదులు సంభవించును. హిమగౌ=(క్షీణ) చంద్రుడయ్యెనేని, శృంగ్యబ్జజః=కొమ్ములుగల జంతువులవలనను జలచరజంతువులవలనను వ్రణాదులు సంభవించును. అన్యైః=తక్కిన శుభగ్రహముల, శుభం=ఆపదలురావని, ఆదిశేత్=చెప్పవలయును.

తా. లగ్న ప్రథమద్రేక్కాణమున బుట్టినవానికి శిరస్సుమొదలు కంఠమువరకును గల యంగములయందును, ద్వితీయద్రేక్కాణమున బుట్టినవానికి శిరస్సుమొదలు కంఠమువరకును గల యంగములయందును, తృతీయద్రేక్కాణమున బుట్టినవానికి నాభి క్రిందిభాగమున

గల యంగములయందును, విభజింపబడియుండు లగ్నాది ద్వాదశరాసులలో ఏ యంగమునకే రాశి యేర్పడునో ఆరాశి పాపగ్రహయుతమై యుండినచో ఆయంగమున, ఆగ్రహ దశాంతర్దశలయందు కురుపులు మొదలగునవి గలుగుననియు, ఆ పాపగ్రహయుక్తరాశి శుభదృష్టి కల్గి యుండినయెడలను, శుభసంయుక్తముగా నుండినను ఆ యంగమునందు మచ్చగలుగు ననియును చెప్పవలయును. ఆవ్రణమశకాదుల గలుగజేసెడు క్రూరగ్రహము స్వక్షేత్ర, స్వనవాంశ, స్థిరరాసులయం దుండునెడల కురుపులు మొదలగునవి పుట్టుకతో బుట్టినవని జెప్పదగును. ఆ పాపగ్రహము పరరాశి, పరనవాంశ యందుండి ఆ రాశి చరరాశి యయ్యేనేని కురుపులు మొదలగునవి ఏదో నొక కారణంబున తద్గ్రహ దశాంతర్దశలయందు గల్గునని జెప్పదగును.

మఱియు వ్రణ మశకాదుల గలుగజేయు గ్రహము శనైశ్చరుఁడైనచో, రాతిపెట్టుననైనను, వాతసంబంధములగు వ్యాసులవలనను, వ్రణాదులు గలుగుననియు, అంగారకుఁడైనయెడల అగ్నిహోత్రము, కత్తి, సర్పాది విషజంతువులు అను వాటియందెద్దానిచేతనైన వ్రణాదులు గల్గుననియు, క్రూరగ్రహయుక్తుడగు బుధుడగునెడల, మిట్టనుండి పల్లమునబడుట, నేలయందే జారిపడుట, గుంటిగడ్డల దెబ్బలు తగులుటయను వాట్లచే వ్రణాదులు గలుగుననియు, సూర్యుఁడైనయెడల కఱ్ఱదెబ్బలచేనైనను నాలుగుకాళ్ల జంతువుల కాళ్లు, కోరలు మొదలగువాటివలనను వ్రణాదులు గలుగుననియు, క్షీణచంద్రుఁడగునెడల, కొమ్ములుగల జంతువులవలన వ్రణాదులు గలుగుననియు జెప్పదగును. ఈ అధికారము పూర్ణచంద్ర, గురు, శుక్ర, శుభయుతబుధులకు, గల్గినయెడల వ్రణాదులు గలుగవనియు, ఆ యంగములు పుష్టి గలిగి యభివృద్ధిగ నుండుననియు దెలియదగినవి. 25

శ్లో. సమనుపతితా యస్మిన్భాగే త్రయ స్సబుధా గ్రహాభవతి
నియమా త్తస్యావా ప్తిః శుభే ష్వశుభేషువా
వ్రణకృ దశుభః షష్ఠే దేహే తనో ర్భసమాశ్రితే
తిలక మశకకృ ద్దృష్ట స్సౌమ్యై ర్యుతశ్చ సలక్ష్మవాన్. 26

టీ. యస్మిన్ భాగే = ఏభాగమందు, త్రయో గ్రహాః = మూడుగ్రహములు, సబుధాః = బుధునితోచేరి, సమనుపతితాః = ఉన్నవో, శుభేష్వశుభేషువా = అవిశుభగ్రహములైనను క్రూరగ్రహములైనను, నియమాత్ = నిశ్చయముగా, తస్య = ఆవ్రణముయొక్క, అవాప్తిః = ప్రాప్తి, భవతి = అగుచున్నది. అని పఠించి యేయంగమునందు బుధసహితములగు మూడుగ్రహములుండునో, తనోః = లగ్నమునకు, షష్ఠే = షష్ఠమందు, అశుభః = పాపుడుండెనేని, భసమాశ్రితే = తానున్నరాశిచేత నాశ్రయింపబడియున్న, దేహే = అవయవమందు, వ్రణకృత్ = వ్రణమును గలుగజేయును. వ్రణముగలుగుననియును, సౌమ్యైః = శుభగ్రహములచేత, దృష్టః = చూడఁబడెనేని, తిలకమశకకృత్ = తిలకమనఁగా నల్లమచ్చ, మశకమనగా తెల్లమచ్చ, వీనిగలుగజేయునది, భవతి = అవుచున్నది. సౌమ్యైః = శుభగ్రహములతోడ, యుతః =

కూడియుండెనేని, సః = ఆ (పుట్టిన) శిశువు, లక్ష్మవాక్ = పూర్వోక్తావయవమందు, రోమని చయాది చిహ్నముగల వాఁడగును.

తా. శరీరమున దక్షిణభాగమునందైనను, వామభాగమునందైనను,బుధునితోఁగూడ శుభగ్రహములైనను,పాపగ్రహములైనను మూఁడుగ్రహములుచేరి యానాలుగుగ్రహములు యేరాశియందుండునో యారాశికి జెప్పబడినయంగమున ఆగ్రహములలో బలాధిగ్రహ దశాకాలమున తప్పక వ్రణముగల్గునని జెప్పదగును. అనుభవమున కొందఱు "సమను పతితాయస్మిన్ గాత్రే" యనిపఠించి ఏయంగమునందు బుధునితోఁగూడ మూఁడుగ్రహములుచేరియున్నవో యాయంగమునందు వ్రణముగలుగునని చెప్పుగురు. ఇదియు యోచింపదగినది. లగ్నమునకు ఆరవయింట పాపగ్రహముండినయెడల ఆఆరవరాశి "కాలాంగాని వరాంగమనెడు" శ్లోకోక్తముగ నేయంగముగా నేర్పడునో యాయంగమునందు వ్రణముగలుగునని జెప్పదగును. ఆకూరగ్రహము స్వక్షేత్ర స్వనవాంశలందుండి ఆరాశియు స్థిరరాశియయ్యెనేని ఆయంగమున పుట్టునపుడే వ్రణముగలిగి యుండుననియు, ఆపాపగ్రహము పరరాశి పరనవాంశలయందుండి ఆరాశి చరరాశియయ్యెనేని ఆగ్రహదశాకాలమునందు వ్రణాదులు గలుగుననియు, ఆపాపగ్రహమునకు శుభవీక్ష్యముండిన ఆయంగమునందు తెల్లటిదైనను, నల్లనిదైన నగు మచ్చయుండుననియు, ఆపాపగ్రహము శుభగ్రహయుతమై యుండునెడల ఆయంగమున రోమములు దట్టముగగలిగిన మచ్చలు యుండుననియు జెప్పదగినది. 26

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
జననకాల లక్షణాధ్యాయ నామక
పంచమాధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### బాలారిష్టాధ్యాయము:—6.

జాతకుని ఆయుర్దాయమును నిశ్చయించుటకు పూర్వము, జాతకుని జన్మకాల చక్రము నందు బాలారిష్టాది దుర్యోగము లెవ్వియును లేకుండుటను యెఱుగుట ముఖ్యము. బాలారిష్టాది యోగములను, తద్భంగములను బాగుగ గమనించి చెప్పు నాయుర్దాయమే సరియైనది గాన నిందు అరిష్టయోగములు, తద్భంగములు చెప్పబడినవి.

#### బహువిధ బాలారిష్ట యోగములు.

శ్లో. సంధ్యాయాం హిమదీధితిహోరా పాపై ర్భాంతగతై ర్నిధనాయ
ప్రత్యేకం శశి పాప సమేతైః కేంద్రై ర్వా సవినాశ ముపైతి.

టీ. సంధ్యాయాం=అహోరాత్రముల సంధికాలము, హిమదీధితిహోరా=చంద్రహోర, భాంతగతైః-భ=రాసులయొక్క. అంత=అంత్యనవాంశను, గతైః=పొందియున్న, పాపైః=పాపగ్రహములచేత, నిధనాయ=శిశుమరణముకొరకు, (భవతి=అగుచున్నది). ప్రత్యేకం = వేర్వేరుగా, శశిపాపసమేతైః=చంద్రపాపగ్రహములతో గూడిన, కేంద్రైః = కేంద్రస్థానముల చేత, సః=ఆ జనించిన శిశువు, వినాశం=మరణమును, ఉపైతి=పొందుచున్నది.

* తా. 1 సంధ్యాకాలమునందు చంద్రహోరగానుండి లగ్నమున క్రూరగ్రహములు ఏరాసులయందైనను, అంత్యనవాంశలయందుండగా బుట్టిన శిశువు బ్రతుకదని తెలియదగినది.

* సంధ్యాకాలము:—దివారాత్రములకు సంధికాలము దీనినిగురించి "అర్ధాస్తమయా సంధ్యావ్యక్తీభూతానతారకా, యావత్తేజః పరిభాతి ముఖాద్భానో రర్ధోదయోయావత్." అనగా సాయంసమయమున సూర్యుని అర్ధాస్తమయము మొదలు నక్షత్ర ప్రకాశమువరకును సాయంసంధ్యయనియు, ప్రాతఃకాలమున వస్తునిశ్చయము చేయలేనిసమయమునుండి సూర్యుని అర్ధోదయమువరకును ప్రాతస్సంధ్యయని, గ్రంథాంతరమునను భరద్వాజసంహితలో "ఉదయాత్ ప్రాక్తనీ సంధ్యా ఘటికాద్వయ ముచ్యతే, సాయంసంధ్యా ద్విఘటికా హ్యస్తాదుపరి భాస్వతః." అనగా, సూర్యోదయాత్పూర్వము రెండుఘడియలు ప్రాతస్సంధ్యయనియు, అస్తమయానంతరము రెండు ఘడియలు, సాయం సంధ్యయనియు చెప్పబడెను.

2 కేంద్రస్థానములగు, 1, 4, 7, 10, యిండ్లయందు, మూడు పాపగ్రహములును, చంద్రుడును, ఒక్కొక్క స్థానమునందు ఒక్కొక్కడుగా నుండు కాలమున బుట్టిన శిశువు

త్రుతుకదని జెప్పదగినది ఇందులకు, "కేంద్రేషు సర్వేషుచ చంద్రషాపై ర్యుక్తేషు జాతో యమలోకమేతి." అని సారావళియందును, "మృత్యుః ప్రత్యేకాస్తే కేంద్రేషు శశాంక సాపైశ్చ." అని గ్రంథాంతరములయందును ఉదాహరణములున్నవి.

**శ్లో.** చక్రస్యపూర్వా పరభాగగేషు, క్రూరేషు సౌమ్యేషుచ కీటలగ్నే
క్షిప్రంవినాశం సముపైతిజాతః, పాపైర్విలగ్నా స్తమయాభితశ్చ. 2

**టీ.** క్రూరేషు=పాపులును, సౌమ్యేషు చ=శుభులును, చక్రస్య=రాశిచక్రముయొక్క, పూర్వాపరభాగగేషు=పూర్వోత్తర భాగగతులుకాగా, కీటలగ్నే=వృశ్చిక కర్కాటక లగ్నమునం దొకదానియందు, జాతః=పుట్టినశిశువు, క్షిప్రం=శీఘ్రముగానే, వినాశం= మరణమును, ఉపైతి=పొందును. విలగ్నా స్తమయాభితశ్చ-విలగ్న=లగ్నమునకును, అస్తమయ=సప్తమస్థానమునకును, అభితః=ఇరుప్రక్కలను, పాపైః=పాపగ్రహంబులుండెనేని, జాతః = పుట్టినశిశువు మరణమొందును.

తా. (3)పాపగ్రహములు రాశిచక్రముయొక్క పూర్వార్ధమునందును, సౌమ్యగ్రహములు చక్రముయొక్క ఉత్తరార్ధమునందును ఉండగా వృశ్చిక కర్కాటక లగ్నంబులలో నెద్దానియందైనను జనించినశిశువు శీఘ్రమున మరణించునని జెప్పదగినది.

ఈ శ్లోకమునగల కీటశబ్దమునకు వృశ్చిక కర్కాటకములని యర్థము. ఈ విషయమై. "పూర్వాపరస్థైరశుభై స్సౌమ్యై రళికర్కటేలగ్నే జాతస్య శిశోర్మరణం సద్యః కథయంతి యవనేంద్రాః." అను బాదరాయణవచనము ఉదాహరణముగ నున్నది కొందఱు, "చక్రస్య పూర్వభాగే పాపాసౌమ్యా స్తదోత్తరార్ధేచ, వృశ్చికలగ్నే జాతాగతా యుషోమృత్యరోగేస్యుః." అను యవనేశుని వచనానుగుణ్యముగ కీటశబ్దమునకు వృశ్చికలగ్నమునుమాత్రము చెప్పుదురుగాని కర్కాటకలగ్నమును గూడ జెప్పటు తగును.

[లగ్నశేష మెన్నిభాగములో యన్నిభాగములు 10-వ స్థానమునందును, 11, 12, 1, 2, 3, స్థానములును, లగ్నభుక్తి యెన్నిభాగములో యన్నిభాగములు 4-వ స్థానమునను గలది. ద్వాదశరాశి చక్రముయొక్క పూర్వార్ధమనియు, లగ్నముయొక్క నాల్గవరాశియందు మిగిలిన భాగములును, 5, 6, 7, 8, 9, రాసులును, లగ్నభుక్తి యెన్నిభాగములో యన్నిభాగములు 10-వ రాశియందును గలది, రాశిచక్రముయొక్క ఉత్తరార్ధమనియు విభజింపబడియున్నది.]

(4) లగ్న సప్తమస్థానముల పార్శ్వములందనగా, లగ్నపార్శ్వములగు ద్వితీయ ద్వాదశములందైనను, సప్తమ స్థానపార్శ్వములగు షష్టాష్టమములందైనను, ఉండు పాపగ్రహములు శుభగ్రహ యుక్తములుగాకయుండినయెడల తత్కాలమున బుట్టిన శిశువు శీఘ్రముగ మరణించునని జెప్పదగును. ఈ విషయమునకు:—"లగ్నా ద్వాదశధనగైః పాపైర్మ్రియతేచ రంధ్ర రిపుసంస్థైః, శుభసంపర్క మయాతై ర్నాసేమ ష్వేష్టమేవాపి." అను దేవశర్మ వచనమున్నది. మఱియు, "గ్రహేషు లగ్నాభిముఖేషు సర్వేష్వవాప్త షీర్యేషుస్వవర్గ గేషు."

అను భట్టోత్పలుని వచన ముండుటవలన, లగ్నాభిముఖులును, సప్తమాభిముఖులును, అని యూహింపవలసినది. ఈవిషయమున కొందఱు పంద్రెండవరాశియందుండు గ్రహము లగ్నాభిముఖుడనియూ ఆరవ యింటియందుండు గ్రహము సప్తమాభి ముఖుడనియు, నిశ్చయించి లగ్నమునకు 6, 12, యిండ్లయందు పాపగ్రహములుండగా బుట్టిన శిశువు మృతినొందునని చెప్పుదురు. మఱికొందఱు, లగ్నమునకు ద్వితీయమునందుండు గ్రహము లగ్నాభిముఖుడనియు, లగ్నాష్టమమందుండు గ్రహము సప్తమాభిముఖుడనియు నూహించి, ద్వితీయాష్టమములయందు పాపగ్రహము లుండునెడల బాలారిష్టము తప్పకకల్గునని చెప్పుదురు. ఇందులకు:—"రిపువ్యయ గతైఃపాపైః, ర్యదివాధన మృత్యుగైః, లగ్నేవా పాపమధ్యస్థే మ్యానేవా మృత్యుమాప్నుయాత్." అను గార్గివచనము, విశదముగా దెలియుచున్నది. 2

శ్లో. పాపా ఉదయాస్తగతౌ క్రూరేణ యుతశ్చ శశీ
దృష్టశ్చ శుభైర్నయదామృత్యుశ్చ భవేద చిరాత్. 3

టీ. పాపౌ=రెండు పాపగ్రహములు, ఉదయాస్తగతౌ=లగ్నమందొకటియు, సప్తమమందొకటియునైయుండి, శశీ=చంద్రుఁడు, క్రూరేణ=పాపగ్రహముతో, యుతః=కూడినవాఁడై, యదా=ఎప్పుడు, శుభైః=శుభగ్రహములచే, నదృష్టః=చూడఁబడడో అపుడు, అచిరాత్=శీఘ్రముగా, మృత్యుః=మరణము, భవేత్=కలుగును.

తా. (5) జననలగ్నమునం దొక పాపగ్రహమును, లగ్నమునకు సప్తమస్థానమున మఱియొక పాపగ్రహమును యుండి, ఏరాశియందైనను, చంద్రుఁడు పాపయుక్తుడై, శుభగ్రహవీక్షణ లేకుండెనేని ఆశిశువు శీఘ్రముగ మరణించునని చెప్పదగినది. మఱియు అనుభవజ్ఞులు కొందఱు పాపయుక్తుడు గాకయుండు చంద్రుని శనైశ్చరుడు చూచుచుండిన యెడల బాలారిష్టము గలుగునందురు. 3

శ్లో. క్షీణే హిమగౌ వ్యయగే పాపై రుదయాదష్టమగైః
కేంద్రేషు శుభాశ్చనచేత్ క్షిప్రం నిధనం ప్రవదేత్. 4

టీ. క్షీణేహిమగౌ=క్షీణచంద్రుఁడు, వ్యయగే=ద్వాదశమందుండఁగా, పాపైః=పాపులు, ఉదయాష్టమగైః=లగ్నాష్టమములందుండఁగా, కేంద్రేషు=కేంద్రస్థానములందు, శుభాః=శుభగ్రహములు, నయది=లేకుండెనేని (శిశువునకు), క్షిప్రం=శీఘ్రముగా, నిధనం=మరణమును, ప్రవదేత్=చెప్పవలయు.

తా. (6) క్షీణచంద్రుడు లగ్నద్వాదశమునందును, పాపగ్రహములు లగ్నాష్టమములయందుండి, కేంద్రములగు 1, 4, 7, 10, స్థానములందు శుభగ్రహములు లేనికాలమున పుట్టిన శిశువు శీఘ్రమున మరణించును. ఈ యోగమున పాపగ్రహములు లగ్నాష్టమములందు లేకుండినను బాలారిష్టము కలుగునని కొందఱందురు. అనుభవమునుబట్టి లగ్నద్వాదశమందుండు క్షీణచంద్రుని, శనైశ్చర, అంగారకులు చూచుచుండిరేని. లగ్నాష్టమములయందు పాపగ్ర

హములు లేకున్నను బాలారిష్టము తప్పక కల్గునని తెలియదగినది. ఈ విషయమునకు "క్షీణే చంద్రే వ్యయగతైః పాపైరష్టమ లగ్నగైః, కేంద్ర బాహ్యగతైస్సౌమ్యైః క్షాతస్య నిధనం భవేత్." అను గార్గివచనము విశదముగా దెలియుచున్నది.                                        4

శ్లో. క్రూరసంయుత శ్శశీస్మరాంత్య మృత్యులగ్నగః
కంటకాద్బహిశ్శుభై రవీక్షితశ్చ మృత్యుదః.                                        5

టీ. క్రూరసంయుతః = పాపగ్రహ యుక్తుడగు, శశీ = చంద్రుడు, స్మరాంత్య మృత్యులగ్నగః = సప్తమద్వాదశాష్టమ జన్మలగ్నములలో నొకచోటనుండి, కంటకాత్ = కేంద్రస్థానములకంటె, బహిః = వెలుపలి, శుభైః = శుభగ్రహములచేత, అవీక్షితః = చూడఁబడనివాఁడయ్యేనేని, మృత్యుదః = శిశువునకు మరణము నిచ్చును.

తా. (7) పాపగ్రహసంయుక్తుడగు చంద్రుడు, 1, 7, 8, 12 యిండ్లలో నెందేనియుండి, కేంద్రములుగాని స్థానములనుండు, శుభగ్రహములచే జూడబడకుండిన యెడల, శిశువునకు శీఘ్రమున మరణము నిశ్చయము, ఇందు "కంటకాద్బహిశ్శుభై" అని మాత్రము యుండుట వలన కేంద్రస్థానములందు బలయుక్తులగు శుభగ్రహములుండు నెడల పైయోగమునకు, భంగము గల్గునని యూహింపదగినది                                        5

ఈ విషయమై:—"వ్యయాష్ట సప్తోదయగె, శశాంకేపాపై స్సమేతే, శుభదృష్టిహీనే, కేంద్రేషు సౌమ్యగ్రహవర్జితేషు, జాలస్యసద్యః కురుతేప్రణాశం" అని సారావళి ప్రమాణముగమున్నది.

శ్లో. శశిన్యరి వినాశగె సధనమాశు పాపేక్షితేశుభై
రధనమాష్టకం దళమతశ్చ మిశ్రైస్థితిః
అసద్భిరవలోకితే బలిభిరత్రమాసం శుభే
కళత్ర సహితేచ పాపవిజితే విలగ్నాధిపే                                        6

టీ. అరివినాశగే = షష్ఠాష్టమములలో నొకచోట, శశిని = చంద్రుండు పాపేక్షితే = పాపగ్రహములచేత చూడఁబడెనేని పుట్టినశిశువునకు, ఆశు = వేగమే, నిధనం = మరణము గలుగును, శుభైః = ఆచంద్రుఁడు శుభగ్రహములచేత జూడఁబడుచుండిన ఆశిశువునకు, సమాష్టకం=ఎనిమిదేండ్లు, స్థితిః = జీవించుటగలుగును, మిశ్రైః= శుభాశుభగ్రహ దృష్టితమైన యెడ, అతః= ఈయెనిమిది సంవత్సరములలో, దళం (అర్ధభాగము) నాలుగుసంవత్సరములు, *స్థితిః = జీవించియుండును, అత్ర = ఈషష్ఠాష్టమములయందు, శుభే = శుభగ్రహముండి, బలిభిః = బలవంతములైన, అసద్భిః = పాపగ్రహములచేత, అవలోకితేసతి = చూడఁబడుచుండఁగా పుట్టిన, (శిశువునకు) మాసం = ఒకమాసము, స్థితిః = బ్రతుకుటకలుగును, విలగ్నాధిపే = లగ్నాధిపతి, పాపవిజితే = పాపగ్రహముచే గెలువఁబడినవాఁడై, కళత్రసహితే = సప్తమమందుండగా, శిశువొక్క మాసముమీద జీవింపఁడు,

తా॥ (8) జన్మలగ్నముయొక్క షష్ఠాష్టమము లందెందేని నుండు చంద్రునకు, పాపగ్రహ వీక్షణ్యముండి, శుభగ్రహ దృష్టిలేకుండిన యెడల, ఆశిశువు జననమైన నెలలోపల మరణించును. 6

(9) ఆషష్ఠాష్టమములలో నొక్కడనున్న చంద్రుడు, శుభగ్రహ వీక్షణము మాత్రముగల్గియుండెనేని, జాతకుడు, పుట్టినది మొదలు 8 వత్సరములవరకు జీవించును.

(10) లగ్నమునకు, 6, 8, యిండ్లయందున్న చంద్రుని శుభగ్రహములును, అశుభగ్రహములును చూచుచుండగా బుట్టిన శిశువు, 4 సంవత్సరములు మాత్రము జీవించును,

[పైకనుబరచిన, 8, 9, 10, మూడు యోగముల కనుగుణ్యముగ, "వర్షేణషష్ఠాష్టమగశ్శశాంకో నిహంతి మాసాదశుభైశ్చదృష్టః, అబ్దాష్టకాత్కేవల సౌమ్యదృష్టో మిశ్రేక్షితో వర్ష చతుష్టయేన" అని సారావళి ప్రయోగమున్నది]

(11) లగ్నమునకు షష్ఠాష్టమములలో నొకటి పాపక్షేత్రమైయుండి, ఆపాపక్షేత్రమున నున్న చంద్రుడు పాపగ్రహదృష్టికల్గియుండిన యెడల ఆశిశువుపుట్టిన తోడనే మరణించునని నూహింపదగనది.

(12) షష్ఠాష్టమ స్థితుడగు చంద్రుడు శుభగ్రహ క్షేత్రములందుండినను, పాపక్షేత్రములందు శుభయుక్తుడైయుండినను, శుభగ్రహ వీక్షితుడైయుండినను శిశువునకు మరణము గలుగదని చెప్పదగినది.

ఈ విషయమై, భట్టోత్పలవ్యాఖ్యానమున "షష్ఠాష్టమములందున్న చంద్రుడు శుభాశుభగ్రహములలో నేగ్రహముచేతనైనను జూడబడకయుండినచో బాలారిష్టము గలుగదనియున్నది." అయినది, సారావళీ ప్రయోగమునకు, భేదించుచున్నది. సారావళీ ప్రయోగమున, షష్ఠాష్టమ స్థితచంద్రునకు ఏగ్రహవీక్షణ్యమును లేకుండు నెడల తత్కాలమున జనించిన శిశువు ఒక సంవత్సరమువరకు జీవించుననియు, పాపులచే జూడబడెనేని ఒక నెలవరకు మాత్రము జీవించుననియు దెలియుచున్నది. ఇదియుగాక "పక్షేసితే భవతిజన్మ యదిక్షపాయాం కృష్ణేధవాహని శుభాశుభ దృశ్యమానః, తచ్చంద్రమారిపు వినాశగతోపి యత్నాదాపత్స్యరక్షతి పితేవ శిశుం నహంతి" అనుమాండవ్యుని వచనోక్తముగ శుక్లపక్షపు రాత్రియందును, కృష్ణపక్షపు పగటియందును, బుట్టిన శిశువును, చంద్రుడు, షష్ఠాష్టమముల యందుండినను, శుభగ్రహవీక్షణ మాత్రముగలిగి యుండినచో ఆపదలు గలుగనీయక తండ్రివలె రక్షించునని చెప్పియుండుటవలన, ఈ యరిష్టయోగము, శుక్లపక్షపు పగటియందును, కృష్ణపక్షపు రాత్రియందును జన్మించిన వారికి మాత్రమే గలుగునని యూహింపదగినది.

(13) జననలగ్నము యొక్క, 6, 8, యిండ్లయందు. శుభగ్రహములుండి, బలీయులగు క్రూరగ్రహములచే జూడబడుచుండిన యెడల, తత్కాలమున జనించిన శిశువునకొకమాసకాలము మాత్రమే, ఆయువును నిశ్చయింపదగినది. ఆ శుభగ్రహమునకు యితర శుభగ్రహ వీక్షణ ముండినను, అరిష్టభంగము నిశ్చయము.

ఇందులకు:—“శశివత్సామ్యాః పాపైర్వక్రిభిరాలోకితా నశుభదృష్టాః, మాసేనమరణ మాస్యుః, పాపజితో లగ్నపశ్చాసే.” అనియు, “సౌమ్యాష్టషష్ఠమగాః క్రూరైర్వక్రోపగతై దృష్టాః మాసెనమృత్యుదా స్తేయది నశుభై స్తత్రసందృష్టాః.” అనియును గ్రంధాంతరములయందు జెప్పబడియున్నది

(14) జన్మలగ్నాధిపతి, పాపగ్రహములచే యుద్ధమునందు అపజయము గల్గినవాడై, సప్తమస్థానమునందుండగా జనించిన శిశువు ఒక్కమాసమున కధికముగా జీవింపదని చెప్పవలయును.

శ్లో. లగ్నక్షీణే శశిని నిధనం రంధ్రకేంద్రేషుపాపైః
పాపాంతస్థేనిధనహిబుకద్యూన యుక్తేచచంద్రే
ఏవంలగ్నే భవతి మదనచ్ఛిద్రసంస్థైశ్చపాపై
ర్మాత్రాసార్థం యదిచనశుభై ర్వీక్షితశ్శక్తిమద్భిః. 7

టీ. క్షీణేశశిని = క్షీణచంద్రుఁడు, లగ్నే = (జన్మ) లగ్నమందుండఁగా, రంధ్రకేంద్రేషు = అష్టమ కేంద్రస్థానములయందుండెడు, పాపైః = పాపులచేత శిశువునకు, నిధనం = మరణముగలుగును. నిధనహిబుకద్యూనయుక్తే = అష్టమచతుర్థసప్తమములలో నొకచోనున్న, చంద్రే = చంద్రుఁడు, పాపాంతస్థే = పాపద్వయమధ్యగతుండౌచుండఁగ జనించినశిశువు మరణించును, ఏవం = ఈ ప్రకారముగానే, లగ్నే = లగ్నమందు, శక్తిమద్భిః = బలవంతులైన, శుభైః = శుభగ్రహములచేత, నవీక్షితః = చూడఁబడనివాఁడైయుండిన, మదనచ్ఛిద్రసంస్థైః = సప్తమాష్టమములయందున్న, పాపైః = పాపగ్రహములచేత, మాత్రాసార్థం = తల్లితోఁగూడ, (శిశువునకు) మరణముగలుగును.

తా. (15) జననలగ్నమునందు క్షీణచంద్రుఁడుండి, కేంద్రస్థానములగు, 1-4-7-10 యిండ్లయందును, రంధ్రస్థానమనబడు, 8 వ యింటియందును పాపగ్రహములుండిన యెడల, పాపగ్రహదృష్టి గలుగుటచె శిశువునకు శీఘ్రమున మరణమును జెప్పదగినది. 7

(16) చంద్రుఁడు లగ్నమునకు అష్టమస్థానమున నుండి, ఇరుప్రక్కల అనగా, 7-9 రాసులయందు, పాపగ్రహములున్న యెడల బాలారిష్టముగలుగును.

(17) చంద్రుఁడు లగ్నమునకు 4 వ రాశియందుండి, 3-5 యిండ్లయందు పాపగ్రహములుండు నెడల, బాలారిష్టము గలుగును.

(18) చంద్రుఁడు లగ్నమునకు 7 వ రాశియందుండి, 6-8 యిండ్లయందు పాపగ్రహములుండు నెడల బాలారిష్టము గలుగును.

## మాతృసహిత శిశుమరణ యోగము.

(19) చంద్రుఁడు జన్మలగ్నమునందు పాపగ్రహమధ్యగతుఁడై శుభగ్రహములచేత జూడబడక, సప్తమాష్టమములనుండు పాపగ్రహములచే జూడబడుచుండెనేని, తల్లియు, బిడ్డ

రము, మృతినొందుదురని చెప్పదగినది, మఱియు అనుభవజ్ఞులు కొందరు, చంద్రుఁడు ద్వాద శమున శనైశ్చరదృష్టి గలిగియుండి, చంద్రదశయందే జనన కాలమైన యెడల, శిశువునకు శీఘ్రముగ మాతృసహిత మరణమును చెప్పదగుననియు, చెప్పుచున్నారు అయినను చంద్రుఁ డు శుభగ్రహములచే జూడబడుచుండిన యెడల శిశువునకు మాత్రము మరణమని కొందఱు ను, మాతృకారకుఁడును, లగ్నస్థితుడును గనుక, మాతకును, శిశువునకును, వ్యాధిగలుగు నేగాని మరణము గలుగదని మఱికొందఱు దైవజ్ఞులు వచించుచున్నారు.

శ్లో. రాశ్యంతగేసద్భిరవీక్ష్యమాణే
చంద్రే త్రికోణోప గతైశ్చపాపైః
ప్రాణైః ప్రయాత్యాశు శిశుర్వియోగ
మస్తే తు పాపైస్తు హిమాంశులగ్నే. 8

టీ. రాశ్యంతగే = ఏరాశియందైనను, చంద్రే = చంద్రుఁడు, సద్భిః = శుభగ్రహము లచేత, అవీక్ష్యమాణేసతి = చూడఁబడకయుండఁగా, త్రికోణోపగతైః = పంచమనవమములను బొందిన, పాపైః = పాపగ్రహములచేత, శిశుః = పుట్టినశిశువు, ఆశు = వేగమే, ప్రాణైర్వి యోగం = మరణమును, ప్రయాతి = పొందును. తుహినాంశులగ్నే = చంద్రుఁడులగ్న మునందుండఁగ, అస్తే = సప్తమమందున్న, పాపైః = పాపగ్రహములచేత, శిశువు మరణించును.

తా. (20) ఏరాశియందైనను, అంత్యనవాంశయగు నవమనవాంశయందు చంద్రుడుం డి, శుభగ్రహ వీక్షితుఁడుగాక యుండగా, లగ్నముయొక్క త్రికోణ రాసులగు, పంచమ, నవమముల యందు పాపగ్రహములుండు నెడల, ఆపాపగ్రహములచే శిశువునకు శీఘ్రముగ మరణమును చెప్పదగినది. 8

(21) చంద్రుఁడు జననలగ్నమునందుండి, సప్తమమున పాపగ్రహములున్నయెడల బాలారిష్టము, తప్పక గల్గునని యూహింపదగినది. ఇందు, తుహినాంశులగ్నమనగా, కర్కా టకమని "ఉదయగతో వా చంద్రస్సప్తమరాశిస్థితైః పాపైః" అను లఘు జాతక ఉదాహర ణోక్తముగా చెప్పుచున్నారు. గాన రెండువిధముల యోజింపదగును.

## ప్రహణకాల జనిత బాలారిష్టయోగములు.

శ్లో. అశుభసహితే గ్రస్తే చంద్రే కుజే నిధనాశ్రితే
జననిసుతయోర్మృత్యుర్లగ్నే రవౌతుసశస్త్రజః
ఉదయతిరవౌ శీతాంశౌవా త్రికోణ వినాశగై
ర్నిధనమశుభై ర్వీర్యోపేతైః శ్శుభైర్నయుతేక్షితే. 9

టీ. అశుభసహితే = పాపగ్రహంబగు (శనితోఁ) గూడిన, చంద్రే = చంద్రుండు. లగ్నే = లగ్నగతుఁడై, గ్రస్తే = రాహువుచే పట్టుబడుచుండఁగా, కుజే = అంగారకుఁడు, నిధనాశ్రితే = అష్టమమందుండె నేని, జననిసుతయోః = మాతాసుతులకు, మృత్యుః = మరణ

ము (కలుగును,) రవౌ = సూర్యుఁడు, జన్మలగ్నమందు అశుభగ్రహ యుక్తుఁడై రాహుగ్రస్తుఁడై యుండఁగా కుజుండష్టమమందుండిన, జననీసుతయోః = తల్లిబిడ్డలకు, శస్త్రజః = ఆయుధమువలన, మృత్యుః = మరణము (గలుగును) వీర్యోపేతైః = బలయుక్తములైన, శుభైః = శుభగ్రహములతో, అయుతేక్షితే = కూడకయు శుభగ్రహములచేతఁ జూడఁబడకయుండినేని, రవౌ = సూర్యుఁడుగాని, శీతాంశౌవా = చంద్రుఁడుగాని, ఉదయతిసతి = లగ్నగతుఁడై యుండఁగా, త్రికోణవినాశగైః = నవమపంచమాష్టమములను బొందియున్న, అశుభైః = పాపగ్రహములచేత, నిధనం = మరణము, (గలుగును.)

## చంద్రగ్రహణ కాలజనిత బాలారిష్టయోగము.

శా. (22) పాపగ్రహమగు శనైశ్చరునితో గూడిన చంద్రుఁడు, లగ్నమందుండి, రాహుగ్రస్తుడగుచుండగా, లగ్నమునకు, అష్టమస్థానమున అంగారకుడుండు కాలమున జనించిన శిశువుతోగూడ తల్లియు మృతినొందును. 9

ఈ శ్లోకమున "అశుభసహితే" అనియుండుటచే నిచ్చట పాపగ్రహము శనియని యేర్పడుచున్నది. ఎట్లనగ, చంద్రగ్రహణకాలమునందు, సూర్యుడు చంద్రునితో చేరఁడు. బుధుడునుగూడడు. బుధుడు పాపయుక్తుడు గాకయు, సూర్యునకు సమీపముననుండుటచే చంద్రునితో గూడుటకు వీలులేదు. అంగారకుడు, అష్టమస్థానమున నుండవలెనుటచే లగ్నగతుఁడగు చంద్రునితో చేరుటకు వీలులేదు. గాన, శనైశ్చరుడే చంద్రయుక్తుడుగా నుండవలెనని నిశ్చయింపబడినది

## సూర్యగ్రహణ కాలజనిత బాలారిష్టయోగము

(23) జననలగ్నమున సూర్యుఁడుండి, బుధశనులలో నొక్కనిగూడి, రాహుగ్రస్తుఁడగుచుండగా, లగ్నమునకు అష్టమస్థానమున అంగారకుండుండెనేని తత్కాలమున జనించిన శిశువునకును తల్లికిని శస్త్రములవలన మరణము గలుగును, అష్టమస్థానమున నుండదగు అంగారకుడు లగ్నగతుడగు సూర్యునితో గూడుటకు వీలుగాదు. సూర్యునితో గూడుటచే బుధుఁడును పాపియగుటవలన, బుధునితోనైనను, శనైశ్చరునితోనైనను గూడిన, సూర్యుడని యీ యోగమున నిశ్చయించ వలెను.

(24) బలీయులగు సౌమ్యగ్రహసంయుక్తతయు, వీక్షణమును గలుగక, సూర్యుడైనను, చంద్రుడైనను లగ్నమునందు యుండి, లగ్నమునకు నవమ పంచమాష్టస్థానములయందు పాపగ్రహములుండిరేని తత్కాలమున జనించిన శిశువును తల్లియు మరణమునొందుదురు. ఈవిషయమై "పాపాస్త్రికోణాష్టమగావిసౌమ్యా, శ్చందోఽతనాభా స్వతివాంతయాయ." అని దేవశర్మ చెప్పియున్నాఁడు.

ఇచ్చట లగ్నగతుఁడగు సూర్యుడైనను చంద్రుఁడైనను బలవంతులగు శుభగ్రహయుత వీక్షణములు గల్గియుండినచో మరణము కలుగదని యూహింపవలసినది.

శ్లో. అసిత రవి శశాంకభూమి జైర్వ్యయ నవమోదయ నైధనాశ్రితైః
భవతి మరణ మాశు దేహినాం యదిబలినా గురుణానవీక్షితాః. 10

టీ. వ్యయనవమోదయ నైధనాశ్రితైః = ద్వాదశనవను లగ్నాష్టమములను పొంది యున్న, అసితరవిశశాంక భూమిజైః = శని సూర్య చంద్ర కుజులు, బలినా = బలయుక్తుండైన, గురుణా=బృహస్పతిచేత, నవీక్షితాయది=చూడఁబడకుండిరేని, దేహినాం = శిశువులకు, ఆశు= వేగమే. నిధనం=మరణము, భవతి కలుగుచున్నది.

తా. (25) ద్వాదశ, నవమ లగ్నాష్టమములయందు క్రమముగా శనైశ్చర సూర్య చంద్రాంగారకులుండి బలయుతుడగు బృహస్పతిచే జూడబడకుండిరేని బాలారిష్టము శీఘ్రమున గల్గుచున్నది. బృహస్పతి ఆ శని రవి చంద్ర కుజులలో కొందరినిమాత్రము చూచుచుండినను, బలహీనుడై ఆనాలుగు గ్రహముల జూచుచుండినను, కొంతకాలమునకు పైన శిశు మరణము జెప్పదగును. మఱియు బృహస్పతి బలియుడై లగ్నముయొక్క పంచమస్థానమునందుండి పై నాలుగు గ్రహములను జూచుచుండెనేని శిశువునకు అరిష్టములేదని వచింపవలెను

మఱియు త్రికోణకేంద్రముల బొందిన గురు, శుక్ర, బుధులు, దోషరహితులై క్రూరగ్రహావీక్షితులుగాక యుండినను, ఆ త్రికోణ, కేంద్రస్థానములు పాపగ్రహారాసులై అందు గురుశుక్రబుధు లుండినను ఈ అరిష్టయోగమునకు భంగము గలుగుచున్నది. జన్మ లగ్నమునకు శనైశ్చరుడు బలియుడై గురువుచే చూడబడుచుండెనేని రుగ్మత గలుగునుగాని మరణము గలుగదని చెప్పవలెను. 10

శ్లో. సుతమదన నవాంత్య లగ్నరంధ్రే
ష్వ శుభయుతో మరణాయ శీతరశ్మిః
భృగుసుత శశిపుత్ర పూజ్యై
ర్యయది బలిభి ర్నయుతో వలోకితోవా. 11

టీ. అశుభయుతః=పాపగ్రహముతోఁ గూడిన, శీతరశ్మిః=క్షీణచంద్రుఁడు, సుతమదనవాంత్య లగ్నరంధ్రేషు=పంచమ సప్తమ నవమ ద్వాదశ లగ్నాష్టమములయందుండి, బలిభిః=బలవంతులయిన, భృగుసుతశశిపుత్ర దేవపూజ్యైః=శుక్ర బుధ గురువులలో నొకనితోఁడ, యుతః=కూడినవాఁడును, అవలోకితోవా=చూడబడినవాడును, నయది=కాకయుండెనేని, మరణాయ=(శిశు) మరణము, భవతి=అగుచున్నాడు.

తా. పాపగ్రహయుతుడగు క్షీణచంద్రుడు పంచమ, సప్తమ, నవమ, ద్వాదశ, లగ్నాష్టమములయందుండి బలియులగు శుక్ర, గురు, బుధ యుతుఁడుగాకయు దృష్టుఁడుగకయు నుండెనేని శిశువునకు మరణము కలుగుననవలెను.

(26) క్షీణచంద్రుడు ౕ-వ యింటు నుండి బలవంతులగు శుక్ర గురు బుధులను గూడక వారిచే చూడబడక యుండుట యొక అరిష్టయోగము.

(27) పైరీతిగ క్షీణచంద్రుఁడు 7-వ యింటనుండుట.

(28) పైరీతిగ క్షీణచంద్రుఁడు 9-వ యింట నుండుట.

(29) క్షీణచంద్రుఁడు పై విశేషములతో 12-వ యింటనుండుట.

(30) " " లగ్నమునందుండుట

(31) " " 8-వ యింటనుండుట.

25 మొదలు 30 యోగముల వరకగు ఆరు యోగములవరకును కర్తయగు క్షీణచంద్రునకు బలీయులగు బుధ, గురు, శుక్రులలో నొకరి సంయోగముగాని, చూపుగాని గల దేని బాలారిష్టదోషము గలుగదనుట నిశ్చయము. అనుభవజ్ఞులు కొందరు క్షీణచంద్రుఁడు సప్తమమునందైనను, త్రికోణములయందైనను యుండి గ్రహవీక్షణమే లేక యుండినప్పుడల అరిష్టమునకు భంగము గలుగించుచున్నారు. పై ఆరు యోగముల కనుగుణ్యముగ:—"ధనా స్త వ్యయలగ్న త్రికోణగాః క్షీణచంద్ర సంయుక్తాః। పాపా బలిన శ్శుభయైర్న దృశ్యాశ్చావా గతాయుషం కుర్యుః" అని సారావళియందు చెప్పబడియున్నది. 11

## అధికసారశ్లోకము.

శ్లో. భౌమేవిలగ్నే శుభదైరదృష్టే, షష్ఠేష్టమేవార్కి సుతేనయుక్తే
తావస్తసంస్థా శుభదృష్టిహీనౌ, జాతస్యసద్యః కురుతేప్రణాశమ్.

టీ. భౌమేవిలగ్నే=కుజుఁడులగ్నమందుండి, శుభైరదృష్టే=శుభులు చూడకుండినను, షష్ఠేష్టమేవార్కిసుతేనయుక్తే=ఆరవ యింటగాని, ఎనిమిదవ యింటగాని శనియుండినను, తావస్తసంస్థౌ శుభదృష్టిహీనౌ=ఆ అంగారకశనులు సప్తమమున సౌమ్యగ్రహ వీక్షణము లేనివారైనను, జాతస్యసద్యః కురుతేప్రణాశం=శిశువు పుట్టినవెంటనే చచ్చును.

తా. (32) జన్మలగ్నమునందు అంగారకుఁడుండి, శుభగ్రహయుక్తుడు గాకయు వీక్షితుడుగాకయు, నుండగా శనైశ్చరుడు లగ్నమునకు 6-8 యిండ్లలో నెందైన నుండిన యెడల శిశువు పుట్టినవెంటనే చనిపోవును, మఱియు,

(33) ఆ అంగారక శనైశ్చరులు సప్తమమునందు శుభగ్రహములచే జూడబడనివారైనను, శిశువునకు సద్యోమరణమును జెప్పదగును. 12

## అరిష్టకాలపరిమితి.

శ్లో. యోగేస్థానం గతవతి బలినశ్చంద్రే స్వంవా తనుగృహ మథవా
పాపైర్దృష్టే బలవతిమరణం వర్షస్యాంతే కిలమునిగదితమ్. 13

టీ. యోగే=(ఈచెప్పఁబడిన) యోగములలో, బలినః=బలాధికమైన గ్రహముయొక్క, స్థానం=స్థానమును, వర్షస్యాంతే=ఒక సంవత్సరమునకులోపల, పాపైః=అనేకపాపగ్రహముల చేత, దృష్టే=చూడబడియున్న, బలవతి=బలవంతుఁడైన, చంద్రే=చంద్రుఁడు, గతవతిసతి=

పొందుచుండఁగా, మరణం=(బాలారిష్టము) చావు, మునిగదితం=ఋషులచే చెప్పఁబడెను. స్వంవా=జన్మకాలమందు పాపదృష్టుఁడై బలవంతుఁడైయున్న చంద్రుఁడు తానున్న రాశినైనను, అథవా తనుగృహం=జన్మలగ్నరాశినైనను (పొందుచుండఁగా), బాలారిష్టముగలుగును.

తా. పైఁ జెప్పబడిన 32 బాలారిష్టయోగములలో అరిష్టకాలమును నిర్ణయింపని యోగములకు చంద్రసంచారముచే కాలనిర్ణయము జేయదగినది. అరిష్టయోగముల కలుగజేసెడి గ్రహములయందు బలయుక్తగ్రహము జన్మకాలమునందు, ఏరాశియందుండునో ఆరాశిని చంద్రుఁడు బహు పాపగ్రహములచే చూడబడుచు, బలవంతుఁడై, సంవత్సరములోపల జేరునప్పుడైనను, జననకాలమునందు చంద్రుఁడు ఏరాశియందుండెనో ఆరాశిని తాను పాపదృష్టుఁడై, బలియుఁడై, మరల సంవత్సరములోపల నెప్పుడు జెందుచున్నాడో అప్పుడైనను జననలగ్నమును, ఉక్తవిశేషణ విశిష్టుఁడైన చంద్రుఁ డెప్పుడు జేరుచున్నాడో ఆ కాలముననైనను, శిశువునకు మరణమును నిశ్చయింపదగినది. ఇందులకు:—“బలిగ్రహస్థానగతే శశాంకే జన్మాగతేవా తనుమాగతేవా, సమగ్రవీర్యే బహుపాపదృష్టే వర్షాత్పురామృత్యు రనుక్తకాలే.” అని జ్యోతిషకృష్ణులు వచించియున్నారు. ఇచ్చట సంవత్సరమునకు లోపల అని మాత్రము చెప్పబడియున్నది. బలవద్గ్రహవశంబున “అయనక్షణ వాసరర్తవే” మొదలగు శ్లోకముల ననుసరించి మాస, పక్ష, దివసంబుల స్పష్టముగా నెరుగదగినది. ఇదియుగాక జననకాల ద్రేక్కాణములవలనను, జననకాలమున చంద్రస్థిత నవాంశలవలనను, చంద్రాక్రాంత నక్షత్రములవలనను, జననకాలమున గ్రహబలస్థితుల ననుసరించియు జెప్పబడియుండు కొన్ని పితృమాత్రాద్యరిష్ట యోగములు యీ క్రింది గ్రంథాంతర వచనంబులవలన దెలియదగును.

శ్లో. లగ్నేద్రేక్కాణాని గళాహి పక్షిపాశాన్వితాస్స్వ మిభిరప్యదృష్టాః, కూరారాశ్రితా స్సృత్యుకరాః ప్రసూతౌ సంవత్సరై స్సప్తభిరేవసత్యం. ఇత్యాది వచనములవలన ద్రేక్కాణారిష్టంబులును, శ్లో. అభుక్త మూలసంభవం పరిత్యజేచ్చబాలకం సమాష్టకంపితా తథానతస్యముఖం విలోకయేత్, తదాద్యపాదకేపితా జనన్యథోద్వితీయకే ధనక్షయ స్తృతీయకే చతుర్థకే శ్చుభావః. ప్రతీపమంత్యపాదదః ఫలం తదేవసార్పభే, తదుక్తదోష శాంతయేవిధేయ మత్రశాంతికం. పితృజన్మ నియేజాతాతే హన్యశ్చతథాపితృజ్, మాతృజన్మ నియాజాతామాతృణాం ఘాతుకాః స్త్రియః. పుష్యే కర్కటకేజాతో జలేశే పితృమృత్యుకృత్, పుత్రోజాతో యుమిత్రీచే న్మాతరంచ జఘాంసతి. త్వాష్ట్రేచతిష్యేచ తథైవలోయే కన్యాకులీరో దయచాపలగ్నే, శుభగ్రహాఃపశ్యతి చేన్నహన్యా త్పిత్ర్యాంశ్చ మాతృాంశ్చ సుతంచమాతులం. చాపేకర్కటకేచ షష్ఠభవనే సింహాంశకస్థేవిథౌ తాలోంబావనితాంశకేచప్పృథుకో జాకాంశకే మాతులః. కార్పణ్యం జోపగతే సమేతిమరణం కేచిత్తులాళ్యం శకేప్రోక్తాంశం శుభమాహురుక్తభవనే ష్వేవంవినాశం క్రమాత్. ఇత్యాది వచనములవలన నక్షత్రారిష్ట చంద్రాధిష్టిత నవాంశారిష్టంబులును. శ్లో. సప్తాష్టలగ్నవ్యయగే శశాంకే కూరేణయుక్తే శుభదృష్టిహీనే, పాపైర్ద్విహీనేషుచ కంటకేషుకృతాంత దంష్ట్రాంతరగః ప్రసూతః. తాతాంబికాసోదర మాతు

లాశ్చమాతా మహా స్తత్సదృశశ్చనూనుః, సూర్యాదిఖేటాః క్రమశః ప్రదిష్టాస్త్రికోణ గాస్తే పిచతం నిహన్యుః. ఇత్యాది వచనములవలన గ్రహారిష్టంబులునుం దెలియఁదగినవి. గ్రంథవిస్తర భీతిచే యీ శ్లోకములకు వివరణము విరమింపంబడియెను.

ఈ యోగముల నన్నిటిని చక్కఁగ గమనించి ఫలితములను జెప్పదగును.

—— అరిష్టభంగములు. ——

పైన జెప్పబడిన అరిష్టయోగము లన్నిటికిని భంగము లనేకములున్నవి. ఈ క్రింద వివరింపబడు విషయము లేవియు లేకుండు నట్టి అరిష్టయోగములే ఫలితము లగుచున్నవి. ఈ విషయమై శ్రీ దేవకీర్తి మొదలగువారలు చెప్పియుండు అరిష్ట భంగయోగములను యిందు జేర్చియున్నది.

1. సర్వానిమాన్నతి బలస్ఫురదం శుజాలో
   లగ్నస్థితః ప్రశమయే త్సురరాజమంత్రీ
   ఏకోబహూని దురితాని సదుస్తరాణి
   భక్త్యాప్రయుక్త ఇవచక్రధరే ప్రణామః.

తా. ప్రకాశ మానాంశజాలుడగు బృహస్పతి బలియుడై జననలగ్నమున నుండెనేని పరాత్పరుడగు శ్రీమన్నారాయణునకు జేయబడు నమస్కారము, తరింపగూడని పాప సమూదాయమును హరించునట్లు సర్వారిష్టములు నశించును.

2. లగ్నాధిపో తిబలవా నశుభై రదృష్టః
   కేంద్రస్థితై శుభఫలై రవలోక్యమానః
   మృత్యుం విధూయ విదధాతి సుదీర్ఘమాయుః
   సార్థంగుణై ర్బహుభిరూర్జిత యాచలక్ష్మ్యా.

తా. లగ్నాధిపతి బలవంతుడైయుండి పాపగ్రహములచేత జూడబడక, కేంద్రస్థానంబులగు 1, 4, 7, 10, యిండ్లయందుండు శుభగ్రహములచే జూడబడుచుండునెడల మృత్యువును బోగొట్టి సకల గుణోత్కర్ష భాగ్యాతిశయాది విశేషంబులతో దీర్ఘాయువును గలుగజేయును.

3. లగ్నాదష్టమ వర్త్యపి గురు బుధ శుక్ర దృకాణగ శ్చంద్రః
   మృత్యుప్రాప్తం సుతమపి పరిరక్షత్యేవ నిర్వ్యాజమ్.

తా. చంద్రుఁడు జననలగ్నమునకు అష్టమస్థానమున నుండినను, గురు, బుధ, శుక్ర ద్రేక్కాణగతుం డయ్యెనేని శిశువునకు సంభవించు మృత్యువును తొలగించి నిష్కాపట్యముగ రక్షించును.

4. చంద్రస్సంపూర్ణ తను స్సౌమ్యర్క్ష గతస్స్థిత శ్శుభస్యాంతః
ప్రకరోత్యరిష్ట భంగం విశేషత శ్శుక్ర సందృష్టః.

తా. పూర్ణచంద్రుఁడు శుభగ్రహముల మధ్య, శుభక్షేత్రస్థితు డగుచుండెనేని ఎటువంటి యరిష్టమును కలుగదు. మఱియు, ఆ చంద్రునకు శుక్రవీక్షణ్య ముండినచో దోషమే లేదనదగును.

5. బుధభార్గవ జీవానా మేకతమః కేంద్రమాగతో బలవాన్
యద్యపి క్రూరసహాయ స్సద్యోరిష్టస్య భంగాయ.

తా. బుధ గురు శుక్రులలో నొకఁడు బలయుతుఁడై కేంద్రస్థానములగు లగ్న, చతుర్థ, సప్తమ, దశమస్థానంబుల నొక్కాడ పాపగ్రహయుక్తుడై యుండినను, శిశువు జనించిన తోడనే గలుగు అరిష్టమునకు గూడ భంగము గలుగుచున్నది.

6. రిపుభవన గతోఽపి శశీ గురు సిత చంద్రాత్మజ దృక్కాణస్థః
గరుడ ఇవ భోగిదష్టం పరిరక్ష త్యేవ నిర్వ్యాజం.

తా. చంద్రుఁడు జననలగ్నమునకు ఆరవయింటనుండినను, గురు బుధ శుక్ర ద్రేక్కాణములలో నొక ద్రేక్కాణమున నుండెనేని, సర్పదష్టుండగు వానిని గరుత్మంతుండు రక్షించు రీతిని నిర్వ్యాజముగ రక్షించును.

7. సౌమ్యద్వయాంతర గతస్సంపూర్ణ స్నిగ్ధమండలశ్శశిభృత్
నిశ్శేషారిష్ట హంతా భుజగలోకస్య గరుడ ఇవ.

తా. పూర్ణచంద్రుఁడు శుభగ్రహద్వయ మధ్యగతు డగునెడల పన్నగ సమూహమునకు పక్షిరాజువలె సర్వారిష్టములను నిశ్శేషముగ బోగొట్టును

8. శశభృతి పూర్ణశరీరే శుక్లే కృష్ణే నిశాభవే ద్దివసే
రిపునిధనస్థే రిష్టం ప్రభవతి నైవాత్ర జాతస్య.

తా. జననలగ్నమునకు 6, 8, యిండ్లయందు సంపూర్ణచంద్రుఁడున్నను, శుక్లపక్షపు రాత్రియందును, కృష్ణపక్షపు పగటియందును, బుట్టిన శిశువునకు బాలారిష్టదోషము కలుగదు.

9. ప్రస్ఫురిత కిరణజాలే సుధాంశుమండలే విలోకయతి
సురమంత్రిణి కేంద్రగతే సర్వారిష్టం శమం యాతి.

తా. సంపూర్ణచంద్రుఁడు జననలగ్నమును జూచుచుండి, బృహస్పతి కేంద్రస్థానగతు డగుచుండెనేని సకల బాలారిష్టములకును శాంతి గలుగుచున్నది.

10. సౌమ్యభవనోపయాతాస్సౌమ్యాంశక సౌమ్య దృక్కాణాః
గురుచంద్రకావ్య శశిజా సర్వేరిష్ట స్య హంతారః.

తా. శుభక్షేత్ర, శుభనవాంశ, శుభద్రేక్కాణ స్థితులగు గురు చంద్ర శుక్ర బుధులు సర్వారిష్టములను బోగొట్టుచున్నారు.

**11. పాపాయది శుభవర్గే సౌమ్యైర్దృష్టా శ్శుభాంశ వర్గస్థైః**

**నిఘ్నంతి తదారిష్టం పతిం విరక్తా యథాయువతిః.**

తా. పాపగ్రహములు శుభషడ్వర్గములయందుండి, శుభషడ్వర్గ గతులగు శుభగ్రహములచే జూడబడుచుండినచో అనురాగరహిత తనభర్తను హింసించునట్లు సకలారిష్టములను బోగొట్టును.

**12. తాత్కాలే యదివిజయా శుభగ్రహ శ్శుభనిరీక్షితో వశ్యం**

**నాశయతి సర్వారిష్టం మారుత ఇవపాదపాన్ ప్రబలః.**

తా. జననకాలమునందు ఒక శుభగ్రహము యుద్ధమునందు జయమునుబొంది మఱియొక శుభగ్రహముచే జూడబడుచుండె నేని ప్రబలవాయువు వృక్షములగూల్చునట్లు బాలారిష్టముల కన్నిటికిని నాశము గలుగుచున్నది. ఇట్లనేకవిధములగు బాలారిష్టభంగయోగములు ప్రాచీనదైవజ్ఞులచే వచింపబడియుండుటవలన అరిష్టయోగ కారకగ్రహములయొక్కయు. అరిష్ట భంగముల గల్గించు గ్రహములయొక్కయు బలాబలముల బాగుగ పరిశీలించి, అరిష్టయోగకారకగ్రహబలమధికమగునేని శిశువునకు మృత్యువును, అరిష్టభంగ కారక గ్రహబల మాధిక్యతగాంచు నెడల, శిశువునకు పూర్ణాయుర్దాయమును, ద్వివిధగ్రహబలములు సమానమగునెడల, అరిష్టయోగఫలితమును నిశ్చయింపదగినది. ఇందులకు:—

"శుభాశుభత్వంచ హితాహితత్వం, తుంగాదినీచా స్తమయాశ్రితత్వం, రిష్టేశభంగేశ్వర యోర్విచింత్యా, సమానవర్గస్య సమానవర్గాత్, రిష్టేశఖేటస్య బలోత్కటత్వం, చేద్రిష్టకర్తుర్హి తదాత్వరిష్టం, భంగంప్రభోశ్చే దధరిష్టభంగ స్సమాన తాయామపి కష్టమేవ" అను శ్రీపతివచనము వివరముగా గానబడుచున్నది.

బాలారిష్ట యోగములును, తద్భంగములును బాగుగ యోచించి ఫలముల దెలిసికొని. అరిష్ట నివారణకై, నవగ్రహ, అధిదేవత, ప్రత్యధిదేవతారాధనలను, జపహోమ అర్ఘ్యదానాదుల యుక్తరీతిని గావించినయెడల గ్రహదేవతా వరప్రసాదంబుచే ఐశ్వర్యాధిక్యతయు, ఆయుర్వృద్ధియు, గలుగునని జ్యోతిష్కులు, వచించుచున్నారు.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

బాలారిష్టాధ్యాయ నామక

షష్ఠాధ్యాయము.



శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము



## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ఆ యు ర్దా యా ధ్యా య ము:—7.

శ్లో. మయయవన మణిత్థశక్తిపూర్వై ర్దివసకరాదిషు వత్సరాః ప్రదిష్టాః
నవతిథి విషయాశ్వి భూతరుద్రాదశ సహితా దశభిస్స్వతుంగగేషు. 1

టీ. మయయవనమణిత్థ శక్తిపూర్వైః—మయ=సూర్యోపాసనా లబ్ధవరుండైన మయుండను దానవుండు, యవన=మ్లేచ్ఛదేశాధిపతి, మణిత్థ=మణిత్థుండనెడు జ్యోతిషగ్రంథకర్త, శక్తిపూర్వ=శక్తిపుత్రులైన పరాశరులు, వీరలచేత, స్వతుంగగేషు=తమతమ పరమోచ్ఛ భాగములయందున్న, దివసకరాదిషు=సూర్యాది గ్రహములయందు, క్రమముగా, దశభిస్సహితాః=పదితోఁగూడిన, నవతిథివిషయాశ్వి భూతరుద్రాదశ, నవ=తొమ్మిది, తిథి=పదునైదు, విషయ=అయిదు, అశ్వి=రెండు, భూత=అయిదు, రుద్ర=పదునొకండు, దశ=పది, ఈసంఖ్యలుగల, వత్సరాః = సంవత్సరములు, ప్రదిష్టాః = చెప్పఁబడినవి.

తా. శ్రీమత్సూర్యాంశ సంభూతుండగు వరాహమిహిరాచార్యులు మయ, యవన, మణిత్థ, పరాశరాదుల మతముల కనుగుణ్యముగా ఆయుర్నిర్ణయ విధమును దెలియజెప్పుచున్నాఁడు, ప్రాచీన దైవజ్ఞులయందు, సూర్యోపాసనాలబ్ధ జ్యోతిశ్శాస్త్ర పారంగతుడగు మయుండను రాక్షసుడును, యావనాచార్యులును గాక యవనుడను మఱియొక మ్లేచ్ఛ ప్రభువును, మణిత్థుడను, జ్యోతిష శాస్త్రజ్ఞుడును, శక్తి కుమారుఁడగు పరాశరుడును, పేరువడసిన శాస్త్రకర్తలగుటచే శాస్త్రసంప్రదాయమును వదలక సూర్యాది గ్రహ పరమాయుః ప్రమాణ సంవత్సరముల నీక్రిందివిధమున జెప్పియున్నారు. సూర్యాదిగ్రహములు తమతమ పరమోచ్ఛ భాగములయందుండగా పదితో గూడిన, నవ, తిథి, విషయా, శ్వి, భూత, రుద్ర, దశ, అనగా 9, 15, 5, 2, 5, 11, 10, అను సంఖ్యలుగల సంవత్సరములకు క్రమముగా నొక్కొక్క దానికిని 10 వంతున జేర్పబడిన సంవత్సరముల ఆయువును యిచ్చుచున్నారు. ఈప్రకారము గణనచేయఁగ వచ్చిన సూర్యాదిగ్రహముల పరమాయుః ప్రమాణ సంవత్సరములు సూర్యునకు 19, చంద్రునకు 25, అంగారకునకు 15, బుధునకు 12, బృహస్పతికి 15,

శుక్రునకు 21, శనైశ్చరునకు 20, సంవత్సరములు నగుచున్నవి,

## —పరమ నీచాంశస్థిత గ్రహాయుర్దాయము.—

శ్లో. నీచేచార్ధం హ్రసతిహి తతశ్చాంతర స్థేను పాతో
హోరాత్వంశ ప్రతిమమపరే రాశితుల్యం వదంతి
హిత్వావక్రం రిపుగృహగతై ర్హీయతే స్వత్రిభాగః
సూర్యోచ్ఛిన్న ద్యుతిషుచ దళం ప్రోజ్ఝ్యశుక్రార్కపుత్రౌ. 2

టీ. నీచే (సూర్యాదులు) పరమనీచాంశలయందుండిరేని, అర్ధం=ఆయుర్వత్సరములలో సగము, హ్రసతి=క్షయించుచున్నది, తతశ్చాంతర స్థేనుపాతః—తతః=ఆపరమోచ్చ పరమనీచాంశలకు, అంతరస్థే=మధ్యమందు గ్రహముండెనేని, అనుపాతః=త్రైరాశికముచేత ఆయుః=ప్రమాణనిర్ణయము చేయదగినది.

తా. సూర్యుఁడు మొదలుగాగల గ్రహములు పరమనీచాంశలయందుండునెడల పూర్వశ్లోకమున జెప్పబడియుండు పరమాయుః ప్రమాణ సంవత్సరముల యందు సగము నశించుచున్నది. ఈప్రకారము క్షయించిన సంవత్సరములుగాక నిలువయుండు సంవత్సరములు.

| | సం. | నెల. | | సం. | నెల. | | సం. | నెల. |
|---|---|---|---|---|---|---|---|---|
| సూర్యునకు | 9 | 6 | బుధునకు | 6 | 0 | శనైశ్చరునకు | 10 | 0 |
| చంద్రునకు | 12 | 6 | బృహస్పతికి | 7 | 6 | | | |
| అంగారకునకు | 7 | 6 | శుక్రునకు | 10 | 6 | | | |

పరమోచ్చ, పరమనీచాంశల మధ్యమున గ్రహముండునెడల త్రైరాశికముచే నాయుః ప్రమాణమును నిర్ణయింపదగును. ప్రతిగ్రహముయొక్క పరమోచ్చ పరమ నీచాంశల నడుమ 6 రాసులున్నవి. రాశి 1 కి 30 భాగములు. భాగము 1 కి 60 లిప్తలు నగును. గనుక ఆరురాసులకును 10800 లిప్తలగుచున్నవి. ఈప్రకారము రాసులను లిప్తలుగా వించి గ్రహముచేత తనపరమోచ్చాంశకంటె అధికముగ భుక్తమైయుండునెడల, పరమోచ్చ భాగమువరకు త్రోసివేసి మిగిలియుండు దానిని లిప్తలు గావింపవలయును. తన పరమనీచాంశ కంటె నధికముగ భుక్తమైయుండు నెడల పరమ నీచ భాగమువరకును త్రోసి శేషమును లిప్తలు గావింపవలయును. ఇట్లు గావించిన లిప్తలకే గ్రహభుక్త లిప్తాగణ మనిసంజ్ఞ.

పరమ నీచాంశస్థిత గ్రహాయుర్దాయ మాసములు:—

| సూర్యునకు | చంద్రునకు | కుజునకు | బుధునకు | గురువునకు | శుక్రునకు | శనైశ్చరునకు |
|---|---|---|---|---|---|---|
| 114 | 150 | 90 | 72 | 90 | 126 | 120 |

## —త్రైరాశిక వివరము.—

భగణార్ధ లిప్తలు 10800 కి నెలలు 114 అయిన యెడల గ్రహభుక్తలిప్తలెన్ని రాయన్నిటి కెన్నిమాసములని గణనచేయుటయే త్రైరాశికము:—ఇందులకు "ప్రమాణమిచ్ఛాచ

సమానజాతీ ఆద్యంతయోస్థః ఫలమన్యజాతిః, మధ్యేతదిచ్ఛా హతమాద్యహృత్స్యాదిచ్ఛాఫలం వ్యస్త విధిర్విలోమే." అను లీలావతీ గ్రంథ సూత్రానుగుణ్యముగ సమాన జాతులగు, ప్రమాణ ఇచ్ఛలను, క్రమముగ ఆద్యంతములయందుంచి అన్యజాతియగు ఫలమును, మధ్యమున నుంచి ఇచ్ఛచేత ఫలమునుగుణించి, ప్రమాణముచేత విభజింపగ ఫలమేర్పడుచున్నది వ్యత్యయ మగునెడల ఇచ్ఛచేత ప్రమాణమును గుణించి ఫలముచే భాగింపదగినది.

ఉదాహరణము:—సూర్యుడు వృషభమునందు 13 భాగములమీద 48 లిప్తల నతిక్రమించి 49 వ లిప్తయందుండగా నెన్ని సంవత్సరము లగునని దెలియుటకు:—

సూర్యునకు మేషరాశియందు 10 వ భాగము పరమోచ్ఛము గనుక, అంతవరకును త్రోసివేసి 11 వ భాగము మొదలు సూర్యస్థిత లిప్తవరకు గణనచేయగ మేషమున మిగులు భాగములు 20 + వృషభము భాగములు 13 ఉభయం 33 భాగములు. యీ 33 భాగములకు 33 × 60=1980 + వృషభ రాశియందు 13 భాగములకు పైన అతిక్రమించి యుండు లిప్తలు 48=2028 అగుచున్నవి. గాన యివియే సూర్యభుక్త లిప్తలు అనబడుచున్నవి.—

పైన జెప్పిన త్రైరాశిక సూత్రము ననుసరించి.

| | ప్రమాణము. | ఫలము. | ఇచ్ఛ. |
|---|---|---|---|
| భగణార్థ లిప్తలు | 10800 / గవిపరమనీచ మాసములు | 114 / గవిభుక్త లిప్తలు | 2028 |

$$\frac{114 \times 2028}{10800} = \frac{231192}{10800}$$

```
10800)231192(21   మాసములు.
      21600
      -----
       15192
       10800
       -----
        4392 × 30
10800)131760(12  దినములు.
      10800
      -----
       23760
       21600
       -----
        2160 × 60
10800)129600(12   ఘడియలు
      10800
      -----
       21600
       21600
       -----
```

ఘడియలయందును శేషముండు నెడల విఘడియలుచేసి పూర్వప్రకారము 10800 చే భాగింపగ విఘడియలేర్పడు చున్నవి, గనుక ఇందులబ్ధమేర్పడిన 1 సంవత్సరము, 9 మాసములు, 12 దినములు, 12 ఘడియలు, పరమోచ్చస్థానగత రవిపరమాయుః ప్రమాణ సంవత్సరములగు 19 సంవత్సరములయందు తీసివేయగా

| | సం. | మా. | ది. | ఘ. |
|---|---|---|---|---|
| | 19 | 0 | 0 | 0 |
| | 1 | 9 | 12 | 12 |
| మిగిలిన సం. | 17 | 2 | 17 | 48 |

పరమోచ్చను విడిచి నీచమునకు పోవుచు, 1 రా., 13 భా, 48 లిప్తలు భుక్తముగా గలిగియుండు సూర్యుడిచ్చెడు పరమాయుః ప్రమాణమని గణింపదగినది. పరమనీచాంశమగు తులాదశమభాగమునుండి స్వోచ్చకుబోవుచు, వృశ్చికమునందు, 13 భాగముల మీద 48 లిప్తల నతిక్రమించి 49 వ లిప్తయందున్నట్టి సూర్యునకుగూడ ఇదేప్రకారము 1 సంవత్సరము, 9 మాసములు, 12 దినములు, 12 ఘడియలు, యేర్పడుచున్నది. గనుక, యీ సంఖ్యను పరమనీచస్థానమునకు జెప్పియుండు పరమాయుః ప్రమాణ సంవత్సరములగు 9 సంవత్సరముల 6 మాసములతో జేర్పగ, ఉభయము 11 సంవత్సరములు, 3 మాసములు, 12 దినములు, 12 ఘడియలు, పరమనీచమునుండి స్వోచ్చకుబోవుచు, రా 7 భా 13 లి 48 భుక్తముగాగలిగియుండు సూర్యుని పరమాయుః ప్రమాణముగా యెరుగదగినది.

## అనుపాతాయుర్దాయ నిర్ణయము.

ఇష్టమగు గ్రహమునకు రాశ్యాదిలిప్తాంతములేక స్వోచ్చ పూర్వోక్తములగు ఉచ్చస్పష్టకములను, అనగా (సూర్యునకు 0-10-0-0 చంద్రునకు 1-3-0-0 ఈరీతిగా గలవాటిని) త్రోసివేయగ మిగిలిన శేషము గ్రహపరమోచ్చభాగమునకు లోపుగనుండు నెడల ఉచ్చధ్రువకము పోదు గనుక ద్వాదశరాసులను ఆశేషముతో గూడ కూడినయందు నుచ్చధ్రువకమును త్రోసి శేషము నుంచుకొనవలయును. ఆశేషము 6 రాసులకు తక్కువగాయుండు నెడల దానిని 12 రాసులలో త్రోసి శేషమును లెక్కకు తీసికొనవలెను. 6 రాసులకు అధికమగు నెడల ఆశేషమునే లెక్కకు తీసికొనవలయును ఈ రీతిగ గణనచేయగ నేర్పడు దానిని రాశ్యాది విలిప్తాంతముగా నుంచుకొని ఆయాగ్రహ పరమాయుఃప్రమాణ సంవత్సరములచేత ప్రత్యేకముగ గుణించి విలిప్తాస్థానమును 60 చే భాగించి ఆలబ్ధమును లిప్తాస్థానమునందు గూడి, ఆ లిప్తాస్థానమును 60 చే భాగింపగా యేర్పడులబ్ధమును భాగస్థానమునందు గూడి, ఆ భాగస్థానమును 30 యింట విభజించి వచ్చులబ్ధమును రాశిస్థానమునందు గూడి, యీరాశిస్థానమును 12 యింట పాల్గొనగా నేర్పడులబ్ధము భగణస్థానము, ఆ భగణస్థానము సంవత్సరములు, రాశిశేషము మాసములు, భాగశేషము దినములు, లిప్తాశేషము ఘడియలు, విలిప్తాశేషము విఘడియలు, గాశేయగా సూర్యాదిగ్రహముల ఆయుఃప్రమాణ మేర్పడుచున్నది. ఈ విషయమునకు సారావళీకారకుడు, "స్వోచ్చశుద్ధో గ్రహశ్శోధ్య షడ్రాశ్యూనోధ మండలాత్ స్వపిండగుణితో భక్తో రాశిమానేన వత్సరాః" అని వచించియున్నాడు.

ఉదాహరణము:—పూర్వము త్రైరాశిక ఉదాహరణమునకు తీసికొనిన సూర్యభుక్తి రా 1. భా 13. లి 48. కే ఆయుర్దాయ గణితక్రమము.

రా–భా–లి
1–13–48
పరమోచ్ఛధ్వనకము. 0–10– 0 పోఁగా
1– 3–48 ఇది ఆరురాసులకు తక్కువగాను
రా–భా–లి
12– 0– 0
1– 3–48 పోఁగా
10–26–12

రవిపరమోచ్ఛ ప్రమాణ ఆయుర్వత్సరములు. 19–19–19

190—494—228
16 3 48
206 497
17 2 17
= సం 17, మా 2, ది 17, ఘ 48

పూర్వము రీతిని అగుచున్నది.—
రా–భా–లి
10–26–12
19
సం. 17–2–17.48 అగుచున్నది.

60) 228
3–48
194
30) 497
16–17
190
12) 206
17–2

మఱియొక ఉదాహరణము. సూర్యునికి మేషరాశియందు 0-భా 7–లి–4, వి–4 భుక్తమైయుండు నెడల సూర్యుని ఉచ్ఛధ్వనకము త్రోయుటకు వీలుపడదుగనుక పండ్రెండు రాసులను గూడుకొనవలెను, అట్లు గూడుకొనగ 12– 7– 4– 4 అగుచున్నది. అందు ఉచ్ఛధ్వనకము. 0– 10– 0– 0 పోఁగా
11– 27– 4– 4

ప్రత్యేకముగ గుణించిన వీటిని సూ. ప. ప్ర. వ. అగు, 19– 19–19–19
209–513 76–76 అగుచున్నవి.

వీటినిపూర్వముచెప్పినరీతిని గణనచేయగ సంవత్సరములు 18, మాసములు 10,దినములు ఘడియలు. 17, విఘడియలు. 16, అగుచున్నవి. దీనినే యీక్రిందివిధముగను గణింపవగును.

రా-భా- లి- వి

11-27- 4- 4

19

18-10- 4-17-16

గనుక 18 సంవత్సరములు, 10 మాసములు, 4 దినములు, 17 ఘడియలు, 16 విఘడియలగు చున్నవి.

యీ ప్రకారమే యితర గ్రహములకును జూడదగినది.

60) 76
1-16
76
60) 77
1-17
513
30)514
17-4
209
12)226
18-10

లగ్నమునం దెన్ని నవాంశలు చెల్లినవో అన్ని సంవత్సరములును, వర్తమాన నవాంశను బట్టి త్రైరాశికముచే మాసాదులును దెలియదగినది.

ఉదాహరణము:—జననలగ్నమున 21 భాగములును, 11 లిప్తలును చెల్లియుండు నెడల.

భా - లి

21-11

60

1260 + 11

1271 లిప్తలు అగుచున్నవి. (గతనవాంశలు) లేక, రాశిలిప్తలగు 1800 ను. 9 భాగములు చేయగ 1 భాగమునకు (200) లిప్తలగుచున్నవి.

గనుక—

200)1271(6 సంవత్సరములు
1200
71 × 12
200)852(4 మాసములు
800
52 × 30
200)1560(7 దినములు
1400
160 × 60
200)9600(48 ఘడియలు
800
1600
1600

యింకను శేషముండునెడల విఘడియలు చేయదగును.

ఇట్లు గణనచేయఁగ నేర్పడు సంవత్సరములు 6, మాసములు 4, దినములు 7, ఘడియలు 48 రయు లగ్నాయుర్దాయముగ నేర్పడుచున్నది. కొందరు రాశిక్రమము ననుసరించి లగ్నాయుర్దాయమును నిర్ణయింతురు.

మేషాదిగ నెన్నిరాసులు గతములో యన్ని సంవత్సరములును, వర్తమానరాశి భుక్తభాగములను లిప్తలుగావించి ఆలిప్తలను 12 చే గుణించి రాశిలిప్తలగు 1800 చే భాగింపగ వచ్చులబ్ధము మాసములును, శేషమును దినములు, ఘడియలు, విఘడియలుగా జేయదగునందురు.

ఇందులకుఉదాహరణములు:—"లగ్నరాశి సమాంశాబ్దాన్ మాసాద్యాననుపాతతః, లగ్నాయుర్దాయ మిచ్ఛంతి, హోరాశాస్త్ర విశారదాః" అని మణిత్థునిచేతను, "లగ్నదారేకాంశ తుల్యస్యా దంతరేచాను పాతతః, తత్పతౌ బలసంపన్నే రాశితుల్యం స్వభా థిపే" అని సారావళియందును జెప్పబడియున్నవి. సారావళి ప్రయోగము ననుసరించిజూడఁగ, నవాంశాధిపతి బలవంతుడైయుండు నెడల నవాంశసమముగాను, రాశ్యాధిపతి బలవంతుడై యుండు నెడల రాశితుల్యముగను ఆయుర్నిర్ణయము శేయదగునని యేర్పడుచున్నది.

వక్రించియుండు గ్రహములుగాక తక్కిన గ్రహములు శత్రుక్షేత్రగతములై యుండు నెడల తమ ఆయుర్వత్సరములయందు మూడవపాలు హరణమగుచున్నది. వక్రించియుండు గ్రహములు శత్రుక్షేత్రములందున్నను ఆయువునందు హరణము గలుగదు.

ఈ విషయమును చాలమంది హోరాశాస్త్రజ్ఞులు ఆమోదించియున్నారు ఐనను కొందరు, శత్రుక్షేత్రహరణము కుజునకు తక్కతక్కిన గ్రహముల కన్నిటికిని గలదని చెప్పుచున్నారు. ఇందులకు "భూమ్యాఃపుత్రం వర్జయిత్వాఽ ధస్తాహన్యస్స్వ స్యాదాయుష స్త్రిభాగం" అను బాదరాయణుని వచనము ఉదాహరణముగనున్నది. శుక్రశనైశ్చరులుగాక తక్కిన గ్రహములు అస్తంగత దోషమును జెందియుండు నెడల దమ ఆయుర్వత్సరములయందు సగము హరింపబడుచున్నది. 2

## చక్రపాతహరణము.

శ్లో. సర్వార్ధత్రిచరణ పంచషష్ఠభాగాః
క్షీయంతే వ్యయభవనాదసత్సు వామమ్
సత్స్వర్ధం హ్రసతితథైక రాశిగానా
మేకోంశం హరతి బలీతథాహ సత్యః. 3

టీ. అసత్సు=పాపగ్రహములు, వ్యయభవనాత్=ద్వాదశస్థానము మొదలుకొని, వామం=విలోమముగా నుండఁగా, సర్వార్ధత్రిచరణ పంచషష్ఠభాగాః=సర్వార్ధా ద్యంశములు, క్షీయంతే=క్షయించుచున్నవి, సత్సు=ఈవ్యయాది స్థానములయందు శుభగ్రహములుండెనేని, అర్ధం=పాపగ్రహములకుం జెప్పినహరణములోసగము, హ్రసతి=క్షయించును, తథా=ఆప్రకా

రమే, ఏకరాశిగానాం=శుభగ్రహములుగాని పాపగ్రహములుగాని, బలీ=బలవంతుఁడైన, ఏకః=ఒకఁడే, అంశం=ఆస్థానమందు, హరతి=హరించును, తథా=ఆప్రకారముగా, సత్యః=సత్యాచార్యుఁడు, అహ=చెప్పెను.

| స్థానములు. | గ్రహములు. | ఆయుర్దాయ హరణభాగము. | గ్రహములు. | ఆయుర్దాయ హరణభాగములు. |
|---|---|---|---|---|
| 12 యింటి | పాపగ్రహము | సంపూర్ణము | శుభగ్రహము | అర్థము |
| 11 యింటి | పాపగ్రహము | అర్థము | శుభగ్రహము | నాల్గవపాదము |
| 10 యింటి | పాపగ్రహము | మూడవపాలు | శుభగ్రహము | ఆరవపాదము |
| 9 యింటి | పాపగ్రహము | నాల్గవపాలు | శుభగ్రహము | ఎనిమిదవపాలు |
| 8 యింటి | పాపగ్రహము | ఐదవపాలు | శుభగ్రహము | పదియవపాలు |
| 7 యింటి | పాపగ్రహము | ఆరవపాలు | శుభగ్రహము | పండ్రెండవపాలు |

ఈ ప్రకారముగా వ్యయాదిస్థానంబులబొందిన పాపగ్రహములు తమ ఆయుర్దాయమునందు క్రమముగా సర్వార్థాంశములును, వ్యయాదిస్థానంబులబొందిన శుభగ్రహములు, పాపగ్రహములకు జెప్పిన హరణములయందు సగమును, తీయించుచున్నవి.

పైకినుదహరించిన స్థానములయం దుపస్థానమునగాని, శుభగ్రహములైనను పాపగ్రహములైనను, రెండు, లేక మూడు గ్రహములుండునెడల అందు బలయుతమగు గ్రహమునకు మాత్రమే ఆస్థానమునకు జెప్పబడియుండు హరణాంశరీతిగ ఆయువు నశించుచున్నది. తక్కిన గ్రహములకు ఆ న్యూనహరణములేదని సత్యాచార్యులవారు వచించియున్నారు. ఇదియే వరాహమిహిరాచార్య సమ్మతము.

## లగ్నమందున్న పాపగ్రహము ఆయుర్దాయాంశమును హరించువిధము.

శ్లో. సార్ధోదితోదిత నవాంశ హతాత్సమస్తా
ద్భాగోష్టయుక్త శతసంఖ్య ముపైతి నాశం
క్రూరేవిలగ్న సహితే విధినా త్వనేన
సౌమ్యేక్షితే దళమతః ప్రళయం ప్రయాతి. 4

టీ. క్రూరే=పాపగ్రహములలో నొకఁడు, విలగ్నసహితే=లగ్నమందుండఁగా, సార్ధోదితోదిత నవాంశహతాత్=అర్ధోదిత నవాంశ సహితములైన గతి నవాంశలచేత గుణింపఁబడిన, సమస్తాత్=లగ్నాయుస్సహితమయిన సర్వగ్రహాదాయుః పిండమువలన, అష్టయుక్త శతసంఖ్యం=అష్టయుక్తమైన శతసంఖ్యగలుగునట్లు, భాగః=పాలుగానఁగా, నాశం=నాశమును ఉపైతి=పొందును, సౌమ్యేక్షితే=ఆలగ్నమందున్న పాపగ్రహము శుభగ్రహముచేత చూడఁబడెనేని, అనేనవిధినా=ఈ విధానము చేతనే సార్ధోదితోదిత నవాంశలచేత, గుణించి 108చేత భాగింపఁగావచ్చిన, అతః=ఈలబ్ధములో, దళం=సగము, ప్రళయం=నాశమును, ఉపైతి=పొందును.

తా. పాపగ్రహములగు సూర్యాంగారక శనైశ్చరులయందొక గ్రహము లగ్నమం దుండగా అర్ధోదిత నవాంశసహితములగు గతనవాంశలచేత గుణింపబడిన లగ్నాయుస్సహితమగు సర్వగ్రహదత్తాయుః పిండములను 108 చేతభాగింపగా లబ్ధము యేర్పడిన సంవత్సరమాసాదులు నాశనమును బొందుననుట.

వివరణము:—మేషరాశి మొదలు తత్కాలలగ్న భాగమువరకు లిప్తలుచేసి ఆలిప్తలను, నవాంశప్రమాణలిప్తలగు 200 చే భాగింపగా లబ్ధ మెన్నివచ్చునో యన్నినవాంశలు గతములని తెలియుచున్నది. వర్తమాన నవాంశకై ఒకటిని దీనియందుగూడిన సార్ధోదితోదిత నవాంశ సమూహమగుచున్నది. దీనిచేత, లగ్నాయుస్సహితమైన సర్వగ్రహదత్తాయుస్సును గుణించి, 108 చేత భాగింపగా లబ్ధములగు వర్షాదులను లగ్నస్థిత పాపగ్రహము హరించుచున్నది. అట్లు యేర్పడిన సంవత్సరమాసాదులను సర్వగ్రహదత్తాయుః పిండమునగ్గోసివేయగ, మిగిలినది క్రూరోదయహరణశుద్ధమైన ఆయుఃపిండమగుచున్నది. ఈప్రకారము, ఆయాగ్రహములకును గుణింపగ ఆయాగ్రహదశావత్సరాదులు ఏర్పడుచున్నవి. కొందరు, మేషాదిగలెక్కగొనక, లగ్నమున చెల్లినభాగముల ననుసరించి గతనవాంశల నెరింగి, వర్తమాన నవాంశకై ఒకటినిగూడిన, సార్ధోదితోదిత నవాంశసమూహమగును, దీనిచే సర్వగ్రహదత్తాయుః పిండమును గుణించి, పూర్వోక్త ప్రకారముహరణము చేయదగునని యు జెప్పుదురు. మఱియు, లగ్నస్థిత పాపగ్రహమునకు శుభవీక్షణయుండు నెడల పైరీతిగ గుణించి 108 చేత భాగింపగావచ్చు లబ్ధములగు వత్సరాదులయందు సగముమాత్రము నశించుచున్నదని తెలియదగినది. యొక పాపగ్రహమును, యొక శుభగ్రహమునుగూడి లగ్నమునయుండు నెడల వర్తమాన నవాంశకు సమీపమున ఏగ్రహముండునో ఆగ్రహమునకు జెప్పబడియుండు ప్రకారము ఆయుర్హరణము జేయదగినది, గాని, యితరగ్రహములకు జేయదగదు. ఇందుక్షీణచంద్రుని పాపగ్రహముగ దీసికొనగూడదు. ఈ విషయమై:—"సూర్యాంగారకమందేష్వేకస్మిన్ లగ్నగేభవతిహానిః విధినాత్వనేన సౌమ్యేక్షితే దళం పాతయేల్లబ్ధమ్" అనిబాదరాయణోక్తిగలదు.

### మనుష్య, గజ, హయాదుల, పరమాయుః ప్రమాణము.

శ్లో. సమాష్షష్టి ర్ద్విఘ్నా మనుజ కరిణాం పంచచ నిశా
హయానాం ద్వాత్రింశ త్ఖరకర భయోః పంచక కృతిః
విరూపా సాత్వాయు ర్వృష మహిషయో ర్ద్వాదశ శునాం
స్మృతం ఛాగాదీనాం దశక సహితా షట్చ పరమమ్. 5

టీ. ద్విఘ్నాః=రెంటగుణింపబడిన, షష్టిస్సమాః=60 సంవత్సరములును, పంచనిశాశ్చ=అయిదురాత్రులును, అనగా 120 సంవత్సరములమీద 5 దినములు, మనుజకరిణాం, మనుజ=మనుష్యులకును, కరిణా=ఏనుగులకును, పరమాయుః=సంపూర్ణాయుః ప్రమాణమగును, హయానాం=గుఱ్ఱములకు, ద్వాత్రింశత్=32 సంవత్సరములు(పరమాయువు.) ఖరకరభయోః, ఖర=గాడి

దెలకును, కరభయోః=ఒంటెలకును, పంచకకృతిః=పంచవర్గమైన 25 ఏండ్లఆయువు, వృష మహిషగోః=వృష=గోవులకును, మహిషయోః=ఎనుబోతులకును, సాతు=ఆపంచక కృతియైన 25 ఏండ్లు, విరూపా= ఒకటి తక్కువయైనదగును, శునాం=కుక్కలకును, ద్వాదశ= 12 ఏండ్లుపరమాయువు, ఇక్కడ సునాం అని చెప్పుటనఖముగల వ్యాఘ్రమార్జాలాద్యుపలక్షణార్థముగనుక వానికిని 12 ఏండ్లు పరమాయువని తెలియందగినది, ఛాగాదీనాం= మేక పొట్టేలు, మొదలైనవానికి, దశకసహితా 10 తో గూడిన, షట్=ఆరు, అనగా 16 సంవత్సరంబులు పరమాయువగును.

మనుష్యులకును, ఏనుగులకును, 120 సంవత్సరములు, 5 రోజులు, పరమాయుః ప్రమాణము.

గుఱ్ఱములకు, ముప్పదిరెండు సంవత్సరములు.

గాడిదెలకును, ఒంటెలకును ఇరువదియైదు వత్సరములు.

వృషభములు, గోవులు, మహిషములు మొదలగువాటికి ఇరువదినాలుగుసంవత్సరములు.

కుక్కలు, వ్యాఘ్రములు, మార్జాలాదులకు పండ్రెండు సంవత్సరములు.

మేకలు మొదలగు వానికి పదునారువత్సరములును. పరమాయుః ప్రమాణ మగును.

అశ్వాదుల జననకాలమును బట్టి ఆయుః ప్రమాణనిర్ణయము గావింపవలయును.

గ్రహముయొక్క పరమాయువుచే అశ్వాదులపరమాయు ర్వర్షముల గుణించి మనుష్య పరమాయువుచేత భాగింపగా అశ్వాదుల విషయమై, ఆయాగ్రహములిచ్చెడు పరమాయువు ఏర్పడుచున్నది. ఉదాహరణము:

సూర్యుని పరమాయు ర్వర్షములగు 19 చేత అశ్వముయొక్క పరమాయు ర్వర్షములు 32 ను గుణించిన 608 వచ్చును. దీనిని మనుష్య పరమాయువగు సం. 120 చేత భాగింపగా వచ్చులబ్ధము సం. 5, మా 0, ది. 24 వచ్చును.

ఈ ప్రకారమే తక్కిన గ్రహములకు అనగా

| సూర్యునకు | చంద్రునకు | అంగారకునకు | బుధునకు | గురువునకు | శుక్రునకు | శనైశ్చరునకు |
|---|---|---|---|---|---|---|
| సం॥5-0-24 | 6-8-0 | 4-0-0 | 3-2-12 | 4-0-0 | 5-7-6 | 5-4-0 |

అగుచుండు సంవత్సరమాసాదులు. పరమోచ్చగతులగు సూర్యాదులు ఇచ్చెడు ఆయుర్దాయమని యూహింపదగినది. దీనిననుసరించి. మనుష్యులకు ఆయుర్దాయనిశ్చయము జేయు రీతినిహరణశోధనాదులు చేయగ శేషించిన ఆయువును అశ్వాదులకు జెప్పదగును. కొందరు. 120 సంవత్సరముల 5రోజులు పరమాయువుగల జంతువులకు ఇంతకాలము ఆయుర్దాయమైనచో అశ్వాదిజంతువుల పరమాయుర్దాయమునకుయెంత ఆయుర్దాయమని త్రైరాశికమున గణన జేయుచున్నారు.

## సంపూర్ణాయుర్యోగము.

శ్లో. అనిమిషపరమాంశకే విలగ్నే, శశితనయే గవి పంచవర్గలిప్తే
భవతిహిపరమాయుషః ప్రమాణం, యదిసకలాస్సహితాస్స్వతుంగభే.

టీ. అనిమిష=మీనరాశియొక్క, పరమాంశకే=పరమనవాంశయైన, తొమ్మిదవనవాంశ, విలగ్నే=లగ్నమగుచుండగా, శశితనయే=బుధుడు, గవి=వృషభమందు, పంచవర్గలిప్తే=25 లిప్తల నతిక్రమించి యుండగా, సకలాః = బుధ వ్యతిరిక్తమైనఆరుగ్రహములు, స్వతుంగభేషు=తమతమ పరమోచ్చ భాగములయందు, సహితాయది=ఉండినేని, పరమాయుషః ప్రమాణం=పరమాయుః ప్రమాణమైన వర్షములు 120. మా 0. ది 5 భవతిహి=అగును (గదా).

తా. మీనరాశియొక్క పరమనవాంశయగు 9-వ నవాంశలగ్నమై బుధుడు, వృషభమునందు ఇరువదియైదు లిప్తల నతిక్రమించియుండి, బుధుడుగాక తక్కిన గ్రహములారును విమతము పరమోచ్చ భాగములయం దుండుకాలమున బుట్టినవానికి 120 సంవత్సరములు. 5 రోజులు పరమాయుః ప్రమాణ మగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| లగ్న నవాంశ 9 | చంద్రుడు 1-2-0 | బుధుడు 1-0-25 | శుక్రుడు 11-26-0 |
| సూర్యుడు 0-9-0 | అంగారకుడు9-27-0 | గురువు 3-4-0 | శనైశ్చరుడు 6-19-0 |

ఈరీతిగ భుక్తము గావించియుండ

పరమోచ్చగతులగు సూర్య చంద్రాంగారక గురు శుక్ర శనుల
పరమాయుః ప్రమాణ వర్షములు.

| సూర్యునకు | చంద్రునకు | కుజునకు | గురునకు | శుక్రునకు | శనైశ్చరునకు |
|---|---|---|---|---|---|
| 19, | 25, | 15, | 15, | 21, | 20 |

బుధునిఆయుర్దాయము:—బుధుడు తననీచస్థానమగు మీనరాశియుండి యుచ్చస్థానమగు కన్యకుబోవును. రా 1 - భాం - లి 25లో యున్నాడు గనుక, ఈ రాశిభాగాదుల యందు బుధుని పరమనీచధృవకమగు రా 11 - భా 15 పోవుచుండుటచే పన్నెండు రాసులం జేర్చుకొన దగినది.

$$
\begin{array}{r}
1\text{-}\ 0\text{-}25 \\
12\text{-}\ 0\text{-}\ 0 \\
\hline
13\text{-}0\ \text{-}25
\end{array}
$$

పరమనీచ ధృవకము 11-15- 0 పోగా

$$
\begin{array}{r}
1\text{-}15\text{-}25 \text{ మిగులు} \\
30 \\
\hline
30 \times 15 \\
\hline
45 \times 60 \\
\hline
2700 \times 25 \\
\hline
2725 \text{ లిప్తలు.}
\end{array}
$$

## త్రైరాశికము.

భగణార్ధలిప్తలు 10800 కు బుధుని పరమనీచ మాసములు 72 కాగా బుధ భుక్తలిప్తలు 2725 కు ఎన్నిమాసములు ? అని గణన చేయదగినది.

| | |
|---|---|
| $\frac{2725 \times 72}{10800}$ | సం. 1 మా. 6 ది. 5 దీనిలో |
| | సం. 6 మా. 0 ది. 0 చేర్చగ |
| బుధ పరమ నీచగత ఆయుర్వర్షములు. | సం 7 మా. 5 ది. 5 లు |

బుధాయుర్దాయ మగుచున్నది.

ఇందుగల వ్యాహారదిహారణము:—లగ్నమునకు అష్టమస్థానమున శనైశ్చరుం డుండుటచే తన ఆయుర్వర్షములు యిరువదింట బందమాంశము 4 సంవత్సరములను హరించుచున్నాడు. గనుక హరణశుద్ధమగు సంవత్సరములు 16. అంగారకుడు లగ్నమునకు 11-వ యింట నుండుటచే, తన ఆయుర్వర్షములు పదునైదింట సగభాగమగు సం 7 మా. 6 హరించుచున్నాడు గాన హరణశుద్ధమగు సంవత్సరములు. 7. మా. 6. లగ్నమునందుండు 9-వ నవాంశయగుటవలన లగ్నాయుర్దాయము సం. 9. ఈప్రకారము గణనచేయగ,

| | సం. | మా | ది. |
|---|---|---|---|
| సూర్యునకు | 19 | 0 | 0 |
| చంద్రునకు | 25 | 0 | 0 |
| అంగారకునకు | 7 | 6 | 0 |
| బుధునకు | 7 | 6 | 5 |
| బృహస్పతికి | 15 | 0 | 0 |
| శుక్రునకు | 21 | 0 | 0 |
| శనైశ్చరునకు | 16 | 0 | 0 |
| లగ్నమునకు | 9 | 0 | 0 |
| మొత్తము సం. | 120 | 0 | 5 |

ఏర్పడుచున్నది ఇదియే పరమాయుర్జీవితయోగము.

## పరమాయుర్దోషములు.

శ్లో. ఆయుర్దాయ విష్ణుగుప్తోపిచైవం
దేవస్వామీ సిద్ధసేనశ్చ చక్రే
దోషశ్చైషాం జాయతేష్టా వరిష్టం
హిత్వానాయుర్వింశ తేస్స్యాదధస్తాత్. 7

టీ. ఏవం = పూర్వోక్తప్రకారముగా, ఆయుర్దాయం = ఆయుర్దాయమును, విష్ణుగుప్తోపి = చాణక్యుడనెడు విష్ణుగుప్తుడును, దేవస్వామీ = దేవస్వామియనెడు జ్యోతిశ్గ్రంథకర్తయు, సిద్ధసేనశ్చ = సిద్ధసేనుడనెడు గ్రంథకర్తయు, చక్రే = చేసెను. ఏషాం = ఈ మయ

యవనమణిత్థ పరాశరవిష్ణుగుప్త దేవస్వామి సిద్ధసేనాదులయొక్క మతమందు, దోషః=దోషము, జాయతే=కలుగుచున్నది, ఆదోషంబెట్లనిన, అష్టౌ = 8 సంవత్సరములు, అరిష్టం = బాలారిష్టమును, హిత్వా=విడిచి, వింశతేః=ఇరువది సంవత్సరములకు, అధస్తాత్=క్రింద, ఆయుః = ఆయుస్సమాప్తి, నస్యాత్=కాదు.

తా. పూర్వశ్లోకమున జెప్పబడియుండు ఆయుర్దాయమును చాణక్యుడనెడు విష్ణుగుప్తుడును, దేవస్వామియనెడు జ్యోతిష పారంగతుడును, సిద్ధసేనుడనెడు జ్యోతిషగ్రంథకర్తయును, స్థిరపరచియున్నారు. అయినను వీరిమతమునందు ప్రత్యక్షదోషము గానబడుచున్నది. వీరు మతానుసరణముగ జూడగ 8 సంవత్సరములవరకుబాలారిష్టమును విడచి 20 సంవత్సరములలోపుగ అయుస్సమాప్తి యగునట్లు లేదు. గాని ప్రపంచమునందనేకులు 8 సంవత్సరములకుపైన 20 సంవత్సరములలోపుగ మృతి నొందుచుండుటచే యీ విషయమునకు భంగము యేర్పడుచున్నది.

శ్లో. యస్మిన్ యోగే పూర్ణమాయుః ప్రదిష్టం
తస్మిన్ప్రోక్తం చక్రవర్తిత్వమన్యైః
ప్రత్యక్షోయం తేషుదోషః పరోపి
జీవత్యాయుః పూర్ణమర్థైర్వినాపి. 8

టీ. యస్మిన్ యోగే=యేయోగమందు, పూర్ణం=సంపూర్ణమైన, ఆయుః=ఆయుస్సు ప్రదిష్టం=చెప్పబడెనో, తస్మిన్=ఆయోగమందు, అన్యైః=మతికొందఱిచేత, చక్రవర్తిత్వం=సార్వభౌమత్వము, ప్రోక్తం=చెప్పబడెను, అర్థైర్వినాపి=ధనములేని దరిద్రుడును, పూర్ణమాయుః=నిండు ఆయువునుగలిగి, జీవతి=బ్రతుకుచున్నాడు, తేషు=ఆమయ యవనాదులయందు, పరః=మతియొకటైన, అయందోషః=ఈదోషము, ప్రత్యక్షః=ప్రత్యక్షముగానున్నది.

తా. మతియు, పైజెప్పబడిన పూర్ణాయుర్యోగమందు. "యదిసహితా స్సకలాస్స్వతుంగభే." అని యుండుటనాలోచించగను, "షడ్భిస్స్వోచ్చక్రవర్తీ త్రిభువన ఖిలంశాస్తి సర్వైర్వనరోహేంద్రైః." అను బాదరాయణుల వచనానుసారముగను, ఆరుగ్రహములు పరమోచ్చగలమునై యుండుకాలమున బుట్టినవాడు సార్వభౌముడు గావలెనని యున్నది. గ్రహములు పరమోచ్చగతులు గాకుండినచో పూర్ణాయువు గలుగదు అట్లుగాదేని దరిద్రుడై పూర్ణాయువును గలిగియుండును గనుక మయ, యవన, మణిత్థాదుల మతమున మతియొక దోషము ప్రత్యక్షముగ గానబడుచున్నది. సత్యాచార్యమతంబు ననుసరింపదలచి యీ యాయుర్దాయమున దోషములు చెప్పియున్నట్లు తోచుచున్నది. ఐనను పరాశరాదులు, పిండాయుర్దాయమునే ముఖ్యముగా వచించియున్నారు. ఇదియుగాక భట్టోత్పలుడు, ఇందు చెప్పబడిన దోషములు అసంబద్ధములై యుండుటవలన, దోషములను గనబరచు పైరెండు శ్లోకములును వరాహమిహిరాచార్యులచే రచింపబడినవి గావనియు, యీ దోషములకు పరిహారములు గలవనియు వచించియున్నాడు

## దోష పరిహారములు.

(1) "సార్ధోదితో...నాశమ్" అనురీతిని ఆయా లగ్నవాంశవలన క్రూరోదయ హారణముచేయగ నేర్పడు నాయుర్దాయమునకు మితిలేకుండుటచే, "ఆయుర్వింశతే స్స్యాద ధస్తాత్" అను దూషణము అయుక్తము.

ఇందులకు ఉదాహరణము:—కుంభరాశియొక్క ప్రథమనవాంశలగ్నమై, సూర్య చంద్రాంగారకులు పరమోచ్చగతులై, బుధగుశుశనైశ్చరులు పరమనీచస్థానస్థితులై అంగారకుడు కుంభరాశియొక్క 29 వ భాగమునందుండగా జనించినవాని ఆయుర్దాయమును గణనచేయగ:—

| | సూ | చం | అం | బు | గు | శు | శ | ల |
|---|---|---|---|---|---|---|---|---|
| రా | 0 | 1 | 10 | 11 | 9 | 11 | 0 | 10 |
| భా | 9 | 2 | 28 | 14 | 4 | 26 | 19 | 1 |
| లి | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |

లగ్నమునందు కొంచెమైనను భుక్తముగాలేదు గనుక లగ్నాయుర్దాయములేదు. పరమనీచగతులగు గ్రహముల ఆయుర్దాయములు పూర్వపురీతిని లెక్కింపవలయును, కుజాయుర్దాయము.

కుజభుక్తి 10-28-0 నందు.

కుజపరమోచ్చధృవకము. 9-28-0 పోగా

1-0-0

30

30 × 60

1800 లిప్తలు.

కుజ పరమనీచ మాససంఖ్య 90

భగణార్ధసంఖ్య 10800) 162000

15 = 1 సం. 3 మా.

అంగారక పరమోచ్చసంవత్సరములు. 15-0-0

పైనవేర్పడియుండు సం. 1-3-0 పోగా

కుజాయుర్దాయము. సంవత్సరములు. 13-9-0

### బృహస్పతి ఆయుర్దాయము.

శుభగ్రహమగు బృహస్పతి, లగ్నమునకు ద్వాదశస్థానముననుండుటచే దన పరమనీచ ఆయుర్దాయమగు సం 7 మా 6 లయందు సగముహరించునుగావున హారణశుద్ధమగు సం 3 మా 9 బృహస్పతి ఆయుర్దాయమగుచున్నది.

## గ్రహాయుర్దాయములు.

| | సం. | మా. | ది. |
|---|---|---|---|
| సూర్యునకు | 19 | 0 | 0 |
| చంద్రునకు | 25 | 0 | 0 |
| అంగారకునకు | 13 | 9 | 0 |
| బుధునకు | 6 | 0 | 0 |
| బృహస్పతికి | 3 | 9 | 0 |
| శుక్రునకు | 21 | 0 | 0 |
| శనైశ్చరునకు | 10 | 0 | 0 |
| మొత్తము సం. | 98 | 6 | 0 |

అగుచున్నవి.

పాపగ్రహమగు అంగారకుడు లగ్నమున నుండుటవలన క్రూరోదయ హరణము జేయవలెను.

లగ్నము కుంభమగుటచే లగ్న సంఖ్య 10
9
నవాంశలు 90
వర్తమాన నవాంశ 1
సార్ధోదితోదిత నవాంశ సమూహము 91
సర్వగ్రహదత్తాయుఃపిండ సంవత్సరములు 98-6-0
91

108) 8963-6-0 (82
864
823
216
107 × 12
1284 + 6
108) 1290 (11
1188
102 × 30
108) 3060 (28
216
900
864
36

సం 82 మా 11 ది 28 ఏర్పడుచున్నది.

| | | |
|---|---|---|
| సర్వగ్రహదత్తాయుఃపిండ సం. | 98- 6- 0 | నందు |
| క్రూరోదయగణన సం. | 82 11-28 | పోగా |
| మిగులు సంవత్సరములు. | 15- 6- 2 | స్థిరమగు ఆయుర్దాయ మగుచున్నది. |

ఇందువలన, 8 సంవత్సరములకు పైన 20 సంవత్సరములకు లోపుగకూడ ఆయుస్స మాప్తియగు నట్లేర్పడుటవలన ఈ దోషారోపణము అయుక్తముగనున్నది. కొందరు, పాపగ్రహావర్జితమైన లగ్నములందు బుట్టిన వారనేకులు 8 సంవత్సరములకు పైన 20 సంవత్సరములకు లోపుగ మృతిచెందుచున్నారేగాని, మయయవన మణిత్థాదుల యాయుర్దాయమునందు దోషము మాత్రము తప్పకయున్నదని యందురు. ఐనను, ఈ రీతిగ ఆయుర్దాయమును చెప్పియుండు గ్రంథకర్తలలో "షష్టాష్టమస్థోరిపు దృష్టమూర్తిః పాపగ్రహాః సాపగ్రహేయదిస్యాత్ స్వాంతర్దశాయాంమరణా యజంతోక్షే యస్సయుద్ధపజితో యదాన్యైః" అని బాదరాయణుడును, "క్రూరదశాయాంక్రూరః ప్రవిశ్యచాంతర్దశాం యదాకురుతేపుంసాం స్యాత్సందేహస్తదారిరోగే స్సదైవమహాజ్ క్షితితనయస్య దశాయాం రవిజస్యాంతర్దశాయ దావిశతి బహుకాల జీవినామపిమరణం నిస్సంశయంకురుతే" అని సారావళీకారకుడగు కల్యాణవర్మయు, "షష్టాష్టమస్థోరిపు దృష్టమూర్తిః పాపశ్శుభస్థానగతేన దృష్టః స్వాంతర్దశాయాంప్రకరోతి మృత్యుం, వ్యాధ్యధ్వబంధాది పరిక్షయాన్వా" అని యవనేశ్వరుడును అపమృత్యురోగముల వచించియుంచుట వలన పూర్వోక్తగ్రంథకర్తల అభిప్రాయమునందు దోషము చెప్పుట అయుక్తముగా నున్నది.

## ద్వితీయ దోషమునకు బరిహారము.

ధనుర్గంత్య నవాంశములగ్నమై, సూర్యుడు వృషభమున భా 10, చంద్రుడు మిథునమున భా 3. అంగారకుడు కుంభమున భా 28, బుధుడు మేషమున భా 15, గురుడుసింహమున భా 5, శుక్రుడు మేషమునందు భా 27, శనికుంభమున భా 20 లయందుండగా జనించినవాని ఆయుర్దాయమును పూర్వోక్తరీతిని గణనచేయగ:—

| | | | |
|---|---|---|---|
| | బుధుడు 15 భా.<br>శుక్రుడు 27 భా. | రవి 10 భా. | చంద్రుడు 3 భా. |
| కుజుడు 28 భా.<br>శని 20 భా. | రాశిచక్రము. | | |
| | | | గురువు 5 భా. |
| ల<br>అంత్య న | | | |

| రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | ల |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 10 | 0 | 4 | 0 | 10 | 8 |
| 10 | 3 | 28 | 15 | 5 | 27 | 20 | 27 |
| 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |

ఇందువలన యేర్పడు సంవత్సరాదులు.

| | రవికి | చంద్రునకు | కుజునకు | బుధునకు | గురువునకు | శుక్రునకు | శని | లగ్నము |
|---|---|---|---|---|---|---|---|---|
| సం. | 17 | 22 | 13 | 7 | 13 | 19 | 13 | 8 |
| మా. | 5 | 11 | 9 | 0 | 9 | 3 | 4 | 0 |

## హరణములు.

బృహస్పతి లగ్నమునకు నవమస్థానమున నుండుటవలన తన ఆయువునందు అష్టమాంశము హరించును. గనుక—

| | సం. మా. ది. | |
|---|---|---|
| గురువు ఆయుర్దాయము | 13 - 9 - 0 | లలో |
| అష్టమాంశము | 1 - 8 - 19 | పోగా |
| గురువుయొక్క హారణశుద్ధ ఆయువు సం. | 12 - 0 - 11 | అగుచున్నది. |

చంద్రుడు సప్తమమునందుండుటచే తన ఆయుర్దాయమున షష్టాంశము హరించును. గనుక—

| | సం. మా. ది. | |
|---|---|---|
| చంద్రాయుర్దాయము | 22 - 11 - 0 | |
| షష్టాంశము సం. | 3 - 3 - 25 | |
| చంద్రుని హారణశుద్ధ సం. | 19 - 1 - 5 | అగుచున్నవి. |

బృహస్పతి సూర్యునకు మిత్రుడు, శుక్రుడు తాత్కాలిక మిత్రుడుగనుక శత్రుక్షేత్రహారణము జేయనక్కరలేదు. అంగారకుడు శత్రుక్షేత్రమగు కుంభరాశియందున్నను, " హిత్వావక్రరిపు గృహాగతైర్హ్రీయతే స్వత్రిభాగః " అనుటచేతను, అంగారకునకు వక్రుడనుట వాడుకలోనుండుటచేతను కుజునకు శత్రుక్షేత్రహారణములేదు. ఈ ప్రకారముహారణముజేయగ మిగిలిన శుద్ధమైన ఆయువు.

| | సం. మా. ది. |
|---|---|
| సూర్యునకు | 17 - 5 - 0 |
| చంద్రునకు | 19 - 1 - 5 |
| అంగారకునకు | 13 - 9 - 0 |
| బుధునకు | 7 - 0 - 0 |
| గురువునకు | 12 - 0 - 11 |
| శుక్రునకు | 19 - 3 - 0 |
| శనైశ్చరునకు | 13 - 4 - 0 |
| లగ్నమునకు | 8 - 0 - 0 |
| మొత్తము సం. | 109 - 10 - 16 |

అగుచున్నది. ఇట్లు రాజయోగము లేకుండినను పూర్ణాయువు గలిగియుండుట గలుగుచున్నది, మఱియు, చంద్రయోగాధ్యాయము ననుసరించి చూడనిది కేమద్రుమయోగముగా నేర్పడుచున్నది. ఈ కేమద్రుమయోగమున జనించినవాడు దీర్ఘాయుష్మంతుడును, దుఃఖము ననుభవించువాడగుచున్నాడు. గనుక, రెండవదోష

రోపణమునకును అవకాశములేదు. ఇందుచే వరాహమిహిరాచార్యులు సత్యాచార్యుల మతాయుర్దాయమును అంగీకరింప బోవుచున్నారనుటకు వీలుగాదు "జ్యోతిషమాగమ శాస్త్రం విప్రతిపత్తౌనయోగ్య మస్మాతం స్వయమేవ వికల్పయితుంకింతు బహునాంయతంవక్ష్యే" అని వరాహమిహిరాచార్యుల ప్రతిజ్ఞ గనుక బహుతరాచార్య సమ్మతముగనున్నదని తెలియజేయుటగాని పూర్వోక్తాయుర్దాయ దూషణార్థముగాదని తెలియదగినది.

## జీవశర్మ మతాయుర్దాయ క్రమము.

శ్లో. స్వమతేనకిలాహజీవశర్మా గ్రహదాయం పరమాయుషః స్వరాంశం
గ్రహభుక్తనవాంశ రాశితుల్యం బహుసామ్యంసముపైతి సత్యవాక్యం.

టీ. జీవశర్మా = జీవశర్మయనెడు గ్రంథకర్త, స్వమతేన = తనమతముచేత, పరమాయుషః = పరమాయుస్సుయొక్క, స్వరాంశం = సప్తమాంశమును, గ్రహదాయం = ఒక్కొక్క గ్రహముయొక్క ఆయుర్దాయముగాను, ఆహకిల = చెప్పెనుగదా, గ్రహభుక్తనవాంశరాశితుల్య. అనఁగా ఒకానొక రాశియందు ఏనవాంశయందు గ్రహముండునో ఆనవాంశ ఏరాశినవాంశయగునో ఆరాశివఱకు మేషము మొదలుకొని లెక్కింపఁగా నెన్నియగునో అన్ని సంవత్సరముల ఆయుస్సును ఆ గ్రహమిచ్చుననుట. ఇట్లు గ్రహభుక్త నవాంశరాసులెన్నియగునో అన్ని సంవత్సరములును ఆయుఃప్రమాణకాలమగును, సత్యవాక్యం = ఈచెప్పియున్న సత్యమతాయుర్దాయము, బహుసామ్యం = అనేక గ్రంథకర్తలు చెప్పియున్న ఆయుర్దాయమునకు సమానత్వమును, సముపైతి = పొందుచున్నది.

తా. జ్యోతిష గ్రంథకర్తయగు జీవశర్మ తనమతానుసారముగ నాయుర్దాయమును స్థాపించు, నిధినేర్పరుపదలచి, పరమాయుర్దాయమగు, సం. 120, మా. 0, ది. 5 టిని, 7 సమభాగములు చేయగ, లబ్ధమేర్పడు సం 17, మా 1, ది 22, ఘ 8, విఘడియలు 34, ఒక్కొక్క గ్రహము తనపరమోచ్చయందున్నపుడిచ్చు ఆయుర్దాయమని నిశ్చయించియున్నారు, "సప్తదశై (17) కం (1) ద్వియమా (22) వసవో (8) వేదాగ్నయో (34) గ్రహేంద్రాణాం వర్షాద్యుచ్చస్థానాం నీచస్థానామతోర్థంస్యాత్ మధ్యేనుపాత తస్మాద్యదానయనం శిష్టమత్రయత్కించిత్ పిండాయుష ఇవకార్యం తత్సర్వం గణితత్వజ్ఞైః." అనుటచే పరమనీచస్థానగత గ్రహాయుర్దాయమున సగమునశించగ మిగిలినసం. 8, మా 9, ది 26, ఘ 6, విఘడియలు 17 మాత్రము యేర్పడుచున్నది. గ్రహము ఉచ్చ, నీచమధ్యమందుండునెడల పిండాయుర్దాయము ప్రకారము, త్రైరాశికముచేత నాయుర్దాయమును నిశ్చయింపవలయును. కుజునకుగాక తక్కిన గ్రహములకు శత్రుక్షేత్రహరణమనాబడు తృతీయాంశహరణము గావింపవలయును. శుక్రశనైశ్చరులకుగాక తక్కిన గ్రహములకు అస్తంగత హరణము జేయవలయును, మఱియు గ్రహస్థిత స్థానముల ననుసరించి "సర్వార్ధత్రిచరణ పంచషష్ఠభాగాః" అను ప్రకారము గవ్యయాది హరణము జేయవలెను. లగ్నము పాపాక్రాంతమై

యుండునెడల క్రూరోదయ హారణము "సార్ధోదితోదిత" అను శ్లోకమున జెప్పినరీతిగ జేయవలయును. ఈప్రకారము జీవశర్మమతాయుర్దాయమునందును అంశహారణాదులన్నియు పూర్వము జెప్పినరీతిగ జేయవలయును. అట్లు స్థిరపరచిన యాయుర్దాయమే జీవశర్మమతాయుర్దాయము.

## సత్యాచార్య ప్రోక్తాయుర్దాయ క్రమము

ఇందు "గ్రహభుక్త నవాంశరాశితుల్యం" అని యుండుటవలన, గ్రహస్థిత నవాంశ ఏరాశి సంబంధమగుచున్నదో ఆరాశివరకు మేషము మొదలుగ నెన్నియగునో అన్ని సంవత్సరముల ఆయువును ఆగ్రహము ఇచ్చునని తెలియదగినది. కనుక గ్రహభుక్తనవాంశలు ఎన్నియగుచున్నవో అన్ని సంవత్సరములును వర్తమాన నవాంశయందలి గతలిప్తాదులచేత త్రైరాశికము చేయగ నేర్పడు మాసాదులును ఆయాగ్రహమునకు ఆయుఃప్రమాణమగుచున్నది. ఈ విషయమై, "రాశ్యంశక సంయోగాద్గ్రహోగురిహ సమానాః గ్రహోదద్యుః" అని సత్యాచార్యులు వచించియున్నారు. ఈ ఆయుర్దాయక్రమము అనేకగ్రంథకర్తలు చెప్పియుండు ఆయుర్దాయమునకు సమానమైయున్నది. ఇందులకు "ఆయూంషి రాశ్యం శకచారయోగాత్" అని యవనేశ్వరుడు చెప్పియున్నాడు. కొందరు దైవజ్ఞులు, గ్రహస్థితరాశియం దెన్ని నవాంశలు భుక్తములై యుండునో అన్ని సంవత్సరముల ఆయువును ఆగ్రహము యిచ్చునని అర్థము చెప్పుచురుగాని ఈప్రకారము గణనచేయగ ప్రతిగ్రహమునకును 9 సంవత్సరములకు పైన ఆయుర్దాయమేర్పడదు గనుక ఈ అభిప్రాయము సరియైనదికాదు. ఈ విషయమునకు "రాశ్యంశకళాగుణితా ద్వాదశ నవభిర్గ్రహస్య భగణేభ్యః, ద్వాదశహతావ శేషోబ్దమాసగణనాదికాః క్రమశః." అను బాదరాయణ వచనాను సారముగ నర్థముచేయదగును. ఇట్లర్థము చేయగ మేషనవాంశభుక్తుడగు గ్రహమునకు ఒకసంవత్సరమును, వృషభ నవాంశభుక్తుడగు గ్రహమునకు రెండు సంవత్సరములును, మిథున నవాంశభుక్తుడగు గ్రహమునకు మూడు సంవత్సరములును కర్కాటక నవాంశ భుక్తుడగు గ్రహమునకు నాల్గు సంవత్సరములును, ఇట్లు మీనమునకు పండ్రెండు సంవత్సరములును క్రమముగనేర్పడు ఆయుర్దాయము ఆయాగ్రహమున కగుచున్నది.

## పూర్వ శ్లోకమున జెప్పబడియుండు సత్యాచార్య ఆయుర్దాయము గణించు క్రమము.

శ్లో. సత్యోక్తే గ్రహమిష్టం లిప్తీకృత్వా శతద్వయేనాప్తం
మండలభాగ విశుద్ధేఽబ్దాస్స్యుశ్శేషాత్తు మాసాద్యాః. 10

టీ. సత్యోక్తే = సత్యాచార్యోక్త విధానమునందు, ఇష్టం = తనకుఇష్టమైన, గ్రహం = గ్రహమును, లిప్తీకృత్వా = లిప్తలుచేసి, శతద్వయేన = 200 చేత, ఆప్తం = భాగింపగా వచ్చినలబ్ధమును, మండలభాగవిశుద్ధే = 12 చేత భాగింపగా, అబ్దాః = సంవత్సరములగును, శేషాత్తు = శేషమువలన, మాసాద్యాః = మాసదినఘటికాదు లేర్పడును.

తా. ఇష్టమైన గ్రహమును లిప్తలుజేసి నవాంశ లిప్తాప్రమాణమగు 200 చే హార్గా నగ లబ్ధము 12 కంటె అధికముగ నుండునెడల 12 చే భాగించిన సంవత్సరములగును, శేష మును 12 చే గుణించి 200 చే భాగ్గానగా మాసములును, శేషములవలన దినములు, ఘుడి యలు, విఘడియలును ఏర్పడుచున్నవి.

ఉదాహరణము:—

తాత్కాలిక గ్రహభుక్త రాశ్యాదులు. రా. భా. లి.
1 - 8 - 45
30
38 × 60
2280 + 45
2325 లిప్తలు.

2325 / 200

200)2325(11
2200
125 × 12
200)1500(7
1400
100 × 30
200)3000(15
3000

11 ను 12 చేత భాగించుట కు వీలుగాదు గనుక 11 సంవ త్సరము లగుచున్నవి. గనుక.

సం. 11 మా. 7 ది. 15.

శేషముండునెడల ఘుడియ లు విఘుడియలు చేయదగినది. ఇం దులకే "రాశ్యంశకళా గుణితా ద్వాదశ నవభిర్గ్రహాస్య భగణేభ్యః." అనురీతిని గణనవివరము.

60)540 లిప్తలు.
9-0
96
60)105 భాగలు.
8-15
12
12) 15 రాసులు.
1-3
30)135
4-15
27
12) 31(2
24
7
9 + 2 = 11.

మఱియొక విధము.

తాత్కాలిక గ్రహభుక్త రాశ్యాదులు. రా. భా. లి.
1 - 8 - 45
12
1 - 3 - 15 - 0
9
సం. 11 - 7 - 15 - 0

ఇదియూ పూర్వమువలెనే సం. 11 మా. 7 ది. 15 వచ్చుచున్నది. గనుక, ఈరీతుల నన్నిటి కనుగుణ్యముగ వరాహ మిహిరాచార్యులచేత నాయుర్దాయ నిర్ణయ క్రమము వచింపబడినది.

## ఈ ఆయుర్దాయ క్రియావిశేషములు.

శ్లో. స్వతుంగవక్రోపగతై స్త్రిసంగుణం
ద్విరుత్తమ స్వాంశకభ త్రిభాగగైః
ఇయా న్విశేషస్తు భదత్తభాషితే
సమాన మన్యత్ప్రథమే ప్యుదీరితమ్. 11

టీ. స్వతుంగ=తన ఉచ్ఛస్థానమును బొందియున్న గ్రహముచేతను, వక్రోపగతైః= వక్రించియున్న గ్రహముచేతను, ఇయ్యబడిన ఆయుస్సు, త్రిసంగుణం=మూడింటు గుణింపఁ దగినది, ఉత్తమ = వర్గోత్తమాంశయందున్న గ్రహముచేతను, స్వాంశక=తన నవాంశయందున్న గ్రహముచేతను, స్వభ=స్వక్షేత్రమందున్న గ్రహముచేతను, స్వత్రిభాగగైః = తన ద్రేక్కాణమందున్న గ్రహముచేతను, ఈయబడిన ఆయుస్సు, ద్విః = రెంటగుణింపఁదగినది, భదత్త భాషితే= సత్యాచార్యోక్తమైన యీఅంశాయుర్దాయమందు, ఇయాన్ విశేషః = ఈచెప్పిన మిగతను, అన్యత్ =ఇతరమైన, ప్రథమే ప్యుదీరితం=ప్రథమమున మయయవనాది మతమందుఁ జెప్పఁబడియున్న దానిని, సమానం = ఈసత్య మతాయుర్దాయమందును తుల్యమైనది.

తా తన ఉచ్ఛస్థానము ను బొందియున్న గ్రహమువల్లనుఁ వక్రించియుండు గ్రహము వల్లను ఏర్పడునట్టి ఆయువును మూడింటు గుణింపదగినది

వర్గోత్తమాంశయందు గల గ్రహము. స్వక్షేత్రము నందుగల గ్రహము.
స్వనవాంశయందు గల గ్రహము. స్వద్రేక్కాణమున గల గ్రహము.

ఇటువంటి గ్రహములచే నేర్పడు ఆయువు రెంటిచేత గుణింపదగినది. పూర్వము చెప్పిన ఆయుర్దాయ క్రమమందు లేక ఇందుమాత్రము విశేషముగా జెప్పబడినవి పైరెండు అంశములు మాత్రమే గనుక, ఆయుర్దాయ నిర్ణయమున పూర్వము జెప్పినరీతిగ వక్రవర్జముగ శత్రుక్షేత్రమందున్న గ్రహమునకు మూడవపాలు హారణముగ శుక్ర శనులకు గాక,తక్కిన గ్రహములకు అస్తంగత దోషముండునెడల సగభాగ హారణమును, "సర్వార్ధత్రిచరణో" అను దాని ననుసరించి వ్యయాది స్థానములకు జెప్పబడిన రీతి హారణములను జేసి తరువాత పై రెండు గుణకారముల గమనించవలయును. 11

## లగ్నాయుర్దాయ క్రమము.

శ్లో. కిం త్వత్ర భాంశ ప్రతిమం దదాతి
వీర్యాన్వితా రాశి సమంచ హోరా
క్రూరోదయే చాపచయ స్స నాత్ర
కార్యంచ నాద్యైః ప్రథమోపదిష్టైః. 12

టీ. కింతు=మఱియు, అత్ర=ఈ సత్యాచార్యోక్తాయుర్దాయమున, హోరా=లగ్నము భాంశప్రతిమం=నవాంశ రాశితుల్య వర్షములను, దదాతి=ఇచ్చుచున్నది. వీర్యాన్వితా=బలయుక్తమైయుండెనేని, రాశిసమంచ=లగ్నరాశి సమానవర్షములను, దదాతి=ఇచ్చుచున్నది. క్రూరోదయే = లగ్నమందు పాపగ్రహముండెనేని, అపచయః=క్రూరోదయహారణము, అత్ర=ఈసత్య మతాయుర్దాయమందు, న=లేదు, ప్రథమోపదిష్టైః=మొదట జెప్పఁబడిన,అబ్దైః ఆయుర్వత్సరములచేతను, కార్యం =చేయఁదగిన త్రైరాశికము. అత్ర=ఈ సత్యాయుర్దాయమందు, న = లేదు, కొందఱు, ప్రథమోపదిష్టైః=పూర్వోక్తములైన, అబ్దైః=మయయవనాద్యుక్తవర్షములచేతను, జీవశర్మోక్త వర్షముల చేతను న కార్యం=ఆయుర్దాయము చేయఁదగదు.

తా. ఈ ఆయుర్దాయమునందు లగ్న నవాంశరాశికి సమమగు వర్షములిచ్చుచున్నది. తత్కాలలగ్నమున వర్తమాన నవాంశ ఏ రాశికి సంబంధించినదో ఆరాశికి పూర్వరాసుల నన్నిటిని మేషాదిగ లెక్కింపగ నెన్నియగునో యన్ని సంవత్సరములును వర్తమాన నవాంశలను లిప్తలుజేసి ఆ లిప్తలను 12 చే గుణించి 200 చే భాగింపగ లబ్ధము మాసములుగను, శేషమును 30 చే గుణించి 200 చే భాగింపగ లబ్ధము దినములుగను అగుచున్నవి. శేషముండునెడల ఘడియలు విఘడియలు జేయదగినది.

ఇట్లు జేయగ నేర్పడిన సంవత్సర మాసాదులు, లగ్నాయుర్దాయ మగుచున్నది.

మఱియు, " హోరాస్వామి గురుజ్ఞవీక్షితయుతా నాన్యైశ్చ వీర్యోత్కటా." అను ప్రకారముగ లగ్నము బలయుక్తమై యుండునెడల లగ్నరాశి సమానవర్షము లిచ్చుచున్నది. లగ్నరాశి పూర్వరాసులు మేషాదిగ లెక్కింపగ నెన్నియగునో అన్ని సంవత్సరములును లగ్నభుక్తిని లిప్తలుచేసి ఆ లిప్తలను 12 చే గుణించి రాశిలిప్తా ప్రమాణమగు 1800 చే భాగింపగ లబ్ధము మాసములును శేషమును 30 చే గుణించి 1800 చే భాగించగ దినములును, యేర్పడుచున్నవి. శేషముండునెడల ఘడియలు విఘడియలు జేయవలెను. ఇట్లు చేయగ నేర్పడునది ఆయుర్దాయము.

లగ్నము బలహీనమైనచో "భాంశ ప్రతిమందదాతి" అను దాని ననుసరించి నవాంశ రాశితుల్యముగ లగ్నాయుర్దాయము నిర్ణయింపదగినది. పూర్వము జెప్పినరీతిగ మయయవనాదుల మతానుసారము ననుసరించి లగ్నమునందు పాపగ్రహ ముండునెడల క్రూరోదయహారణము జేయవలెననుట. ఈ సత్యాచార్య ప్రోక్తాయుర్దాయమందులేదు. మఱియు నీ ఆయుర్దాయాధ్యాయ ప్రథమశ్లోకమున మయ యవన మణిత్థ పరాశరాదుల మతానుసరణముగ "అబ్దేనవ తిథివిషయాశ్వి భూతరుద్రైః" అను గ్రహపరమాయుర్వర్ష క్రమసంఖ్యలచేతను, "గ్రహాదాయం పరమాయుష స్వరాంశం" అను జీవశర్మమత ఆయుర్వత్సరములచేతను, జేయబడు త్రైరాశికము, ఈ సత్యాచార్యమతమున లేదు. "సత్యోక్తే గ్రహమిష్టం" అని యుండుటచే ఇతరుల మతముల ననుసరింపక సత్యాచార్య ప్రోక్తాయుర్దాయ క్రమమున ఆయుర్దాయమును నిర్ణయింపదగినదని కొందరందురుగాని భట్టోత్పలుని వ్యాఖ్యానమున పూర్వోక్తాయుర్దాయ క్రమనిషేధము గానబడలేదు.

## క్రూరోదయ హరణ నిషేధము.

శ్లో. సత్యోపదేశో వర మత్ర కింతు
కుర్వంత్యయోగ్యం బహువర్గణాభిః
ఆచార్యకం త్వత్ర బహుఘ్నతాయా
మేకంతు యద్భూరి తదేవ కార్యం. 13

టీ. అత్ర=ఈ చెప్పఁబడిన మూడు మతములయందును, సత్యోపదేశః = సత్యాచార్య మతము, వరం=శ్రేష్ఠమైనది, కింతు=మఱియు, ఈసత్యాచార్యాయుర్దాయమును కొందఱు బహువర్గణాభిః=బహు గుణములచేత, అయోగ్యం=అ యోగ్యమైన దానినిగాను, కుర్వంతి = చేయుచున్నారు. యత్=ఏది, భూరి=అధికమైనదో, తత్=అతూడిక, ఏకమేవ=ఒక్కటియై, కార్యం=చేయదగినది. ఆచార్యకం=ఇది ప్రాచీనాచార్యపద్ధతి.

తా. వరాహ మిహిరాచార్యులు, మయ, యవన మణిత్థ, పరాశరాదులమతాయుర్దాయ క్రమమును, జీవశర్మ మతాయుర్దాయ క్రమమును, సత్యాచార్య ప్రోక్తాయుర్దాయ క్రమమును జెప్పి అన్నిటియందును సత్యాచార్య మతమే శ్రేష్ఠమైనదని వచించుచున్నాడు. కొందఱు ఈ సత్యాచార్యుల మతము ననుసరించిన ఆయుర్దాయగణితమును జక్కఁగ జేయక శాస్త్రరీతి నెఱుంగక అనేక గుణనలచేత చెరుచుచున్నారు. "స్వతుంగ వక్రోపగతై స్త్రిసంగుణం" అని యుండుటచే స్వోచ్చయందుండు గ్రహాయుర్దాయమును మూడింట గుణించి అగ్రహామే వక్రించి స్వక్షేత్రమునందుండు నెడల వక్రమున కొక గుణనము స్వక్షేత్రమున కొకగుణనము ఇట్లు రెండు సారులు మూడింట గుణించి అగ్రహామే స్వనవాంశ స్వద్రేక్కాణఃగులయం దుండెనేని, నవాంశ కొక్కటూరి ద్రేక్కాణమునకు మఱియొకమారును రెండింటగుణించి ఈ ఆయుర్దాయక్రమము అనావశ్యకములగు గుణనలచే ఉపయోగము లేనిదానినిగా జేయుచున్నారు.

గణనచేయుపద్ధతి:—ఒక గ్రహమునకు అనేకములగు ద్విగుణత్వ, త్రిగుణత్వములు ప్రాప్తించినయెడల వానియం దేది యధికమైనదో ఆగుణన మొకటిమాత్రము జేయనగినది. ఇదియే పూర్వ గ్రంథాచార్య సంప్రదాయము. ఒక గ్రహమునకు రెండుసారులు ద్విగుణత్వము చేయవలసి యుండునెడల ఒకసారిమాత్రమే గుణనము చేయదగినది. ఒక ద్విగుణత్వము, ఒక త్రిగుణత్వము చేయవలసి యుండునెడల అధికమగు త్రిగుణత్వము మాత్రము చేయదగినది. రెండుసార్లు త్రిగుణత్వము చేయవలసి యుండునెడల ఒక్కటూరిమాత్రమే గుణనము చేయదగినది.

చక్రపాత హరణముగాక తక్కిన హరణములలో ననేకములు ఒక గ్రహమునకు తటస్థించినయెడల వానిలో అధికమైన హరణము ఒకటిమాత్రము చేయదగినది. ఒక గ్రహము నీచక్షేత్రగతంబును, శత్రుక్షేత్రగతంబును, అస్తంగతంబునై యుండునెడల. ఒక అర్థాంశ హరణమును మాత్రము జేయదగినది. ఒక గ్రహమునకు, కొన్ని హరణములును, కొన్ని గుణ

నలును, చేయవలసియుండు నెడల అధికమగు హారణమునొక్కదానిని జేసి తరువాత అధికమగు గుణనమొక్కటిని జేయదగును. ఒక గ్రహమునకు చక్రపాతహారణమును, శత్రుక్షేత్రాది హారణమును, స్వోచ్చాదిగుణనమును, సంభవించినయెడల ప్రథమమున చక్రపాతహారణమును, తరువాత శత్రుక్షేత్రాదిహారణములలో అధికమైనదాని నొక్కహారణము జేసి, అధికమగు ఒకగుణనమును మాత్రముచేయదగినది. ఈవిషయమునకు, "రాశితుల్యాంశసంఖ్యాని గ్రహో వరాణియచ్ఛతి, లగ్నంచే త్సబలంతాని భుక్తరాశిసమానితు, మాసాద్యనయనంకార్య మను పాతాదతఃపరం, సర్వార్ధత్రిచతుర్థాంశాక్ వామంపంచమడంశకాక్, హరంతి పాపాస్స్వాద్దాయా త్తదర్ధ మితరేగ్రహాః, వ్యయాచ్చక్రాపహానిస్తు కదితేయంతథాధ్రువమ్, ఏకస్తేష్వేకగ్రహేష్వేన కరోతిబలవాక్ గ్రహాః, శత్రుక్షేత్ర గతస్త్రంశం నీజేర్ధంసూర్యగస్తథా, హంతి స్వదాయాద్రవిగా వసితాదిత్యనందనా, నచావనిసుతశ్చాంతం శత్రుక్షేత్రగతస్తథా, ధ్రువాపహానిః కర్తవ్యా తతో న్యాసు బహుష్వపి, ప్రాప్తాస్వేకైవకర్తవ్యా యాస్వాత్తాసు మహత్తరా, తతస్తుగుణనాకార్యా స్యైకైవ మహతీసకృత్, ద్వాభ్యాంవర్గోత్తమేస్వాంశే స్వద్రేక్కాణేస్వకేగృహే, త్రిభిర్వక్రగతస్యాథ స్వోచ్చరాశిగతస్యచ, గ్రహదాయాభవత్యేవం శోధ్యక్షేపకృతఃక్రియః." అని గార్గివచించియున్నాడు. సత్యాచార్య ప్రోక్తాయుర్దాయమును ప్రధానముగ నంగీకరించిన వరాహమిహిరాచార్యులేగాక పిండాయుర్దాయక్రమము నేర్పరచిన మణిత్థాదులుగూడ, "విలగ్నభేబలోపేతే శుభదృష్టేంశసంభవః, రవౌపిండోద్భవంకుర్యా దితిబ్రూయుశ్చింతకాః" అని చెప్పియుండుటవలన జననలగ్నము బలాధిక్యతగలిగి యుండునెడల అంశాయుర్దాయమును, జననకాలమున సూర్యుడు బలీయుడై యుండునెడల పిండాయుర్దాయమును జేయదగినదని, భట్టోత్పలుడు వ్యాఖ్యానముజేసి యున్నాడు మఱియు కొందఱుజ్యోతిష్కులు, పైజెప్పిన అంశాయుః పిండాయువులను రెంటిని గణించి, అందేదియల్పాయువు గలిగియున్నదో దానికడపటి అంతర్దశ మూలదశాధిపతికి, మిత్రుగ్రహాంతర్దశయగునెడల ఇంకను జీవించుననియు, మధ్య గ్రహాంతర్దశయగు నెడల తత్కాలమున శరీరపీడగలుననియు, నీరెండు విధములయందును, అధిక వత్సరములు వచ్చు ఆయుర్దాయమును, శత్రుగ్రహాంతర్దశయగునెడల తత్కాలమున మరణము గల్గుననియు, ఇందులకు అల్పాయువు గలిగియుండు ఆయుర్దాయపద్ధతిని స్థిరపరచు చున్నారు. గాని ఈప్రకారముచేయుట యుక్తముగాదని పూర్వగ్రంథకర్తల అభిప్రాయమనుటను ముఖ్యముగా గమనింప వలయును.

## అపరిమితాయుర్యోగము.

శ్లో. గురు శశి సహితే కుళీరలగ్నే
శశితనయే భృగుజేచ కేన్ద్రియాతే
భవ రిపు సహజోపగైశ్చశేషై
రమిత మిహాయు రనుక్రమా ద్వినా స్యాత్ 14

టీ. కుళీరలగ్నే = జన్మలగ్నమైనకర్కాటకము. గురుశశిసహితే = గురుచంద్రులతో కూడియుండఁగా, శశితనయే = బుధుడును, భృగుజేచ=శుక్రుడును, కేంద్రయాతే = కేంద్రస్థానగతులైయుండఁగా, భవరిపుసహజోపగైః = ఏకాదశషష్ఠ తృతీయస్థానములయందున్న, శేషైః=తక్కిన రవికుజశనులచేత, ఇహ=ఈయోగమందుఁబుట్టినవానికి, అనుక్రమాద్వినాపి = గణితక్రమము నతిక్రమించి, అమితం=అపరిమితమైన, ఆయుః=ఆయుష్యు, స్యాత్=కలుగును.

తా. కర్కాటకము జననలగ్నమై అందుగురు చంద్రులుండి, బుధశుక్రులు కేంద్రస్థానస్థితులగుచుండగా, 11-6-3, యిండ్లయందు రవ్యంగారక శనైశ్చరులుండు కాలమున జనించిన వానికి పూర్వోక్త పరమాయుస్సుకంటె అధికమగు ఆయుర్దాయముగలదు కనుక ఇట్టియోగమున బుట్టినవానికి ఆయుర్దాయగణనసేయ నక్కరలేదు.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ఆయుర్దా యాధ్యాయ నామక
సప్తమాధ్యాయము.

---

శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### దశాంతర్దశాధ్యాయము. అష్టమాధ్యాయము.—8.

---

శ్లో. ఉదయ రవి శశాంక ప్రాణి కేంద్రాది సంస్థాః
ప్రథమవయసి మధ్యేంత్యేచ దద్యుఃఫలాని
నహిన ఫలవిపాకః కేంద్రసంస్థా ద్యభావే
భవతిహి ఫలపక్తిః పూర్వమాపోక్లిమేపి. 1

టీ. ఉదయరవి శశాంకప్రాణి కేంద్రాది సంస్థాః—ఉదయరవిశశాంక=లగ్నరవిచంద్రుల లోపల, ప్రాణి=బలాధికుని ప్రథమదశయగును, ఆప్రథమదశాపతికి, కేంద్రాదిసంస్థాః=కేంద్ర పణ ఫరాపోక్లి మస్థానములలోని గ్రహములు, ప్రథమవయసి=ప్రథమవయస్సునందును, మధ్యే

వయోమధ్యమందును, అంత్యేచ=అంతిమవయస్సునకును, ఫలాని=(తమతమ) దశాఫలములను, దద్యుః=ఇచ్చును, కేంద్రసంస్థాద్యభావే=ప్రథమదశాపతికి కేంద్రస్థానములయందు గ్రహములు లేకుండినను, ఫలవిపాకః=వయఃప్రథమమున ఫలపరిణతి, నహీతిన=లేకుండదు, పూర్వం=ప్రథమవయస్సునందు, ఆపోక్లిమేపి=ఆపోక్లిమస్థానమందుండు గ్రహములకును, ఫలపక్తిః=ఫలపరిణతి,భవతిహి = అగుచున్నదిగదా.

తా. పూర్వాధ్యాయోక్తముగా ఆయుర్దాయ నిర్ణయముజేయబడిన జాతకులకు సుఖ దుఃఖాదులు జరుగు కాలమును వివరించుటకై దశాంతర్దశలు యేర్పరుపబడి యున్నవి.—

## దశాక్రమము.

లగ్న, రవి, చంద్రులలో లగ్నము బలవంతమై యుండునెడల లగ్నమునకును, రవిబలవంతుడై యుండునెడల రవికిని, చంద్రుడు బలాధికుడైయుండునెడల చంద్రునకును ప్రథమదశ నేర్పరుపవలయును. తరువాత, ప్రథమదశాధిపతికి కేంద్రములందుండు గ్రహములకును, తదుపరి ఫణపరములందుండు గ్రహములకును, అటుపిమ్మట ఆపోక్లిమములందుండు గ్రహములకును, క్రమముగా గ్రహబలాధికత ననుసరించి దశల నేర్పరుపవలెను.

ప్రథమ దశాధిపతికి కేంద్రస్థానములగు 1,4,7,10,ఈ యిండ్లయందుండు గ్రహములు ప్రథమ వయస్సునందును, ఫణఫరస్థానములగు 2,5,8,11 ఈ యిండ్లయందుండు గ్రహములు మధ్యవయస్సునందును, ఆపోక్లిమస్థానములగు 3,6,9,12 ఈయిండ్లయందుండు గ్రహములు అపరవయస్సునందును తిమతమ దశాఫలముల నిచ్చుచుందురు. ప్రథమదశానాథునకు కేంద్రములందు గ్రహములులేకుండునెడల ప్రథమవయస్సునందును, ఫణఫరస్థానములయందు గ్రహములులేకుండునెడల మధ్యవయస్సునందును ఫలపరిపాకము లేక పోవుట లేదు. కేంద్రపణఫరములయందు గ్రహములు లేనప్పుడు, అపోక్లిమస్థానస్థితగ్రహఫల పరిపాకము ప్రథమవయస్సునగలుగు చున్నదిగదా ?

లగ్నమునకు శరీరమనియు, సూర్యునకు ఆత్మయనియు, చంద్రునకు మనస్సనియు సంజ్ఞలుగనుక, లగ్న రవిచంద్రులలో బలాధికత ననుసరించి పైజెప్పినరీతిని ప్రథమదశను కల్పించి, ప్రథమదశానాథునికి కేంద్ర, ఫణపర, ఆపోక్లిమస్థానములందుండు గ్రహములకు క్రమముగా తదుపరిదిశలను కల్పింపవలెను. కేంద్రస్థానములుందు గ్రహములు లేకున్నచో ప్రథమదశానంతరమున ఫణపర స్థానస్థితగ్రహములకును, కేంద్ర, ఫణపరములను ద్వివిధస్థానములయందును గ్రహములులేకున్న, ఆపోక్లిమస్థానములందున్న గ్రహములకును, ప్రథమదశానంతర దశలను బలాధికత ననుసరించి నిర్ణయింపవలెను కేంద్రములయందును, ఆపోక్లిమముల యందును గ్రహములుండి పణపరములందు గ్రహములు లేకుండెనేని, ప్రథమదశానంతరమున కేంద్రస్థానస్థిత గ్రహములకు దశలుకల్పించి తదుపరి ఆపోక్లిమస్థానస్థిత గ్రహములకు దశలను కల్పింపవలెను.

## దశాకాల ప్రమాణాదులు.

శ్లో. ఆయుఃకృతం యేనహి యత్తదేవ కల్ప్యాదశా సా ప్రబలస్యపూర్వం
సామ్యే బహూనాం బహువర్షదస్య తేషాంచసామ్యే ప్రథమోదితస్య.

టీ. యేన=ఏగ్రహముచేత, యదాయుః, యేఆయుష్షు, కృతం=చేయఁబడునో, తదేవ=ఆయువే, దశా=దశాకాలమని, కల్ప్యా=నిశ్చయింపఁదగినది, సా=ఆదశ, ప్రబలస్య=అధికబలునికి, పూర్వా=మొదటిదియగును, బహూనాం=అనేకగ్రహములకు, సామ్యే=బలసామ్యము కలుగుచుండఁగా, బహువర్షదస్య=ఏగ్రహము అయుర్దాయము నధికరింపఁజేయునో ఆగ్రహమునకు ముందర దశకల్పింపఁదగినది. తేషాంచ=ఆయాయుర్దాయ వర్షములకును, సామ్యే = సమత్వము కలుగుచుండఁగా, ప్రథమోదితస్య=ఏగ్రహము మొదటనుదయించి యుండునో ఆగ్రహమునకు ముందరదశ కల్పింపఁదగినది.

తా. పూర్వాధ్యాయమగు ఆయుర్దాయాధ్యాయమున జెప్పబడిన రీతిని గణనజేయగా నేగ్రహమునకు, హరణభరణా వశిష్టమగు ఆయువెంత, ఏర్పడుచున్నదో అంతకాలమే ఆగ్రహముయొక్క దశయగుచున్నది. "సాప్రబలస్యపూర్వం" అనియుండుటచే పూర్వశ్లోకోక్తముగ లగ్న, రవి, చంద్రులయందు ప్రథమదశగల్పించిన పిదప ప్రథమదశానాథునకు కేంద్రస్థానస్థితగ్రహముల యందుబలాధిక్యత జెందినగ్రహమునకు తదనంతరదశను గల్పించి, ఆగ్రహమునకన్న తక్కువ బలముగలిగి కేంద్రస్థానములయందే యుండుగ్రహముల కన్నిటికి. బలము ననుసరించి క్రమముగ తదనంతరదశల నేర్పరుప వలెను. ఈరీతిగనే పణఫర ఆపోక్లిమస్థానములందుండు గ్రహములకు బలాధికత క్రమముననుసరించి దశల నేర్పరుపవలెను, కేంద్రాది స్థానములయందుండు అనేకగ్రహములు సమానబలయుతములు లగుచుండెనేని, ఏగ్రహముయొక్క ఆయుర్దాయ మధికముగ నున్నదో, ఆగ్రహమునకు ప్రథమదశానంతర దశనుకల్పింపవలెను ఆయుర్దాయ కాలముగూడ సమముగనుండునెడల ఏగ్రహము సూర్య మండలము నుండి మోక్షమునుపొంది మొదటనుదయించియుండునో ఆగ్రహమునకు ముందటిదశనుకల్పింపవలెను, ఈవిషయమునకు, "బలీలగ్నేందు సూర్యాణాం, దశమాద్యాం ప్రయచ్ఛతితస్మాతతః ప్రయచ్ఛంతి కేంద్రాదిస్థాః క్రమేణతు, తత్రాతుబలినః పూర్వంతత్సామ్యే బహుదాయకాః, తత్సామ్యేపి ప్రయచ్ఛంతి యేపూర్వంరవి విచ్యుతాః" అనిగార్గియు. "పూర్వా దశాతి బలినస్స దృశేద్బవృద్ధి, స్సామ్యేభవేచ్చ శరదాంప్రథమోది తస్య" అని సారావళీకారకుఁడును వచించి యున్నారు.

## అంతర్దశావివరము.

శ్లో. ఏకర్క్షగోర్ధ మపహృత్య దదాతితుస్వం
త్ర్యంశం త్రికోణగృహగః స్మరగస్స్వరాంశం
పాదం ఫలస్య చతురస్ర గతస్సహోరా
స్త్వేవం షడన్సర గతాః పరిపాచయంతి. 3

టీ. ఏకస్థగః = (మూలదశాపతినిగూడి) యొకరాశియందున్న గ్రహము, అర్ధం = అర్ధాంశకాలమును, అపహృత్య=తీసుకొని, స్వం=తన (దశాఫలమును), దదాతి = ఇచ్చును, త్రికోణగృహగః=నవమపంచమములందుండు గ్రహము, త్ర్యంశం=తృతీయాంశ కాలమును స్మరగః=ఏడవయింటనున్న గ్రహము, స్వరాంశం = సప్తమాంశకాలమును, చతురస్రగతః= చతుర్థాష్టమములందున్న గ్రహము, ఫలస్య=ఫలకాలముయొక్క, పాదం = చతుర్థాంశకాలమును అపహరించి నీతియు దశాఫలమునిచ్చును ఏవం=ఈవిధముగా, సహోరాః=లగ్నయుక్తములైన గ్రహములును, పరస్పరగతాః = ఈముందు చెప్పిన స్థానములయందుండినవై, పరిపాచయంతి=పరిపాకము సేయును,

తా. మూలదశా సంవత్సరములలో జన్మకాల గ్రహస్థితిచే ముందర మూలదశాధిపతికి భాగకల్పనజేసి పిమ్మట మూలదశాధిపతికి వచ్చిన అంతర్దశావత్సరములకు సమముగా అర్ధాది భాగంబులు ఏకరాశ్యాదిగత గ్రహంబులకు గల్పించతగినవి. మూలదశా నాధునితోగూడ నొకరాశియందేయుండు గ్రహము మూలదశానాధుని దత్తాంతర్దశాకాలమున అర్ధాంశమును హరించి ఆకాలమున తనదశాఫలమును ఇచ్చును. మూలదశాధిపతికి పంచమ నవమముల యందుండు గ్రహము మూలదశానాధుని దత్తాంతర్దశాకాలమున తృతీయాంశమునుహరించి తత్కాలమున తన దశాఫలమువొసంగును. మూలదశాధిపతికి సప్తమస్థానమునందున్న గ్రహము మూలదశానాధ దత్తాంతర్దశాకాలమున సప్తమాంశమును హరించి తత్కాలమున తన దశాఫలము నిచ్చును. మూలదశానాధునికి చతుర్థాష్టమముల నొక్కెడనున్న గ్రహము మూలదశాధిపతి దత్తాంతర్దశాకాలమునందు చతుర్థ భాగమునుహరించి తత్కాలమున తన దశాఫలమునిచ్చును. (పంచమ, నవమస్థానములు రెంటియందును గ్రహములున్నయెడల మూలదశాధిపతి దత్తాంతర్దశాసంవత్సరములయందు తృతీయాంశములో అర్ధము పంచమస్థానస్థితిగ్రహ అంతర్దశా కాలమనియు, తక్కిన అర్ధమున నవమస్థానమందున్న గ్రహముయొక్క అంతర్దశాకాలమనియు తెలియదగినది( ఇట్లే చతుర్థాష్టమములయందున్న గ్రహములకు అంతర్దశానిర్ణయము గల్పించదగినది) ఇట్లులగ్నసహితములైన గ్రహములు, ఒకరొకరు పూర్వోక్తస్థానముల యందుండి తమతమస్థానస్థితి బలాధిక్యములచేత మూలదశాకాలమును భాగించుకొనుచున్నవి. ఏకరాశ్యాధిగత గ్రహములవలెనే లగ్నమును ఏకరాశ్యాదిగతమైనదగుచు పూర్వోక్త భాగముల నపహరించి, తన దశాఫలమునిచ్చునని యెరుగదగినది. ఇందుచెప్పబడిన స్థానములలోనే స్థానమునందైనను రెండు మూడు గ్రహములుండెనేని అందు బలాధికమైన ఒక గ్రహమునకే అంతర్దశకల్పింప దగినదిగాని యితర గ్రహములకు జేయదగదు. ఈ విషయమై. "ఏకస్థోప గతానాం సౌభవతిబలాధికో విశేషేణ, ఏకస్సయేవహర్తానాన్యేత్రత్ర స్థితాశ్చ హర్తారః" అని యముండును, "ఏకస్థ గేషుబలవాన్ భాగహరోమిత్రతోరిపోర్వ్యాపి, మిత్రంచపుష్కల ఫలంతస్మిన్ కాలేరిపోర్నైవం" అని సత్యాచార్యులును వచించియున్నారు. లగ్నమునకును అంశహారిత్వ ముండుటవలన, లగ్నమందు గ్రహమున్నయెడల లగ్నగ్రహములలోనేది బలాధి

క్రమో దానికిమాత్రము అంతర్దశను కల్పింపదగినది. ఒక స్థానమునందు అనేక గ్రహములుండు నెడల ఆగ్రహములకన్నిటికి ఆస్థానమునకేర్పరుప బడియుండు ఒక భాగకాలమును విభజించి అంతర్దశల కల్పింపదగుననియు, మూలదశానురోధముగ గ్రహములకు అంతర్దశాధి పత్యము గలుగుననియు జెప్పుదురుగాని అన్ని గ్రహములకును అంతర్దశలురావనుట పూర్వోక్త గ్రంధకర్తల అభిప్రాయము.

## అంతర్దశా విభాగగణితము.

శ్లో. స్థానాన్యథైతాని సవర్ణయిత్వా సర్వాణ్యధశ్ఛేద వివర్జితాని
దశాబ్దపిండైర్గుణనా యథాంశం ఛేదస్తదైక్యేన దశాప్రభేదః. 4

టీ. ఏతాని=ఈచెప్పఁబడిన, స్థానాని= స్థానములను, సవర్ణయిత్వా=సమభాగములుగా చేసి,అధశ్ఛేదవివర్జితాని=అధఃప్రదేశస్థితచ్ఛేదసంఖ్యావిహీనమునవై, సర్వాణి=సమచ్ఛేదములు చేసియున్న ఆ సకలస్థానములను, దశాబ్దపిండైః=మూలదశా సంవత్సరాదులచేత, గుణనా= వేర్వేఱుగాగుణించి, తదైక్యేన = ఛేదసంఖ్యావిహీనములైయున్న పై సంఖ్యల మొత్తముచేత, ఛేదః=భాగముచేయఁదగినది. ఇట్లుచేయఁగా, యథాంశం= మొదట జెప్పఁబడిన అర్థాద్యంశ ముల నతిక్రమింపక, దశాప్రభేదః=అంతర్దశాకాలభేదం బేర్పడును.

తా. పూర్వశ్లోకమున జెప్పబడియున్న అర్ధాంశ, తృతీయాంశ సప్తమాంశాది స్థానములను, సమచ్ఛేదములుగాజేసి అందు క్రిందనున్న ఛేదసంఖ్యలనుత్రోసి మీదనుండునట్టి స్థానములనన్నిటిని వేర్వేరుగా మూలదశాసంవత్సరాదులచేత గుణించి ఛేదసంఖ్యావిహీనములై మీదనున్న సంఖ్యలనన్నిటిని నొకటిగాకూడి ఆమొత్తముచేత పాల్గొనగా ఏకరాశ్యాదిగత గ్రహముల అంతర్దశాకాలములు యథాంశముగావచ్చును.

మరియొక ఉదాహరణము:—

మూలదశాధిపతికి చతురశ్రమస్థానములగు చతుర్థాష్టమములయందు గ్రహములుండి మూలదశాధిపతియుండు రాశియందును, ఆరాశికి త్రికోణములయందును, సప్తమమునందును, గ్రహములులేకుండగా.

న్యాసము.

| 1 | 1 | 1 |
|---|---|---|
| 1 | 4 | 4 |

పైవానిని సమచ్ఛేదములు చేయగా.

| 16 | 4 | 4 |
|---|---|---|
| 16 | 16 | 16 |

వీనియందుక్రిందనున్న ఛేదసంఖ్యలనుత్రోయగా. 16, 4, 4, అగుచున్నవి. ఈసంఖ్యల నొకటిగాగూడిన మొత్తము 24 అగుచున్నది. మూలదశాసంవత్సరములు 6 ఈ సంఖ్యచేత ప్రథమస్థానమునందున్న 16ను గుణించగానగు 96ను మొదటమొత్తముచేసియుండు 24 చేత పాల్గొనగా మూలదశాధిపతికివచ్చిన అంతర్దశాసంవత్సరములు 4 పూర్వమువలెనే ద్వితీ

యీ తృతీయస్థానములందుండు సంఖ్యలను వేర్వేరుగా మూలదశాసంవత్సరములగు ఆరింటిచే గుణించి ఆ మొత్తమును మొదటిమొత్తమైయుండు 24 చేత భాగింపగా ఒక్కొక్క స్థానమునకును, ఒక్కొక్క సంవత్సరము వచ్చుచున్నది. గనుక మూలదశాపతికి చతుర్థస్థానమందున్న గ్రహమునకగు అంతర్దశాసంవత్సరము ఒకటియు, మూలదశాధిపతికి అష్టమస్థానమందున్న గ్రహమునకగు అంతర్దశాసంవత్సరము ఒకటిగను ఏర్పడుచున్నది. ఈముగ్గురి అంతర్దశాసంవత్సరముల గలియగూడగా ఆరు సంవత్సరములగుచున్నవి.

మరియొక ఉదాహరణము:—

| | |
|---|---|
| మూలదశాధి పతికి రూపము. | 1 |
| మూలదశాధిపతితోగూడి ఏకరాశియందున్న గ్రహమునకు. | 2 |
| మూలదశాధిపతికి త్రికోణస్థానములలో నొకస్థానమందున్న గ్రహమునకు రూప తృతీయాంశము. | 3 |
| మూలదశాధిపతికి చతురశ్రములలో నొక స్థానమునందున్న గ్రహమునకు రూప చతుర్థాంశము. | 4 |
| మూలదశాధిపతికి సప్తమమందున్న గ్రహమునకు రూప సప్తమాంశము. | 7 |

న్యాసము.

| 1 | 1 | 1 | 1 | 1 |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 7 |

వీనిని సమచ్ఛేదములు జేయగా.

| 168 | 84 | 56 | 42 | 24 |
|---|---|---|---|---|
| 168 | 168 | 168 | 168 | 168 |

ఇందు, 168, 84, 56, 42, 24 వీటిని కలియగూడగా 374 అగుచున్నది. మూలదశా సంవత్సరములు 12. పై వాటిని పూర్వమువలె మూలదశా సంవత్సరములచే గుణించి మొత్తముచే భాగింపగా నేర్పడు.

## అంతర్దశల వివరము.

| | సం. | మా. | ది. | ఘ. | వి. |
|---|---|---|---|---|---|
| మూల దశాధిపతికి. | 5 | 4 | 20 | 32 | 5 |
| ఏకరాశి గ్రహమునకు. | 2 | 8 | 10 | 16 | 2 |
| త్రికోణములలో నొకటనున్న గ్రహమునకు. | 1 | 9 | 16 | 50 | 41 |
| చతురశ్రములలో నొకస్థానమందున్న గ్రహమునకు. | 1 | 4 | 5 | 8 | 1 |
| సప్తమ మందున్న గ్రహమునకు. | 1 | 9 | 7 | 13 | 9 |
| విడిచియున్న స్వల్పశేషముల వలన వచ్చినది. | 0 | 0 | 0 | 0 | 2 |
| మొత్తము సంవత్సరములు | 12 | 0 | 0 | 0 | 60 |

ఇట్లే, తత్కాలగ్రహస్థితిదశాదుల ననుసరించి అంతర్దశా సంవత్సరముల విభజింపవలెను. ఇదియుగాక పూర్వవ్యాఖ్యాతలచే జెప్పబడిన సులభమగు అంతర్దశావర్షానయనక్ర

మము. శ్లో. గవిరర్థ హతశ్చేదో హరిస్త్ర్యం శాపహారిణః, సప్తాప హరిణోరూపం చాతుర్థ్యా గ హ్యతః కరః, యావంతోప హరంత్యాయు స్తావచ్ఛే దైర్ధ్వజాన్వితైః, ధ్వజసంఖ్యా హతా పిండ దశామూల దశోచ్యతే, ద్విత్రిసప్త చతుర్భక్త హ్యతాదంతర్దశోచ్యతే. అను శ్లోకరీతిగా గణితము నేర్పరుచుకొన నగును.

వివరము:—మూల దశాసంవత్సరములు 12. ఈసంఖ్యను "ధ్వజహతా" 84 చేత, గుణింపగా. 1008 అగుచున్నది

| | |
|---|---|
| అర్థాంశహారియైన గ్రహమునకు. రవిః = | 42 |
| తృతీయాంశ హారియైన గ్రహమునకు. హరిః = | 28 |
| సప్తమాంశ హారియైన గ్రహమునకు. రూపం = | 12 |
| చతుర్థాంశ హారియైన గ్రహమునకు. కరః = | 21 |
| వీనిని కలియగూడగా మొత్తము. | 103 ఇంకను |
| "ధ్వజాన్వితైః" 84 ను గూడగా | 187 అగుచున్నది. |

ఈ 187 చేత ధ్వజహత మూలదశా వర్ష సంఖ్యయైన 1008 ని పాలుగొనగ.

| | సం. | మా | ది. | ఘ. | వి |
|---|---|---|---|---|---|
| మూలదశాధిపతికి అంతర్దశా. | 5 | 4 | 20 | 32 | 5 |

యీసంవత్సరములను "ద్విత్రిసప్తచతుర్భక్తః" అను క్రమమునవిభాగింపగ.

| | | సం. | మా | ది. | ఘ. | వి |
|---|---|---|---|---|---|---|
| మూలదశాధిపతితో నేక రాశినున్న గ్రహమునకుఅంతర్దశ. | | 2 | 8 | 10 | 16 | 1 |
| త్రికోణ మందున్న గ్రహమునకు. | ,, | 1 | 9 | 16 | 50 | 41 |
| సప్తమ మందున్న గ్రహమునకు. | ,, | 0 | 8 | 7 | 13 | 9 |
| చతురశ్రమందున్న గ్రహమునకు. | ,, | 1 | 4 | 5 | 8 | 1 |
| విడిచియున్న స్వల్పశేషములవలన వచ్చినది. | | 0 | 0 | 0 | 0 | 2 |
| మొత్తము. | | 12 | 0 | 0 | 0 | 0 |

అంతర్దశా పాపకు లనేకులు సంభవించునెడల మొదట మూలదశాధిపతికి అంతర్దశని చ్చిపిమ్మట పూర్వము చెప్పియుండు దశావిభాగ క్రమమున ఆయాస్థానస్థిత గ్రహములకు అంతర్దశల నేర్పరుప వలయును. ఒకదశాపాచక గ్రహమునకు అంతర్దశాపాచకత్వము సంభవింపనియెడల, ఆగ్రహమునువిడిచి అటుతరువాత ఏగ్రహమునకు దశాపాచకత్వమున్నదో ఆ గ్రహమునకు అంతర్దశనుకల్పింపవలయును. పూర్వులలో కొందరు, అంతర్దశల కల్పించునపుడు వరుస క్రమముననుసరించి, ప్రథమమున మూలదశాధి పతికిని, అటుపైని ఏకరాశిస్థిత గ్రహమునకును, తర్వాత త్రికోణస్థిత గ్రహమునకును, తదుపరి చతురశ్రమందున్న గ్రహమునకును, తర్వాత సప్తమమందున్న గ్రహమునకును అంతర్దశలగల్పింతురు. అయినను, గార్గిమహర్షిచే జెప్పబడియుండు. "శ్లో. ఆదావంతర్దశాపాకో భవత్యేవదశాపతేః, తతఃపరంతు వక్తవ్యందశా

షాత్క్రమేణతు." అను శ్లోకోక్తముగ నాలోచించగ నైక్రమము యుక్తముగాదనియు, దశావిభాగ క్రమముననే అంతర్దశా విభాగమును గూడ జేయదగినదనియు నేర్పడుచున్నది.

## దశాంతర్దశల శుభాశుభఫలాను రూపసంజ్ఞలు.

శ్లో. సమ్యగ్బలిన స్స్వతుంగభాగే సంపూర్ణా బలవర్జితస్య రిక్తా
నీచాంశగతస్య శత్రుభాగే జ్ఞేయానిష్ట ఫలా దశా ప్రసూతౌ. 5

టీ. ప్రసూతౌ=జన్మకాలమందు, సమ్యక్=లెస్సగా, బలినః=స్థానాది సకలబలములతో నున్నట్టియు, స్వతుంగభాగే=తనపరమోచ్చభాగమందున్నట్టియు గ్రహముయొక్క, దశా = దశ, సంపూర్ణా = సంపూర్ణదశయనబడును, బలవర్జితస్య = స్థానాదిబలరహిత గ్రహము యొక్క, దశా=దశ, రిక్తా = రిక్తదశయనంబడును, నీచాంశగతస్య = తననీచాంశను పొందిన, శత్రుభాగే=శత్రునవాంశయందున్నట్టి గ్రహముయొక్క దశ, అనిష్టఫలా = అనిష్ట దశయని, జ్ఞేయా=తెలియవలెను.

తా. జననకాలమునందు ఏగ్రహము పూర్వోక్తములగు స్థానాదిసకలబలయుతమై తన పరమోచ్చ భాగమునందున్నదో ఆగ్రహదశ సంపూర్ణదశయనంబడును కేవలము పరమోచ్చ భాగగత గ్రహదశయు సంపూర్ణదశయనంబడును అధికమగు బలముతోగూడక ఉచ్చరాశి యందుమాత్రము ఉండుగ్రహదశయు, ఉచ్చనవాంశయందుండి శుభులచేజూడబడునట్టి గ్రహ దశయు పూర్ణదశ యనంబడును. పూర్వోక్తస్థానాది బలరహితమగు గ్రహదశ రిక్తదశ యన బడును. నీచాంశనైనను శత్రునవాంశనైనను బొందియున్న గ్రహదశ అనిష్టదశయనబడును. ఈ చెప్పబడిన దశావిధములు మూడింటియందును, జాతకము సంపూర్ణ దశాకాలమునందు, శరీరా రోగ్య ధనసమృద్ధ్యాధిక్యతచే ప్రసిద్ధి వడయుదురు. పూర్ణదశకాలమునందు ఆరోగ్యధనాదులు గలిగియుందురు. రిక్తదశాకాలమునందు ధనక్షయము గలిగియుందురు. అనిష్టదశా కాల ములయందు, శరీర అసౌఖ్యత బంధుద్వేషము, ధననాశనము, మొదలగు చెడుఫలములు గలిగి యుందురు. ఇందులకు "సర్వైర్బలైరుపేతస్య పరమోచ్చగతస్యచ, సంపూర్ణాఖ్యాదశాజ్ఞే యా ధనారోగ్యవివర్ధనీ, స్వోచ్చరాశిగతస్యాథ కించిద్బలయుతస్యచ, పూర్ణానామ దశాజ్ఞే యా ధనవృద్ధికరీశుభా, సర్వైర్బలైర్విహీనస్య నీచరాశిగతస్యచ, రిక్తానామదశాజ్ఞేయా ధన నాశస్యకారిణీ, యస్యాత్పరమనీచస్థ సదాచానవాంశకే, తస్యానిష్టఫలానామ వ్యాధ్యనర్థ వివర్ధినీ. అని గార్గియు. "నష్టదశావ్యసనకరీ మృత్యుం కరోతినైధనస్థదశా, స్వోచ్చగతస్య తురాజ్యం స్వక్షేత్రగతస్య సౌఖ్యసంపత్తిః." అని బాదరాయణులును వచించియున్నారు.

## అవరోహణ మధ్యారోహణ దశల వివరము.

శ్లో. భ్రష్టస్యతుంగా దవరోహిసంజ్ఞా మధ్యాభవేత్సా సుహృదుచ్చభాగే
ఆరోహిణీనిమ్న పరిచ్యుతిస్య నీచారిభాగే ప్యధమా భవే త్సా. 6

టీ తుంగాత్ = పరమోచ్చనుండి, భ్రష్టస్య=జారినగ్రహముయొక్క, దశా=దశ, అవ రోహిసంజ్ఞా = అవరోహిణియనెడు పేరుగలది, సా=(ఆయవరోహిదశ), సుహృదుచ్చభాగే=

ఏరాశియందైన, మధ్యా= మధ్యదశయనంబడును, నిమ్నపరిచ్యుతస్య = పరమనీచాంశనుదాటి ఉచ్చాభిముఖమైయున్న గ్రహముయొక్క దశ, ఆరోహిణీ=ఆరోహిణియనంబడును, నీచారి భాగేషు = ఏరాశియందైన, అధమా=అధమదశ యనంబడును.

తా. గ్రహము తనపరమోచ్చాంశను విడిచి తనపరమనీచాంశకు లోపుగనుండెడు ఆరు రాసులలో ఏరాశియందైన నుండెనేని ఆగ్రహదశ అవరోహిణి యనబడును. ఈదశ అధమఫలము నిచ్చునది. అవరోహదశ ఏరాశియందైనను మిత్రనవాంశయందుగాని స్వోచ్చ నవాంశయందుగాని స్వనవాంశయందు గాని ఉన్న గ్రహమువల్ల నేర్పడినదయ్యేనేని మధ్యమదశయనబడును. ఇందుమధ్యమఫలముగలగును. తనపరమనీచాంశను విడిచి తనపరమోచ్చాంశకు లోపుగ నుండెడు ఆరురాసులలో నేరాశియందైననుండు గ్రహదశ ఆరోహిణియనబడును. ఈదశ శుభఫలాధిక్యతగల్గించును. ఈఆరోహిణియనెడు దశ ఏరాశియందైనను తన నీచరాశి నవాంశయందైనను, శత్రునవాంశయందైనను ఉండుగ్రహమువలన నేర్పడినదగునెడల అధమదశయనబడును. ఇందు అశుభఫలములుగలుగును. ఈవిషయమై. "తుంగాచ్యుతస్య విందశ్యాసుమృదుచ్చాంశేవరోహిణీ, మధ్యానీచారిపునీచాంశే గ్రహస్యచారోహిణి కష్టా." అని సారావళీ కారకుడు వచించియున్నాడు. మఱియు. "ఉచ్చనీచాంతరస్థస్య దశాస్యాదవరోహిణీ తస్యాముల్పమవాప్నోతి ఫలంక్లేశాచ్ఛుభంవరః. మిత్రోచ్చాత్మాంశకస్థస్య మధ్యామధ్య ఫలంతుసా, నీచోచ్చ మధ్యగస్యోక్తా శ్రేష్ఠాచారోహిణీదశా. సైవాధమాఖ్యా భవతి నీచరాశ్యంతగస్యతు, అవరోహిణిచే దధమాభవేత్కష్టఫలాపదా, ఆరోహిణీమధ్యఫలా సంపూర్ణాపరికీర్తితా." అనిగార్గిచే చెప్పబడియుండుటవలన. అవరోహిదశ శత్రునవాంశకస్థిత గ్రహముచే నీయబడినదిగానుండు నెడల అశుభఫలము లధికముగ గల్గుచున్నది. ఆరోహిదశ శత్రునవాంశకస్థిత గ్రహముచే నీయబడినదగునెడల శుభఫలము లత్యల్పముగాగలుగు చున్నవి. ఇట్లే అవరోహిణియను దశ అధమదశయైనయెడల అనిష్టదశయనబడును ఆరోహిణియనుదశ ఉచ్చనవాంశమిత్రనవాంశ స్థిత గ్రహముచే నేర్పడినదగునెడల మధ్యదశగా నొప్పుచున్నది. అట్టిమధ్యదశసంపూర్ణమైన శుభఫలముల నిచ్చుటచే సంపూర్ణదశ యనంబడు మన్నది.

## మిశ్రమదశా వివరము.

శ్లో. నీచారిభాంశే సమవస్థితస్య శస్తేగృహేమిశ్ర ఫలా ప్రదిష్టా
సంజ్ఞానురూపాణి ఫలాన్యథైషాం దశాసువక్ష్యామియథోపయోగం.

టీ. శస్తేగృహే=ఉత్తమములైనస్వోచ్చ మూలత్రికోణస్వక్షేత్ర మిత్రక్షేత్రాదులయందు, నీచారిభాంశే=తన నీచరాశినవాంశయందుగాని తనశత్రుగ్రహరాశి నవాంశయందుగాని, సమవసితస్య = ఉన్నగ్రహముయొక్క, దశా=దశ, మిశ్రఫలా=శుభా శుభములరెంటి నిచ్చునని, ప్రదిష్టా=చెప్పబడెను. అథ=అనంతరము, ఏషాం=ఈగ్రహములయొక్క, దశాసు=దశాంతర్దశ లందు, సంజ్ఞానురూపాణి = పేర్లకనురూపమున, ఫలాని = ఫలములను, యథోపయోగం = ఉపయుక్తమగునో ఆప్రకారముగా, వక్ష్యామి = చెప్పుచున్నాను.

తా. గ్రహము తనస్వోచ్చ మూలత్రికోణ స్వక్షేత్ర మిత్రక్షేత్రములయందైనను, తన నీచరాశినవాంశయందైనను, తన శత్రుగ్రహరాశి నవాంశయందైనను ఉండగా నిచ్చునట్టి దశ మిశ్రఫలదశయనబడును. ఈ దశయందు (మిశ్రమఫలములనగా) శుభాశుభఫలముల నొసంగును. అనంతరము సూర్యాది గ్రహముల దశాంతర్దశలయందు వాటిపేర్లకు సమానముల గుఫలములను ఏయేదశయందు ఏఫల మేప్రకారముపయుక్తమో ఆప్రకారము జెప్పదగును.

(ఇచ్చట సంజ్ఞానురూపములనగ: సంపూర్ణదశ శ్రేష్టఫలముల నొసంగునది. మధ్యదశ శుభా శుభఫలముల నిచ్చునది. అనిష్టదశ అశుభఫలముల నొసంగునది. ఇట్లు దశానామాను గుణ్యముగ నూహింపదగినది).

## లగ్నదశాఫల భేదములు.

శ్లో. ఉభయేఽధమ మధ్యపూజితా ద్రేక్కాణై శ్చరభేషు చో
త్క్రమాత్ అశుభేష్టసమాస్థిరే క్రమాద్ధోరాయాః పరికల్పితా దశా.

టీ. హోరాయాః = లగ్నముయొక్క, ద్రేక్కాణై = ద్రేక్కాణములచేత, ఉభయే=ద్విస్వభావ రాశిలగ్నమున, అధమ మధ్యమపూజితాః = అధమమధ్యమశ్రేష్ఠఫలము లగును, చరభేషుచోత్క్రమాత్ = చరగాసులయందు (విరుద్ధఫలములు కలుగును) అశుభేష్ట సమాస్థిరేక్రమాత్ = స్థిరరాశిలగ్నమై అందు ప్రథమద్రేక్కాణమయ్యేనేని అశుభఫలమును ద్వితీయద్రేక్కాణమయ్యేనేని శుభఫలంబును తృతీయ ద్రేక్కాణమయ్యేనేని మిశ్రఫలంబును అగును, హోరాయాః=లగ్నముయొక్క, దశాః=దశాభేదములు, పరికల్పితః= కల్పింపఁబడెను.

తా. లగ్నము ద్విస్వభావరాశియై అందుజననము ప్రథమద్రేక్కాణమున నగునెడల ఆదశ అధమదశ అనగా అనిష్టఫలముల నిచ్చు దశయనియు, ద్వితీయద్రేక్కాణమున జనన మగునెడల ఆదశ మధ్యదశ అనగా శుభా శుభఫలములనిచ్చు నదియనియు, తృతీయద్రేక్కాణమైనచో ఆదశ పూజితము అనగా శ్రేష్టముగల ఫలముల నొసంగునదియనియు దెలియదగినది.

## లగ్నదశా ఫలభేదములు.

| జననకాలము. | | దశానామము. | | ఫలములు. |
|---|---|---|---|---|
| ద్విస్వభావరాశి | 1 | ద్రేక్కాణము | అధమదశ | అనిష్టఫలములు |
| ,, | 2 | ,, | మధ్యదశ | శుభాశుభఫలములు |
| ,, | 3 | ,, | పూజితదశ | శ్రేష్ఠమగుశుభఫలములు |
| చరరాశి | 1 | ,, | పూజితదశ | శ్రేష్ఠమగుశుభఫలములు |
| ,, | 2 | ,, | మధ్యదశ | శుభాశుభఫలములు |
| ,, | 3 | ,, | అధమదశ | అనిష్టఫలములు |
| స్థిరరాశి | 1 | ,, | అధమదశ | అశుభఫలములు |
| ,, | 2 | ,, | పూజితదశ | శుభఫలములు |
| ,, | 3 | ,, | మధ్యదశ | శుభాశుభమిశ్రఫలము |

ఈ ప్రకారము, లగ్నదశలును, తత్ఫలభేదంబులును కల్పింపబడినవి. ఇందులకు "ద్రేక్కాణేచదశామూర్తేః, పూజితామధ్యమాధమా, చరేమిశ్రేప్రతీపాచ, స్థిరేపాపేష్ట మధ్యమా" అని సారావళీ వచనమున్నది.

## నైసర్గిక దశా కాలములు.

శ్లో. ఏకం ద్వే నవ వింశతి ర్ధృతికృతీ పంచాశ దేషాంక్రమా
చ్చంద్రార్కేందుజ శుక్ర జీవ దినకృద్దైవా కరీణాం సమాః
సై స్వైస్వైః పుష్టఫలా నిసర్గజనితైః పక్తిర్దశాయాః క్రమా
దంతే లగ్నదశా శుభేతి యవనా నేచ్ఛంతి కేచి త్తథా. 9

టీ. చంద్ర=చంద్రునికి, ఏకంసమాః = ఒకసంవత్సరంబును, ఆర = కుజునికి, ద్వే=రెండు సంవత్సరములును, ఇందుజ=బుధునికి, నవ=9 సంవత్సరములును, శుక్ర=శుక్రునికి, వింశతిః=20 సంవత్సరములును, జీవ=గురునకు, ధృతి= 18 సంవత్సరములును, దినకృత్=సూర్యునికి, కృతి= 20 సంవత్సరములును, దైవాకరి=శనికి, పంచాశత్=50 సంవత్సరములును, ఈ రీతిగా, ఏషాం=ఈ గ్రహములకు, క్రమాత్ వరుసగా, సమాః=నైసర్గిక దశాసంవత్సరములగును, దశాయాం = పూర్వోక్తదశయొక్క, పక్తిః = పరిపాకము, నిసర్గజనితైః = సహజదశాజనితములైన, స్వైస్వైః=తమతమసంవత్సరములతో గూడినయెడల, పుష్టఫలా=సంపూర్ణఫలయుక్తములగును. కేచిత్=శ్రుతకీర్తి మొదలు గాగల కొందఱు గ్రంథకర్తలు, తథా=ఆప్రకారము అత్యంతవయస్సునందలి లగ్నదశను శుభకరమైనదానినిగా, నేచ్ఛంతి=అంగీకరింపరు

| | |
|---|---|
| చంద్రునకు 1 సంవత్సరము. | బృహస్పతికి 18 సంవత్సరములు |
| అంగారకునకు 2 సంవత్సరములు. | సూర్యునకు 20 సంవత్సరములు. |
| బుధునకు 9 సంవత్సరములు. | శనైశ్చరునకు 50 సంవత్సరములు. |
| శుక్రునకు 20 సంవత్సరములు. | |

ఈ విధముగ చంద్రాది గ్రహములకు క్రమముగ నైసర్గిక దశాకాలములు నిర్ణయింపబడి మొత్తము సంవత్సరములు 120 పరమాయు వగుచున్నది. ఈనైసర్గిక దశాధినాథులు బలవంతులై ఉపచయస్థానములగు 3, 6, 10, 11, యిండ్లయందుండు నెడల తమతమదశాంతర్దశాకాలముల యందు శుభఫలమునిత్తురు. హీనబలులై యపచయస్థానములగు యిండ్లయందుండు నెడల తమతమదశాకాలములయందు అశుభఫలముల నిత్తురు. ఈవిషయమై "స్తనోపభోగశ్చశిశోర్వయః ఖంభౌమస్య విద్యాద్దశేవాను జన్మబాధంతు శిక్షాపరకాల మాహ్వురమై ధనేచ్ఛాలలిత ప్రవృత్తి, శౌక్రంయౌవత్వం విధిపూర్వ దృష్టమామధ్య మాద్దేవగురోర్వదంతి రవేర్మహోగ్రాత్వరమన్యదస్మాత్సౌరేర్జరాదుర్బలకాలమాహుః"అనియవనేశుడువచించియున్నాడు.

## నైసర్గిక దశకు ప్రయోజనము.

పూర్వము చెప్పబడియుండు గ్రహదశయును, ఈనైసర్గికగ్రహదశయును ఏకకాలమున ఒకగ్రహమునకు ఏర్పడి యుండినచో, అట్లుండు కాలమువరకు ఆగ్రహము యొక్క

దశలైనను అంతర్దశలైనను, సంపూర్ణమగు శుభఫలములు కలుగ జేయునని దెలియ దగినది. ఇం దులకనుగుణ్యముగ "ఏకాబ్ధికళ్ళ శీత్ర్యబ్ధికః కుజో ద్వాదశాబ్ధిక స్సౌమ్యః, ద్వాత్రింశద్భృగుపుత్రో గురుస్తు కథితశ్చ తస్యాష్టంపస్తత్యబ్ద స్సూర్యో వింశత్యధిక శ్శనైశ్చరో ద్దె శతః వయస్సోంతరాణి నైషాం స్వదశా నైసర్గికః కాలః, స్వంస్వం వయస్సద్వృశం గ్రహాస్సమాసాద్య దేహినాం కాలం, భతుణపోషణచే ప్రాస్వభావ గాస్సు్యర్యథా సంఖ్యం" అనిసత్యాచార్యవచన మున్నది.

పూర్వీకయువన మతలగ్నదశా నైసర్గికకాలము పూర్వపుయవనులు, పరమాయువగు 120సంవత్సరములకు పైనఆయుస్సుగల జాతకునకు అంత వయస్సునందు లగ్నముయొక్క నైసర్గికదశయనియు, ఆలగ్నదశ శుభకరమైన దనియుజెప్పుదురుగాని శ్రుతకీర్తి మొదలుగాగల కొందరు గ్రంథకర్తలు ఆప్రకారము అంత్యవయస్సునందలి లగ్నదశ శుభకరమైనదనుటను ఇచ్ఛయింపరు. ఈవిషయమునకు "అంతేలగ్నదశాశుభేతి యవనానేలద్బహూనాం మతం, తస్మిక్షీణ బలేయతోంత్య సమయేసామ్యాదతో నేష్యతే" అనిశ్రుతకీర్తిగ్రహించియున్నాడు. అయినను వరాహమిహిరాచార్యులు లగ్నదశాఫల శుభాశుభత్వముల బలాబలవశమున గాక ద్రేక్కాణవశమున జెప్పియుండుటచే పూర్వయవనోక్త ప్రకారముగ అంత్యవయస్సునందు లగ్ననైసర్గికదశ శుభకరమైనదనియు ఆకాలమున శుభఫలములు జరుగుననియు చెప్పిరి.

## దశాంతర్దశల శుభాశుభ ఫలములు.

శ్లో. పాకస్వామిని లగ్నగే సుహృదివా వర్గేస్య సౌమ్యేపివా
ప్రారబ్ధా శుభదా దశా త్రిదశ షల్లాభేషు వా పాకపే
మిత్రోచ్చోపచయ త్రికోణమదనే పాకేశ్వరస్యస్థిత
శ్చంద్ర స్సత్ఫలబోధనాని కురుతే పాపానిచాతో న్యథా. 10

టీ. పాకస్వామిని=దశాధిపతి, లగ్నగే=దశాప్రవేశలగ్నమందుండు నప్పుడైనను, సుహృదివా=మిత్రగ్రహము లగ్నమందుండగా గాని, అస్య=ఈదశాధి పతియొక్క, వర్గే=సప్తవర్గము లగ్నమైయుండగాగాని, సౌమ్యేపివా=శుభగ్రహము లగ్నమందుండగాగాని, పాకపే=దశాధి పతి, త్రిదశషల్లాభేషువా 3, 10, 6, 11,యిండ్ల యందుండగాగాని, ప్రారబ్ధా=ప్రారంభించిన, దశా=దశ, శుభదా=శుభఫలమునిచ్చును, చంద్రః=చంద్రుడు,పాకేశ్వరస్య=దశానాధునియొక్క, మిత్రోచ్చోపచయ త్రికోణమదనే = గ్రహరాశియందుగాని ఉచ్చ రాశియందుగాని 3, 6, 10, 11, యిండ్లయందుగాని 9, 5, 7, యిండ్లయందుగాని, స్థితః=ఉన్నవాడై, సత్ఫల బోధనాని = శుభఫలములను, కురుతే = యిచ్చును, అతః = యింతకంటె, అన్యథా=వేరుగా, అశుభఫలములను, పాపాని=చంద్రుడున్న రాశి జననకాలమందు, కురుతే=యిచ్చును.

తా. ఈదశలయొక్క శుభాశుభత్వములు, దశాప్రవేశకాలమువలనను, తత్కాలగ్రహ సంచారము వలనను జెప్పబడియున్నవి. పూర్వోక్తప్రకారము దశాంతర్దశల గల్పించి, అవ

శాంతర్దశల ప్రవేశకాల సవికలపావనమున ఆర్యభటసిద్ధాంతోక్త మార్గము ననుసరించి,అద్యు గణమువలన స్ఫుటములగు గ్రహములను దెచ్చితత్కాల లగ్న స్ఫుటము జేయదగినది.

వివరము:—"జన్మకాలకలియాత వత్సరోత్పన్న మధ్య మ రవాభమండలే నితి పేదథ దశాదిజా సమా మాస వాసరఘటీ వినాడికాః. తాదృశోభవతిభాస్కరోయదా మధ్య మోప రదశాభవేత్తథా" అను శ్రీపతి వచనమునను సరించి, జన్మకాలకల్యాది సభగణమధ్య రవియందు దశా, వర్ష, మాస, దివ, ఘటికా సఘటికలుగూడగా ముందటిదశా ప్రవేశకాల భగణా ది మధ్యరవియగును.

ఉదాహరణము:—

| | |
|---|---|
| జననకాల సభగణమధ్యమ రవి. | 4-29-2-10-8-56 |
| లగ్నమహాదశయందలిలగ్నాంతర్దశా వర్షాదిసంఖ్యయగు. | 3- 9-1-19-0 గూడగా |
| లగ్నాంతర్దశాంతిక మధ్యమరవి. | 4-29-6-7-10-15-0 అగుచున్నది. |

"సాద్య తేదిన ఘనోనుపాతతః ఖేః రాశ్ సపికలాద హర్గణాః" అనురీతిని. అనుపాతం బున ద్యుగణమును సాధించు క్రమము.

ద్యుగణమును యుగ రవి భగణములచేత గుణించియు గసావనవాసరములచే పాల్గొన గా భగణాది సూర్యుడువచ్చును. ఆభగణాది సూర్యుని పెట్టుకొని విపరీతముగ యుగసావన వాసరములచే గుణించియుగరవిభగణములచే బాల్గొనగసకలద్యుగణమువచ్చును.ఇందులకు"యు గార్కవర్షైర్యుగ సౌరసావనైర్యదాప్యపిండస్స మవాప్య తేశదా అని గ్రంథాంతరములందున్నది.

లగ్నాంతర్దశాంతిక మధ్యమరవి 4, 29, 6, 7, 10, 15,0 ను ఆర్యభటసిద్ధాంతసావన వాసరములు (ఖగేషునగ చంద్రాంక సప్తశైల శరేందవః)= 1577917500. దీనిచేతగుణించి విలిప్తాస్థానమును 60 ట పాల్గొనిలిప్తాస్థానమునందుగూడి, ఆలిప్తాస్థానమున 60 ట బాల్గొని భాగస్థానమునగూడి, ఆభాగస్థానమును 30 ట పాల్గొని, రాశిస్థానమునందుగూడి, ఆరాశిస్థా నమును 12 ట పాల్గొని భగణస్థానమునందుగూడి, ఆభగణస్థానమును యుగరవిభగణములైన 4320000చే పాలుగొనగా ఘడియలు 45 ఉభయము ద్యుగణము 1569374-45 ఈద్యుగణము ఘడియలను భగణముచేత గుణించి ఘటికాస్థానమును పైద్యుగణమునందుగూడి సావనవాసర ములచేత పాలుగొనగా భగణములు వచ్చును భగణశేష ఘటికాశేషములను 12 ట గుణించి, ఘటికాశేషములు 60 టపాల్గొని భగణశేషమునందుగూడి సావనవాసరములచేత పాల్గొనగా రాసులువచ్చును. ఆశేషములవలన భాగాదులు ఏర్పడుచున్నవి.

భగణమధ్యరవి = 4296, 7, 10, 15, 0.
స్ఫుటరవి = 7, 11, 0.
అయనాంశ = 11, 13.
ఇష్టఘడియలు = 11.
తత్కాలోదయలగ్నము = 1, 7, 28.
స్ఫుటచంద్రుడు = 8, 2, 54.
స్ఫుటకుజుడు = 5, 28, 50.
స్ఫుటబుధుడు = 7, 26, 50.
స్ఫుటగురువు = 3, 14, 1.
స్ఫుటశుక్రుడు = 0, 0, 28.
స్ఫుటశని = 9, 14, 3.

ఈ ప్రకారముగా సకలగ్రహ దశాంతర్దశాప్రవేశ కాలంబులును గ్రహంబులును, లగ్నంబును, స్ఫుటముచేయదగును. సావనమానముచేతనే ఆయుర్దాయ దశావిభాగముచేయ దగును. ఇందులకు "శ్లో. ఆయుర్దాయ విభాగశ్చ ప్రాయశ్చిత్త క్రియా స్తథా, సావనే నైవ కర్తవ్యా సత్రాణామ ప్యుపాసనం. గార్గివచనానుగుణ్యమగు సావనమాన ప్రమాణము సూర్యోదయము మొదలు మరునాడు సూర్యోదయమువరకు ఒక దినము.

30 దినములు = 1 మాసము.

12 మాసములు లేక 360 దినములు = 1 సంవత్సరము.

దశాధిపతి, దశాప్రవేశలగ్నమందుండగానైనను, దశాధినాధుని మిత్రగ్రహము దశాప్రవేశలగ్నమందుండగా నైనను, (మిత్రక్షేత్రములగ్నమని కొందరిభావము) *దశాధిపతి యొక్క సప్తవర్గము లగ్నగతమైయుండగా నైనను, ఏదేనిఒకశుభగ్రహము దశాప్రవేశ లగ్నమునందుండగా నైనను, దశాప్రవేశలగ్నమునకు ఉపచయస్థానములగు 3, 6, 10, 11, స్థానములయందు దశానాధుడు ఉండగనైనను, ప్రారంభించిన దశశుభఫలముల నిచ్చునట్టిది. ఈ విషయమునను సరించి, "దశాపతి ర్లగ్నగతో యదిస్యాత్ త్రిషడ్దశైకాదశ గశ్చలగ్నాత్, తత్సప్త వర్గోప్యథ తత్సుహృద్వా లగ్నే శుభేవా శుభదాదశాసా." అను శ్రీపతి వాక్యము ఉదాహరణముగ నున్నది.

దశానాధునకు, అంతర్దశాధిపతి అధిశత్రువైన అనిష్టఫలమును, అధిమిత్రమైన శుభ ఫలమును, మధ్యమగ్రహమైన సమఫలమును ఇచ్చుట సహజము. పై జెప్పిన శుభదశయందును దశాధిపతి దశాప్రవేశము మొదలు అంత్యమువరకు శుభఫలములనీయడు. చంద్రసంచార వశం బున శుభాశుభఫలముల నిచ్చుచుండును. వివరము:— చంద్రుడు, దశాధిపతియొక్క తత్కాలమిత్రగ్రహరాశియందైనను, ఉచ్చరాశియందైనను, ఉపచయస్థానములగు 3,6,10, 11, యిండ్లయందైనను, త్రికోణస్థానములగు, 5, 9, యిండ్లయందైనను, 7 వయింటి యందైనను, ఉండగా తత్కాల భావసంజ్ఞనను సరించి శుభఫలములనిచ్చుచున్నాడు. ఈ జెప్పిన స్థానములందుగాక దశాధిపతికి తాత్కాలిక శత్రురాశియందైనను, నీచరాశియందైనను, దశాధిపతినిగూడి ఏకరాశియందైనను, దశాధిపతికి 2, 4, 8, 12, స్థానములలో నొకస్థానమందున్నచంద్రుడు, శుభగ్రహ మహాదశయందైనను, భావసంజ్ఞాను సరణముగనశుభఫలములజేయును. గార్గివచనముగూడ నిందులకు అనుగుణ్యముగనున్నది.

ఉచ్చనీచాది స్థానస్థితసూర్యాదిగ్రహ దశాఫలముల దెలుపు గ్రంధాంతరశ్లోకములు.

శ్లో. సూర్యః కరోతి నీచేదోష సహస్రం మహావిపులం, శత్రుదశాయాం నాశం ధనజందోషం సదాకురుతే. నైధనభాగస్థాపై ప్యేవం హ్యుచ్చాది శుభదశావర్గం, మూల త్రికోణగేషు స్వోచ్చేషుచ శుభఫలాసమాదేశ్యా మిత్రగృహోచ్చాదిక ఫలధాన్యథశాంతించ సతత మిహాకురుతే చంద్రస్స్వక్షేత్రాదిషు మూలత్రికోణేచ భాగగే సతతం. నీచసమస్థాన గతశ్శీతాంశుః పాపసమఫలః ప్రోక్తః. నైధన --శసమేతం వ్యయగంచంద్రంసదాషరీత్యేవం.

పాపఫలంప్రబ్రూయాన్నియత మశుభదం సదాచింత్యం,భౌమస్స్వక్షేత్ర గతః స్వోచ్చేచ కరోతి ధనధాన్యం, మిత్రత్రికోణ కేష్వపి రత్నానాం భాజనంకురుతే. నీచరిపుస్థానగతో భౌమోనియతం వినాశమిహకురుతే, సతతంచదోషబహుళం కరోతిపురుషంనైధనస్థదశా, సౌమ్యదశాయాంకురుతే బంధనదోషాంశ్చ శత్రుగృహే, నీచదశాయాం గృహమపికుష్ఠాది రోగమష్టమగతాయాం, స్వోచ్చదశాయాం రాజ్యంమిత్రగృహే ధాన్యముక్తాది, స్వక్షేత్ర గోపిసౌమ్యః కరోతిధనధాన్యసంపత్తిం, జీవోమిత్ర దశాయాంకురుతే పురుషస్యవాహనావాప్తిం, స్వోచ్చగృహే రాజ్యాదిక ఫలమేతదసంశయంపుంసాం, స్వక్షేత్రగశ్చకురుతే భూషణలాభంచవాహనావాప్తం, నీచదశాయాంబంధం శత్రుగృహే నృపకులాద్దోషం, ఉదరామయాఙ్గిరోగాః నిధనదశాయాంకరోతి పురుషస్య, ప్రాప్తోమిత్రగృహంశుక్రో నార్యవాప్తింకరోతిచ, స్వోచ్చగస్య దశాయాంతు రాజ్యలాభంకరోత్యసౌ స్వక్షేత్రగశ్చాపి సదా స్త్రీలాభరత్నదస్తథా, నీచశ్శత్రుగృహేచైవ వ్యాధింబంధంతథైవచ, నిధనస్థాతుకురుతే విదేశ గమనంధ్రువంతం శనైశ్చర శ్శత్రుగృహంప్రయాతః, కరోతిదోషంస్వజనాచ్చదుఃఖం, మైత్రేగృహేవాపి తథోచ్చరాశౌకరోతి రాజ్యంబహుమానయుక్తం, స్వక్షేత్రగశ్చాపి కరోతిసౌఖ్యం యోషిచ్చవృద్ధాధన ధాన్యవృద్ధి, దశాసునీచాస్వపి బంధనాదిరంధ్రేపి చైవం కురుతే దశాయాం, ఏవందశాయాం గృహదోషభావం శుభాశుభం సత్ఫలదంవిచార్యం, శుభా దశానుధ్య ఫలాదశాచ సర్వత్రకాలేనియతం విచింత్యాః. 10

## చంద్రాంతర్దశ శుభాశుభ ఫలములు.

శ్లో. ప్రారబ్ధా హిమగౌ దశా స్వగృహగే మానార్థ సౌఖ్యావహా
కౌజే దూషయతి స్త్రియం బుధగృహే విద్యాసుహృద్విత్తదా
దుర్గారణ్య పథాలయే కృషి కరీ సింహే సితర్క్షేన్నదా
కుస్త్రీ దామ్మృగ కుంభయో ర్గురుగృహే మానార్థ సౌఖ్యావహా. 11

టీ. హిమగౌ=చంద్రుఁడు, స్వగృహగే=స్వక్షేత్రమైనకర్కాటకమందుండఁగా, ప్రారబ్ధా=ప్రవేశించిన, దశా=అంతర్దశ, మానార్థసౌఖ్యావహా, మాన=సన్మానమును, అర్థ=ధనమును సౌఖ్య=సౌఖ్యమును, ఆవహా=కలుగఁజేయును, కౌజే=కుజక్షేత్రములైన మేషవృశ్చికములలో నొకరాశియందు చంద్రుఁడుండఁగా ప్రవేశించినఅంతర్దశ, స్త్రియం = భార్యను, దూషయతి=పరపురుష సంపర్కాదులచేత దోషయుక్తురాలినిఁగాఁజేయును, బుధగృహే = మిథున కన్యలలో నొకరాశియందు చంద్రుఁడుండఁగా ప్రవేశించినఅంతర్దశ,విద్యాసుహృద్విత్తదా విద్యా మిత్ర ధనములనిచ్చును, సింహే=సింహమందు చంద్రుఁడుండఁగా ప్రవేశించిన అంతర్దశ,దుర్గారణ్యపథాలయే—దుర్గ=దుర్గము లయందును, అరణ్య =అడవులయందును, పథ = మార్గములయందును, ఆలయే=గృహసమీపమందును, కృషికరీ= కృషినిజేయించును, సితర్క్షే = వృషభతులలయందు చంద్రుఁడుండఁగా ప్రవేశించిన అంతర్దశ, అన్నదా = మృష్టాన్నము

గలుగఁజేయును, మృగకుంభయోః = మకరకుంభములయందు చంద్రుఁడుండఁగా ప్రవేశించిన అంతర్దశ, కుస్త్రీదా=కుత్సితస్త్రీనిచ్చును, గురుగృహే=ధనుర్మీనములయందుచంద్రుఁడుండఁగా ప్రవేశించినఅంతర్దశ, మానార్థసౌఖ్యావహా=సమ్మానధన సౌఖ్యములం గలుగఁజేయును.

తా. అంతర్దశా ప్రవేశకాలమున చంద్రుఁడు స్వక్షేత్రమగు కర్కాటకమునందుండే నేని అట్టి అంతర్దశసమ్మాన, ధన, సౌఖ్యాదుల గలుగజేయును. చంద్రుడు మేషవృశ్చిక ములలో నొకరాశియందుండు కాలమున బ్రవేశించిన యంతర్దశ భార్యను పరపురుషసం పర్కాదులచే దోషయుక్తగాలుగజేయును. బుధక్షేత్రములగు మిథునకన్యారాశులయందొక దానియందాశశియుండు కాలమున బ్రవేశించిన అంతర్దశ విద్యను మిత్రవర్గమును, ధన మును గలుగజేయును. రవిక్షేత్రసుగు సింహమునచంద్రుడుండు సమయమున నారంభమైన అంతర్దశ కొండలు సమీపమునను, అడవులయందును, మార్గములయందును నివాసమును, గృహ నిర్మాణ కృష్యాదికార్యముల జేయించును. శుక్రక్షేత్రములగు వృషభ, తులలయందు చంద్రు డుండుకాలమున బ్రవేశించిన అంతర్దశసుభోజనమును గలుగజేయును. మకరకుంభములయందు చంద్రుడుండగా నారంభించిన అంతర్దశ నీచస్త్రీసంగమమును గలుగజేయును. బృహస్పతి క్షేత్రములగు ధనుర్మీనములందు చంద్రుడుండు కాలమునబుట్టిన అంతర్దశ, సమ్మానము, ధనము, సౌఖ్యము మొదలగువాటిని గలుగజేయును, చంద్రస్థిత రాశిననుసరించియు, తత్కాలమున చంద్రునికి గలుగువీక్షణననుసరించియు, శుభకాలముగనుండానపుడ బ్రవేశించిన శుభదశ, శుభఫలాధిక్యతగల్గించును. శుభకాలమున నారంభమైన అశుభదశయు, అశుభకాలమున బ్రవే శించిన శుభదశయు, మధ్యమ ఫలములనిచ్చును అశుభకాలమున బ్రవేశించిన అశుభదశ, అనేకములగు అశుభఫలములనిచ్చునని నూహింపదగినది. 11

## సూర్య దశాంతర్దశల శుభాశుభ ఫలములు.

శ్లో. సౌర్యాం స్వం నఖదంత చర్మ కనక క్రౌర్యాధ్వభూపాహవై
స్తైక్ష్ణ్యం ధైర్య మజస్ర ముద్యమ రతిః ఖ్యాతిః ప్రతాపోన్నతిః
భార్యా పుత్ర ధనారి శస్త్ర హుతభు గ్భూభ పోద్భవా వ్యాపద
స్త్యాగీ పాప రతి స్స్వభృత్యకలహో హృత్క్రోడపీ డామయాః. 12

టీ. నఖ = సుగంధిద్రవ్య విశేషంబును గోళ్లును, దంత=ఏనుగుదంతములు, చర్మ=వ్యా ఘ్రాదిచర్మములు, కనక=బంగారు, క్రౌర్య=క్రూరభావము,అధ్వ=మార్గము,భూపాః=రాజులు, ఆహవ=యుద్ధము, ఈచెప్పఁబడినవానిచేత, స్వం=ధనముగలుగును, తైక్ష్ణ్యం=ఉగ్ర స్వభావము ధైర్యం=ధీరత్వము, అజస్రం=ఎల్లప్పుడు, ఉద్యమరతిః=ఉద్యోగాసక్తి, ఖ్యాతిః=కీర్తి, ప్రతా పోన్నతిః = శౌర్యముచేతనైన శత్రుజయోన్నత్యము, ఈఫలములు సూర్యుని శుభదశయందు గలుగును.అశుభదశయందు,భార్యా=పెండ్లాము, పుత్ర=కుమారుడు, ధన=ధనము, అరి=శత్రువు, శస్త్ర=ఆయుధము, హుతభుక్=అగ్ని, భూప=రాజు, వీరివలన, ఉద్భవాః=పుట్టిన, వ్యాపదః

విశేషాపదలు ప్రాప్తించును, త్యాగీ=శుభదశయందు సద్విషయత్యాగియు, అశుభదశయందు దుర్విషయ త్యాగియునగును, పాపరతిః=పాపాసక్తుడును, స్వభృత్యకలహః = తనభృత్యుల తోడ కలహము గలవాడునౌను, హృత్కోడపీడామయాః, హృత్=హృదయమునకును, కోడ=కడుపునకును, పీడా=పీడయు, ఆమయాః=రోగములునుగలుగును, ఇవిసూర్యుని అశుభదశా ఫలములు.

తా. సూర్యదశాంతర్దశలయందు సుగంధద్రవ్యాది విశేషములచేతను, గోళ్లచేతను, ఏనుగు దంతములచేతను, పులులు మొదలగువాటి చర్మములచేతను, బంగారువల్లను, కఠిన స్వభావ మార్గముచేతను, యుద్ధమువలనను, రాజులవల్లను ధనము గలుగునని దెలియదగినది. సూర్యుని శుభదశయందు, ఉగ్రస్వభావము, ధీరత్వము, ఎల్లప్పుడును ఉద్యోగాసక్తి, కీర్తి, శౌర్యాదులచే శత్రుజయోన్నతియు గలుగును సూర్యుని అశుభదశయందు కళత్ర, పుత్ర, ధన రిపు, శస్త్రాగ్నియుద్ధ, రాజాగ్నిపీడలు గలుగునని దెలియదగినది. మఱియు శుభదశయందు సద్విషయమూలక దానకీర్తియు, అశుభ దశయందు దుర్విషయాదులచే ధనవ్యయము, పాపకార్యానురక్తి, తన భృత్యులతో కలహము, హృదయమునకును, ఉదరమునకును పీడయు, రోగములును గలుగును. సూర్యుని మిశ్రదశయందు శుభాశుభఫలములు సమముగా గలుగును. 12

## చంద్ర దశాంతర్దశల శుభాశుభ ఫలములు.

శ్లో. ఇందోః ప్రాప్య దశాఫలాని లభతే మంత్ర ద్విజాత్యుద్భవా
నీక్షుక్షీర వికార వస్త్ర కుసుమ క్రీడా తిలాన్న శ్రమైః
నిద్రాలస్య మృదు ద్విజామర రతిః స్త్రీ జన్మ మేధావితా
కీర్త్యర్థోపచయ క్షయాంశ్చ బలిభి ర్వైరం స్వపక్షేణచ. 13

టీ ఇందోః=చంద్రునియొక్క, దశాం=దశను, ప్రాప్య=పొంది, మంత్ర=మంత్రప్రయోగములవలనను, ద్విజాతి=బ్రాహ్మణులవలనను, ఉద్భవాని = పుట్టిన, ఫలాని=ఫలములను, లభతే=పొందును, ఇక్షువికార=చెఱకునంబుట్టిన గుడశర్కరాదులు, క్షీరవికార = క్షీరవికారమయిన దధిఘృతాదులు, వస్త్ర=వస్త్రములు, కుసుమ=పుష్పములు, క్రీడా=ఆటలు, తిల=నువ్వులు, అన్న=అన్నము, వీనివలనంగలిగిన, శ్రమైః = వ్యాయామములచేత, ఫలాని=శుభఫలములను, లభతే=పొందును, ఇవిచంద్రుని శుభదశాఫలములు, అశుభదశాఫలము లెవ్వియనిన, నిద్రా=నిద్రయందును, ఆలస్య=ఆలస్యమందును, మృదు=ఓర్పుగలిగి యుండుటయందును,ద్విజ=బ్రాహ్మణసేవయందును, అమర=దేవతారాధన మందును, రతిః=ఆసక్తియు, స్త్రీజన్మ=స్త్రీశిశుజననంబును, మేధావితా=బుద్ధివృద్ధియు గలుగును, కీర్త్యర్థోపచయక్షయాః, శుభదశయందు కీర్తి ధనములభివృద్ధియు, అశుభదశయందు కీర్తిధననాశమును గలుగును, బలిభిః = బలవంతులతోడను, స్వపక్షేణచ = తనపక్షమై యున్నవారితోడను, వైరం = విరోధము గలుగును.

తా. చంద్రుని శుభదశాకాలమున మంత్రప్రయోగముచేతను, బ్రాహ్మణులవలనను, గన సంజనితములగు ఫలములును, చెఱకునబుట్టిండ శర్కరాదులును, క్షీరమువలన గలుగు

దధి, ఘృతాదులు, వస్త్రములు, పుష్పములు, క్రీడాదులు, తిలలు, అన్నము, మొదలగువాని చే గలిగిన వ్యాయామములచే శుభఫలములు గలుగును. చంద్రుని అశుభదశయందు నిద్ర యందును, ఆలస్యమునందును, ఓర్పుగలిగి యుండుటయును, బ్రాహ్మణ సేవయందును, దేవతా రాధనయందును, రక్తిగల్గియుండుటయును, స్త్రీశిశు జననమును, మేధాధిక్యతయు గలుగును. మఱియు శుభదశయందు కీర్తి, ధనము లభివృద్ధియు, అశుభదశయందు అవమానము, ధనక్షయము, బలవంతులతోడను, తనపక్షమున నుండు వారితోడను, విరోధము మొదలగునవి గలుగును. మిశ్రదశయందు శుభాశుభఫలితముల నూహింపదగినది. 13

## కుజ దశాంతర్దశల శుభాశుభ ఫలములు

శ్లో. భౌమస్యారి విమర్ద భూప సహజ క్షిత్యావికాజైర్ధనం
ప్రద్వేష స్సుత మిత్ర దార సహజై ర్విద్వద్గురుద్వేషితా
తృష్ణా సృగ్జ్వర పిత్త భంగ జనితా రోగాః పరస్త్రీ కృతాః
ప్రీతిః పాపరతై రధర్మ నిరతిః పారుష్య తైక్ష్ణ్యేచ. 14

టీ. భౌమస్య=కుజునియొక్క, దశయందు, అరివిమర్ద=శత్రుమర్దనము, భూప=రాజు, సహజ=తోడబుట్టినవాడు, క్షితి=భూమి, ఆవిక=మేషగోమాదులు, అజ=మేకలు వీనిచేత, ధనం=ధనములభించును ఇవి కుజుని శుభదశాఫలములు. అశుభదశాఫలము లెవ్వియనిన:—సుత మిత్ర దార సహజైః=పుత్ర మిత్ర కళత్ర భ్రాతలతోడ, ప్రద్వేషః=వైరంబును, విద్వద్గురు ద్వేషితా= విద్వాంసులతోడను, గురువులతోడను, విరోధంబును, తృష్ణా = అతిగాహము, అసృక్=రక్తస్రావము, జ్వర=జ్వరము, పిత్త=పైత్యము, భంగ=అవయవములయందు పగులుట, వీనివలన, జనితాః=పుట్టిన, రోగాః=రోగములును, పరస్త్రీకృతాః=పరస్త్రీలవలన గలిగిన రోగములును, సంభవించును. (పరస్త్రీప్రసక్తా అనెడు పాఠమందు, పరస్త్రీలయందు ప్రేమముగలవాడౌనని యర్థము.) పాపరతైః = పాపకార్యాసక్తులైన వారిచేత, ప్రీతిః= సంతోషంబును, అధర్మనిరతిః=అధర్మాసక్తియును, పారుష్య తైక్ష్ణ్యేచ. పారుష్య=వాక్పారుష్యంబును, తైక్ష్ణ్యే చ=ఉగ్రస్వభావత్వంబునుం గలుగును, ఇవి కుజుని అశుభదశాఫలములు.

తా. అంగారకుని శుభదశయందు, శత్రుమర్దనము, రాజులు, సహోదరవర్గము, భూమి, అజాదులరోమవిక్రయము, మొదలగువానిచే ధనలాభముగలుగును. అశుభదశయందు పుత్ర మిత్ర కళత్ర భ్రాతృజన విరోధము, విద్వాంసులతోడను, గురువులతోడను వైరమును, అతి గాహము, రక్తస్రావ, జ్వర, పైత్యవికార శరీరభంగాదులచే జనించు రోగబాధయును, పర స్త్రీసంగమమునగలుగు వ్యాధులును, సంభవించును. మఱియు పాపకార్యాసక్తులగు వారివలన మెప్పును, అధర్మకార్యాసక్తియు, వాక్పారుష్యమును, కఠిన, ఉగ్రస్వభావము మొదలగు నవిగలుగును. మిశ్రదశయందు శుభాశుభఫలితముల జెప్పదగినది. 14

## బుధ దశాంతర్దశల శుభాశుభ ఫలములు.

శ్లో. సౌమ్యాం దౌత్య సుహృద్గురు ద్విజ ధనం విద్వత్ప్రశంసాయశో
యుక్తిద్రవ్య సువర్ణ వేసర మహీ సౌభాగ్య సౌఖ్యాప్తయః
హాస్యోపాసన కౌశలం మతిచయో ధర్మ క్రియాసిద్ధయః
పారుష్య శ్రమ బంధ మానసశుచః పీడాచ ధాతుత్రయాత్. 15

టీ. సౌమ్యాం=బుధదశయందు, దౌత్యసుహృద్గురుద్విజధనం=దూతకార్యమువలనను మిత్ర గురు బ్రాహ్మణులవలనను ధనముగలుగును, విద్వత్ప్రశంసాయశః=పండితులవలన స్తుతియునుయశస్సును గలుగును. యుక్తిద్రవ్య = విత్తళికంచు మొదలైనవి, సువర్ణ=బంగారు, వేసర=అశ్వవిశేషము, మహీ=భూమి, సౌభాగ్య=సర్వజనప్రియత్వము, సౌఖ్య=సుఖము, వీనియొక్క, ఆప్తయః=లాభములు గలుగును, హాస్య = పరిహాసమందును, ఉపాసన=సేవయందును, కౌశలం=చాతుర్యంబును, మతిచయః=బుద్ధివృద్ధియు, ధర్మక్రియాసిద్ధయః=ధర్మకార్యసిద్ధులును, ఈ ఫలములుబుధునిశుభదశయందుగలుగును, అశుభదశయందు, పారుష్య=వాక్పారుష్యము, శ్రమ=ఖేదము, బంధ=బంధనము, మానసశుచ =మనోదుఃఖము, ధాతుత్రయాత్=వాతపిత్తశ్లేష్మములవలనబుట్టిన, పీడాచ=వ్యాధియును, ఈ యశుభఫలములు గలుగును.

తా. బుధుని శుభదశయందు దూతకార్యము వలనను మిత్ర, గురు, బ్రాహ్మణుల మూలకముగను ధనప్రాప్తి గలుగును మఱియును, విద్వాంసులచే బొగడ్తయు, కీర్తియుగలుగును, విత్తళి, కంచు మొదలగువి బంగారు, అశ్వములు, భూమి, సకలజనానురాగము, సుఖము మొదలగునవి గలుగును, మఱియు పరిహాసోపాసన కౌశల మనీషాభివృద్ధియు, ధర్మకార్యసిద్ధియు చాతుర్యము మొదలగునవి గలుగును. అశుభదశయందు పరుసధనము, దుఃఖము అలసట, బంధనము మనోవ్యాకులము, వాతపిత్త శ్లేష్మములవలన బుట్టినవ్యాధియు కలుగును. మిశ్రదశయందు శుభాశుభఫలములు రెండును గలుగును.

## గురు దశాంతర్దశల శుభాశుభ ఫలములు.

శ్లో. జైవ్యాం మానగుణోదయో మతిచయః కాంతిః ప్రతాపోన్నతి
ర్మాహాత్మ్యోద్యమ మంత్ర నీతి నృపతి స్వాధ్యాయ మంత్రైర్ధనం
హేమాశ్వాత్మజ కుంజ రాంబరచయః ప్రీతిశ్చ సద్భూమిపైః
సూక్ష్మోహాగహనశ్రమః శ్రవణరుగ్వైరం విధర్మాశ్రితైః. 16

టీ. జైవ్యాం=గురుదశయందు, మాన=సమ్మానము, గుణ=శ్రుతాధ్యయన వినయ శౌర్యాదిగుణములు, వీనియొక్క, ఉదయః=ఉత్పత్తియు, మతిచయః=బుద్ధివృద్ధియు, కాంతిః=తేజస్సును, ప్రతాపోన్నతిః=శత్రుజయము వలననైన శౌర్యాధిక్యంబును, మహాత్మ్య=పరోపకారశీలత్వము, ఉద్యమ=మహాకార్యోద్యోగము, మంత్ర=ఆలోచన, నీతి = నీతిశాస్త్రము,

నృపతి=రాజసేవ, స్వాధ్యాయ=వేదపాఠము, మంత్ర=మంత్రజపము, వీనిచేత, ధనం=ధనము ప్రాప్తించును. హేమ=బంగారము, అశ్వ=గుఱ్ఱములు, ఆత్మజ=పుత్రులు, కుంజర=ఏనుగులు, అంబర=మకూలవస్త్రములు, వీనియొక్క, చయః=సమూహంబును, సద్భూమిపైః = గుణవంతులైన రాజులతోడ, ప్రీతిశ్చ=స్నేహంబును, ఈ ఫలమును గురుని శుభదశయందు గలుగును, అశుభదశయందు, సూక్ష్మ=సూక్ష్మములై, ఊహాగహన=దుర్జ్ఞేయములైన తర్కవిచారములచేతనైన, శ్రమః=శ్రమముగలుగును, కొందఱు "సూక్ష్మోహాగమనశ్రమః" అని పఠించి సూక్ష్మవిచారహేతువైన త్రిప్పటవలన వృథాశ్రమముగలుగునని చెప్పుదురు. మఱికొందఱు, గహనాః = దుర్జ్ఞేయములైన, సూక్ష్మోహాః=సూక్ష్మతర్కవిచారములును, శ్రమః=శ్రమమును గలుగునందురు. శ్రవణరుక్=కర్ణరోగంబును, విధర్మాశ్రితైః=ధర్మబాహ్యులైన వారితోడ, వైరం = విరోధంబును, ఈయశుభఫలములు గలుగును.

తా. గురుని శుభదశయందు, సన్మానము, శ్రుతాధ్యయన వినయశౌర్యాదిగుణాభివృద్ధి, బుద్ధికుశలత, తేజస్సు, శత్రుజయము, శౌర్యాన్వితత్వము, పరోపకారశీలత, మహోత్సాహోద్యోగము, మంత్రిత్వము, రాజసేవ, వేదపాఠము, నీతిశాస్త్రము, మొదలయినవానిచే ధనార్జనగలుగును. బంగారము, గుఱ్ఱములు, ఏనుగులు, కుమారులు, మకూలవస్త్రములు, మొదలగునవి అధికముగ గలిగియుండును. గుణవంతులైన రాజులతోడి సహవాసముగలుగును, యత్నకార్యసిద్ధి మొదలగు శుభఫలములు గలుగును. అశుభదశయందు, సులభముగ దెలియగూడని తర్కవిచారములచేత నగు శ్రమ, కర్ణరోగము, ధర్మబాహ్యులగు వారితోడ విరోధము, మొదలగునవికలుగును. మిశ్రదశయందుశుభాశుభఫలములు గలుగును.

## శుక్ర దశాంతర్గ్రహల శుభాశుభ ఫలములు.

శ్లో. శౌక్ర్యాం గీతరతి ప్రమోద సురభి ద్రవ్యాన్న పానాంబర
స్త్రీ రత్న ద్యుతి మన్మథోపకరణ జ్ఞానేష్ట మిత్రాగమాః
కౌశల్యం క్రయ విక్రయే కృషినిధిప్రాప్తి ర్ధన స్యాగమో
బృందోర్వీశ నిషాద ధర్మ రహితై ర్వైరం శుచః స్నేహతః. 17

టీ. శౌక్ర్యాం=శుక్రదశయందు, గీతరతి=గానాసక్తి, ప్రమోద=సంతోషము, సురభి ద్రవ్య=పరిమళద్రవ్యములు, అన్న=మృష్టాన్నము, పాన=పానము, అంబర = మకూలవస్త్రములు, స్త్రీ=స్త్రీలు, రత్న=మణులు, ద్యుతి=కాంతి, మన్మథోపకరణ=కామభోగసాధనములయిన శయనతాంబూల గంధపుష్పాదులు, జ్ఞాన=జ్ఞానము, ఇష్ట=బంధువులు, మిత్ర=స్నేహితులు, వీరియొక్క, ఆగమాః=లాభములుగలుగును, క్రయవిక్రయే=క్రయవిక్రయములయందు కౌశల్యం=సామర్థ్యంబును, కృషి=కృషియొక్కయు, నిధి=నిక్షేపముయొక్కయు, ప్రాప్తిః=లాభంబును, ధనస్య=ధనముయొక్క, ఆగమః = ఆదాయంబును, ఈఫలములుశుక్రుని శుభదశ

యందు గలుగును. అశుభదశయందు, బృంద=బహుజనసమూహముతోడను, ఉర్వీశ= రాజుల తోడను, నిషాద=అరణ్యజీవులును ప్రాణిఘాతకులునునైన కిరాతులతోడను, ధర్మరహితైః= ధర్మహీనులైనవారితోను, వైరం = విరోధమును, స్నేహాతః = స్నేహమువలన, శుచః= శోకమునుగలుగును

తా. శుక్రుని శుభదశయందు, గానమునందు ఆసక్తి, సంతోషము, పరిమళద్రవ్యములు, మృష్టాన్నపానములు, దుకూలవస్త్రములు, సుందరీమణులు, రత్నములు, శోభ, కామభోగసాధనములగు తాంబూలగంధపుష్ప శయ్యాదులసౌఖ్యము, బుద్ధి, బంధువులు, స్నేహితులు మొదలుగాగలవి లభించును. సంతోషము చక్కగాభివృద్ధికి వచ్చు సామర్థ్యమును, సేద్యమునందులాభమును, నిక్షేపప్రాప్తియును, పలువిధములధనలాభంబును, గలుగును.

అశుభదశాంతర్దశయందు, జనసముదాయముతోడను, రాజులతోడను, కిరాతుల తోడను, పాపగ్రహులతోడను విరోధముగలుగును. స్నేహితులయందు స్నేహాభివృద్ధికిబదులు శోకము అభివృద్ధియగును. మిశ్రదశయందు ఉభయఫలములు జరుగుచుండును.

—◦— శనిదశాంతర్దశల శుభాశుభ ఫలములు. —◦—

శ్లో. సౌరీం ప్రాప్య ఖరోష్ట్ర పక్షిమహిషీ వృద్ధాంగనా వాప్తయః
శ్రేణీ గ్రామపురాధి కారజనితా పూజా కుధాన్యాగమః
శ్లేష్మేర్ష్యానిల కోప మోహ మలిన వ్యాపత్తి తంద్రాశ్రమా
న్భృత్యాపత్య కళత్ర భర్త్సనమపి ప్రాప్నోతి చవ్యంగతామ్. 18

టీ. సౌరీం=శనిదశను, ప్రాప్య=పొంది, ఖర = గర్దభములు, ఉష్ట్ర - ఒంటెలు, పక్షి= పక్షులు, మహిషీ=ఎనుము, వృద్ధాంగనా = వృద్ధస్త్రీ, మొదలగువానియొక్క, అవాప్తయః= ప్రాప్తముగలుగును, శ్రేణిబంధులయు, గ్రామ = గ్రామముయొక్కయు, పుర = పట్టణముయొక్కయు, అధికార=అధికారముచేత, జనితా=కలిగిన, పూజా=మర్యాదయు, కుధాన్యాగమః-ధాన్యలాభంబును, (శనిశుభదశయందుగలుగును) శ్లేష్మ=శీతలముచేతను, ఈర్ష్య=మత్సరముచేతను, అనిల=వాయువుచేతను, కోప=క్రోధముచేతను, మోహ = చిత్తభ్రమముచేతను, మలిన=మాలిన్యముచేతను, వ్యాపత్తి = అధికాపదలనుపొందును, తంద్రాశ్రమాన్ = నిద్రాంతిని శ్రమమునుపొందును, భృత్యాపత్యకళత్ర భర్త్సనమపి= సేవకులు, పుత్రులు భార్యవలన తిరస్కారమును, వ్యంగతాం=అంగహీనత్వమును, ప్రాప్నోతి=పొందును,

తా. శనైశ్చరుని శుభదశయందు గార్ధభములు, ఒంటెలు, పక్షులు, మహిషములు మొదలగునవియు, వయస్సుమీరిన యువతీసంగమమును, గలుగును, కులాధికారమును, గ్రామాధికారమును కలుగును. కొఱ్ఱలు, జొన్నలు, నువ్వులు మొదలగు ధాన్యముల ఫలితములును గలుగును, అశుభదశయందు, కోపము, మత్సరము, చిత్తభ్రమ మొదలగుబాధలచే

విశేష ఆపదలు గలుగును. నిద్ర, ఉన్మత్తము, ఆలస్యములచే శ్రమయును, భార్య, బిడ్డలు, సేవకులు, బంధువులు మొదలుగాగలవారిచే తిరస్కారమునుబొందును. మఱియు నీ యశుభదశయందు అంగహీనత్వముగలుగును.మిశ్రదశయందు పైజెప్పబడినశుభాశుభఫలితములుజరుగును.

## శుభాశుభ ఫలముల విషయ విభాగ లగ్నదశాఫలములు.

శ్లో. దశాసు శస్తాసు శుభాని కుర్వం
త్యనిష్టసంజ్ఞా స్వశుభాని చైవం
మిశ్రాసు మిశ్రాణి దశాఫలాని
హోరాఫలం లగ్నపతే స్సమానం. 19

టీ. శస్తాసు=శుభములైన, దశాసు=దశలయందు, శుభాని=శుభఫలములను, కుర్వంతి=చేయుదురు, అనిష్టసంజ్ఞాసు=అశుభసంజ్ఞాదశలయందు, అశుభాన్యేవ=అశుభఫలములనే, కుర్వంతి=చేయుదురు, మిశ్రాసు=మిశ్రములైయున్న దశలయందు, మిశ్రాణి=మిశ్రఫలములను,కుర్వంతి చేయుదురు,హోరాఫలమ=లగ్న దశాఫలము,లగ్నపతేః=లగ్నాధిపతికి, సమానం=సమానమైనది,

తా. సూర్యచంద్రాదులు శుభదశలయందు శుభఫలములను, అశుభదశలయందు అశుభఫలములను, మిశ్రదశయందు శుభాశుభమిశ్రములైన ఫలితములుగలుగజేయుదురు. మఱియు "జన్మన్యుపచయభవనే సంస్థితా స్సవ్యగాస్సుమూర్తి ధరాః, శ్రేష్ఠంఫలం విదధ్యుర్గ్రహాః క్రమాత్స్వందశాంప్రాప్య, అన్యైర్నిహతారూక్షాల్ప మూర్తయోనుపచయర్క్ష సంస్థాశ్చ, స్వదశాభిహితంనేష్టంగ్రహాః ప్రయచ్ఛంతిలోకేషు." అనుసత్యాచార్యుల వచనానుసరణముగ జన్మకాలమునందు ఉపచయరాశిస్థితులును, నిర్మలమూర్తులును, స్పష్టగతులైన గ్రహములదశాంతర్దశలు శుభప్రదములగును. అనుపచయరాశిస్థితులును, శత్రుపీడితులును, స్వల్పమూర్తులునైన గ్రహముల దశాంతర్దశలు అశుభప్రదములగును.

## లగ్న ఫలము.

లగ్నదశాఫలము లగ్నాధిపతికి సమానమైనది అనగా:—

| | |
|---|---|
| మేష వృశ్చికములకు:—కుజదశాఫలము | మకర కుంభములకు:—శని దశాఫలము |
| వృషభ తులలకు:—శుక్రదశాఫలము. | సింహమునకు:—రవిదశాఫలము. |
| మిధున కన్యలకు:—బుధ దశాఫలము. | కర్కాటకమునకు.—చంద్ర దశాఫలము. |
| ధను ర్మీనములకు:—గురుదశాఫలము. | (అను తెలియవలెను.) |

ఇదియునుగాక "ఉభయేధమ మధ్యపూజితాః" అను శ్లోకోక్తముగ ద్రేక్కాణవశంబున లగ్నదశ శుభాశుభ ఫలముల నొసంగును.

సారావళి శ్లో. "ప్రవేశే బలవాన్ ఖేటస్సుహృద్భిర్వా సన్నిరీక్షితః, సౌమ్యాధిమిత్రవర్గస్థో మృత్యుకృన్నభవేత్తదా, అంతర్దశాధినాథస్య విబలస్య దశాయదా, బలిన స్స్యాత్తదా శుభం

గో నబాధ్యా తస్యచ ధ్రువమ్, యుద్ధేచ విజయీ తస్మిన్ గ్రహయోగే శుభోయది, దశాయాం నభవేత్కష్టం స్వోచ్చాదిషుచ సంస్థితః." ననుసరించి అంతర్దశా ప్రవేశకాలమున అంతర్దశాధిపతి క్రూరుడైన బలవంతుడును, శుభులచే జూడబడిన వాడును, శుభాది మిత్ర వర్గమందును యున్నవాడాయె నేనియు, మూలదశాధిపతి బలవంతుడై అంతర్దశాధిపతి బలహీనుడై యుండినను, యుద్ధమునందు జయమును బొందినట్టియుఁ శుభయుక్తుడైనట్టియు ఉచ్చయందున్నట్టి గ్రహదశాంతర్దశల యందును అరిష్టభంగములు గలుగునని నూహింప దగినది.

శ్లో. సంజ్ఞాధ్యాయే యస్య యద్ద్రవ్య ముక్తం
కర్మా జీవో యశ్చ యస్యోప దిష్టః
భావ స్థానా లోక యోగోద్భవం చ
తత్తత్సర్వం తస్య యోజ్యం దశాయాం. 20

టీ. సంజ్ఞాధ్యాయే=సంజ్ఞా ప్రయుక్తమగు గ్రహయోని భేదాధ్యాయమందు, యస్య=ఏగ్రహమునకు, యద్ద్రవ్యం=యేద్రవ్యము, ఉక్తం = చెప్పఁబడెనో, తస్య=ఆగ్రహముయొక్క, శుభా=శుభసమయములందు తత్తత్ఫలములు కలుగును, యస్య=ఏగ్రహమునకు, యశ్చకర్మా జీవః=ఏకర్మాజీవము, ఉపదిష్టః=చెప్పఁబడెనో, ఆగ్రహదశాంతర్దశలయం దాకర్మాజీవ ఫలప్రాప్తియగును. భావస్థానాలోక యోగోద్భవంచ=భావఫలములును రాశిఫలములును దృష్టిఫలంబులును, యోగఫలములును, తత్సర్వం = ఆఫలములన్నియు, తస్య=ఆగ్రహముయొక్క దశాయాం=దశయందు, యోజ్యం = యోజింపఁదగినవి.

తా. పై జెప్పబడిన ఫలములేగాక గ్రహయోని భేదాధ్యాయమునందు "తామ్రం స్యాన్మణి"అనుశ్లోకమున ఏగ్రహమునకు ఏద్రవ్యము చెప్పబడియున్నదో ఆద్రవ్యార్జనముఆగ్రహ శుభదశయందును, ఆవిధమైన ద్రవ్యనాశనము ఆగ్రహ అశుభదశయందును, గలుగును. ఏ గ్రహమునకు "యశ్చకర్మాజీవ అర్థాప్తిః పితృజననీ సపత్ని మిత్ర భ్రాతృస్త్రీ భృతక జనాద్దివాకరాద్యైః" అనుదానిననుసరించి ఏకర్మాజీవము చెప్పబడెనో ఆయాగ్రహ దశాంతర్దశలయం దాయా కర్మాజీవము ప్రాప్తించును. ఇవియుగాక ఆయాగ్రహమునకు, "భావస్థానాలోక యోగోద్భవంచ శూరస్తబ్ధో వికృత నయనో నిర్ఘృణోర్క తనుస్థే" మొదలగు భావ ఫలములయందును, "ప్రథితశ్చతురశ్శోటనోల్పవిత్తః క్రియగే" మొదలగు రాశిఫలములందును, "చంద్రేభూపబుధౌ" అను దృష్టిఫలంబులందును, ఏయేఫలములు జెప్పబడినవో ఆఫలములును, నాభసయోగ వ్యతిరిక్తములైన యోగఫలములును, ఆయాగ్రహముయొక్క దశాంతర్దశలయందు, యోజింపదగినవి. "శ్లో. ఇతినిగదితా యోగా స్సార్థం ఫలైరిహనాభసా నియతఫలదా శ్చింత్యాహ్యేతే సమస్త దశాస్వపి" అని నాభసయోగములు మాత్రమే సమస్త దశలయందును తమఫలముల నిచ్చుచుందును. 20

## శరీర కాంత్యాదులచే నష్టజాతక గ్రహదశా నిర్ణయము.

శ్లో. ఛాయాం మహా భూత కృతాంచ సర్వే
భి వ్యంజయంతి స్వదశా మవాప్య
క్ష్మాం బ్వగ్ని వాయ్వం బరజా న్గు ణాంశ్చ
నాసాస్య దృక్త్వక్ఛ్రవణాను మేయాన్.    21

టీ. సర్వే=సకల గ్రహములును, స్వదశాం=తమతమదశను, అవాప్య=పొంది, మహాభూతకృతాం = మహాభూత కృతమైన, ఛాయాం=కాంతిని, అభివ్యంజయంతి = ప్రకాశింపఁజేయుచున్నవి. క్ష్మాంబ్వగ్ని వాయ్వంబరజాన్ = పృథివ్యప్తేజో వాయ్వాకాశముల వలనజనించినవి, నాసాస్యదృక్త్వక్ఛ్రవణానుమేయాన్ = నాసికాజిహ్వానేత్ర త్వక్ఛ్రోత్రముల వలనం దెలియఁనట్టి, గుణాన్=గుణములను, అభివ్యంజయంతి = ప్రకాశింపఁజేయును.

తా. సకలగ్రహములు తమతమదశనుపొంది పృథివ్యాపస్తేజోవాయు రాకాశాలు అను పంచభూతకృతమైన శరీరకాంతిని, ప్రకాశింప జేయుచున్నవి. ఆశరీరకాంతి పృథివ్యప్తేజోవాయ్వాకాశములవలన బుట్టినట్టియు, నాసికా జిహ్వానేత్రత్వక్ఛ్రోత్రములవలన దెలియదగినట్టి గుణములను ప్రకాశింప జేయును.    21

వివరము:—

పృథివీభూతమునకు ఘ్రాణేంద్రియ గ్రాహ్యమైన గంధము గుణముగనుక పురుషుడెపుడు పృథివీఛాయా గుణములు గలవాడైయుండునో అపుడు బుధదశా కాలమని తెలియదగినది.

జలభూతమునకు రసనేంద్రియ గ్రాహ్యమైన రసము గుణము గనుక పురుషుడెపుడు మంచిరసముతో గూడిన పదార్థముల భుజించుచు జలచ్ఛాయా గుణములు గలవాడైయుండునో అపుడు చంద్రశుక్రులలో నొకనిదశయని దెలియదగినది.

అగ్నిభూతమునకు చక్షురింద్రియ గ్రాహ్యమైన రూపము గుణము గనుక పురుషుడెపుడు మంచిరూపము గలవాడై అగ్నిచ్ఛాయా గుణములు గలిగియుండునో అపుడుకుజరవులలో నొకనిదశయని నూహింపదగినది.

వాయు భూతమునకు త్వగింద్రియ గ్రాహ్యమైన స్పర్శముగుణము గనుక పురుషుడెపుడు దుష్టమగుస్పర్శ గలవాడై వాయుచ్ఛాయా గుణములు గలిగియుండునో అపుడు శనిదశా కాలమని దెలియదగినది.

ఆకాశ భూతమునకు శ్రోత్రేంద్రియ గ్రాహ్యమైన శబ్దము గుణముగనుక పురుషుడెపుడు శ్రవణసుఖంబుగా బలుకుచు, ఆకాశచ్ఛాయా గుణములు కలిగియుండునో అపుడు గురుదశా కాలమని గ్రహింపదగినది.

| సం. | భూతములు. | ఇంద్రియములు. | గుణము. | కాలప్రవర్తనము. | ఛాయాగుణములు. | దళ. |
|---|---|---|---|---|---|---|
| 1 | పృథివి | ఘ్రాణేంద్రియము | గంధము | సుగంధముల యందు ప్రీతి | పృథివీ ఛాయాగుణములు | బుధదళ |
| 2 | జలము | రసనేంద్రియము | రసము | రసవత్పదార్థ భోజన ప్రీతి | జలచ్ఛాయాగుణములు | చంద్రదళ లేక శుక్రదళ |
| 3 | అగ్ని | చక్షురింద్రియము | రూపము | మంచిరూపము గలిగి యుండుట | అగ్నిచ్ఛాయా గుణములు | కుజదళ లేక రవిదళ |
| 4 | వాయువు | త్వగింద్రియము | స్పర్శము | మృదుస్పర్శగల వాడైయుండుట | వాయుచ్ఛాయా గుణములు | శనిదళ |
| 5 | ఆకాశము | శ్రోత్రేంద్రియము | శబ్దము | శ్రవణసుఖంబుగ బలుకుట | ఆకాశచ్ఛాయాగుణములు | గురుదళ |

వరాహమిహిరాచార్యకృతి ఛాయాగుణ విశేషములు.

శ్లో. స్నిగ్ధద్విజత్వఙ్నఖలోమకేశ చ్ఛాయాసుగంధాతు మహీసముత్థా,
తుష్టర్థలాభాభ్యుదయాన్ కరోతి ధర్మస్య చాహన్య హాని ప్రవృద్ధిం. 1

శ్లో. స్నిగ్ధా సితా చ హరితా నయనాభిరామా సౌభాగ్యమార్దవ సుఖాభ్యుదయాన్ కరోతి,
సర్వార్థసిద్ధి జననీ జననీవ చాప్యా ఛాయాఫలం తనుభృతాం శుభమాదధాతి. 2

శ్లో. చండాదృష్ట్యా పద్మహేమాగ్నివర్ణా యుక్తా తేజో విక్రమైః సప్రతాపైః,
ఆగ్నేయీతి ప్రాణిషు స్యాజ్జయాయ క్షిప్రం సిద్ధిం వాంఛితార్థస్య దత్తే. 3

శ్లో. మలిన పరుష కృష్ణా పాపగంధానిలోత్థా జనయతి వధబంధవ్యాధ్యనర్థార్థనాశాన్. 4

శ్లో. స్ఫటికసదృశ రూపా భాగ్యయుక్తాత్యుదారా నిధిరివగగనోత్థా శ్రేయసాం స్వచ్ఛవర్ణాత్

## అంతరాత్మ స్వరూపమువలన ఫలభేదము నెఱుంగుట.

శ్లో. శుభ ఫలద దశాయాం తాదృగే వాంత రాత్మా
బహుజన యతిపుంసాం సౌఖ్య మర్థాగ మంచ
కథిత ఫలవిపాకై స్తర్క యేద్వర్త మానాం
పరిణమతి ఫలోక్తి స్స్వప్న చింతా స్వవీర్యైః. 22

టీ. శుభఫలదదశాయాం=శుభఫలములనిచ్చు దశయందు, అంతరాత్మా=పురుషునిమనస్సు, తాదృగేవ = శుభస్వరూపముగనే యుండును, పుంసాం=పురుషులకు, బహు=అనేకములైన, సౌఖ్యం=సౌఖ్యములును, అర్థాగమంచ=ధనలాభమును, జనయతి=కలుగఁజేయును, కథితఫలవిపాకైః= ఈచెప్పఁబడిన శుభాశుభఫల పరిపాకములచేత, వర్తమానాం=తత్కాలదశను, తర్కయేత్ =ఊహింపఁగలయును, అవీర్యైః = బలహీనములగు గ్రహములచేత, ఫలోక్తిః = ఫలవాక్యము, స్వప్నచింతాసు = స్వప్నచింతలయందు, పరిణమతి = పరిణమించుచున్నది.

తా. శుభఫలముల నిచ్చెడు దశయందు పురుషుని మనస్సు శుభస్వరూపమై యుండును అపుడు మహాభూతకృతచ్ఛాయచే నూహింపబడిన గ్రహదశపురుషులకు సకల సౌఖ్యమును, ధనలాభమును గలుగజేయును అశుభదశయందు శుభదశాకాల ఫలితంబులకు వ్యతిరేకమగుఫలములను గలుగజేయును మిశ్రదశయందు శుభాశుభఫలితముల రెంటిని గలిగించును.

ఇందులకు "శ్లో. శుభాశుభాని సర్వాణి, నిమిత్తాని స్యురేకతః, ఏకతశ్చ మనశ్శుద్ధి స్తద్విశుద్ధి గ్రహాణహో" అని యాత్రాగ్రంథశ్లోకము ఉదాహరణముగ నున్నది. గనుక శుభాశుభ ఫలములవలన వర్తమాన దశనూహింప దగినది.

మఱియు శుభాశుభ ఫలములయందు కొన్నికొందఱికి అనుభవమునకు రాకయుండుట యుంగలదు అందుముఖ్యముగా శుక్ర శుభదశయందు నిధిప్రాప్తియు, శనైశ్చరుని యశుభదశయందు అంగహీనత్వమును అనుభవమునకు రాకయున్నవి. అయిన ఆఫలములు బలహీనములగు గ్రహములచేత స్వప్న చింతలయందు పరిణమించుచున్నవి. గనుక అవి కొందఱికి ప్రత్యక్షు అనుభవమునకు రావని యూహింపదగినది.

## గ్రహ పరస్పర విరుద్ధ ఫలభేద నిర్ణయము.

శ్లో. ఏకగ్రహస్య సదృశే ఫలయో ర్విరోధే
నాశం వదేద్య దధికం పరిపచ్యతే తత్
నాన్యో గ్రహస్స దృశ మన్య ఫలం హినస్తి
స్వాం స్వాం దశా ముపగతా స్స్వ ఫల ప్రదా స్స్యుః. 23

టీ. ఏకగ్రహస్య=ఒకగ్రహముయొక్క, ఫలయోః=ఫలములయందు, విరోధే= విరోధము, సదృశే=సమానమైయుండఁగా, నాశం=నాశమును, వదేత్ = చెప్పవలయును, యత్ =ఏఫలము, అధికం=అధికముగనుండునో, తత్ =ఆఫలము, పరిపచ్యతే=పరిపాకమునుబొందును, అన్యః=

వేరొక గ్రహము, సదృశం = సమానమైన ఫలమునుగాని, అన్యఫలం = ఇతరఫలమునుగాని, న హినస్తి=చెరుపదు, స్వాంస్వాందశాం =తమతమదశలను, ఉపగతాః = పొందినవారై, స్వఫల ప్రదాః = తమతమఫలముల నిచ్చువారలు, స్యుః=అగుదురు.

తా. ఒక గ్రహముయొక్క రెండు ఫలములయందు పరస్పర విరోధము సమానమైన యెడల ఆఫలముల నాశనమును చెప్పవలయును అనగా శుభపయోగములు తప్ప తక్కినఫలముల నాయాగ్రహము తనతనదశయందు మాత్రమే కలిగించునని చెప్పబడియున్నది గనుక ఒక గ్రహము ఒకయోగముచేత బంగారము నిచ్చువాడును, మఱియొక యోగముచేత బంగారము నపహరించు వాడునునై యుండు నెడల ఆగ్రహము ఆ రెండుఫలితములలో దేనినైనను గల్గింప జాలదు ఈఫలయోగములయందు హెచ్చుతక్కువలు అనగా ఒక గ్రహము రెండు యోగములచేత బంగారము నిచ్చువాడును ఒకయోగముచేత బంగారము నపహరించువాడునునై యుండు నెడల సువర్ణప్రదత్వ యోగములధికముగ నుండుటవలన సువర్ణము నిచ్చునేగాని అపహరింప జాలదు ఒక గ్రహము నొకఫలమును యిచ్చుచుండగా ఆఫలము సమానమైనదైనను, అన్యఫలమైనను మఱియొక గ్రహము చెరుపదు అయితే సకలగ్రహములు స్వదశలయందు మాత్రమే తమతమ ఫలముల నిచ్చువారలు అగుచున్నారు. అనగా బంగారము నిచ్చుశక్తిగల గ్రహముతన దశయందు మాత్రమే బంగారము నిచ్చును బంగారమును పోగొట్టుగల గ్రహముతనదశయందు మాత్రమే బంగారమును పోగొట్టును. 23

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
దశాంతర్దశాధ్యాయ నామక
అష్టమాధ్యాయము.

---

శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### అష్టకవర్గాధ్యాయము. నవమాధ్యాయము. —9

---

#### సూర్యాష్టకవర్గ.

జననకాలమునందు రవ్యాది సప్తగ్రహంబులును లగ్నంబును. ఈ 8 యు ఏరాశియం దుండునో ఆయారాశి మొదలుకొని చారవశంబున సంచరించుచున్న ఒక్కొక్క గ్రహము యొక్క శుభాశుభ ఫలములను ఈ అష్టకవర్గాధ్యాయమున తెలిసి కొనవచ్చును.

## సూర్యాష్టక వర్గు.

శ్లో. స్వాదర్కః ప్రథమాయ బంధు నిధన ద్వ్యాజ్ఞాతపో ద్యూనగో
వక్రా త్స్వాదివ తద్వ దేవ రవిజా చ్ఛుక్రాత్ స్మరాం త్యారిషు
జీవా ద్ధర్మ సుతాయ శత్రుషు దశ త్ర్యా యారిగ శ్శీతగో
గేష్వే వాంత్యతపస్సు తేషుచ బుధాల్లగ్నా త్సబంధ్వం త్యగః. 1

టీ. అర్కః=సూర్యుఁడు, స్వాత్=తానున్న రాశి మొదలు, ప్రథమాయబంధు నిధన ద్వ్యాజ్ఞాతపోద్యూనగః= 1, 11, 4, 8, 2, 10, 9, 7, స్థానములయందు చారవశంబున నున్నవాఁడై, శుభః=శుభప్రదుఁడగును, వక్రాత్ స్వాదివ=అంగారకుఁడున్న స్థానము మొదలుకొని తనకుం జెప్పిన స్థానములవలెనే అనఁగా 1, 11, 4, 8, 2, 10, 9, 7, స్థానములనున్న సూర్యుఁడు శుభప్రదుఁడగును. తద్వదేవరవిజాత్=శనియున్న చోటు మొదలుకొని, 1, 11, 4, 8, 2, 10, 9, 7, స్థానములనున్న రవి శుభుండగును, శుక్రాత్ స్మరాంత్యారిషు = శుక్రుఁడున్న స్థానము మొదలు 7, 12, 6, స్థానములయందున్న సూర్యుఁడు శుభకరుఁడగును. జీవాద్ధర్మసుతాయశత్రుషు=గురుఁడున్న స్థానము మొదలుకొని, 9, 5, 11, 6, స్థానములయందున్న సూర్యుఁడు శుభదుండగును. దశత్ర్యాయారిగశ్శీతగోః=చంద్రుఁడున్న స్థానము మొదలుకొని 10, 3, 11, 6, స్థానములయందుండు సూర్యుఁడు శుభదుండగును. ఏష్వేవాంత్యతపస్సు తేషు బుధాత్=బుధుడున్న స్థానము మొదలుకొని చంద్రునికి చెప్పఁబడిన 10, 3, 11, 6, 12, 5, 9, స్థానములయందున్న సూర్యుఁడు శుభకరుఁడగును. లగ్నాత్సబంధ్వంత్యగః = లగ్నాది 10, 3, 11, 6, 4, 12, స్థానములలోని సూర్యుఁడు శుభకరుఁడగును.

తా. సూర్యుఁడు జననకాలమున తానున్న రాశి మొదలుకొని చారవశంబున, 1, 2, 4, 7, 8, 9, 10, 11, స్థానంబుల యందును.

అంగారకుఁడున్న స్థానము మొదలు. 1, 2, 4, 7, 8, 9, 10, 11, స్థానములందును,

శనియున్న స్థానము మొదలు. 1, 2, 4, 7, 8, 9, 10, 11, స్థానములందును.

శుక్రుఁడున్న స్థానము మొదలు. 6, 7, 12, స్థానములందును.

బృహస్పతి యున్న స్థానము మొదలు. 5, 6, 9, 11, స్థానంబులందును.

చంద్రుఁడున్న స్థానము మొదలు. 3, 6, 10, 11, స్థానంబు లందును.

బుధుఁడున్న స్థానము మొదలు 3, 5, 6, 9, 10, 11, 12, స్థానంబులందును.

లగ్నము మొదలుకొని 3, 4, 6, 10, 11, 12, స్థానంబులందునుండగా శుభుఁడగుచున్నాఁడు.

ఈవిషయమై తరుచువచించినవాక్యములు సులభముగ నూహించుటకువీలుగానున్నవి.

సూర్యుడు మొదలు 'పుత్రవాసోదధానస్య' 1, 2, 4, 7, 8, 9, 10, 11,

చంద్రుడు మొదలు, 'గోస్థానదే' 3, 6, 10, 11,

అంగారకుడు మొదలు, 'కారవస్సదాధనికః' 1, 2, 4, 7, 8, 9, 10, 11.

బుధుడు మొదలు, 'గోమతోధనపాత్రం' 3, 5, 6, 9, 10, 11, 12.

గురువు మొదలు, 'శేషోధన్యః' 5, 6, 9, 11.

శుక్రుడు మొదలు. 'తిథిశ్రీః' 6, 7, 12.

శనైశ్చరుడు మొదలు, 'పురావాసోవాధనికః' 1, 2, 4, 7, 8, 9, 10, 11.

లగ్నము మొదలు 'గార్హిస్థ్యాంపగః' 3, 4, 6, 10, 11, 12.

సూర్యసమదాయ బిందువులు 48.

మఱియు ఇందులననుసరించిన లఘుజాతకము. శ్లో. కేంద్రాయాష్ట ద్వినవస్వర్కస్సాన్వ దార్కభౌమ యోశ్చ శుభః, షట్సప్తాంత్యేషు సితాత్షడా యధీధర్మగో జీవాత్, ఉపచయగోర్కశ్చంద్రాదుపచయ నవమాంత్యధీయుత స్స్వామ్యాత్, లగ్నాదుపచయ బంధువ్యవస్థితశ్శోభనః ప్రోక్తః, అనునది ఉదాహరణముగ నున్నది.

## చంద్రాష్టక వర్గ.

శ్లో. లగ్నాత్షట్త్రిదశాయగస్సధనధీధర్మేషు చారాచ్ఛశీ
స్వాత్సాస్త్రాదిషుసాష్టసప్తసు రవేషట్త్ర్యాయధీస్థో యమాత్
ధీత్ర్యాయాష్టమకంటకేషు శశిజాజ్జీవాద్వ్యయాయాష్టగః
కేంద్రస్థశ్చ సితాత్తుధర్మసుఖధీత్ర్యాయాస్పదానంగగః. 2

టీ. శశీ=చంద్రుడు, లగ్నాత్=లగ్నము మొదలు, షట్త్రిదశాయగః=6, 3, 10, 11, స్థానములయందున్నవాడై శుభుడగును, ఆరాత్=కుజుడున్న స్థానము మొదలు, సధనధీధర్మేషు= 6, 3, 10, 11, 2, 5, 9. స్థానములయందున్న చంద్రుడు శుభుడగును, స్వాత్=తానున్న స్థానము మొదలు, సాస్త్రాదిషు=ఆలగ్న స్థానములగు 6, 3, 10, 11, 7, 1. యందు చంద్రుడు శుభకరుండగును, సాష్టసప్తసురవేః = సూర్యుడున్న స్థానము మొదలుకొని 6, 3, 10, 11, 8, 7, స్థానములయందు చంద్రుడు శుభకరుండగును, షట్త్ర్యాయధీస్థోయమాత్=శనియుండు స్థానము మొదలుకొని 6, 3, 11. 5. స్థానములయందున్న చంద్రుడు శుభకరుండగును. ధీత్ర్యాయాష్టమకంటకేషు శశిజాత్=బుధ స్థానము మొదలు 5, 3, 11, 8, 4, 7, 10. స్థానములయందున్న చంద్రుడు శుభకరుడగును. జీవాద్వ్యయాయాష్టగః కేంద్రస్థశ్చ=బృహస్పతియున్న స్థానము మొదలుకొని 12, 11, 8, 1, 4, 7, 10, ఈ స్థానములయందున్న చంద్రుడు శుభుడగును. సితాత్తుధర్మ సుఖధీత్ర్యాయాస్పదానంగగః, శుక్రుడున్న స్థానము మొదలుకొని, 9, 4, 5, 3, 11, 10, 7. యందున్న చంద్రుడు శుభకరుండగును.

తా. చంద్రుడు లగ్నము మొదలు, 3, 6, 10, 11, స్థానములందును.

అంగారకుడున్న స్థానము మొదలు, 2, 3, 5, 6, 9, 10, 11, స్థానములందును.

తానున్న స్థానము మొదలు, 1, 3, 6, 7, 10, 11, స్థానములందును.

సూర్యుడున్న స్థానము మొదలు, 3, 6, 7, 8, 10, 11, స్థానములందును.
శనియున్న స్థానము మొదలు, 3, 5, 6, 11, స్థానములందును.
బుధుడున్న స్థానము మొదలు, 1, 3, 4, 5, 7, 8, 10, 11, స్థానములయందును.
బృహస్పతియున్న స్థానము మొదలు 1, 4, 7, 8, 10, 11, 12, స్థానములయందును.
శుక్రుడున్న స్థానము మొదలు 3, 4, 5, 7, 9, 10, 11 స్థానములందును యుండగా శుభప్రదు డగుచున్నాడు. ఈవిషయమై వరరుచి వచించిన వాక్యములు.

సూర్యుడుండు స్థానము మొదలు' గుప్తాసాజనయః' 3, 6, 7, 8, 10, 11.
చంద్రుండుండు స్థానము మొదలు 'పండితనూనుర్యః' 1, 3, 6, 7, 10, 11.
అంగారకుడుండు స్థానము మొదలు 'త్రిగుణోషధనాయ' 2, 3, 5, 6, 9, 10, 11.
బుధుడుండు స్థానము మొదలు 'సోగీవశసుజస్య' 1, 3, 4, 5, 7, 8, 10, 11.
గురుడుండు స్థానము మొదలు 'పుంవాసోజనోయత్ర' 1, 4, 7, 8, 10, 11, 12.
శుక్రుడుండు స్థానము మొదలు 'లవణస్వాదు నిత్యం' 3, 4, 5, 7, 9, 10, 11.
శనైశ్చరుడుండు స్థానము మొదలు 'గుణస్తోత్యం' 3, 5, 6, 11.
లగ్నము మొదలు 'గీతజ్ఞేయః' 3, 6, 10, 11.
చంద్రసముదాయ బిందువులు 49.

ఈవిషయమై 'శ్లో. శశ్యుపచయేషు లగ్నాత్సాద్యముని స్వాత్కుజాత్స నవధీస్వః, సూర్యాత్సాప్త స్మరగత్రీపడాయను నేషు సూర్యసుతాత్, జ్ఞాత్కేంద్రత్రిసుతా యాష్టమ గో గురో ర్వ్యయాయాష్ట కేంద్రేషు త్రి చతుస్సుత నవమ దశ సప్తమాయగ శ్చంద్రమా శ్శుభశ్శుక్రాత్' అని లఘుజాతకమున నున్నది.

## కుజాష్టకవర్గు.

శ్లో. వక్రస్తూపచయే ష్వినా త్సతనయే ష్వాద్యాధికే షూదయా
చ్చంద్రా ద్దిగ్విషలేషు కేంద్రనిధన ప్రాప్త్యర్థగ స్స్వాచ్ఛుభః
ధర్మాయాష్టమకేంద్రగో ర్కతనయాత్ జ్ఞాత్త్రిషడ్ధీలాభగః
శుక్రాత్ష డ్వ్యయలాభ మృత్యుషు గురోః కర్మాంత్యలాభారిషు. 3

టీ. వక్రస్తూపచయేష్వినాత్సతనయేషు=రవియున్న స్థానము మొదలుకొని=3, 6, 10, 11, 5, యందున్న కుజుడు శుభుడగును. ఆద్యాధికేషూదయాత్ =లగ్నము మొదలు ప్రథమస్థానాదికములైన ఉపచయములగు 3, 6, 10, 11, 1, యందున్న కుజుండు శుభుడు. చంద్రాద్దిగ్విషలేషు=చంద్రుడున్న రాశి మొదలుకొని 3, 6, 11, స్థానములయందున్న కుజుడు శుభుడగును. కేంద్రనిధన ప్రాప్త్యర్థగస్స్వాచ్ఛుభః=అంగారకుడు జన్మకాలమందు తానున్న రాశి మొదలుకొని 1, 4, 7, 10, 8, 11, 2 లనుండినవాడైన శుభకరుండగును. ధర్మాయాష్టమ కేంద్రగో ర్కతనయాత్ = శనియున్న స్థానము మొదలుకొని 9, 11, 8, 1, 4, 7, 10, గృహముల

యందున్న కుజుఁడు శుభకరుండగును, జ్ఞాత్ షట్ త్రిధీలాభగః = బుధుఁడున్న స్థానమునకు 6, 3, 5, 11, ఈ స్థానములయందున్న కుజుఁడుశుభకరుండగును. శుక్రాత్ షడ్వ్యయలాభమృత్యుషు, శుక్రుఁడున్న స్థానము మొదలుకొని 6, 12, 11, 8, స్థానములయందున్న కుజుఁడు శుభకరుండగును. గురోఃకర్మాంత్యలాభారిషు = గురువున్న స్థానమునకు 10, 12, 11, 6, ఈ స్థానములయందున్న కుజుఁడు శుభకరుండగును.

తా. సూర్యుడున్న స్థానము మొదలు అంగారకునకు 3, 5, 6, 10, 11, స్థానములందును.

లగ్నము మొదలు 1, 3, 6, 10, 11, స్థానములందును.

చంద్రుడున్న స్థానము మొదలు 3, 6, 11, స్థానములందును.

తానున్న స్థానము మొదలు 1, 2, 4, 7, 8, 10, 11, స్థానములందును.

శనైశ్చరుడున్న స్థానము మొదలు 1, 4, 7, 8, 9, 10, 11, స్థానములందును

బుధుడున్న స్థానము మొదలు 3, 5, 6, 11, స్థానములందును.

శుక్రుడున్న స్థానము మొదలు 6, 8, 11, 12, స్థానములందును.

గురువున్న స్థానము మొదలు 6, 10, 11, 12, స్థానములందును.

యుండగా శుభప్రదుడగు చున్నాడు.

ఈ విధ ముపై వారుచివచించిన వాక్యములు సూర్యుడుండు స్థానము మొదలు "బాలతనయః" 3, 5, 6, 10, 11.

చంద్రుడుండు స్థానము మొదలు "శుస్త్రాయం" 3, 6, 11.

కుజుడుండు స్థానము మొదలు "పాత్రవసాదనికః" 1, 2, 4, 7, 8, 10, 11.

బుధుడుండు స్థానము మొదలు "గోశతయః" 3, 5, 6, 11.

గురువుండు స్థానము మొదలు "నినయశ్రీః" 6, 10, 11, 12.

శుక్రుడుండు స్థానము మొదలు "తేజవరః" 6, 8, 11, 12.

శనియుండు స్థానము మొదలు— "కరసాదధనికః" 1, 4, 7, 8, 9, 10, 11

లగ్నము మొదలు "నాలస్తునిత్యః" 1, 3, 6, 10, 11.

అంతు అంగారకసముదాయ బిందువులు 39.

## బుధాష్టకవర్గు.

శ్లో. ద్వ్యాద్యాయాష్ట తపస్సుఖేషుభృగుజా త్సత్రాత్మ జేష్వేందుజః
సాజ్ఞాస్తే యమారయోర్వ్య యరిపుప్రాప్త్యష్టగో వాక్పతేః
ధర్మాయారిసుత వ్యయేషు సవితుస్స్వాత్సాద్యకర్మత్రిగః
షట్స్వాయాష్ట సుఖాస్పదేషుహిమగో స్సాద్యేషులగ్నాచ్ఛుభః. 4

టీ. ఇందుజః=బుధుఁడు, భృగుజాత్=శుక్రస్థానము మొదలుకొని, సత్రాత్మజేషు=త్రితీయాపంచములతోఁగూడిన, ద్వ్యాద్యాయాష్టతపస్సుఖేషు, ద్వితీయ ప్రథమైకాదశా,

ష్టమ నవమచతుర్థములయందు, (అనఁగా శుక్రుఁడున్న స్థానమునకు 2, 1, 11, 8, 9, 4, 3, 5, స్థానములయందును) సాజ్ఞాస్తేషు యమారయోః, సాజ్ఞాస్తేషు=దశమ సప్తమ సహితములయిన ద్వ్యేకాష్టతప స్సుఖస్థానములయందును వ్యయరిపుప్రాప్త్యష్ట గోవాక్పతేః = బృహస్పతియున్న స్థానమునకు 12, 6, 11, 8, స్థానములయందును, ధర్మాయారిసుతవ్యయేషుసవితుః=సూర్యుఁడున్న స్థానమునకు 9, 11, 6, 5, 12, ఈ స్థానములయందును, స్వాత్సాద్యకర్మత్రిగః—స్వాత్=తానున్న స్థానమునకు, సాద్యకర్మత్రిగః=ప్రథమ దశమ తృతీయ సహితములయిన ధర్మాయా సుతవ్యయములయందు, షట్స్వాయాష్ట సుఖాస్పదేషు హిమగోః=చంద్రుఁడున్న స్థానమునకు 6, 2, 11, 8, 4, 10, ఈ స్థానములయందును, సాద్యేషు లగ్నాచ్ఛుభః, లగ్నమునకు ప్రథమ సహితములైన షట్స్వాయాష్ట సుఖాస్పదములయందును బుధుఁడు శుభకరుండగును

తా. శుక్రుడున్న స్థానము మొదలు బుధుఁడు 1, 2, 3, 4,5,8,9,10,11, స్థానములందును.

శనైశ్చరుడున్న స్థానము మొదలు 1, 2, 4, 7, 8, 9, 10, 11, స్థానములందును.

అంగారకుడున్న స్థానము మొదలు 1, 2, 4, 7, 8, 9, 10, 11, స్థానములందును.

బృహస్పతియుండు స్థానము మొదలు 6, 8, 11, 12 స్థానములందును.

సూర్యుడున్న స్థానమునకు 5, 6, 9, 11, 12, స్థానములందును.

తానున్న స్థానము మొదలు 1, 3. 5, 6, 9, 10. 11, 12, స్థానములందును.

చంద్రుడున్న స్థానము మొదలు 2, 4, 6, 8, 10, 11, స్థానములందును.

లగ్నము మొదలు 1, 2, 4, 6, 8, 10, 11, స్థానములందును యుండగా శుభప్రదుడగుచున్నాడు.—

ఈ విషయమై వరరుచి వచించిన వాక్యములు.

సూర్యుని మొదలు "శిక్షాధన్యశ్రీః"=5, 6, 9, 11, 12.

చంద్రుని మొదలు "రథస్థదాసస్య"=2, 4, 6, 8, 10, 11.

అంగారకుని మొదలు "పౌరవస్సదాధనికః"=1, 2, 4, 7, 8, 9, 10, 11.

బుధుని మొదలు "యోగమతో ధనపాత్రః"=1, 3, 5, 6, 9, 10, 11, 12.

గురువు మొదలు "తదపాత్రం" 6, 8, 11, 12.

శుక్రుని మొదలు "పుత్రగర్భో మదాధన్యః" 1, 2, 3, 4, 5, 8, 9, 11.

శనైశ్చరుని మొదలు "పురవాసౌ దాధనికః" 1, 2, 4, 7, 8, 9, 10, 11.

లగ్నము మొదలు—"కౌరవస్తదానస్య" 1, 2, 4, 6, 8, 10, 11.

అంతు బుధుని సముదాయబిందువులు. 54.

## గుర్వష్టకవర్గు.

శ్లో. దిక్స్వాద్యాష్టమ దాయబంధుషు కుజాత్స్వాత్సత్రికేష్వంగిరాః
సూర్యాత్సత్రినవేషు ధిస్వనవది గ్లౌభాదిగో భార్గవాత్

జాయాయార్థ నవాత్మ జేషు హిమగో ర్మందా త్త్రిషడ్వ్యయే
దిగ్ధీమట్ స్వసుఖాయ పూర్వ నవగో జ్ఞాత్సస్మ రశ్చోదయాత్. 5

టీ. దిక్స్వాద్యాష్టమదాయబంధుషుకుజాత్ = కుజుఁడున్నస్థానమునకు 10, 2, 1, 8, 7, 11, 4, స్థానములయందున్న, అంగిరాః = బృహస్పతి, స్వాత్సత్రికేషు = తృతీయ సహితములయిన ద్విక్స్వాద్యాష్టమదాయబంధు స్థానములయందు, అనఁగా బృహస్పతితాను జన్మకాలమందున్న రాశికి 10, 2, 1, 8, 7, 11, 4, 3, స్థానములయందును, సూర్యాత్స త్రినవేషు=సూర్యుఁడున్న రాశికి తృతీయ నవమ సహితములైన ఆకుజస్థానములందే అనఁగా సూర్యుఁడున్న రాశికి 10, 2, 1, 8, 7, 11. 4, 3, 9, స్థానముల యందును, ధీస్వనవది గ్లాభారి గోభార్గవాత్ = శుక్రుఁడున్న రాశికి 5, 2. 9, 10, 11, 6, స్థానముల యందును జాయాయార్థనవాత్మ జేషుహిమగోః = చంద్రుఁడున్న రాశికి 7, 11, 2, 9, 5, స్థానముల యందును, మందాత్త్రిషడ్వ్యయే = శనియున్న రాశికి 3, 6, 5, 12, స్థానముల యందును దిగ్ధీమట్స్వసుఖాయ పూర్వనవగోజ్ఞాత్ = బుధుఁడున్న రాశికి 10, 5, 6, 2, 4, 11, 1, 9, స్థానములయందును, సస్మరశ్చోదయాత్ =సప్తమస్థానసహితములైన ఆ బుధస్థానములయందు అనఁగా లగ్నమునకు 10, 5, 6,2 ,4, 11, 1, 9. 7. స్థానముల యందునుండు గురుఁడు శుభకరుఁడు.

తా. బృహస్పతి. అంగారకుఁడున్నస్థానమునకు. 1. 2, 4, 7, 8, 10,11. స్థానములందును
తానున్న స్థానమునకు. 1, 2. 3, 4, 7, 8, 10, 11. స్థానములందును
సూర్యుడున్న స్థానమునకు. 1, 2, 3, 4, 7, 8, 9, 10, 11. స్థానము లందును
శుక్రుడున్న స్థానమునకు 2, 5, 6, 9, 10, 11. స్థానము లందును
చంద్రుడున్న స్థానమునకు. 2, 5, 7, 9, 11. స్థానములందును
శనియున్న స్థానమునకు. 3, 5, 6, 12. స్థానములందును
బుధుఁడున్న స్థానమునకు. 1, 2, 4, 5, 6, 9, 10, 11 స్థానములందును
లగ్నమునకు. 1, 2, 4, 5, 6, 7, 9, 10, 11. స్థానములందును యుండగా శుభకరుడగుచున్నాడు. ఇందులకుగాను, వరరుచివచించిన వాక్యము:—

సూర్యుని మొదలు. "యాత్రలాభస్సదాధనికః" 1, 2, 3, 4, 7, 8, 9, 10, 11.
చంద్రుని మొదలు "గ్రామసాధుస్స్యాత్" 2, 5, 7, 9, 11.
అంగారకుని మొదలు"పురవాసోహానికః" 1, 2, 4, 7, 8, 10, 11.
బుధుని మొదలు "పురవశ్యతధానిత్య" 1, 2. 4, 5, 6, 9, 11, 12.
గురువు మొదలు "పుత్రగర్భసదానయః" 1, 2, 3, 4, 7, 8, 10, 11.
శుక్రుని మొదలు "శ్రీమతోధనపః" 2, 5, 6, 9, 10, 11.
శనైశ్చరుని మొదలు "గాణాచరం" 3, 5, 6, 12.

లగ్నము మొదలు "కరివశేషుధిర్నయా" 1, 2, 4, 5, 6, 7, 9, 10, 11.

అంతుబృహస్పతి సముదాయ బిందువులు 56.

## శుక్రాష్టకవర్గు.

శ్లో. లగ్నాదా సుతలాభరంధ్రి నవగస్సాంత్యాశ్చశాంకా త్సితః
స్వాత్సాజ్ఞేషు సుఖత్రిధీనవదశచ్ఛిద్రాప్తిగస్సూర్యజాత్
రంధ్రా యవ్యయగో రవేర్నవదశ ప్రాప్త్యష్టధీస్థో గురో
ర్జ్ఞాద్ధీత్ర్యాయనవారిగ స్త్రినవషట్ పుత్రాగమాంత్యఃకుజాత్. 6

టీ. లగ్నాదాసుత లాభగంధ్రినవగః= లగ్నము మొదలుకొని 1, 2, 3, 4. 5, 11, 8, 9, స్థానములయందున్న, సితః = శుక్రుఁడు శుభకరుండగును, సాంత్యాశ్చశాంకాత్ = చంద్రుఁడున్న స్థానమునకు 1, 2, 3, 4. 5, 11, 8, 9, 12. స్థానములయందును, స్వాత్సాజ్ఞేషు= శుక్రుఁడు జన్మకాలమందు తానున్న స్థానమునకు 1. 2, 3, 4, 5, 11, 8, 9, 10, స్థానములందును, సుఖత్రిధీనవదశచ్ఛిద్రాప్తిగ స్సూర్యజాత్ =శనియున్న స్థానమునకు 4, 3, 5, 9, 10, 8, 11, స్థానములందును, రంధ్రాయవ్యయగోరవేః = సూర్యుఁడున్న స్థానమునకు 8, 11, 12, స్థానములను, నవదశప్రాప్త్యష్ట ధీస్థోగురోః = బృహస్పతి యున్న స్థానమునకు 9, 10, 11, 8, 5, స్థానములయందును, జ్ఞాద్ధీత్ర్యాయనవారగః = బుధుఁడున్న స్థానమునకు 5. 3, 11. 9, 6, స్థానములయందును, త్రినవషట్ పుత్రాగమాంత్యః కుజాత్ = కుజుఁడున్న స్థానమునకు 3, 9. 6. 5. 11, 12. స్థానములయందునుయున్న శుక్రుఁడు శుభకరుండగును.

తా. శుక్రుడు లగ్నమునకు. 1, 2, 3. 4, 5, 8. 9. 10, 11, స్థానములందును.

చంద్రుడున్న స్థానమునకు. 1. 2. 3. 4, 5, 8. 9, 11, 12, స్థానములందును.

తానున్న. స్థానమునకు. 1, 2, 3, 4, 5, 8, 9, 11, స్థానములందును.

శనియున్న స్థానమునకు. 3, 4, 5, 8. 9, 10. 11, స్థానములందును.

సూర్యుడున్న స్థానమునకు. 8, 11, 12, స్థానములందును.

బృహస్పతి యున్న స్థానమునకు. 5, 8. 9, 10, 11, స్థానములందును

బుధుడున్న స్థానమునకు. 3, 5, 6. 9, 11, స్థానములందును.

అంగారకుడున్న స్థానమునకు. 3. 5, 6, 9, 11, 12, స్థానములందుండగా శుభప్రదుడగు చున్నాడు.

ఈ విషయమై వరరుచి రచించిన వాక్యములు.

సూర్యుని మొదలు "హాయశ్రీః" 8, 11, 12.

చంద్రుని మొదలు "పారంగావోమదాధన్య" 1, 2, 3, 4, 5, 8, 9, 11, 12.

కుజుని మొదలు "గుణేషుధన్యత్ర" 3, 5, 6, 9, 11, 12.

బుధుని మొదలు "గుణేషుధన్యః" 3, 5, 6, 9, 11.

గురువు మొదలు "మహీధనాఢ్యః" 5, 8, 9, 10, 11.

శుక్రుని మొదలు "పురగోభూమిహాధన్యః" 1, 2, 3, 4, 5, 8, 9, 11.

శనైశ్చరుని మొదలు "గతోప్యమహాధనికః" 3, 4, 5, 8, 9, 10, 11.

లగ్నము మొదలు "పారంగావోమదాధనికః" 1, 2, 3, 4, 5, 8, 9, 10, 11.

అంతుశుక్రుని సముదాయబిందువులు 52.

## శనైశ్చరాష్టకవర్గం.

శ్లో. మంద స్స్వ త్రిసుతాయ శత్రుషు శుభ స్సాష్టాంత్యగో భూమిజా
త్కేంద్రాయాష్ట ధనే ష్వినాదుపచయే ష్వాద్యేసుఖే చోదయాత్
ధర్మాయారిదశాంత్యమృత్యుషు బుధాచ్చంద్రాత్త్రి మల్లాభగః
షష్ఠాయాంత్య గతస్సితా త్సురగురోః ప్రాప్త్యం త్యధీ శత్రుషు.7

టీ. మందస్స్వత్రిసుతాయశత్రుషుశుభః=శనైశ్చరుడు జన్మకాలమందు తానున్న స్థానమునకు 3, 5, 11, 6, స్థానములయందు శుభకరుండగును, సాష్టాంత్యగోభూమిజాత్= కుజుఁడున్న స్థానమునకు 3, 5, 11, 6, 10, 12, స్థానములయందును, కేంద్రాయాష్టధనేష్వినాత్ = సూర్యుఁడున్న స్థానమునకు 1, 4, 7, 10, 11, 8, 2, స్థానముల యందును, ఉపచయేష్వాద్యేసుఖేచోదయాత్ = లగ్నమునకు 3, 6, 10, 11, 1, 4, స్థానముల యందును, ధర్మాయారిదశాంత్యమృత్యుషుబుధాత్ = బుధుఁడున్న స్థానమునకు 9, 11, 6, 10 12, 8, స్థానములయందును, చంద్రాత్త్రిమల్లాభగః = చంద్రుడున్న స్థానమునకు 3, 6, 11, స్థానములయందును, షష్ఠాయాంత్యగతస్సితాత్ = శుక్రుఁడున్న స్థానమునకు 6, 11, 12, స్థానములయందును, సురగురోః ప్రాప్త్యంత్యధీశత్రుషు=బృహస్పతియున్న స్థానమునకు 11, 12, 5, 6, స్థానములయందున్న శని శుభకరుండగును.

తా. తానున్న స్థానమునకు 3, 5, 6, 11, స్థానములందును.

కుజుడున్న స్థానమునకు 3, 5, 6, 10, 11, 12. స్థానములందును.

సూర్యుడున్న స్థానమునకు 1, 2, 4, 7, 8, 10, 11, స్థానములందును.

లగ్నమునకు— 1, 3, 4, 6, 10. 11, స్థానములందును

బుధుడున్న స్థానమునకు 6, 8, 9, 10, 11, 12, స్థానములందును.

చంద్రుడున్న స్థానమునకు 3, 6, 11, స్థానములందును.

శుక్రుడున్న స్థానమునకు 6, 11, 12, స్థానములందును.

బృహస్పతియున్న స్థానమునకు 5, 6, 11, 12, స్థానములందుండగా శని శుభప్రదుడగుచున్నాడు.

ఈవిషయమై వరరుచివచించిన వాక్యములు.

సూర్యుని మొదలు "శారవస్సుదానీకః" 1, 2, 4, 7, 8, 10, 11.
చంద్రుని మొదలు "లతేయం" 3, 6, 11.
అంగారకుని మొదలు "లక్ష్మీతనయంత్రం" 3, 5, 6, 10, 11, 12.
బుధుని మొదలు "తేజోధనపాత్రం" 6, 8, 9, 10, 11, 12.
గురువు మొదలు "శీతకరః" 5, 6, 11, 12.
శుక్రుని మొదలు "తస్యశ్రీః" 6, 11, 12.
శని మొదలు "గుణస్తర్కాః" 3, 5, 6, 11.
లగ్నము మొదలు "సౌగంధ్యరినాగ్యః" 1, 3, 4. 6. 10, 11.
అంగుశేన్న ఎకి ర్గ సముదాయ సంఖ్యలు 39.

శ్లో. ఇతి నిగదిత మిష్టం నేష్ట మన్య ద్విశేషా
దధిక ఫలవిపాకం జన్మభాత్తత్ర దద్యుః
ఉపచయ గృహ మిత్ర స్వోచ్చగైః పుష్ట మిష్టం
త్వపచయగృహ నీచారాతిగై ర్నేష్టసంపత్. 8

టీ. ఇతి=ఈప్రకారముగా, నిగదితం=చెప్పబడిన స్థానములు, ఇష్టం=శుభఫల ప్రదములగును అన్యత్=ఇతరమైన స్థానములు, నేష్టం=అశుభఫలప్రదములగును, జన్మభాత్=జన్మకాలమందు ఏయే స్థానమందు గ్రహములుండునో ఆయేడుస్థానములును జన్మలగ్నంబొకటియు ఈ 8 స్థానములు నిక్కడ జన్మశబ్దముచేత గ్రహింపబడును గనుక ఈ 8 స్థానములలో నొక్కొకస్థానము మొదలుకొని, తత్ర=ఆయష్టకవర్గమందు, విశేషాత్=ఇష్టానిష్టసంశోధనము చేయుటవలన, అధికఫలవిపాకం=ఇష్టానిష్టములలో నేది అధికమైయుండునో అఫలవిపాకమును, దద్యుః=గ్రహములు, లిచ్చును. ఉపచయగృహమిత్రస్వోచ్చగైః=లగ్నము మొదలు కొనిగాని చంద్రుడున్న రాశి మొదలుకొనిగాని ఉపచయస్థానములయందును తనమిత్రక్షేత్ర మందును స్వోచ్చస్థానమందును స్వక్షేత్ర మూలత్రికోణములయందును ఉన్నగ్రహములచేత, ఇష్టం= అష్టకవర్గమందు శుభఫలము నిచ్చునట్టిది, పుష్టం = మిక్కిలి శుభఫలమునిచ్చును. అపచయగృహనీచారాతిగైః=లగ్నము మొదలుకొనిగాని చంద్రుడున్న రాశి మొదలుకొనిగాని అపచయస్థానములందును తననీచస్థానములయందును శత్రుక్షేత్రమందును ఉన్నగ్రహముల చేత అష్టకవర్గమందు శుభఫలము నిచ్చునట్టి, ఇష్టసంపత్=శుభఫలసంపత్తు, నపుష్టా = అధికమైనదికానేరదు. ఉపచయ గృహమిత్ర స్వోచ్చగైః=లగ్నము మొదలుకొనిగాని చంద్రుడున్న రాశి మొదలుకొనిగాని ఉపచయస్థానములయందును తనమిత్రక్షేత్రమందును స్వోచ్చస్థానమందును స్వక్షేత్రమూలత్రికోణముల యందునున్న గ్రహము, ఇష్టం=అష్టకవర్గమందు శుభఫలము నిచ్చునట్టిదాయెనేని, అపుడు, పుష్టం=మిక్కిలి శుభఫలమునిచ్చును.

తా. పైజెప్పబడిన ఏడు శ్లోకములయందును జెప్పబడిన స్థానములు ఆయాగ్రహముల

ను శుభఫలప్రదములగును. చెప్పబడకయుండు స్థానములు అశుభఫలప్రదములగును. జన్మ కాలమునందు ఏయేస్థానములందు గ్రహములుండునో ఆయేడుస్థానములును జననలగ్న మొకటి ఈ 8 స్థానములలో ఒక్కొక్క స్థానము మొదలుకొని ఆయష్టకవర్గమునందు యిష్టానిష్టసంశో ధనము జేయుటవలన, అధికమైయుండు ఫలపరిపాకమును గ్రహములిచ్చును అనగా రాశి చక్రమునందు జననకాలగ్రహస్థితినివ్రాసి ఏగ్రహాష్టకవర్గమునందు ఏస్థానములు శుభములని చెప్పబడియున్నవో ఆ స్థానములయందు, (౦) సున్నలును అశుభములని చెప్పబడియుండు స్థానములందు, (1) రేఖలనువ్రాయగా బిందువులుఅధికముగావచ్చియుండు రాశియందు గ్రహ ము శుభదాయకమనియు, ఏరాశియందు రేఖలధికముగావచ్చునో ఆ రాశియందా గ్రహము అశుభదాయకమగుననియు దెలియదగినది. మఱియు ఏగ్రహాష్టక వర్గమందైనను 8 బిందు వులువచ్చిన రాశికిగ్రహమువచ్చినపుడు సంపూర్ణశుభఫలములిచ్చును. 7 బిందువులును, 1 రేఖయుగలరాశియందు గ్రహమువచ్చినపుడు బిందుసంఖ్యయందు రేఖాసంఖ్యనుత్రోయగా 6 బిందువులుమిగులును గనుకముప్పాతిక శుభఫలమునిచ్చును ఇట్లే 6 బిందువులులో 2 రేఖలను త్రోయగా 4 బిందువులు వచ్చును. అర్ధశుభఫలము.

5 బిందువులు 3 రేఖలు = 2 బిందువులు. పాదశుభఫలము.

4 బిందువులు 4 రేఖలు = మధ్యమఫలమునిచ్చును.

8 రేఖలు వచ్చినయెడల = సంపూర్ణముగ అశుభఫలము.

7 రేఖలు 1 బిందువు = ముప్పాతికపాలు అశుభఫలము.

6 రేఖలు 2 బిందువులు = అరపాలు అశుభఫలము.

5 రేఖలు 3 బిందువులు = పాతికపాలు అశుభఫలముగాగ జరుగుచుండును.

## ఉదాహరణము.

| లగ్నము శుక్రుడు | రవి | చంద్రుడు బుధుడు | |
|---|---|---|---|
| | పరహాయు | | గురువు |
| అంగారకుడు | శ్రీజీవితయోగ రాశిచక్రము | | |
| | | శని | |

## పై రాశిచక్రమునగల గ్రహముల అష్టకవర్గముల వివరము.

<table>
<tr><td>|||||<br>000</td><td>||||<br>0000</td><td>||||<br>0000</td><td>||||||<br>00</td></tr>
<tr><td>||<br>000000</td><td colspan="2" rowspan="2">సూర్యాష్టక వర్గము.</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|||<br>00000</td><td>||||<br>0000</td></tr>
<tr><td>|||||<br>000</td><td>||||<br>0000</td><td>|||<br>00000</td><td>|||||<br>000</td></tr>
</table>

<table>
<tr><td>||||<br>0000</td><td>|||||||<br>0</td><td>||<br>000000</td><td>||||<br>0000</td></tr>
<tr><td>||<br>000000</td><td colspan="2" rowspan="2">చంద్రాష్టక వర్గము.</td><td>||||<br>0000</td></tr>
<tr><td>||||<br>0000</td><td>|||||<br>000</td></tr>
<tr><td>||||<br>0000</td><td>|||<br>00000</td><td>||||<br>0000</td><td>||||<br>0000</td></tr>
</table>

<table>
<tr><td>|||||<br>000</td><td>|||||<br>000</td><td>|||||<br>000</td><td>|||||<br>000</td></tr>
<tr><td>||||<br>0000</td><td colspan="2" rowspan="2">కుజాష్టక వర్గము.</td><td>||||<br>0000</td></tr>
<tr><td>|||<br>00000</td><td>|||<br>00000</td></tr>
<tr><td>||||||<br>00</td><td>|||||||<br>0</td><td>|||<br>00000</td><td>||||||<br>00</td></tr>
</table>

<table>
<tr><td>|||<br>00000</td><td>|||<br>00000</td><td>||||<br>0000</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|||<br>00 00</td><td colspan="2" rowspan="2">బుధాష్టక వర్గము</td><td>||||<br>0000</td></tr>
<tr><td>|||<br>00000</td><td>|||<br>00000</td></tr>
<tr><td>||||<br>0000</td><td>|||||<br>000</td><td>||<br>000000</td><td>|||||<br>000</td></tr>
</table>

<table>
<tr><td>||||<br>0000</td><td>|||<br>00000</td><td>|||||<br>000</td><td>||||<br>0000</td></tr>
<tr><td>|||<br>00000</td><td colspan="2" rowspan="2">గుర్వష్టక వర్గము.</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|<br>0000000</td><td>|||<br>00000</td></tr>
<tr><td>||||<br>0000</td><td>|||<br>00000</td><td>||||<br>0000</td><td>|||<br>00000</td></tr>
</table>

<table>
<tr><td>|<br>0000000</td><td>||||<br>0000</td><td>||<br>000000</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|||||<br>000</td><td colspan="2" rowspan="2">శుక్రాష్టక వర్గము.</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|||<br>00000</td><td>|||||<br>[illegible]</td></tr>
<tr><td>||||<br>0000</td><td>|||<br>00000</td><td>|||||<br>000</td><td>|||||<br>000</td></tr>
</table>

<table>
<tr><td>|<br>0000000</td><td>||||<br>0000</td><td>||<br>0000 0</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|||||<br>000</td><td colspan="2" rowspan="2">శన్యష్టక వర్గము.</td><td>|||<br>00000</td></tr>
<tr><td>|||<br>00000</td><td>||||||<br>00</td></tr>
<tr><td>|||||<br>000</td><td>|||<br>00000</td><td>|||||<br>000</td><td>|||||<br>000</td></tr>
</table>

ఇందుగల అష్టకవర్గములలో కుజాష్టక వర్గవివరము:—ఈవర్గ మునందు మేషమున 5 రేఖలును 3 బిందువులు వచ్చినవిగనుక రేఖాసంఖ్యలో బిందుసంఖ్యను తీసియగా. రెండు రేఖలు మిగులును కాఁబట్టి కుజుఁడు చారవశంబున మేషరాశి గతుండైనపుడు పాతిక పాలు అశుభఫలము నిచ్చుచుండును. వృషభమందు 5 రేఖలు 3 బిందువులును వచ్చును గనుక రేఖా సంఖ్యలో బిందుసంఖ్యను త్రోసివేయఁగా రెండు రేఖలు మిగులును కాఁబట్టి వృషభ రాశిగతుఁడై నప్పుడును పాతికపాలు అశుభఫలము నిచ్చును. మిథున మందు 5 రేఖలును 3 బిందువులును వచ్చినవి గనుక మిథున రాశిగతుండైనపుడును పాతికపాలు అశుభఫలము నిచ్చును కర్కాటకమందు 4 రేఖలు 4 బిందువులు సమముగా వచ్చినవి గనుక కర్కాటక రాశి గతుండైనపుడు మధ్యమ ఫలుండగును, సింహమందు 5 బిందువులు 3 రేఖలు వచ్చినవిగనుక బిందుసంఖ్యయందు రేఖాసంఖ్యను త్రోసివేయఁగా రెండుబిందువులు మిగులును కాఁబట్టి సింహ రాశిగతుండైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చును. కన్యయందు 6 రేఖలును 2 బిందువులును వచ్చినవి గనుక కన్యారాశిగతుఁడైనపుడు అరపాలు అశుభఫలమునిచ్చును. తులయందు 5 బిందువులు 3 రేఖలు వచ్చినవి గనుక తులారాశిగతుఁడైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చును. వృశ్చికమందు 7 రేఖలు 1 బిందువువచ్చినవి గనుక వృశ్చికరాశి గతుండైనపుడు ముప్పాతికపాలు అశుభఫలము నిచ్చును. ధనుస్సునందు 6 రేఖలును 2 బిందువులును వచ్చినవి గనుక ధనూరాశిగతుఁడైనపుడు అరపాలు అశుభఫలమునిచ్చును. మకరమందు 5 బిందువులును 3 రేఖలును వచ్చినవిగనుక మకరరాశిగతుఁడైనపుడు పాతికపాలు శుభఫలమునిచ్చును. కుంభ మందు 4 రేఖలు 4 బిందువులు సరిగావచ్చినవిగనుక కుంభరాశిగతుఁడైనపుడు మధ్యమఫల ప్రదుఁడగును మీనమందు 5 రేఖలును 3 బిందువులును వచ్చినవిగనుక కుజుఁడుమీనరాశి గతుండైనపుడు పాతికపాలు అశుభఫలమునిచ్చును, ఇట్లుసర్వ గ్రహాష్టకవర్గము వలనవచ్చిన శుభఫలములను అశుభఫలములను మొత్తములుగాపించి అశుభాశుభ ఫలములలో అధికమైన దానియందుతక్కువయైన దానితోసివేయఁగా ఏఫలంబెంతమిగులునో ఆ ఫలంబంత కలుగు నని చెప్పఁదగినది. ఈవిషయమై. శ్లో. "ఏకేన యశ్శుభ స్యాత్షడ్భి ర్థానైస్స పాపదో భవతి, యస్తు చతుర్భిర్దృష్టః సర్వత్ర ఫలకల్పనాత్వేనం, అని బాదరాయణవచనం. ఈ యోగమునకే బుధాష్టకవర్గ ఫలనిర్ణయ క్రమము:— ఈ యోగమందు మేషమునకు 5 బిందువులు 3 రేఖలువచ్చునుగనుక బిందుసంఖ్యయందు రేఖాసంఖ్యను తోసివేయఁగా రెండు బిందువులుమిగులును కాఁబట్టి యిట్టియోగమందుఁ బుట్టినవానికి బుధుండు చారవశంబున మేషరాశి గతుఁడైనప్పుడు పాతికపాలు శుభఫలము నిచ్చుచుండును, వృషభమునకు 4 బిందువులును 4 రేఖలును సమముగావచ్చును గనుక బుధుఁడువృషభరాశిగతుఁడైనపుడు శుభాశుభ ఫలముల సమముగ నిచ్చును. మిథునమునకు 5 బిందువులును 3 రేఖలును వచ్చును గనుక బుధుండు మిథునరాశిగతుఁడైనపుడు పాతికపాలు శుభఫలము నిచ్చును కర్కాటకమునకు బిందు రేఖలు సమానములుగానాలుగేసి వచ్చునుగనుక బుధుఁడు కర్కాటరాశి గతుఁడైనపుడు

శుభాశుభఫలముల సమానముగ నిచ్చును, సింహామునకు 5 బిందువులు 3 రేఖలువచ్చును గనుక బుధుఁడుసింహారాశిగతుఁడైనపుడు పాతికపాలు శుభఫలంబునిచ్చుచుండును, కన్యకు 5 రేఖలును 3 బిందువులును వచ్చును గనుక బుధుఁడుకన్యారాశిగతుఁడైనపుడు పాతికపాలు అశుభఫలము నిచ్చుచుండును. తులకు 6 బిందువులు 2 రేఖలును వచ్చునుగనుకబుధుండు తులారాశిగతుండైనపుడు అరపాలు అశుభఫలము నిచ్చుచుండును. వృశ్చికమునకు 3 బిందువులును 5 రేఖలును వచ్చుచున్నవి కాఁబట్టి బుధుఁడు వృశ్చికరాశిగతుఁడైనపుడు పాతికపాలు అశుభఫలమునిచ్చుచుండును. ధనుస్సునకు బిందురేఖలు సమానములుగా నాలుగేసివచ్చును గనుక ధనూరాశిగతుఁడైనపుడు సమత్వమైన శుభాశుభఫలముల నిచ్చును, మకరమునకు 5 బిందువులు 3 రేఖలు వచ్చును గనుక బుధుఁడు మకరరాశిగతుఁడైనపుడు పాతికపాలశుభఫలము నిచ్చుచుండును. కుంభమునకు 5 బిందువులు 3 రేఖలువచ్చును గనుక కుంభరాశిగతుఁడైనపుడును పాతికపాలు శుభఫలమునిచ్చుచుండును, మీనమునకు 5 బిందువులును 3 రేఖలునువచ్చును కాఁబట్టి బుధుఁడు మీనరాశిగతుఁడైనపుడు పాతికపాలుశుభఫలము నిచ్చుచుండును. ఈ రీతిగానే తక్కిన గ్రహములకును అష్టకవర్గఫలము లూహింపఁదగినవి. శుక్రశనైశ్చరాష్టకవర్గములలో మీనరాశియందును, గుర్వాష్టకవర్గమున మకరరాశియందును 7 బిందువులును 1 రేఖయు వచ్చియుండుటవలన ఆ రాసులయం దాగ్రహముల సంచారకాలమున ముప్పాతికపాలు శుభఫలము జరుగునన నూహింపదగినది. ఇంగుగల దశాంతర్దశాధ్యాయమందు (ఏకగ్రహస్య సదృశే ఫలయోర్విరోధే నాశంవదే ద్యదధికం పరిపచ్యతేతత్) అని చెప్పి యిపుడు మఱల (ఇతినిగదితమిష్టం నేష్టముస్యద్విశేషా దధికఫలవిపాకం జన్మభాత్ప్రదద్యుః) అని చెప్పుటవలన పౌనరుక్త్యములేదని తెలియఁ జేయువిధంబెట్లనిన. దశాంతర్దశాధ్యాయమందు, ఒక గ్రహము ఒక కారణముచేత సువర్ణదాతయైయుండి మఱియొక కారణముచేత సువర్ణాపహారి యయ్యెనేని అపుడుఆగ్రహము సువర్ణదానముగాని సువర్ణాపహారణముగాని చేయఁజాలదనియు ఒకగ్రహము రెండుకారణములచేత సువర్ణదాతయైయుండి యొకకారణముచేత సువర్ణాపహారియయ్యెనేని అప్పుడు ఒకకారణమునకుం దగిన సువర్ణదానమును జేయుననియు ఇట్లుపరస్పర విరుద్ధంబులై సమానములైయున్న రెండు ఫలములకును క్షయము చెప్పంబడెను, ఈయష్టకవర్గమందు అసమానములై యున్నప్పటికిని శుభాశుభత్వముచేత పరస్పరవిరుద్ధములైన రెండుఫలములును క్షయించునని చెప్పబడియె, అదియెట్లనిన:—బాదరాయణ యవనేశ్వరాదులు ఆయాగ్రహమున్నస్థానము మొదలుకొని ఆయాస్థానములయందున్న గ్రహము ఈశుభాశుభ ఫలములనిచ్చునని ప్రత్యేకముగ అష్టకవర్గ ఫలములం జెప్పియున్నారు గనుక అట్టిశుభాశుభ ఫలములు సమానములుగాక యున్నప్పటికిని ఆ రెండుఫలములును క్షయించుననియు, ఇట్లు కొన్ని శుభఫలంబులును కొన్ని అశుభఫలంబులును ప్రాప్తించుచుండఁగా అశుభాశుభఫలములలో నేది అధికముగా మిగులునో ఆఫలము ప్రాప్తించుననియును దెలియందగినది, అదియెట్లనిన:— అష్టకవర్గమందు ఒకగ్రహము యవనేశ్వరాద్యుక్త ప్రకారముగా నొక కారణముచేత శుభ

ర్ణదాతయైయుండి మఱియొక కారణముచేత రజతాపహారియయ్యెనేని ఆఫలములకు దానాప హారణాత్మకమైన విరోధము గలిగియుండుటవలన ఆగ్రహము సువర్ణదానంబుగాని రజతాపహారణంబుగాని చేయఁజాలదు ఇట్లు ఏస్థానమందు శుభాధిక్యముగలిగియుండునో ఆస్థానమందు శుభుఁడును ఏస్థానమందు నశుభాధిక్యముగలిగియుండునో ఆస్థానమందు అశుభుఁడును ఏస్థానమందుశుభాశుభ సామ్యముగలిగియుండునో ఆస్థానమందుసముఁడును నగునని తెలియఁదగినది, ఈరీతిగా అష్టకవర్గమందు సమానములుగాక యున్న ఫలములకుంగూడ ఇష్టానిష్ట శోధనము చెప్పంబడియుండుటవలన పౌనరుక్త్యము లేదు, కనుకనే వరాహమిహిరాచార్యులు అష్టకవర్గ ఫలములను వేర్వేరుగాఁ జెప్పక స్థానసంజ్ఞామాత్రముచేత స్థానశుభాశుభత్వమునుం జెప్పెను. యవనేశ్వరాదులును, అష్టకవర్గ ఫలములను వేర్వేరుగా జెప్పియు, 'కడపట వరాహమిహిరాచార్యోక్త క్రమంబున శుభాశుభఫలములుసమాన సంఖ్యములైయుండెనేని ఆ రెండుఫలములు తుల్యించుననియు శుభాశుభఫలములలో అధికమైయున్న ఫలము ప్రాప్తించుననియునుం జెప్పియున్నారు, ఈయర్థమందు శ్లో. "ఫలాష్టవర్గే శుభపాపలబ్ధ్యే సమానకల్పావఫలౌ ప్రదిష్టౌ, జ్యాయాంస్తు యస్తస్యఫలం విదార్య్యం యాత్రాపిధానేన్న సముద్భవేచ." అని యవనేశ్వరుండును, శ్లో. "కష్టశ్రేష్ఠతుల్య సంఖ్యేఫలే చేత్స్యాతాం నాశస్తు ఫలయోస్తత్ర వాచ్యః, వాచ్యాపరాద్వ్యతిరిక్తంతు యాత్స్యాత్ స్థానేస్థానే కల్పనీయం ప్రదిష్టా, అని బాదరాయణులును చెప్పియున్నారు.

ఇట్లుచెప్పుటవలన అష్టకవర్గమందు అశుభఫలమిచ్చెడు గ్రహము అపచయనీచ శత్రుస్థానములయందుండెనేని మిక్కిలి అశుభఫలము నిచ్చుననియు ఉపచయస్వక్షేత్రమిత్రక్షేత్ర స్వోచ్చమూలత్రికోణముల యందుండెనేని అశుభఫలమును స్వల్పముగా నిచ్చుననియు, శుభఫలమిచ్చెడు గ్రహము అపచయనీచశత్రుస్థానములయం దుండెనేని శుభఫలమునుస్వల్పముగా నిచ్చుననియును తెలియఁదగినది, ఇక్కడ ఉచ్చనీచాదిస్థానగతి శుభాశుభఫలకల్పజన్మకాల గ్రహస్థితిని బట్టిచేయఁ దగినది. ఈవిషయమై శ్లో. "అపచయరాశౌనీచేశత్రుక్షేత్రేచ జన్మకాలేస్యాత్, యస్తుసదద్యాత్పాపంఫలం సతిశయితం యథాకాలం,"అని శ్రీదేవకీర్తియును, శ్లో. "యస్తుస్వనీచారి గృహోపగోవైర్యక్షితోరిదృష్టోల్పతనుర్వివర్ణః, సూతావభూజన్మపతౌబలస్థేసజన్మగోవంధ్య ఫలోవిభక్తః, ఈషత్సుహృత్స్వేచ భృగ్విష్టదృష్టో మిత్రక్షే జన్మోపచయేబలీయాన్, యోజాతకేభూత్సతు జన్మసంస్థోదద్యాచ్ఛుభంనత్వశుభోప్యనిష్టం" అని యవనేశ్వరుండును, "జన్మన్యుపచయభవనోపగాగ్రహాహ్యుపచయేషుపుష్టఫలాః, అపచయభవనోపేతాః స్థిత్వాస్థానేప్యపచయాయ ఫలకాలే"అని సత్యాచార్యుండునుం జెప్పియున్నారు, చంద్రవ్యతిరిక్త గ్రహములు బలయుక్తములైయుండెనేని ఆయాగ్రహములకు జెప్పియున్న శుభాశుభఫలముల నధికముగానిచ్చును, బలహీనములైయుండెనేని స్వల్పముగానిచ్చును, చంద్రుఁడుశుభుఁడైనను బలహీనుఁడైయుండెనేని అశుభఫలములనే యిచ్చునుగాని శుభఫలము నియ్యఁజాలఁడు, బలయుక్తుండై యుండెనేని శుభఫలమునిచ్చును, ఈయర్థమందు,

శ్లో. "పుష్టమపుష్టం స్వఫలందద్యాత్సుబలో బలేనహీనశ్చ, గ్రహాఇవసర్వశ్చంద్రః కష్టఫలో బలవిహీనస్తు" అని శ్రీదేవకీర్తిచేఁ జెప్పఁబడియున్నది.

మఱియు నీఅష్టకవర్గవిషయమున సారావళీ కారకుడు "రవికుధిరౌభవనం ప్రవిశంతౌగురు భృగు జౌగృహమధ్య సమేతౌ, శశిశశి సౌఖులు నిర్గమ కాలే శశితనయః ఫలదస్తుసదైవ అని చెప్పియుండుటచే రవికుజులు రాశిప్రవేశ, కాలమునంగును అనగా చారవశంబున ఏరాశియందుండి శుభఫలమునుగాని అశుభఫలమునుగాని అష్టకవర్గఫలమును యిత్తురో ఆరాశియొక్క మొదటి తృతీయాంశమందుండునపుడు ఫలమునిత్తురు. గురుశుక్రులు ఆరాశియొక్క మధ్య తృతీయాంశమందుండునపుడు ఫలమునిత్తురు చంద్రశనులు ఆరాశియొక్క అంత్య తృతీయాంశ మందుండునపుడు ఫలమునిత్తురు. బుధుడు ఆరాశియందెన్ని దినములుండునో అన్ని దినములును ఫలము నిచ్చువాడనుటను యెరుగదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
అష్టకవర్గాధ్యాయ నామక
నవమాధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### కర్మజీవాధ్యాయము. దశమాధ్యాయము. —10.



### ధనార్జనయోగములు.

శ్లో. అర్థాప్తిః పితృ జననీ సపత్న మిత్ర భ్రాతృస్త్రీ
భృతక జనాద్దివాకరాద్యైః
హోరేంద్వోర్దశమగతై ర్వికల్పనీయా
భేంద్వర్కాస్పదపతి గాంశనాథవృత్త్యా. 1

టీ. హోరేంద్వోః = జన్మలగ్న చంద్రులకు, దశమగతైః = దశమస్థానమందున్న = దివాకరాద్యైః = సూర్యాదిగ్రహములచేత, క్రమముగా, పితృజననీ సపత్నమిత్రభ్రాతృ

స్త్రీభృతక జనాత్ = తండ్రి మొదలగువారివలన, అర్థాప్తిః = ధనప్రాప్తి, వికల్పనీయా = కల్పింపఁదగినది. అదియెట్లనిన జన్మలగ్నమునకైనను జన్మకాల చంద్రునికైనను దశమమందు సూర్యుఁడుండెనేని, పితృ = తండ్రివలనను, చంద్రుఁడుండెనేని, జనని = తల్లివలనను, కుజుఁడుండెనేని, సపత్న = శత్రువులవలనను, బుధుఁడుండెనేని, మిత్ర = స్నేహితునివలనను, బృహస్పతియుండెనేని, భ్రాతృ = తోడఁబుట్టినవారివాలనను, శుక్రుఁడుండెనేని, స్త్రీ = స్త్రీలవలనను, శనియుండెనేని, భృత్క = భృత్యునివలనను, ధనప్రాప్తియగును, భేంద్వర్కాస్పదపతి గాంశనాథవృత్త్యా, భ = లగ్నము, ఇందు = చంద్రుఁడు, అర్క = సూర్యుఁడు, వీరలయొక్క, ఆస్పదపతిగ = దశమస్థానాధిపతియున్న, అంశ = నవాంశయొక్క, నాథ = అధిపతియొక్క, వృత్త్యా = వృత్తిచేత, అర్థాప్తిః = ధనప్రాప్తియని తెలియఁదగినది.

తా. జాతకులరాశి నవాంశచక్రముల యందలి గ్రహస్థిత స్థానములనుబట్టి వారిధనాగమప్రకారమ మూహింపుటకై గలవిధములన్నిటిని బాగుగయోచించి తద్విధిని దెలుపనగును. జన్మలగ్నమునకైనను జన్మకాలమున చంద్రుడున్న రాశికైనను దశమస్థానమునందు రవియుండునెడల తండ్రివలన ధనములభించును. చంద్రుడుండునెడల తల్లివలనను అంగారకుడుండునెడల జ్ఞాతులవల్లనైనను లేక శత్రువులవలననైనను ధనప్రాప్తి కలుగును. బుధుడుండునెడల స్నేహితులమూలమున ధనములభించును బృహస్పతియుండునెడల సహోదరులచే ధనములభించును శుక్రుడుండునెడల భార్యమూలకముగనుమఱియు యితర స్త్రీలమూలకముగనుధనము ప్రాప్తించును శనైశ్చరుడుండు నెడల భృత్యాదులవలన ధనము గలుగునుగాన దశమస్థానస్థిత గ్రహమునను సరించి ధనలాభమెవ్వరివలన ననుట నూహింపవగును. ఇదియుగాక లగ్నరాశికి దశమస్థానమున నొకగ్రహముకు చంద్రుడున్న రాశికి దశమస్థానమున నొకగ్రహమును ఉండునెడల ఆరెండుగ్రహములును తమతమ దశాంతర్దశా కాలముల యందలి పైనచెప్పబడిన వారి మూలకముగ ధనలాభమని నూహింపదగినది. లగ్నమునకైనను చంద్రునికైనను దశమస్థానమునందనేకగ్రహములుండుచో ఆయాగ్రహాంతర్దశా విదశాసూక్ష్మ దశా కాలములయందు బూర్వోక్తప్రకారము ధనాగమమగునని దెలియదగినది. ఈవిషయమై శ్లో. "ఉదయాదిందుతో వాపి యేగ్రహాదశమస్థితాః, తేసర్వేర్థప్రదాజ్ఞేయాః స్వదశా సుయథోదితాః," అనిగార్గివచించియున్నారు. ఇదియుగాక లగ్నమునకు చంద్రునకు, సూర్యునకునుదశమ స్థానాధిపతులు ఏనవాంశలందుందురో యానవాంశాధిపతు లెవ్వరో వారికి ఈకర్మజీవధ్యాయమున రెండవశ్లోకమందు "అర్కాంశేతృణకన కార్ణభేషజాద్యైః" అనుశ్లోకమునం దేయేవృత్తులు చెప్పబడియున్నవో ఆయావృత్తులచే జాతకులకు ధనాగమమని నూహింపదగినది. ఈ విషయమునకు శ్లో. "లగ్నార్క మృతభాను భ్యోదశమాధి పతిర్గ్రహాః యస్మిన్నవాంశే తత్కాలంవర్తతే తస్యయఃపతిః తద్వృత్త్యా ప్రవదేద్విత్తం జాతస్యబహవోయది భవంతి విత్తదాస్తేపిస్వదశా సువినిశ్చితాః," అని గార్గి వచించియున్నారు.

శ్లో. అర్కాంశేతృణ కనకోర్ణ భేషజాద్యై
శ్చంద్రాంశే కృషిజలజాంగనాశ్రయాచ్చ,
ధాత్వగ్ని ప్రహరణ సాహసైః కుజాంశే
సౌమ్యాంశే లిపిగణితాది కావ్యశిల్పైః. 2

టీ. చంద్రసూర్యులకు దశమస్థానాధిపతియున్న నవాంశము, అర్కాంశే = సూర్యాంశయయ్యేనేని, తృణకనకోర్ణ భేషజాద్యైః, తృణ = సుగంధ ద్రవ్యములు, కనక = బంగారు, ఊర్ణ = మేషాదిరోమములు, తన్నిర్మితచిత్రకంబళాదులు, భేషజ = ఔషధము. వీనియొక్క క్రయవిక్రయాదులచేతను, ఆద్యైః = వైద్యక్రియారోగ పరిచర్యాదులచేతను (ధనప్రాప్తి గలుగును.) తృణములనఁగా ప్రసిద్ధతృణములనికొందఱు. చంద్రాంశే = చంద్రాంశయయ్యేనేని, కృషిజలజాంగ నాశ్రయాచ్చ, కృషి = వ్యవసాయము వలనను, జలజ = శంఖముక్తా ప్రవాళాది క్రయవిక్రయముల వలనను, అంగనాశ్రయాత్ = స్త్రీలనాశ్రయించుట వలనను, ధనాగమము గలుగును, కుజాంశే = అంగారకాంశయయ్యేనేని. ధాత్వగ్ని ప్రహరణసాహసైః = సువర్ణరజత తామ్ర కాంస్యాదులును. మనశ్శిలా హరితాళాదులును, ధాతువులు, వీనియొక్క క్రయవిక్రయాదులచేతను, అగ్ని = అగ్నిసంబంధమగు కార్యములచేతను, ప్రహరణ = ఖడ్గశస్త్రాద్యాయుధముల క్రియవిక్రయాదుల చేతనైనను, తన్నిర్మాణముచేతనైనను, తద్ధారణము చేతనైనను, సాహస = వెనుకముందుచూడక పనులుచేయుటచేతను మల్లక్రియాదులచేతను ధనప్రాప్తికలుగును, సౌమ్యాంశే = బుధాంశయయ్యేనేని, లిపిగణితాది కావ్యశిల్పైః = లిపిశబ్దమువలన నగరాదిలిపివిశేషములు గ్రహింపఁబడునని కొందఱు, అక్షరవిన్యాసమని కొందఱు, గణిత = గణితశాస్త్ర జ్యోతిశ్శాస్త్రములు, ఆదిశబ్దమువలన వ్యాఖ్యానయంత్ర ప్రయోగాదులనికొందఱు, ద్యూతన్యత్యాదులని కొందఱు, కావ్య = కవిత్వము చెప్పుట, శిల్ప = చిత్తరువులు వ్రాయుట, పుస్తకములు వ్రాయుట, పుష్పమాలికలుకట్టుటఇత్యాదులచేతధనాగమముగలుగును.

తా. లగ్నచంద్రసూర్యులకు దశమాధిపతియున్న నవాంశ రవ్యంశయగునెడల సుగంధాదిద్రవ్యములు, బంగారము, మేషాదిరోమములచే చేయఁబడు కంబళాదులు, ఔషధముల క్రయవిక్రయాదులచేతను, వైద్యక్రియారోగ పరిచర్యాదులచేతను ధనలాభము గల్గునని సూచింపదగినది. లగ్నచంద్ర సూర్యులకు దశమస్థానాధిపతియున్న నవాంశచంద్రాంశయగునెడల, వ్యవసాయమువలనను, ప్రవాళశంఖముక్తాదుల క్రయవిక్రయములచేతను స్త్రీలమూలకముగను, ధనముగలుగునని జెప్పదగినది. ఆదశమస్థానాధిపతియున్న నవాంశము అంగారకాంశయగునెడల, బంగారు, వెండి, రాగి, కాంస్యమును చతుర్విధలోహములు మనశ్శిల హరితాళము మొదలుగాగలధాతువులు వీనిసంబంధములగు వస్తువులయొక్క క్రయవిక్రయాదులచే ధనముప్రాప్తించునని చెప్పదగును. ఇదియుగాక, అగ్నిచేజేయు కార్యములచేత అనగా పాచకుడు కమ్మరి మొదలగువాడి వృత్తులచేతను ఆయుధములు, కత్తులు, చక్రములు మొద.

లకు వాణిజ్యముచేయుటచేతను, వాటిక్రయవిక్రయాదులచేతను ఆయుధాదులు ధరించునట్టి వృత్తులు [illegible], యుద్ధాంగంలయందు వెనుకముందు చూడక తనధైర్య సాహసములను జూపుటచేతను ధనప్రాప్తిని వచింపదగినది ఆదశమాధి పతియున్న నవాంశ బుధాంశయగు నెడల, గణితజ్యోతిశ్శాస్త్ర వ్యాఖ్యాన యంత్రప్రయోగాదుల చేతను, కవిత్వముచెప్పుటచేతను, చిత్తరువులువ్రాయుట, పుస్తకములు వ్రాయుట, పుష్పమాలికలు గట్టుట, ఇత్యాది క్రియలచే ధనాగమమును వచింపదగినది.

శ్లో. జీవాంశే ద్విజవిబుధాకరాదిధర్మైః
కావ్యాంశే మణిరజతాదిగోమహిష్యైః
సౌరాంశే శ్రమవధ భారనీచశిల్పైః
కర్మేశాధ్యుషిత నవాంశ కర్మసిద్ధిః. 3

టీ. లగ్నచంద్రసూర్యులకు దశమస్థానాధిపతియున్న నవాంశ, జీవాంశే=బృహస్పతి నవాంశయయ్యెనేని, ద్విజవిబుధాకరాదిధర్మైః–ద్విజ=బ్రాహ్మణులు, విబుధ=దేవతలైనను విద్వాంసులైనను,ఆకర=సువర్ణ గజ మాణిక్యాదుల యుత్పత్తిస్థానములు,ఆది=ఆదిశబ్దముచేత క్రియావాదజప ప్రభృతులు, ధర్మైః=యజ్ఞదానోపవాస తీర్థయాత్రాదులుచేత ధనాగమము గలుగును, కావ్యాంశే=శుక్రనవాంశయయ్యెనేని, మణిరజతాది గోమహిష్యైః–మణి=వజ్ర వైడూర్య మరకతపద్మరాగేంద్రనీల మౌక్తికాదులు, రజత=వెండి, ఆది=ఆదిశబ్దముచేత గజతురంగాదులని కొందఱు, సర్వలోహములనికొందఱు. గో=ఆవులు. మహిష్య=ఎనుములు, వీనియొక్క క్రయవిక్రయాదులచేత ధనప్రాప్తియగును. సౌరాంశే=శనైశ్చరాంశయయ్యెనేని, శ్రమవధభారనీచశిల్పైః–శ్రమ=త్రోవనడుచుట మొదలైన వానివలనంగలిగెడు ఆయాసము, వధ=మృగపక్ష్యాది ప్రాణులవధించుట (లేక) స్వశరీరతాడనాదులు, భార=బరువుమోయుట, నీచశిల్ప=స్వకులోచితములుగాని నీచకార్యములుచేయుట, వీనిచేత ధనప్రాప్తియగును, కర్మేశాధ్యుషిత నవాంశకర్మసిద్ధిః=లగ్నచంద్రసూర్యులకు, దశమస్థానాధిపతి, ఏరవశంబున నేనవాంశయందుండునో ఆనవాంశాధిపతివశంబున, కర్మ=చెప్పబడినకర్మలయొక్క. సిద్ధిః=సిద్ధి కలుగును.

తా. లగ్నచంద్రసూర్యులకు దశమస్థానాధిపతియున్న నవాంశము, బృహస్పతి నవాంశయయ్యెనేని బ్రాహ్మణులవలనను, దేవతలవలనను, విద్వాంసులవలనను, సువర్ణ, గజ, మాణిక్యాదుల ఉత్పత్తిస్థానముల కధిపతియగుటచేతను, యజ్ఞదానోపవాస తీర్థాదులచేతను, క్రియావాద జపాదులవలనను ధనప్రాప్తియగునని తెలియదగినది. ఆ దశమస్థానాధిపతియున్న నవాంశము శుక్రనవాంశయగునెడల వజ్ర, వైడూర్య, మరకత, పద్మరాగ, ఇంద్రనీల మౌక్తికాదులు, వెండి, సర్వలోహములు, ఆవులు, ఎనుములు, గజములు, తురగములు, వీనియొక్క క్రయవిక్రయాదులచేత ధనలాభముగల్గునని తెలియదగినది. ఆదశమస్థానాధిపతియున్న నవాంశము శనైశ్చరాంశయగునెడల మార్గాయాసమునను, మృగపక్ష్యాది ప్రాణుల వధించుట

చేతను, భారము మోయుటవలనను, స్వకులోచితములుగాని నీచకృత్యములు చేయుటవలనను, ధనప్రాప్తమని యూహింపదగినది. మఱియు, లగ్నచంద్రసూర్యులకు దశమస్థానాధిపతి చారవశమున నున్న నవాంశాధిపతికి "అర్క్యాంశే" అను శ్లోకమున నెట్టికర్మలు చెప్పబడియున్నవో ఆయాకర్మలవలన ధనప్రాప్తియని యెరుగదగినది. ఈవిషయమై మఱికొందరు ఆ దశమస్థానాధిపతియుండు నవాంశాధిపతి ఉచ్చరాశియందుండెనేని తదుక్తవృత్తులకు ప్రయత్నము చేయనక్కఱలేకయే కార్యసిద్ధియగుననియు నీచరాశియందుండునెడల బహుప్రయత్నమున స్వకీయపోషణమాత్రఫలసిద్ధియగుననియు, పరమోచ్చయందుండునెడల సులభముగ విశేషఫలప్రాప్తి యగుననియు, పరమనీచయందుండునెడల బహుకష్టంబున మిగుల స్వల్పఫలప్రాప్తియనియు చెప్పుదురు. ఇందులకు "లగ్నకర్మాధిపోయస్మిన్ నవాంశే వర్తతేగ్రహః, చారక్రమేణతత్తుల్యాం కర్మణాంసిద్ధిమాదిశేత్." అను గార్గివచనము ఉదాహరణముగనున్నదందురు మఱికొందరు ఆ దశమస్థానాధపతియున్న నవాంశరాశి చరమైయుండునెడల దూరదేశగమనమువలనను, స్థిరరాశియగునెడల స్వదేశమందుండుటవలనను, ద్విస్వభావరాశి యగునెడల స్వదేశ, పరదేశ సంచారములవలన ధనాగమము కలుగునని చెప్పుదురు ఇందులకు "తదధీశే చరభాంశే ప్రవాసతో౽ర్థాగమం సుఖంలభతే, స్థిరభాంశకే స్వదేశా దుభయాంశకే సర్వతో ధనప్రాప్తిః." అని గ్రంథాంతరమున చెప్పబడినదందురు. యీ శ్లోకము కడపటిపాదమునందుగూడ ఈ యర్థమే యేర్పడుచున్నదని జ్యోతిషులు అభిప్రాయపడుచున్నారు.

## మిత్ర శత్రు స్వజనాదులవలన ధనప్రాప్తి వివరము.

శ్లో. మిత్రారిస్వగృహగతైర్గ్రహైస్తతో౽ర్థాః
స్తుంగస్థే బలినిచ భాస్కరే స్వవీర్యాత్
ఆయస్థైరుదయ ధనాశ్రితైశ్చ సౌమ్యై
స్సంచిత్యం బలసహితై రనేకధా స్వమ్. 4

టీ. లగ్నచంద్రులకు దశమస్థానమందున్న గ్రహములుగాని, దశమస్థానమందు గ్రహములు లేకుండెనేని లగ్నచంద్రసూర్యులకు దశమాధిపతియున్న నవాంశాధిపతులుగాని, జన్మకాలమందు, మిత్రారిస్వగృహగతైః=మిత్రశత్రుస్వక్షేత్రముల యందుండిరేని, తతః = ఆమిత్రాదులవలన, జన్మకాలమందు పూర్వోక్త విధానముచే ధనగాతమైన, భాస్కరే = సూర్యుడు, బలిని=బలవంతుడై, తుంగస్థే=ఉచ్చమైన మేషమందుండెనేని, స్వవీర్యాత్ = తనవ్యాపకత్వబలమువలన, ధనప్రాప్తియగును, జన్మకాలమందు. ఆయస్థైః = ఏకాదశమందున్నట్టియు, ఉదయధనాశ్రితైః=లగ్నద్వితీయముల యందున్నట్టియు, బలసహితైః=బలసహితులైనట్టి, సౌమ్యైః=శుభగ్రహములచేత, అనేకధా=అనేకవిధములుగా, స్వం = ధనాగమము సంచింత్యం = విచారింపదగినది.

తా. లగ్నచంద్రసూర్యులకు దశమస్థానమునందుండు గ్రహములైనను, గ్రహములు లేనియెడల దశమాధిపతియున్న నవాంశమున కధిపతియైనను, జననకాలమున మిత్రక్షేత్రమునందుండు నెడల మిత్రులవలనను, శత్రుక్షేత్రమునందుండు నెడల శత్రువులవలనను, స్వక్షేత్రమందుండు నెడల స్వజనులవలనను. ధనప్రాప్తి యగునని యూహింపదగినది ధనదాతయగు సూర్యుడు బలవంతుడై యుచ్చయందుండు నెడల జాతకుడు తనవ్యాపకశక్తి బలమువలన ధనలాభమును బొందును. జననకాలమునందు లగ్నద్వితీయైకాదశములయందు, స్వోచ్చాదిబలసహితములైన శుభగ్రహములుండెనేని అనేకవిధములుగ ధనలాభమును, జాతకు డేప్రకారము ధనమార్జింపదలచునో ఆప్రకారము ధనప్రాప్తియగునని నూహింపదగినది. ఈ విషయమై "ధనదా జన్మసమయే మిత్రాం స్వగృహోపగాః, యస్యతస్య ధనందద్యా న్మిత్రారి స్వగృహోద్భవం, ధనదో భాస్కరోయస్య తుంగేబల సమన్వితః, భవేజ్జన్మని తస్యస్యా ద్విత్తమాత్మో ద్యమార్జితం, లాభార్థ లగ్నగై స్సౌమ్యై ర్యేన యేనైవకర్మణా, ధనార్జనం ప్రార్థయతే తేన యత్నాత్సమశ్నుతే" అని గార్గి వచించియున్నారు.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
కర్మజీవాధ్యాయ నామక
దశమాధ్యాయము.

—•—

శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

రాజయోగాధ్యాయము. ఏకాదశాధ్యాయము.—11.



రాజయోగముల విషయమున యవన
జీవశర్మలకు గల మతభేదము.

శ్లో. ప్రాహుర్యవ నాస్స్వతుంగగైః క్రూరైః క్రూర మతి మర్మహీ పతిః
క్రూరైస్తు న జీవశర్మణః పక్షే క్షిత్యధిపః ప్రజాయతే. 1

టీ. యవనాః=యవనేశ్వరాదులు, స్వతుంగగైః = తమయుచ్ఛ స్థానములయందున్న. క్రూరైః=రవికుజశనులచేత, క్రూరమతిః=పాపబుద్ధిగల, మహీపతిః=పుడమిఱేడు, ప్రజాయతే=పుట్టుచున్నాఁడని, ఆహుః=చెప్పుదురు, జీవశర్మణః=జీవశర్మయొక్క, పక్షే=మతమందు, ఉచ్చగతైః=ఉచ్ఛస్థానములయందున్న, క్రూరైః=పాపగ్రహములచేత, క్షిత్యధిపః = రాజ్యాధిపతి, నప్రజాయతే=పుట్టఁడు.

తా. మూఁడుగ్రహములుగాని,అందుకు అధికముగాగాని,గ్రహములు ఉచ్ఛస్థానగతులై యుండగా క్షత్రియకులంబునబుట్టినవాఁడు రాజ్యాధిపతియగునని సకలజ్యోతిష గ్రంథంబుల యందును ప్రసిద్ధమైయున్నది. ఈవిషయమై యవనేశ్వరాదులు "పాపగ్రహంబులగు రవ్యంగారక శనైశ్చరులు ఉచ్ఛస్థానములయందుండగా బుట్టువాడు క్రూరబుద్ధిగల రాజు అగునని వచించియున్నారు." ఇట్లుచెప్పుటచే శుభగ్రహములు ఉచ్ఛస్థానగతులైయుండగా బుట్టువాడు సౌమ్యస్వభావముగలరాజు అగుననియు, శుభగ్రహములును పాపగ్రహములును, తమతమ యుచ్ఛస్థానములయందుండగా సౌమ్య పాప మిశ్రస్వభావముగలరాజగునని యూహింపవలసియున్నది. ఇందునకు "పాపైః పాపమతిస్స్వోచ్ఛగతై రథధర్మవాక్ సౌమ్యైః, వ్యమిశ్రైర్మిశ్రమతిః పృథ్వీశో జాయతేమనుజః" అను యవనేశ్వరుని వచనము ఉదాహరణముగానున్నది. జీవశర్మ "మూఁడుపాపగ్రహంబు లుచ్ఛస్థానంబులందుండగా బుట్టువాడు రాజ్యాధిపతిగానేరడు కాని, రాజసమానుండును, క్రోధశీలుండును, కలహప్రియుండును," అగునని వచించియున్నారు. ఇందులకు, "పాపైరుచ్చ గతైర్జాతా నభవంతి నృపానరాః, కింతువిత్తాన్వితా స్తేన్యుః క్రోధనః కలహప్రియాః," అని వచించియున్నారు. ఈవిషయమై లఘుజాతకమున "త్రిప్రభృతి భిరుచ్ఛస్థైః నృపవంశ భవాభవంతిరాజానః, పంచాదిభి రన్య కులోద్భవాశ్చ తద్వత్త్రికోణగతైః" అని సామాన్యముగ జెప్పబడియుండుటవలన వరాహ మిహిరాచార్యులవారికి యవనాభిప్రాయమే సమ్మతమని తోచుచున్నది.

## —ద్వాత్రింశతి రాజయోగములు.—

శ్లో. వక్రార్క జార్కగురుభి స్సకలైస్త్రిభిశ్చ
స్వోచ్ఛేషు షోడశ నృపాః కథితైకలగ్నే
ద్వ్యేకాశ్రితేషుచ తదైకతమే విలగ్నే
స్వక్షేత్రగే శశిని షోడశ భూమిపా స్స్యుః. 2

టీ. స్వోచ్ఛేషు = తమతమ యుచ్ఛస్థానములయందును, కథితైకలగ్నే = చెప్పఁబడినవానిలోనొక లగ్నమందు నున్నట్టి, వక్రార్కజార్క గురుభిస్సకలైః = కుజుఁడు, శని, రవి, గురుఁడు ఈ నలుగురిచేతను నాలుగు రాజయోగములౌను, ఈ నాలుగుగ్రహములలో, త్రిభిః= ఉచ్ఛస్థానములయందు 3 ను అందులగ్నమందొకటి ఈ ప్రకారముగానున్న మూఁడు గ్రహములచేత 12 రాజయోగంబులగును.ఇట్లుశ్లోకార్థమందు చెప్పంబడినవన్నియు, షోడశనృపాః=

16 రాజయోగములు, శశిని=చంద్రుఁడు, స్వక్షేత్రగే =స్వక్షేత్రమైన కర్కాటకమందుండఁగా, ద్వ్యేకాశ్రితేషు=ఇక్కడ ద్వ్యాశ్రితేషు, ఏకాశ్రితేషు అని ఆశ్రితశబ్దము ప్రత్యేకముగా సంబంధించును. పూర్వము చెప్పఁబడిన కుజ శని రవి గురువులలో, ద్వ్యాశ్రితేషు = రెండు గ్రహము లుచ్చగతములైయుండి, తదా=అపుడు, ఏకతమే=అందొకఁడు, విలగ్నే= లగ్నమం దుండెనేని 12 రాజయోగములౌను, ఏకాశ్రితేషు = చంద్రుండు స్వక్షేత్రమందుండఁగా ఒకఁడే యుచ్చస్థానగతుఁడై లగ్నమందుండెనేని 4 రాజయోగములౌను.

తా. తమతమ యుచ్చస్థానము లందు అంగారక శని, రవి, గురువులు నలువురుండి అందొక్కటి జననలగ్నముగనుండినచో నాల్గు రాజయోగములనియు, పైజెప్పిన రవ్యంగారక శనైశ్చర బృహస్పతులయందు ముగ్గురు తమతమ ఉచ్చస్థానములందుండి అందొక్కటి జనన లగ్నమగునెడల పండ్రెండు రాజయోగము లగునని యు, దెలియదగినది.

ఉదాహరణము:—

## 4 గ్రహములచేగల్గు 4 రాజయోగములు.

(1) మేషము లగ్నమై, అందు రవి, కర్కాటకమున గురువు, తులయందు శనైశ్చరుఁడు, మకరమున అంగారకుడుండుట.

(2) కర్కాటకము లగ్నమై అందు గురుడు, తులయందు శనైశ్చరుడు, మకరమునం దంగారకుడు, మేషమునందు సూర్యుడుండుట.

(3) తులలగ్నమై అందు శనైశ్చరుడు, మకరమునం దంగారకుడు, మేషరాశియందు సూర్యుడు, కర్కాటకమున గురువుండుట.

(4) మకరము లగ్నమై, అందు అంగారకుడు, మేషమునందు సూర్యుడు, కటకమున గురుడు, తులయందు శనైశ్చరుడుండుట.

ఇట్లుండు నాల్గుయోగములును రాజయోగములు.

## మూడు గ్రహములుచేగలుగు 12 రాజయోగములు.

(1) మేషము లగ్నమై అందు రవి, కర్కాటకమునగురువు, తులయందు శనియుండుట.

(2) కర్కాటకము లగ్నమై అందు గురుడు, తులయందు శని, మేషమందు రవి.

(3) తుల లగ్నమై, అందు శని, మేషమందు రవి, కర్కాటకమున గురువు.

(4) కర్కాటకము లగ్నమై అందు గురుడు. తులయందు శని, మకరమందు కుజుడు.

(5) తుల లగ్నమై అందు శని, కర్కాటకమున గురుడు, మకరమందుకుజుడు.

(6) మకరము లగ్నమై అందు కుజుడు, కర్కాటకమున గురుడు, తులయందుశని.

(7) మేషము లగ్నమై అందు రవి, తులయందు శని, మకరమందుకుజుడు.

(8) తుల లగ్నమై అందు శని; మకరమం దంగారకుడు, మేషమునందు రవి.

(9) మకరము లగ్నమై అందు కుజుడు, మేషమందు రవి, తులయందు శని.

(10) మేషము లగ్నమై అందు రవి, కర్కాటకమందు గురుడు, మకరమందు కుజుడు.

(11) కర్కాటకములగ్నమై, అందుగురుడు, మేషమందు రవి, మకరమందుకుజుడు

(12) మకరములగ్నమై అందుఅంగారకుడు, మేషమందురవి, కర్కాటకమునగురుడు.

ఇట్లుండు రాజయోగములు 16 ను శ్లోకపూర్వార్ధమున జెప్పబడినవి.

మరియు.— చంద్రుడు స్వక్షేత్రమగు కర్కాటకమున నుండగా పూర్వము చెప్పబడిన కుజ, శని, గురు, సూర్యులలో రెండు గ్రహములు ఉచ్ఛగతములైయుండి అందొకడు లగ్నమునందుండెనేని 12 రాజయోగములగుచున్నవి. ఈశ్లోకమున "ద్వ్యేకాశ్రితేషు" అనియుండుటచే "ద్వ్యాశ్రితేషు" "ఏకాశ్రితేషు" అని ఆశ్రితశబ్దము ప్రత్యేకముగ సంబంధించుచున్నది.)

## (రెండుగ్రహములచే గలుగు 12 రాజయోగములు.)

(1) మేషము లగ్నమై అందు సూర్యుడు, కర్కాటకమునందు చంద్రగురు లుండుట.

(2) కర్కాటకము లగ్నమై అందు చంద్రగురులు, మేషమందు రవియుండుట.

(3) మేషము లగ్నమై అందు సూర్యుడు, కర్కాటకమున చంద్రుడు, తులయందుశని.

(4) తుల లగ్నమై అందు శని, మేషమందు రవి, కర్కాటకమున చంద్రుడు.

(5) మేషములగ్నమైఅందురవి, కర్కాటకమున చంద్రుడు, మకరమునందంగారకుడు.

(6) మకరము లగ్నమై అందు అంగారకుడు, మేషమునందు సూర్యుడు, కర్కాటకమున చంద్రుడు.

(7) కర్కాటకము లగ్నమై, అందు చంద్రగురులు, తులయందు శనియుండుట.

(8) తుల లగ్నమై అందు శనైశ్చరుడు, కర్కాటకమున చంద్ర గురు లుండుట.

(9) కర్కాటకము లగ్నమై అందు చంద్ర గురువులు, మకరమందు కుజుండుట.

(10) మకరము లగ్నమై అందు అంగారకుడు, కర్కాటకమున చంద్ర గురులు.

(11) తుల లగ్నమై అందు శని, మకరమందు కుజుడు. కర్కాటకమునచంద్రుడు.

(12) మకరము లగ్నమై అందు అంగారకుడు, తులయందు శనైశ్చరుడు, కర్కాటకమున చంద్రుడుండుటచే, గలుగునట్టి 12 రాజయోగములు.

మరియు "ఏకాశ్రితేషు," అని యూహింపగా చంద్రుడు స్వక్షేత్రమున నుండగా పైజెప్పిన శన్యంగారక గురు సూర్యులలోనొకడు యుచ్చస్థాన స్థితుడై లగ్నమునందుండెనేని నాలుగు రాజయోగములగును.

## ఒకగ్రహముచే గలుగు 4 రాజయోగములు.

(1) మేషము లగ్నమై అందు సూర్యుడు, కర్కాటకమున చంద్రుడుండుట.

(2) కర్కాటకము లగ్నమై అందు చంద్రబృహస్పతు లుండుట.

(3) తుల లగ్నమై, అందు శనైశ్చరుడు, కర్కాటకమున చంద్రుడుండుట.

(4) మకరము లగ్నమై అందు అంగారకుడు, కర్కాటకమున చంద్రుడుండుట. ఇట్లుండగా నేర్పడునవి 4 రాజయోగములు.

ఈ శ్లోకముయొక్క పూర్వార్థమందు 16 రాజయోగములను ఉత్తరార్ధమునందు 16 రాజయోగములును కలియగూడగా 32 రాజయోగము లగుచున్నవి.

### నలువదినాలుగు రాజయోగములు.

శ్లో. వర్గోత్తమ గతే లగ్నే చంద్రేవా చంద్రవర్జితైః,
చతురాద్యైర్గ్రహైర్దృష్టే నృపా ద్వావింశతిః స్మృతాః. 3

టీ. వర్గోత్తమగతే = వర్గోత్తమ నవాంశను పొందియున్న. లగ్నే = జన్మలగ్నముగాని, చంద్రేవా=వర్గోత్తమాంశను పొందియున్న చంద్రుడుగాని, చంద్రవర్జితైః=చంద్రవ్యతిరిక్తములైన, చతురాద్యైర్గ్రహైః=నాలుగు గ్రహములచేతనైనను ఆదిశబ్దమువలన అయిదారుగ్రహముల చేతనైనను, దృష్టేసతి - చూడబడుచుండగా, ద్వావింశతిన్నృపాః = ఇరువదిరెండు రాజయోగములు, స్మృతాః = చెప్పంబడినవి.

తా. వర్గోత్తమ నవాంశను పొందియున్నట్టి జన్మలగ్నముగాని, వర్గోత్తమాంశను బొందిన చంద్రుడుగాని, చంద్రవ్యతిరిక్తములగు నాలుగుగ్రహములచే జూడబడుచుండిన యెడల 15 రాజయోగములును, అయిదు గ్రహములచే చూడబడుచుండిన యెడల ఆరు రాజయోగములును, ఆఱుగ్రహములచే చూడబడుచుండిన యెడల ఒక రాజయోగమును, అంతయిరువదిరెండు యోగములు, వివరము:—

### నాలుగు గ్రహములచే గలుగు 15 రాజయోగములు.

| | | | |
|---|---|---|---|
| (1) | లగ్నముగాని | చంద్రుడుగాని | రవి, కుజ, గురు, బుధులచే, జూడబడుచుండుట. |
| (2) | ,, | ,, | రవి, కుజ, బుధ, శుక్రులచే జూడబడుచుండుట, |
| (3) | ,, | ,, | రవి, కుజ, బుధ, శనులచే జూడబడుచుండుట, |
| (4) | ,, | ,, | రవి, కుజ, గురు, శుక్రులచే జూడబడుచుండుట, |
| (5) | ,, | ,, | రవి, కుజ, గురు, శనులచే జూడబడుచుండుట, |
| (6) | ,, | ,, | రవి, కుజ, శుక్రశనులచే జూడబడుచుండుట. |
| (7) | ,, | ,, | రవి, బుధ, గురు, శుక్రులచే జూడబడుచుండుట, |
| (8) | ,, | ,, | రవి, బుధ, గురు, శనులచే జూడబడుచుండుట, |
| (9) | ,, | ,, | రవి, బుధ, శుక్ర, శనులచే జూడబడుచుండుట, |
| (10) | ,, | ,, | రవి, గురు, శుక్ర, శనులచే జూడబడు చుండుట, |
| (11) | ,, | ,, | కుజ, బుధ, గురు, శుక్రులచే జూడుబడుచుండుట, |
| (12) | ,, | ,, | కుజ, బుధ, గురు, శనులచే జూడబడుచుండుట, |
| (13) | ,, | ,, | కుజ, బుధ, శుక్ర, శనులచే జూడబడుచుండుట, |

(14) లగ్నముగాని, చంద్రుడుగాని కుజ, గురు, శుక్ర, శనులచే జూడబడుచుండుట,
(15) „ „ బుధ, గురు, శుక్ర, శనులచే జూడబడుచుండుట,

అయిదు గ్రహములచే గలుగు నాలు యోగములు.

(1) లగ్నముగాని, చంద్రుడుగాని రవి,కుజ,బుధ,గురు, శుక్రులచేజూడబడుచుండుట.
(2) „ „ రవి, కుజ, బుధ, గురు, శనులచే జూడబడుచుండుట.
(3) „ „ రవి, కుజ, బుధ, శుక్ర, శనులచే జూడబడుచుండుట.
(4) „ „ రవి, కుజ, గురు, శుక్ర, శనులచే జూడబడుచుండుట.
(5) „ „ రవి, బుధ, గురు, శుక్ర, శనులచే జూడబడుచుండుట.
(6) „ „ కుజ, బుధ, గురు, శుక్ర, శనులచే జూడబడుచుండుట.

ఆఱు గ్రహములచే గల్గు రాజయోగము.

(1) లగ్నముగాని, చంద్రుడుగాని చంద్రవ్యతిరిక్తములగు నాలుగ్రహములనగా, రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శనులచే,జూడబడు చుండుట. ఇట్లుండుటచే నేర్పడు యోగములు 22అగును, ఇట్లులగ్నమువలన, 22ను, చంద్రునివలన 22నుకలియగూడగా 44రాజయోగములగుచున్నవి. ఈప్రకారమే ద్వాదశరాశులయందును, ప్రత్యేకముగా వర్గోత్తమాంశస్థితిని బట్టి గణితముచేయగా లగ్నమువలన, 12 × 22=264, చంద్రునివలన 264, నుచేరి మొత్తము 528 రాజయోగములగుచున్నవి.ఈవిషయమై “శ్లో. గణోత్తమే లగ్నవనాంశ కోద్గమే నిశాకరశ్చాపి గణోత్తమేధవా,చతుర్గ్రిహైశ్చంద్ర వివర్జితైస్తదా, నిరీక్షిత స్యాదథమోద్భవోన్నపః,” అని సారావళీకారకుడును, “విలగ్నభవనంగతే బలయుతేచ వర్గోత్తమే చతుః ప్రభృతి భిర్గ్రహైశ్శశినివా సమాలోకితే, వసంభవతి, పార్థివః, పటుకృపాణ పాణీరణే కదాచిదపి వీక్షితే రిపుజనోనయ స్యానవమ్” అని మాండవ్యుల వారును చెప్పియున్నారు. ఇందుచే పరమార్థమువలన మరిరెండు రాజయోగము లేర్పడుచున్నవి

(1) చంద్రుడు వర్గోత్తమాంశగతుడై నాలుగు మొదలు గ్రహములచేత జూడబడుట యొకయోగము.

(2) లగ్నము వర్గోత్తమాంశగతమై నాలుగు మొదలు గ్రహములచేత జూడబడుచుండుట రెండవ యోగమనియు నూహింప దగియున్నది.

మఱల అయిదు రాజయోగములు.

శ్లో. యమే కుంభే ర్కేజే గవి శశిని తైరేవ తను గై
ర్నృయుక్ సింహాళి స్థై శ్శశిజ గురు సకైర్నృపతయః
యమేందూ తుంగే ౽ంగే సవితృ శశిజౌ షష్ఠ భవనే
తులాజేందు క్షేత్రైః ససిత కుజ జీవై శ్చ నరపా. 4

**టీ.** యమే=శనైశ్చరుఁడు, కుంభే=కుంభమందును, అర్కే = సూర్యుఁడు, అజే=మేష మందును, శశిని=చంద్రుఁడు, గవి=వృషభమందును, ఉండి, తై రేవతనుగైః=ఆశని సూర్యచంద్రయుక్తములైన కుంభ మేష వృషభములలో నొకటి లగ్నమగుచుండఁగా, నృయుక్సింహాళిస్థైః= మిథున సింహ వృశ్చికములయందున్న, శశిగురువక్రైః=బుధ గురు కుజులచేత, నృపతయః=మూఁడు రాజయోగంబు లేర్పడును. యమేందూ = శని చంద్రులు, తుంగే=తమయుచ్ఛస్థానములైన తులావృషభములయందుండి, అంగే=తులా వృషభములలో నొకటిలగ్నమై, సవితృశశిజౌ = రవి బుధులు, షష్ఠభవనే = కన్యయందుండఁగా (క్రమముగా) ససితకుజజీవైః= శుక్ర కుజ గురువులతో గూడిన, తులాజేందుక్షేత్రైః=తులా మేష కర్కాటములచేత, నరపౌ=రెండు రాజయోగము లేర్పడును.

తా. కుంభమున శనైశ్చరుడు, మేషమున రవి, వృషభమున చంద్రుఁ డుండి, కుంభ, మేష వృషభములయం దొక్కటి లగ్నమై, మిథున, సింహ, వృశ్చికములయందున్నట్టి బుధగుర్వంగారకులచే మూడు రాజయోగము లేర్పడుచున్నవి, ఆయోగముల వివరము.

(1) కుంభము లగ్నమై అందుశనైశ్చరుడు, మేషమునందు రవి, వృషభమున చంద్రుడు, మిథునమందు బుధుడు, సింహమున గురుడు వృశ్చికమం దంగ రకుడుండుట.

(2) మేషము లగ్నమై అందుసూర్యుడు, వృషభమున చంద్రుడు, మిథునమున బుధుడు, సింహమందు గురుడు, వృశ్చికమునం దంగారకుడు, కుంభమున శనైశ్చరుడుండుట.

(3) వృషభములగ్నమై అందుచంద్రుడు, మిథునమున బుధుడు, సింహమందు గురుడు, వృశ్చికమునం దంగారకుడు, మేషమున సూర్యుడు, కుంభమున శనైశ్చరు డుండుట.

శనైశ్చర, చంద్రులు, తమ తమ యుచ్ఛస్థానములైన, తులా వృషభములయం దుండి ఆ తులా వృషభములలో నొకటి లగ్నమై రవి బుధులు కన్యాలగ్నమున నుండగ, శుక్రాంగారక గురువులతో గూడిన తులా మేష, కర్కాటకములచేత, రెండు రాజయోగము లేర్పడుచున్నవి.

(1) తులలగ్నమై అందు శుక్ర శనులు, వృషభమున చంద్రుడు, కన్యయందు రవి బుధులు, మేషమం దంగారకుడు, కర్కాటకమునందు గురు డుండుట.

(2) వృషభము లగ్నమై, అందు చంద్రుడు, తులయందు శని శుక్రులు, కన్యయందు బుధ రవులు, మేషమునం దంగారకుడు, కర్కాటకమున గురుడుండుట.

పైరీతిని యుండగా ఏర్పడు యోగములను గలియగూడగా నయిదు రాజయోగము లగుచున్నవి.

ఈ శ్లోకమున "షష్ఠభవనే" అనగా లగ్నము మొదలు ఆరవరాశియని కొందరు అర్థముచేయుచు, తులాలగ్నమున శుక్రుడుండగా మీనమున సూర్యుడుండడనియు పూర్వపక్షము ప్రాప్తమగుచుండగా వక్ష్యమాణ వజ్రాదియోగములయందు సూర్యస్థిత రాశికిచతుర్థస్థానమున బుధశుక్రుల స్థితి జెప్పబడియున్నదనియు కారణము జెప్పుచుగాని "తులాలగ్నే

సిత సౌరే మేషే భౌమోగురుః కుళీరగతః కన్యాయాం రవి శశిజౌ జాతో నృపతి ర్వృషేచ చంద్రేవా" అను బాదరాయణుని వచనాను గుణ్యముగ షష్ఠభవనమనగా మేషము మొదలు ఆఱవరాశి కన్యారాశియని యూహింప దగియున్నది.

శ్లో. కుజే తుంగేర్కేందో ర్ధనుషి యమ లగ్నే చ కుపతిః
పతిర్భూమే శ్చాన్యః క్షితి సుత విలగ్నే స శశిని
సచంద్రే సౌరే స్తే సురపతి గురౌ చాప ధరగే
స్వతుంగస్థే భానా వుదయ ముపయాతే క్షితి పతిః. 5

టీ. కుజే=కుజుఁడు, తుంగే=తన యుచ్చస్థానమైన మకరలగ్నమందును, అర్కేంద్వోః=సూర్యచంద్రులు, ధనుషి = ధనుస్సునందును, యమలగ్నే = శనైశ్చరుఁడు జన్మలగ్నమైనమకరమందును, ఇట్లుండఁగాఁబుట్టినవాఁడు, కుపతిః=పుడమి ఱేఁడగును, ఈ యోగమందే, క్షితిసుతవిలగ్నే = కుజసహితమైన మకరలగ్నము, సశశిని = చంద్రునితోఁగూడినదై యుండఁగాను, ధనుస్సున సూర్యుఁడుండఁగాను, పుట్టినవాఁడు, అన్యః=మఱియొకఁడైన, భూమేఃపతిః=భూపాలుండగును, సౌరే = శని, అస్తే = సప్తమమందును, సురపతిగురౌ=బృహస్పతి చాపధరగే=ధనుస్సునందునుండఁగా, భానౌ=సూర్యుఁడు, స్వతుంగస్థే=తనయుచ్చరాశియగు మేషమందుండి, ఉదయముపయాతే = లగ్నముఁ బొందినవాఁడగుచు నుండఁగాఁ బుట్టినవాఁడు, క్షితిపతిః=పుడమి ఱేఁడగును.

తా. జననలగ్నమున శనైశ్చరుఁడును, సూర్యచంద్రులు ధనుస్సునందును, అంగారకుఁడు తనయుచ్చస్థానముగు మకరముననుండగా మకరరాశియే జననలగ్నమైనపుడు బుట్టినవాడురాజగునని యూహింపఁదగినది. ఈ శ్లోకమున "యమలగ్నే" అనిచెప్పియుండుటచే, శనైశ్చరుడు లగ్నమునందు లేకుండినను, మకర, కుంభములయందెందేని నుండిన జాలునని కొందరందురు. గాని "లగ్నే సౌర స్తుంగే భౌమ శ్చంద్రాదిత్యౌ చాప ప్రాప్తౌ" అనుబాదరాయణులును, "ఆదిత్యశ్చ నిశాకరశ్చ భవతో వాగీశరాశౌ యదాసార్ధం భాస్కరిణా స్వరాశి సహితః ప్రాప్తో మృగేమంగళః, ప్రాప్నోతి ప్రభవం తదా సుకృతీ క్ష్మాపాల చూడామణీ ర్యస్యాంతే పరిపంథినో రణముఖే యస్మాత్కృతాందివ" అనిమాండవ్యులును, "చాపార్ధేభగవాన్సహస్రకిరణ స్తత్రైవతారాధిపోలగ్నే భాను సుతోతి తీర సహిత స్సోచభూనందనః" అని సారావళీ కారకుడును వచించియుండుట వలన మకరమందనియే స్థిరపరుప దగియున్నది. మరియు మకరము నచంద్రాంగారకులు, ధనుస్సున సూర్యుడుండగా జననలగ్నము మకరమగు చుండగా బుట్టినవాడు భూపాలుడగును. ఈ విషయమునకై "భానుశ్చాపే స్తేందు ర్భౌమ స్తుంగ ప్రాప్తో లగ్నే వాస్యాత్" అనుబాదరాయణ వచనము ప్రమాణముగా నున్నది. మరియు మేషము లగ్నమై, అందుసూర్యుడు, ధనుస్సున బృహస్పతి, తులయందు శనైశ్చరుఁడుడగా బుట్టినవాడు భూపాలుడ డగును.

### మఱల రెండు రాజయోగములు.

శ్లో. వృషే సేందౌ లగ్నే సవితృ గురు తీక్ష్ణాంశుతనయైః
సుహృజ్జాయా ఖస్థై ర్భవతి నియమా న్మానవపతిః
మృగే మందే లగ్నే సహజ రిపు ధర్మ వ్యయ గతైః
శశాంకాద్యై ర్జాతః పృథు గుణ యశాః పుంగవపతిః. 6

టీ. సేందౌ=చంద్రునితోఁగూడిన, వృషే = వృషభములగ్న మగుచుండఁగా, సుహృజ్జాయాఖస్థైః = చతుర్థ దశమసప్తమముల యందున్న, సవితృగురుతీక్ష్ణాంశుతనయైః = రవి గురుశనులచేత, నియమాత్ = నిశ్చయముగా, మానవపతిః = నరేంద్రుఁడు, భవతి = అగుచున్నాఁడు, లగ్నే=లగ్నమైన, మృగే=మకరమందు, మందే = శనియుండఁగా, సహజరిపుధర్మవ్యయగతైః = తృతీయషష్ఠ నవమద్వాదశముల యందున్న, శశాంకాద్యైః = చంద్రకుజబుధగురుల చేత, జాతః=పుట్టినవాఁడు, పృథుగుణయశాః='విస్తీర్ణములైన శౌర్యాదిగుణములను కీర్తియునుఁగల, పుంగవపతిః=రాజశ్రేష్ఠుండౌను. శశాంకాద్యైఃఖ్యాతః'అనిపాఠాంతరము.

తా. (1) వృషభము లగ్నమై అందుచంద్రుడు, సింహమున సూర్యుడు, వృశ్చికమున బృహస్పతి, కుంభమున శనైశ్చరుడు, ఉండగా బుట్టినవాడు అవశ్యము భూపాలుడగును.

(2) మకరము లగ్నమై అందుశనైశ్చరుడు, మీనమున చంద్రుడు, మిథునమున అంగారకుడు, కన్యయందు బుధుడు, ధనుస్సున బృహస్పతియు నుండగా బుట్టినవాడు విస్తారములైన శౌర్యాది గుణములును, కీర్తియును గలరాజశ్రేష్ఠుండగును. ఈవిషయమై "మృగే లగ్నే సౌరస్తిమి యుగ గతశ్శీతకిరణః కుజే యుగ్మే నార్యాశశి ధరసుత శ్చాపధరగః, గురుర్దైత్యేజ్యార్కా వభిమత గతౌచార వశతః ప్రసూతౌ యస్యా సౌ భవతి నరపశ్చక్ర సదృశః" అను మాండవ్యవచనము ఉదాహరణముగా నున్నది.

### మఱల మూడు రాజయోగములు.

శ్లో. హయే సేందౌ జీవే మృగముఖగతే భూమితనయే
స్వతుంగస్థౌ లగ్నే భృగుజ శశిజా వత్ర నృపతీ,
సుతస్థౌ వక్రార్కీ గురు శశి సితా శ్చాపి హిబుకే
బుధే కన్యాలగ్నే భవతిహి నృపోన్యోపి గుణవాన్. 7

టీ. హయే=ధనస్సునందు. జీవే = బృహస్పతి, సేందౌ = చంద్రసహితుండై యుండఁగా, భూమితనయే = కుజుఁడు, మృగముఖగతే = మకరమందుండఁగాను, భృగుజశశిజౌ= శుక్రబుధులు, స్వతుంగస్థౌ = తమయుచ్చస్థానగతులై, లగ్నే=లగ్నమందుండిరేని, నృపతీ= రెండు రాజయోగములగును, వక్రార్కీ = కుజ శనులు, సుతస్థౌ=పంచమమందును, గురుశ

శసితాః = గురుచంద్రశుక్రులు, హిబుకే = చతుర్థమందును, బుధే=బుధుఁడు, కన్యాలగ్నే = జన్మలగ్నమైన కన్యయందు నుండఁగా పుట్టినవాఁడు, అన్యోపి=క్షత్రియ వ్యతిరిక్తకులోద్భవుండైనను, గుణవాన్=సద్గుణవంతుఁడైన, నృపతిః=రాజ్యాధిపతి, భవతిహి=అగుచున్నాఁడు.

తా. (1) మీనములగ్నమై, అందు శుక్రుడు, ధనుస్సున గురుచంద్రులు, మకరమందంగారకుడు, ఉండగా బుట్టినవాడు రాజగును.

(2) కన్యలగ్నమై అందు బుధుడు, ధనుస్సున గురు చంద్రులు, మకరమునందంగారకుడుండగా బుట్టినవాడు రాజగును.

(3) కుజశనులు పంచమస్థానమున, గురుచంద్ర శుక్రులు చతుర్థస్థానము నందు బుధుడుస్వక్షేత్రమున, అనగా, కన్యలగ్నమై అందుబుధుడు, మకరమునందంగారక శనైశ్చరులు, ధనుస్సున చంద్ర, శుక్రబృహస్పతులు, నుండగా బుట్టినవాడు అన్యకులజుండైనను గుణవంతుడగు ప్రభువగును.

మఱియు మూడు రాజయోగములు.

శ్లో. ఝషే సేందౌ లగ్నే ఘట మృగ మృగేంద్రేషు సహితై
ర్యమారార్కై ర్యోభూ త్పఖిలు మనుజశ్శాస్తి వసుధాం,
అజే సారే మూర్తౌ శశిగృహగతే చామర గురౌ
సురేజ్యేవా లగ్నే ధరణిపతి రన్యోపి గుణవాన్. 8

టీ. సేందౌ=చంద్రునితోఁగూడిన, ఝషే=మీనము,లగ్నే=లగ్నమైయుండగా,ఘటమృగమృగేంద్రేషు=కుంభమకర సింహములయందు, సహితైః=కూడియున్న, యమారార్కైః= శనికుజరవులచేత, గలిగిన, మనుజః=పురుషుండు, వసుధాం=భూమిని, శాస్తిఖలు=పరిపాలించునుగదా. సారే=కుజునితోఁగూడిన, అజే=మేషము, మూర్తౌ=లగ్నమైయుండఁగాను, అమర గురౌ=బృహస్పతి, శశిగృహగతే=కర్కటమందుండఁగా పుట్టినవాఁడు, అన్యోపి=అన్యవంశోద్భవుండైనను, గుణవాన్=సద్గుణవంతుండైన, ధరణిపతిః = పుడమి ఱేడౌను, అథవా=అటుగాక పోయినను, సురేజ్యే= బృహస్పతి, కర్కటస్థుఁడై, లగ్నే= కర్కటమే లగ్నమైయుండఁగా, కుజుఁడు మేషమందుండెనేని, అపుడు పుట్టినవాఁడును భూపాలుండగును.

తా. (1) మీనలగ్నమై అందుచంద్రుడును, కుంభమందుశనియు, మకరమందు కుజుడును, సింహమంద సూర్యుడును ఉండగా బుట్టినమనుజుడు ప్రజలనేలును.

(2) మేషములగ్నమై అందుఅంగారకుడు, కర్కటమునందు బృహస్పతియునుండగా బుట్టినవా డితరకులసంభవుడైనను, సద్గుణవంతుడగు భూనాయకుడగును అట్లు గాకుండు నెడల కర్కటములగ్నమై అందుబృహస్పతియు, మేషమున అంగారకుడును ఉండగా బుట్టినవాడు, భూపాలకుండగును.

## మఱియొక రాజయోగము.

శ్లో. కర్కిణి లగ్నే తత్థ్సే జీవే చంద్రసితజ్ఞై రాయప్రాప్తైః
మేషగతేఽర్కే జాతం వింద్యాద్విక్రమయుక్తం పృథ్వీనాథమ్. 9

టీ. కర్కిణి=కర్కాటకము, లగ్నే=లగ్నమగుచుండఁగాను, జీవే=బృహస్పతి, తత్స్థే=అలగ్నమందుండఁగాను, చంద్రసితజ్ఞైః=చంద్రశుక్రబుధులు, ఆయప్రాప్తైః=ఏకాదశ స్థానమందుండఁగాను, అర్కే=సూర్యుఁడు, మేషగతే=మేషమందుండఁగాను, జాతం=పుట్టినవానిని, విక్రమయుక్తం=పరాక్రమయుక్తుండైన, పృథ్వీనాథం=క్షితిపతినిగాను, వింద్యాత్=తెలియవలయును.

తా. కర్కాటకములగ్నమై అందుబృహస్పతియు, చంద్ర, శుక్ర, బుధులు ఏకాదశమునందనగా వృషభమునందును, సూర్యుడు మేషమునను, యుండగా బుట్టినవాడు పరాక్రమయుక్తుడగు రాజగునని తెలియదగినది.

## మఱియొక రాజయోగము.

శ్లో. మృగముఖేఽర్కతనయే తనుసంస్థే క్రియకుళీరహరయోఽధిపయుక్తాః
మిథునతౌళిసహితౌ బుధశుక్రౌ యది తదా పృథుయశాః పృథివీశః.

టీ. మృగముఖే=మకరలగ్నమై, అర్కతనయే=శని, తనుసంస్థే=ఆమకర లగ్నమందుండఁగా, క్రియకుళీర హరయః=మేషకర్కటసింహములు, అధిపయుక్తాః=స్వస్వామి యుక్తములును, బుధశుక్రౌ=బుధశుక్రులు, మిథునతౌళిసహితౌయది = మిథునతులలతోఁ గూడినవారునైన, తథా=అపుడిట్లు గ్రహంబులుండఁగాఁబుట్టినవాఁడు, పృథుయశాః=విస్తీర్ణకీర్తిగల, పృథివీపతిః=భూపాలుఁడౌను.

తా. మకరములగ్నమై, అందుశనైశ్చరుడు, మేషమందు అంగారకుడు, కర్కాటకమునందు చంద్రుడు, సింహమందుసూర్యుడు, మిథునమందు బుధుడు, తులయందుశుక్రుడును, యుండగా బుట్టినవాడు విస్తారమగుకీర్తిగలరాజగునని తెలియదగినది.

## మఱియొక రాజయోగము.

శ్లో. స్వోచ్చసంస్థే బుధే లగ్నే భృగౌ మేషూరణాశ్రితే
సజీవేఽస్తే నిశానాథే రాజా మందారయోస్సుతే. 11

టీ. స్వోచ్చసంస్థే=తనయుచ్చస్థానమైన కన్యయందున్న, బుధే = బుధుఁడు, లగ్నే=ఆకన్యాలగ్నమందుండఁగాను, భృగౌ=శుక్రుఁడు, మేషూరణాశ్రితే=దశమమందుండఁగాను, సజీవే=బృహస్పతితోఁగూడిన, నిశానాథే = చంద్రుండు, అస్తే = సప్తమమందుండఁగాను, మందారయోః=శనికుజులు, సుతే=పంచమమందుండఁగానుఁ, బుట్టినవాడు రాజగును.

తా. కన్యలగ్నమై అందుబుధుడు, మిధునమందుశుక్రుడు, మీనమున గురుచంద్రులు మకరమునశనైశ్చర అంగారకులును నుండగాఁబుట్టినవాడు రాజగునని దెలియదగినది.

—రాజయోగములయందు గలభేదము.—

శ్లో. అపి ఖలకులజాతా మానవా రాజ్యభాజః
కిముత నృపకులోత్థాః ప్రోక్తభూపాలయోగైః
నృపతికులసముత్థాః పార్థివా వక్ష్యమాణై
ర్భవతి నృపతి తుల్య స్తేష్వభూపాలపుత్రః. 12

టీ. ప్రోక్తభూపాలయోగైః=ఈచెప్పంబడిన రాజయోగములచేత, ఖలకులజాతాఅపి=నీచవంశమందుఁ బుట్టినవారైనను, మానవాః=పురుషులు, రాజ్యభాజః=రాజ్యాధిపతులౌదురు, నృపకులోత్థాః=క్షత్రియ వంశమందుఁబుట్టినవారు రాజ్యాధిపతులౌదురని, కిముత=చెప్ప నేల? అనఁగానవశ్యము రాజ్యాధిపతు లౌదురనుట. వక్ష్యమాణైః = ఇంకమీఁద జెప్పఁబడెడురాజయోగములచేత, నృపకులసముత్థాః=క్షత్రియ వంశమునఁబుట్టినవారు, పార్థివాః=రాజులౌదురు, తేషు=ఆరాజయోగములయందు,అభూపాలపుత్రః=క్షత్రియవ్యతిరిక్తకులమందుఁబుట్టినవాఁడు, నృపతితుల్యః=ఐశ్వర్యాదులచేత రాజసమానుఁడై, భవతి=అగుచున్నాఁడు.

తా. ఈ చెప్పబడిన రాజయోగములందు బుట్టినవారు అన్యకులసంజాతులైనను, రాజ్యాధిపతులగుదురనియు.నిక జెప్పబడునట్టి యోగములంబుట్టిన క్షత్రియవంశజులు మాత్రము రాజ్యాధిపతులగుదురనియు, అన్యకులసంభవులు రాజతుల్యులగుదురనియు, జెప్పబడినది. ఈ చెప్పబడినరాజయోగములచేత నీచకులమున బుట్టినవారైనను, పురుషులు రాజ్యాధిపతులగుదురనియు తెలియదగినది. ఇట్లుచెప్పుటవలన క్షత్రియవంశమునబుట్టినవారు రాజ్యాధిపతు లగుదురని వేరుజెప్పనక్కరలేదు. క్షత్రియవంశజులైన యెడల తప్పకరాజ్యాధిపతులగుదురనుట యేర్పడుచున్నది. వక్ష్యమాణరాజయోగములచేత క్షత్రియ వంశసంజాతులు రాజులగుదురనుటకుసందేహములేదు. ఆ రాజయోగములయందు నితరకులమున బుట్టినవారురాజతుల్యులగుదురని తెలియదగినది.

శ్లో. స్వోచ్చ స్వత్రికోణగై ర్బలస్థై స్త్రివ్యాద్యై ర్భూపతి వంశజా నరేంద్రాః
పంచాదిభి రన్యవంశజాతా హీనై ర్విత్తయుతా న భూమిపాలాః. 13

టీ. స్వోచ్చ స్వత్రికోణగైః=తమతమయుచ్చ మూలత్రికోణములను పొందియున్న, బలస్థైః=స్థానదిక్కాలాది బలయుక్తములైన, త్ర్యాద్యైః=మూఁడునాలుగు గ్రహములచేత, భూమిపతివంశజాః=క్షత్రియవంశమునఁ బుట్టినవారు, నరేంద్రాః=రాజులౌదురు, పంచాదిభిః=ఉచ్చమూల త్రికోణములయందు స్థానాది బలయుక్తములైయున్న 5-6-గ్రహములచేత, అన్యవంశజాతాః=క్షత్రియవ్యతిరిక్తవంశమందుఁ బుట్టినవారును రాజ్యాధిపతులౌదురు, హీనైః=బలహీనులగుగ్రహములచేత, విత్తయుతాః=ధనవంతులగుదురుకాని, నభూమిపాలాః=రాజ్యాధిపతులుగారు.

తా. తమతమ యుచ్చమూల త్రికోణములను బొంది, స్థానదిక్కాలాది బలయుక్తములగు 3 లేక 4 గ్రహముల వలన క్షత్రియకులమున బుట్టినవారు రాజులగుదురనియు, తమ తమ ఉచ్చమూల త్రికోణములయందు స్థానాది బలయుక్తములగు 5, 6 గ్రహములచేతఅన్య కులజులగువారు రాజ్యాధి పత్యమును బొందుదురనియు తెలియదగినది. మరియు తమ తమ మూల త్రికోణములయందు మూడుగ్రహములు స్థానదిక్కాలాది బలహీనములై యున్నను క్షత్రియ వంశమున బుట్టినవారు ధనవంతులగుదు రనియు, రాజయోగము కలుగదనియు, ఇందుచెప్పియుండు బలయుత గ్రహములలో కొన్ని తమయుచ్చస్థానము లందును కొన్ని తమమూల త్రికోణ స్థానములయందును కొన్నిస్థానబలయుతము లగుచు కొన్ని దిగ్బలములగుచు, కొన్ని కాల బలయుతములగుచు మూడుగ్రహములకు తక్కువ పడకయుండు నెడల యథోక్తము లగు ఫలితములు గలుగునని నూహింపదగినది.

## మఱియొక రాజయోగము.

శ్లో. లేఖాస్థే ఽర్కే ఽజేంద్వో లగ్నే భౌమే స్వోచ్చే కుంభే మందే
చాప ప్రాప్తే జీవే రాజ్ఞః పుత్రం విద్యాత్పృథ్వీ నాథమ్. 14

టీ. లేఖాస్థే = ఉదయించుచున్న, అర్కే=సూర్యుఁడు, అజే=మేషమందును, ఇందౌ=చంద్రుఁడు, లగ్నే=మేషలగ్నమందును, భౌమే=కుజుఁడు, స్వోచ్చే=తనయుచ్చమైన మకరమందును, మందే=శని, కుంభమందును, జీవే=గురుఁడు, చాపప్రాప్తే=ధనుస్సునందును ఉండఁగా, రాజ్ఞఃపుత్రం=క్షత్రియకుమారుని, భూమేర్నాథం=పృథివీపతినిగా, విద్యాత్=తెలియవలయును. ఈయోగంబున అన్యకులమందుఁబుట్టినవాఁడు ధనవంతుఁడగుననిభావము.

తా. మేషము లగ్నమై యందుసూర్యచంద్రులు అంగారకుడు తన ఉచ్చస్థానమగు మకరమందును, శనైశ్చరుడు, కుంభమునను, గురుడు, ధనుస్సునందును యుండగాబుట్టినక్షత్రియుడు రాజగుననియు, అన్యకులజుడు ధనవంతుడగుననియు తెలియదగినది. ఇందుజెప్పబడియుండు లేఖాశబ్దమునకు ఉదయస్థానమని నూహింపదగినది. మరియు "లేయస్థార్కే" అనిపఠించి సూర్యుడుసింహమునందుండవలయుననికొందరనుచున్నారు ఇదియుసమంజసముగానేయున్నది.

## మఱిరెండు రాజయోగములు.

శ్లో. స్వక్షే శుక్రే పాతాళస్థే ధర్మస్థానం ప్రాప్తే చంద్రే
దుశ్చిక్యాంగ ప్రాప్తిప్రాప్తైః శేషైర్జాతః స్వామీ భూమేః. 15

టీ. స్వక్షే=స్వక్షేత్రములగు వృషభతులలలో నొకరాశియందున్న, శుక్రే=శుక్రుఁడు, పాతాళస్థే=చతుర్థమునం డఁగా, చంద్రే = చంద్రుఁడు, ధర్మస్థానం=నవమమును, ప్రాప్తే = పొందుచుండఁగాను, దుశ్చిక్యాంగప్రాప్తిప్రాప్తైః= తృతీయలగ్నైకాదశ గతులైన, శేషైః= తక్కిన రవి కుజ బుధ గురు శనులచేత నియ్యఁబడినయోగమందు, జాతః = పుట్టినవాఁడు, భూమేః = పుడమికి, స్వామీ=ఏలికయగును.

తా. (1) కుంభములగ్నమై, శుక్రుడు వృషభమునందును, చంద్రుడు తులయందును తక్కిన గ్రహములగు రవి, కుజ, బుధ, గురు, శనులు, యథాసంభవముగ తృతీయ, లగ్న, ఏకాదశులయందనగా, మేష, కుంభ, ధనుస్సులయందుండగా బుట్టిన క్షత్రియుడు మహాదైశ్వర్యసంపన్నుడగు రాజగును. అన్యకులజుడు, ధనవంతుడగును.

(2) కర్కాటకములగ్నమై, శుక్రుడు తులయందును చంద్రుడు మీనమునను, తక్కిన గ్రహములు యథాసంభవముగ కన్యా కర్కాటక వృషభముల యందుండగా బుట్టిన రాజవంశజుడు రాజగును, అన్యకులజుడు, ధనవంతుడగును.

—— మఱియొక రాజయోగము ——

శ్లో. సౌమ్యే వీర్యయుతే తనుయుక్తే వీర్యాఢ్యేచ శుభే శుభయాతే
ధర్మార్థోపచయే ష్వవశేషైః ర్ధర్మాత్మా. నృపజః పృథివీశః. 16

టీ. వీర్యయుతే=షడ్బలసంపన్నుడైన, సౌమ్యే=బుధుడు, తనుయుక్తే=లగ్నమందుండగాను, వీర్యాఢ్యే=బలయుక్తుడైన, శుభే=గురుశుక్రులలోనొకడు, శుభయాతే=నవమమందుండగాను, ధర్మార్థోపచయేషు=నవమ ద్వితీయ తృతీయ షష్ఠ దశమైకాదశములయందు యథాసంభవముగానున్న, అవశేషైః=తక్కిన గ్రహములచేత, నియ్యబడిన రాజయోగమందు బుట్టిన, నృపజః=రాజపుత్రుడు, ధర్మాత్మా=పుణ్యాత్ముడైన, పృథివీశః=భూపతియగును.

తా. షడ్బలసంపన్నుడైనబుధుడు, లగ్నమందును, గురుశుక్రులలో నొకడు బలవంతుడై నవమమునను తక్కిన గ్రహములు యథాసంభవముగా నవమ, ద్వితీయ, తృతీయ, షష్ఠ, దశమ, యేకాదశములయందుండగాబుట్టిన క్షత్రియుడు పుణ్యాత్ముడగు రాజగును. అన్యకులజుడు, ధనవంతుడగును "శుభేశుభయాతే" అని యుండుచోట "శుభేసుఖయాతే" అని పఠించి శుభగ్రహము చతుర్థస్థానమునందుండవలయునని కొందరనుచున్నారు.

—— మఱిరెండు రాజయోగములు. ——

శ్లో. వృషోదయే మూర్తి ధనారి లాభగై
శ్శశాంక జీవార్క సుతా పరైర్నృపః
సుఖే గురౌ ఖే శశి తీక్ష్ణదీధితీ
యమోదయే లాభగతై ర్నృపోపరైః. 17

టీ. వృషోదయే=వృషభములగ్నమై, మూర్తిధనారిలాభగైః=లగ్న ద్వితీయ షష్ఠైకాదశములయందు, వరుసగానున్న, శశాంకజీవార్కసుతాపరైః=చంద్రుడు, గురుడు, శని, రవి కుజ, బుధ, శుక్రులచేబుట్టినక్షత్రియుండు, నృపః=నరపాలుడగును, గురౌ=బృహస్పతి, సుఖే=చతుర్థమందును, శశితీక్ష్ణదీధితీ=చంద్రసూర్యులు, ఖే=దశమమందును, యమోదయే = శనైశ్చరుడు లగ్నమందును, లాభగైః = ఏకాదశమందున్న, అపరైః = తక్కినకుజబుధశుక్రులచేత బుట్టినక్షత్రియుండు, నృపః=నృపాలుండగును.

తా. (1) లగ్నమువృషభమై అందుచంద్రుడు, గురుడు మిథునమునందు, శనైశ్చరుడు తులయందు, తక్కినగ్రహములు, అనగా, రవి, కుజ, బుధ, శుక్రులు మీనమునందు నుండగాబుట్టిన క్షత్రియుడు రాజేంద్రుడగును. అన్యకులజుడు, ధనాఢ్యుడగును.

(2) లగ్నమున శని, చతుర్థమున గురువు, దశమమునరవిచంద్రులు, ఏకాదశమున, కుజ, బుధ, శుక్రులుండగాబుట్టి క్షత్రియుడు నృపాలురలో శ్రేష్ఠుడగును. అన్యకులోద్భవుడు ధనాఢ్యుడగును.

## మఱిరెండు రాజయోగములు.

శ్లో. మేషూరణా యతను గాశ్శశి మంద జీవా
జ్ఞారౌధనే సితరవీ హిబుకే నరేంద్రం
వక్రాసితౌ శశి సురేజ్య సితార్క సౌమ్యా
హోరా సుఖాస్త శుభఖాప్తి గతాః ప్రజేశం. 18

టీ. మేషూరణాయతనుగా=దశమైకాదశ లగ్నములయందు యథాక్రమముగానున్న, శశిమందజీవాః=చంద్ర,శని, గురువులును, ధనే=ద్వితీయమందు, జ్ఞారౌ=బుధకుజులు, హిబుకే=చతుర్థమందు, సితరవీ = శుక్రసూర్యులు, ఇవ్విధంబుననున్నవారలై క్షత్రియవంశంబునందు బుట్టినవాని, నరేంద్ర = నరాధిపునిజేయుదురు. వక్రాసితౌ = కుజశనులు, శశిసురేజ్యసితార్కసౌమ్యాః = చంద్రగురు శుక్రరవిబుధులును (వరుసగా) హోరాసుఖాస్త శుభఖాప్తిగతాః= లగ్నచతుర్థ సప్తమనవను దశమైకాదశముల యందున్నవారలై, రాజపుత్రుని, ప్రజేశం = నరాధిపునిగా జేయుదురు.

తా. (1) లగ్నమునగురుడు, ద్వితీయమున బుధకుజులు, చతుర్థమున శుక్రసూర్యులు, దశమమున చంద్రుడు, ఏకాదశమున శనైశ్చరుడును ఉండగా బుట్టిన క్షత్రియవంశజుడు రాజగునని తెలియదగినది. అన్యకులస్థుడు ధనవంతుడగును.

(2) లగ్నమునందంగారక శనైశ్చరులు, చతుర్థమున చంద్రుడు, సప్తమమునగురుడు, నవమమున శుక్రుడు, దశమమున సూర్యుడు, ఏకాదశమున బుధుడుండగాబుట్టిన క్షత్రియుడు నరేంద్రుడగుననియు, అన్యకులోద్భవుడు, ధనాఢ్యుండగుననియు నూహింపదగినది.

## రాజయోగ జనితులకు, రాజ్యప్రాప్తి, తద్భ్రంశాది కాలముల వివరము.

శ్లో. కర్మ లగ్న యుత పాక దశాయాం రాజ్యలబ్ధి రథవా ప్రబలస్య
శత్రు నీచ గృహ యాతదశాయాం ఛిద్రసంశ్రయ దశా పరికల్ప్యా.

టీ. కర్మ=లగ్నమునకు దశమముతోడను, లగ్న=జన్మలగ్నముతోడను, యుత = కూడియున్న గ్రహముయొక్క, పాకదశాయాం=అంతర్దశయందు, రాజ్యలబ్ధిః = రాజయోగమునం బుట్టినవానికి రాజ్యప్రాప్తి యగును. అథవా=అటుగాక లగ్న దశమములయందు గ్రహములు

లేకుండెనేని, ప్రబలస్య=జన్మకాలంబున సకలగ్రహంబులలో నేగ్రహము బలాధికమయి యుండునో ఆగ్రహముయొక్క అంతర్దశయందు రాజ్యప్రాప్తియగును. శత్రునీచ గృహాయాత దశాయాం=రాజ్యము ప్రాప్తమైనవానికి జన్మకాలమందు శత్రుక్షేత్రమునుగాని నీచక్షేత్రమును గాని పొందియున్న గ్రహముయొక్క అంతర్దశయందు, ఛిద్రదశా = రాజ్యహరణదశయును, సంశ్రయదశా=పరాశ్రయదశయును, పరికల్ప్య=కల్పింపఁదగినది.

తా. రాజయోగమున బుట్టినవానికి రాజయోగములను గలుగఁజేయు గ్రహములలో నే గ్రహము జననలగ్నమునకు దశమస్థానమునందుగాని, జన్మలగ్నమందుగానియున్నదో ఆగ్రహముయొక్క అంతర్దశయందు, రాజ్యప్రాప్తియగును. ఆలగ్న దశమస్థానములయందు రెంటియందును, గండు గ్రహములున్నను, స్థానద్వయమునందనేక గ్రహములున్నను, అందు బలాధిక గ్రహాంతర్దశయందు రాజ్యప్రాప్తియగునని తెలియదగినది. అట్లుగాని పక్షమున, ఆలగ్న దశమములయందు గ్రహములు లేకుండెనేని సకలగ్రహములయందు జననకాలమున నేగ్రహము బలాధికమైయుండునో ఆగ్రహాంతర్దశయందు రాజ్యప్రాప్తియగునని తెలియదగినది. ఇట్లు అనేక అంతర్దశలు రాజ్యప్రదంబులుగ నేర్పడునెడల చారవశమున నేగ్రహముస్వాంతర్దశా కాలమునందతిబలయుక్తమై యుండునో ఆగ్రహాంతర్దశయందు రాజ్యప్రాప్తియగునని తెలియదగినది.

## రాజ్యభ్రంశాది కాలము.

జననకాలమున శత్రుక్షేత్రమునసైనను, నీచక్షేత్రమునసైనను, నుండునట్టి గ్రహములు బలయుక్తమైయుండు నెడల తద్గ్రహాంతర్దశాకాలమున రాజ్యముపోవును. హీనబలయుతమై యుండునెడల ఆగ్రహాంతర్దశాకాలమున ఆపత్తులధికముగ గలుగుననియు అట్టికాలమున పరుల నాశ్రయించుటచే రాజ్యమునిలుచుననియు దెలియదగినది. ఈ విషయమై "లగ్నగః కర్మగో వాస్యాదథవా ప్రబలోపి యః, సస్వాన్యతస్వాంతర్దశాకాలే రాజ్యదః ప్రబలోయథా, నీచారిగృహసంస్థస్య దశాయాం ప్రబలస్య చ, చ్యుతిర్బలవిహీనస్య తస్మోక్షః పరసంశ్రయాత్" అనిగార్గి వచించి యున్నారు.

## భోగవంతులజననము, శబరతస్కరాధిపతుల జననమును వివరించుట.

శ్లో. గురు సిత బుధ లగ్నే సప్తమస్థే ర్కపుత్రే
వియతి దివసనాథే భోగినాం జన్మ వింద్యాత్
శుభబలయుత కేంద్రైః క్రూరభస్థైశ్చ పాపై
ర్వ్రజతి శబర దస్యు స్వామితా మర్థభాక్చ. 20

టీ. గురుసితబుధలగ్నే=గురుబుధ శుక్రులలోనొకఁడు లగ్నమందుండఁగాను, అర్కపుత్రే=శని, సప్తమస్థే=సప్తమమందుండఁగాను, దివసనాథే=సూర్యుఁడు, వియతి = దశమమందుండఁగాను, భోగినాం=ధనహీనులైనను ఏవిధంబునసైన నెల్లప్పుడు భోగములననుభవించు

వారియొక్క, జన్మ=జననమును, వినిర్దేశ్యాత్ = తెలియవలయునది. శుభబలయుత కేంద్రైః, శుభ=గ్రహసంబంధులును, బల=బలయుతములైన, కేంద్రైః=కేంద్రస్థానములచేతను, క్రూరభస్థైః=పాపగ్రహసంబంధరాసులయందున్న, పాపైః=పాపగ్రహములచేతను, శబరగస్యుస్వామితాం, శబర=బోయవారికిని, దస్యు=చోరులకును, స్వామితాం=అధిపతి యొాటను, వ్రజతి=పొందును, సః=వాఁడు, అర్థభాక్చ=ధనవంతుఁడగును.

## భోగవంతుల జననయోగము.

తా. గురుబుధశుక్రులలో నొకఁడులగ్నమందును, శనైశ్చరుడు సప్తమమునందును ఉండగా బుట్టినవారు ధనహీనులైనను, ఏవిధముగానైనను ఎల్లప్పుడును భోగము ననుభవించువారగుదురు. కొందరు, "రవి బుధ సిత లగ్నే" అనిపఠించి దశమమందు సూర్యుఁడుండగా లగ్నమున బుధశుక్రులుండరు గనుక, రవి, బుధ శుక్ర సంబంధములగు సింహ వృషభ తులా మిథున కన్యా లగ్నములయందని చెప్పుదురు వజ్రాదియోగములయందు సూర్యునిదశమస్థుడై యుండగా లగ్నమునందు బుధశుక్రులయునికి చెప్పబడియుండుటచే పూర్వ శాస్త్రానుసారముగ నీయోగము వరాహమిహిరాచార్యులవలన జెప్పబడినది. ఇందులకు "జీవజ్ఞ భార్గవైర్లగ్నే సప్తమస్థేర్కనందనే, దశమస్థే రవౌ జాతో భోగవాన్ పురుషోభవేత్" అని గార్గి వచించి యున్నారు.

## శబరతస్కరాధిపతుల జననయోగము.

శుభగ్రహసంబంధంబులగు వృషభ, మిథున, కర్కాటక, కన్యా, తులా, ధనుర్మీనములు బలయుక్తములైన కేంద్రస్థానము లగుచుండగా పాపగ్రహసంబంధములగు మేష, సింహ, వృశ్చిక, మకర, కుంభములయందు పాపగ్రహములుండు నెడల అపుడు బుట్టినవాడు శబరతస్కరాదులకు రాజై ధనవంతుడగునని తెలియదగినది కొందరు ఈయోగమునకు, శుభగ్రహసంబంధరాసులు కేంద్రస్థానములై అందుశుభగ్రహములుండగా పాపగ్రహసంబంధరాసులయందు పాపగ్రహము లుండవలయునందురు. ఇదియునొప్పుకోదగినది. మరికొందరు, ఏరాసులైనను కేంద్రస్థానగతములై బలయుక్తములగు శుభగ్రహములతో కూడియుండవలయునని చెప్పుదురు. ఇందులకు "పాపక్షేత్ర గతైః పాపైః కేంద్రస్థైః సౌమ్య రాశిభిః సబలైర్యస్య జన్మస్యాత్స్యాదసౌ దస్యు నాయకః" అను గార్గివచనము విరుద్ధముగానుండుటచే గ్రాహ్యముకాదని యూహింపదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
రాజయోగాధ్యాయ నామక
ఏకాదశాధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### నాభసయోగాధ్యాయము. ద్వాదశాధ్యాయము.—12.



### నాభసయోగ సంఖ్యావివరము.

శ్లో. నవ దిగ్వసవ స్త్రిశకాగ్ని వేదై, ర్గుణితా ద్విత్రి చతుర్వికల్పజా స్స్యుః
యవనై స్త్రిగుణా హి షట్ఛతీసా కథితా విస్తరతోఽత్ర తత్సమాసః.

టీ. నవ దిగ్వసవః=9, 10, 8, ఈసంఖ్యలు, క్రమముగా, త్రిశకాగ్ని వేదైః=3, 3, 4, ఈసంఖ్యలచేత, గుణితాః = గుణింపఁబడినవై, ద్విత్రిచతుర్వికల్పజాః = 2, 3, 4, వికల్పముల వలనఁబుట్టెడు యోగంబులు, స్యుః=అగును, యవనైః = పురాతన యవనులచేత, త్రిగుణాః = వాటిచేత గుణింపఁబడిన, షట్ఛతీ 600 అనఁగా 1800 నాభసయోగములు, విస్తరతః = విస్తరముగా, కథితా = చెప్పఁబడెను, అత్ర=ఈబృహజ్జాతకమందు, తత్సమాసః=ఆ 1800 యోగములయొక్క సంగ్రహము చేయఁబడును.

### నాభసయోగములకు 4 వికల్పములు.

తా. 1. ఆకృతియోగములు.

2. ఆకృతియోగములు, సంఖ్యాయోగములు.

3. ఆకృతియోగములు, సంఖ్యాయోగములు, ఆశ్రయ యోగములు.

4. ఆకృతియోగములు, సంఖ్యాయోగములు ఆశ్రయయోగములు దళయోగములు.

ఇంతులకు సంఖ్యా విశదము ఇందు "నవదిగ్వసవః" అని యుండుటచే 9, 10, 8; అను సంఖ్యలు, క్రమముగ "త్రిశకాగ్ని వేదైః" 3, 3, 4 అనుసంఖ్యలచే గుణింపబడి. "ద్వి, త్రి, చతుర్వి కల్పజాః," అనగా 2, 3, 4, వికల్పములవలన ఏర్పడు యోగములగుచున్నవి.అనగా,

9 × 3=27 గనుకద్వికల్పమువలన 27 యోగములు ఏర్పడుచున్నవి.

10 × 3=30 గనుక త్రివికల్పమువలన 30 యోగములు యేర్పడుచున్నవి.

8 × 4=32 గనుక చతుర్వి కల్పమువలన 32 యోగములు యేర్పడుచున్నవి.

ఆకృతి యోగములు 20 సంఖ్యాయోగములు 7 ఈరెండును మొత్తము చేసినయెడల ద్వివికల్పజ యోగములు 27 అగుచున్నవి.

ఆకృతియోగములు 20, సంఖ్యాయోగములు 7 ఆశ్రయయోగములు 3 యీమూడును గలిపిన త్రివికల్పజ యోగములు 30 అగుచున్నది.

ఆకృతియోగములు 20 సంఖ్యాయోగములు 7 ఆశ్రయ యోగములు 3 దళయోగములు 2 యీనాల్గును గూడగా చతుర్వికల్పజయోగములు 32 అగుచున్నవి.

గనుక ఇట్లు 82 యోగములేర్పడుచున్నవి పురాతన యవనులచేత మాటిచేగుణింపబడిన 600 అనగా $3 \times 600 = 1800$ నాభసయోగములు విస్తారముగ జెప్పబడి యున్నవి. అయినను శుచిధ్వజుడు యీవిషయమై "సంస్థాన సాదృశ్యమనంతకం స్యాద్ద్వ్యాణి నానా ప్రకృతీని దృష్ట్వా" అని చెప్పియుండుటచే నాభసయోగములు అనంత్యములనియేర్పడుచుండగా బురాణయవనులకు నాభసయోగమును 1800 అని సంఖ్యానిర్ణయ మెట్లుఏర్పడెననగ సర్వగ్రహములును చతుర్థ సప్తమములయందుండెనేని శంఖ యోగము సర్వగ్రహములు సప్తమదళమముల యందుండెనేని బభ్రుయోగము, సకలగ్రహములు దళమ చతుర్థముల యందుండెనేనిధ్వజయోగము యీమూడును, పూర్వము జెప్పిన ఆకృతి యోగములు 20 అంతు ఆకృతియోగములు 28 సంఖ్యాయోగములు 127. ఈ సంఖ్యాయోగముల గణితవివరము.

| 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |

ఏక వికల్పజ యోగములు. 7.

$(7 \times 6) \div 2 = 21$ ద్వివికల్పజ యోగములు.

$(21 \times 5 \div 3 = 35$ త్రివికల్పజయోగములు.

$(35 \times 4) \div 4 = 35$ చతుర్వి కల్పజయోగములు.

$(35 \times 3) \div 5 = 21$ పంచవికల్పజ యోగములు.

$(21 \times 2) \div 6 = 7$ షడ్వికల్పజ యోగములు.

$(7 \times 1) \div 7 = 1$ సప్తవికల్పజ యోగములు.

మొత్తము. $7 + 21 + 35 + 35 + 21 + 7 + 1 = 127$ యోగములు— (ఈగణితము మునఘానఫాదియోగములయందు జెప్పబడియున్నది) గనుక ఆకృతియోగములు 23 సంఖ్యాయోగములు 127 మొత్తము యోగములు 150 ఈసంఖ్యను రాశిసంఖ్యయగు 12 తో గుణింపగా ద్వాదశ రాశిలగ్న జనితయోగములు $150 \times 12 = 1800$ అగుచున్నవి. ఇవియే నాభసయోగములు ఈబృహజ్జాతకమునందు ముప్పదిరెండు యోగములచేత పైజెప్పిన 1800 యోగములయందు చెప్పబడిన యావదర్థము విశదముగా తెలియునట్లు సంగ్రహముగా జెప్పబడియున్నదని తెలియదగినది.

### ఈముప్పదిరెండు యోగముల నామములు.

"నాచ్ఛత్రకూట కార్ముకశృంగాటక వజ్రదామనీ పాశాః, వీణాసరోజ ముసలావాపీ హల శరసముద్రచక్రాణి మాలాసర్పార్ధేం దూయవ కేదారా గదావిహాగ యూపాః యుగశకటశూల దండారజ్జు శ్శక్తి స్సధానగోనలః" అనవొప్పుచున్నవని సారావళీ కారకుడు వచించి యున్నాడు.

### ఆశ్రయయోగములు దళయోగములు.

శ్లో. రజ్జుర్ముసలం నలశ్చరాద్యైః సత్య శ్చాశ్రయజాన్ జగాదయోగాన్
కేంద్రై స్సదసద్యుతై ర్దలాఖ్యౌ స్రక్సర్పౌ కథితౌ పరాశరేణ. 2

టీ. సత్య=సత్యాచార్యుఁడు, చరాద్యైః = సకలగ్రహములచేత నాశ్రయింపబడియున్న, చరస్థిరద్విస్స్వభావ రాసులచేత, క్రమముగా, రజ్జుర్ముసలంనలశ్చ=రజ్జు, ముసల, నలములనెడు, ఆశ్రయజాన్ = ఆశ్రయమువలన బుట్టునట్టి, యోగాన్ = యోగములను, జగాద = చెప్పెను, "ఆశ్రయజానిహాహ" అనుపాఠమందు, ఇహ=ఈ ప్రకరణమందు, ఆహ= చెప్పెననియర్థము, పరాశరేణ = పరాశరులచేత, సదసద్యుతైః=శుభపాపగ్రహములతోఁగూడిన, కేంద్రైః=మూఁడుకేంద్రస్థానములచేత, దళాఖ్యౌ = దళసంజ్ఞంబులైన, స్రక్సర్పౌ= స్రగ్యోగ సర్పయోగములు, కథితౌ = చెప్పఁబడెను,

### సత్యోక్తములగు ఆశ్రయయోగత్రయవివరము.

తా. (1) సర్వగ్రహములు చరరాసులగు మేషకర్కాటక, తులామకరములందుండి స్థిరరాసులయందును, ద్విస్స్వభావరాసులు శూన్యములై యుండునెడలరజ్జుయోగమనబడును.

(2) సకలగ్రహములు స్థిరరాసులగు వృషభసింహ, వృశ్చిక, కుంభముల యందుండి చరరాసులును, ద్విస్స్వభావరాసులును, శూన్యంబులై యుండునెడలముసలయోగమనబడును.

(3) గ్రహములన్నియు, ద్విస్స్వభావరాసులగు మిథున, కన్యా, ధనుర్మీనములయందుండి అన్యరాసులు శూన్యములై యుండునెడల నలయోగ మనబడును. ఈమూఁడుయోగములవిషయమున కొందరు నాలుగు చరరాసులందును గ్రహములుండిన రజ్జుయోగమనియు, నాలుగు స్థిరరాసులయందును గ్రహములుండిన నాలుగు ద్విస్స్వభావ రాసులయందును గ్రహములుండెనేని నలయోగమనియు జెప్పుదురుగాని ఈ విషయమై "ఏకోద్వావాత్రయస్సర్వే సర్వైర్యుక్తా యదా గ్రహైః, చరయోగస్థగా రజ్జుశ్శిష్వాణాం జన్మదోభవేత్, స్థిరశ్చే న్ముసలం నామ మానినాం జన్మకృన్నృణాం, ద్విస్స్వభావో నలాఖ్యస్తు బలినాం పరికీర్తితః." అని గార్గి వచించియుండుటవలన ఈ రెండవ సారి చెప్పినది గ్రాహ్యంబు గాదు మరియు నీమార్గమునందు "చరరాశిగతై ర్గ్రహేంద్రై రజ్జుః, స్థిరరాశిగతై స్తథా ముసలం, ద్విశరీరగతైశ్చ యోగో నలసంజ్ఞో మునిభి రుద్దిష్టః" అని సత్యాచార్యులవారును. "ఉభయ స్థిరచరసంస్థై స్సర్వై ర్నల ముసల రజ్జవః క్రమశః" అని సారావళీకారకుడును వచించియున్నారు.

## పరాశరోక్తములగు దళయోగద్వయ వివరము.

మూడు కేంద్రములయందును శుభగ్రహములు చంద్రవ్యతిరిక్తములుగ నుండి ఒక కేంద్రమునందైనను లేకుండినచో దళాఖ్యమగు మాలాయోగమని చెప్పబడును.

(2) మూడు కేంద్రములందును పాపగ్రహములగు రవి, కుజ, శనులుండి, ఒక కేంద్రమునందైన శుభగ్రహము లేకుండునెడల దళాఖ్యమగు సర్పయోగమని చెప్పబడును.

ఈశ్లోకమున "కేంద్రైస్సద సద్భిస్తై ర్దళాఖ్యౌ" అనిసామాన్యముగ చెప్పబడియున్నను, శుక్ల కృష్ణపక్షములయందు చంద్రునికి పూర్ణత్వక్షీణత్వములు సంభవించుటవలనను, గ్రంథాంతర వచనాను సారముగ చంద్రవ్యతిరిక్త గ్రహములని అర్థముచేయబడినది అయిన కేంద్రత్రయము శుభగ్రహయుక్తమైయుండగ క్షీణచంద్రుడు నాల్గవవాడై కేంద్రమునందున్నయెడల స్రగ్యోగమునకును, కేంద్రత్రయము పాపగ్రహయుక్తమైయుండగ పూర్ణచంద్రుడు నాలవవాడై కేంద్రమునందున్న యెడలసర్పయోగమునకును భంగములేదని తెలియదగినది. కేంద్రములు నాల్గైయుండగా, మూడుకేంద్రములను మాత్రము గ్రహించి స్రగ్యోగమునకు కేంద్రత్రయమున శుభగ్రహత్రయమగు గురుబుధ శుక్రులుండవలెననియు, సర్పయోగమునకు కేంద్రత్రయమునపాపగ్రహత్రయమగు రవి కుజ శనైశ్చరులుండవలెననియు విశేషముగ చెప్పబడుటకు గారణమేమన "త్రికేంద్రగైర్యమారార్కై స్సర్పో దుఃఖిత జన్మదః, భోగిజన్మప్రదా మాలా తద్వజ్జీవ సితేందుజైః" అని గార్గియు, "కేంద్రేష్వపాపేషు సితజ్ఞ జీవైః త్రికేంద్రసంస్థైః కథయంతి మాలాం సర్పస్తు సౌమ్యైశ్చ యమారసూర్యై శ్శోకావహౌ ద్వౌ కథితౌ దళాఖ్యౌ" అని బాదరాయణులును వచించియుండుటచే పూర్వోక్తప్రకారముగ అర్థముచేయబడినది. ఈయోగములు ఇతరులును చెప్పియున్నారు. అయిన కొందరు గ్రంథకర్తలు విశదపరచిరి, మరికొందరు వదలుకొనిరి అయినను ముఖ్యులగు పరాశరులుచే చెప్పబడియుండుటచే వరాహ మిహిరాచార్యులును విశదముగా వచించియున్నారు. ఈవిషయమై "ద్వేబాధ యోగసంజ్ఞే భుజంగమాలే పరాశరేణోక్తే" అనిసారావళీకారకుడను వచించియున్నాడు.

### కొందఱు ఆశ్రయ యోగత్రయమును దళయోగద్వయమును చెప్పకపోవుటకు గారణము.

శ్లో. యోగా వ్రజంత్యాశ్రయజా స్సమత్వం
యవాబ్జ వజ్రాండజ గోలకాద్యైః
కేంద్రోపగ ప్రోక్తఫలా దలాఖ్యా
విత్యాహు రన్యే చ పృథక్ఫలా తే. 3

టీ. యవాబ్జవజ్రాండజగోలకాద్యైః=ఆకృతియోగములైన యవపద్మ, వజ్ర, విహంగ యోగములతోడను అదిశబ్దమువలన గదా శకటాదులతోడను సంఖ్యాయోగములైన గోళక,

శూల, కేదారములతోడను, ఆశ్రయజాః = ఆశ్రయజములైన, యోగాః = రజ్జు ముసలనల యోగములు, సమత్వం = సమానత్వమును, కేంద్రోపగ ప్రోక్తఫలా, కేంద్రోపగ = కేంద్రస్థానములను బొందియున్న గ్రహములకు, ప్రోక్త = చెప్పఁబడినఫలములే, ఫలాః = ఫలములుగాఁ గలిగి, దళాఖ్యౌ = దళనామకములైన, తౌ = ఆ స్రక్సర్పయోగములు, పృథక్ఫలా = భిన్నఫలములు, నేతి = కావని, అన్యే = కొందఱు, ఆహుః = చెప్పుదురు.

తా. ఆకృతి యోగములగు యవ, పద్మ, వజ్ర, విహంగ యోగములతోడను గదాశకటాది యోగములతోడను, సంఖ్యాయోగములగు గోళక, శూలకేదార యోగములతోడను, ఆశ్రయజములైన రజ్జుయోగము, ముసలయోగము, నలయోగములను మూడును సమానత్వమునొందు చుండుటచే కొందఱు యీ ఆశ్రయయోగములం జెప్పలేదు. అయినను రజ్జుమొదలగు యోగములకు వ్యతిరిక్తముగ నాశ్రయయోగములకు నవకాశముండక పోవుటచే ఈ రజ్జు మొదలుగాఁగల యోగములు వరాహ మిహిరాచార్యులచే జెప్పబడెను. కేంద్రస్థానముల నుబొందియున్న గ్రహములకు జెప్పబడిన ఫలములే ఈ మాల్యా సర్ప యోగములకు చెప్పబడియుండుట చేతను భిన్నఫలములేనియు గ్రాహ్యమగుటకు వీలులేక యుండుటచేతను కొందరు వచించరైరి మరియు "కేంద్ర త్రికోణేషు శుభాః ప్రశస్తాస్తే ష్వేవ పాపా నశుభప్రదాస్యుః" అని బృహజ్జాతక కారకుడగు వరాహ మిహిరాచార్యునిచే జెప్పబడిన రీతిగ కేంద్రస్థానముల బొందినట్టి శుభగ్రహములు శుభఫలముల నిచ్చుచుండెడు వారనియు, కేంద్రస్థానములను బొందినట్టి పాపగ్రహములు అశుభఫలముల నిచ్చెడు వారనియు జ్యోతిషగ్రంథ కర్తలనేకులు జెప్పియున్నారు ఆఫలములే ఇందుగనుపరుపబడియుండు దళాఖ్యములగు స్రక్సర్ప యోగములయందును జెప్పబడియుండుటచే నీయోగద్వయమును జెప్పుట అంతవిశేషముగాదని యెంచి కొందరు చెప్పలేదని నూహింపదగినది అయినను కేంద్రస్థానములను బొందియున్నట్టి గ్రహములు తమతమదశా కాలములయందు మాత్రమేఫలప్రదము లగునుగాని అన్నిదశలయందును ఫలములు గలిగించుట దుర్లభము నాభసాఖ్య యోగములందు చెప్పబడియుండు యీ యోగములు సర్వదశల యందును ఫలప్రదము లగుటచే పరాశరాద్యుక్త ప్రకారముగ వరాహ మిహిరాచార్యులచే దళాఖ్య యోగములగు నీ స్రక్సర్ప యోగములు రెండును చెప్పబడినవని తెలియదగినది.

## గదా, శకట, విహంగ, శృంగాటక, హలాఖ్యయోగములు.

శ్లో. ఆసన్న కేంద్ర భవన ద్వయగై ర్గదాఖ్య
స్తన్వ స్తగేషు శకటం విహగః ఖబంధ్వోః
శృంగాటకం నవమ పంచమ లగ్న సంస్థైః
లగ్నాన్యగై ర్హలమితి ప్రవదంతి తద్జ్ఞాః. 4

టీ. ఆసన్న = పరస్పరసమీపమందున్న, కేంద్రభవనద్వయ=రెండు కేంద్రస్థానము లను, గతైః=పొందియున్న సర్వగ్రహము లచేత, గదాఖ్యః = గదాహ్వయ యోగంబగును, తన్వస్తగేషు=అన్ని గ్రహంబులును లగ్నసప్తమముల యందుండగా, శకటం=శకటయోగము, ఖబంధ్వోః=దశమచతుర్థము లయందుఅన్ని గ్రహంబులుండెనేని, విహగః=విహగయోగము.నవమ పంచమలగ్న సంస్థైః = నవమపంచమ లగ్నములయందు అన్ని గ్రహంబు లుండెనేని, శృంగాటకం = శృంగాటకయోగము, లగ్నాన్యగైః = లగ్నముగాకతక్కిన స్థానములయందు యథా సంభవముగా అన్ని గ్రహంబులు పరస్పరత్రికోణస్థానము లయందుండెనేని, హలం = హల యోగము, ఇతి=ఈప్రకారము, తద్జ్ఞాః=హోరాశాస్త్రజ్ఞులు, ప్రవదంతి = చెప్పుదురు

తా. గదాయోగము:—పరస్పర సమీపమునందుండు కేంద్రస్థానద్వయమున గ్రహములన్నియునుండెనేని గదాయోగమనబడును.

ఈయోగము 4 విధములు.

(1) సర్వగ్రహములు పరస్పరాసన్న కేంద్రస్థానములగు లగ్నచతుర్థములందుండుట
(2) సకలగ్రహములు చతుర్థ సప్తమములయందుండుట.
(3) సర్వగ్రహములు సప్తమ, దశమములయందుండుట.
(4) సకలగ్రహములు దశమ, లగ్నములయందుండుట.

ఈ నాల్గువిధములును గదాయోగములనబడును.

శకటయోగము:—గ్రహములన్నియు లగ్నసప్తమములయందుండు నెడల శకటయోగము.

విహంగయోగము:—అన్ని గ్రహములు చతుర్థదశమములందుండెనేని విహంగయోగము.

శృంగాటకయోగము:—గ్రహములన్నియు, నవమ, పంచమ, లగ్నములయందుండు నెడల శృంగాటకయోగ మనబడును.

హలయోగము:— సకలగ్రహములు లగ్నత్రికోణముగాక, తక్కిన త్రికోణముల యందు యథాసంభవముగానుండు నెడల హలయోగమనబడును.

ఇది 3 విధములు:— (1) ద్వితీయ, షష్ట, దశమములందుండుట. (2) తృతీయ, సప్తమ, ఏకాదశములయందుండుట. (3) చతుర్థ, అష్టమ, ద్వాదశములయందుండుట.

ఈ యోగముల విషయమై సారావళీకారకుడు, "కేంద్రప్రత్యాసన్నైర్భైః సద్య యాగ్రైర్గదా నామ" అని గదాయోగమును, "హోరాస్తగతైశ్శకటం" అని శకటయోగమును, "చతుర్థదశమాశ్రితైర్భవేద్విహగః" అని విహంగయోగమును, "ఉదయాన్యగైస్త్రికోణైర్హల ఇతి శృంగాటకంసలగ్నైః" అని హల, శృంగాటకయోగములను జెప్పియున్నారు.

## వజ్ర, యవ, కమల, వాపీయోగములు.

శ్లో. శకటాండజవ చ్ఛుభాశుభై ర్వజ్రం తద్విపరీతగై ర్యవః
కమలంతు విమిశ్ర సంస్థితై ర్వాపీ తద్యది కేంద్ర బాహ్యతః. 5

టీ. శకటాండజ వచ్ఛుభాశుభైః=అనఁగా పూర్వశ్లోకమందు శకటయోగమునకు ఏ స్థానములయందు గ్రహంబు లుండవలయునని చెప్పఁబడెనో ఆ లగ్నసప్తమములయందు శుభగ్రహంబులును విహగయోగమునకు ఏస్థానములయందు గ్రహములుండవలయునని చెప్పఁబడెనో ఆదశమచతుర్థ స్థానములయందు పాపగ్రహంబులునుయుండి తక్కినస్థానములయందు గ్రహములు లేకుండెనేని, వజ్రం=వజ్రయోగమగును, తద్విపరీతస్థైర్యవః = అనఁగా ఈవజ్రయోగమునకుఁ జెప్పఁబడిన క్రమమునకువ్యత్యాసముగా లగ్నసప్తమములయందు పాపగ్రహములును దశమ చతుర్థములయందు శుభగ్రహంబులునుయుండి తక్కిన స్థానములయందు గ్రహంబులు లేకుండెనేని, యవః=యవయోగంబగును, విమిశ్రసంస్థితైః=ఈ నాలుగు కేంద్రములయందును శుభపాపగ్రహములుకలిసియుండినయెడల,కమలం= కమలయోగమగును, తత్=ఆ కమలయోగమునకుఁ జెప్పఁబడినగ్రహస్థితి, కేంద్రబాహ్యతోయది = కేంద్రములకుమీది రాసులైన పణఫరములయందైనను ఆపోక్లిమములయందైనను అయ్యెనేని, వాపీ=వాపీయోగమగును.

తా. వజ్రయోగము:— పూర్వశ్లోకమున, "కేన్ద్రస్థగేషు శకటం విహగః ఖబంధ్వోః" అని జెప్పబడియుండు శకటయోగమునకు ఏస్థానములందు గ్రహము లుండవలయునని యున్నదో, ఆస్థానములగు లగ్న, సప్తమములయందు, శుభగ్రహములుండి, విహగయోగమునకు ఏస్థానములందు గ్రహములుండవలయునని యున్నదో, ఆస్థానములగు చతుర్థదశమములయందు పాపగ్రహము లుండి, యితరస్థానములగు 2, 3, 5, 6, 8, 9, 11, 12, యిండ్లయందు గ్రహములులేకుండునెడల వజ్రయోగమనబడును. ఇందులకు "లగ్నాస్తమగైస్సౌమ్యైః పాపైస్సుఖకర్మగైర్భవతివజ్రం" అని సారావళీకారకుడు వచించియున్నారు.

యవయోగము:—పైజెప్పబడిన వజ్రయోగమునకు వ్యత్యస్తముగ అనగా, శుభగ్రహములుండఁదలసిన స్థానములగు లగ్నసప్తమములయందు పాపగ్రహములును,పాపగ్రహములుండవలసిన స్థానములగు చతుర్థదశమములయందు శుభగ్రహములును యుండి తక్కినస్థానములగు, 2, 3, 5, 6, 8, 9, 11, 12, యిండ్లయందు గ్రహములు లేకుండునెడల యవయోగమనబడును

కమలయోగము:— సౌమ్యపాపగ్రహములు నాలుగు కేంద్రములందును మిశ్రముగనుండి అనగాశుభగ్రహములుండవలసిన స్థానములగు లగ్నసప్తమములలో నొకస్థానమున శుభగ్రహములును మఱియొక స్థానమున అశుభగ్రహములును, పాపగ్రహములుండవలసిన స్థానములగు చతుర్థదశమములలో నొకస్థానమున శుభగ్రహములును, మరియొకస్థానమున అశుభగ్రహములును యుండి తక్కిన స్థానములగు 2, 3, 5, 6, 8, 9, 11, 12, యిండ్లయందు గ్రహములులేకుండునెడల కమలయోగమనబడును.

వాపీయోగము:—కమలయోగమునకు జెప్పబడియుండు గ్రహస్థితి కేంద్రస్థానములందు గాక, పణఫరస్థానములయందైనను, ఆపోక్లిమ స్థానములయందైనను, అగునెడల, వాపీయోగ మనబడును. ఈయోగము ద్వివిధము.

(1) శుభాశుభ గ్రహములు మిశ్రములై పణఫరస్థానములగు ద్వితీయాష్ట మైకాదశ పంచమము లందుండి తక్కినచోట్ల గ్రహములు లేకుండుట

(2) శుభాశుభ గ్రహములు మిశ్రములై ఆపోక్లి మస్థానములగు తృతీయ నవమ ద్వాదశ షష్ఠములందుండి తక్కినచోట్ల గ్రహములు లేకుండుట.

ఇట్లుండు యోగద్వయము వాపీయోగము లనబడుచున్నవి.

## వజ్ర యవ యోగముల సంభవా సంభవములు.

శ్లో. పూర్వ శాస్త్రానుసారేణ మయా వజ్రాదయః కృతాః
చతుర్థే భవనే సూర్యాత్ జ్ఞ సితౌ భవతః కథమ్. 6

టీ పూర్వశాస్త్రానుసారేణ = మయయవనాద్యుక్త పూర్వశాస్త్రానుసారముగా, మయా=నాచేత, వజ్రాదయః = వజ్రయవాదియోగములు, కృతాః=రచియింపఁబడెను, సూర్యాత్ = సూర్యునికి, చతుర్థభవనే = నాలవరాశియందు, జ్ఞసితౌ = బుధశుక్రులు, కథం=ఎట్లు, భవతః = ఉందురు.

తా. పూర్వ శ్లోకమున జెప్పబడియుండు వజ్రయవాది యోగముల మయ యవనాద్యుక్త పూర్వశాస్త్రాను సారముగ నాచేత జెప్పబడెను గాని, ఆ యోగములు అసంభవములని యేర్పడుచున్నది ఎట్లన, వజ్రయోగమున శుభగ్రహములకును, అశుభగ్రహములకును పరస్పరచతుర్థస్థానస్థితి చెప్పబడియుండుటచే రవికి చతుర్థస్థానమున సౌమ్యగ్రహములగు బుధశుక్రులుండనియెడల వజ్రయోగము అసంభవమగు మన్నది. ఇదియుగాక బుధశుక్రుల ఉదయాస్తమయ సమయములు, సూర్యోదయ మందైనను, సూర్యాస్తమయమునందైనను, మధ్యాహ్నమునందైనను, నిశీథ కాలమునందైనగాని యేర్పడుటలేదు, గనుక రవికి చతుర్థస్థానమున బుధశుక్రుల స్థితియొక్క ప్పటను గలుగదు కావున నీవజ్రయవాది యోగములు అసంభవములని స్థిరముగా చెప్పబడియున్నది. అయిన యీ యోగములు ఇతర మన్వంతరములయందు సంభవించి యుండుటచేత పూర్వ శాస్త్రకర్తలచే జెప్పబడియున్నదని యూహింపదగును.

## యూప, శర, శక్తి, దండయోగములు.

శ్లో. కంటకాది ప్రవృత్తైస్తు చతుర్గృహ గతైర్గ్రహైః
యూపేషు శక్తి దండాఖ్యా హోరాద్యైః కంటకైః క్రమాత్. 7

టీ. కంటక=కేంద్రస్థానమే, ఆది=మొదలుగా, ప్రవృత్తైః=ఎడతెగకయున్న, చతుర్గృహగతైః = నాలుగురాసులను బొందియున్న, గ్రహైః = సర్వగ్రహములచేతను, హోరాద్యైః=లగ్నము మొదలుగాగల, కంటకైః = కేంద్రములచేతను, క్రమాత్=వరుసగా, యూపేషుశక్తిదండాఖ్యాః=యూప శర శక్తి దండము లనెడు నాలుగుయోగంబులగును.

తా. కేంద్రస్థానము లాదిగా నాల్గురాసులం బొందియున్నట్టి సర్వగ్రహముల వలనను, లగ్నాది కేంద్రములవలనను, యూప, శర, శక్తి, దండములనెడు నాల్గుయోగములు గలుగును.

1. యూపయోగము:—రవ్యాది సప్తగ్రహంబులు, లగ్న కేంద్రము మొదలు వరుసగా నాలుగు రాసులయందనగా లగ్న, ద్వితీయ, తృతీయ, చతుర్థములయం దుండు నెడల యూపయోగము.

2 శరయోగము:—చతుర్థ కేంద్రమాదిగాగల నాల్గు రాసులయం దనగా, చతుర్థ, పంచమ, షష్ట, సప్తమ స్థానములయందు రవ్యాది సప్తగ్రహంబులున్న యెడల శరయోగము.

3 శక్తియోగము:—సప్తమ కేంద్రాదిగాగల నాల్గు రాసులయం దనగా, సప్తమ, అష్టమ, నవమ, దశమ స్థానములయందు రవ్యాది సప్తగ్రహంబు లుండు నెడల శక్తియోగము.

4. దండయోగము:—దశమ కేంద్రాదిగాగల నాలుగు రాసులయం దనగా, దశమము, ఏకాదశము, ద్వాదశము, లగ్నములయందు సూర్యాది సప్తగ్రహము లుండు నెడల దండయోగము.

ఈ నాలుగు యోగముల విషయమై శ్లో॥ లగ్నాది కంటకేభ్యశ్చ తుర్గృహే వస్థితై గ్రహైర్యోగాః, యూప శర శక్తి దండా స్సత్యాభార్య ప్రియానిత్యమ్. అని సారావళి కారకుడు వచించియున్నాడు.

## నౌ, కూట, ఛత్ర, చాపార్థచంద్రాఖ్య బులను 5 యోగములు.

శ్లో. నౌకూట చ్ఛత్రిచాపాని తద్వ త్సప్తర్క్ష సంస్థితైః
అర్ధచంద్రస్తు నావాద్యైః ప్రోక్తా దన్యర్క్ష సంస్థితైః. 8

టీ. తద్వత్=పూర్వ శ్లోకోక్తప్రకారముగా లగ్న చతుర్థ సప్తమ దశమ కేంద్రములు మొదలు, సప్తర్క్ష సంస్థితైః=ఏడేసి రాసులయందుండెడు సర్వగ్రహములచేత, నౌకూట చ్ఛత్రచాపాని=నౌకూట ఛత్రచాపాఖ్యంబులగు నాలుగు యోగంబులగును. నావాద్యైః=ఈనావాయోగాదులచేత, ప్రోక్తాత్=చెప్పఁబడిన కేంద్రాది క్రమమునకంటె, అన్యర్క్ష సంస్థితైః=ఇతరస్థాన పణఫర రాశ్యాదిగానైనను ఆపోక్లిమ రాశ్యాదిగనైనను 7 రాసులయందున్న సర్వగ్రహములచేత, అర్ధచంద్రః=అర్ధచంద్ర యోగమగును.

తా. పూర్వశ్లోకమున జెప్పబడిన ప్రకారముగ కేంద్రస్థానము లాదిగాగల ఏడేసి రాసులయందుండెడు రవ్యాది సప్తగ్రహములచేత నౌ, కూట, ఛత్ర, చాపాఖ్యములను నాలుగు యోగము లేర్పడుచున్నవి.

1. నౌయోగము:—గ్రహములన్నియు అవిచ్ఛిన్నములై లగ్న ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ట, సప్తమస్థానములం దుండు నెడల నౌయోగ మనదగినది.

2. కూటయోగము:—సర్వగ్రహములు అవిచ్ఛిన్నములై చతుర్థ, పంచమ, షష్ట, సప్తమ, అష్టమ, నవమ, దశమస్థానములం దుండు నెడల కూటయోగ మనదగినది.

3. ఛత్రయోగము:—సకలగ్రహములు అవిచ్ఛిన్నములై సప్తమ, అష్టమ, నవమ, దశమ, ఏకాదశ, ద్వాదశ, లగ్నము లనునట్టి స్థానములందుండు నెడల ఛత్రయోగ మనదగినది.

4. ధను (చాప) యోగము:—గ్రహములన్నియు అవిచ్ఛిన్నములై దశమ, ఏకాదశ, ద్వాదశ, లగ్న ద్వితీయ, తృతీయ, చతుర్థములందుండునెడల ధనుర్యోగ మనదగినది.

ఈ నాలుగుయోగముల విషయమై. శ్లో. హోరాది కంటకేభ్య స్సప్తగ్రహైః క్రమేణ యోగాస్స్యుః, నౌచ్ఛత్రకూట కార్ముకనిర్దేశాః పూర్వయవనేంద్రైః. అను సారావళీ వచనము గానబడుచున్నది.

5 అర్ధచంద్రయోగము:—పై జెప్పబడిన చతుర్విధ యోగములగు నౌ,కూట, ఛత్ర, చాపాఖ్యయోగములకు జెప్పబడిన కేంద్రస్థానము లాదిగాగల క్రమమునగాక, తదితరములగు పణఫర రాశ్యాదిగానైనను, ఆపోక్లిమ రాశ్యాదిగానైనను, ఏడురాసులయందు రవ్యాది సప్తగ్రహములు అవిచ్ఛిన్నములై యుండునెడల అర్ధచంద్రయోగ మనదగినది.

ఈ యోగము 8 విధములు:—

1. గ్రహములన్నియు అవిచ్ఛిన్నములై ద్వితీయాది అష్టమాంతమువరకు అనగా 2, 3, 4, 5, 6, 7, 8, యిండ్లయందుండుట

2. సర్వగ్రహముల విచ్ఛిన్నములై తృతీయాది నవమాంత స్థానములందనగా 3, 4, 5, 6, 7, 8, 9, యిండ్లయందుండుట.

3. సకలగ్రహముల విచ్ఛిన్నములై పంచమాద్యేకాదశాంత స్థానములందుండుట. అనగా, 5, 6, 7, 8, 9, 10, 11, స్థానములందుండుట.

4. గ్రహములన్నియు షష్టాది ద్వాదశాంతస్థానములందు అనగా, 6, 7, 8, 9, 10, 11, 12, స్థానములందుండుట.

5 సర్వగ్రహములు అష్టమాది ద్వితీయాంతస్థానములందు అనగా 8, 9, 10, 11, 12, 1, 2, స్థానములందుండుట.

6. సకలగ్రహములు నవమాది తృతీయాంతస్థానములందనగా 9, 10, 11, 12, 1, 2, 3, యిండ్లయందుండుట

7. గ్రహములన్నియు ఏకాదశాది పంచమాంత స్థానములందనగా 11, 12, 1, 2, 3, 4, 5, యిండ్లయందుండుట.

8. సర్వగ్రహములు ద్వాదశాది షష్టాంత స్థానములందనగా 12, 1, 2, 3, 4, 5, 6, యిండ్లయందుండుట.

ఇట్లు జూపిన యెనిమిదివిధముల యోగములు అర్ధచంద్ర యోగము లనబడును. ఇందులకు "శ్లో. సప్తభిర్గ్రహైంద్రైః కేంద్రాదన్యత్ర కీర్తితోర్ధశశీ" అని సారావళీ కారక వచనము గానబడుచున్నది.

## సముద్రచక్ర యోగములు.

శ్లో. ఏకాంతరగతై రర్థాత్సముద్ర షడ్గ్రహాశ్రితైః.
విలగ్నాదిస్థితై శ్చక్ర మిత్యాకృతిజసంగ్రహః. 9

టీ. అర్థాత్ = ద్వితీయస్థానము మొదలుకొని, ఏకాంతరగతైః = ఒకరాశినివిడిచి యొకరాశియందున్న, షడ్గృహాశ్రితైః = ఆరు రాశులనుబొందిన సకల గ్రహములచేత, సముద్రః = సముద్రయోగమగును, విలగ్నాదిస్థితైః = లగ్నము మొదలుకొని యొకరాశినివిడిచి యొకరాశియందున్న గ్రహములచేత, చక్రం=చక్రయోగమౌను, ఆకృతిజ = ఆకృతియోగంబులయొక్క, సంగ్రహః = సంగ్రహము, ఇతి ఈప్రకారముగా చెప్పబడెను.

తా. సముద్రయోగము:—ద్వితీయ స్థానము మొదలు ఒకరాశిని వదలి యొకరాశి యందుండునట్టి ఆరురాసులనుబొందియున్న సకలగ్రహములచేత ననగా ద్వితీయస్థానము మొదలు సరియిండ్లగు. 2, 4, 6, 8, 10, 12, యీస్థానములయందు గ్రహములన్నియు నుండినయెడల సముద్రయోగమనదగినది ఇందుకు "రాశ్యంతరితై రర్థాత్షడ్భవనగతై గ్ఘవేజ్జలధిః" అను గ్రంథాంతర వచనమున్నది.

చక్రయోగము:—లగ్నము మొదలు ఒకరాశినివిడిచి యొకరాశియందుండు నట్టిఆరు రాసులను బొందియున్న సకలగ్రహములచే ననగా లగ్నము మొదలు బేసిరాసులగు 1, 3, 5, 7, 9, 11, యీస్థానములందు గ్రహములన్నియు నుండునెడల చక్రయోగమనదగినది. ఇందులకు "రాశ్యంతరతైర్లగ్నాత్షడ్భవనగతైర్భవేచ్చక్రం" అని గ్రంథాంతర వచనము గానబడుచున్నది. ఈనాభసయోగాధ్యాయమున 4-వ శ్లోకమగు "ఆసన్న కేంద్ర భవనద్వయగైః" అను శ్లోకము మొదలు, 8వదియగు యీశ్లోకమువరకుగలశ్లోకములతో జెప్పబడియుండు

| | |
|---|---|
| (1) గదాయోగము. | (11) శరయోగము. |
| (2) శకటయోగము. | (12) శక్తియోగము. |
| (3) విహగయోగము. | (13) దండయోగము. |
| (4) శృంగాటకయోగము. | (14) నౌయోగము. |
| (5) హలయోగము. | (15) కూటయోగము. |
| (6) వజ్రయోగము. | (16) ఛత్రయోగము. |
| (7) యవయోగము. | (17) చాపయోగము. |
| (8) కమలయోగము. | (18) అర్ధచంద్రయోగము. |
| (9) వాపీయోగము. | (19) సముద్రయోగము. |
| (10) యూపయోగము. | (20) చక్రయోగము. |

లను యిరువది యోగములును ఆకృతియోగ సంగ్రహమని జెప్పబడినది.

## సంఖ్యాయోగములు.

శ్లో. సంఖ్యాయోగా స్సప్తసప్తర్క్ష సంస్థై
రేకాపాయా ద్వల్లకీ దామనీచ
పాశః కేదారశ్చ శూలో యుగంచ
గోళ శ్చాన్యాః పూర్వ ముక్తా న్విహాయ. 10

టీ. పూర్వం=ముందు, ఉక్తాః = చెప్పబడిన, అశ్రయాః = ఆశ్రయ దళాకృతియోగములను, విహాయ = వదలి, సప్తర్క్ష సంస్థైః = ఏడు రాసులయందున్న ఏడు గ్రహములచేత, ఏకాపాయాత్, ఒక్కొకరాశి తగ్గుటవలన, (క్రమముగా) వల్లకీ = వల్లకీ యోగము, దామనీ = దామనయోగము, పాశః = పాశయోగము, కేదారశ్చ = కేదారయోగము, శూలః = శూలయోగము, యుగంచ = యుగయోగము, గోళశ్చ = గోళయోగములనియూ, సప్త = ఏడు, సంఖ్యాయోగః = సంఖ్యాయోగములు, (అగుచున్నవి.)

తా. ఏడురాసుల యందుండునట్టి ఏడు గ్రహములచేతను, ఒక్కొకరాశి తగ్గుటవలనను క్రమముగ 1, వల్లకీ 2, దామనీ, 3, పాశ. 4, కేదార. 5, శూల 6, యుగ, 7, గోళ యోగములను ఏడుయోగములు ఏర్పడుచున్నవి.

1. వల్లకీయోగము:—సకల గ్రహములు ద్వాదశరాశి చక్రమున నెచ్చటనైనను 7 రాసులయందుండు నెడల వల్లకీ యోగమనదగినది.

2. దామనీ యోగము:—సర్వగ్రహములు ద్వాదశరాశి చక్రమునసెచ్చట నైనను 6 రాసుల యందుండు నెడల దామనీ యోగమనదగినది.

3. పాశయోగము:—గ్రహములన్నియు ద్వాదశరాశి చక్రమున నెచ్చటనైనను 5 రాసుల యందుండు నెడల పాశయోగమనదగినది.

4 కేదారయోగము:—సకల గ్రహములు ద్వాదశ రాసులలో నెచ్చటనైనను 4 రాసులలో నుండు నెడల కేదార యోగమన దగినది.

5. శూలయోగము:—సప్తగ్రహములు ద్వాదశ రాసులలో నెచ్చటనైనను 3 రాసులయందుండు నెడల శూల యోగమనదగినది.

6 యుగయోగము:—రవ్యాది సప్తగ్రహములు, మేషాదిద్వాదశ రాసులయం దెచ్చటనైనను రెండు రాసులయందుండు నెడల యుగ యోగమునదగినది.

7. గోళయోగము:—సూర్యాది సప్తగ్రహములు, పండ్రెండు రాసులలో నెచ్చటనైనను ఒకరాశియందే యుండు నెడల గోళయోగమనదగినది.

పూర్వము చెప్పబడిన ఆశ్రయ దళాకృతియోగములను విడిచినచో సంఖ్యాయోగము లనబడుననగా బూర్వోక్తములగు కేంద్రాది స్థాన నియమముగల ఆశ్రయ, దళాకృతియోగములు సంఖ్యాయోగ సామ్యమును బొందునెడల ఆశ్రయదళాకృతియోగములే గ్రాహ్యములగును గానిసంఖ్యా యోగము గ్రాహ్యము కానేరదని తెలియదగినది.

—ఆశ్రయ దళ యోగ జనితులకుగలుగు ఫలములు.—

శ్లో. ఈర్ష్యుర్విదేశనిరతో ధ్వరుచిశ్చ రజ్వా
మానీ ధనీచ ముసలే బహుకృత్యసక్తః,
వ్యంగస్థిరాఢ్య నిపుణా నలజాః స్రగుత్థో
భోగాన్వితో భుజగజో బహుదుఃఖభాక్స్యాత్. 11

టీ. రజ్జ్వాం = రజ్జుయోగమందు బుట్టినవాఁడు, ఊర్జ్యశ్చ = పరశ్రేయస్సునోర్వలేని వాఁడును, విదేశనిరతః = దేశాంతర వాసాసక్తుఁడును, అధ్వరుచిః = త్రోవనడచుట యందు ప్రీతిగలవాఁడును, స్యాత్ = అగును, ముసలే = ముసలయోగమందు బుట్టినవాఁడు, మానీ = గర్వితుఁడును, ధనీ = ధనికుఁడును, బహుకృత్యసక్తః=మిక్కిలి కార్యారంభశీలుండునునగును, నలజాః = నలయోగమందుఁ బుట్టినవారు, వ్యంగ= అంగహీనులును, స్థిర = దృఢనిశ్చయులును, ఆఢ్య = ధనవంతులును, నిపుణాః=సూక్ష్మదృష్టులును అగుదురు, స్రగుత్థః = స్రగ్యోగమందుఁ బుట్టినవాఁడు, భోగాన్వితః = సుఖములతోఁగూడిన వాఁడగును, భుజగజః = సర్పయోగమందుఁ బుట్టినవాఁడు, బహుదుఃఖభాక్ = నానావిధదుఃఖముల ననుభవించు వాఁడగును.

తా. ఆశ్రయయోగ త్రయమగు రజ్జు, ముసల, నలయోగముల బుట్టినవారికి గలుగు ఫలములు.

1. రజ్జుయోగమున బుట్టినవాడు పరుల శ్రేయమును జూచి యోర్వజాలనివాడును, పర దేశవాసమునం దాసక్తి గలవాడును, దారి నడచుటయం దాశగలవాడును, అగును. ఇందులకు, శ్లో. "అటనప్రియా స్సురూపాః పరదేశే ష్వర్థభాగినో మనుజాః, క్రూరాః ఖలస్వభావా రజ్జు ప్రభవా స్సదాకథితాః." అను సారావళీవచనము. ఉదాహరణముగా నున్నది. ఇందువలన యీ యోగమున బుట్టినవాఁడు సౌందర్యవంతుడగునని నూహింపదగినది.

2. ముసలయోగమున బుట్టినవాడు ధనికుడును, గర్వముగలవాడును, అనేక కార్యములు చేయ నారంభించువాడును, అభిమానము గలవాడును అగును. ఇందులకు, శ్లో. "మాన ధనజ్ఞానయుతాః, కర్మోద్యుక్తా నృపప్రియాః, ఖ్యాతాః స్థిరచిత్తాముస లోత్థాభవంతి శూరా స్సదాపురుషాః." అను సారావళీ వచనము గానబడు చున్నది.

3. నలయోగమున బుట్టినవాడు అంగహీనుడును, దృఢనిశ్చయుడును, ధనవంతుండును, సూక్ష్మబుద్ధిగలవాడును, అగును ఇందులకు సారావళీకారకుడు. "ఊనాతిరిక్త దేహా ధన సంచయ భాగినోతి నిపుణాశ్చ బంధుహితాశ్చ సురూపానలయోగే సంప్రసూయంతే" అని వచించియున్నాడు.

## దళయోగద్వయమగు స్రగ్ సర్ప యోగములయందు బుట్టినవారికి గలుగు ఫలములు.

1. స్రగ్యోగమునందు బుట్టినవాడు సర్వవిధములగు భోగముల ననుభవించువాడగు చున్నాడు. ఈ విషయమై. "శ్లో. నిత్యం సుఖప్రధానా వాహన వస్త్రార్థ భోగసంపన్నాః, కాంతాస్సు బహుస్త్రీ కామాలాయాం సంప్రసూతాస్స్యుః." అని సారావళీకారకుడు వచించియున్నాడు.

2. సర్పయోగమున బుట్టినటువంటివాడు నానావిధములగు దుఃఖము లనుభవించువాడుగ నగును. ఇందులకు, "విషమాః క్రూర నిః స్వానిత్యం దుఃఖార్దితా స్సుదీనాశ్చ పరభుక్తా స్సర్పే జాతాభవంతి నరాః." అని కొందరు గ్రంధకర్తలు వచించియున్నారు

### ఆశ్రయయోగముల ఫలితాఫలితములు.

శ్లో. ఆశ్రయోక్తాస్తు విఫలాంభవంత్యన్యైర్యదిమిశ్రితాః
మిశ్రాయైస్తే ఫలం దద్యు రమిశ్రాస్స్వ ఫలప్రదాః. 12

టీ. ఆశ్రయోక్తాః = ఆశ్రయాభిధానముచేఁ జెప్పఁబడిన యోగములు అనఁగా ఆశ్రయయోగములు, అన్యవిమిశ్రితాః = ఇతరములైన గదాది యోగములతోఁ గూడినవయ్యె నేని, విఫలాః = నిష్ఫలంబులు, భవంతి = అగుచున్నవి, అపుడు ఆశ్రియయోగములు, యైః= ఏయోగములతో, మిశ్రాః = కూడినవగుచున్నవో, తే = ఆయోగములు, ఫలం = ఫలమును దద్యుః = ఇచ్చును. అమిశ్రాః = ఆశ్రియయోగము లితరయోగములతోఁ గూడినవి గాక యుండెనేని, స్వఫలప్రదాః = తమ ఆశ్రియయోగ ఫలములనే యిచ్చునవియగును.

తా. ఆశ్రయయోగములు ఇతరములైన గదాదియోగములతో గూడిన వయ్యె నేని నిష్ఫలము లగుచున్నవి. అట్టికాలమున ఆశ్రయయోగములు ఏ యోగములతో మిశ్రము లగుచున్నవో ఆయోగముల ఫలితములను మాత్రము గలుగజేయును. ఆశ్రయయోగములు సంకరములు లేక యుండగా ఆ యోగములయందు బుట్టినవారు మాత్రము సౌఖ్యము, లాభము మొదలగు ఆశ్రయయోగ ఫలితములు గలవారగుదురు.

### గదా, శకట, విహగ, శృంగాటక, హలయోగ సంభవుల స్వభావము.

శ్లో. యష్టార్థ భాక్సతత మర్థరుచి ర్గదాయాం
తద్వృత్తి భుక్ఛకట జస్సరుజః కుదారః
దూతోటనః కలహ కృద్విహగే ప్రదిష్టః
శృంగాటకే చిరసుఖీ కృషికృద్ధలాఖ్యే. 13

టీ. గదాయాం = గదాయోగమందుఁ బుట్టినవాఁడు, యష్టా = యజనశీలుఁడును, అర్థభాక్ = ధనవంతుఁడును, సతతం = ఎల్లప్పుడు, అర్థరుచిః = ధనార్జనోద్యమ శీలుఁడు నగును శకటజః = శకటయోగమునఁ బుట్టినవాఁడు, తద్వృత్తిభుక్ = ఆ శకటవృత్తిచేఁ జీవించు వాఁడును, సరుజః = వ్యాధిపీడితుఁడును, కుదారః = కుత్సితురాలైన భార్యగల వాఁడును నగును. విహగే = విహగయోగమునందు బుట్టినవాడు. దూతః= చెప్పి పంపినమాటలనుఁ జెప్పుచుండువాఁడును, అటనః = స్వేచ్ఛగాఁ దిరిగెడువాఁడును, కలహకృత్ = కలహశీలుఁడును నగునని, ప్రదిష్టః = చెప్పఁబడెను. శృంగాటకే = శృంగాటక యోగ సంభూతుఁడు, చిరసుఖీ = అంత్యవయస్సున సుఖముగలవాఁడగును. హలాఖ్యే = హలయోగమునఁబుట్టినవాఁడు కృషికృత్ = కృషీవలుండగును.

తా. 1. గదాయోగమున బుట్టినవాడు ధనాధిపుడును. యజనశీలుడును, ధనార్జనోద్యమము సేయువాడునునగును. ఇదియుగాక నీయోగమున బుట్టినవాడు. శ్లో. "సతతం మానార్థ

పరాయజ్ఞాన శ్చాస్త్రయోగ కుశలాశ్చ ధనకనకరత్న సంపత్సంయుక్తా మానవా గదాయా తు" అను గ్రంథాంతర వచనానుగుణ్యములగు స్వభావములను గలిగియుండును.

2. శకటయోగమున బుట్టినవాడు శకటాది సాధనముల మూలముగ జీవించువాడును సర్వదా వ్యాధిపీడితుడును, కుత్సితురాలగు భార్యను గలవాడును నగును విశేషించి. శ్లో "రోగార్తాః కుకళత్రా మూర్ఖా శ్శకటానుజీవినో నిస్స్వాశ్చ స్వజనైర్మిత్రైర్హీనా శ్శకటే జాతాభవంతి నరాః." అను వచనానుగుణ్యముగ నీ యోగమున బుట్టినవాడు. మూర్ఖుడుగ నుండునని యూహింపదగియున్నది.

3. విహగయోగమున బుట్టినవాడు దూతకార్యమున నొప్పినవాడనగా ఒకరు చెప్పి పంపిన వార్తలను జెప్పుచుండువాడును తన యిష్టానుసారము తిరుగులాడుచుండు వాడను కలహామునం దాసక్తిగలవాడు నగును.

4 శృంగాటకయోగమున బుట్టినవాడు అంత్యకాలమున సుఖించునట్టివాడగును. మరి కొందరు. "చిరసుఖీ" యనుటకు నిరంతరసుఖియని యర్థము జేయుచురుగాని "లగ్నపంచమ ధర్మస్థై ర్గ్రహైశ్శృంగాటకోమతః, వయోంతే సుఖీనాంజన్మ తత్రస్యాత్కటుభాషిణాం." అను గార్గివచనము ననుసరించి యుండినందున రెండవయర్థము గ్రాహ్యము గాదు మరియు, కొందరు. శ్లో. "ప్రియ కలహ సమరసాహస సుఖినోన్నృపతేః ప్రియా స్సుభగకాంతాః, అధ్యాయువతి ద్వేష్యా శ్శృంగాటక సంభవా మనుజాః." అను శ్లోకానుగుణ్యములగు గుణములు శృంగాటక యోగసంభవులకు గలుగు-నియు జెప్పుదురు.

5. హలయోగమున బుట్టినవాడు కృషిమూలకమగు జీవనము గలవాడగును ఇందును గురించి సారావళీకారకుడు. శ్లో. "బహ్వాశినోదంద్రాః కృషీవలా దుఃఖితాశ్చ, సోద్వేగాః బంధుసుహృత్స్వం త్యక్తాః ప్రేష్యాహాల సంజ్ఞితే పురుషాః." అని వచించియుండుటచే హాల యోగమున బుట్టినవాడు తిండిపోతుతనము, దరిద్రము మొదలగు స్వభావములు గలవాడగు నని యూహింపదగియున్నది.

## ―― వజ్రయవ పద్మవాపీయోగ సంభవుల స్వభావములు. ――

శ్లో. వజ్రేంత్య పూర్వసుఖిత స్సుభగోతిశూరో
వీర్యాన్వితో ప్యథ యవే సుఖితో వయోంతః
విఖ్యాత కీర్త్య మిత సౌఖ్య గుణశ్చ పద్మే
వాప్యాం తను స్థిరసుఖీ నిధికృన్న దాతా. 14

టీ. వజ్రే = వజ్రయోగమునంబుట్టినవాఁడు, అంత్యపూర్వసుఖితః=వార్ధక బాల్యముల యందు సుఖముగలవాఁడును, అనఁగా బాల్యమందు సుఖియై యౌవనమందు దుఃఖియై మఱల ముసలితనమందు సుఖియగుననుట, సుభగః = సర్వజనమనోహరుఁడును, అతిశూరః= మిక్కిలి శౌర్యవంతుఁడును అగును, యవే= యవయోగంబునఁ బుట్టినవాఁడు, వీర్యాన్వితః = పరాక్రమయుక్తుఁడును, వయోంతః = యౌవనమందు, సుఖితః = సుఖముగలవాఁడును అగును,

కొందఱు శౌచాన్వితో వ్యథయేసుఖితో, వరోంత్యే=అని పఠించి శౌచాన్వితత్వంబు గూడ వజ్రయోగఫలంబనియు, యవయోగ జాతుఁడు ముసలితనంబున సుఖియగుననియును జెప్పియున్నారు, పద్మే=పద్మయోగమున జనించినవాఁడు, విఖ్యాతకీర్త్యమిత సౌఖ్యగుణశ్చ=సర్వజనవిఖ్యాత కీర్తిగలవాఁడును, అధికసౌఖ్యవంతుఁడును అధికగుణవంతుఁడునగును, వాప్యాం = వాపీయోగమున జనించినవాఁడు, తనుస్థిరసుఖీ = స్వల్పమై స్థిరమైన సుఖముగలవాఁడును, నిధికృత్=భూమియందుధననిక్షేపముచేయువాఁడును, నదాతా= దానవర్జితుఁడునగును.

1\. వజ్రయోగమున బుట్టినవాడు బాల్యదశయందును, వార్థిక్యదశయందును సుఖము గలవాడును, మనోహరురాలగు భార్యగలవాడును, భోగవంతుడును. మిక్కిలి శౌర్యము గలవాడును అగును.

2\. యవయోగమున బుట్టినవాడు పరాక్రమవంతుండును, ముసలితనంబున సుఖంబు గలవాడును, మరియు "వ్రతనియమ మంగళపరాఃవయసో మధ్యే సుఖార్థ సంయుక్తాః, దాతారః స్థిరవిత్తాయవయోగ భవాస్సదాపురుషాః, అనుసారావళీ వచనాను సారముగ యవయోగమున బుట్టినవాడు వ్రతాదులం దాసక్తి మొదలగు గుణములు గలవాడని నూహింపదగినది.

3\. పద్మయోగమున బుట్టినవాడు సర్వజన విఖ్యాత కీర్తిగలవాడును సర్వజనానుగుణ్యుడును, సుగుణసంపన్నుడును అధిక సౌఖ్యవంతుడును అగును.

4\. వాపీ యోగమున బుట్టినవాడు స్వల్పమై స్థిరమైన సుఖముగలవాడును. ఆర్జితధనమును భూమియందుబాతిపెట్టువాడును, దానమీయనివాడునుభూజీవనము గలవాడునుఅగును.

## యూప, శర, శక్తి, దండ, యోగజనితుల స్వభావములు.

శ్లో. త్యాగాత్మవాన్ క్రతువరైర్యజతేచ యూపే
హింస్రోథ గుప్త్యధికృత శ్శరకృ చ్ఛరాఖ్యే,
నీచోలస స్సుఖధనై ర్వియుతశ్చ శక్తౌ
దండే ప్రియైర్విరహితః పురుషోంత్య వృత్తిః. .. 15

టీ. యూపే = యూపయోగమునఁబుట్టినవాఁడు = త్యాగాత్మవాన్ = వితరణబుద్ధి గలవాఁడై, క్రతువరైః = వాజపేయాది శ్రేష్ఠయజ్ఞములచేత, యజతె = దేవతలనుతృప్తిబొందించును, యజదేవపూజాసంగతి కరణదానేషు అనిధాతువు, శరాఖ్యే = శరయోగమున జనించినవాఁడు, హింస్రః = చంపువాఁడును, గుప్త్యధికృతః = బంధనాధికారియు, శరకృత్ = బాణములంజేయువాఁడు నగును. కొందఱు గుప్త్యధికృతుఁడనఁగా రాజగృహామందలిరహస్య స్థానాధికారియనియు, శరకృత్ = అనఁగా శరాభ్యాసము సేయువాఁడనియును జెప్పుదురు, శక్తౌ=శక్తియోగంబున జనించినవాఁడు, నీచః = కులోచితములుగాని అధమ కృత్యములు సేయువాఁడును, లలసః = మందుఁడును, సుఖధనైర్వియుతశ్చ = సుఖధనహీనుఁడునునగును, దండే = దండయోగంబునఁబుట్టిన, పురుషః= నరుఁడు, ప్రియైః=ఇష్టజనులచేత, విరహితః = వివర్జితుఁడును. అంత్యవృత్తిః = అధమమైనవృత్తిగలవాఁడును అగును.

తా. 1. యూపయోగమున బుట్టినవాడు వితరణ బుద్ధిగలవాడై వాజపేయాది శ్రేష్ఠ యజ్ఞములచే దేవతుల తృప్తిబొందించువాడును త్యాగియును ప్రియ వచనములు గలవాడును నగును మరియు "ఆత్మనిరక్షా నిరతస్త్యాగ యుతో విత్త సౌఖ్యసంపన్నః వ్రతనియమ సత్యనిరతో యూపేజాతో విశిష్టశ్చ" అనుశ్లోకోక్తముగ ఆత్మరక్షణము మొదలగు గుణములు గలవాడగును.

2. శరయోగంబున జననమందినవాడు చంపువాడను, బందనాధి కారియు కఠినగుణము గలవాడును, బాణములు, కత్తులు మొదలగు వాటినిజేయువాడును, తద్వృత్తిచే జీవించువాడును అగును. ఇందులకు కొందరు రాజగృహమున రహస్యముగ ఖడ్గధారణ జేయువాడును బాణప్రయోగాభ్యాసముల నితరులకు జెప్పువాడనునగు నందురు, మరియు "ఇషుకరణ దస్యుబంధన మృగయాదన సేవనేతిసోన్మాదాః, హింస్రాః, కుశిల్పనిలతాశ్చగ యోగే సంప్రసూతాస్స్యుః, అనుసారావళీ వచనోక్తముగ వేటాడుట మొదలగు వాటియందాసక్తి గలవాడగునని జెప్పుదురు.

3. శక్తియోగమున నుద్భవమందినవాడు స్వకులాచార విముఖుడును, మందమతియు సుఖధన హీనుడును నగును, మరియు మలిన వస్త్రధారణుడనియు, యుద్ధమునందు నిపుణుడును మంచికళత్రము గలవాడగునని కొందరందురు.

4. దండయోగమునబుట్టినవాడు, ఇష్టజనులచే విడువబడినవాడును, అధమమగు వృత్తి గలవాడును నగును, మరియు, భార్యాపుత్రులను బోగొట్టు కొనునట్టివాడును, సర్వకాలము లందును దుఃఖము ననుభవించువాడును, నీచుడును నగునని కొందరు జ్యోతిష్కులు వచించుచున్నారు.

### నౌ, కూట, ఛ్ఛత్ర, ధనుర్యోగజనితుల స్వభావములు.

శ్లో. కీర్త్య న్వితశ్చల సుఖఃకృపణశ్చ నౌజః
కూటేనృత ప్లవగ బంధన పశ్చజాతః
ఛత్రోద్భవ స్స్వజనసౌఖ్య కరోంత్యసౌఖ్య
శ్చ్యారశ్చ కార్ముకభవః ప్రథమాంత్యసౌఖ్యః. 16

టీ. నౌజః = నౌయోగజుఁడు, కీర్త్యన్వితః=యశస్సుతోఁగూడినవాఁడును, చలసుఖః= అస్థిరమైన సుఖముగలవాఁడును, కృపణః = లోభియునగును, కూటే = కూటయోగమునజనించినవాఁడు, అనృతప్లవగబంధనపశ్చ— అనృతప్లవగ = అసత్యమనెడు కార్యతరణ సాధనమునుఁబొందినవాఁడును అనఁగా అనృతభాషియనుట, బంధనపః = కారాగృహాధ్యధి కారియునగును, అనృతప్లవన = అను పాఠమందు అసత్యమందు బుద్ధిగలవాఁడని యర్థము, అనృతీ కృపణబంధనపః = అనుపాఠమందు అసత్యవాదియు కృపణుఁడును కారాగృహాధికారియునగుననియర్థము, ఛత్రోద్భవః = ఛత్రయోగ సంభవుఁడు, స్వజనసౌఖ్యకరః = బంధుజన

సౌఖ్య కరుఁడును, అంతసౌఖ్యః = ముసలితనమందు సౌఖ్యముగలవాఁడునగును, కార్ముకభవః = చాపయోగోద్భవుఁడును, శూరః=శూరుఁడును, ప్రథమాంత్యసౌఖ్యః = బాల్యవార్థకములయందు సౌఖ్యముగలవాఁడునగును.

తా. 1. నౌ యోగమునందు బుట్టినవాడు యశోవంతుడును, చంచల సౌఖ్యముగలవాడును, లోభియునగును. మరియు నుదకములచే సంపాదింపబడిన గొప్పవిభవము గలవాడగుననియు కొందరందురు.

2. కూటయోగమున బుట్టినవాడు అసత్యమనెడు కార్యతరణ సాధనమును బొందినవాడును కారాగృహాధి కారియును నగును.

మరియు శ్లో "ఆనృతికకితవబంధన పాలానిమ్నించనా శ్శఠాః క్రూరాః, కూటసముత్థా నిత్యంభవంతి గిరిదుర్గ వాసినో మనుజాః" అనుశ్లోకోక్తముగ జూదము మొదలగు వాటియందు ఇష్టుడును కొండలయందు వసించు వాడును నగునని కొందరందురు.

3 ఛత్రయోగమున బుట్టినవాడును బంధుజన సౌఖ్యకరుడును, ముసలితనమునందు సౌఖ్యముగలవాడును, నగును మరియు స్వజనాశ్రయుడును, దయగలవాడును దాతయు సర్వ కార్యముల యందును జయముగలవాడును నగునని కొందరందురు.

4 ధనుర్యోగ జనితుడు శూరుడును, సౌఖ్యము గలవాడును, బాల్యవార్ధక్యములయందు సుఖపడువాడు అనగా మధ్యవయస్సున గష్టపడువాడును, అగును మరియును. అడవులలయందు సంచరించువాడును, చోరుడును అగునని కొందరి అభిప్రాయము (ఆయుస్సును 3 భాగములు చేయగా 1 బాల్యము, 2 మధ్యమము 3 వృద్ధాప్యము.)

{ అర్ధచంద్ర, సముద్ర, చక్ర, వల్లకీయోగములయందు జనించిన వారి గుణములు, }

శ్లో. అర్ధేందుజ స్సుభగ కాంతవపుః ప్రధాన
స్తోయాలయే నరపతి ప్రతిమస్తుభోగీ,
చక్రే నరేంద్ర ముకుట ద్యుతిరంజితాంఘ్రి
ర్వీణోద్భవశ్చ నిపుణః ప్రియగీత నృత్యః. 17

టీ. అర్ధేందుజః = అర్ధచంద్రయోగమునఁ బుట్టినవాఁడు, సుభగకాంతవపుః, సుభగ = సర్వజనప్రియుఁడును, కాంతవపుః = మనోహర శరీరుఁడును, ప్రధానః = సర్వజన ముఖ్యుఁడునునగును, తోయాలయే = సముద్రయోగమునఁబుట్టినవాఁడు, నరపతిప్రతిమః = రాజసమానుఁడును, భోగీ = సుఖముగలవాఁడునగును, చక్రే = చక్రయోగమునఁబుట్టినవాఁడు, నరేంద్రముకుటద్యుతి రంజితాంఘ్రిః, నరేంద్ర = రాజులయొక్క, మకుట= కిరీటములయొక్క అనఁగా శిరోరత్నములయొక్క, ద్యుతి = కాంతిచేత, రంజిత = రంజింపఁబడిన, అంఘ్రి=పాదములుగలవాఁడగును, వీణోద్భవః = వల్లకీయోగ సంభవుఁడు, నిపుణః=సూక్ష్మదృష్టిగలవాఁడు= ప్రియగీతనృత్యః = గానశీలుఁడును నాట్యప్రియుఁడునునగును.

తా. 1. అర్ధచంద్రయోగమున బుట్టినవాడు సర్వజనప్రియుండును మనోహరుండును, సర్వజన ముఖ్యుడును, అగును. మరియు సేనాధిపతియు, మణికనక భూషణ యుతుడును, శ్రీతను తుల్యమగు శరీరముగల వాడును, రాజప్రియుడును అగుననియు యితర గ్రంథకర్తల అభిప్రాయము.

2. సముద్రయోగమున జననమందినవాడు రాజసమానుడును, సుఖముగలవాడును సర్వజనాను రంజకుడును, అగును ఈయోగమున బుట్టినవాడు, సర్వదా రత్నాభరణ భూషితుడును, స్థిరచిత్తుడును, సత్త్వవంతుడును అగునని కొందరు అభిప్రాయ పడుచున్నారు.

3. చక్రయోగమున బుట్టినవాడు, రాజకిరీటమణి ద్యుతిచేత రంజింపబడిన పాదములుగలవాడగును అనగా రాజాధిరాజై ఏకచ్ఛత్రాధిపత్యముండుటచేనైనను, తపోజ్ఞానాధిప్రభావయుక్తుడౌట వల్లనైనను నరేంద్రులు వానిపాదములకు వందనమాచరింతురు రనుట.

సంఖ్యాయోగములయందు బుట్టిన వారి స్వభావములు.

4. వల్లకీ యోగమున బుట్టినవాడు సూక్ష్మబుద్ధి గలవాడును, సూక్ష్మదృష్టి గలవాడును గానలోలుడును, నాట్యప్రియుడును. మిత్రజన పరివృతుండును, పరిజనమధికముగా గలవాడును కీర్తివంతుడును అగును.

—దామ, పాశ, కేదార, శూలయోగ జనితుల స్వభావము.—

శ్లో. దాతాన్య కార్యనిరతః పశుపశ్చ దామ్ని
పాశే ధనార్జన విశీల సభృత్యబంధు
కేదారజః కృషికర స్సు బహూపయోజ్యః
శూరః క్షతో ధనరుచి ర్విధనశ్చ శూలే. 18

టీ. దామ్ని = దామయోగంబునఁ బుట్టినవాఁడు, దాతా = దానశీలుఁడును, అన్యకార్యనిరతః = పరోపకారాసక్తుండును, పశుపః = గోరక్షకుండునగును, పాశే = పాశయోగమున జనించినవాఁడు, ధనార్జనవిశీల సభృత్యబంధుః ధనార్జనవిశీల = ఏవిధంబుననైన ధనమార్జింపవలెననెడి శీలములేనివాఁడు అనఁగా సన్మార్గముచే ధనమార్జించు వాఁడనుట, సభృత్యబంధుః = సభృత్యబంధువులతోఁ గూడినవాఁడునగును, కేదారజః = కేదారయోగోద్భవుండు, కృషికరః = కృషివలుండును, సుబహూపయోజ్యః = లెస్సగా ననేకులకు ఉపకారము సేయువాఁడునగును, శూలే = శూలయోగమునఁ బుట్టినవాఁడు, శూరః = సమరధీరుండును, క్షతః = కత్తిదెబ్బతగిలినవాఁడును, ధనరుచిః = అర్థాశగలవాఁడును। విధనశ్చ = దరిద్రుఁడునగును, వధరుచియనుపాఠమందు ప్రాణిహింసాపరుఁడగునని యర్థము.

తా. 1 దామయోగమున బుట్టినవాడు దానశీలుడును, పరోపకారమునందాసక్తిగలవాడును, పశుపోషకుండును నగును, మరియు, బహుసుతరత్న సమృద్ధుడగుననియును, ధీరుడగుననియు, విద్యావంతుడగుననియు, నూహింపదగినది.

2 పాశయోగమున జనించినవాడు సన్మార్గమున ధనార్జనచేయుటకు ప్రయత్నించు వాడును, సభృత్య బంధువులతో గూడినవాడును, మిక్కుటముగా మాటలాడు వాడును అగును.

3. కేదారయోగమున బుట్టినవాఁడు, అనేకులకు ఉపకారము చేయువాడును, శక్తికొలది ఉపచారము జేయువాడును, కృషిచే జీవించువాఁడును, చంచలస్వభావుండును, ధనవంతుడును అగును.

4 శూలయోగమున బుట్టినవాడు, యుద్ధవీరుడును, పరాక్రమశాలియు, నెత్తుటి గాయములు గలవాడును, ధనాశగలవాడును, ప్రాణహింస జేయువాడును, బహిష్కృతుడును, దరిద్రుడును అగును.

## —యుగ, గోలక యోగోద్భవుల స్వభావములు—

శ్లో. ధనవిరహితః పాషండీ స్యాద్యుగే త్వథ గోలకే
విధనమలినాజ్ఞానోపేతః కుశిల్ప్యలసోటనః
ఇతి నిగదితా యోగాస్సార్ధం ఫలైరిహ నాభసా
నియతఫలదాశ్చింత్యా హ్యేతే సమస్తదశాస్వపి. 19

టీ యుగే = యుగయోగమున జనించినవాఁడు, ధనవిరహితః = ధనహీనుండును, పాషండీ = వేదబాహ్యుండును, స్యాత్ = అగును. అథ = అనంతరమందు, గోలకే= గోలకయోగమందు జనించినవాఁడు, విధన = అర్థహీనుండును, మలిన = మలినవస్త్రుండును, అజ్ఞానోపేతః = మూర్ఖుడును, కుశిల్పీ = లోకనింద్యమైన శిల్పముగలవాఁడును, అలసః = మందుండును, అటనః = భుక్త్యర్థమై తిరుగుచుండు వాఁడునగును. ఇట్లు సంఖ్యాయోగఫలంబులును జెప్పంబడెను. ఇతి = ఈప్రకారముగా, ఇహ = ఈ యధ్యాయమందు, నాభసాః= నాభసాఖ్యులైన, యోగాః= యోగములు, ఫలైస్సార్ధం = ఫలములతోఁగూడ, నిగదితాః = చెప్పబడెను. ఏతే = ఈ నాభసయోగములు, సమస్తదశాస్వపి = సకల దశలయందును, నియతఫలదాః = సర్వకాల ఫలప్రదంబులగునని, చింత్యాః = పర్యాలోచింపఁదగినవి.

తా. 1 యుగయోగమున జనించినవాడు ధనహీనుడును, పాషండుడును, పుత్ర, కళత్ర, మాన, ధర్మ, రహితుడును అగును.

2. గోలకయోగమున బుట్టినవాడు మలినవసనధరుడును, మూర్ఖుడును, ధనహీనుడును, లోకనింద్యమగు శిల్పముగలవాడును, నిర్హేతుకముగ తిరుగువాడును నగును.

ఈ యధ్యాయమున నాభసయోగముల ఫలితాఫలితము లన్నియు విశదముగా జెప్పబడినవి. ఈ నాభసాఖ్యయోగములు, సకల దశలయందును, సర్వకాల ఫలప్రదము లనుటకు సందియములేదు. సుఖదుఃఖములు యావజ్జీవము నేకరీతిగ నుండక యుండుటచేతను, ధనవంతులకు కష్టమును, బీదలకు సౌఖ్యమును గలుగుటలుగూడ సంభవించుటవల్లను. నీయోగము సర్వదశలయందును నియత ఫలప్రదములు.

మరియు నీయోగములు దశాష్టక వర్గఫలములను దొలగించి తమఫలముల మాత్రము నీయజాలవు. గనుక యష్టక వర్గానుసారముగ శుభాశుభ ఫలములు గలుగుచుండగా నివియును, ఆయాకాలమునకు అనుగుణ్యముగ సర్వ దశలయందును తమతమఫలముల నిచ్చుచుండును. గాన సౌఖ్యాసౌఖ్యములు ధనాధిపులకును, దరిద్రులకును సామాన్యముగా సంభవించుట నిశ్చయమనుట దృఢమగుచున్నది. మరియు నీయోగములయందు ఏకకాలమున దళాకృతి యోగద్వయ సంభవముగాని దళాశ్రియ యోగద్వయ సంభవముగాని గలుగుటలేదు. దళసంఖ్యా యోగద్వయ సంభవమమాత్రము గలుగుచున్నది. అయినను, దళయోగ సంఖ్యాయోగములు ఏకకాలమున గూడునెడల దళయోగము ఫలప్రదమగునుగాని, సంఖ్యాయోగము ఫలప్రదముగాదు. ఆకృతి ఆశ్రియయోగములు ఏకకాలమున సంభవించినను ఆకృతి సంఖ్యాయోగములు ఏకకాలమున సంభవించినను ఆకృతియోగమే ఫలప్రదమగునుగాని తక్కినవి ఫలప్రదములుగా నేరవు. ఆశ్రియ సంఖ్యాయోగము ఏకకాలమున గూడినచో నపుడుగూడ సంఖ్యాయోగఫలితమున కవకాశములేదు ఉదాహరణము:—చర, స్థిర, ద్విస్వభావరాశులయందు నెందైన నొకరాశియందు సర్వగ్రహము లుండినచో ఆశ్రియయోగమే ఫలకారియగుచున్నది. గాని సంఖ్యా యోగాంతర్గతంబైన గోళకయోగంబున కవకాశము లేకయుండుటచే నీరీతిగ సంభవించుయోగములందు జనించువారికి యోగముల తారతమ్యమును చక్కగ నెరింగి ధీవిశాలురగు జ్యోతిష్కులు ఫలితముల జెప్పదగును.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

నాభసయోగాధ్యాయ నామక

ద్వాదశాధ్యాయము.





శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

చంద్రయోగాధ్యాయము. త్రయోదశాధ్యాయము.— 13.



### సూర్యుడుండు స్థానము మొదలు కేంద్ర ఫణఫర ఆపోక్లిమ స్థానములందు చంద్రుడుండగా జననమందినవారి స్వభావములు.

శ్లో. అధమ సమ వరిష్ఠా న్యర్క కేంద్రాది సంస్థే
శశిని వినయ విత్త జ్ఞాన ధీ నైపుణాని
అహని నిశిచ చంద్రే స్వాధిమిత్రాంశకేవా
సురగురు సిత దృష్టే విత్తవా న్యాత్సుఖీచ. 1

టీ. శశిని = చంద్రుడు, అర్క కేంద్రాదిసంస్థే = రవికి కేంద్రపణఫరాపోక్లిమ స్థానములయందుండగా బుట్టినవానికి, వినయ = వినయము, విత్త = ధనము, జ్ఞాన= శాస్త్రజ్ఞానము, ధీ = బుద్ధి, నైపుణ = కార్యములయందు నేర్పరితనము, ఇవి, అధమసమవరిష్ఠాని = నికృష్ట మధ్యమోత్కృష్టములై యుండును, స్వ = తనయంశయందైనను, అధిమిత్రాంశకేవా = తన అధిమిత్రాంశ యందైన నుండెడు, చంద్రే = చంద్రుడు, అహని = పగటియందు, నిశిచ = రాత్రియందైనను క్రమముగా, సురగురుసితదృష్టే = గురుని చేతను శుక్రునిచేతను జూడబడుచుండగా, జనించినవాడు, విత్తవాన్ = ధనవంతుడును, సుఖీ = భోగవంతుడునగును.

తా. చంద్రుడు సూర్యుడుండు స్థానమునకు కేంద్ర పణఫర ఆపోక్లిమస్థానములందుండగా బుట్టినవానికి వినయము, ధనము, శాస్త్రజ్ఞానము, బుద్ధి, కార్యములందు నేర్పరితనము అను నివి నికృష్ట మధ్యమోత్కృష్టములై యుండుననగా చంద్రుడు సూర్యునకు కేంద్రస్థానములగు 1, 4, 7, 10, యిండ్లయందుండునెడల పైని చెప్పబడిన వినయాది గుణములు లేకుండుననియు పణఫర స్థానములగు ద్వితీయ, పంచ

మాష్ట మేకాదశమములయం దుండునెడల పై జెప్పబడిన విషయాదులు మధ్యమములై యుండుననియు, అపోక్లీమస్థానములగు తృతీయ, షష్ఠ, నవమ, ద్వాదశములయం దుండు నెడల పై జెప్పబడిన విషయాదులు సంపూర్ణాధిక్యత గలిగియుండుననియు దెలియదగినది. ఇందులకు, శ్లో. సూర్యాత్కేంద్రాది గతో నిశాకర స్స్వల్ప మధ్య భూయిష్టాన్, కుర్యాత్క్రమేణ ధనధీ నైపుణ విజ్ఞాన విషయాంశ్చ" అని సారావళీ కారకుడు వచించియున్నను "మూర్ఖాన్ దరిద్రాంశ్చ ఫలాన్వి శీలాం శ్చంద్రః ప్రసూతేర్క చతుష్టయస్థః." అని యవనేశ్వరుడు చెప్పియుండుటచే యీ అధ్యాయ ప్రథమశ్లోకమగు నిందు చెప్పియుండు అధమ శబ్దమునకు అభావమని అర్థము నూహింపదగియున్నది. మరియు చంద్రుడు స్వనవాంశయం దైనను అధిమిత్ర నవాంశయందైనను నుండి గురువుచే జూడబడుచుండగా బగటికాలమున బుట్టినవాడు ధనాఢ్యుండును, భోగియును నగునని దెలియదగినది. చంద్రుడు తన నవాంశ యందుగాని, అధిమిత్ర నవాంశయందుగాని యుండి శుక్రునిచే జూడబడుచుండగా రాత్రి కాలమున బుట్టినవాడు ధనాధిపుడును భోగవంతుడును, కీర్తివంతుడును, అగును. ఇందులకు "స్వాంశేధిమిత్రస్యాం శేవా సంస్థితో దివసే శశీ గురుణాదృశ్యతే తత్ర జాతో విత్త సుఖాన్వితః, నిశ్యేవం భృగుణాదృష్టః శశీజన్మ నిశస్యతే, విపర్యయస్థేశీతాంశౌ జాయంతేఅల్పధనా నరాః." అని గార్గియు, "స్వాంశేశశీ భార్గవదృష్టమూర్తి ర్నిశీశ్వరో ద్యుతికరః ప్రదిష్టః తదుత్తమోద్యుతి కరస్సతు స్యాద్దృష్టేదివాదేవ పురోహితేన." అని యవనేశ్వరుండును చెప్పియున్నారు. మరియు నీవిషయమునుగురించి, "అధిమిత్రాంశ గశ్చంద్రో దృష్టో దానవ మంత్రిణా, అనిశంకురుతేలక్ష్మీ స్వామినంభూపతింనరం." అనియు, "స్వాంశేధమిత్ర భాగేహ గురుణా యదదృశ్యతే శశీ మహీపతిం కుర్యాద్దివసే నాత్రసంశయః." అనియును సారావళీ కారకుడు వచించియున్నాడు.

## అధియోగ వివరము, తత్ఫలములు.

శ్లో. సౌమ్యైః స్మరారి నిధనే ష్వధియోగ ఇందో
స్తస్మిం శ్చమూప సచివక్షితిపాలజన్మ
సంపన్న సౌఖ్యవిభవా హత శత్రవశ్చ
దీర్ఘాయుషో విగతరోగభయాశ్చ జాతాః. 2

టీ. ఇందోః=చంద్రునికి, స్మరారినిధనేషు = సప్తమ షష్ఠాష్టమములయందుండెడు, సౌమ్యైః=బుధ గురు శుక్రులచేత, అధియోగః=అధియోగంబగును, తస్మిన్=ఆ యధియోగమందు, చమూపసచివక్షితిపాలజన్మ=సేనాపతిమంత్రిభూపతుల జననంబగును, జాతాః= ఈ యోగమందుఁ బుట్టినరాజాదులు; సంపన్నసౌఖ్యవిభవాః=అతిసౌఖ్యైశ్వర్య సంపన్నులును, హతశత్రవశ్చ= నష్టశత్రులును, దీర్ఘాయుషః =పూర్ణాయుష్యగలవారును, విగతరోగభయాః = రోగభయవర్జితులు నగుదురు.

తా. చంద్రునకు సప్తమ షష్ఠాష్టమములయం దుండెడు బుధ గురు శుక్రులచేత ననగా షష్ఠ సప్త మాష్ట స్థానములలో నొక స్థానమందైనను, స్థానద్వయమునందైనను లేక స్థానత్రయమునందైనను, సకల శుభగ్రహములనగా బుధ గురు శుక్రులుండిరేని అధి యోగమనంబడును. కొందరు ఈ మూడుస్థానములందును మూడు శుభగ్రహము లుండవలయు నందురు గాని అది యుక్తముగాదు, మరియు "నిధనం ద్యూనం షష్ఠచంద్ర స్థానాద్యదా శుభైర్యుక్తం, అధియోగ స్సప్రోక్తో న్యాసకృతా సప్తధాపూర్వైః. అను శ్రుతకీర్తి వచనాను సరణముగ ఈయోగము ఏడు విధములని పూర్వులచే జెప్పబడినట్లు నూహింపదగియున్నది.

1. సకల శుభగ్రహములు చంద్రునకు 6-వ యింట నుండుట.
2. సర్వ శుభగ్రహములు చంద్రునకు 7-వ యింట నుండుట.
3. శుభగ్రహములన్నియు చంద్రునకు 8-వ యింట నుండుట.
4. శుభగ్రహములన్నియు చంద్రునకు 6-వ యింటను, 7-వ యింటను యుండుట.
5. శుభగ్రహములన్నియు చంద్రునకు 6-వ యింటను, 8-వ యింటను యుండుట.
6. శుభగ్రహములన్నియు చంద్రునకు 7-వ యింటను, 8-వ యింటను యుండుట.
7. శుభగ్రహములన్నియు చంద్రునకు 6, 7, 8, యిండ్లయం దుండుట.

ఇట్లుండుటచే నేర్పడునవియే ఏడువిధములు. మరియు నీరీతిగ పాపగ్రహములుండుట తటస్థించునెడల పాపాధియోగమనియు, మిశ్రమముగ నుండునెడల మిశ్రయోగమనియు నెంచదగినది. ఇందులకు "షట్సప్తాష్టమ సంస్థై శ్చంద్రాత్సౌమ్యై శ్శుభోధియోగస్స్యాత్, పాపః పాపైరేవం మిశ్రైర్మిశ్ర స్తథైవోక్తః" అని శ్రుతకీర్తిచే చెప్పబడి యుండుటవలన నీ యధియోగంబున సేనాపతి, మంత్రి, భూపతుల జననం బగుదురనగా, జననకాలమున నీ యధియోగ ప్రకరణము ప్రకారము లగ్న చంద్రలగ్నాదు లేర్పడి బుధ గురు శుక్రులు, మధ్యమబలయుతులై యుండునెడల తత్కాలముల బుట్టినవాడు రాజగుననియు, బుధ గురు శుక్రులు, మధ్యమబలయుతులై యుండునెడల మంత్రి యగుననియు, బలహీనులై యుండిరేని సేనాధిపతియగుననియు దెలియదగినది. మరియు నీయోగమున బుట్టినవారు అధిక సౌఖ్యైశ్వర్య సంపన్నులును, శత్రువులు లేనివారును, పూర్ణాయువు గలవారును, రోగ భయ వర్జితులును, అగుదురని తెలియదగినది. మరియు కొందరీ యధియోగమును రాజయోగ ముగా నెంచియున్నారు.

అందు "షష్ఠం ద్యూనమథాష్టమం శశిరగోః ప్రాప్తా స్సమస్తా శ్శుభాః, క్రూరాణాం యదిగోచరేనపతితా భాస్వాలయా ద్దూరతః భూపాలః ప్రభవేత్సయస్య జలధే ర్వేలావనాం తోద్భవై స్సేనామత్త కరీంద్ర దాన సలిలం భృంగైర్ముహుః పీయతే." అని సారావళీ కారకుడును, "అమిత్రం జామిత్రం నిధనమథవా శీతరుచితో గతాస్సర్వే సౌమ్యాస్తమిహ జన యే యుర్నరపతిం-ధృతే సేవాసేకం గతవతి విషాదేకపయసా ప్రతాపాగ్ని ర్యస్య జ్వలతి హృదయే శత్రుసుదృశామ్." అని మాండవ్యుడును వచించియున్నారు.

## సునఫా నంఫా దురుధురా కేమద్రుమంబులనెడు చతుర్విధయోగములు.

శ్లో. హిత్వార్కం సునఫానఫా దురుధురాస్స్వాంత్యోభయస్థైర్గ్రహైః
శీతాంశోః కథితో౽న్యథా తు బహుభిః కేమద్రుమో నైస్త్వసౌ
కేంద్రే శీతకరే౽థవా గ్రహయుతే కేమద్రుమో నేష్యతే
కేచిత్కేంద్ర నవాంశకేషు చ వదంత్యుక్తి ప్రసిద్ధానతే. 3

టీ. అర్కం=రవిని, హిత్వా=విడిచి, శీతాంశోః=చంద్రునికి, స్వాంత్యోభయస్థైః = ద్వితీయమందైనను ద్వాదశమందైనను ఈరెండు స్థానములయందైనను స్నట్టి, గ్రహైః=కుజాది పంచగ్రహములచేత, సునఫానఫాదురుధురా=సునఫా, అనఫా, దురుధుర, అను నీమూడు యోగములగును. అన్యథా=ఈమూడుయోగములును గాకుండెనేని, కేమద్రుమః=కేమద్రుమయోగము, బహుభిః=పెక్కండ్రు గ్రంథకర్తలచేత, కథితః=చెప్పఁబడెను. అన్యైః=గార్గ్యాదులచేత, అసౌ=ఈకేమద్రుమయోగము, కేంద్రే=జన్మలగ్న చతుర్థ సప్తమ దశమములలో నొక కేంద్రము, గ్రహయుతే=కుజాదిగ్రహములతోఁ గూడినదొచుండఁగా, అథవా=అటుగాక, శీతకరే=చంద్రుఁడు, గ్రహయుతే=కుజాదిగ్రహములతోఁ గూడినవాఁడౌచుండఁగాను, కేమద్రుమః=కేమద్రుమయోగము, నేష్యతే=ఇచ్ఛయింపఁబడదు. అన్యైః = అని చెప్పుటవలన నిది పరమతముగాని వరాహమిహిరాచార్య మతముగాదని యర్థము. కేచిత్ = శ్రుతికీర్తి జీవశర్మ ప్రభృతులు, కేంద్రనవాంశకేషు తే=ఆకేంద్ర నవాంశవశంబున నీయోగములం జెప్పెదువారు, ఉక్తి వృద్ధసమ్మతవాక్యములచేత, ప్రసిద్ధాః=ప్రసిద్ధులు, న = కారు.

తా. సూర్య వ్యతిరిక్త గ్రహములు అనగా కుజ, బుధ, గురు, శుక్ర, శనైశ్చరులు, చంద్రునకు రెండవయింట యుండునెడల సునఫా యోగమనియు 12-వ యింటియం దుండునెడల అనఫా యోగమనియు, చంద్రునకు నుభయపార్శ్వములయందుండునెడల ధురుధురాయోగమనియు, ఈమూడు యోగములు గాక యుండునెడల కేమద్రుమ యోగమనియును జెప్పబడియున్నది. ఇదియుగాక సూర్యుడు చంద్రునకు రెండు పండ్రెండు యిండ్లయందుండినను ఈ యోగ కర్తలయందు గణింపబడునుగాని యీ యోగములకు భంగము లేదని తెలియదగినది. కొందరు గ్రంథకర్తలు చంద్రునకు ద్వితీయ ద్వాదశములయందు, కుజాది పంచగ్రహములనగా కుజ, బుధ, గురు, శుక్ర, శనైశ్చరులు లేకుండినను జన్మలగ్నాది కేంద్రములగు లగ్న చతుర్థ, సప్తమ, దశమ, కేంద్రంబులలో నొక కేంద్రమునందంగారకాది పంచగ్రహములుండినను, చంద్రుడు కుజాది యుక్తుడై యుండినను కేమద్రుమయోగము కాదందురుగాన, చంద్రునకు ద్వితీయ ద్వాదశములయందును, జన్మలగ్నాది కేంద్రములయందును, కుజాది గ్రహములు లేకయు, చంద్రుడు, రవి, కుజ, బుధ, గురు. శుక్ర శనైశ్చరులతో గూడక యుండినచో కేమద్రుమ యోగ

మని నూహింపదగియున్నవి. ఇందులకు "వ్యయార్థకేంద్రగ శ్చంద్రా ద్విసాభానుం నచేద్గ్రహాః, కశ్చి త్స్యా ద్వావినా చంద్రం లగ్నాత్కేంద్ర గతోథవా, యోగః కేమద్రుమో నామతదా స్యాద్యత్ర గర్హితాః, భవంతి నిందితాచార దారిద్ర్య ప్రసంయుతాః." అని గార్గియు, "సునఫానఫాదు రుధురాః క్రమేణయోగా భవంతి రవిరహితైః, విత్తాంత్యో భయసంస్థైః కైరవవన బాంధవా ద్విహాగైః, ఏతేన యదాయోగాః కేంద్రేగహావర్జితే శ్శశాంకేచ, కేమద్రుమోతి కష్టశ్శశినిచ సమస్తగ్రహైర్దృష్టే." అని సారావళీకారకుడును వచించియుండుటచే చంద్రునకు యితర గ్రహదృష్టియును లేక యుండవలయునని నూహింపదగియున్నది. మరికొందరు వ్యాఖ్యాతలు జననలగ్నాది కేంద్రములయందు చంద్రుడున్నను, ఏస్థానముననగాని చంద్రుడు కుజాదిగ్రహయుక్తుడై యున్నను, చంద్రునకు ద్వితీయ ద్వాదశములయందు కుజాది గ్రహములు లేకయుండినను, కేమద్రుమయోగముగాదని భావించినారుగాని "రవివర్జ్యం ద్వాదశగై రనఫా, చంద్రాద్ద్వితీయగై స్సునఫా, ఉభయస్థితై ర్దురుధురా కేమద్రుమసంజ్ఞితో౽న్యః." అను లఘుజాతక ఉదాహరణము ననుసరించి పూర్వోక్తముగ చంద్రునకు ద్వితీయ ద్వాదశమములయందు, సూర్య వ్యతిరిక్తములగు కుజాది పంచ గ్రహములు లేకుండునెడల కేమద్రుమ యోగమని వరాహమిహిరాచార్యుల మతమని నూహింపదగియున్నది.

మరియు, "చంద్రాచ్చతుర్థగై స్సునఫా దశమస్థితైః కీర్తితో౽నఫావిహాగైః, ఉభయస్థితై ర్దురుధురా కేమద్రుమసంజ్ఞితో౽న్యథా యోగః" అను శ్రుతకీర్తి వచనాను గుణ్యముగ కొందరు సూర్య వ్యతిరిక్తములగు గ్రహములు చంద్రునకు చతుర్థమం దుండునెడల సునఫాయోగము, దశమస్థానమం దుండునెడల అనఫాయోగము, చతుర్థదశమములయం దుండునెడల దురుధురాయోగము, చంద్రునికి చతుర్థదశమములయందు కుజాదిగ్రహములు లేకుండునెడల కేమద్రుమయోగమని కేంద్రస్థానస్థితో క్తముగ జెప్పుదురు. మరికొందరు, సూర్య వ్యతిరిక్తములగు గ్రహములు ఏరాశియందైనను జంద్రుడుండు నవాంశరాశికి ద్వితీయమున నుండునెడల సునఫాయోగమనియు, చంద్రనవాంశరాశికి ద్వాదశమున నుండునెడల అనఫాయోగమనియు, చంద్ర నవాంశరాశికి ద్వితీయ ద్వాదశమములయందు రెంటియందును నుండునెడల దురుధురాయోగమనియు, చంద్రనవాంశరాశికి ద్వితీయ ద్వాదశమములయందు సూర్య వ్యతిరిక్తములగు అంగారకాది గ్రహము లేకుండునెడల కేమద్రుమయోగమనియును, జీవశర్మ నవాంశానుగుణ్యముగ, "యద్రాశిసంశ్లే శీతాంశు ర్నవాంశే జన్మని స్థితః తద్ద్వితీయ స్థితై ర్యోగ స్సునఫాఖ్యాః ప్రకీర్తితః, ద్వాదశై రనఫాఖ్యోయా గ్రహైర్ద్విద్వాదశస్థితైః, ప్రోక్తో దురుధురాయోగో ౽న్యథా కేమద్రుమస్మృతః." అని వచించియుండురీతి ననుసరించి జెప్పుచున్నారు ఈ విషయము కేవలము కొందరి జ్యోతిష్కుల సమ్మతమేకాని చాలమందికి సమ్మతమయినది గాదు గాన జ్యోతిష్కులు యోచించి యోగనిర్ధారణ జేయదగినది.

## ఇచ్ఛావికల్పములచేత నేర్పడెడు నీయోగముల సంఖ్యలు.

శ్లో. త్రింశత్స్వరూపా స్సునఫానఫాఖ్యా, ష్షష్టిత్రయం దౌరుధురప్రభేదాః
ఇచ్ఛావికల్పైః క్రమశోభినీయ, నీతే నివృత్తిః పునరన్యనీతిః. 4

టీ. సునఫా=సునఫాయోగములు, అనఫా=అనఫాయోగములు, త్రింశత్స్వరూపాః= 30 భేదములుగలది, దౌరుధురప్రభేదాః=దురుధురాయోగభేదములు, షష్టిత్రయం=180 ఇచ్ఛావికల్పైః=ఇచ్ఛా=(కుజాదిగ్రహైకైకాది సంస్థాపనలక్షణమైన) ఇచ్ఛచేతనగు, వికల్పైః= వికల్పములచేత, క్రమశః = క్రమముగా, అభినీయ = చంద్రునికి ద్వితీయ ద్వాదశములయందు, కుజాదిగ్రహంబులను ప్రత్యేకముగానుంచి, నీతేసతి = యోగభేదము తెలియఁబడినదగుచుండఁగా, నివృత్తిః = పూర్వసంస్థాపిత గ్రహనివృత్తి చేయఁదగినది. పునః = మఱల, అన్యనీతిః = మఱియొకవిధముగా గ్రహసంస్థాపనము చేయఁదగినది.

తా. సునఫాయోగములు. 30. అనఫాయోగములు. 30. దురుధురాయోగములు. 180.

ఈయోగములసంఖ్య యేర్పడువిధము. కుజాదిగ్రహైకైకాది సంస్థాపనలక్షణమగు ఇచ్ఛచేతనైన వికల్పములచేత గ్రమముగ జంద్రునకు ద్వితీయ ద్వాదశములయందు కుజాది గ్రహముల ప్రత్యేకముగ నుంచి యోగభేదము తెలియబడినదగుచుండగ పూర్వ సంస్థాపిత గ్రహనివృత్తి చేయదగినది. ఇట్లొక్కొక్కవిధముగ గ్రహసంస్థాపనము జేయదగినది.

ఈవిధమున అంగారకాది అయిదు గ్రహములను ఒక్కొకటిగాను, రెండేసిగాను, మూడేసిగాను, నాల్గేసిగాను, అయిదేసిగాను, చంద్రునకు ద్వితీయమునందుంచి గణింపగా 30 సునఫాయోగములు ఏర్పడుచున్నవి. పూర్వరీతిని కుజాదిగ్రహముల క్రమముగా చంద్రునకు ద్వాదశమందుంచి గణింపగా 30 అనఫాయోగములు ఏర్పడుచున్నది. ఈస్థానద్వయమందనగా ద్వితీయ ద్వాదశములయందుపై క్రమమున కుజాదిగ్రహములనుంచి గణింపగా 180 దురుధురాయోగములు ఏర్పడుచున్నవి. ఈ వికల్పమును వివరముగా దెలియువిధము.

"ప్రతిలోమ్యం వినిక్షిప్య చానులోమ మధక్షిపేత్, అనులోమం సమాహన్యా దధస్థేన విభాజయేత్. అను శ్లోకోక్తముగ.

| 5 | 4 | 3 | 2 | 1 |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |

ఇక్కడ అంగారకాదిగ్రహము లయిదింటిచేత ని యోగము లేర్పడుచున్నందున పై చక్రమునగనుచరచినరీతిని 5 మొదలు 1 వరకు ప్రతిలోమముగ సంఖ్యలువ్రాసి దానిక్రింద 1 మొదలు 5 వరకు అనులోమముగ సంఖ్యలువ్రాసి అధోరూపముగ భేదముచేయదగినది. ఇట్లుచేయుగా నేర్పడు ఏకవికల్పయోగములు అయిదు. యీ అయిదుచేత ద్వితీయస్థానమందున్న 4 నుగుణింపగా యిరువదియగును, ఆయిరువదిని క్రిందనున్న రెండుచేత భాగింపగా పదియగుచున్నది గనుక ద్వివికల్పములు పది, ఈపదిచేత తృతీయస్థానముననున్న మూడింటిని గుణించి క్రిందనున్న మూడింటిచేత భాగింపగాపదియగును. గాన త్రివికల్పములు పదియగు

చున్నవి. ఈ పదిచేత చతుర్థస్థానమునను్న రెంటిని గుణించి యడుగునను్న నాల్గింటిచే భాగింపగా అయిదువచ్చుచున్నదిగాన చతుర్వికల్పములు అయిదగుచున్నవి. ఈ అయిదుచేత

(I) $5 \div 1 = 5$

(II) $5 \times 4 = 20 \div 2 = 10$

(III) $10 \times 3 = 30 \div 3 = 10$

(IV) $10 \times 2 = 20 \div 4 = 5$

(V) $5 \times 1 = 5 \div 5 = 1$

పంచమస్థానమందున్న ఒకటిని గుణించి క్రిందనుండు అయిదుచేభాగింపగా ఒకటివచ్చుచున్నది. గనుక పంచవికల్పము ఒకటియగుచున్నది. ఇదియుగాక "పూర్వేణ, పూర్వేణ గతేనయుక్తం, స్థానం వినాంత్యం ప్రవదంతిసంఖ్యాం" అనువచనోక్తముగ గణించినను, ఈ విధముగనే సంఖ్యలేర్పడును, ఈ యోగముల యుత్పత్తి ప్రకారము చంద్రునకు రెండవయింట

1 అంగారకుండుండుట.

2 బుధుండుండుట.

3 బృహస్పతియుండుట.

4 శుక్రుడుండుట.

5 శనైశ్చరుడుండుట.

ఇట్లుండుటచే నేర్పడు 5 యోగములును ఏక వికల్పయోగములు.

## ద్వివికల్ప యోగములు 10.

చంద్రునకు రెండవయింట.

1 కుజ, బుధులుండుట.

2 కుజ, గురులుండుట.

3 కుజ, శుక్రులుండుట.

4 కుజ, శనులుండుట.

5 బుధ, గురులుండుట.

6 బుధ, శుక్రులుండుట.

7 బుధ, శనైశ్చరులుండుట.

8 గురు, శుక్రులుండుట.

9 గురు, శనులుండుట

10 శుక్ర, శనైశ్చరులుండుట.

## త్రివికల్ప యోగములు 10.

చంద్రునకు రెండవయింట.

1 కుజ, బుధ, గురులుండుట.

2 కుజ, బుధ, శుక్రులుండుట.

3 కుజ, బుధ, శనులుండుట.

4 కుజ, గురు, శుక్రులుండుట.

5 కుజ, గురు, శనులుండుట.

6 కుజ, శుక్ర, శనులుండుట.

7 బుధ, గురు, శుక్రులుండుట.

8 బుధ, గురు, శనులుండుట.

9 బుధ, శుక్ర, శనులుండుట.

10 గురు, శుక్ర, శనులుండుట.

## చతుర్వికల్ప యోగములు 5.

చంద్రునకు రెండవయింట.

1 కుజ, బుధ, గురు, శుక్రులుండుట.

2 కుజ, బుధ, గురు, శనులుండుట.

3 కుజ, గురు, శుక్ర, శనులుండుట.

4 కుజ, బుధ, శుక్ర, శనులుండుట.

5 బుధ, గురు, శుక్ర, శనులుండుట.

## పంచవికల్ప యోగము 1.

చంద్రునకు రెండవయింట కుజ, బుధ, గురు, శుక్ర, శనులుండు నెడల పంచవికల్ప యోగమగుచున్నది.

ఈ విధమున 30 సునఫా యోగముల యుత్పత్తిని దెలుపఁబడినది. ఈ ప్రకారముననే చంద్రునకు ద్వాదశమున అంగారకాది పంచగ్రహములుండుటచే 30 అనఫాయోగములు యేర్పడుచున్నవి. దురుధురాయోగ భేదములు పూర్వము చెప్పబడియున్న గణితముచే నేర్పడవు గనుక ఇచ్ఛావికల్పములచేతనే తెలిసికొనదగినవి:— ఇందులకు వివరము అంగారక, బుధ, గురు, శుక్ర, శనైశ్చరులలో చంద్రునకు రెండవయింట నొకగ్రహమును పంద్రెండవయింట మరియొకగ్రహము, ఈ రీతిగనుండు నెడల నేర్పడు భేదములు.—20.

చంద్రునకు రెండవయింట రెండు గ్రహములును పంద్రెండవయింట నొక గ్రహమును యుండు నెడల నేర్పడు భేదములు —30.

చంద్రునకు రెండవయింట నొక గ్రహమును పంద్రెండవయింట రెండు గ్రహములును యుండు నెడల నేర్పడు భేదములు.—30.

చంద్రునకు రెండవయింట మూడు గ్రహములు పంద్రెండవయింట నొక గ్రహమును నుండుటచే నేర్పడు భేదములు —20.

చంద్రునకు రెండవయింట నొక గ్రహమును పంద్రెండవయింట మూడు గ్రహములును నుండుటచే నేర్పడు భేదములు.—20.

చంద్రునకు రెండవ యింట నాలుగు గ్రహములు పంద్రెండవయింట నొకగ్రహముండుటచే నేర్పడు భేదములు.—5.

చంద్రునకు రెండవయింట నొకగ్రహమును పంద్రెండవయింట నాలుగు గ్రహములును నుండుటవలన నేర్పడు భేదములు —5.

చంద్రునకు రెండవయింట రెండుగ్రహములు పంద్రెండవయింట రెండు గ్రహము లుండు నెడల నేర్పడు భేదములు.—30.

చంద్రునకు రెండవయింట మూడుగ్రహములు పంద్రెండవయింట రెండు గ్రహము లుండుటచే నేర్పడు భేదములు —10.

చంద్రునకు రెండవయింట రెండు గ్రహములును పంద్రెండవయింట మూడు గ్రహములు నుండుటచే నేర్పడు భేదములు —10.

ఇట్లేర్పడిన దురుధురాయోగ భేదముల మొత్తము.—180.

### —సునఫానఫా యోగజనితుల స్వభావములు.—

శ్లో. స్వయ మధిగతవిత్తః పార్థివ స్తత్సమోవా
భవతి హి సునఫాయాం ధీ ధన ఖ్యాతి మాంశ్చ

ప్రభు రగదశరీర శ్శీలవా న్ఖ్యాత కీర్తి
ర్విషయ సుఖసువేషో నిర్వృత శ్చానఫాయామ్. 5

టీ. సునఫాయాం = సునఫా యోగమున జనించినవాఁడు, స్వయమధిగతవిత్తః = తన బాహుబలముచేత సంపాదింపఁబడిన ధనముగల, పార్థివః = పుడమి ఱేడగును. అథవా = అట్లుగాకపోయినను, తత్సమః = రాజతుల్యుఁడును, ధీధనఖ్యాతిమాంశ్చ = బుద్ధి ధనకీర్తులు గలవాఁడుగను, భవతి = అగును. అనఫాయాం = అనఫాయోగమునఁ బుట్టినవాఁడు, ప్రభుః = అప్రతిహతమైన ఆజ్ఞగలవాఁడును, అగదశరీరః = వ్యాధిలేని శరీరముగలవాఁడును, శీలవాన్ = శాంతివినయాది గుణములు గలవాఁడును, ఖ్యాతకీర్తిః = ప్రసిద్ధమైన కీర్తిగలవాఁడును, విషయసుఖ = శబ్దస్పర్శాది విషయసుఖములు గలవాఁడును, సువేషః = అనులేపన మాల్య భూషణాద్యలంకారములు గలవాఁడును, నిర్వృతః = మనోదుఃఖము లేనివాఁడును, భవతి = అగును

తా. (1) సునఫా యోగమున బుట్టినవాడు, తన బాహుబలముచేత సంపాదింపబడిన ధనముగల రాజగును. అట్లు గాదేని రాజతుల్యుండగును. మరియు బుద్ధి, కీర్తి, ధనము గలవాడగును. ఇందులకు, "శ్రీమాన్ స్వబాహువిభవో బహుధర్మశీలః శాస్త్రార్థ విద్బహుయశాః స్వగుణాభిరామః శాంతస్సుఖీ క్షితిపతి స్సుఖివాదవాస్యా త్సూతః పుమాన్ విపులధీ స్సునఫాభిధానే." అని సారావళీకారకుడు వచించియున్నాడు.

(2) అనఫాయోగమున బుట్టినవాడు అప్రతిహతమైన ఆజ్ఞగలవాడును, వ్యాధిలేని శరీరముగలవాడును, శాంతివినయాది గుణములుగలవాఁడును, విషయసుఖము గలవాఁడును, అనులేపన మాల్యభూషణా ద్యలంకారములు గలవాఁడును, మనోదుఃఖము లేనివాఁడును, అగుచున్నాడు.—ఇందులకు "వాగ్మీ ప్రభుర్గ్రా విణవానగద స్సుశీలో భోక్తాన్నపాన కుసుమాంబర భామినీనాం ఖ్యాతస్సమాహిత గుణ స్సుఖశ్శాన్త చిత్తో యోగేనిశాకరకృతే త్వనఫేసుషేమః." అని సారావళీకారకుడు వచించియున్నాడు.

## దురుధురా కేమద్రుమయోగ జనితుల స్వభావములు.

శ్లో. ఉత్పన్నభోగ సుఖభు గ్ధన వాహనాఢ్య
స్త్యాగాన్వితో దురధురా ప్రభవ స్సుభృత్యః
కేమద్రుమే మలినదుఃఖిత నీచనిస్స్వాః
ప్రేష్యాః ఖలాశ్చ నృపతే రపి వంశజాతాః. 6

టీ. దురుధురాప్రభవః = దురుధురాయోగమందు జనించినవాఁడు, ఉత్పన్నభోగసుఖభాక్ = లోకమందుగల అనేకవిధ భోగములచే సుఖముల ననుభవించువాఁడును, ధనవాహనాఢ్యః = ధనవాహనములచేత సంపూర్ణుడైనవాఁడును. త్యాగాన్వితః = వితరణగుణము గలవాఁడును, సుభృత్యః = మంచిభటులు గలవాఁడునగును, కేమద్రుమే = కేమద్రుమయోగమందుఁ బుట్టినవాఁడు, నృపతేః = రాజుయొక్క, వంశజాతాఅపి = కులమందుఁ బుట్టిన

వారలై నప్పటికిని, మలిన=మురికిగుడ్డలు గట్టుకొనియు స్నానముచేయకయు అసహ్యముగా దిరిగెడువారును, దుఃఖిత=శరీర మనోదుఃఖముల ననుభవించువారును, నీచ = అధమ కృత్యములు చేయువారును, నిస్వ = దరిద్రులును, ప్రేష్యాః = పరప్రేష్యజీవనులును, ఖలాశ్చః = దుష్టస్వభావముగలవారును, అగుదురు.

తా. (1) దురుధురాయోగమున జననమందినవాడు లోకమునందు గలిగియుండెడు సకల విధములగు భోగముల ననుభవించువాడును, ధనవాహనముల మిక్కుటముగ గలవాడును, వితరణ గుణముగలవాడును, శూరుడును, మంచిభటులు గలవాడును, అగును. ఇందునుగురించి, "వాగ్బుద్ధి విక్రమగుణైః ప్రథితః పృథివ్యాం స్వాతంత్ర్య సౌఖ్య ధనవాహన భోగభోగీ దాతా కుటుంబభరపోషణ లబ్ధఖేదః సద్వృత్త వాన్దురుధురా ప్రభవోధురిష్ఠః" అను సారావళీ వచన ముదాహరణముగ నున్నది.

(2) కేమద్రుమయోగమున బుట్టినవాడు రాజవంశజుడైనను, స్నానముచేయక మురికిగుడ్డలు కట్టుకొని తిరుగువాడును, శరీర మనోదుఃఖములను అనుభవించువాడును, నీచకృత్యములు చేయువాడును, దరిద్రుడును, వరప్రేష్యజీవనుడును, దుష్టస్వభావుడును అగును. రాజవంశజులే యిట్లుఅగుచుండగా నితరవంశజుల సంగతి చెప్పనక్కరలేదు. ఇందులకు:—"కాంతాన్నపాన గృహవస్త్ర సుహృద్విహీనః దారిద్ర్యదుఃఖ గదదైన్యమ లైరుపేతః ప్రేష్యః ఖలస్సకలలోక విరుద్ధవృత్తిః కేమద్రుమే భవతి పార్థివవంశజోఽపి." అని సారావళికారకుడు వచించియున్నాడు.

## —◇ { సునఫాది యోగములయందు జనించినవారికి గ్రహవశంబునగలుగు విశేష ఫలములు. } ◇—

శ్లో. ఉత్సాహ శౌర్య ధనసాహసవా న్మహీజః
సౌమ్యః పటు స్సువచనో నిపుణః కలాసు
జీవో ర్థ ధర్మ సుఖభు ఙ్నృప పూజితశ్చ
కామీ భృగు ర్బహుధనో విషయోపభోక్తా. 7

టీ. ఈ యోగములం గలుగఁజేయు గ్రహము, మహీజః = కుజుండయ్యె నేని (పుట్టినవాఁడు), ఉత్సాహ శౌర్యధన సాహసవాన్ = ఉత్సాహ శౌర్యధన సాహసములు గలవాఁడగును. సౌమ్యః=బుధుఁడయ్యె నేని, పటుః= సమర్థుఁడును, సువచః=మంచి వాక్చాతుర్యము గలవాఁడును, కలాసు = గీత వాద్యాది చతుష్షష్టికళలయందు, నిపుణః= నేర్పరియు నగును. జీవః = గురుండయ్యె నేని, అర్థధర్మసుఖభుక్ = ధనవంతుఁడై ధర్మంబు సేయుచు తానుగూడ సుఖముల ననుభవించువాఁ డగును. నృపపూజితశ్చ = రాజపూజితుఁడగును. భృగుః=శుక్రుఁడయ్యె నేని, కామీ= స్త్రీలోలుఁడును, బహుధనః=స్వర్ణరత్న రజతాది భేదమువలన బహువిధమైన ధనముగలవాఁడును, విషయోపభోక్తా = ఇంద్రియసుఖంబుల ననుభవించువాఁడగును

తా. ఈ సునఫాదియోగములను గలుగజేయు గ్రహము అంగారకు డగునెడల జాతకుడు, ఉత్సాహ శౌర్య ధన సాహసములు గలవాడగును. బుధుడయ్యేనేని మంచి వాక్చాతుర్యము, గీత వాద్యాది చతుష్షష్టికళా నిపుణత్వము సమర్థత్వము గలవాడగును. బృహస్పతి యగునెడల ధనవంతుడై ధర్మంబు సేయుచు తాను సుఖముల ననుభవించువాడును, రాజపూజితుడును, ఎల్లప్పుడును బంధుమిత్ర సమాగమము గలవాడును అగును. శుక్రుడైనచో స్త్రీలోలుడును, స్వర్ణ రత్న రజతాది భేదమువలన బహువిధములయిన ధనము గలవాడును, ఇంద్రియసుఖముల ననుభవించు వాడును అగును.

ఈ యోగములనిచ్చు శనైశ్చరుని ఫలములు, దృశ్యాదృశ్య చంద్ర ఫలములు.

శ్లో. పరవిభవ పరిచ్ఛదోపభోక్తా
రవితనయే బహుకార్య కృద్గణేశః
అశుభకృ దుడుపోఽహ్ని దృశ్యమూర్తి
ర్గళితతనుశ్చ శుభోఽన్యథాన్య దూహ్యమ్. 8

టీ. ఈ సునఫాదియోగములకు కర్త, రవితనయే = శనియయ్యేనేని. పర = ఇతరుల యొక్క, విభవ = ఐశ్వర్యములను, పరిచ్ఛద = గృహవస్త్ర వాహన పరివారములను ఉపభోక్తా = అనుభవించువాడును, బహుకార్యకృత్ = నానావిధ కార్యములం జేయు వాడును, గణేశః = సజాతీయ సముదాయాధి పతియు నగును. అహ్ని = పగటి యందు జనించినవానికి, ఉడుపః = చంద్రుడు, దృశ్యమూర్తిః = దృశ్యచక్రార్థమందు కానంబడు చుండెనేని, అశుభకృత్ = దారిద్ర్యాద్యశుభఫలంబులం జేయును. గళితతనుః = అదృశ్య చక్రార్థమందు కానరాక యుండెనేని, శుభః = పగలుపుట్టినవానికి ఐశ్వర్యాధి శుభ ఫలప్రదుండగును. అన్యథా = ఉక్తవైపరీత్యముగా జన్మకాలమందు చంద్రుడుండెనేని, అన్యత్ = ఉక్త వ్యతిరిక్తఫలము, ఊహ్యం = ఊహింపదగినది.

తా. ఈ యోగములను గలిగించువాడు శనైశ్చరు డగునెడల, ఇతరుల ఐశ్వర్యమును గృహవస్త్రవాహన పరివారములను, అనుభవించువాడును, నానావిధ కార్యములు చేయు వాడును, స్వజాతి బృందమునకు అధిపతియు అగును. ఈ సునఫాదియోగకర్త ఒక గ్రహము అగుచుండగా పైరెండు శ్లోకములయందు జెప్పబడియుండు ఫలితములను, గ్రహస్థిత స్థాన భేదమును చక్కగ నూహించి ఫలితములను జెప్పదగినది. కొందరు శాస్త్రకర్తలు ఈ విషయము ననుసరించి యిందు చెప్పబడియుండు గూఢభావమువలె గాక ఆయా యోగకర్తలవల్ల గల్గుగు ఫలములను సునఫానఫా దురధురాయోగములకు వేర్వేరుగా జెప్పుచున్నారు. అందు సారావళీకారకుడు.—

## సునఫా యోగకారక గ్రహఫలములు.

(1) "విక్రమవిత్తప్రాయో నిష్ఠుర వచనశ్చమూపతి శ్చండః, హింస్రోదంభ విరోధీ సునఫాయాం భౌమసంయోగే" అనగా, సునఫా యోగమును కలుగజేయు గ్రహము అంగా

రకు డగుచుండగా బుట్టినవాడు పరాక్రమము, ధనము, కఠినవాక్కు సేనాధిపత్యము, హింస, దంభము. విరోధము మొదలగునవి కలవాడగును.

(2) "శ్రుతిశాస్త్రగేయకుశలో ధర్మపరః కావ్యకృన్మనస్వీచ, సర్వహితో రుచిరతనుః సునఫాయాం సోమజేభవతి" అనగా సునఫాయోగకర్త బుధుడగుచుండగా బుట్టినవాడు, వేదశాస్త్రజ్ఞుడు, ధార్మికుడు, కవిత్వముదెలిసినవాడు, మానవంతుడు, సర్వజనప్రియుడు, సుందరశరీరము మొదలగునవి గలవాఁడును అగును.

(3) "విద్యాచార్యంఖ్యాతం నృపతిం నృపతిప్రియంవాపి సకుటుంబ ధనసమృద్ధం సునఫాయాం సురగురుః కురుతే" అనగా సునఫాయోగకారకుడు బృహస్పతి యగుచుండగా జనించినవాడు సర్వశాస్త్రములు దెలిసినవాడు, ప్రఖ్యాతిగలవాడు, కుటుంబధన సమృద్ధిగలవాడై రాజగుచున్నాడు అట్లుగాదేని రాజ సమానుడగుచున్నాడు.

(4) "స్త్రీక్షేత్రవిత్త విభవశ్చతుష్పదాఢ్య స్సువిక్రమో భవతి, నృపసత్కృత స్సుధీరో దక్షశ్శుక్రేణ సునఫాయామ్" అనగా సునఫాయోగమును గలుగజేయు గ్రహము శుక్రుడగుచుండగా బుట్టినవాడు స్త్రీ క్షేత్రము, ధనము, పశువులు, మొదలుగాగల ఐశ్వర్యములు గలవాడును, పరాక్రమము, రాజసన్మానము, మొదలగునవి గలవాడగుచున్నాడు.

(5) "నిపుణమతి ర్గ్రామపురై ర్నిత్యం సంపూజితో ధనసమృద్ధః, సునఫాయాం రవిపుత్రో క్రియానుగుప్తో భవేద్ధరః" అనగా శనైశ్చరుడు సునఫాయోగ కర్త యగుచుండగా జనించినవాడు, మంచిబుద్ధిగలవాడు, పురజనులచే పూజింపబడువాడు, ధనము, ధైర్యము, గోప్యములగు కార్యములు చేయువాడు నగుచున్నాడు.

### అనఫా యోగములందు గ్రహవశమున గలుగు ఫలములు.

(1) "చోరస్వామీ ఘృష్టస్స్వవశో మానీ రణోత్కటః, క్రోధీ శ్రేష్ఠ శ్లాఘ్యస్సుతనుః రుజేనఫాయాం" అనఫా యోగకారకుడు అంగారకు డగుచుండగా బుట్టినవాడు, చోరాధిపతి, స్వవిషయాసక్తుడు, మాన్యుడు, యుద్ధమున శూరత్వము, క్రోధము మొదలగు గుణములు గలవాడునునై కొనియాడ దగినవాడగును.

(2) "గంధర్వా లేఖ్యపటుః కవిః ప్రవక్తా నృపాత్త సత్కారః రుచిరతను స్త్వనఫాయాం ప్రసిద్ధకర్మా బుధేనభవేత్" అనఫాయోగకర్త బుధుడగుచుండగా జనించినవాడు, చిత్రలేఖనమునందు సమర్థుడు, కవిత్వము దెలిసినవాడు, చక్కగా మాటలాడువాడు, రాజానుగ్రహమున గలిగిన ఐశ్వర్యముగలవాడు, సుందరశరీరము గలవాడు, ప్రసిద్ధ కార్యానుకూలత గలవాడును అగును.

(3) "గాంభీర్యసత్వమేధా స్థానరతో బుద్ధిమాన్ నృపాత్తయశాః, అనఫాయాం త్రిదశగురౌ సంజాత స్సత్వవిద్భవతి" అనఫా యోగకారకుడు బృహస్పతి యగుచుండగా జననమందినవాడు, గాంభీర్యము, సత్వము, మేధాబుద్ధి రాజపూజ్యత మొదలగు ప్రసిద్ధ గుణములు గలవాడగుచున్నాడు.

(4) "యువతీనామతిసుభగః ప్రణయాక్షితి పస్యభోగవాక్ ఖ్యాతః, కాంతః కనక సమృద్ధస్త్వనఫాయాంభార్గవేథకతి" అనఫాయోగ కారకుడు శుక్రుడగుచుండగా బుట్టినవాడు, స్త్రీలకు అత్యంతప్రియుడును, రాజప్రియుడును, భోగము, ఖ్యాతి, సౌందర్యము మొదలగు గుణములు గలవాడై ధనాధిపుడగుచున్నాడు.

(5) విస్తీర్ణ భుజో నేతాగృహీత వాక్యశ్చతుష్పదసమృద్ధః దుర్వనితాయాభక్తో గుణ సహితశ్చార్క-పుత్రేణ. అనగా అనఫాయోగమును గలిగిం మనట్టిగ్రహము శనైశ్చరుడగుచుండగా బుట్టినమనుజుడు, పొడవైనభుజములుగలవాడు, అధిపతి, పరేంగితజ్ఞానముగలవాడు, పశుసమృద్ధిగలవాడు, దుష్టస్త్రీలయందాసక్తిగలవాడు, మంచిగుణములుగలవాడును అగును.

దురుధురాయోగములయందు గ్రహములవశంబున గలుగుఫలములు.

(1) "అనృతికోబహువిత్తో నిపుణోతిశఠోధికోలుబ్ధః వృద్ధాసతీప్రసక్తః కులాగ్రణీశ్శశినిభౌమబుధమధ్యే" చంద్రుడు కుజబుధులకు మధ్యనుండగాబుట్టినవాడు, అనృతమునందాసక్తిగలవాడు, ముక్కిలిధనవంతుడు, నిపుణుడు, కపటముగలవాడు లుబ్ధుడు, వృద్ధస్త్రీరతుడు, కులశ్రేష్ఠుడగుచున్నాడు.

(2) "ఖ్యాతః కర్మఠవిభవీ బహుజనవైరస్త్వమర్షణోహ్యాప్తః కులరక్షే కుజగుర్వో స్సంగ్రహాశ్శీలశ్శశినిమధ్యే" చంద్రుడు అంగారక గురులమధ్యయుండగా జననమందినవాడు. దయగలవాడు, కీర్తివంతుడు, కులగతుణయందు సమర్థుడు. సంగ్రహమునందు ఆసక్తిగలవాడును అగుచున్నాడు.

(3) "ఉత్తమరామ స్సుభగోవివాదశీలశ్శు ఖర్భ వేద్దతుః వ్యాయామిరణ శూరస్సితార యోర్మధ్యగేచంద్రే" చంద్రుడు శుక్రాంగారకుల మధ్యనుండగా బుట్టినవాడు, సౌందర్యము గలవాడు, కలహప్రియుడు, శుచిగలవాడు, రణప్రియుడు, సమర్థత మొదలగు గుణములు గలవాడును అగుచున్నాడు.

(4) "కుత్సితరామాషిద్రవణో బహుసంచయకారకో వ్యసనత ప్తః క్రోధీ, పుశునో, రిపుమాన్, యమారయోస్సాన్యే ద్దురుధురాయాం" చంద్రుడు శన్యంగారకుల మధ్యనుండగా జన్మించినవాడు, కుత్సితభార్యగలవాడు, ఆర్జనయందాసక్తిగలవాడు, వ్యసనముచేతపించువాడు, క్రోధము, లుబ్ధత్వము, శత్రువులు గలవాడును అగుచున్నాడు.

(5) "ధర్మపరశ్శాస్త్రజ్ఞో వాచాలస్సత్కవిర్ధనోపేతః త్యాగయుతో విఖ్యాతో బుధ గురు మధ్యేస్థితేచంద్రే" చంద్రుడు బుధబృహస్పతుల మధ్యయుండగా బుట్టినవాడు కవిత్వము, ధనము, ఖ్యాతి, త్యాగము మొదలగునవి గలవాడగుచున్నాడు.

(6) "ప్రియవాక్సుభగః కాంతః ప్రనృత్తగేయాదిషుప్రియోభవతి, సేవ్యశ్శూరో మంత్రీబుధసితయోర్దురు ధురాయోగ" చంద్రుడు, బుధశుక్రుల మధ్యనుండగా బుట్టినవాడు, ప్రియమగు మాటలు గలవాడును, సౌందర్యముగలవాడును, నృత్తగీతాదులయందాసక్తిగలవాడును, సేవకులుగలవాడును, శూరుడుగను నగుచున్నాడు.

(7) "దేవాద్దేశంగచ్ఛతి, విత్తపరోనాతివిద్యయాసహితః చంద్రే స్యేషాంపూజ్యస్స్వజనవిరోధీజ్ఞమందకౌమార్యధ్యే" చంద్రుడు, బుధశనైశ్చరుల మధ్యనుండగా బుట్టినవాడు స్వల్పమగువిద్యగలవాడు, ధనమునందు ఆసక్తిగలవాడు, దేశాటనము చేయువాడు; స్వజన విరోధి, అన్యులచేమిక్కిలి పూజింపబడువాడును అగుచున్నాడు

(8) "ధృతిమేధా శౌర్యయుతో నీతిజ్ఞః కనకరత్నపరిపూర్ణః ఖ్యాతో నృపకృత్యకరో గురుసితసౌర్యధురాయోగే" చంద్రుడు గురుశుక్రులమధ్యనుండగా జనించిన మనుష్యుడు ధైర్యము, మేధాశక్తి, శౌర్యము, నీతి, ఖ్యాతి, రాజకార్యాసక్తి మొదలగు గుణములు గలవాడై బంగారములు రత్నములు మొదలగు వానిచేబరిపూర్ణుడగువా డగుచున్నాడు.

(9) "సుఖనయవిజ్ఞానయుతః ప్రియవాగ్విద్వాన్ దురంధరోనార్యః శాంతో ధనీసురూపశ్చంద్రే గురుభానుజాంతస్థే" అనగా, చంద్రుడు గురుశనైశ్చరుల మధ్యనుండగా బుట్టిన మనుజుడు, సుఖము, నీతి,జ్ఞానము, ప్రియవాక్కులు,విద్య మొదలైనవి గలవాడగుచున్నాడు.

(10) "వృద్ధచరితంకులాగ్ర్యం నిపుణంస్త్రీవల్లభం, ధనసమృద్ధం నృపసత్కృతం, బహుధనంకురుతే చంద్రస్సితాసితయోః" అనగా, చంద్రుడు శుక్రశనైశ్చరుల మధ్యనుండగా బుట్టినమానవుడు, కులశ్రేష్ఠుండును, నిపుణుడును, స్త్రీలోలుడును, ధనము, రాజసన్మానము, మొదలగునవి గలవాడగుచున్నాడు.

యీప్రకారముగ ఫలితములవచించియున్నాడు. మరియు రెండుమూడు గ్రహములు యోగకర్తలై చంద్రునకు రెండవయింటగాని, పంన్రెండవయింటగాని నుండునెడల "ఉత్సాహశౌర్యధన సాహసవాన్ మహీజః" అనునట్టి వాక్యాదులయందు జెప్పబడియుండు ఫలములను, గ్రహముల నీచశత్రు క్షేత్రనవాంశాది స్థానస్థితులనెరింగి ఫలితము లను జెప్పదగినది.

## దృశ్యాదృశ్య చంద్ర ఫలములు.

చంద్రుడు దృశ్యచక్రార్ధమునందుండగా పగలుబుట్టినవాడు దారిద్ర్యాద్యశుభఫలముల బొందుచున్నాడు. చంద్రుడు అదృశ్యచక్రార్ధమునందుండగా పగలు బుట్టినవానికి ఐశ్వర్యాదులు సంపూర్ణముగ గలుగుచున్నవి. ఉక్తవైపరీత్యముగ గలుగునెడల ననగా రాత్రి జనించినవానికి, దృశ్యచక్రార్ధమునందు చంద్రుడుండునెడల శుభఫలితములు గలుగుననియు, అదృశ్యచక్రార్ధమునందుండగా శుభఫలితములు గలుగవనియు సూచింపదగియున్నది.

## లగ్నచంద్రుల, ఉపచయస్థానస్థిత సౌమ్యగ్రహ ఫలములు.

శ్లో. లగ్నాదతీవ వసుమాన్వసుమాంశ్చ శశాంకా
త్సౌమ్య గ్రహై రుపచయోపగతైస్సమస్తైః
ద్వాభ్యాం సమోల్ప వసుమాంశ్చ తదూనతాయా
మన్యేష్వసత్స్వపి ఫలేష్విద ముక్త మేన. 9

టీ. లగ్నాత్ = లగ్నమునకు, ఉపచయోపగతైః=ఉపచయస్థానములను బొందియున్న, సమస్తైః=సకలములైన, సౌమ్యగ్రహైః = శుభగ్రహములచేత, అనఁగా బుధ గురు శుక్రులచేత, అతీవవసుమాన్ = మిక్కిలి ధనవంతుఁడగును, శశాంకాత్ = చంద్రుఁడున్న రాశికి, ఉపచయస్థానమందున్న, సౌమ్యైః = బుధ గురు శుక్రులచేతను, వసుమాన్ = ధనవంతుఁడగును, ద్వాభ్యాం = జన్మలగ్నమునకైనను, చంద్రలగ్నమునకైనను, ఉపచయస్థానమునందున్న రెండు శుభగ్రహములచేత, సమః = సామాన్యధనవంతుఁ డగును, తదూనతాయాం = లగ్నమునకైనను చంద్రునికైనను ఉపచయస్థానమం దొక శుభగ్రహ ముండెనేని, అల్పవసుమాన్ = స్వల్పధనవంతుఁడగును. అన్యేషు=ఇతర యోగజనితములైన, ఫలేషు= ఫలములు, అసత్స్వపి = అశుభకరములై యున్నను, ఇదం = ఈశ్లోకమందుఁ జెప్పఁబడిన శుభ ఫలము, ఉత్కటేన = అధికముగా నగును. వ్యాఖ్యానాంతరమందు, "అన్యేషు సత్స్వపి ఫలే ష్విదముత్కటేన" అని పఠింపఁబడి, అన్యేషు = అనుపచయస్థానగత గ్రహములచేత ప్రాప్తములైన యోగములు, విఫలేషుసత్సు = నిష్ఫలము లగుచుండఁగా, ఇదం = ఈ యుపచయస్థానగత శుభగ్రహఫలము,ఉత్కటేన= అధికముగా నగునని యర్థము చేయఁబడియున్నది.

తా. జననలగ్నమునకు ఉపచయస్థానములగు తృతీయ, షష్ఠ, దశమైకాదశములయందు సౌమ్యగ్రహములగు బుధ, గురు, శుక్రులు ముగ్గురును యుండునెడల జాతకుడు అధిక ధనవంతు డగుచున్నాడు. చంద్రునకు ఉపచయములందు సౌమ్యగ్రహములగు బుధ, చంద్రులున్నను జాతకుడు ధనవంతుడగుచున్నాడు. జన్మలగ్నమునకైనను, చంద్రలగ్నమునకైనను ఉపచయస్థానములందున్న రెండు శుభగ్రహములచే జాతకుడు సామాన్యధనవంతు డగుచున్నాడు. జననలగ్నమునకైనను చంద్రుడున్న రాశికైనను ఉపచయ రాశులయందు యొక శుభగ్రహముమాత్ర ముండుటవలన జాతకుడు స్వల్పధనవంతు డగుచున్నాడు. ఈ విధముగ జెప్పుటవలన జాతకుని జన్మలగ్నమునకైనను, చంద్రలగ్నమునకైనను, ఉపచయస్థానములయందు శుభగ్రహమున్నయెడల ధనవంతుడగుననియు, శుభగ్రహము లేకుండునెడల దరిద్రుడగుననియు నూహింపదగియున్నది. మరియు ఇతర యోగజనితములైన ఫలములను అశుభకరములై యున్నను ఈశ్లోకమున జెప్పబడిన ఫలములు బాహుళ్యముగా నగుననగా, లగ్నచంద్రులకు ఉపచయస్థానములందు సౌమ్యగ్రహము లుండునెడల ఆ జాతకమున కేమద్రుమాది అశుభయోగము లున్నను తత్ఫలములు క్షీణములై ఉపచయ స్థానస్థిత సౌమ్యగ్రహ ఫలితములే అధికముగా నగునని దెలియదగినది. వ్యాఖ్యానాంతరమున అనుపచయస్థాన స్థిత గ్రహయోగ ఫలితములకన్నను ఉపచయస్థానస్థిత శుభగ్రహ ఫలితములే యధికముగా గలుగునని భావింప బడియున్నది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
చంద్రయోగాధ్యాయ నామక
త్రయోదశాధ్యాయము.



శ్రీ రస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ద్విగ్రహయోగాధ్యాయము. చతుర్దశాధ్యాయము.—14



**సూర్యుడు చంద్రాదియుక్తుడగుచుండగా బుట్టినవాని స్వభావములు.**

శ్లో. తిగ్మాంశు ర్జనయ త్యుషేశ సహితో యంత్రాశ్మకారం నరం
భౌమే నాఘరతం బుధేన నిపుణం ధీకీర్తిసౌఖ్యాన్వితం
క్రూరం వాక్పతి నాన్యకార్య నిరతం శుక్రేణ రంగాయుధై
ర్లబ్ధస్వం రవిజేన ధాతు కుశలం భాండ ప్రకారేషువా. 1

టీ. తిగ్మాంశుః=సూర్యుఁడు, ఉషేశసహితః=చంద్రునితోఁగూడినవాఁడై, యంత్రాశ్మకారం=నానావిధయంత్రములను బాషాణకర్మలను, జేయునట్టి నరం=పురుషుని, జనయతి=పుట్టించును. భౌమేన=కుజునితోఁగూడినవాఁడై, అఘరతం=పాపాసక్తుని, పుట్టించును,బుధేన=బుధునితోఁగూడినవాఁడై, నిపుణం=కార్యములయందుసూక్ష్మబుద్ధిగలవానిని, ధీకీర్తి సౌఖ్యాన్వితం = బుద్ధికీర్తిసుఖములతోఁగూడినవానినిజనింపఁజేయును, వాక్పతినా = బృహస్పతితోఁగూడినవాఁడై, క్రూరం=విమతుస్వభావముగలవానిని, అన్యకార్యనిరతం = ఇతరులకార్యములయందాసక్తిగలవానిని, జనింపఁజేయును, శుక్రేణ=శుక్రునితోఁగూడినవాఁడై, రంగాయుధైః రంగ=మల్లాదిక్రియలచేతననికొందఱు, నాట్యక్రియలచేతననికొందఱు, ఆయుధైః=ఖడ్గశస్త్రాద్యాయుధములచేతను,లబ్ధస్వం=పొందఁబడినధనముగలవానిని, జనింపఁజేయును, రవిజేన=శనితోఁగూడినవాఁడై, ధాతుకుశలం= తామ్రాద్యుత్పాదకమృత్తికలుగాని గైరికాదులుగాని ధాతువులనంబడును. వానిక్రియలయందు, కుశలం=సమర్థుఁడైనవానినైనను, భాండప్రకారేషువా = తామ్రరజతాది పాత్రరచనా ప్రకారములయందు సమర్థుఁడైన వానినైనను జనింపఁజేయును.

తా. 1. సూర్యుడు చంద్రసహితుడైయున్న నానావిధయంత్రములను, బాషాణకర్మ జేయునటి పురుషునిబుట్టించును. ఇందువిషయమై గ్రంథాంతరమున "యువతీనాంవశగస్సాంగ దవినీతఃకూట విత్పృథులవిత్తః, ఆసవవిక్రయకుశలో రవ్యుడుపతో్యః క్రియానిపుణః" అ

గా రవి చంద్రులు కలసి ఒకరాశియందుండు కాలమునబుట్టినవాడు స్త్రీవశవర్తి నీతిలేనివాడు, కపటమెరిగినవాడు, ధనికుడు, కార్యములయందు నిపుణత మొదలగు గుణములుగలవాడగు చున్నాడు అనిచెప్పబడియున్నది

2. సూర్యుడు అంగారకునితో గూడినవాడైనయెడల పాపాసక్తునిగ జనింపజేయును. ఇందువిషయమై "ఓజస్వీసాహసికోమూర్ఖో బలసత్వసంయుతో నృతవాక్ పాపమతిర్వధ నిరతో రవికుజయోస్స్యాత్ప్రచండశ్చ" అనగా రవ్యంగారకులు కలిసి ఒకరాశియందుండు కాలమున జనించినవాడు సాహసము, మూర్ఖత, బలము, సత్వము, అనృతము, పాపబుద్ధి, కోపము, మొదలగునవికలవాడై వధయందత్యాసక్తిగలవాడగుచున్నాడని వచింపబడియున్నది.

3. సూర్యుడు బుధునితో జేరినయెడల కార్యములయందు సమర్థతగలవానినిబుట్టించును ఇందువిషయమై:—"సేవాకృదస్థిర ధనోరవిజ్ఞయోః ప్రియవచాయశోర్థ స్స్యాత్ ఆర్యః క్షితిపతిదయితస్సతాంచబలరూప విత్తవిద్యావాన్" అని యుండుటచే సూర్యుడుబుధునితో గూడియుండుకాలమున జనించినవాడు సేవ, అస్థిరమైనధనము, ప్రియవచనములునుగలవాడు, యశస్సుధనముగాగలవాడు, పూజ్యుడు, రాజప్రియుడు, సత్పురుషులలో శ్రేష్ఠుడు, బలము రూపము, ధనము మొదలగునవి కలవాడగుచున్నాడు అని భావింపదగియున్నది.

4 సూర్యుడు బృహస్పతితో జేరినయెడల జాతకుని విషమస్వభావముగలవానినిగాను, ఇతరులకార్యములయందాసక్తినిగలవానినిగాను జేయుచున్నాడు. ఈవిషయమై "బహుధర్మోనృపసచివస్సుబుద్ధిమాన్మిత్ర సంశ్రయాద్ధాప్తః సూర్యే బృహస్పతియుతే భవేదుపాధ్యాయ సంజ్ఞశ్చ" అనగా సూర్యుడు బృహస్పతితోగూడియుండు కాలమునజన్మించినవాడు ధార్మికుడు, రాజమంత్రి, బుద్ధిమంతుడు, మిత్రులవలనగాబడినధనము గలవాడు, ఉపాధ్యాయుడునునగుచున్నాడని సారావళీకారకుడు వచించియుండుటచే, వరాహమిహిరాచార్యుని యభిప్రాయముకొంత భేదించుచున్నది. అయినను, కల్యాణవర్మయు యావనాచార్యుల వచనానుగుణ్యముగ వచించియుండుటచే జ్యోతిష్కులుపర్యాలోచన జేయదగినది.

5. సూర్యుడుశుక్రునితో జేరినవాడైనచో, మల్లాదిక్రియలచేతనైనను లేక నాట్యక్రియలచేతను, ఖడ్గశస్త్రాద్యాయుధములచేతను పొందబడినధనము గలవానినిగ జనింపజేయుచున్నాడు. ఇందులకు సారావళీకారకుడు "శస్త్రప్రహరణ విద్యాశక్తియుతో నేత్రదుర్బలశ్చరవే, రంగజ్ఞోరవిసితయోః స్త్రీసంగాల్లబ్ధ బంధుధనః" అనగా సూర్యుడుశుక్రునితో జేరియుండుకాలమునబుట్టినవాడు శస్త్రవిద్య మొదలుగాగల విద్యయందునిపుణుడును, వార్ధకమునందు దృష్టిబలములేనివాడును, నాట్యక్రియలను దెలిసినవాడును, వివాహానంతరము, ధనము, బంధువులు గలవాడగుచున్నాడని వచించియున్నాడు.

6. సూర్యుడు శనైశ్చరునితో గలసియుండునెడల జాతకునితామ్రాద్యుత్పాదకవృత్తి కాస్త్రకారాదిధాతువులయందు సమర్థుడైనవానినిగానైనను, తద్ధాతువులవలన నగు పాత్రాదుల జేయువానిగనైనను, జేయును, "భాండంపాత్రే వణిజ్మాలధనే భూపాశ్వభూషణయోః" అని

మేదిని నింఘుంటువున జెప్పబడియుండుటచే పాత్రనిర్మాపకునిగ జేయుననియు జెప్పఁదగి యున్నది. ఇదియుఁగాక "ధాతుజ్ఞో ధర్మయయ స్స్వధర్మనిరతః ప్రణష్టసుతదారః నిజవంశ గుణైశ్వర్యద్ధశ్చనిరవోఽర్యరల్పశీలశ్చ" అని సారావళీవచనముండుటచే సూర్యుడు శనైశ్చరునితోఁ గూడియుండు కాలమునజన్మించినవాడు, భార్యాపుత్రులు మొదలుగాగలవారియందు భేదముగల వాడును,స్వధర్మసంపాసక్తిమొదలగు గుణములుగలవాఁడగుచున్నాఁడనియు నూహింపదగును.

చంద్రుఁడు అంగారకాది గ్రహయుక్తుఁడగుచుండగా బుట్టినవానిలక్షణములు.

శ్లో॥ కూటస్త్ర్యాసవకుంభపణ్య మశివం మాతు స్సవక్రశ్శశీ
సజ్ఞః ప్రశ్రిత వాక్య మర్థనిపుణం సౌభాగ్యకీర్త్యన్వితం
విక్రాన్తం కులముఖ్య మస్థిరమతిం విత్తేశ్వరం సాంగిరా
వస్త్రాణాం ససితః క్రియాదికుశలం సార్కిః పునర్భూసుతమ్. 2

టీ. శశీ=చంద్రుఁడు, సవక్రః=కుజునితోఁగూడినవాఁడై, కూటస్త్ర్యాసవకుంభ పణ్యం=(ఇక్కడపణ్యశబ్దమునుకూటాదులయందు ప్రత్యేకముగాసంబంధింపఁజేసి కూటపణ్యం స్త్రీపణ్యం, ఆసవపణ్యం, కుంభపణ్యం, అని చెప్పఁదగినది.) కూటపణ్యం=కపటంబున నొక వస్తువునకు మఱియొకవస్తు రూపమును గల్పించి విక్రయించు వానిని, స్త్రీపణ్యం=స్త్రీనివిక్ర యించువానిని, ఆసవపణ్యం=మద్యమువిక్రయించువానిని, కుంభపణ్యం = కుండలమ్మెడువానిని, మాతుః=తల్లికి, అశివం = అశ్రేయస్కరుఁడైన వానిని, జనింపజేయును. (కూటపణ్యుఁడనఁగా నానావిధ ద్రవ్యము విక్రయించువాఁడనికొందఱు), సజ్ఞః=బుధునితోఁగూడినవాఁడై, ప్రశ్రితవాక్యం=ప్రియభాషణశీలుని, అర్థనిపుణం=ద్రవ్యార్జనమందు సూక్ష్మదృష్టి గలవానిని సౌభాగ్యకీర్త్యన్వితం=సౌభాగ్యకీర్తులతోఁ గూడినవానిని, జనింపఁజేయును, సాంగిరాః=బృహస్పతితోఁగూడినవాఁడై, విక్రాంతం=పరాక్రమవంతుని, కులముఖ్యం=బంధుప్రధానుని, అస్థిర మతిం=చపలచిత్తుని, విత్తేశ్వరం=ధనవంతుని, జనింపఁజేయును, ససితః = శుక్రునితోఁగూడిన వాఁడై, వస్త్రాణాం=వస్త్రములయొక్క, క్రియాదికుశలం=క్రయవిక్రయరంజనాదిక్రియ లయందు నేర్పుగల వానినిజనింపఁజేయును, సార్కిః=శనితోఁగూడినవాఁడై, పునర్భూసుతం= మారుమనువు దానియందుకొడుకును బుట్టించును.

తా. 1. చంద్రుడు అంగారకునితోఁగూడినచోఁ కపటముగా ఒకవస్తువునకు మఱియొక వస్తురూపమును, గల్పించివిక్రయించువానిని, స్త్రీని విక్రయించువానిని (కొందరు అన్యకుల జుడు అన్యకుల కన్యావిక్రయముజేయువాఁడని భావించెదరు.) మద్యము, నీచపదార్థములు విక్రయించెడువానిని, కుండలమ్మెడువానిని జనింపజేయును, మఱియును, తల్లికిశ్రేయస్సును గల్గింపనివానిని జనింపజేయును, ఇదియుఁగాక నీవిషయమై "శూరోరణప్రతాపీ మల్లోస్సగ్వేద వార్తదేవాశ్చ మృచ్చర్మధాతుశిల్పీకూటజ్ఞ శ్చంద్రకుజయోగే" అని కొందరు వచించి యుండుటచే, చంద్రుడంగారకునితో జేరి యొకరాశియందుండు కాలమున జననమందినమాన

వుడు, శూరుడు, యుద్ధమునందు ప్రతాపముగలవాడు) బాహుయుద్ధము జేయువాడు, రక్త వేదనవలనగలుగు వ్యాధిచేపీడింపబడువాడు, మత్తుడు, మృత్తిక, చర్మము మొదలగునాటిచే చిత్తరువులు సేయువాడును, కపటముగలవాడుగ నగుచున్నాడనియు నూహింపదగియున్నది.

2. చంద్రుడు బుధునితో గూడిన వాడయ్యేనేని, జాతకుని, ప్రియభాషణశీలునిగాను, ద్రవ్యార్జనయందు సూక్ష్మదృష్టిగలవానినిగాను, సౌభాగ్యకీర్తులతో గూడినవానిగాను జేయును. ఇందువిషయమై సారావళియందు "కావ్యకథాస్వతి నిపుణస్సధన స్త్రీసమ్మతస్సురూపశ్చ స్మితవదన శ్శశిబుధ సంగర్భరుచి స్స్యాద్విశిష్టగుణః" అనగా చంద్రుడు బుధునితో గలసి యొక రాశియందుండగా జనించిన మానవుడు, కావ్యకథలయందు నిపుణుడు, ధనికుడు, స్త్రీ జితుడు, సౌందర్యముగలవాడు, చిరునగవుతో గూడిన ముఖముగలవాడు, ధర్మమందాసక్తి గలిగి, శ్రేష్ఠమగుగుణములు గలవాడగుచున్నాడని వచింపబడియున్నది.

3. చంద్రుడు బృహస్పతితో గూడినచో జాతకుని, పరాక్రమవంతునిగాను, బంధుశ్రేష్ఠునిగాను, చపలచిత్తునిగాను, ధనవంతునిగాను జేయును, ఈ విషయమై "దృఢసౌహృదోవినీతిస్స్వబంధుసన్మానకృద్ధనేశశ్చ గుర్విందోశ్శుభశీల స్సురద్విజేభ్యోరతో భవేత్పురుషః" అనగా చంద్రుడు బృహస్పతితో కలిసి యుండగాజనించినవాడు, స్థిరమైన స్నేహితులుగలవాడు, నీతిగలవాడు, ధనికుడు, బంధువులను సత్కరించువాడు, దేవతలయందును, బ్రాహ్మణులయందును భక్తిగలవాడని వచింపబడియున్నది.

4. చంద్రుడు శుక్రునితో జేరియుండు కాలమున జనించినవానిని వస్త్రములు విక్రయించుటయందును, గానకళాకుశలత్వమునందును, సమర్థతగలవానిగ జేయును, ఇందు విషయమై "స్రగ్గంధాంబరయుక్తః క్రియావిధిజ్ఞః కులప్రియోత్యలసః, క్రయవిక్రయేషు కుశలశ్శశిభార్గవయోస్సదాయోగే" అనగా చంద్రశుక్రులు కలసియుండుకాలమున జననమందినవాడు, పుష్పమాలికలు, ధౌతాంబరములు మొదలగు పరిమళద్రవ్యముల ననుభవించువాడు, కార్యవిధులనుదెలిసినవాడు, వంశమునందు శ్రేష్ఠుడు, మిక్కిలిమాంద్యముగలవాడు, క్రయ విక్రయములయందు నేర్పరివాడగుచున్నాడని వచింపబడియున్నది.

5. చంద్రుడు శనైశ్చరునితో గూడినచో, మాఱుమనువు కొమారునిగబుట్టించునని తెలియదగినది. పునర్భూలక్షణము:—"పరిణీతాపతిం హిత్వా సవర్ణం కామతఃశ్రయేత్, అక్షతా చక్షతాచైవ పునర్భూ సంస్కృతాపునః" అని లఘుజాతకమునందు చెప్పబడి యుండుటచేసి, చంద్రుడు, శనైశ్చరునితో చేరియుండగా బుట్టినవాడు తల్లియొక్క ద్వితీయవరునికిబుట్టినవాడని నూహింపదగియున్నది. అయినను సారావళియందీ విషయమునకు "జీర్ణవధూజనరమణోగజాశ్వసంపాదకో నిగమశీలః వశ్యోవిధనః పురుషః పరాజితస్స్యాచ్ఛశాంకశనియోగే" అనగా చంద్రశనైశ్చరులు కలిసియుండుకాలమున జనించినవాడు, వృద్ధాంగనాప్రియుడు, గజాశ్వములు మొదలగునవి కలవాడు, వేదమునందాసక్తిగలవాడు, జనవశ్యుడు, ధనహీనుడు, పరాజితుడగుచున్నాడని వచింపబడియుండుటచే యోచించిఫలములు చెప్పదగియున్నది.

**అంగారకుడు బుధాదులతో గూడియుండగా జనించినవానిలక్షణములు.**

శ్లో. మూలాది స్నేహకూటై ర్వ్యవహరతి వణిగ్బాహుయోద్ధా ససౌమ్యే
పుర్యధ్యక్షః ససజీవే భవతి నరపతిః ప్రాప్తవిత్తో ద్విజో వా
గోపో మల్లో ఽథ దక్షః పరయువతిరతో ద్యూతకృ త్సాసురేజ్యే
దుఃఖార్తో సత్యసంధ స్ససవితృతనయే భూమిజే నిందితశ్చ. 3

టీ. భూమిజే=కుజుడు, ససౌమ్యే = బుధునితోఁగూడినవాఁడగు చుండఁగాబుట్టిన వాఁడు, వణిక్=వర్తకుఁడై, మూలాదిస్నేహకూటైః, మూల=కందమూలాదులును, ఆదిశబ్దము వలన ఫలపుష్పవల్కలాదులును, స్నేహ = ఘృతతైలాదులును, కూటైః=కృత్రిమద్రవ్యములును, వీనిచేత, వ్యవహరతి = వ్యాపారముచేయువాఁడును, బాహుయోధా = మల్లయుద్ధముసేయువాఁడునగును, సజీవే = బృహస్పతితోఁ గూడినవాఁడగుచుండఁగా జనించిన వాఁడు, పుర్యధ్యక్షః = పట్టణాధిపతియైనను, నరపతిః = రాజ్యాధిపతియైనను, ప్రాప్తవిత్తః = లబ్ధధనుఁడైనను, ద్విజః= బ్రాహ్మణుఁడైనను, అగును ("ఈపురాధ్యక్షత్వాదులను గ్రహబలాబలములం బట్టిచెప్పవలసినది" "ప్రాప్తవిద్యః" అనుపాఠమందు పొందఁబడిన విద్య గలవాఁడని యర్థము, సాసురేజ్యే = శుక్రునితోఁగూడిన వాఁడగుచుండఁగా జనించినవాఁడు, గోపః=గోపాలకుఁడును, మల్లః = బాహుయుద్ధముసేయువాఁడును, దక్షః = సమర్థుఁడును, పరయువతిరతః = పరస్త్రీసంసక్తుఁడును, ద్యూతకృత్ = జూదమాడెడువాఁడునగును, "సూతకృత్"=అనిపఠించి బండ్లునడిపించువాఁడని చెప్పుదురు, ససవితృతనయే = శనితోఁగూడినవాఁ డగుచుండఁగా, జనించినవాఁడు, దుఃఖార్తః = దుఃఖపీడితుఁడును, అసత్యసంధః = అనృతభాషియు, నిందితః = జననిందితుఁడునగును (నిందితుఁడనఁగా కుత్సితుండనికొంద అందురు)

తా. 1. అంగారకుడు బుధునితో గూడినకాలమున బుట్టినవాడు. కందమూల ఫలపుష్ప వల్కలాదులను, ఘృతతైలాదులను విక్రయించి వ్యాపారాది కృత్రిమవృత్తిచే ధనము నార్జించువాడును, మల్ల యుద్ధముచేయువాడును అగునువ్వాడు, ఇందులగురించి "స్త్రీదుగ్ధగోల్పవిత్త స్సువర్ణలోహ ప్రకారక స్థపతిః, దుష్టస్త్రీవిధవానాం కుజబుధయో రౌషధ క్రియానిపుణః" అనగా ఎవనిజనన కాలమున అంగారక బుధులు గలిసియుందురో అట్టివాడు దుష్టస్త్రీగలవాడు, స్వల్పధనికుడు, సువర్ణాదులను సేయువాడు, దుష్టులైన విధవాంగనల కుప్రియుడు, ఔషధములు జేయుట యందు నేర్పరి యగుచున్నాడని వచింప బడియున్నది.

2. అంగారకుడు బృహస్పతితో జేరియుండగా జనించినవాడు, పురాధి పతియైనను, రాజ్యాధి పతియైనను, ధనికుడైనను, బ్రాహ్మణుండైనను నగును ఈవిషయమున గ్రహముల బలీయతననుసరించి విద్యావినయ సంపన్నతను గూడజెప్పదగినది. ఈవిషయమై "శిల్పశ్రుతి శాస్త్రజ్ఞో మేధావీ వాగ్విశారదోమతిమాన్ అస్త్రప్రియప్రధానస్సుర గురు కుజయోస్స మాగతయోః" అనగా అంగారక గురువులు కూడియుండు కాలమున బుట్టిన మనుష్యుడు,

ల్పశాస్త్రజ్ఞుడు వేదమును దెలిసినవాడు ధారణాశక్తిగలవాడు, నేర్పుగ మాటలాడువాడు, బుద్ధిమంతుడు, అస్త్రశాస్త్రము నెరిగిన వారలలో శ్రేష్ఠుడగు చున్నాడని కల్యాణ వర్మవచించి యున్నాడు.

3. అంగారకుడు శుక్రునితో గూడినచో జాతకుడు, గోపాలకుడును, బాహుయుద్ధము సేయువాడును, సమర్థుండును, పరస్త్రీరతుండును, ద్యూతమునందా సక్తిగలవాడును అగును ఇందుగల "ద్యూతకృత్" అనుదానికిబదులుగా "కూటకృత్" అనిపఠించిశకటముల నడిపించువాడని కొందరను చున్నారు ఈవిషయమై "పూజ్యోగణ ప్రధానో గణితజ్ఞో స్యాంగనాసక్తః ద్యూతానృత కార్యరతో విటశ్చసిత రుధిర సంయోగే" అనగా అంగారక శుక్రులుకలిసి యుండుకాలమున జనించినవాడు, పూజ్యుడు, సేనానాయకుడు, గణితజ్ఞుడు, పరస్త్రీసంసక్తుడు, కోపముగలవాడు, ద్యూతము, అనృతము దెలిసిన వాడగుచున్నాడని సారావళీకారకుడు వచించియున్నాడు.

4. అంగారకుడు శనితోగూడినటులయిన జాతకుడు దుఃఖపీడితుడును, అనృతభాషియు, జననిందితుడును, కుత్సితాన్నభోజనము గలవాడునుఅగుచున్నాడు. ఇందును గురించి "ధాత్వింద్రజాల కుశలః ప్రపంచక స్తేయ కర్మకుశలశ్చ కుజసౌరయో ర్విధర్మశ్శస్త్ర విషఘ్నః కలియచిస్స్యాత్" అనగా అంగారక శనైశ్చరులు గూడియుండగా బుట్టిన మానవుడు గైరికాది ధాతువులచే ఇంద్రజాలములయందు కుశలుడు, విస్తరించువాడు, దొంగతనమునందు నేర్పరి, ధర్మశూన్యుడు, శస్త్రవిషాదులచే మరణము నొందువాడు, అసత్యమునందా సక్తిగలవాడును అగుచున్నాడని యితరగ్రంథములయందు వచింప బడియున్నది.

బుధుడు, గురు, శుక్ర, శనైశ్చరులతో గూడియుండగను,

బృహస్పతి శుక్రాదులతో గూడియుండగను బుట్టినవారల స్వభావములు.

శ్లో. సౌమ్యే రంగచరో బృహస్పతియుతే గీతప్రియోనృత్యవి
ద్వాగ్మీభూ గణప స్సితేన మృదునా మాయాపటుర్లంఘకః
సద్విద్యో ధనదారవా న్బహుగుణ శ్శుక్రేణ యుక్తే గురౌ
జ్ఞేయః శ్మశ్రుకరోసితేన ఘటకృజ్జాతోన్న కారోపివా. 4

టీ. సౌమ్యే = బుధుడు, బృహస్పతియుతే = గురుయుక్తుడై యుండగా, జాతః = పుట్టినవాడు, రంగచరః = మల్లాది యుద్ధరంగమందు చరించువాడును, గీతప్రియః = గానలోలుడును, నృత్యవిత్ = నాట్యశాస్త్రాభిజ్ఞుడునగును, సితేన = శుక్రునితో గూడినవాడై యుండగా జనించినవాడు, వాగ్మీ = మాటలచేత నెవటివానిని మెప్పించు నేర్పుగలవాడును, భూగణపః = భూమికిని సభకును అధిపతియైనవాడునుఅగును, మృదునా = శనితో గూడియుండగా జనించినవాడు, మాయాపటుః = పరులమోసపుచ్చుటయందు నేర్పరియును, లంఘకః = ఆచార్యాదివచనముల నుల్లంఘించువాడునుఅగును, గురౌ = బృహస్ప

తి, శుక్రేణ= శుక్రునితోడ, యుక్తే=కూడినవాఁడుగ చుండఁగా పుట్టినవాఁడు, సద్విద్యాధన దారవాణ్ = శ్రేష్ఠములయిన విద్యాధనకళత్రములు గలవాఁడును, అఁగానుత్తము విద్యయు, అధిక ధనంబును మంచి పెండ్లామును గలవాఁడనుట, బహుగుణః = అనేక సుగుణములుగలవాఁడునగును, గురౌ=బృహస్పతి, అసితేన=శనితోఁగూడి యుండఁగా జాతః=పుట్టినవాఁడు, శ్మశ్రుకరః = మంగలవాఁడైనను, ఘటకృత్ = కుమ్మరవాఁడైనను, అన్నకృత్=వంటవాఁడైననగును, దూతోన్నకారో పివాఅని పాఠాంతరము.

తా. 1. బుధుడు గురు యుక్తుడగుచుండగా జనించినవాడు మల్లక్రీడాదుల యందు దిరుగు వాడును, గానలోలుడును, నాట్యశాస్త్రాభిజ్ఞుండును నగుచున్నాడు ఈవిషయము నకు "నృత్తనిధేవిజ్ఞాతా ప్రాజ్ఞోపి చగే యశాస్త్రవిన్మనుజః,బుధగురుయోగేమతిమాణ్ సౌఖ్యయుతే జాయతేవశ్యం" అనగా బుధగురులు కలిసి ఒకరాశియందుండు కాలమున బుట్టినవాడు, నాట్యవిద్యనెరిగినవాడు ప్రాజ్ఞుడు, సంగీతశాస్త్రమును దెలిసినవాడు బుద్ధిమంతుడు, సౌఖ్యము మొదలగునవి గలవాడగుచున్నాడనియు నితరగ్రంథ కర్తలువచించి యున్నారు.

2. బుధుడు శుక్రయుక్తుండగుచుండగా బుట్టినవాడు మాటలచేత నెదుటివారిని మెప్పించు నేర్పుగలవాడును, విస్తారముగ భూమిగలవాడును, సభాధిపుడును అగుచున్నాడు. మరియు "అతిశయధనో నయజ్ఞో బహుశిల్పో వేదవిత్సువాక్యస్స్యాత్ గీతజ్ఞోహాస్యరతిర్భృగసిత యోర్గంధమాల్యరుచిః" అనగా బుధశుక్రులు కలిసి యుండుకాలమున జననమందినవాడు గొప్పధనికుడు, నీతిదెలిసినవాడు, శిల్పము దెలిసినవాడు, వేదముల దెలిసినవాడు, నేర్పుగమాటలాడువాడు, గానము హాస్యము అనువానియందు సమర్థుడు గంధపుష్పాదులనను భవించు వాడగుచున్నాడని కొందరు వచించుచున్నారు.

3. బుధుడు శనైశ్చరునితో గూడియుండుకాలమున బుట్టినవాడు ఇతరులను మోసపుచ్చుటయందు నేర్పరియు, ఆచార్యాదుల వచనముల నుల్లంఘించు వాడును నగుచున్నాడు. మరియునితరగ్రంథ కర్తలు "ఋణవాణ్ దంభప్రాయః ప్రపంచక స్సత్క్రవిగ్గమనశీలః, నిపుణశ్శోభన వాక్యోబుధశని యోగేపుమాణ్ భవతి" అనగా బుధశనులుగలసియుండు కాలమున జనించినవాడు, ఋణముగలవాడు, దంభముగలవాడు, ఆహారములేక తిరుగువాడు, విస్తరించువాడు, శాస్త్రజ్ఞానముగలవాడు, తిరుగుట స్వభావముగా గలవాడు, నేర్పరితనము మొదలగునవి గలవాడగుచున్నాడని వచించుచున్నారు.

## బృహస్పతి, శుక్ర, శనుల యుక్తుడగుచుండగా బుట్టిన వానిలక్షణములు.

1. బృహస్పతి శుక్రునితో గూడియుండు కాలమున బుట్టినవాడు సద్విద్యాధనకళత్రములు గలవాడును బహు సద్గుణములు గలవాడును నగుచున్నాడు మరియు కొందరు శాస్త్రజ్ఞులు "జీవతివిద్యా వాదైర్వి శిష్టధర్మస్థితో ప్రమాణయుతః జీవసితయోర్మనుష్యో విశిష్టదారో భవేన్మతిమాణ్" అనివచించి యుండుటచే, గురు శుక్రులు కలసియుండు కాలమున జనించువాడు, విద్యచే జీవించువాడు ధార్మికుడు, ప్రామాణికుడు, ఉత్కృష్టమైన భార్యగలవాడు, బుద్ధిమంతుడు, ఉత్తమగుణములు కలవాడును నగుచున్నాడని నూహింపదగినది.

2. బృహస్పతి, శనైశ్చర యుక్తుడగు చుండగా బుట్టినవాడు మంగలవాడైనను, కుమ్మరవాడైనను, వంటవాడైనను అగుచున్నాడు (కలాహీనుడును అగుచున్నాడని యందురు) మరియును కొందరు శాస్త్రకర్తలు "శూరోవిత్త పఞ్చధ్యోనగరాధి పతిర్యశస్వీచ, శనిజీవ యోః ప్రధానశ్శ్రేణి సభాగ్రామ సంఘానామ్" అనివచించి యుండుటచే, గురుశనులు కలిసి యుండుకాలమున జనించినవాడు శూరుడు, ధనికుడు, నగరాధిపతి, యశస్సుకలవాడు, సభమొదలుగాగల ప్రదేశములయందు ప్రధానుడగుచున్నాడని భావము ఏర్పడుచున్నది ఈభావము వరాహమిహిరాచార్యభావమునకు వ్యతిరిక్తముగా నుండుటచే బృహజ్జాతక కారకుడు కొన్నిచోట్ల యావనాచార్యుల మతము నంగీకరించ లేదని తోచుచున్నది.

## శుక్రుడు శనియుక్తుడగుచుండగా బుట్టినవాని లక్షణములు త్రిగ్రహాది యోగఫలములు.

శ్లో. అసిత సిత సమాగమేఽల్పచక్షు ర్యువతిసమాశ్రయసంప్రవృద్ధవిత్తః
భవతిచ లిపి చిత్రకాదివేత్తా కథితఫలైః పరతో వికల్పనీయాః,

టీ. అసితసితసమాగమే = శనిశుక్రులు కూడియుండగా బుట్టినవాడు, అల్పచక్షుః = స్వల్పమైన దృష్టిగలవాడును, యువతిసమాశ్రయ = స్త్రీలనాశ్రయించుటచేత, సంప్రవృద్ధ = లెస్సగావృద్ధిబొందిన, విత్తః = ధనముగలవాడును, లిపి = పుస్తకములు వ్రాయుట, ఆది = మొదలుగాగల పనులను, వేత్తా = తెలిసినవాడునగును, పరతః = ఇతరములైన త్రిగ్రహచతుర్గ్రహాదులు ఏకరాశిగతములైయుండెనేని, కథితఫలైః = ద్విగ్రహయోగమునకుం జెప్పఁబడిన ఫలములచేత, వికల్పనీయాః = వికల్పించఁదగినవి.

తా. శుక్రుడు శనైశ్చర యుతుడగు చుండగా బుట్టిన మానవుడు, అల్పదృష్టిగలవాడును, స్త్రీలనాశ్రయించుటచేత వృద్ధినొందిన ధనముగలవాడును, పుస్తకములు వ్రాయుట, చిత్తరువులు వ్రాయుట మొదలగు పనులు తెలిసినవాడును అగునని తెలియదగినది. ఈవిషయమై కల్యాణవర్మ "దారువిదారణదక్షః క్షురచిత్రాశ్మాది కర్మశిల్పీచ మల్లోటనః పశుపతిశ్శనిసితయోగే పుమాన్ భవతి" అనగా శుక్రశనులు కలిసియుండగా బుట్టినవాడు, చెట్లుగొట్టుటయందు సమర్థుడు. చిత్రమైన రాతిపనియందు నేర్పరి, బాహు యుద్ధమునందు నిపుణుడు, పశువులు కలవాడను అగుచున్నాడని వచించియున్నాడు. ఇవిద్విగ్రహ యోగములు. జననకాలమునరెండు లేకమూడు ద్విగ్రహయోగములు తటస్థించుసెడల, ఎన్నియోగములు తటస్థించుచున్నవో యన్నియోగముల ఫలితముల జెప్పతగినది. ఇతరములగు మూడు నాలుగుగ్రహములు ఏకరాశి గతములై యుండుసెడల ద్విగ్రహయోగములకు జెప్పబడిన ఫలములచే వికల్పింపదగినది:—ఉదాహరణము:—ఒకరాశియందు రవి చంద్ర కుజులు కూడియుండుసెడల 1. రవిచంద్రయోగఫలము, 2. రవికుజయోగఫలము. 3 చంద్రాంగారకయోగఫలము. యీ

మూడుఫలములను జెప్పదగినవి తక్కినయోగములను గూడనిట్లే యూహింపదగియున్నది. ఈ ద్విగ్రహ, త్రిగ్రహ, చతుర్గ్రహ, పంచగ్రహ,షడ్గ్రహ, యోగములు, వేదాంగ విద్వర్యుడగు, శ్రీ, కల్యాణ వర్మ విరచితంబగు సారావళియను జాతక గ్రంథమున విశదముగా జెప్పబడి యున్నవి. ద్విగ్రహయోగములయందు, సారావళీ కారకుని యభిప్రాయము బృహజ్జాతక కారకుడగు వరాహ మిహిరాచార్యుల యభిప్రాయమునకు కొన్నిచోట్ల భేదించుచున్నను, చక్కగవిశదీకరింపబడియుండుటచే బాగుగా పరిశీలించి ఫలితముల జెప్పదగియున్నది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ద్విగ్రహయోగాధ్యాయ నామక
చతుర్దశాధ్యాయము.

---

శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ప్రవ్రజ్యాయోగాధ్యాయము. పంచదశాధ్యాయము.—15.



ఏకరాశిగతులగు చతుఃపంచాది గ్రహముల చేత సంభవించు
ప్రవ్రజ్యాభేదములు.

శ్లో. ఏకస్థైశ్చతురాదిభి ర్బలయుతై ర్జాతాః పృథ గ్వీర్యగైః
శాక్యా జీవక భిక్షువృద్ధ చరకా నిర్గ్రంథ వన్యాశనాః
మాహేయజ్ఞ గురు క్షపాకర సిత ప్రాభాకరీ నైః క్రమాత్
ప్రవ్రజ్యా బలిభి స్సమాః పరజితై స్తత్స్వామిభిః ప్రచ్యుతిః. 1

టీ. ఏకస్థైః=ఏకరాశిగతములైన, బలయుతైః=స్థానాదిబలయుక్తములైన, చతురాదిభిః=4, 5, 6, 7, గ్రహములచేత, జాతాః=పుట్టినవారు (సన్యాసులగుదురు,) పృథక్=ప్రత్యేకముగా, వీర్యగైః=బలవంతులైన, మాహేయజ్ఞగురుక్షపాకరసితప్రాభాకరీభిః=కుజ, బుధ

గురు, చంద్ర, శుక్ర, శని,సూర్యులచేత, క్రమాత్=వరుసగా, శాక్యాజీవక భిక్షు వృద్ధచరకా నిర్గ్రంథవన్యాశనాః = శాక్యాజీవక భిక్షు వృద్ధ చరక నిర్గ్రంథవన్యాశ, నాఖ్యులయిన సన్న్యాసులగుదురు, ప్రవ్రజ్యాః=ప్రవ్రజ్యలు, బలిభిః = ఆచతుః ప్రభృతి గ్రహములలో బలవంతములగు గ్రహములన్నిటిలోడ, సమాః=సమానములైనవి. పరజితైః=గ్రహయుద్ధమునం దితర గ్రహములచేత జయింపబడినట్టి, తత్స్వామిభిః=ప్రవ్రజ్యాధిపులయిన గ్రహములవలన, చ్యుతిః = స్వీకృత ప్రవ్రజ్యా భ్రంశముగలుగును.

తా. ద్వాదశరాశి చక్రమున నేరాశియందైనను ఒకరాశియందు, 4, 5, 6, 7, గ్రహములు బలీయులై యుండగా జనించినవాడు, సన్న్యాసియగును,అట్టిబలయుక్తములగు గ్రహములలో అధిక బలముతో గూడినవెన్ని గ్రహములో యన్నివిధములగు ప్రవ్రజ్యలను యీ క్రిందకనుబరచిన క్రమమున జాతకుడు బొందుచున్నాడు.

ప్రత్యేకముగ బలయుక్తులగు కుజ, బుధ, గురు, చంద్ర ,శుక్ర, శనైశ్చరాదిత్యులచేత వరుసగా శాక్యాజీవక భిక్షు వృద్ధ చరక నిర్గ్రంథవన్యాశ నాఖ్యులగు సన్యాసులగు దురనగా ఏకరాశిస్థితులగు చతుర్థపంచమాది గ్రహములయందు అంగారకుడుబలవంతుడగునెడల (శాక్య) బుద్ధోపాసకుండగు రక్తవస్త్రసన్యాసి యగుననియు, బుధుడు బలయుక్తుడగునెడల (ఆజీవక) ఏకదండ సన్యాసియగుననియు, బృహస్పతి బలవంతుడుగా నుండునెడల (భిక్షు) త్రిదండ సన్యాసియగుననియు, చంద్రుడు బలీయుడైనయెడల (వృద్ధ) వృద్ధశ్రావకుండనెడు కాపాలికుండగుననియు, శుక్రుడు బలయుతుడగునెడల (చరక) చక్రచరాఖ్యసన్యాసియగుననియు, శనైశ్చరుడుబలయుతుడగునెడల (నిర్గ్రంథ) దిగంబర సన్యాసియగుననియు, రవి బలీయుడగునెడల (వన్యాశన) అడవియందు బుట్టిన కందమూలఫలాదుల భుజించు తాపసుడగుననియు, తెలియదగినది. ఈశ్లోకమున "ప్రవ్రజ్యాబలిభిస్సమాః" అని యుండుటచే ఏకరాశినిబొందినట్టి నాలుగుమొదలు గ్రహములయందెన్ని గ్రహములుబలయుతములో అన్నివిధములగు ప్రవ్రజ్యలు జాతకునికి గలుగునని తెలియదగినది. మరియు "చతురాదిభిరేకస్థైః ప్రవ్రజ్యాస్స్వాం గ్రహాః కరోతిబలీబహుభిః వీర్యోపేతైః ప్రథమావీర్యాధికస్యైవ, తాపస,వృద్ధ, శ్రావక, రక్తపటా, జీవి, భిక్షు, చరకాణామ్ నిర్గ్రంథానాం, చార్కాత్పరాజితైః ప్రచ్యుతిర్బలిభిః" అను లఘుజాతకఉదాహరణోక్తముగ, బలయుక్తగ్రహములలో నధికబలయుతమగు గ్రహమునకు జెప్పబడిన ప్రవ్రజ్య ముందుగలిగి గ్రహబలాధిక పూర్వక్రమముగ ఇతర ప్రవ్రజ్యలుగలుగునని తెలియదగియున్నది. ఇందువలన ఏకరాశిగతులగు చతుః పంచాదిగ్రహములయందు నొకగ్రహమైనను బలయుతము గాకయుండినచో ప్రవ్రజ్యాయోగము గలుగుటకువీలులేదని నూహింపదగియున్నది.

మరియునిందు, "పరజితైస్తత్స్వామిభిః ప్రచ్యుతిః" అనియుండుటచే జననకాలమున ఏకరాశిగతులైన ప్రవ్రజ్యాధిపతులగు చతురాదిగ్రహములయందు బలయుతగ్రహము యుద్ధమునందు పరాజితమైయుండునెడల జాతకుడు ఆగ్రహసంబంధమగు ప్రవ్రజ్యను స్వీకరించి

మరల విడచునని తెలియదగినది. ఈ విధముగ ననేకగ్రహములు బలయుక్తములై గ్రహయుద్ధమున పరాజితములై యుండునెడల పరాజితగ్రహ సంబంధములగు సన్యాసభేదములనన్నింటిని స్వీకరించి మరలవిడిచిపెట్టుచు కట్టకడపటపరాజితముగాక యుండు ప్రవ్రజ్యను స్వీకరించి యావజ్జీవము నాప్రవ్రజ్యయందే గడపుననియు, బలవద్గ్రహములన్నియు పరాజితములై యుండునెడల ప్రవ్రజ్యలన్నింటిచేతను భ్రష్టుడగుననియు, తెలియదగినది.

మరియు, ప్రవ్రజ్యాదాయకములగు గ్రహములనేకము గ్రహయుద్ధమున బరాజితములుగాక యుండునెడల ప్రథమప్రవ్రజ్యాదాయక గ్రహదశాంతర్దశలయందు మొదటి ప్రవ్రజ్యనుజాతకుడు నాశ్రయించి ద్వితీయ ప్రవ్రజ్యాదాయక గ్రహాంతర్దశలవరకు నాప్రథమ ప్రవ్రజ్యయందుండి ద్వితీయప్రవ్రజ్యాదాయక గ్రహదశాంతర్దశలయందు రెండవ ప్రవ్రజ్యను ఆశ్రయించుననియు, ఇట్లెన్నిగ్రహములు ప్రవ్రజ్యాదాయకములగునో యన్నివిధములగు సన్యాసములను జాతకుడుగ్రహించి, కడపటిప్రవ్రజ్యయందు యావజ్జీవముండుననియు తెలియదగినది. ఈవిషయమై "తేష్వధిక బలీ జీవ స్త్రీదండినం భార్గవశ్చ చరకముఖ్యం, నగ్నశ్రమణం సౌరోబుధస్తథా జీవకాచార్యమ్. వృద్ధశ్రావకమిందు ర్దివాకరస్తాపసం, తపోముఖ్యం వక్రశ్చాకశ్యం శ్రవణం త్వేతాశ్రయజం గుణాంశ్చైతా ఽ వీర్యోపేతేష్వత నావదీక్షుతాభక్తివాదినస్తేషామ్, అన్యైః పరాజితశ్చేత్ప్రవ్రజ్యాప్రచ్యుతింకుర్యాత్ యావంతో వీర్యయుతాః ప్రవ్రజ్యాభవంతి, తావంత్యః ఏకస్మిన్ గేషు నియమాత్తేషామాద్యా బలోపేతాత్" అని సత్యాచార్యులవారు వచించియున్నారు.

## ప్రవ్రజ్యాయోగదాయక గ్రహములకు అస్తంగతాదిదోషములు గలిగినయెడల పూర్వశ్లోకోక్త ప్రవ్రజ్యలు అసంభవమనుటకు వివరము.

శ్లో. రవిలుప్తకరైరదీక్షితా బలిభిస్తద్గతభక్తయో నరాః
అభియాచితమాత్రదీక్షితా నిహతైరన్య నిరీక్షితైరపి. 2

టీ. రవిలుప్తకరైః=సూర్యునిచేత లోపింపంబడిన కిరణములుగలిగిన, (అస్తంగతములయిన) బలిభిః=బలయుక్త గ్రహములచేత, నరాః=పురుషులు, అదీక్షితాః=ప్రవ్రజ్యావర్జితులగుదురు, మఱియెట్లనగా:—నరాః (బలయుక్తగ్రహములస్తంగతములై యుండగాఁబుట్టిన) పురుషులు, తద్గతభక్తయః=ఆప్రవ్రజ్యనుపొందిన సన్న్యాసులయందుభక్తిగలవారలై యుందురు, నిహతైః=ఏకరాశిగతచతురాది గ్రహములలో బలయుక్తగ్రహములు జన్మకాలమందు ఇతరగ్రహములచే గెలువఁబడియున్నను, అన్యనిరీక్షితైః పి=ఇతర గ్రహములచేఁజూడఁబడియున్నను, అభియాచితమాత్రదీక్షితాః=సన్న్యసింపవలయునని కోరుదురుగాని సన్న్యసింపఁజాలరు.

తా. సూర్యునిచేత లోపింపబడిన కిరణములుగలిగినబలయుతగ్రహములవలన బురుషులు ప్రవ్రజ్యావర్జితులగుదురనగా నేకరాశియందుండు చతురాది గ్రహములలో బలయుతగ్రహములన్నియు ప్రవ్రజ్యాదాయకములని పూర్వశ్లోకమున జెప్పబడియున్నను అందెన్నిగ్ర

హములు అస్తంగతములై యుండునో ఆ గ్రహములు తమ తమ ప్రవ్రజ్యలనీయజాలవని తెలియ దగినది. అయినను, ఏకరాశియందుండు నాలుగైదు మొదలగు గ్రహములలో బలయుక్తగ్రహములు అస్తంగతములై యుండగా బుట్టినమనుజుఁడు తద్గ్రహోక్తములైన ప్రవ్రజ్యలను స్వీకరించిన సన్యాసులయందు భక్తిగలవారై యుందురు.

మరియు, ఏకరాశియందుండు చతురాదిగ్రహములలో బలయుక్త గ్రహములు జనన కాలమున నితరగ్రహములచే గెలువబడియుండినను, అన్యగ్రహములచే జూడబడియుండినను, జాతకులు సన్యసింపలేనని గోరుదురుగాని సన్యసింపజాలరని తెలియదగినది. ఈవిషయమై "ప్రవ్రజ్యాయాస్స్వ మీరవిముషిత తనుర్నిరీక్షితోవాన్యైః నాచితదీక్షానభవతి వయ వనాధిపతేర్యథావాక్యమ్" అని సారావళీకారకుడు వచించియున్నాడు. ఈ విషయముపూ ర్వశ్లోకమున జెప్పబడియుండు "పరజితైస్తత్స్వామిభిః ప్రచ్యుతిః" అనుదానికపవాదముగా నుండుటచే బలవద్గ్రహము యుద్ధమునందు బరాజితంబైనను, అన్యగ్రహదృష్టిలేకుండగా జనించిన పురుషుకు తద్బలవద్గ్రహసంబంధమగు ప్రవ్రజ్యను స్వీకరించిపరిత్యజించుననియు, బలయుక్తగ్రహము పరాజితంబై అన్యగ్రహముచే జూడబడుచుండినచో తత్కాలమున జనించిన మానవుడుసన్యాసస్వీకరణమును గోరువాడైనను స్వీకరింపజాలడని తెలియదగినది. ఇదియుగాక "దీక్షాదానసమర్థో యోభవతి తదా బలేన సంయుక్తః తస్యైవ దశాకాలే దీక్షాం లభతే నరోవశ్యం యస్యచదీక్షా చ్యవనం తస్యైవ దశావసానే స్యాత్" అనిగ్రంథాంతరమున జెప్పబడియుండుటచే జననకాలమందు గ్రహబలాబలముల బాగుగవిచారించి ఫలముల జెప్పదగినది.

## ప్రకారాంతరముచే సంభవించెడు ప్రవ్రజ్యా యోగత్రయము.

శ్లో. జన్మేశో న్యైర్యద్య దృష్టోర్కపుత్రం
పశ్యత్యార్కి ర్జన్మపం వా బలోనం
దీక్షాం ప్రాప్నోత్యార్కి ద్రేక్కాణ సంస్థే
భౌమార్క్యంశే సౌరదృష్టేచ చంద్రే. 3

టీ. జన్మేశః=జన్మకాలంబున చంద్రుండేరాశియందుండునో ఆరాశ్యాధిపతి జన్మేశుండనంబడును, అజన్మేశుఁడు, అన్యైః=ఇతరగ్రహములచేత, అదృష్టస్సన్=చూడఁబడనివాఁడయి, అర్కపుత్రం=శనైశ్చరుని, పశ్యతియది=చూచుచుండెనేని, జాతకుఁడు, దీక్షాం=శనైశ్చరునికిం జెప్పఁబడిన దిగంబరసన్న్యాసమును, ప్రాప్నోతి = పొందుచున్నాఁడు, అథవా= అటుగాకపోయినను, అర్కిః=శనైశ్చరుఁడు తానుబలవంతుఁడై బలోనం=బలహీనుఁడైన, జన్మపం=జన్మేశుని, పశ్యతియది = చూచుచుండెనేని, దీక్షాంప్రాప్నోతి = శనైశ్చరునికిం జెప్పఁబడిన ప్రవ్రజ్యనుబొందును. ఆర్కిద్రేక్కాణసంస్థే = శనిద్రేక్కాణమందున్న, చంద్రే = చంద్రుఁడు, భౌమార్క్యంశే=కుజశని నవాంశలలో నొకనవాంశయందు (ఇతరగ్రహములచేఁ

జూడఁబడకయుండి) శౌరదృష్టే = శనిచేతఁజూడఁబడెనేని, శనికిం జెప్పఁబడిన ప్రవ్రజ్యను పొందఁగలవాఁడగును.

తా. జననకాలమునచంద్రుఁడేరాశియందుండునో యారాశ్యాధిపతికిజన్మేశుండను పేరు గలదు. అజన్మేశుఁడు అన్యగ్రహములచేత జూడఁబడనివాఁడై శనైశ్చరునితానుచూచుచుండె నేనిజాతకుఁడు శనైశ్చరునకుం జెప్పబడిన దిగంబరసన్యాసమును బొందునని తెలియఁదగినది. మరియు నీ దువిషయమై "యస్యైతు తేర్కపుత్రం జన్మభనాథో గ్రహైర్న సందృష్టః తస్య హి దీక్షాలాభ స్తద్భల యోగాద్దశాకాలే" అని గ్రంథాంతరమున జెప్పబడియుండుటచే జనన కాలమునందు జన్మేశ, శనైశ్చరులయందెవఁడు బలవంతుఁడో ఆ గ్రహదశాంతర్దశలయందు తదు క్తమగుప్రవ్రజ్యను బొందునని తెలియదగినది. అట్లుగాకపోయినను, శనైశ్చరుఁడు మిక్కిలి బల యుతుఁడై బలహీనుఁడగుజన్మేశునిజూచినచో శనైశ్చరునకుం జెప్పబడిన ప్రవ్రజ్యనుబొందు నని తెలియదగినది. ఈవిషయమై "శనిదృష్టేబలహీనే జన్మనినాథేవదేచ్ఛ నిర్గ్రంథమ్" అని గ్రంథాంతరమున జెప్పబడియున్నది. మరియు శనైశ్చరద్రేక్కాణమునందు నున్నట్టిచంద్రుఁడు అంగారకశనైశ్చర నవాంశలలో నొక్కనవాంశయందు యితరగ్రహములచే జూడఁబడక శనైశ్చరునకు జెప్పబడినట్టి నిర్గ్రంథసన్యాసమును బొందునని తెలియదగినది. ఇందులకు "శౌరి ద్రేక్కాణసంస్థో యది భవతి శశీ తదంశ సంస్థశ్చవక్రాంశేవా దృష్ట స్సౌరేణాలు సర్వదర్శన విముక్తః" అనిలఘుజాతకమునందు జెప్పబడియున్నది.

## పృథివీశులైనను శాస్త్రకర్తలును పరివ్రాజకులునునగు యోగద్వయము.

శ్లో. సురగురు శశిహోరా స్వార్కి దృష్టా సుధర్మే
గురు రథ నృపతీనాం యోగజస్తీర్థ కృత్స్యాత్
నవమభవనసంస్థే మందగే నైర్యదృష్టే
భవతి నరపయోగే దీక్షితః పార్థివేంద్రః. 4

టీ. సురగురుశశిహోరాను = గురుచంద్రలగ్నములు, అర్కిదృష్టాను = శనిచేతఁజూడఁబడుచుండఁగా, ధర్మే=నవమమందు, గురుః = బృహస్పతియుండెనేని, నృపతీనాంయోగజః = రాజయోగమందుఁబుట్టినవాఁడైనను, తీర్థకృత్ = శాస్త్రకర్తయగును, శనైశ్చరునిచే మాత్రముచూడబడినయెడల, నవమభవనసంస్థే = లగ్నమునకు నవమస్థానమందున్న, మందగే= శనైశ్చరుఁడు, అన్యైః = ఇతరగ్రహములచేత, అదృష్టేసతి = చూడఁబడకుండఁగా, నరపయోగే = రాజయోగమందుఁబుట్టినవాఁడు, పార్థివేంద్రః = రాజాధిరాజైనను, దీక్షితః = సన్యాశియగును.

తా. గురుచంద్రలగ్నములు శనిచేత జూడబడు చుండగా నవమస్థానమునందు బృహస్పతి యుండు నెడల జాతకుఁడు రాజయోగమునందు బుట్టినవాఁడైనను శాస్త్ర కర్త యగును "తీర్థంశాస్త్రి ధ్వరక్షేత్రోపాయో పాధ్యాయమంత్రిషు" అనివిశ్వనిఘంటువున జెప్పబడి

యున్నది. మరియు నిందువిషయమై "గురుశశిలగ్న ద్రష్టరి మందే యదినవమగోజీవః, నరనాథజన్మ జాతశ్శాస్త్రకరోభవతి నచనృపః" అనిగ్రంథాంతరమున జెప్పబడియున్నది గావున నీ యోగమున బుట్టినవారు కణాదబ్రహ్మగుప్తాదులవలె శాస్త్రకర్తలగుదురనియు, నీయోగమును, రాజయోగమును గూడియుండగా బుట్టినవారు, జనక కాశీరాజ ప్రభృతులవలె రాజేంద్రులై శాస్త్రకర్తలగుదురనియును దెలియదగినది, ఈవిషయమై. "అస్మిన్ యోగే చాన్యోన్నృపయోగోభవతి తత్రయోజాతః నభవతిజనేంద్రతుల్యో నరనాథశ్శాస్త్రి కర్తాచ" అనిగ్రంథాంతర వచనము గానబడుచున్నది అయినను కొందరు, ధనుర్మీనకరాటకముల యందునొకటి జనన లగ్నమై ఆలగ్నమును శనైశ్చరుడు చూచుచుండగా బృహస్పతి తొమ్మిదవ యింటనుండెనేని రాజయోగ జాతుండైనను తీర్థ యాత్రసేయు వాడగునని వ్యాఖ్యానముచేసియున్నారు. జననలగ్నమునకు తొమ్మిదవయింటు నుండునట్టి శనైశ్చరుడు, అన్యగ్రహానులచేత జూడబడ కుండగా రాజయోగమునందు జననమందినవాడు రాజాధి రాజును దీక్షితుండును నగునని తెలియదగినది. ఇందులకు "నవమస్థానే సౌరోయది స్థితస్సగ్వ దర్శనవిముక్తః నృపయోగస్యాభావే యోగేస్మిన్ దీక్షితో నరోజాతః నిస్సందిగ్ధం ప్రవదేద్యోగస్యాస్య ప్రభావేన" అనిగ్రంథాతర వచనము గానబడుచున్నది. మరియును, "ప్రథితమునిప యోగే రాజయోగే యదిస్యాదశుభఫలవిపాకం సర్వముత్సాల్య పశ్చాత్, జనయతి పృథివీశం దీక్షితం సాధుశీలం ప్రణతనృపశిరో మణ్యుజ్వలత్పాదయుగ్మమ్" అనగా ప్రవ్రజ్యాయోగంబును రాజయోగంబును గూడియుండగా బుట్టినవాడు, ప్రవ్రజ్యా యోగమందు జెప్పబడిన అశుభమంతయు దొలగి సమస్త దేశాధీశులయొక్క శిరోరత్నములచే ప్రకాశించుపాదయుగ్మము గలవాడగునని, సారావళీ కారకుడు వచించియుండుటచే రాజయోగ యుక్తములగు సకల ప్రవ్రజ్యా యోగములయందును బలాబలములనాలోచించి ఫలములు జెప్పవలయును.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ప్రవ్రజ్యాయోగాధ్యాయ నామక
పంచదశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ఋక్షశీలాధ్యాయము. షోడశాధ్యాయము. —16.



#### అశ్వినీ, భరణీ నక్షత్రజనితుని స్వభావములు.

శ్లో. ప్రియభూషణ స్సురూప స్సుభగోదక్షో౽శ్వినీషు మతిమాంశ్చ
కృతనిశ్చయ సత్యా రుగ్దక్షా స్సుఖితశ్చ భరణీషు. 1

టీ. అశ్వినీషు = అశ్వినీనక్షత్రమునందుఁ బుట్టినవాఁడు, ప్రియభూషణః = అలంకారప్రియుఁడును, సురూపః = మంచిసౌందర్యముగలవాఁడును, సుభగః = సర్వజనప్రియుఁడును, దక్షః=సమర్థుఁడును, మతిమాన్ = బుద్ధిమంతుఁడును అగును, భరణీషు = భరణియందుఁ బుట్టినవాఁడు, కృతనిశ్చయః = ప్రారంభించిన కార్యము నెరవేరు వరకు దృఢనిశ్చయుండై యుండువాఁడును, సత్యం = యథార్థవాదియు, అరుక్ = రోగవర్జితుండును, దక్షః = చతురుండును, సుఖితః = దుఃఖవర్జితుండును అగును.

తా. అశ్వినీ నక్షత్రమున జనించినవాఁడు అలంకారప్రియుండును, మంచిసౌందర్యము గలవాఁడును, సర్వజనప్రియుండును, సమర్థుండును, బుద్ధిమంతుండును అగును.

భరణీ నక్షత్రమున జననమందినవాఁడు, ఆరభించిన కార్యము నెట్లయినను నెరవేర్చుకొనువాఁడు దృఢనిశ్చయుఁడు, యథార్థవాది, రోగములేని శరీరము గలవాఁడు, చతురుఁడును దుఃఖములేనివాఁడును అగును.

#### కృత్తికా రోహిణీ నక్షత్రజనితుని స్వభావములు.

శ్లో. బహుభుక్పరదారరత స్తేజస్వీ కృత్తికాసు విఖ్యాతః
రోహిణ్యాం సత్యశుచిః ప్రియంవద స్థిరమతి స్సురూపశ్చ. 2

టీ. కృత్తికాసు = కృత్తికయందుఁ బుట్టినవాఁడు, బహుభుక్ = అధికాహారుఁడును, పరదారతః = పరస్త్రీలయందాసక్తిగలవాఁడును, తేజస్వీ = కాంతిమంతుఁడును, విఖ్యాతః = ప్రసిద్ధుఁడునగును, రోహిణ్యాం = రోహిణియందుఁబుట్టినవాఁడు, సత్యః=యథార్థవాదియు,

శుచిః = పరద్రవ్యపరదారాదులయందాసక్తిలేనివాఁడును, శాస్త్రోక్తాచారములననుష్ఠించువాఁడును, ప్రియంవదః = మధురభాషియు, స్థిరమతిః = నిశ్చలమైన బుద్ధిగలవాఁడును, సురూపః = మంచిసౌందర్యముగలవాఁడును = అగును.

తా. కృత్తికానక్షత్రమున బుట్టిన మానవుఁడు, అధికమైన అహారమును తినువాఁడును, పరస్త్రీలయందాసక్తిగలవాఁడును, కాంతిమంతుఁడును ఖ్యాతివంతుఁడును అగును

రోహిణీ నక్షత్రమున జననమందిన మానవుఁడు యథార్థవాదియు, పరధన పరదారల యందు ఆసక్తిలేని వాఁడును, శాస్త్రోక్తాచారములను సలుపువాఁడును, మధుర భాషియు, నిశ్చలమైన బుద్ధికలవాఁడును, సురూపవంతుఁడును అగును.

## మృగశీర్ష ఆర్ద్రా నక్షత్రజనితుని స్వభావములు.

శ్లో. చపలశ్చతురో భీరుః పటురుత్సాహీ ధనీ మృగే భోగీ
శఠగర్వితౌ కృతఘ్నో హింస్రః పాపశ్చ రౌద్రర్క్షే. 3

టీ. మృగే = మృగశీర్షయందుఁబుట్టినవాఁడు, చపలః = చపలచిత్తుఁడును, చతురః = సమర్థుఁడును, భీరుః = భయశీలుఁడును, పటుః = మాటలయందు నేర్పరియు, ఉత్సాహీ = ఉత్సాహవంతుఁడును, ధనీ = ధనవంతుఁడును, భోగీ = భోగవంతుఁడునగును, రౌద్రర్క్షే = ఆర్ద్రయందుఁ బుట్టినవాఁడు, శఠః = కుత్సితుఁడును, గర్వితః = అహంకారియు, కృతఘ్నః = ఉపకారమును మఱచువాఁడును, హింస్రః = ప్రాణి హింసకుఁడును, పాపః = పాపకర్ముఁడునగును.

తా. మృగశీర్ష నక్షత్రమున జనించినవాఁడు. చపలచిత్తుండును, సమర్థుఁడును, భయశీలుఁడును, మాటలయందు నేర్పుగలవాఁడును, సంతోషవంతుఁడును, ధనవంతుఁడును, భోగవంతుఁడును అగును. ఆర్ద్రానక్షత్రమునందు బుట్టినవాఁడు. స్వకార్యార్థమై మనసున నొకటి దలంచి, మరియొక విధముగా బలుకుచు అందుకువ్యతిరక్తముగా పనిచేయువాఁడును, అహంకారియు, ఉపకారమును మరచువాఁడును, ప్రాణిహింసకుండును, పాపకర్ముఁడును అగును ఈశ్లోకమున ప్రయోగింపబడిన, శఠుఁడు. అనుపదమునకు, కుత్సితుఁడు, లేక మోసగాఁడని యర్థము చెప్పుదురు. మరియు శఠలక్షణము "శ్లో. మనసా వచనా యశ్చ దృశ్యతే కార్యతత్పరః, కర్మణా విపరీతశ్చ సశఠ స్సద్భిరీర్యతే" అనివివరముగా జెప్పబడియుండుటచే, తలమనదొకటి, చెప్పునదొకటి, చేయునదొకటిగా యుండి. ఇవిఅన్నియును స్వకార్యార్థమైనవిగా యుండునట్లు నర్పుశక్తి గలవాఁడని నూహింపవగియున్నది.

## పునర్వసునక్షత్రజనితుని స్వభావములు.

శ్లో. దాంత స్సుఖీ సుశీలో దుర్మేధా రోగభాక్పిపాసుశ్చ
అల్పేనచ సంతుష్టః పునర్వసౌ జాయతే మనుజః. 4

టీ. దాంతః = తపఃక్లేశమునుసహించునట్టియు, సుఖీ = సుఖవంతుఁడైనట్టియు, సుశీలః = సత్స్వభావము గలిగినట్టియు, దుర్మేధాః = జడప్రాయుండైనట్టియు = రోగభాక్ = రోగపీడి

తుండైనట్టియు, పిపాసుః = మిక్కిలి దప్పిగలిగినట్టియు, అల్పేన=స్వల్పలాభముచేత, సంతుష్టః = సంతసించునట్టి, మనుజః = పురుషుఁడు, పునర్వసౌ = పునర్వసు నక్షత్రమునందు, జాయతే = పుట్టును.

తా. పునర్వసునందు బుట్టినవాడు తపఃక్లేశము నోర్చునట్టివాడును, సుఖవంతుఁడును, సత్స్వభావము గలవాడును, జడప్రాయుఁడును, రోగపీడితుడును, మిక్కిలి దప్పిగలవాడును, స్వల్పలాభముచేత సంతోషించువాడును, అగును.

## పుష్యాశ్రేషానక్షత్ర జనితుని స్వభావములు.

శ్లో. శాంతాత్మా సుభగః పండితో ధనీ ధర్మ సంశ్రితః పుష్యే
శఠ సర్వభక్షః పాపః కృతఘ్న ధూర్తాశ్చ భౌజంగే. 5

టీ. పుష్యే = పుష్యమినక్షత్రమందుఁబుట్టినవాఁడు, శాంతాత్మా = శమదమపరాజితేంద్రియుఁడును, సుభగః = సర్వజనప్రియుఁడును, పండితః = శాస్త్రార్థజ్ఞుఁడును, ధనీ=ధన వంతుఁడును, ధర్మసంశ్రితః = ధర్మరతుఁడునుఅగును, భౌజంగే = ఆశ్రేషయందు, శఠః = కుత్సితుఁడును, సర్వభక్షః = భాగార్హులమోసపుచ్చి సర్వమునపహరించువాఁడును, పాపః = పాపకర్ముఁడును, కృతఘ్నః = ఉపకారమును మఱచువాఁడును, ధూర్తః = పరవంచనసమర్థుఁడును అగును.

తా. పుష్యమి నక్షత్రమునందు బుట్టినవాడు, శమదమ పరాజితేంద్రియుండును సర్వజనప్రియుండును, శాస్త్రార్థమును తెలిసినవాడును, ధనవంతుండును, ధర్మముచేయునట్టివాడును నగును. ఆశ్రేషానక్షత్రమున జననమందినవాడు కుత్సితుండును, స్వజనులను, భాగస్థులను మోసపుచ్చి సర్వము నపహరించువాడును, పాపకర్ముడును, ఉపకారమును మరచువాడును, ఇతరులును వంచించుటయందు సమర్థతగల వాడును అగును.

## మఖా పూర్వఫల్గునులయందు బుట్టినవారిస్వభావములు.

శ్లో. బహుభృత్యో ధనో భోగీ సురపితృభక్తో మహోద్యమః పిత్ర్యే
ప్రియవాగ్దాతా ద్యుతిమా నటనో నృపసేవకో భాగ్యే. 6

టీ. పిత్ర్యే=మఖయందుఁ బుట్టినవాఁడు, బహుభృత్యధనః=అనేకపరివారంబును అధికధనంబునుంగలవాఁడును, భోగీ=భోగవంతుఁడును, సురపితృభక్తః=దేవతలయందును పితృదేవతలయందును భక్తిగలవాఁడును, మహోద్యమః=మిక్కిలి ఉత్సాహముగలవాడునుఅగును, భాగ్యే=పుబ్బయందుపుట్టినవాఁడు, ప్రియవాక్=ప్రియభాషణుఁడును, దాతా=దానశీలుఁడును= ద్యుతిమాన్= కాంతిమంతుఁడును, అటనః=సంచారణమునం దిష్టముగలవాఁడును, నృపసేవకః= రాజసేవానురక్తుండును, అగును.

తా. మఖయందుబుట్టినవాఁడు, విశేషపరివారము గలవాడును, ధనముగలవాడును, భోగవంతుండును, దేవతలయందును, పితృదేవతలయందును భక్తికలవాడును, అధిక ఉత్సాహముగలవాడును అగును.

పూర్వఫల్గునియందు జననమందినవాడు. ప్రియభాషణుడ, దాతయును, కాంతిమంతుడు, సంచారప్రియుడు, రాజసేవానురక్తుండును అగును.

## ఉత్తర, హస్తానక్షత్ర జనితుల స్వభావములు.

శ్లో. సుభగో విద్యాప్తధనో భోగీ సుఖభాగ్ద్వితీయ ఫల్గున్యామ్
ఉత్సాహీ ధృష్టః పానపోఘృణీ తస్కరో హస్తే. 7

టీ ద్వితీయఫల్గున్యాం=ఉత్తరయందుఁబుట్టినవాడు, సుభగః=సర్వజనప్రియుండును, విద్యాప్తధనః=విద్యచేపొందఁబడిన ధనముగలవాఁడును, భోగీ=భోగవంతుఁడును, సుఖభాక్, దుఃఖములేనివాడును, అగును. హస్తే=హస్తయందుఁబుట్టినవాఁడు, ఉత్సాహీ=ఉత్సాహవంతుండును, ధృష్టః=దిట్టతనముగలవాఁడును, పానపః=మద్యపానముచేయువాడును, అఘృణీ=నిర్దయుఁడును, తస్కరః=దొంగయునగును.

తా. ఉత్తరానక్షత్రమున బుట్టినవాడు. సర్వజన ప్రియుండును, విద్యవలన సంపాదింపఁబడిన ధనముగలవాడును, భోగవంతుడును, సుఖవంతుడును అగును.

హస్తానక్షత్రమున బుట్టినవాడు, ఉత్సాహవంతుడును, దృఢాత్మగలవాడును, మద్యపానముచేయువాడును, నిర్దయుడును, దొంగయునగును.

## చిత్రాస్వాతులయందు బుట్టినవారిస్వభావములు.

శ్లో. చిత్రాంబరమాల్యధర స్సులోచ నాంగశ్చ భవతి చిత్రాయామ్
దాంతో వణిక్కృపాళుః ప్రియవాగ్ధర్మాశ్రిత స్స్వాతౌ. 8

టీ. చిత్రాయాం=చిత్తయందుఁ బుట్టినవాఁడు, చిత్రాంబర మాల్యధరః = నానావర్ణములైన వస్త్రమాల్యములనుధరించువాఁడును, సులోచనాంగః=మంచి నేత్రావయవములుగలవాఁడును, భవతి=అగుచున్నాఁడు, స్వాతౌ=స్వాతియందుఁ బుట్టినవాఁడు, దాంతః=వినయయుక్తుఁడును జితేంద్రియుఁడును, వణిక్=వర్తకుఁడును, కృపాళుః=దయగలవాఁడును,(పాఠాంతరమందు"కృపాళుః" దాహమునుభరించ లేనివాఁడును) ప్రియవాక్=ప్రియభాషణుడును, ధర్మాశ్రితః=ధర్మబుద్ధిగలవాడును, భవతి=అగును.

తా. చిత్తానక్షత్రమున జననమందినవాడు, వివిధవస్త్రమాల్యములను ధరించువాడును, మంచినేత్రములు అవయవములుగలవాడునునగును. (కొందరు, చిత్రాన్నప్రియుండును, వననదీతీరములయందు సుఖముగావిహారము సేయుటకుత్సహించువాడును, విచిత్రములగు కార్యాలోచనతత్పరుడును నగునందురు.)

స్వాతీనక్షత్రమునబుట్టినవాడు, వినయ గుణముగలవాడును, జితేంద్రియుడును, వర్తకుడును దయగలవాడును, దప్పినిసహించ లేనివాడును, ప్రియభాషణుడును ధర్మము సేయువాడును, అగును.

## విశాఖానూరాధ నక్షత్రజనితుల స్వభావములు.

శ్లో. ఈర్ష్యుర్లుబ్ధో ద్యుతిమాన్వచనపటుః కలహకృద్విశాఖాసు
ఆఢ్యోవిదేశ వాసీ క్షుధాళు రటనో నూరాధాసు. 9

టీ. విశాఖాసు= విశాఖయందుఁబుట్టినవాఁడు, ఈర్ష్యుః= పరులసంపదకోర్వలేనివాఁడును, లుబ్ధః = లోభియును, ద్యుతిమాన్= కాంతిగలవాడును, వచనపటుః = మాటలయందు నేర్పరియు, (పాఠాంతరమందు, అర్థపటుః=ధనార్జనపరుఁడును,) కలహకృత్ = కలహకారియును, అగును, అనూరాధసు = అనూరాధాయందుఁ జన్మించినవాఁడు, ఆఢ్యః= ధనవంతుఁడును, విదేశవాసీ = పరదేశమున వసించువాఁడును, క్షుధాళుః = ఆకలికోర్వలేనివాఁడును, అటనః = పరిభ్రమణశీలుఁడును, అగును,

తా. విశాఖా నక్షత్రమున బుట్టినవాడు పరులసంపదల కోర్వలేనివాడును, లోభియును, కాంతిమంతుడును, సంభాషణ సమర్థుడును, ధనార్జనమున సమర్థుడును కలహముచేయువాడును, అగును.

అనూరాధా నక్షత్రమున జననమందిన వాఁడు, ధనికుడును పరదేశమున నివసించు వాడును, ఆకలికోర్వనివాడును, పరిభ్రమణశీలుండును, అగును, మరియు గ్రంథాంతరములయందు విద్యావినయ గాంభీర్య గౌరవాది గుణములు గలవాడును, దయాళువును, స్వకళత్రప్రియుండును, సభాశ్రేష్ఠుండును. అగునని చెప్పబడియున్నది.

## జ్యేష్ఠా మూలానక్షత్ర జనితుల స్వభావములు.

శ్లో. జ్యేష్ఠాసు నబహుమిత్రస్సంతుష్టో ధర్మకృత్ప్రచురకోపః
మూలే మానీ ధనవాన్ సుఖీ నహింస్రః స్థిరో భోగీ. 10

టీ. జ్యేష్ఠాసు = జ్యేష్ఠయందుఁబుటినమనుజుఁడు, నబహుమిత్రః = మిత్రులధికముగా లేనివాఁడును, సంతుష్టః = సంతోషముగా నుండువాఁడును, ధర్మకృత్ = ధర్మములు సేయువాఁడును, ప్రచురకోపః = అతికోపియునగును, మూలే= మూలయందుఁబుట్టినవాఁడు, మానీ= గర్వితుడును, ధనవాన్= ధనవంతుఁడును, సుఖీ = సౌఖ్యవంతుడును, నహింస్రః = జీవహింసచేయనొల్లనివాఁడును, స్థిరః = స్థిరచిత్తుఁడును, భోగీ=భోగవంతుఁడును, అగును.

తా. జ్యేష్ఠానక్షత్రమున జనించినవాడు. స్వల్పస్నేహితులు గలవాడును, సంతోషస్వభావుండును, ధర్మముచేయువాడును, అతిక్రోధియును అగును.

మూలానక్షత్రమున జననం బొందిన మానవుఁడు, గర్వముగలవాడును, ధనవంతుడును, సుఖవంతుండును, జీవహింసచేయనివాడును, స్థిరచిత్తుండును, భోగవంతుండును అగును.

## పూర్వాషాఢోత్తరాషాఢలయందు బుట్టినవారి స్వభావములు.

శ్లో. ఇష్టానంద కళత్రో మానీ దృఢ సౌహృదశ్చ జలదైవే
వైశ్వే వినీత ధార్మిక బహుమిత్రః కృతజ్ఞ సుభగశ్చ. 11

టీ. జలదైవే = పూర్వాషాఢయందుఁబుట్టినవాఁడు, ఇష్టానంద కళత్రః = ఇష్టము గాను సంతోషముగానుఁయుండు భార్యగలవాఁడును, మానీ = గర్విష్టియును, దృఢసౌహృదః= స్థిరమగు స్నేహముగలవాఁడు, అగును. వైశ్వే = ఉత్తరాషాఢయందుఁబుట్టినవాఁడు, వినీతః వినయముగలవాడును, ధార్మికః=ధర్మాత్ముఁడును, బహుమిత్రః=మిక్కిలిస్నేహితులుగలవాఁడును, కృతజ్ఞః = చేసిన మేలుమరువని వాడును, సుభగః = సర్వజనయిష్టుఁడును, అగును.

తా. పూర్వాషాఢా నక్షత్రమున జనించిన పురుషుడు సంతోషమును గలుగజేయుదియు, ఇష్టురాలును నగుభార్యనుగలవాడును, గర్వము గలవాడును, స్థిరముగా చాలాకాలము స్నేహము గలవాడును అగును.

ఉత్తరాషాఢా నక్షత్రమునందు జనించిన మానవుడు వినయముతోఁగూడు కొన్నవాడును, ధర్మకార్యములు చేయువాడును, అనేకులు స్నేహితులను గలవాడును, ప్రత్యుపకారశీలుడును, సర్వజనప్రియుడును అగును.

## శ్రవణ ధనిష్ఠలయందు బుట్టినవారి స్వభావములు.

శ్లో. శ్రీమాఞ్ శ్రవణే శ్రుతవా నుదారదారో ధనాన్వితః ఖ్యాతః
దాతా చాఢ్య శ్శూరో గీతప్రియో ధనిష్ఠాసు ధన లుబ్ధః. 12

టీ. శ్రవణే=శ్రవణానక్షత్ర మందుఁబుట్టినవాఁడు, శ్రీమాఞ్ = భోగభాగ్యవంతుడును, శ్రుతవాఞ్=పండితుఁడును,ఉదారదారః=ఉదారశీలయగు భార్యగలవాఁడును, (పక్షాంతరమందు, భార్యయందుప్రియముగలవాఁడును,) ధనాన్వితః=ధనికుఁడును, ఖ్యాతః= కీర్తిగలవాఁడును, అగును. ధనిష్ఠాసు=ధనిష్ఠయందుఁబుట్టినవాఁడు, దాతా=దానముచేయుఁవాడును,ఆఢ్యః=ధనవంతుఁడును, శూరః=శూరుఁడును, గీతప్రియః=గానలోలుఁడును, ధనలుబ్ధః = ద్రవ్యాశగలవాఁడును అగును.

తా. శ్రవణనక్షత్రమున జనించినవాడు,సంపదగలవాడును, పండితుడును, ఉదారగుణవతియగు భార్యకలవాడును,ధనాఢ్యుడును, భార్యాసక్తుడును,కీర్తిచేప్రకాశించువాడును,అగును.

ధనిష్టానక్షత్రమున బుట్టినవాడు, దానశీలుడు, ధనికుడు, రణమునందు ధైర్యగాంభీర్యాదు లధికముగాగలవాడు, సంగీతకళావిశారదుడు, ధనాపేక్ష గలవాడును, అగును.

## శతభిష క్పూర్వాభాద్రలయందు జననమైనవారి స్వభావములు.

శ్లో. స్ఫుటవా గ్వ్యసనీ రిపుహా సాహసిక శ్శతభిషజి దుర్గ్రాహ్యః
భాద్రపదా సూద్విగ్నః స్త్రీ విజితధనీ పటు రదాతా. 13

టీ శతభిషజి = శతభిషం నక్షత్రమందుఁ బుట్టినవాఁడు, స్ఫుటవాక్ = స్పష్టముగా మాట్లాడువాఁడును, వ్యసనీ = దుర్వ్యసనాసక్తుఁడును, రిపుహా = శత్రుఘాతుకుఁడును సాహసికః =సాహసముగలవాడును, దుర్గ్రాహ్యః=ఇతరులకు లోబడనివాడును, అగును. భాద్రపదాసు=పూర్వాభాద్రయందుఁ బుట్టినవాఁడు, ఉద్విగ్నః=దుఃఖితుఁడును, స్త్రీవిజితః=

స్త్రీలచేతజయింపఁబడిన వాఁడును, ధనీ= ధనవంతుఁడును, (పక్షాంతరమందు, స్త్రీవిజితధని= స్త్రీచేత జయింపఁబడిన ధనముగలవాఁడును,) పటుః= నేర్పరియు ,అదాతా = దాతృత్వము లేనివాఁడును అగును.

తా. శతభిషానక్షత్రమున బుట్టినవాఁడు, స్పష్టమైన వాక్కుగలవాడును, స్త్రీద్యూతాద్యాది వ్యసనాసక్తుఁడును, శత్రుఘాతకుడు, సాహసవంతుడు, యితరులకు లోబడనివాడును,అగును.

మరియు, స్వజాతితిరస్కారుఁడును, నీచజనసమ్మానితుఁడును, పాపకార్యముఁ జేయుట యందు అతిగూఢాలోచనపరుఁడును, అగునని కొందరియభిప్రాయము.

పూర్వాభాద్రనక్షత్రమున బుట్టినవాడు, దుఃఖితుండును, స్త్రీలచే జయింపబడినవాఁడును, స్త్రీమూలముగ ధనవంతుడును,నిరాధారుండును, లోభియు కార్యనిపుణత గలవాడును అగును.

## ఉత్తరాభాద్రా రేవతీ నక్షత్రజనితుల స్వభావములు.

శ్లో. వక్తా సుఖీ ప్రజావాన్ జిత శత్రుర్ధార్మికో ద్వితీయాసు
సంపూర్ణాంగ స్సుభగ శ్శూర శ్శుచి రర్థవాన్ పౌష్ణే. 14

టీ. ద్వితీయాసు=ఉత్తరాభాద్రయందుఁబుట్టినవాఁడు, వక్తా=సభయందు నిర్భయముగా మాటలాడువాఁడును, సుఖీ= సుఖవంతుఁడును, ప్రజావాన్=సంతతిగలవాఁడును,జితశత్రుః= శత్రులను జయించినవాఁడును, ధార్మికః=ధర్మశీలుఁడును, అగును పౌష్ణే=రేవతియందుఁ బుట్టి నవాఁడు, సంపూర్ణాంగః = పరిపూర్ణావయవుఁడును, సుభగః = సర్వజనప్రియుఁడును, శూరః=శూరుఁడును, శుచిః=శుచియైయుండువాఁడును, అర్థవాన్=ధనవంతుఁడును అగును.

తా. ఉత్తరాభాద్ర నక్షత్రమునబుట్టినవాడు, సభాంతరంబున న్యాయవిచక్షణము గను, చమత్కారముగను, బలుక నేర్చినవాడును, సౌఖ్యమననుభవించువాడును, కళత్రపుత్ర మిత్రబాంధవాది సహితుండును, జయింపబడినశత్రువులుగలవాడును, ధర్మశీలుడును,నగును.

రేవతీనక్షత్రమునబుట్టినవాడు, పరిపూర్ణావయవములుగలవాడును,సర్వజనులకును ప్రియము గు కార్యములచేయువాడును, రణశూరుడును, ఇతరుల ధనదారాదులయందించుకయైన యాసక్తి లేక సర్వదా దేవ పితృభక్తిగలవాడై శుచిగానుండువాడును, ధనముగలవాడును, అగును.

జాతకమున చంద్రుడు బలవంతుడుగానుండిన మాత్రమున నే పై జెప్పినఫలంబులన్ని యు, సంపూర్ణముగజరుగును, చంద్రుడుబలహీనుడగు నెడల నీనక్షత్రఫలము లేవియు జరుగ జాలవుగాన జ్యోతిష్కులు కేవలము నక్షత్రమునుబట్టి మాత్రమే ఫలనిర్ణయముజేసినచో విప రీతముగజరుగుననుటను యోచించి చంద్రబలమునాధారముగగొని నక్షత్రఫలముల సిద్ధాం తము జేయదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ఋక్షశీలాధ్యాయ నామక
షోడశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### రాశిశీలాధ్యాయము. సప్తదశాధ్యాయము. —17.



#### మేషమున చంద్రుఁడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. వృత్తా తామ్రదృ గుష్ణశాకలఘుభుక్ క్షిప్రప్రసాదోటనః
కామీ దుర్బలజాను రస్థిర ధన శ్శూరోంగనా వల్లభః
సేవాజ్ఞః కునఖీ వ్రణాం కితశిరా మానీ సహోత్థా గ్రజ
శ్శక్త్యా పాణిత లేంకితోతి చపలస్తోయేచ భీరుః క్రియే. 1

టీ. క్రియే = మేషమందుచంద్రుఁడుండఁగాఁ బుట్టినవాఁడు, వృత్త=గుండ్రములై ఆతామ్ర = అంతటనెఱ్ఱనైన, దృక్ = కన్నులుగలవాఁడును, ఉష్ణశాకలఘుభుక్ = ఉష్ణపదార్థభోజియును, అధికశాకభక్షకుఁడును అల్పాహారియును, క్షిప్రప్రసాదః=ప్రథమకోపము గలవాఁడును, అటనః = సంచరించుటయందు స్వభావముగలవాఁడును, కామీ = స్త్రీలోలుండును, దుర్బలజానుః = బలములేనిమోకాళ్లు గలవాఁడును, అస్థిరధనః = దీర్ఘకాలము నిలువని ధనసంపదగలవాఁడును, శూరః = శూరుడును, అంగనావల్లభః = స్త్రీలకుప్రియమైన వాఁడును, సేవాజ్ఞః = సేవకవృత్తియందు నేర్పుగలవాఁడును, కునఖి=పుచ్చిన గోళ్లుగలవాఁడును, వ్రణాంకితశిరాః = కురుపులచేతమచ్చలుగల శిరస్సుగలవాఁడును, మానీ = గర్వితుఁడును, సహోత్థాగ్రజః = తోఁడఁబుట్టినవారిలో పెద్దవాఁడును, పాణితలే = అరచేతియందు, శక్త్యా = శక్తిరేఖలు, అంకితః = గురుతుగాఁగలవాఁడును, అతిచపలః = మిక్కిలి చపలచిత్తుఁడును, తోయే=జలమందు, భీరుః = భయస్థుడును, (పాఠాంతరమందు అతిభీరుః = మిక్కిలిభయపడు వాఁడును,) అగును.

తా. మేషరాశియందు చంద్రుండుండగా బుట్టినవాడు వర్తులములై పూర్ణముగ నెఱ్ఱనైన కన్నులుగలవాడును. ఉష్ణపదార్థభోజియు, అధిక శాఖభక్షకుడును, అల్పాహారియు,

కోపకాలమున శీఘ్రముగా సుముఖుడయ్యెడు వాడును, స్త్రీలోలుడును, బలహీనములగు మోకాళ్లుగలవాడును, దీర్ఘకాలమునిలువని ధనసంపద గలవాడును, శూరుడును, యువతీజనప్రియుడును, సేవకవృత్తియందధిక నేర్పుగలవాడును, పుచ్చిన గోళ్లుకలవాడును, కురుపులమచ్చలచే నిండియుండు తలగలవాడును, గర్వియు, సహోదరులలో జ్యేష్ఠుడును, అరచేతులయందు శక్తిరేఖలుగలవాడును, అధికముగ చలించునట్టి మనస్సుగలవాడును, నీటియందు భయపడువాడును, అగును.

### వృషభమున చంద్రుడుండు కాలమున బుట్టినవాని స్వభావములు.

శ్లో. కాంతః ఖేలగతిః పృథూరువదనః పృష్ఠాస్య పార్శ్వాంకిత
స్త్యాగీ క్లేశసహః ప్రభుః కకుదవాన్ కన్యాప్రజశ్శ్లేష్మలః
పూర్వైర్బంధుధనాత్మజైర్విరహితస్సౌభాగ్యయుక్తః క్షమీ
దీప్తాగ్నిః ప్రమదాప్రియః స్థిరసుహృన్మధ్యాంత్యసౌఖ్యో గవి. 2

టీ. గవి = వృషభమందు చంద్రుడుండగాఁబుట్టినవాఁడు, కాంతః = సుందరుఁడును, ఖేలగతిః = విలాసగమనుఁడును, పృథుః=పొడుగుగానుండు, ఊరు=తొడలును, వదనః=ముఖమునుఁగలవాఁడును, పృష్ఠ = వీపునందైనను, అస్య= ముఖమునందైనను, పార్శ్వ = ప్రక్కలయందైనను, అంకితః = మచ్చగలవాఁడును; త్యాగీ = దాతయును, క్లేశసహః = దుఃఖమునుసహించువాఁడును, ప్రభుః = ఎదురులేని ఆజ్ఞగలవాఁడును, కకుదవాన్ = మూపులుగలవాఁడును, కన్యాప్రజః = ఆడుపిల్లలు గలవాడను, శ్లేష్మలః = కఫాధిక్యముగలవాడును, పూర్వైః = పూర్వులైన, బంధుధనాత్మజైః = బంధు ధన పుత్రులను, విరహితః = ఎడబాసినవాఁడును, సౌభాగ్యయుక్తః = సౌభాగ్యముతో గూడినవాఁడును, క్షమీ=ఓర్పుగలవాఁడును, దీప్తాగ్నిః = ఆకలిగలవాఁడును, ప్రమదాప్రియః = వనితా జనవల్లభుఁడును, స్థిరసుహృత్ = దృఢమైన స్నేహముగలవాఁడును, మధ్యాంత్యసౌఖ్యః = యౌవన వార్ధకములయందు సుఖముగలవాఁడును, అగును.

తా. వృషభరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు, విలాసగమనుడును, వెడల్పయిపొడుగుగానుండు తొడలు గలవాడును, నిడుపగుముఖము గలవాడును, వీపునందైనను ముఖమునందైనను, ప్రక్కలందైనను, మచ్చలు గలవాడును, దానముచేయువాడును, దుఃఖమును సహించువాడును, అప్రతిహతమగు ఆజ్ఞగలవాడును, విస్తారమైన మూపులు గలవాడును, స్త్రీజనకుడును, కఫాధిక్యమగు కంఠముగలవాడును, బంధువును, ధనమును పుత్రాదులనెడబాయు వాడును, సౌభాగ్యయుక్తుండును ఓర్పుగలవాడును, మిక్కిలి యాకలి గలవాడును, వనితాజన వల్లభుడును, దృఢమైన చెలిమిగలవాడును, యౌవనవార్ధక్యములయందు సుఖము ననుభవించువాడును, అగును, ఇందుచే నీజాతకుడు బాల్యమున దుఃఖము ననుభవించువాడనుట స్పష్టముగా నేర్పడుచున్నది. మరియు చంద్రునకు క్షీణత్వ దోషము లేకుండిన యెడల నీఫలితములన్నియు సంపూర్తిగా జరుగును.

### మిథునమున చంద్రుఁడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. స్త్రీలోల స్సురతోపచార కుశల స్తామ్రేక్షణ శ్శాస్త్రవి
ద్దూతః కుంచితమూర్ధజః పటుమతి ర్హాస్యేంగితద్యూతవిత్
చార్వంగః ప్రియవాక్ ప్రభక్షణ రుచిర్గీత ప్రియో నృత్యవిత్
క్లీబై ర్యాతి రతిం సమున్నత నస శ్చాంద్రే తృతీయర్క్షగే. 3

టీ. చంద్రే=చంద్రుఁడు, తృతీయర్క్షగే=మిథునరాశిగతుఁడై యుండఁగాఁ బుట్టినవాఁడు, స్త్రీలోలః=స్త్రీలయందభిలాషగలవాఁడును, సురతోపచార కుశలః=కామశాస్త్రమందుఁ నేర్పరియును, తామ్రేక్షణః = ఎఱ్ఱనికన్నులుగలవాఁడును, శాస్త్రవిత్ = పండితుండును, దూతః = రాయభారము సేయువాఁడును, కుంచితమూర్ధజః = చుట్టబడిన వెండ్రుకలు గలవాఁడును, పటుమతిః=చతురుఁడును, హాస్య= అపహాసము, ఇంగిత = పరులహృద్గతమైన భావము, ద్యూత=జూదము, విత్ = తెలిసినవాఁడును (పాఠాంతరమందు, హాస్యాంచితః=నగుమొగముగల వాఁడును) చార్వంగః=సుందరావయవములు గలవాఁడును, ప్రియవాక్=ప్రియభాషణుఁడును, ప్రభక్షణరుచిః=అధికభక్షకుఁడును, గీతప్రియః=గానలోలుఁడును, నృత్యవిత్ = నాట్యము తెలిసినవాఁడును, సమున్నతనసః=ఎత్తైన ముక్కుగలవాఁడును అగును, క్లీబైః=షండులతోఁడ, రతిం = క్రీడను, యాతి= పొందును

తా. మిథునరాశియందు చంద్రుఁడుండగాబుట్టినవాఁడు, స్త్రీలయందభిలాష గలవాఁడును, కామశాస్త్రజ్ఞాన విచక్షణుండును, ఎఱుపుగలకన్నులుగలవాఁడును, పండితుండును, ఇతరులకు రాయభారముచేయుటయందు నిపుణుఁడును, వంకరగల వెండ్రుకలుగలవాఁడును, చతురుఁడును, అపహాసముచేయుటయందు ఇష్టముగలవాఁడును, ఇతరుల మనోభావమును కనుగొనువాఁడును, జూదమాడుటయందాసక్తిగలవాఁడును, సుందరములగు అవయవములుగలవాఁడును, ప్రియముగమాటలాడువాఁడును, అమితముగ భుజించువాఁడును, గానలోలుఁడును, నాట్యజ్ఞానముగలవాఁడును, నపుంసకులతోడను, నీచులతోను, పిఱికితనము, సోమరితనము గలవారితోడను, స్నేహముగలవాఁడును, అగును. ఈశ్లోకమున "హాస్యేంగిత" అనుచోట "హాస్యాంచితః" అనిపఠించి "నగుమోముగలవాఁడగునని" కొందరుశాస్త్రజ్ఞు లనుచున్నారు.

### కర్కాటకమున చంద్రుఁడుండగా బుట్టినవానిస్వభావములు.

శ్లో. ఆవక్ర ద్రుతగ స్సమున్నతకటిః స్త్రీనిర్జిత స్సత్సుహృ
ద్దైవజ్ఞః ప్రచురాలయః క్షయధనై స్సంయుజ్యతే చంద్రవత్
హ్రస్వః పీనగళ స్సమేతి చ వశం సామ్నా సుహృద్వత్సల
స్తోయోద్యాన రతః స్వవేశ్మ సహితే జాత శ్శశాంకే నరః. 4

టీ. శశాంకే=చంద్రుఁడు, స్వవేశ్మసహితే= స్వగృహమైన కర్కాటమునందుండఁగా, జాతః=పుట్టినవాఁడు, వక్రద్రుతగః = కుటిలమగు శీఘ్రగమనముఁగలవాఁడును, సమున్నత

కటిః=ఉన్నతమైనపిడికట్టు గలవాఁడును, స్త్రీనిర్జితః = స్త్రీలచేత జయింపబడినవాఁడును, సత్సుహృత్=మంచిస్నేహితులుగలవాఁడును, దైవజ్ఞః=జ్యోతిశ్శాస్త్రవేత్తయును, ప్రచురాలయః=అనేకయిండ్లుగలవాఁడును, చంద్రవత్=చంద్రునివలె, క్షయధనైః = ధనక్షయవృద్ధులతోడ, సంయుజ్యతే=సంయుక్తుఁడును, హ్రస్వః = పొట్టివాఁడును, పీనగదః = బలిసినకంఠము గలవాఁడును, సామ్నా = మంచితనముచేత, వశం = స్వాధీనత్వమును, సమేతి=పొందువాఁడును, సుహృద్వత్సలః = స్నేహితులయందు ప్రీతిగలవాఁడును, తోయ = జలమందును, ఉద్యాన= ఉద్యానవనమందును, రతః = ఆసక్తిగలవాఁడును అగును.

తా. కర్కాటకరాశియందు చంద్రుఁడుండగాబుట్టినవాఁడు, కుటిలమగు శీఘ్రగమనము గలవాఁడును, ఉన్నతమగు జఘనముగలవాఁడును, వనితాజనముచే జయింపబడువాఁడును, సత్సాంగత్యముగలవాఁడును, జ్యోతిషమునందును, గణితమునందును, ప్రజ్ఞగలవాఁడును, గృహబాహుళ్యముగలవాఁడును, ఈ కర్కాటకనాథుఁడగు చంద్రునివలె కొన్నిదినములు ధనవంతుఁడుగను, మరి కొన్నిదినములు ధనహీనుఁడుగ నుండువాఁడును, పొట్టివాఁడును, బలిసినట్టి కంఠముగలవాఁడును, సత్స్వభావముచేత దనస్వాధీనముచేసుకొను శక్తిగలవాఁడును, మిత్రులయందధిక ప్రీతిగలవాఁడును, నీటియందును, ఉద్యానవనములందును, క్రీడించుటకాసక్తిగలవాఁడును, అగును. మరియు, రాజతుల్యుఁడైనను, మంత్రియైనను, అగునని కొందరి అభిప్రాయము.

## సింహమున చంద్రుఁడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. తీక్ష్ణస్థూలహనుర్విశాలవదనః పింగేక్షణోల్పాత్మజః
స్త్రీద్వేషీ ప్రియమాంసకాననగః కుప్యత్యకార్యే చిరం
క్షుత్తృష్ణోదరదంతమానసరుజా సంపీడితస్త్యాగవాక్
విక్రాంతః స్థిరధీస్సుగర్వితమనా మాతుర్విధేయోర్కభే. 5

టీ. అర్కభే=సింహరాశియందు చంద్రుఁడుండఁగాఁ బుట్టినవాఁడు, తీక్ష్ణః = ముక్కోపియును, స్థూలహనుః=ఉబ్బినచెక్కిళ్లుగలవాఁడును, విశాలవదనః=విశాలమైనముఖముగలవాఁడును, పింగేక్షణః=పచ్చనికన్నులుగలవాఁడును, అల్పాత్మజః = తక్కువసంతానముగలవాఁడును; స్త్రీద్వేషీ=స్త్రీలకుశత్రువైనవాఁడును, ప్రియమాంసకాననగః= మాంసమునపర్వతములయందు ఇష్టముగలవాఁడును, అకార్యే=చేయఁగూడనికార్యములందు, చిరం=బహుకాలము, కుప్యతి=కోపించును, (పాఠాంతరమందు=అకాండే=అకాలమందు కోపించుననియర్థము) క్షుత్=ఆకలి, తృష్ణా=దాహము, ఉదర=కడుపు, దంత=పండ్లు, మానస = మనస్సు(వలనగలిగిన,) రుజా= బాధచేత, సంపీడితః=పీడింపఁబడువాఁడును, త్యాగవాక్=ఈవిగలవాఁడును, విక్రాంతః=పరాక్రమవంతుఁడును, స్థిరధీః = నిశ్చలమైనబుద్ధిగలవాఁడును, సుగర్వితమనాః = అహంకృతచిత్తుఁడును, మాతుః=తల్లి, విధేయః=చెప్పినట్లువినెడ వాఁడును, అగును.

తా. సింహరాశియందు చంద్రుఁడుండగా బుట్టినవాడు, ముందుకోపముగలవాడును, బలిసిన చెక్కిళ్లు గలవాడును, విశాలముఖము గలవాడును, గోరోజనమువంటి వర్ణముగలిగిన కన్నులుగలవాఁడును, స్వల్పమగు సంతానముగలవాడును, స్త్రీలయందు శత్రుత్వముగలవాడును, మాంసమునందిష్టముగలవాడును, వనములయందును, పర్వతములయందును దిరుగుటయందు ప్రీతిగలవాడును, కాలమునను సరించక అకారణముగ కోపించువాడును, మనస్సువలనను, ఆకలి వలనను, దాహమువలనను, కడుపునొప్పివలనను, పంటినొప్పివలనను, గలుగుబాధచేత పీడింపబడువాడును, దాతృత్వముగలవాడును, అధికబలశౌర్య గాంభీర్యాదులు గలవాడును, అహంకారచిత్తుడును, తల్లిచెప్పినమాటలను జవదాటక వినువాడును, అగును.

## కన్యయందు చంద్రుఁడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. వ్రీడామంథర చారువీక్షణగతిః స్రస్తాంసబాహుస్సుఖీ
శ్లక్ష్ణః స్సత్యరతః కలాసు నిపుణః శ్శాస్త్రార్థ విద్ధార్మికః
మేధావీ సురతప్రియః పరగృహై ర్విత్తైశ్చ సంయుజ్యతే
కన్యాయాం పరదేశగః ప్రియవచాః కన్యాప్రజోల్పాత్మజః. 6

టీ. కన్యాయాం = కన్యయందు చంద్రుఁడుండఁగాబుట్టినవాఁడు వ్రీడా = లజ్జచేతనైన, మంథర=సోమరితనముచేత, చారు= సుందరములైన, వీక్షణ=చూపులును, గతి=గమనమునుగలవాఁడును, స్రస్త = ప్రలంబములైన, అంస=మూపులును, బాహు=భుజములును గలవాఁడును, సుఖీ = సుఖవంతుఁడును, శ్లక్ష్ణః = మృదుశరీరుఁడును, సత్యరతః = సత్యభాషియును, కలాసు = నృత్తగీతవాద్య పుస్తకలేఖనాది క్రియలయందు, నిపుణః = నేర్పరియు, శాస్త్రార్థము దెలిసినపండితుండును, ధార్మికః = ధర్మాసక్తుండును, మేధావీ = ధారణాశక్తియుక్తమైన బుద్ధిగలవాఁడును, సురతప్రియః = కామక్రీడాలోలుఁడును, పరగృహైః = పరగృహములతోఁడను, విత్తైః=పరధనములతోఁడను, సంయుజ్యతే = సంయుక్తుఁడును, పరదేశగః = పరదేశమందు తిరుగువాఁడును, ప్రియవచాః = ప్రియభాషియు, కన్యాప్రజః=కన్యకలగనువాఁడును, అల్పాత్మజః = స్వల్పమైన పుత్రసంతానము గలవాఁడును అగును.

తా. కన్యారాశియందు చంద్రుఁడుండగా బుట్టినవాడు, లజ్జాసంబంధమైనట్టియు, సుందరమైనట్టియు, చూపులును, గమనమును గలవాడును, జారిన మూపులును, భుజములును గలవాడును, సౌఖ్యమునసుభవించు వాడును, మృదువగు శరీరముగలవాడును, సత్యమును పలుకువాడును, సంగీత సాహిత్య నాట్య, వాద్య, శిల్ప, విద్యాపుస్తక లేఖనాది క్రియలయందు నేర్పరియు, శాస్త్రార్థము దెలిసిన పండితుడును, ధర్మాసక్తుండును, ధారణాశక్తియుక్తమైన బుద్ధిగలవాడును, కామక్రీడానురంజకుడును, పరగృహాధనముల ననుభవించువాడును పరదేశమున సంచరించువాడును, ప్రియముగమాటలాడువాడును, స్త్రీసంతానము నధికముగా గలవాడును, స్వల్పమగు పుత్రసంతానము గలవాడును, వనితాజన ప్రియుండును. అగును.

## తులయందు చంద్రుడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. దేవబ్రాహ్మణ సాధుపూజ నరతః ప్రాజ్ఞశ్శుచిః స్త్రీజితః
ప్రాంశు శ్చోన్నతనాసికః కృశచలద్గాత్రోటనోర్థాన్వితః
హీనాంగః క్రయవిక్రయేషు కుశలో దేవద్వినామా సరు
గ్బంధూనా ముపకారకృద్వి రుషి తస్త్యక్తస్తు తై స్సప్తమే. 7

టీ. సప్తమే = తులయందుచంద్రుఁడుండగాఁ బుట్టినవాఁడు, దేవ = దేవతలయొక్కయు, బ్రాహ్మణ = బ్రాహ్మణులయొక్కయు, సాధు = సత్పురుషులయొక్కయు, పూజన = పూజించుటయందు, రతః = ఆసక్తుఁడైనవాఁడును, ప్రాజ్ఞః = ప్రజ్ఞగలవాఁడును, శుచిః = పరిశుద్ధుఁడైయుండువాఁడును, స్త్రీజితః = స్త్రీవశవర్తియును, ప్రాంశుః = మిక్కిలిపొడవైనవాఁడును, ఉన్నతనాసికః = అత్యున్నతమైనముక్కు గలవాఁడును, కృశచలద్గాత్రః = కృశమైచలించెడి దేహముగలవాఁడును, అటనః = తిరుగుటయం దిష్టముగలవాఁడును, అర్థాన్వితః = ధనయుక్తుఁడును, హీనాంగః = సరియైన అవయవములు లేనివాఁడును (పాఠాంతరమందు, పీనాంగః = పరిపూర్ణావయవుండును) క్రయవిక్రయేషు = క్రయవిక్రయములయందు, కుశలః = సమర్థుండును, దేవద్వినామా = మొదటిపేరుగాక, సభ్య పర్యాయమైన దైవవాచకమైన రెండవపేరుగలవాఁడును, సరుక్ = రోగయుక్తుండును, బంధూనాం = స్వజనులకు, ఉపకారకృత్ = ఉపకారము చేయువాఁడును, తైః = ఆబంధువులచేత, విరుషితః = తిరస్కరింపఁబడినవాఁడును, త్యక్త = అట్టిబంధువులచేత విడువఁబడిన వాఁడును అగును.

తా. సప్తమరాశియగు తులారాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు, దేవతలను బ్రాహ్మణులను, సాధువులను పూజించువాడును, లౌకికవ్యవహారాది విషయములందు సమర్థుడును, పండితుడును, కార్యాలోచన తత్పరుడును, శృంగార వంతుడై, పరధనదారాపేక్షలు లేక, పరిశుద్ధముగ నుండువాడును, యువతీజన ఆజ్ఞాప్రవర్తకుడును, మిక్కిలి పొడవైనవాడును, అత్యున్నతమగు ముక్కుగలవాడును, చిక్కియుండి, చలనము గల దేహముగలవాడును, అంతటను తిరిగెడు స్వభావముగలవాడును, ధనవంతుడును, అపరిపూర్ణములైన అంగములు గలవాడును, క్రయవిక్రయాదులయందు నేర్పరియు, తనకు పెట్టబడిన మొదటిపేరుగాక సభాదులయందు తనప్రజ్ఞను గనుబరచి, రెండవపేరును సంపాదించువాడును, రోగముతో గూడుకొన్నవాడును, బంధువులకు ఉపకారముసేయువాడైనను, ఆబంధువుల చేత తిరస్కరింపబడి విడువబడువాడును, అగును.

## వృశ్చికమున చంద్రుడుండగా జనించినవాని స్వభావములు.

శ్లో. పృథుల నయనవక్షా వృత్తజంఘో నుజాను
ర్జనకగురు వియుక్తశ్శైశవే వ్యాధితశ్చ

నరపతి కులపూజ్యః పింగలః క్రూరచేష్టో
ఝషకులిశ ఖగాంక శ్ఛన్నపా పోలిజాతః. ౮

టీ. అలిజాతః = వృశ్చికరాశియందుఁబుట్టినవాఁడు, పృథులనయనవక్షాః = విశాలములైన కన్నులును వక్షస్థలమును గలవాఁడును, వృత్తజంఘోరుజానుః = వర్తులములైనపిక్కలునుతొడలును మోకాళ్లునుంగలవాడును, జనక = తల్లిదండ్రులచేతను, గురు=ఆచార్యునిచేతను, వియుక్తః = విడువంబడినవాఁడును, శైశవే = బాల్యమందు, వ్యాధితశ్చ = వ్యాధిపీడితుండును, నరపతికులపూజ్యః = రాజపూజ్యుండును, పింగళః = పింగళాక్షుండును, క్రూరచేష్టః = క్రూరస్వభావుండును, ఝషకులిశఖగాంకః = మత్స్య వజ్ర పక్షి రేఖలచేత గుర్తులుగలవాఁడును, ఛన్నపాపః = పాపకార్యముల చేసి దాచువాఁడును అగున, పాఠాంతరమందు, ఝషకులిశఖగాంకఛన్నపాదః = మత్స్యవజ్రపక్షి రేఖల చేతకప్పఁబడిన పాదములుగలవాఁడును, అనఁగా మత్స్యాది రేఖలు పాదమందు గలవాఁడని యర్థము.

తా. వృశ్చిక రాశియగు చంద్రుఁడుండగా బుట్టినవాడు, విశాలమగు కన్నులు, వక్షస్థలము గలవాడును, వర్తులములగు తొడలును, మోకాళ్లును గలవాడును, జననీ జనకులచేతను, ఆచార్యునిచేతను విడువబడినవాడును, బాల్యమునందు వ్యాధిపీడితుడును, రాజపూజితుడును, పసుపు రంగుగల కన్నులుగలవాడును, కఠిన స్వభావుడును, మత్స్య, వజ్ర, పక్షి రేఖలుగలవాడును, పాపకార్యములుగూఢముగా జేయువాడును, అగును.

నీచస్థానములు బొందిన చంద్రుడుగాన జాతకునికి విధవా సంభోగము, పరదారా సంపర్కము నీచ పదార్థభోజన ప్రీతి, హింసకునోర్వజాలమి, ధనహీనత, గలుగజేయును మరియు సభారంజకత్వమును సంపూర్ణముగ గలుగజేయును.

## ధనుస్సున చంద్రుఁడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. వ్యాదీర్ఘాస్య శిరోధరః పితృధనస్త్యాగీ కవి ర్వీర్యవాన్
వక్తాస్థూలరద శ్రవోధరనసః కర్మోద్యత శ్శిల్పవిత్
కుబ్జాంసః కునఖీ సమాంసలభుజః ప్రాగల్భ్యవాన్ ధర్మవిత్
బంధు ద్విణ్ణబలాత్సమేతిచ వశం సామ్నైక సాధ్యోశ్వజః. 9

టీ. అశ్వజః = ధనుస్సున చంద్రుఁడుండగా జన్మించినవాఁడు, వ్యాదీర్ఘ = అతిదీర్ఘమైన, ఆస్య = ముఖమును, శిరోధరః = కంఠమునుగలవాఁడును (పాఠాంతరమందు = వ్యాదీర్ఘాస్యశిరోరదః= అతిదీర్ఘములైన, ముఖము, శిరస్సు, దంతములుగలవాఁడును) పితృధనః= పిత్రార్జితమైన ధనముగలవాఁడును, త్యాగీ=దాతయును, కవిః=కావ్యకర్తయును, వీర్యవాన్= బలవంతుడును, వక్తా = మాటలాడుటయందు నేర్పుగలవాఁడును, స్థూల = గొప్పవైన, రద= దంతములు, శ్రవః = చెవులు, అధర – క్రిందిపెదవి, నాసా=ముక్కు, గలవాఁడును, కర్మోద్యతః = బహుకార్యోద్యమశీలుఁడును, శిల్పవిత్ = లిపిపుస్తక చిత్రలేఖనాది వేత్తయు

ను, కుబ్జాంసః = పొట్టిమూపులు గలవాఁడును, కునఖీ = పుచ్చినగోళ్లుగలవాఁడును, సమాంసలభుజః = బలిసిన భుజములు గలవాఁడును, ప్రాగల్భ్యశ్రావ్యా = మిక్కిలి ప్రౌఢిమగలవాఁడును, ధర్మవిత్ = ధర్మమార్గ మెఱింగిన వాఁడును, బంధుద్విట్ = బంధుద్వేషియు నగును, బలాత్ = బలాత్కారమువలన, వశం=అధీనత్వమును, నసమేతి = పొందఁడు, సామైకసాధ్యః = సామోపాయముచేత మాత్రమే సాధింపఁదగిన వాఁడగును.

తా. ధనురాశియందు చంద్రుఁడుండగా బుట్టినవాడు, దీర్ఘములైన గళము, ముఖము శిరస్సుదంతములు గలవాఁడును, పిత్రార్జితమగు ధనము ననుభవించువాఁడును, దాతయును, కావ్యముల వ్రాయుటయందును, చదువుటయందును సమర్థుడును, బలముగలవాడును, నేర్పుగ మాటలాడువాఁడును, పొడవగు పండ్లు పెద్దచెవులు లావుగనుండు అధరము, పెద్దముక్కు అనునిట్టివి గలవాఁడును, బహుకార్యములందు సమర్థత గలవాఁడును, పుస్తకములు వ్రాయుట చిత్తరువులు వ్రాయుట, మొదలగు వాటియందు నేర్పరియు, పొట్టిమూపులు గలవాడును, పుచ్చినగోళ్లు కలవాడును, బలిసిన భుజముగలవాడును, న్యాయవిచక్షణుడును, బంధుద్వేషియు, బలాత్కారమునకు లొంగనివాడును, సామోపాయముచేత మాత్రము సాధింపతగిన వాడును అగును.

## మకరమున చంద్రుఁడుండగా జనించినవాని స్వభావములు

శ్లో. నిత్యం లాలయతి స్వదార తనయాన్ ధర్మధ్వజోఽధః కృశః
స్వక్షః క్షామ కటిర్గృహీత వచన స్సౌభాగ్య యుక్తోఽలసః
శీతాళు ర్మనుజోఽటనశ్చమకరే సత్వాధికః కావ్య కృ
ల్లుబ్ధోఽగమ్య జరాంగనాసు నిరత స్సంత్యక్త లజ్జోఽఘృణః. 10

టీ. మకరే = మకరమున చంద్రుండుండఁగాఁబుట్టిన, మనుజః = నరుండు, స్వదార తనయాన్ = తనదారపుత్రులను, నిత్యం = ఎల్లప్పుడు, లాలయతి = లాలనము సేయుచుండును, ధర్మధ్వజః = ధర్మముచే సెదనని, దబ్బరలాడి ధనమార్జించు వాఁడును, అధఃకృశః = తొడలు మొదలైన అధరావయవములు కృశించి యుండువాఁడును, స్వక్షః = మంచికన్నులు గలవాఁడును, క్షామకటిః = కృశమైన మొలగలవాఁడును, గృహీతవచనః = చెప్పినమాత్రమున గ్రహించువాఁడును, సౌభాగ్యయుక్తః = సౌభాగ్యసంపన్నుఁడును, అలసః=మందబుద్ధిగలవాఁడును, శీతాళుః = చలికిఓర్వలేని వాఁడును, అటనః = తిరిగెడుస్వభావము గలవాఁడును, సత్వాధికః = బలాధికుఁడును, (లేక) ఉదారచేష్టుఁడును, కావ్యకృత్ = కవిత్వము సేయువాఁడును, లుబ్ధః = లోభియును, అగమ్య=హీనజాతిస్త్రీలయందును, జరాంగనాసు= వృద్ధస్త్రీలయందును, నిరతః = ఆసక్తిగలవాఁడును, సంత్యక్తలజ్జః=సిగ్గులేనివాఁడును, అఘృణః = నిర్దయగలవాఁడును, అగును.

తా. మకర రాశియందు చంద్రుడుండగా జనించినవాడు, తనభార్యపుత్రులను ఎల్లప్పుడును ప్రేమించుచు లాలనసేయువాడును, ధర్మము చేయువాడునని, బొంకులాడి ప్రజలకు నమ్మకము గలిగించి ధనమార్జించువాడును, కృశించినతొడలు మొదలగుక్రింది అవయవములు గలవాడును, మంచికన్నులు గలవాడును, సన్నని జఘనము గలవాడును, చెప్పినమాత్రమున గ్రహించువాడును, సౌభాగ్యవంతుండును, సోమరియు, చలికినధికముగా వణకువాడును, తిరుగునట్టి స్వభావముగలవాడును, బలవంతుడును, దాతయు, కావ్యరచనాశక్తి గలవాడును, బహులోభియు, హీనజాతిస్త్రీలయందును, తనకంటెవయసు మీరిన వనితలయందును, సంభోగాసక్తిగలవాడును, సిగ్గులేనివాడును, దయావిహీనుడును, అగును.

## కుంభమున చంద్రుడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. కరభగళ స్సిరాళు ఖరలోమశదీర్ఘతనుః
పృథుచరణోరుపృష్ఠ జఘనాస్యకటి ర్బధిరః
పరవనితార్థపాపనిరతః క్షయవృద్ధియుతః
ప్రియకుసుమానులేపన సుహృద్ఘటజో ధ్వసహః 11

టీ. ఘటజః = కుంభమున చంద్రుండుండఁగాఁ బుట్టినవాఁడు, కరభగళః = ఒంటెమెడవలెపొడవై వంకరయైన మెడగలవాఁడును, సిరాళు = నరములుఉబ్బి కనుపించుచున్నట్టియు, ఖర = కఠినమైనట్టియు, లోమశ=రోమములతోఁగూడుకొన్నట్టియు, దీర్ఘ=ఉన్నతమైనట్టియు, తనుః = శరీరముగలవాఁడును, (కొందఱుసిరాళు = నరములుకనుపించు శరీరముగలవాఁడును, ఖరలోమశతీర్ఘతనః = కర్కశములయిన రోమములచే వ్యాపింపఁబడిన దీర్ఘశరీరము గలవాఁడునని చెప్పుదురు) పృథు = గొప్పలయిన. చరణ = పాదములును, ఊరు= తొడలు మణికట్టును, పృష్ఠ=వీపును, జఘన=మడికట్టు,ఆస్య=నోరును, కటిః= మొలయునుగలవాఁడును, బధిరః=చెవిటివాఁడును, పరవనితార్థ=పరదారాధనము యందును, పాప=పాపకర్మముల యందును, నిరత = ఆసక్తిగలవాఁడును, క్షయవృద్ధియుతః = ఒకప్పుడు లేమితోఁడను మరియొకప్పుడు ధనముతోను గూడుకొనియుండు వాఁడును, ప్రియ కుసమాను లేపన సుహృత్ = పుష్పములయందును సుగంధాది లేపనములయందును స్నేహితులయందును ప్రీతిగలవాడును, అధ్వంసహః = మార్గమందు కలుగు కష్టములను సహించువాఁడును అగును.

తా. కుంభరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు, ఒంటెమెడవలె పొడవై వంకరయైన మెడగలవాడును, ఉబ్బినరములు గలిగినట్టియు, కఠినమైనట్టియు, మిక్కిలిరోమములతోగూడినట్టియు' అత్యున్నతమైన శరీరము గలవాడును, గొప్పవైన పాదములును, తొడలును, వీపును, పిరుదులును, నోరును, మొలయును గలవాడును, పరదారాధనములయందును, పాపకార్యముల యందును, ఆసక్తిగలవాడును, చెవిటివాడును, జీవిత కాలమున కొంత భాగముభాగ్యవంతుడుగను, కొంత కాలము భాగ్యహీనుడుగను నుండువాడును, పుష్పములయం

దును, సుగంధాది లేపనముల యందున్ప్రీతి గలవాడును. స్నేహితులయం దనురక్తిగలవాడు ను, మార్గాయాస క్లేశమును సహించువాడును, అగును.

—— మీనమునచంద్రుడుండగా బుట్టినవానిస్వభావములు. ——

శ్లో. జలపరధనభోక్తా దారవాసోనురక్తః
సమ రుచిర శరీర స్తుంగ నాసో బృహత్కః
అభిభవతి సపత్నాన్ స్త్రీజిత శ్చారుదృష్టి
ర్ద్యుతినిధి ధనభోగీ పండిత శ్చాంత్యరాశౌ. 12

టీ. అంత్యరాశౌ = మీనరాశియందుచంద్రుడుండగాఁ బుట్టినవాఁడు, జలధన = నీటియందుఁబుట్టిన ముత్యములు మొదలైనవాని క్రయవిక్రయములచేత చిక్కినధనమును, పర ధన = పరద్రవ్యములను, భోక్తా = అనుభవించువాఁడును, దార = భార్యయందును, వా సః = వస్త్రములయందును, అనురక్తః = అనురాగముగలవాఁడును, సమ = హెచ్చుతగ్గులు లేక, రుచిర = కాంతియుక్తమైన, శరీర = దేహముగలవాఁడును, తుంగనాసః = ఎత్తైన ముక్కుగలవాఁడును, బృహత్కః = పెద్దతలగలవాఁడును, అగును, సపత్నాన్ = శత్రు వులను, అభిభవతి = గెలిచి తిరస్కరించువాఁడును, స్త్రీజితః = స్త్రీవశవర్తియును, చారుదృష్టిః = అందమైనకన్నులుగలవాఁడును, ద్యుతి = కాంతి, నిధి = నిక్షేపము, ధన = ధనములయొక్క, భోగీ = అనుభవించువాఁడును, పండితః = శాస్త్రజ్ఞుండును = అగును.

తా. మీనరాశియందు చంద్రుడుండగా బుట్టినవాడు, ఉదకమునబుట్టిన ముత్యము లు మొదలగువాని క్రయవిక్రయాదులవలన, ధనమార్జించువాడును, ఇతరులధనము నను భవించువాడును, కళత్రమునందును, వస్త్రములయందును, ప్రీతిగలవాడును, అంగవిహీనము లేక యుండువాడును, సుందరశరీరముగలవాడును, ఎత్తగుముక్కుగలవాడును, పెద్ద తలగలవాడును, శత్రువిషయమునందతి తిరస్కారభావముగలవాడును, వనితాజనవశవర్తి యును, అందమగు కన్నులుగలవాడును, శాస్త్రజ్ఞానముగలవాడును, దొరికిన నిక్షేపమువలన భోగమువనుభవించువాడును, అగును.

—— రాశ్యరాశ్యేతరస్థ చంద్రఫలముల పూర్ణాపూర్ణత్వములు. ——

శ్లో. బలవతి రాశౌ తతధిపతౌచ స్వబలయుత స్స్యా ద్యది తుహినాంశుః
కథితఫలానా మవికలదాతా శశివద శోఽ న్యేప్యనుపరిచింత్యాః. 13

టీ. రాశౌ = జన్మకాలమునచంద్రుడున్న రాశియును, తదధిపతౌ = ఆచంద్రా ధిష్ఠితరాశ్యధిపతియును, బలవతిసతి = బలవంతులై యుండఁగా, తుహినాంశుః = చంద్రు డు, స్వబలయుతస్స్యాద్యది = పూర్వోక్తమైన స్థానబలములతోఁ గూడినవాఁడై యున్న యెడల, కథితఫలానాం = ఈచెప్పంబడినఫలములకు, అవికలదాతా = సంపూర్ణముగా

నిచ్చును. అతః = ఈచంద్రునికంటె, అన్యేపి = ఇతరములైన రవికుజాదిగ్రహములును, శశివత్ = చంద్రునివలె, అనుపరిచింత్యాః = ఆలోచింపదగినవి.

తా. జననకాలమునచంద్రుడును, ఆచంద్రుడుండు రాశినాధుడును, బలయుతులై యుండగాచంద్రుడు, పూర్వోక్తస్థానములందు బలవంతుడై యుండునెడల పై శ్లోకముల యందు జెప్పబడిన ఫలములన్నియు సంపూర్తిగజరుగుటకుసందియము లేదు. ఇట్లనుటచే పై మూడురీతుల బలయుతములగుచుండగా రాశిస్వభావాదులన్నియు పై గనుబరుపబడిన ప్రకారము ఏ లోపములును లేక చక్కగజరుగుననియు, వీనియందు రెండుమాత్రము బలయుతములుగ నున్నయెడల ఫలములుకొంచెము తక్కువగాను, సంపూర్ణఫలితములుగాకను జరుగుననియు, ఒక్కటి మాత్రము బలవంతమైయుండిన ఫలములన్నియు మిక్కిలి స్వల్పముగా జరుగుననియు, ఒక్కటిగూడ బలోపేతముగానియెడల రాశిస్వరూపఫలాదులు ఏమాత్రమును జరుగవనియు, నూహింపదగినది. మరియు చంద్రేతరములగు గ్రహాదులకన్నిటికియిట్లే నూహింపదగినది. ఈ శ్లోకమున "బలవతిరాశౌ తదధిపతౌ చ" అని యుండుటచే సూర్యాంగారక బుధ, గురు, శుక్ర, శనైశ్చరులేరాశియందుందురో ఆరాశియు, ఆరాశినాధుడును, ఆ రాశియందు తత్కాలస్థితగ్రహమును బలయుతములై యుండునెడల వక్ష్యమాణచంద్రేతరములగు సూర్యాంగారక బుధ, గురు, శుక్ర, శనైశ్చరులుండు రాశిస్వభావాదులు సంపూర్ణముగ జరుగుననియు, యిందురెండు మాత్రము బలయుతములగునెడల పూర్వముచంద్రునకు జెప్పినరీతిగ ఫలములుకొంతమధ్యమముగ జరుగుననియు, ఒక్కటిమాత్రము బలముగునెడల ఫలము స్వల్పమనియు, అన్నియు బలహీనములగునెడల ఆ రాశిస్వభావములుమాత్రమే జరుగుననియు, తెలియదగినది.

## సూర్యస్థితరాశి ఫలములు.

### మేషవృషభములయందు సూర్యుడుండగా బుట్టినవానిస్వభావములు.

శ్లో. ప్రథిత శ్చతురోటనోల్పవిత్తః క్రియగే త్వాయుధభృద్వితుంగభాగే
గవి వస్త్రసుగంధ పణ్యజీవీ వనితాద్విట్ కుశలశ్చ గేయవాద్యే. 14

టీ. క్రియగే = మేషమందురవియుండగా బుట్టినవాడు. ప్రథితః = ప్రఖ్యాతుండును, చతురః = నేర్పరియును, అటనః = తిరిగెడువాడును, అల్పవిత్తః = స్వల్పధనవంతుడును, ఆయుధభృత్ = ఆయుధములను ధరించిబ్రతుకువాడును, అగును. ఈ ఫలము, వితుంగభాగే = పరమోచ్చభాగమునకు వెలిగానున్నభాగములతో బుట్టినవానికని తెలియందగినది, గవి = వృషభమందుసూర్యుడుండగా జనించినవాడు, వస్త్రసుగంధపణ్యజీవీ = వస్త్రములు సుగంధద్రవ్యములు విక్రయించి జీవించువాడును, వనితాద్విట్ = స్త్రీద్వేషియు, గేయవాద్యే = గానవాద్యములయందు, కుశలః = సమర్థుండును అగును.

తా. మేషరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు, కీర్తిగలవాడును, నేర్పరితనము గలవాడును, దేశసంచారాభిలాషియు, ధనముస్వల్పముగాగలవాడును, శస్త్రమూలకముగ జీవనముచేయువాడును, అగును. ఈ విషయములు, మేషరాశిసూర్యునకు ఉచ్చస్థానముగా నుండుటచేతను, గ్రంథాంతరవచనములచేతను, యీశ్లోకమున "వితుంగభాగే"యనియుండుట వలనను, పరమోచ్చభాగములుగాక తక్కిన 20 భాగములయందు సూర్యుడుండగా మాత్రమున ఫలితములుజరుగునని యు, పరమోచ్చభాగములగు 10 భాగములయందు సూర్యుడుండు కాలమున జననమందినవాడు, పై జెప్పిన ప్రకారముగాక, ధనాఢ్యుడై, ఆయుధ ధీరులచే సేవింపబడుచు ప్రఖ్యాతిగపాలనముజేయుచు సర్వభోగముల ననుభవించువాడగునని యూహింపదగును

వృషభరాశియందు సూర్యుడుండగా బుట్టినవాడు. వస్త్రములు, సుగంధద్రవ్యములు, మొదలగువాని క్రయవిక్రయాదులచే జీవనముచేయువాడును, స్త్రీలయందు ద్వేషస్వభావము గలవాడును, సంగీతవిద్యాకుశలుడును, అగును. మరియు గ్రంథాంతరముల యభిప్రాయముచే శత్రువులుగలవాడనియు, నేత్రరోగముగలవాడనియు, నూహింపదగియున్నది.

మిథున, కర్కట, సింహ, కన్యలయందు సూర్యుడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. విద్వాన్ జ్యోతిషవిత్తవాన్ మిథునగే భానౌ కుళీరస్థితే
తీక్ష్ణోఽస్వః పరకార్యకృచ్ఛ్రమపథః క్లేశైశ్చ సంయుజ్యతే
సింహస్థే వనశైలగోకులరతి ర్వీర్యాన్వితోఽజ్ఞః పుమాన్
కన్యాస్థే లిపిలేఖ్య కావ్య గణిత జ్ఞానాన్వితః స్త్రీవపుః. 15

టీ. భానౌ=సూర్యుండు, మిథునగే=మిథునమందుండఁగా జనించినవాఁడు, విద్వాన్=వ్యాకరణశాస్త్రజ్ఞుఁడును, జ్యోతిష=జ్యోతిశ్శాస్త్రజ్ఞుండును, విత్తవాన్=ధనికుండును, అగును. కుళీరస్థితే = కర్కాటకమందురవియుండఁగా జనించినవాఁడు, తీక్ష్ణః = తీవ్రమైనవాడును, అస్వః = దరిద్రుండును, పరకార్యకృత్ = పరులకార్యమును సేయువాఁడును. శ్రమపథః= దారినడుచుటచేత శ్రమనొందువాఁడును, అగును. క్లేశైశ్చః=దుఃఖములతో, సంయుజ్యతే = కూడియుండును, సింహస్థే = సింహమందు రవియుండఁగాఁబుట్టిన, పుమాన్ = పురుషుఁడు, వనశైల గోకులరతిః = అడవి కొండ గోష్ఠములందు ప్రేమగలవాఁడును, వీర్యాన్వితః= బలవంతుఁడును, అజ్ఞః = మూర్ఖుఁడును, అగును. కన్యాస్థే=కన్యయందు రవియుండఁగా జనించినవాఁడు, లిపి = అక్షరములువ్రాయుట, లేఖ్య = బొమ్మలువ్రాయుట, కావ్య= కవిత్వముచెప్పుట, గణిత = గణితముచేయుట, జ్ఞాన = ఆత్మజ్ఞానము, అన్వితః = ఈచెప్పబడిన గుణముగలవాఁడును, స్త్రీవపుః = స్త్రీసమ శరీరుఁడునుఅగును.

తా. మిథునమున సూర్యుడుండగా బుట్టినవాడు, భాషావిషయిక శాస్త్రములనెరింగినవాడును, జ్యోతిశ్శాస్త్రము నందనుభవముగలవాడును, ధనవంతుడును, ధారణాసమర్థమగు బుద్ధిగలవాడును, అగును.

కర్కాటకమున సూర్యుడుండగాజనించిన మానవుడు, తీవ్రమగు బుద్ధిగలవాడును, దరిద్రముచే పీడింపబడువాడును, ఇతరులకార్యముల నెరవేర్చుటయందభిలాష కలవాడును, దారినడుచుటచేగలిగిన యాయాసమునోర్వజాలనివాడును, సర్వదాదుఃఖితుడును, అగును. మరియు కార్యములయందు చపలత్వముగలవాడును, స్వజనులచే విరోధింపబడువాడును, మత్తు వస్తువులయందాసక్తిగలవాడును అగుననియు తెలియదగినది.

స్వక్షేత్రమగు సింహరాశియందు సూర్యుడుండుకాలమున బుట్టినవాడు, అడవులందును, పర్వతముల సమీపమునను విహారము సేయుటయం దిచ్ఛకలవాడును, గోకులమునందతిప్రీతిగలవాడును, బలవంతుడును, మూర్ఖుడును అగును. (కొందరు గ్రంథాంతర వచనముల నాధారముగగొని, బలపరాక్రమముగలిగి, భటవర్గసహితంబుగ అరణ్యాదులయందు దుష్ట మృగశిక్షగావించి మానులకు బాధగలుగకుండజేసి వారిచేవనట వలన, గోధనసమృద్ధికలిగి, నిపుణుడై రాజ్యపరిపాలన సేయు రాజగుననియు నూహించుచున్నారు.)

కన్యారాశియందు సూర్యుడుండగాబుట్టినవాడు, పుస్తకములు వ్రాయుటయందును, చిత్తరువులువ్రాయుటయందును, కవిత్వముచెప్పుటయందును, గణితశాస్త్రమునందును, అత్యజ్ఞానమభివృద్ధిచేసుకొనుటయందు సమర్థుడును, స్త్రీసమాన శరీరముగలవాడును, అగును.

## తులావృశ్చిక ధనుర్మకరములయందు రవియుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. జాత స్తౌళిని శౌండికోఽధ్వనిరతో హైరణ్యకో నీచకృత్
క్రూర స్సాహసికో విషార్జితధన శ్శస్త్రాంతగోఽళిస్థితే
సత్పూజ్యో ధనవాన్ ధనుర్ధరగతే తీక్ష్ణో భిష క్కారుకో
నీచోఽజ్ఞః కువణి జ్మృగే ల్పధనవాన్ లుబ్ధోఽన్యభాగ్యోపభుక్. 16

టీ. తౌళిని = తులయందు రవియుండగా, జాతః = పుట్టినవాడును, శౌండికః = మద్యపానరతుడును, అధ్వనిరతః=నడుచుటయందు పేక్షగలవాడును, హైరణ్యకః=స్వర్ణకారుడును, నీచకృత్ = నీచకార్యములు సేయువాడును, అగును. అళిస్థితే = వృశ్చికమందు రవియుండగా (బుట్టినవాడు), క్రూరః, = క్రూరుడును, సాహసికః = సాహసకార్యములు జేయువాడును, విషార్జితధనః = విషప్రయోగముచే ధనముసంపాదించువాడును. (వృథార్జితధనః = వాడుసంపాదించిన ధనమును చోరాదులపహరింతురు కాబట్టి వ్యర్థముగా సంపాదింపబడిన ధనముగలవాడు,) శస్త్రాంతగతః = ఆయుధవిద్యాపారగుడును (శా శాస్త్రా = శిక్షకుడును, అంతకః = నాశకుడు) అగును. ధనుర్ధరగతే = ధనుస్సున రవియుండగా

(బుట్టినవాఁడు), సత్పూజ్యః = సత్పురుషులచే పూజలందువాఁడును, ధనవాక్ = ధనికుఁడును, తీక్ష్ణః = కోపియు, భిషక్ = వైద్యుఁడును, కారుకః = శిల్పకర్మజ్ఞుఁడును, అగును. మృగే = మకరమందు సూర్యుఁడుండఁగాఁ (బుట్టినవాఁడు) నీచః = నీచకార్యములు సేయువాఁడును, అజ్ఞః = మూర్ఖుఁడును, కువణిక్ = కపటమైన బేరము సేయువాఁడును, అల్పధనవాక్=స్వల్పధనవంతుఁడును, లుబ్ధః = లోభియు, అన్యభాగ్యోపభుక్ = ఇతరుల భాగ్యమును అనుభవించువాఁడునగును.

తా. తులారాశియందు సూర్యుఁడుండఁగాఁబుట్టినవాఁడు, మద్యపానాసక్తుఁడును, మద్యమును జేయువాఁడును, విక్రయించువాఁడును, అగును. ముఖ్యముగాఁగ వుండ్లవాఁడనుట సహజముగానున్నది. త్రోవసముచుటయందు ఆసక్తిగలవాఁడును, స్వర్ణకారకసామర్థ్యముగలవాఁడును, నీచకార్యానురక్తుఁడును అగును.

వృశ్చికరాశియందు సూర్యుఁడుండఁగాఁబుట్టినవాఁడు కోపియు, యుక్తాయుక్తపరిజ్ఞానములేక, మూర్ఖుఁడయ్యు ధైర్యముతో సాహసకార్యములు చేయఁగడంగువాఁడును, విషాదులను ప్రయోగించుటచే ఆర్జింపబడిన ధనముగలవాఁడును, ఈవిషయమున, కొందరు. "వృథార్జితధనః" అనిపఠించి ఆర్జించినధనమును సహజకార్యముల కుపయోగింపక దాచిపెట్టఁగాఁ జోరులపహరించుకొనిపోవుచుండునట్టి స్థితిగలవాఁడునగునందురు, మరియు. శాస్త్రములయందు ప్రీతిగలవాఁడును, కఠినముగశిక్షించువాఁడును, అగును.

ధనూరాశియందు రవియుండఁగాఁబుట్టినవాఁడు, సత్పురుషులచే పూజింపఁదగినవాఁడును, కోపిష్ఠియు, శిల్పికార్యములయందతి నిపుణుఁడును, శిక్షకుఁడును అగును.

మకరరాశియందు సూర్యుఁడుండఁగాఁ బుట్టినవాఁడు, స్వకులాచారమునకనుగుణముగాని పనులనుచేయువాఁడును, అతిమూర్ఖుఁడును, నీచవస్తుక్రయవిక్రయాదులయందు సమర్థుఁడును, ధనముస్వల్పముగాఁగలవాఁడును, లుబ్ధుఁడును ఇతరుల సంపదననుభవించువాఁడును, సర్వదా ఇతరుల కార్యములు నెరవేర్చుటయందు యిష్టముగలవాఁడును అగును.

### కుంభ మీనములందు సూర్యుఁడుండఁగా బుట్టినవానిస్వభావములు.

శ్లో. నీచో ఘటే తనయభాగ్యపరిచ్యుతోఽస్వ
స్తోయోత్థపణ్యవిభవో వనితాదృతోఽన్త్యే
నక్షత్రమానవతనుప్రతిమే విభాగే
లక్ష్మాదిశే త్తుహినరశ్మిదినేశయుక్తే. 17

టీ. ఘటే = కుంభమందురవియుండఁగా జన్మించినవాఁడు, నీచః = అధమకార్యములుచేయువాఁడును, తనయభాగ్యపరిచ్యుతః = పుత్రులను భాగ్యమును విడువంబడినవాఁడును, అస్వః = నిర్ధనుఁడును, అగును. అంత్యే = మీనమందురవియుండఁగాఁ బుట్టిన

వాఁడు, తోయోత్థపణ్య విభవః = నీటియందుఁ బుట్టిన ముత్యములు మొదలగు వానివిక్రయముచేత సంపాదించినధనము గలవాఁడును, వనితాదృతః = స్త్రీలచేత ఆదరింపఁబడువాఁడును, అగును. తుహినరశ్మిదినేశయుక్తే = చంద్రసూర్యులు ఏకరాశిగతులై యుండఁగా, నక్షత్రమానవ తను ప్రతిమే, కాలపురుషునియొక్క శరీరమునకు సమమయిన, విభాగే = అంగవిభాగమున, లక్ష్మ = చిహ్నమును, ఆదిశేత్ = చెప్పవలయును.

తా. కుంభరాశియందు రవియుండఁగా బుట్టినవాఁడు, నీచకార్యములు చేయువాఁడును, పుత్రులచేతను, భాగ్యముచేతను విడువబడినవాఁడును, ధనహీనుఁడును అగును.

మీనరాశియందు సూర్యుఁడుండఁగా జనించినవాఁడు, నీటియందు బుట్టిన వగు ముత్యములు శంఖములు మొదలగువాని విక్రయముచే జీవనముచేయువాఁడును, తన్మూలకముగ నార్జించిన ధనసంపదగలవాఁడును, వనితాజనముచే నాదరింపబడువాఁడును, అగును.

## రవిచంద్రులు ఏకరాశిస్థితులగుచుండఁగా బుట్టినవారికిగలుగు చిహ్నములు.

రవిచంద్రులు ఏకరాశిగతులై యుండఁగా వారేరాశియందు కూడియుందురో యా రాశియొక్క నక్షత్రమానవుఁడు అనఁగా కాలపురుషుఁడు, ఆ కాలపురుషునియొక్క శరీరమునకు సమమై "కాలాంగాని" అనుశ్లోకోక్త అంగవిభాగమురీతిగా నేర్పడు అంగమున చిహ్నమును చెప్పవలయును. అనఁగా, సూర్యచంద్రులుండు రాశి కాలపురుషునియంగవిభాగమున నే యంగముగా నేర్పడుచున్నదో జాతకునికి ఆయంగమున మచ్చ యుండునని తెలియదగియున్నది.

### అంగారక స్థితరాశి ఫలములు.

### మేష, వృశ్చిక, వృషభ తులలయందు అంగారకుఁడుండఁగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. నరపతిసత్కృతాటన చమూప వణిక్సధనాన్
క్షతతను చోర భూరి విషయాంశ్చ కుజ స్స్వగృహే
యువతిజితాం స్సుహృత్సు విషమా న్పరదార రతాన్
కుహక సువేష భీరు పరుషా న్సితభే జనయేత్. 18

టీ. స్వగృహే = స్వక్షేత్రములందు, కుజః = అంగారకుఁడు, నరపతిసత్కృత = రాజపూజితులను, అటన = దేశసంచారిగను, చమూప = సేనాపతులను, వణిక్ = వ్యాపారము దెలిసినవారలను, సధనాన్ = ధనవంతులను, క్షతతను = గాయముచే మచ్చలేర్పడు దేహముగలవారలను, చోరః = దొంగలను, భూరివిషయాన్ = అధికమైనకోరికగలవారిని, జనయేత్ = జనింపఁజేయును. సితభే = శుక్రక్షేత్రములయందున్న కుజుఁడు, యువతిజితాన్ = స్త్రీవిధేయులను, సుహృత్సు = బంధుమిత్రులందు, విషమాన్ = క్రూరస్వభావు

లను, పరదారరతాన్ = పరకాంతాసక్తులను, కుహాక = ఇంద్రజాలికులను, సువేష = మంచివేషముగలవారిని, భీరు=భయస్థులను, పరుషాన్=కఠినులను, జనయేత్=జన్మింపఁజేయును.

తా. స్వక్షేత్రములగు, మేష, వృశ్చికరాసులయందు అంగారకుఁడుండగా జనించినవాడు, రాజపూజితుఁడును, దేశములుతిరుగుట స్వభావముగాగలవాఁడును, సేనాధిపతియు, వ్యాపారముచేయువాఁడును, ధనవంతుఁడును, కత్తులు మొదలగువానిచే గాయములేర్పడిన శరీరముగలవాఁడును, దొంగయు, లౌకికవిషయములయందును, ఇంద్రియసుఖాదులయందును, గ్రంధాదులయందును ఆసక్తిగలవాఁడును అగును.

శుక్రక్షేత్రములగు, వృషభ తులారాసులయందు అంగారకుఁడుండగా బుట్టినవాఁడు స్త్రీవశవర్తియు, బంధుమిత్రాదులయందు కౄరబుద్ధిగలవాఁడును, పరస్త్రీప్రియత్వముగలవాఁడును, ఇంద్రజాలమునెరిగినవాఁడును, సర్వజనాకర్షకమైన వస్త్రాభరణములను, ధరించువాఁడును, భయముగలవాఁడును, స్నేహరహితుఁడును, అగును.

## మిథునకన్యాకర్కటకములయందంగారకుఁడుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. బౌధే సహా స్తనయవాన్ విసుహృత్కృతజ్ఞో
గాంధర్వయుద్ధకుశలః కృపణో౽భయోఽర్థీ
చాంద్రేఽర్థవాన్ సలిలయానసమార్జితస్వః
ప్రాజ్ఞశ్చ భూమితనయే వికలః ఖలశ్చ. 19

టీ. భౌధే = బుధక్షేత్రములయందు, భూమితనయే = కుజుఁడుండఁగా (బుట్టినవాఁడు) అసహః = పరులు సహింపఁలేని తేజముగలవాఁడును, తనయవాన్ = పుత్రవంతుఁడును, విసుహృత్ = స్నేహరహితుఁడును, కృతజ్ఞః = చేసినమేలుమరువనివాఁడును, గాంధర్వ = గానమందును, యుద్ధ = యుద్ధమందును, కుశలః = సమర్థుఁడును, కృపణః = కార్పణ్యముగలవాఁడును, అభయః = భీతిరహితుఁడును, అర్థీ = యాచకుఁడును అగును. చాంద్రే = చంద్రక్షేత్రమందు కుజుఁడుండఁగా (బుట్టినవాఁడు) అర్థవాన్ = ధనవంతుఁడును, సలిలయానసమార్జితస్వః = ఓడవ్యాపారముచేత ధనము సంపాదనగలవాఁడును, (పా సలిల= నీటిచేతను, యాన = అన్యదేశగమనముచేతను, అనియుండవచ్చును.) ప్రాజ్ఞః = ప్రజ్ఞగలవాఁడును, వికలః = అంగహీనుఁడును, ఖలః = దుర్జనుఁడును, అగును.

తా. బుధునిక్షేత్రములగు, మిథున, కన్యారాసులయందు అంగారకుఁడుండగా బుట్టినవాఁడు, ఇతరులకు సహింపగూడనంత తేజస్సుగలవాఁడును, పుత్రులుగలవాఁడును, మిత్రులులేని వాఁడును, తనకుచేసిన మేలును మరువక మరల మేలుసేయువాఁడును, గానమున కుశలత్వము గలవాఁడును, యుద్ధమునందు సమర్థుఁడును, కార్పణ్యము గలవాఁడును, భయములేనివాఁడును, యాచకుఁడును, అగును.

టీ. శశాంకజే = బుధుడు, తృతీయే = మిధునమందుండగా (బుట్టినవాడు) వికత్థనః=(అసత్యవాదియు) శాస్త్ర=వ్యాకరణాదిశాస్త్రములయందును, కళా = గీతవాద్యాగులయందును, విదగ్ధః = చాతుర్యము గలవాడును, ప్రియంవదః = ప్రియముగామాట్లాడెడువాడును, సౌఖ్యరతః=సుఖాభిలాషియు, అగును. శశాంకజే=బుధుడు, శీతకరర్క్షయుక్తే = చంద్రగృహమైన కర్కాటకమందుండగా జనించినవాడు, జలార్జితస్వః = జలముచేత సంపాదింపబడిన ధనముగలవాడును స్వజనస్య= బంధువులకు, శత్రుః= ద్వేషియునగును.

తా. స్వక్షేత్రమగు మిధునరాశియందు బుధుడుండగా బుట్టినమానవుడు, బడాయి కొట్టుటయందు సమర్థుడును, వాచాలుడును, వ్యాకరణము మొదలగాగల శాస్త్రములనెరింగినవాడును, గీతవాద్యాదులయందు చాతుర్యముగలవాడును, ఇంపుగమాటలాడువాడును, సౌఖ్యమునందాసక్తిగలవాడును, ఇతరులకుపకారము చేయుటయందు సంతోషముగలవాడును అగును. మరియును, గ్రంధాంతరరచనానుగుణ్యముగ కవితానిపుణత్వము, వృద్ధజనసేవగలవాడును అగునని కొందరందురు.

చంద్రక్షేత్రమగు కర్కాటమున బుధుడుండగాబుట్టినవాడు, ఉదకముమూలముగ సంపాదింపబడిన ధనముగలవాడును, బంధువులకును మిత్రులకును వైరియునగును, ఈ శ్లోకమున "జలార్జితస్వః" అనియుండుటకు బదులుగా, బలార్జితస్వః అనిపఠించి, బలపరాక్రమాదులచే ధనమార్జించువాడనియు, కొందరు చెప్పుచున్నారు.

సింహకన్యలయందు బుధుడుండగా జనించినవారి స్వభావము.

శ్లో. స్త్రీద్వేష్యో విధనస్సుఖాత్మజోఽటనోఽజ్ఞః
స్త్రీలోలః సుపరిభవోఽర్కరాశిగే జ్ఞే
త్యాగీ జ్ఞః ప్రచురగుణస్సుఖీ క్షమావాన్
యుక్తిజ్ఞో విగతభయశ్చ షష్ఠరాశౌ. 23

టీ. జ్ఞే = బుధుడు = అర్కరాశిగే = సింహగృహమును బొంది యుండగా బుట్టినవాడు, స్త్రీద్వేష్యః = స్త్రీలకు అయిష్టుడుగాను, విధనసుఖాత్మజః = ధనసుఖపుత్రరహితుడును, అటనః = తిరిగెడువాడును, అజ్ఞః=మూఢుడును, స్త్రీలోలః=విషయాభిలాషియు, సుపరిభవః = మిక్కిలినిరసింపబడువాడును, అగును, షష్ఠరాశౌ=ఆరవయింటబుధుడుండగా జన్మించినవాడు, త్యాగీ=దాతయును జ్ఞః = బుద్ధిమంతుడును, ప్రచురగుణః = అధికములగువిద్యా శౌర్యాదిగుణములు గలవాడును, సుఖీ = భోగియు, క్షమావాన్ = ఓర్పరియు, యుక్తిజ్ఞః = యుక్తిగలవాడును, విగతభయశ్చ = భయములేనివాడును, అగును.

తా. సింహరాశియందు బుధుడుండగా బుట్టినవాడు వనితాజనమున కయిష్టుడును, ధనము, సుఖము, పుత్రులులేని వాడును, తిరిగెడు స్వభావముగలవాడును, మూర్ఖుడును, స్త్రీలయందభిలాషగలవాడును, తిరస్కరింప బడువాడును అగును.

కన్యారాశియందు బుధుఁడుండగా బుట్టినవాడు, దానము చేయువాడును, బుద్ధిమంతుఁడును, విద్యాశౌర్యాదిగుణము లధికముగా గలవాడును, సుఖియు, ఓర్పుగలవాడును, యుక్తిగలవాడును, భయములేనివాడును అగును.

## మకర కుంభ ధనుర్మీనములయందు బుధుఁడుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. పరకర్మకృదస్వ శిల్పబుద్ధిః ఋణవాన్విష్టికరో బుధేర్కజర్క్షే
నృపసత్కృత పండితాప్తవాక్యో నవమేఽన్త్యే జితసేవకోన్త్యశిల్పః.

టీ. బుధే = బుధుఁడు, అర్కజర్క్షే = శనిగృహములలో నుండగా జన్మించినవాఁడు, పరకర్మకృత్ = పరప్రేష్యుఁడును, అస్వ = దరిద్రుఁడును, శిల్పబుద్ధిః = శిల్పములందు ఆసక్తి గలవాఁడును, ఋణవాన్ = అప్పుగలవాఁడును, విష్టికరః = పనులుచేయువాఁడును అగును. నవమే = ధనుస్సున బుధుఁడుండఁగాఁబుట్టినవాఁడు, నృపసత్కృత = రాజపూజ్యుడును, పండిత = విద్వాంసుఁడును, ఆప్తవాక్యః = అనుకూలముగాఁ బలుకువాఁడును అగును. అంత్యే=మీనమందు బుధుఁడుండగాఁబుట్టినవాఁడు, జితసేవకః = జయించునట్టి సేవకులుంగలవాఁడును, అంత్యశిల్పః = చెప్పులుకుట్టుట మొదలగు నీచపుపనులయందు నేర్పరి అగును.

తా. శనైశ్చరస్థానములగు మకరకుంభములయందు బుధుఁడుండగాబుట్టినవాఁడు దరిద్రుఁడును శిల్పకార్యములందుఆసక్తిగలవాఁడును, అప్పుతీసిన ద్రవ్యముచే జీవనముచేయువాఁడును, అగును. ఈశ్లోకమున "ఋణవాన్" అనియుండుటకు బదులుగా "గుణవాన్" అనికొందరు పఠింతురుగాని అది అనుకూల్యముకాదని శాస్త్రజ్ఞులఅభిప్రాయము — మరియు వెట్టిపనులు చేయువాడును అగును. ధనూరాశియందు బుధుఁడుండగా బుట్టినవాఁడు రాజపూజితుఁడును, విద్వాంసుడును, విశేషజ్ఞాన మధికముగాగలిగి సభయందు పక్షపాతములేక న్యాయరీతిని పలుకువాఁడును, అగును నీచక్షేత్రమగు మీనరాశియందు బుధుఁడుండగా బుట్టినమానవుఁడు, ఇతరుల అభిప్రాయముఁ గ్రహించి తదుక్తముగా నడచుటయందు సేవకులకంటె యధికముగా బ్రవర్తించువాఁడును, చర్మాదులచే నైపుణ్యముగా జేయఁబడిన పాదుకాదుల నిర్మించుటయందును తత్సంబంధ క్రయవిక్రయాదులయందును సమర్థత గలిగినవాఁడును, నీచకార్యములయందాసక్తిగలవాఁడును, స్వకులాచారములకు వ్యతిరేకముగ బ్రవర్తించువాఁడును అగును.

## గురుస్థిత రాశిఫలములు.

## బృహస్పతి మేష వృశ్చిక, వృషభ, తులా, మిథున కన్యలయందుండగా జనించినవారి స్వభావములు.

శ్లో. సేనానీర్బహువిత్తదారతనయో దాతా సుభృత్యః క్షమీ
తేజోదారగుణాన్వితః సురగురౌ ఖ్యాతః పుమాన్ కౌజభే

కల్యాంగ స్ససుఖార్థమిత్ర తనయ స్త్యాగీ ప్రియ శ్శౌక్రభే
బౌధే భూరిపరిచ్ఛదాత్మజసుహృత్సాచివ్యయుక్త స్సుఖీ. 25

టీ. సురగురౌ = బృహస్పతి, కౌజభే = కుజక్షేత్రములైన రాసులలో నుండఁగాఁ బుట్టినవాఁడు, సేనానీః = సేనాధిపతియును, బహువిత్తదారతనయః = బహు ధన భార్య పుత్రులు గలవాఁడును, దాతా = దానముచేయువాఁడును, సుభృత్యః = మంచి సేవకులు గలవాఁడును, క్షమీ = ఓర్పుగలవాఁడును, తేజః = కాంతితోడను, దారగుణైః = కళత్ర సౌఖ్యములతోడను, అన్వితః = కూడుకొనినవాఁడును, ఖ్యాతః = ప్రసిద్ధుఁడును, అగును. శౌక్రభే = శుక్రక్షేత్రము లందు గురువుండఁగాఁ బుట్టినవాఁడు, కల్యాంగః = స్వస్థదేహుండును, ససుఖార్థమిత్రతనయః = సుఖ ధన మిత్ర పుత్రులు గలవాఁడును, త్యాగీ = దానవంతుఁడును, ప్రియః = సర్వజనప్రియుఁడును, అగును. బౌధే = బుధస్థానములందు గురువుండఁగా జన్మించినవాఁడు, భూరి = అనేకులగు, పరిచ్ఛదాత్మజసుహృత్ = పుత్రమిత్ర సేవకులు గలవాఁడును, సాచివ్యయుక్తః = మంత్రాంగమున కర్హుఁడును, సుఖీ = సుఖవంతుఁడును, అగును.

తా. అంగారకక్షేత్రములగు మేష వృశ్చికములయందు గురువుండగా బుట్టినవాడు సేనాధిపతియు, ధనాఢ్యుఁడును, పెక్కు భార్యలుకలవాఁడును, పుత్రు లధికముగాగలవాఁడును, దానముచేయువాఁడును, మంచి సేవకులు గలవాఁడును, శాంతగుణము గలవాఁడును, తేజోవంతుడును, కళత్రసౌఖ్యముగలవాడును, ఉదారగుణముగలవాఁడును, అగును

శుక్రక్షేత్రములగు వృషభతులా రాసులయందు బృహస్పతియుండగా జనించినవాడు రోగములేని శరీరముగలవాఁడును, సౌఖ్యము ననుభవించువాఁడును, ధనము, మిత్రులు పుత్రులాదిగాగలవారితో గూడినవాఁడును, దాతయును, సర్వజనప్రియుఁడును, అగును.

బుధక్షేత్రములగు మిథునకన్యలయందు బృహస్పతియుండగా జననమందినవాఁడు, అమిత పరివారము ను. పుత్రమిత్ర బాహుళ్యము గలవాఁడును, మంత్రిత్వమునందు నియోగింపబడిన వాఁడును, సౌఖ్యము ననుభవించువాఁడును, అగును.

కర్కాటకసింహ, ధనుర్మీన, మకర కుంభము లయందు బృహస్పతియుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. చాంద్రే రత్నసుత స్వ దార విభవ ప్రజ్ఞా సుఖై రన్విత
స్సింహే స్యాద్బలనాయక స్సురగురౌ ప్రోక్తంచ యచ్చంద్రభే
స్వర్క్షే మాండలికో నరేంద్ర సచివ స్సేనాపతి ర్వా ధనీ
కుంభే కర్కటవత్ఫలాని మకరే నీచోఽల్పవిత్తోఽసుఖీ. 26

టీ. సురగురౌ = బృహస్పతి, చాంద్రే = చంద్రక్షేత్రమున నుండగా పుట్టినవాఁడు, రత్న = రత్నములు, సుత = పుత్రులు, స్వ = ధనము, దార = భార్య, విభవ = ఐశ్వర్యము, ప్రజ్ఞా = బుద్ధి, సుఖైః = సౌఖ్యములను, అన్వితః = కూడినవాఁడును, సింహే = సింహ

మున గురువుండఁగాఁ బుట్టినవాఁడు, బలనాయకః = సేనానాయకుఁడగును. చంద్రభే = కర్కాటకమందు గురువుండునపుడు, యత్ప్రోక్తం = "రత్నసుతస్వదార విభవప్రజ్ఞాసుఖై రన్వితః" అని యేఫలము చెప్పఁబడినదో, తత్ = ఆఫలము గలుగును. స్వర్క్షే = స్వక్షేత్రములైన ధనుర్మీనములయందు గురువుండఁగాఁ బుట్టినవాఁడు, మాండలికః = మండలాధిపతియైనను, నరేంద్రసచివః = రాజమంత్రియైనను, సేనాపతిర్వా = సేనాధిపతియైనను, ధనీ = ధనవంతుండైనను, అగును. కుంభే = కుంభలగ్న జాతుఁడును, కర్కాటవత్ = కర్కాటకమందు గురువుండునపుడు పుట్టినవానికివలె, ఫలాని = ఫలములు కలుగును. మకరే = మకరమందు గురువుండఁగాఁ బుట్టినవాఁడు, నీచః = కులానుచితకృత్యములు సేయువాఁడును, అల్పవిత్తః = స్వల్పధనుఁడును, అసుఖీ = దుఃఖితుఁడును, అగును.

తా. కర్కాటకరాశియందు బృహస్పతియుండగా బుట్టినవాడు నవరత్నములు, పుత్రులు, ధనము, సుగుణవతియగు భార్య, సంపద, సౌఖ్యము, తత్వశాస్త్రజ్ఞానము గలవాడును, శాస్త్రార్థము దెలిసినవాడును, ఘనమగు గౌరవము, సజ్జనపూజ్యత, స్వకులాచారము, న్యాయవిచక్షణ మొదలగునవి గలవాడును నగును.

సింహరాశియందు బృహస్పతియుండగా జనించినవాడు, చంద్రక్షేత్రమగు కర్కాటకమున గురువుండగా జనించినవాని కేఫలములు గలుగుచున్నవో యా ఫలితములన్నియు గలవాడగునదియుగాక సేనానాయకుడగును. మరియు కొందరు శాస్త్రజ్ఞులు విరోధము, బలము, మిత్రబాహుళ్యము గలవాడగుననుచున్నారు.

బృహస్పతి స్వక్షేత్రములగు ధనుర్మీనరాసులయం దుండుకాలమున జనించిన మానవుడు, పెక్కుదేశముల నేలురాజైనను, రాజుమంత్రియైనను, సేనానాయకుడైనను, ధనాఢ్యుడైనను అగును. మరియు సారావళీ వచనానుగుణ్యముగ శాస్త్రకారుడును, దాతయు, దేశయాత్రచేయువాడును నగునని తెలియదగినది

బృహస్పతి కుంభరాశియందుండగా బుట్టిన మనుజుడు, కర్కాటక రాశియందు గురువుండుకాలమున బుట్టినవానివలె, రత్న, సుత, స్వదార, విభవ, ప్రజ్ఞాసుఖములు గలవాడగును. మరియు బలిసినవాడును. లుబ్ధుడునగునని కొందరనుచున్నారు

బృహస్పతి తనకు నీచరాశియగు మకరరాశియందుండగా బుట్టినవాడు, నీచకార్యములు చేయువాడును, స్వకులాచారవర్ణనలకు వ్యతిరిక్తముగ ప్రవర్తించువాడును, ధనము స్వల్పముగాగలవాడును, సౌఖ్యములేనివాడును, మనోదుఃఖము గలవాడును, అగును.

## శుక్రచారము.

### మేష వృశ్చిక, వృషభ తులలయందు శుక్రుడుండగా బుట్టినవాని స్వభావములు.

శ్లో. పరయువతిరత స్తదర్థవాదై ర్హృతవిభవః కులపాంసనః కుజర్క్షే
స్వబలమతిధనో నరేంద్రపూజ్యః స్వజనవిభుః ప్రథితో భయస్సితే స్వే.

టీ. సితే = శుక్రుఁడు, కుజర్క్షే = కుజక్షేత్రములైన మేష వృశ్చికములయందుండ గాఁబుట్టినవాఁడు, పరయువతిరతః = పరస్త్రీలోలుఁడును, తదర్థవాదైః = ఆపరస్త్రీలయొక్క ఊరటింపుమాటలచేత, హృతవిభవః = అపహరింపఁబడిన ధనముగలవాఁడును, కులపాంసనః = కులనిందితుఁడును అగును. స్వే=స్వక్షేత్రములైన వృషభతులలయందు శుక్రుఁడుండ గాఁబుట్టినవాఁడు, స్వబలమతిధనః= తనబలముచేతను తనబుద్ధిచేతను సంపాదించుకొన్న ధనముగలవాఁడును, నరేంద్రపూజ్యః = రాజపూజ్యుఁడును, స్వజనవిభుః = తనబంధువులలో శ్రేష్ఠమైనవాఁడును, ప్రథితః = ప్రసిద్ధుఁడును, అభయః = భయములేనివాడును అగును.

తా. అంగారక క్షేత్రములగు మేషవృశ్చికములయందు శుక్రుఁడుండగా బుట్టినవాడు, పరస్త్రీసంగమము చేయువాడును, పరస్త్రీలయూరడింపు మాటలచేత నపహరింపబడిన ధనముగలవాడును, స్వకులులచే నిందింపబడువాఁడును, అగును.

స్వక్షేత్రములగు వృషభతులారాశులయందు శుక్రుడుండగా జనించినవాడు తనబుద్ధిబలములచేతనార్జింపబడిన ధనముగలవాడును, రాజులచే బూజింపఁబడువాడును బంధువులలో ప్రసిద్ధుడును, భయములేనివాడును, అగును. గ్రంథాంతరమందు గానవిద్యావిశారదుడును, బలాత్కారముగ మైథునక్రియల జరుపువాడును, భార్యయందు అనురాగమధికముగాగలవాడును, దేవబ్రాహ్మణ భక్తిగలవాడును, పెక్కుభార్యలు గలవాడును, సుగంధద్రవ్యములయం దాసక్తిగలవాడును, అగునని కొందరనుచున్నారు.

## మిథున కన్యా మకర కుంభములయందు శుక్రుడుండగా బుట్టినవారి స్వభావములు

శ్లో. నృపకృత్యకరోఽర్థవాన్కలావి న్మిథునే షష్ఠగతేఽతి నీచకర్మా
రవిజర్క్షగతేఽమరారిపూజ్యే సుభగః స్త్రీవిజితో రతః కునార్యామ్.28

టీ. అమరారిపూజ్యే = శుక్రుఁడు, మిథునే = మిథునమందుండఁగాబుట్టినవాఁడు, నృపకృత్యకరః = రాజకార్యములు సేయువాఁడును, అర్థవాన్ = ధనికుఁడును, కలావిత్ = సంగీతమును నేర్చినవాఁడును అగును. షష్ఠగతే = శుక్రుఁడుకన్యయందుండఁగాఁ బుట్టినవాడు, అతినీచకర్మా = మిక్కిలినీచకర్మ సేయువాఁడగును, రవిజర్క్షగతే = శనిక్షేత్రములైన మకరకుంభములయందు శుక్రుండుండఁగాఁ బుట్టినవాఁడు, సుభగః = సర్వజనప్రియుఁడు, స్త్రీవిజితః = స్త్రీవశవర్తియు, కునార్యాం = దుష్టస్త్రీతో, రతః = రమించువాఁడు, అగును.

తా. బుధక్షేత్రమగు మిథునరాశియందు శుక్రుడుండగా జనించినవాడు, రాజకార్యములు సేయువాడును, ధనముగలవాడును, గానవిద్యాకుశలుడును అగును. ఈవిషయమున సారావళీకారుడు—శుక్రుడు మిథునస్థితుడగుచుండగా బుట్టినవాడు, శాస్త్రజ్ఞుడును, ప్రసిద్ధుడును, కాముకుడును, లేఖకుడును, ప్రియుడును, వృత్తగీతాదులచే సంపాదింపబడిన ధనముగలవాడును, అగునని వచించియున్నాడు.

శుక్రుడు కన్యారాశియందుండగా బుట్టిన మానవుడు, నీచస్థానముగాన, నీచకార్యములుచేయువాడు అగును. మరియు గ్రంథాంతరములయందు, జారస్త్రీతోడగూడి వసించువాడును, దాతగానివాడును, భార్యావియోగ దుఃఖ మనుభవించువాడును, అల్పాలోచన గలవాడును అగునని చెప్పబడియున్నది.

శనైశ్చర క్షేత్రములగు మకరకుంభరాసులయందు శుక్రుడుండగా బుట్టినవాడు జనులందరికిని ప్రియుండును, వనితా జనవశుండును, దూషితయగు స్త్రీభోగము ననుభవించువాడును, అగును. మరియు ద్రవ్యవ్యయము చేయువాడును, భయముచేతతపించువాడును, బలములేనట్టిదేహము, హృదయరోగము గలవాడును, విఫల కర్మలయందాసక్తిగలవాడును, ధర్మశూన్యుడును, గురువులు, పుత్రులు మొదలగువారితో ద్వేషించువాడును, మాలిన్యముగలవాడును అగునని సారావళీ కారకుడు వచించియున్నాడు.

## { కర్కాటక, సింహ, ధనుర్మీనములయందు శుక్రుడుండగా బుట్టినవారి స్వభావములు. }

శ్లో. ద్విభార్యోఽర్థీ భీరుః ప్రబలమదశోకశ్చశశిభే
హరౌ యోషాప్తార్థః ప్రవరయువతిర్మందతనయః
గుణైః పూజ్య స్సస్వస్తురగసహితే దానవగురౌ
ఝషే విద్వా నాఢ్యో నృపజనిత పూజోఽతి సుభగః. 29

టీ. దానవగురౌ=శుక్రుడు, శశిభే=కర్కాటకమందుండగా, ద్విభార్యః= ఇద్దరుభార్యలు గలవాడును, అర్థీ = యాచకుడును, భీరుః = భయస్థుడును, ప్రబలమదశోకశ్చ = మిక్కిలి మదదుఃఖంబులు గలవాడును జనించును, హరౌ = శుక్రుడు సింహమందుండగా, యోషాప్తార్థః = స్త్రీవలన వచ్చినధనముగలవాడును, ప్రవరయువతిః = మంచిస్త్రీగలవాడును, మందతనయః = స్వల్పపుత్రులుగలవాడును, జనించును. తురగసహితే = శుక్రుడుధనుస్సుతోగూడియుండగా, గుణైః =సద్గుణములచేత, పూజ్యః = పూజింపబడువాడును, సస్వః = ధనవంతుడును, పుట్టును. ఝషే = శుక్రుడుమీనమందుండగా, విద్వాన్ = పండితుడును, ఆఢ్యః = ధనికుడును, నృపజనితపూజః = రాజపూజితుడును, అతిసుభగః = సర్వజనవల్లభుండును జనించును.

* తా. చంద్రక్షేత్రమగు కర్కాటకమున శుక్రుడుండగాబుట్టినవాడు, భార్యాద్వయము గలవాడును. యాచించువాడును, భయస్థుడును, మదాధిక్యముదుఃఖముగలవాడును,అగును మరియు. నీవిషయమై ధనసౌఖ్యముల ననుభవించువాడగుననియు కొందరి అభిప్రాయము. సజీవులగు యిరువురు భార్యలుగలవాడని శాస్త్రజ్ఞుల అభిప్రాయముగా నున్నది.

సూర్యక్షేత్రమగు సింహరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు స్త్రీమూలకముగ వచ్చిన ధనముగలవాడును, చతుర్గుణము సత్స్వభావయువగు భార్యగలవాడును, కుమారు

ము అల్పముగాగలవాడును అగును. మరియు, బంధుప్రియుడును, విచిత్రములగు, సౌఖ్యము లు దుఃఖములుంగలవాడును అగును.

గురుక్షేత్రమగు ధనూరాశియందు శుక్రుడుండగా బుట్టినవాడు, సద్గుణములు గలిగి పూజ్యతగలవాడును, ధనముగలవాఁడును, అగును. మరియు, జనప్రియుడును, సౌందర్యము గలవాఁడును, కులశ్రేష్ఠుడును, విద్వాంసుడును, యోగ్యముగా సంపాదింపబడిన ధనముగలిగి సుగుణవతియగు భార్యగలవాడును, అగునని సారావళీ కారకునివచనము గలదు

శుక్రుడు తన ఉచ్చస్థానమును, బృహస్పతిక్షేత్రమగు మీనరాశియందుండగా బుట్టినవాడు, పండితుడును, ధనముగలవాడును, రాజులచే పూజింపబడువాడును, జనులందరికి ప్రీతిగొల్పువాడును, అగును. మరియు స్వకులాచారసంపన్నుడును, దాక్షిణ్యాది గుణయుక్తుడును అగునని కొందరనుచున్నారు.

## శనైశ్చర చారము.

### శనైశ్చరుడు మేష వృశ్చిక, మిధున కన్యలయం దుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. మూర్ఖోఽటనః కపటవాక్ విసుహృ ద్యమేఽజే
కీటేతు బంధవధభా క్చపలోఽఘృణశ్చ
నిర్హ్రీసుఖార్థతనయః కుశలశ్చ లేఖ్యే
రక్షాపతి ర్భవతి ముఖ్యపతిశ్చ బౌధే. 30

టీ. యమే = శనైశ్చరుఁడు, అజే = మేషమందుండఁగా, మూర్ఖః = తెలివిలేనివాఁడును, అటనః = తిరిగెడువాఁడును, కపటవాక్ = కపటముగలవాఁడును, విసుహృత్ = మిత్రవర్జితుఁడును, జనించును, కీటే = వృశ్చికమందుశనియుండఁగా, బంధవధభాక్ = బంధన తాడనములను బొందువాఁడును, చపలః = చపలచిత్తుఁడును, అఘృణశ్చ = దయలేనివాఁడును, జనించుచు. బౌధే = బుధక్షేత్రములైన మిధునకన్యలయందు శనియుండఁగా, నిర్హ్రీసుఖార్థతనయః = లజ్జా సుఖ ధన పుత్రహీనుఁడును, లేఖ్యే = చిత్తరువువ్రాయుటయందు, కుశలశ్చ = సమర్థుండును (స్ఖలితశ్చ లేఖ్యేయను పాఠమందు చిత్తరువు వ్రాయుటయం దేతఁగాశవిడుచు వాఁడనియర్థము) రక్షాపతిః = రక్షకాధికారియును, (రక్షఃపతిః = రాక్షసపతియును) ముఖ్యపతిః = ప్రధాననాథుఁడును, జనించుచు.

తా. అంగారకక్షేత్రమును శనైశ్చరునకు నీచస్థానమునగు మేషరాశియందు శనైశ్చరుడుండగా బుట్టిన మానవుడు, తెలివిలేనివాడును, తిరిగెడు స్వభావముగాగలవాడును, కపటముగలవాడును, స్నేహితులచే విడువబడినవాడును, అగును. మరియు మనుష్యుల నతి ఘోరముగా హింసించువాడును, సర్వకాలమును దుఃఖముచే తపించువాడును అగునందురు.

శనైశ్చరుడు వృశ్చికరాశియందుండగా బుట్టినమానవుడు బంధనము తాడనము మొదలగువాటిని బొందెడువాడును, చంచలమగు మానసముగలవాడును, దయావిహీనుడును అగును.

బుధక్షేత్రములగు మిథునకన్యారాశులయందు శనైశ్చరుడుండగా బుట్టినవాడు, లజ్జలేనివాడును, సౌఖ్యముననుభవించనివాడును, ధనహీనుడును, పుత్రసంపదలేనివాడును, చిత్తరువులు వ్రాయుటయందు నేర్పరియు, రక్షణాధికారియు, ప్రధాననాథుడును అగును.

ఇందు "కుశలశ్చ" అనుచోట "స్ఖలితశ్చ" అనిపఠించి చిత్తరువులు వ్రాయుటకు చేతగాక విడుచువాడనియు "రక్షాపతి" యనుచోట "రక్షఃపతి" యని పఠించి రాక్షస ప్రకృతిగలవాడనియును కొందరుచెప్పుదురుగాన బాగుగ నాలోచించి ఫలితముల జెప్పవలయును.

శనైశ్చరుడు వృషభ తులా కర్కాటక సింహాముల
యందుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. వర్జ్యస్త్రీష్టో నబహువిభవో భూరిభార్యో వృషస్థే
ఖ్యాతస్స్వోచ్చే గణ పుర బల గ్రామ పూజ్యోఽర్థవాంశ్చ
కర్కిణ్యస్వో వికలదశనో మాతృహీనోఽసుతోఽజ్ఞ
స్సింహేఽనార్యో విసుఖతనయో విష్టికృత్సూర్యపుత్రే. 31

టీ. సూర్యపుత్రే = శనైశ్చరుడు, వృషస్థే=వృషభమందుండగా, వర్జ్యస్త్రీష్టః=అగమ్యాగమనమందు ఇష్టముగలవాడును, నబహువిభవః = అల్పైశ్వర్యముగలవాడును, భూరిభార్యః= పెక్కండ్రుభార్యలుగలవాడును జనించును. స్వోచ్చే = తనయుచ్చరాశియగు తులయందు శనియుండగా, ఖ్యాతః=ప్రసిద్ధుడును, గణ = సమూహము, పుర =పట్టణము, బల= సైన్యము, గ్రామ = గ్రామము లయందుండెడు సకల జనులచేతను, పూజ్యః = పూజింపబడువాడును, అర్థవాంశ్చ = ధనికుడును జనించును, కర్కిణి = కర్కాటకమందు శనియుండగా, అస్వః = దరిద్రుడును, వికలదశనః = దంతపటుత్వము లేనివాడును, మాతృహీనః = తల్లిలేనివాడును, అసుతః = పుత్రహీనుడును, అజ్ఞః = మూర్ఖుడును, పుట్టును, సింహే = సింహామందు శనియుండగా, అనార్యః = మూర్ఖుడును, విసుఖతనయః = సుఖపుత్ర వివర్జితుడును, విష్టికృత్ = వెట్టిమూటలుమోయువాడును పుట్టును.

తా. శనైశ్చరుడు వృషభరాశియందుండగా బుట్టిన మానవుడు దోషితలైై విడువబడిన స్త్రీసంభోగమునందు యిష్టముగలవాడును, అల్పమగు సంపదగలవాడును, పెక్కుభార్యలుగలవాడును అగును. శుక్రక్షేత్రమును, తనకు ఉచ్చస్థానమును నైన తులారాశియందు శనైశ్చరుడుండగా బుట్టినవాడు, స్వజాతివారివల్ల సమాజములవారివలనను, పట్టణములందుండువారిచేతను, సేనాసమూహములవల్లను, గ్రామస్థులచేతను బొగడబడువాడును, ధనవంతుడును, అగును. మరియు మాంత్రికవిషయములందు కడుసమర్థుడును, కపటియు, దీర్ఘక్రోధము గలవాడును కొంతకాలమువరకు ఋణబాధ ననుభవించి తరువాత మహదైశ్వర్య సంపన్నుడగునని కొంద

రు అశుభఫలములు అభిప్రాయపడుచున్నారు. చంద్రక్షేత్రమగు కర్కాటకరాశియందు శనైశ్చరుడుండగా బుట్టినవాడు దరిద్రుడును దంతపటుత్వములేనివాడును మాతృహీనుడును, కుమారులు లేనివాడును, మూర్ఖత్వముగలవాడును అగును.

రవిక్షేత్రమగు సింహరాశియందు శనైశ్చరుడుండగా బుట్టినవాడు మూర్ఖత్వముగలవాడును, సౌఖ్యములేనివాడును, పుత్రులచేత విడువబడినవాడును, ధనమును బోగొట్టుకొన్నవాడును, ఇతరుల కార్యముల నూరక చేయువాడును, లాభములేక నూరక తిరుగువాడును, అగును.

## ధనుర్మీన మకర కుంభములయందు శనియుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. స్వంతః ప్రత్యయితో నరేంద్రభవనే సత్పుత్రజాయాధనో
జీవక్షేత్రగతేఽర్కజే పురబలగ్రామాగ్రనేతాఽర్థవాన్
అన్యస్త్రీధనసంయుతః పురబలగ్రామాగ్రణీర్మందదృక్
స్వక్షేత్రేమలినస్స్థిరార్థవిభవో భోక్తాచ జాతః పుమాన్. 32

టీ. అర్కజే = శనైశ్చరుడు, జీవక్షేత్రగతే = గురుగృహములైన ధనుర్మీనములయందుండగా, స్వంతః = మంచిమరణము గలవాడును. (అంత్యకాలమందు సౌఖ్యముగలవాడును), నరేంద్రభవనే = రాజగృహమందు, ప్రత్యయితః = నమ్మకమును గలిగియుండువాడును, సత్పుత్రజాయాధనః = సుపుత్రులును మంచిపెండ్లామును విక్కిలి ధనముగలవాడును, పుర = పట్టణమునకును, బల = సేనలకును, గ్రామ = గ్రామములకును, అగ్రనేతా = ప్రధాననాయకుడును, అర్థవాన్ = ధనవంతుడును, జనించును. స్వక్షేత్రే = స్వక్షేత్రములైన మకరకుంభములయందు శనియుండగా, జాతః = పుట్టిన, పుమాన్ = పురుషుడు, అన్యస్త్రీధనసంయుతః = పరస్త్రీ పరధనములతోఁ గూడినవాడును, పురబలగ్రామాగ్రణీః = నగరసేనా గ్రామములకు ప్రధాననాయకుడును, మందదృక్ = అల్పదృష్టిగలవాడును, మలినః = మలినుడును, స్థిరార్థవిభవః = స్థిరములైన విత్తవైభవములు గలవాడును, భోక్తా = ధనము కూడబెట్టక అనుభవించువాడును అగును.

తా. బృహస్పతి క్షేత్రములగు ధనుర్మీనరాసులయందు శనైశ్చరుడుండగా బుట్టినవాడు, మంచిమరణముగలవాడనగా అంత్యకాలమున సౌఖ్యము ననుభవించువాడును, రాజాంతఃపురములయందు విశ్వసింపబడువాడును సుగుణవంతులగు పుత్రులను, సత్కళత్రమును, న్యాయమార్గమున సంపాదించిన ధనమును గలవాడును, పట్టణమునకును, సమూహమునకును గ్రామమునకును ప్రధాననాయకుడును, ధనవంతుడును, అగును. ఈవిషయమున ధనాఢ్యుడగు రాజైనను, సేనాధిపతియైనను, గ్రామాధికారియైనను, అధికారముగల గొప్ప యుద్యోగియైనను అగుననియు కొందరి యభిప్రాయము.

స్వక్షేత్రములగు మకరకుంభములయందు శనైశ్చరుడుండగా బుట్టినవాడు, ఇతరస్త్రీ లోలుడును, ఇతరులధనము ననుభవించువాడును, పురములగ్రామాదులకు నాయకుడును, మందమగు దృష్టిగలవాడును, దోషియును, దూషితుడును, స్థిరముగానుండు ధనముగలవాడును, తాను భుజించుటకుమాత్రము ధనము నధికముగా ఖర్చుపెట్టువాడును, అగును. ఈరాశిఫలము లన్నియు యింతకు పూర్వము చెప్పబడియుండు ప్రకారము రాశియు రాశినాథుడును, రాశియందు తత్కాలమున యుండు గ్రహముఁ బలయుతములగు చుండగా మాత్రమే సంపూర్ణముగాజరుగునటులను, శాస్త్రజ్ఞులు స్థిరముగా జెప్పియుండుటచే నైనూ ద్వివిధములను రోచించి ఫలముల జెప్పదగినది.

## చంద్రాధిష్ఠిత మేషాది రాశ్యుక్త స్వభావములను మేషాదిలగ్నములకు బోల్చుట.

శ్లో. శిశిరకర సమాగ మేక్షణానాం సదృశఫలం ప్రవదంతి లగ్నజాతమ్
ఫలమధిక మిదం యదత్ర భావా భవనభనాథగుణై ర్విచింతనీయాః.

టీ. శిశిరకర = చంద్రునియొక్క, సమాగమేక్షణానాం = సంయోగవీక్షణములకు, సదృశఫలం = సమానమైనఫలములనే, లగ్నజాతం = లగ్నమువలనకలిగెడు దానినిగాను, ప్రవదంతి = చెప్పుదురు, అత్ర = ఈలగ్న ద్వితీయాదులయందు. భావాః = తనకుటుంబాదిభావములు, అనునది. యత్ = ఏదిగలదో, తదిదంఫలం = ఆయాఫలమును, అధికం=అధికము, (లే- ఆభావములు,) భవన= తన్వాదిభావములయొక్కయు, భనాథ = భావాధిపతులయొక్కయు, గుణైః = షడ్బలములచేత, విచింతనీయాః = చింతింపదగినవి.

తా. చంద్రునికి సంయోగమువలనను, వీక్షణమువలనను, ఏఫలములు గలుగుచున్నవో యాఫలములనే లగ్నమునకును జెప్పుదురు. అనగా ఈఅధ్యాయ ప్రథమశ్లోకమగు "వృత్తాతామ్రదృగుష్ణశాకలఘుభుక్" అను దానియందు చెప్పబడిన ప్రకారము చంద్రయోగ ఫలము ననుసరించి, ఇందు జెప్పబోవుదృష్టి ఫలాధ్యాయ ప్రథమశ్లోకమున "చంద్రేభూపబుధౌ నృపోపమగుణీస్తే నాథవాశ్చాజగే" అను ప్రథమపాదమున చెప్పియుండు ప్రకారము అంగారక బుధబృహస్పతి శుక్రశనైశ్చర సూర్యవీక్షణ ఫలములను మేషలగ్నజనితునకు చెప్పవలయును. ఇట్లే తక్కినరాశులకన్నిటికిని ఫలితముల జెప్పదగినది, లగ్నద్వితీయాదులయందు తనకుటుంబాది భావములేవిగలవో అవియే యధికముగాన తద్భావములను, తన్వాదిద్వాదశభావములయొక్కయు, భావాధిపతులయొక్కయు, స్థానదిక్కాలదృక్చేష్టా నైసర్గికములను షడ్బలములచేత రోచించదగినది. అనగా జననలగ్నము బలయుతమై లగ్నేశుడును బలాన్వితుడై యుండునెడల శరీరము బలపుష్టిగలిగి చక్కగ నుండుననియు, ద్వితీయము బలయుతమై ద్వితీయాధిపతియు బలవంతుడై యుండునెడల జాతకునకు ధనసమృద్ధిగలుగుననియు తృతీయభావమును తన్నాథుడును బలయుతములగుచుండగా భ్రాతృవృద్ధి గలుగుననియు చతుర్థభావ భావాధి

పతులు బలవంతములగునెడల వాక్చాతుర్య విద్యానైపుణ్యత సౌఖ్యాధిక్యము మొదలగునవి గలుగునవియు ఇట్లే తక్కిన పంచమషష్టి, సప్తమాష్టమ, నవమదశ మేకాదశ ద్వాదశభావములును ఆభావాధిపతులును బలవంతములగునెడల తదుక్తఫలములు అభివృద్ధి గలిగియుండునని యు దెలియదగినది. ఈభావభావాధిపతులలో భావములు బలయుతములై భావాధిపతులు బలహీనులైయుండునెడల భావ సంజ్ఞాభివృద్ధికి సగముబలము చెడునని యు భావములును భావాధిపతులగు గ్రహములును బలహీనములగునెడల భావమునకు తప్పక చెడుపుగలుగునని యు జెప్పదగినవి. ఈప్రకారముజ్యోతిశ్శాస్త్రకర్తలనేకులు వచించియున్నారు. గాన బలాబలములరయోచించి ఫలముల జెప్పదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
రాశిశీలాధ్యాయనామక
సప్తదశోధ్యాయము.

---

శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### దృష్టిఫలాధ్యాయము. అష్టాదశాధ్యాయము. —18.



మేష వృషభ మిధున కర్కాటక రాసులయందుండు చంద్రుడు
కుజాదిగ్రహములచే జూడబడుచుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. చంద్రే భూపబుధౌ నృపోపమగుణీ స్తేనాధనా శ్చాజగే
నిస్స్వ స్తేన నృమాన్యభూప ధనినః ప్రేష్యః కుజాద్యై ర్గవి
నృక్షే ఽయోవ్యవహారి పార్థివబుధా భీతంతువాయాధనా
స్స్వర్క్షే యోధ్ధ కవిజ్ఞ భూమిపతయో ఽ యోజీవిదృగ్రోగిణౌ. ।

టీ. అజగే = మేషమందున్న, చంద్రే = చంద్రునకు, కుజాద్యైః = అంగారకాది మార్యాంతగ్రహములచేతఁ జూడఁబడుచుండఁగా జనించినవారు, క్రమముగా, భూపబుధౌ నృపోపమగుణీస్తేనాధనాః = రాజపండిత రాజతుల్య గుణీ చోరదరిద్రులగుదురు, గవి = వృ

వృషభమందున్న చంద్రుడుగాని (వృషభలగ్నముగాని), కుజాద్యైః=కుజాదిసూర్యాంతగ్రహములచే జూడబడుచుండగా పుట్టిన జాతకుడు, క్రమముగా, నిస్స్వః = దరిద్రుడును, స్తేన= చోరుడును, నృమాన్యః = జనపూజ్యుడును, (పాఠాంతరము. నృపాఢ్యః=రాజశ్రేష్ఠుడును), భూప = రాజును, ధనీ = ధనవంతుడును, ప్రేష్యః = పరిచారకుడును, అగును. నృస్థే = మిథునమందున్న చంద్రుడుగాని, (మిథునలగ్నముగాని), కుజాద్యైః=కుజాదులచేత జూడబడుచుండగా బుట్టినవారు, అయోవ్యవహారీ = శస్త్రముల క్రయవిక్రయాదులచే జీవించువాడును, పార్థివ = రాజును, బుధ=పండితుడును, అభీ = భయములేనివాడును, తంతువాయ= సాలెవాడును, అధన = దరిద్రుడును అగును స్వర్క్షే=స్వక్షేత్రమైన కర్కాటకమందున్న చంద్రుడుగాని (కర్కాటక లగ్నముగాని), కుజాదులచే జూడబడుచుండగా బుట్టినవారు, యోద్ధ్రా= యుద్ధముసేయువాడును, కవిః=కవిత్వముసేయువాడును, జ్ఞః = పండితుడును, భూపతి = రాజును, అయోజీవి = ఆయుధములచే జీవించువాడును, దృగ్రోగవాౕ = నేత్రవ్యాధి పీడితుడును. అగును.

తా. మేషరాశియందు చంద్రుడుండి అంగారకాది గ్రహములచే జూడబడుచుండగా బుట్టినవారు క్రమముగ భూపపండితాగులగుదురు. పూర్వాధ్యాయమున చెప్పబడినప్రకారము మేషలగ్నము అంగారకాదిగ్రహములచే జూడబడుచుండగా ఈఫలములన్నియు సంపూర్ణముగ జరుగును. అనగా జననకాలమున మేషరాశియందుండు చంద్రుడుగాని మేషలగ్నముగాని అంగారకునిచే జూడబడుచుండు నెడల జాతకుడు భూపతియగుననియు, బుధునిచే జూడబడుచుండు నెడల విద్వాంసుడగుననియు, బృహస్పతిచే జూడబడుచుండు నెడల రాజసమానుడగుననియు, శుక్రునిచే జూడబడుచుండు నెడల సుగుణము కలవాడనియు, శనైశ్చరునిచే జూడబడుచుండు నెడల దొంగయగుననియు, సూర్యునిచే జూడబడుచుండు నెడల ధనహీనుడగుననియును జెప్పదగినది.

వృషభలగ్నమైనను, వృషభమునకున్న చంద్రుడైనను అంగారకునిచే జూడబడుచుండెనేని దరిద్రుడగుననియు, బుధునిచే జూడబడుచుండెనేని దొంగయగుననియు, బృహస్పతిచే జూడబడుచుండెనేని జనులందరిచేత పూజింపబడువాడైనను స్వకులశ్రేష్ఠుడైనను, రాజశ్రేష్ఠుడైనను అగుననియు, శుక్రునిచే జూడబడుచుండెనేని రాజైనను, రాజసమానుడైనను అగుననియు శనైశ్చరునిచే జూడబడుచుండెనేని ధనవంతుడగుననియు, సూర్యునిచే జూడబడుచుండెనేని భృత్యుడగుననియును తెలియదగినది. మిథునరాశియందున్న చంద్రుడైనను మిథునలగ్నమైనను అంగారకుడు చూచుచుండు నెడల జాతకుడు ఉక్కు, ఇనుము మొదలగువానితో కత్తులు మొదలగునవి చేయుటయందును, వాటిసంబంధమగు వ్యాపారముచేయుటయందును నిపుణుడగుననియు బుధుడు చూచుచుండు నెడల రాజగుననియు బృహస్పతిచూచుచుండు నెడల పండితుడగుననియు. శుక్రుడుచూచుచుండు నెడల భయములేనట్టివాడగుననియు, శనైశ్చరుడు జూచుచుండు నెడల బట్టలునేయువాడగుననియు, సూర్యుడుచూచుచుండు నెడల, దరిద్రుడగుననియును దెలియదగినది.

స్వక్షేత్రమగు కర్కాటకరాశియందుండు చంద్రుడుగాని, కర్కాటకలగ్నము గాని అంగారకునిచే జూడబడుచుండునెడల జాతకుడు యుద్ధముసేయుటయందను భిజ్ఞుడగునని యును, బుధునిచేజూడబడు చుండునెడల కవిత్వము జెప్పదగినవాడగుననియు, బృహస్పతిచే జూడబడుచుండునెడల పండితుడగుననియు, శుక్రునిచే జూడబడుచుండునెడల భూపతి యగుననియు, శనైశ్చరునిచే జూడబడుచుండునెడల ఇనుముచే జేయబడిన ఆయుధముల క్రయవిక్రయాదులవలన జీవనముచేయువాడగుననియు, సూర్యునిచే జూడబడుచుండు నెడల నేత్రరోగ పీడితుడగు ననియును జెప్పదగినది.

సింహ కన్యా తులా వృశ్చికములయందున్న చంద్రుడు బుధాది
గ్రహవీక్షితుడగు చుండగా జనించినవారి స్వభావములు.

శ్లో. జ్యోతిర్జ్ఞాఢ్య నరేంద్ర నాపిత నృప క్ష్మేశా బుధాద్యైర్హరౌ
తద్వద్భూప చమూప నైపుణయుతా షష్ఠే శుభైః స్త్రీశ్రయః
జూకే భూపసువర్ణ కార వణిజ శ్శేషే క్షితే నైకృతిః
కీటే యుగ్మపితా నతశ్చ రజకో వ్యంగో ధనో భూపతిః. 2

టీ. హరౌ బుధాద్యైః = బుధ గురు శుక్ర శని రవి కుజులచేత సింహమందున్న చంద్రుడు గాని (సింహలగ్నము గాని) జూడబడుచుండగా బుట్టినవారు, జ్యోతిర్జ్ఞః = జ్యోతిశ్శాస్త్రజ్ఞుండును, ఆఢ్య=ధనికుడును, నరేంద్ర = నృపుడును, నాపిత=మంగలవాడును, నృప=రాజును, క్ష్మేశ=భూపతియును అగును. తద్వత్ = ఆప్రకారమే, షష్ఠే = కన్యారాశియందున్న చంద్రుడుగాని కన్యాలగ్నముగాని, బుధాద్యైః = బుధాదిగ్రహములచే జూడబడుచుండగా జాతకుడు(క్రమముగా) భూప=రాజును, చమూప=సేనాధిపతియగును, నైపుణయుత=కార్యములయందు నేర్పుగలవాడును, అశుభైః=పాపగ్రహములైన శనిరవికుజులచేత, స్త్రీశ్రయః=స్త్రీని ఆశ్రయించి జీవించువాడును అగును. జూకే=తులయందున్న చంద్రుడు గాని తులాలగ్నము గాని, భూప = క్ష్మాపతియు, సువర్ణకార = అగసాలియు, వణిక్ = వర్తకుడగును, శేషేక్షితే = తక్కిన శని రవి కుజులచేత చూడబడే నేని, నైకృతిః = పరకార్య విముఖుడును, అగును కీటే = వృశ్చికమందున్న చంద్రుడు గాని (వృశ్చికలగ్నము గాని) యుగ్మపితా = అవడబిడ్డలకు తండ్రియు, నతః = నమ్రుడును, రజకః = చాకలివాడును, అధనః = ధనహీనుడును, భూపతిః = భూమీశుడును అగును.

తా. సింహ రాశియందుండు చంద్రుడైనను సింహలగ్నమైనను బుధునిచే జూడబడుచుండునెడల జాతకుడు గ్రహగత్యాది నిర్ణయ శాస్త్రము దెలిసిన వాడు అగును. బృహస్పతిచే జూడబడుచుండునెడల ధనవంతుడగును, శుక్రునిచే జూడబడుచుండునెడల రాజగును, శనైశ్చరునిచే జూడబడుచుండునెడల మంగలియగును, సూర్యునిచేజూడబడుచుండునెడల రాజగును, అంగారకునిచే జూడబడుచుండునెడల భూపతియగును.

కన్యారాశి యందుండు చంద్రుడైనను, కన్యాలగ్నమైనను, బుధుడు చూచుచుండెనేని జాతకుడు రాజగును, బృహస్పతి జూచుచుండెనేని సేనాధిపతియగును, శుక్రుడు చూచుచుండెనేని నేర్పుగా కార్యములన్నియు చక్కబెట్టుకొనువాడగును, పాపగ్రహములగు శనైశ్చర, అంగారక, సూర్యులు జూచుచుండిరేని స్త్రీలనాశ్రయించి బ్రతుకువాడగును.

తులారాశియందుండు చంద్రుడైనను, తులాలగ్నమైనను బుధునిచే జూడబడుచుండునెడల జాతకుడు రాజగును. బృహస్పతిచే జూడబడుచుండునెడల అగసాలెవాడగును, అకులస్థుడు గాకపోయినను బంగారుపని చేయువాడగును, శుక్రునిచే జూడబడుచుండునెడల వర్తకవృత్తిచే జీవించువాడగును తక్కిన సూర్యాంగారక శనైశ్చరులచే జూడబడుచుండునెడల ఇతరుల కార్యములయందు పరిభూతుడును, క్రూరుడును, దుర్మార్గుడును అగును.

వృశ్చికరాశియందున్న చంద్రుడైనను, వృశ్చికలగ్నమైనను, బుధునిచే జూడబడుచుండెనేని జాతకుడు, అనుడబిడ్డలకు తండ్రియగును. (ఈవిషయమున కొందరు ఇద్దరుకుమారులు గలవాడగునందురు.) బృహస్పతిచే జూడబడుచుండెనేని వినయముగలవాడగును. శుక్రునిచే జూడబడుచుండెనేని చాకలివాడగును. శనైశ్చరునిచే జూడబడుచుండునెడల అంగహీనుడగును. సూర్యునిచే జూడబడుచుండెనేని ధనములేనివాడగును. అంగారకునిచే జూడబడుచుండెనేని భూపతియగును.

⊸ { ధనుర్మకర కుంభ మీన రాశ్యాధిష్టిత చంద్రునకు బుధాదిగ్రహవీక్షణముండగా జనించినవారి స్వభావములు. } ⊸

శ్లో. జ్ఞాత్యుర్వీశ జనాశ్రయాశ్చ తురగే పాపైః సదంభశ్శఠ
శ్చాత్యుర్వీశ నరేంద్ర పండిత ధనిద్రవ్యోన భూపామృగే
భూపో భూప సమో న్యదారనిరత శ్శేషైశ్చ కుంభస్థితే
హాస్యాజ్ఞో నృపతి ర్బుధశ్చ ఝుషగే పాపశ్చ పాపేక్షితే. 3

టీ. తురగే = ధనుస్సునందున్న చంద్రుడుగాని (ధనుర్లగ్నముగాని,) బుధ గురు శుక్రులచే జూడబడెనేని క్రమముగా, జ్ఞాతీ = స్వజనభర్తయును, ఉర్వీశ=పుడమిఱేడును, జనాశ్రయ = జనులకు ఆశ్రయభూతుడును, పాపైః = శనిరవికుజులచేత చూడంబడెనేని, సదంభః = దాంభికుడును, శఠః = పరకార్యవిముఖుడును, అగును, మృగే = మకరమందున్న చంద్రుడుగాని (మకరలగ్నముగాని), బుధ గురు శుక్రులచే జూడబడెనేని క్రమముగా, అత్యుర్వీశ=రాజాధిరాజును, నరేంద్ర=రాజును, పండితః= విద్వాంసుడును, ధనీ=ధనికుడును, ద్రవ్యోన = ధనములేనివాడును, భూప = భూమిపాలకుడును అగును. కుంభస్థితే=కుంభమందున్న చంద్రుడుగాని (కుంభలగ్నముగాని), బుధ గురు శుక్రులచే జూడబడెనేని క్రమముగా, భూపః = రాజును, భూపసమః = రాజసముడును, అన్యదారనిరతః=పరస్త్రీసంసక్తుడును, అగును. శేషైశ్చ = శేషించిన శని రవికుజులచేత చూడబడెనేని, చకారము వలన పరస్త్రీసంసక్తుడే అగును. ఝుషగే = మీనమందున్న చంద్రుడుగాని (మీనలగ్నము

గాని), బుధ గురు శుక్రులచే జూడబడెనేని క్రమముగా, హాస్యజ్ఞః=హాస్యరసాభిజ్ఞుఁడును, నృపతిః = రాజును, బుధః = పండితుఁడును, పాపేక్షితే = శని రవి కుజులచేతఁ జూడఁబడెనేని, పాపకృ = పాపకర్ముఁడును అగును.

తా. ధనూరాశి యందున్న చంద్రుఁడైనను ధనుర్లగ్నమైనను బుధునిచే జూడబడుచుండ గా బుట్టినమానవుఁడు స్వకులశ్రేష్ఠుడగును గురువుచే జూడబడుచుండునెడల భూమీశుడగు ను. శుక్రునిచే జూడబడుచుండునెడల జనులకు నాధారభూతుడగును, పాపులగుశనైశ్చర సూ ర్యాంగారకులచే జూడబడుచుండునెడల క్రమముగా డాంభికుడును, గర్వముగలవాడును, మోసగాడును, అగును.

మకరరాశియందుండు చంద్రుడైనను మకరలగ్నమైనను బుధునిచే జూడబడుచుండు నెడల జాతకుడు రాజేంద్రుడగును. బృహస్పతిచే జూడబడుచుండునెడల నరపతియగును, శుక్ర నిచే జూడబడుచుండునెడల పండితుడగును, శనైశ్చరునిచే జూడబడుచుండునెడల ధనికు డగును, సూర్యునిచే జూడబడుచుండునెడల ధనహీనుడగును, అంగారకునిచే జూడబడుచుం డునెడల భూపతియగును.

కుంభరాశిస్థిత చంద్రుడైనను, కుంభలగ్నమైనను, బుధునిచే జూడబడుచుండెనేని రాజ గును. బృహస్పతిచే జూడబడుచుండునెడల రాజుసమానుడగును, శుక్రునిచే జూడబడుచుం డునెడల వరాంగనా సంభోగుడగును, తక్కిన గ్రహములగు శనైశ్చర, సూర్యాంగారకులచే జూడబడుచుండెనేని క్రమముగా దుష్టస్త్రీప్రియుడును, దుర్మార్గుడును, యువతీజనప్రియు డును అగును. మీనరాశియందుండు చంద్రుడుగాని మీనలగ్నముగాని బుధునిచే జూడబడు చుండగా బుట్టిన మనుజుడు, హాస్యమునందు నేర్పరియగును. బృహస్పతిచే జూడబడుచుండు నెడల రాజగును. శుక్రునిచే జూడబడుచుండునెడల పండితుడు అగును. పాపులగు శనైశ్చర సూర్యాంగారకులచే జూడబడుచుండు నెడల క్రమముగా నీచ విరూపాంగనాసక్తుడును, తీ వ్రకామియు, పాపకార్యరతుడును అగును. పూర్వాధ్యాయ కడపటిశ్లోకమున "శశిరకరస మాగమేక్షణానాం సదృశఫలం ప్రవదంతి లగ్నజాతం" అని యుండుటచే చంద్రదృష్టిఫల మే లగ్నదృష్టిఫలమని యేర్పడు చున్నది. ఆశ్లోకమున లగ్నమునకు చంద్రదృష్టిఫలము చె ప్పబడి యుండలేదు అయినను లగ్నమునకు సప్తమస్థానమున చంద్రుడుండుట తటస్థించునెడ ల ఫలము తేర్పరచుటకు గాను, ఈ హోరాశాస్త్రమున సంజ్ఞాధ్యాయమున లగ్నాదిబలములు వివరించి యుండు "హోరాస్వామి గురుజ్ఞవీక్షితయుతా నాన్యైశ్చ వీర్యోత్కటా" అను శ్లోకమున చెప్పియుండు ప్రకారముగ యోచించగా కర్కాటకలగ్నముగాక తక్కినలగ్నము లు చంద్రునిచే వీక్షింపబడు చుండునెడల బలహీనములగునని యేర్పడుటచే నశుభకరములని యూహింపదగియున్నది. మరియు నీవిషయమునకు "ముక్త్వాతు చంద్రభవనం లగ్నగతం శశిరకి రణ సంస్పృష్టం అశుభఫలం నిర్దిష్టం పృచ్ఛాయాం జన్మసమయేవా" అని పూర్వశాస్త్రజ్ఞులు చెప్పియున్నారు.

ద్వాదశరాశిచక్రమున ఒక్కొకరాశియందుండు చంద్రునిగాని ఆయా జననలగ్నములనుగాని గ్రహములు చూచుచుండగా జాతకులకుగలుగు స్వభావములు.

(చంద్రుడు లగ్నమునుమాత్రము జూచుట తటస్థించును.)

| వీక్షించు గ్రహములు | సూర్యుడు | చంద్రుడు | అంగారకుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శనైశ్చరుడు |
|---|---|---|---|---|---|---|---|
| మేషము | దరిద్రుడు | దూషణప్రియుండు | భూపతి | విద్వాంసుడు | రాజతుల్యుడు | సుగుణుడు | చోరుడు |
| వృషభము | భృత్యుడు | కోపముగల భూపతి | దరిద్రుడు | తస్కరుడు | కులశ్రేష్ఠుడు | నృపతి | ధనవంతుడు |
| మిధునము | ధనహీనుడు | [illegible]యుక్తి గలవాడు | శస్త్రజీవి | రాజు | పండితుడు | నిర్భయుడు | బట్టలు నేయువాడు |
| కర్కాటకము | నేత్రరోగపీడితుడు | రాజు | సౌరాధుడు | కవి | విద్వాంసుడు | భూపతి | శస్త్రజీవి |
| సింహము | రాజు | క్రోధి | భూపతి | జ్యోతిష్కుడు | ధనికుడు | రాజు | మంగలి |
| కన్య | అంగనాసంపూజ్యుడు | కపటి | వనితాజనప్రియుడు | రాజు | సేనాధిపతి | నేర్పరి | స్త్రీలనాశ్రయించువాడు |
| తుల | పరకార్యాసక్తుడు | డాంబికుడు | క్రూరుడు | రాజు | అగసాలి | వర్తకుడు | దుర్మార్గుడు |
| వృశ్చికము | ధనహీనుడు | నీచుడు | భూపతి | అమడబిడ్డల తండ్రి | వినమ్రుడు | చాకలి | అంగహీనుడు |
| ధనుస్సు | గర్వి | గౌరవము లేనివాడు | మోసగాడు | కులశ్రేష్ఠుడు | భూపతి | జనాధారభూతుడు | డాంబికుడు |
| మకరము | నిర్ధనుడు | భయస్థుడు | భూపతి | రాజేంద్రుడు | నగపతి | విద్వాంసుడు | ధనికుడు |
| కుంభము | దుర్మార్గుడు | బలహీనుడు | స్త్రీప్రియుడు | రాజు | రాజసమానుడు | పరకాంతారతుడు | దుష్టస్త్రీప్రియుడు |
| మీనము | తీవ్రకామి | స్వల్పధనుడు | పాపి | హాస్యము వంశ నేర్పరి | రాజు | విద్వాంసుడు | నీచవిరూపాంగనాసక్తుడు |

హోరా ద్రేక్కాణ ద్వాదశాంశల యందుండు చంద్రుడు
సూర్యాదిగ్రహములచే జూడబడుచుండగా జనించినవారికిగలుగు ఫలములు.

శ్లో. హోరేశర్క్ష దళాశ్రితై శ్శుభకరో దృష్టశ్శశీ తద్గత
త్ర్యంశే తత్పతిభి స్సుహృద్భవన గైర్వా వీక్షిత శ్శస్యతే
యచ్చోక్తం ప్రతిరాశి వీక్షణ ఫలం తద్ద్వాదశాంశే స్మృతం
సూర్యాద్యై రవలోకితే శశిని విజ్ఞేయం నవాంశే ష్వతః. 4

టీ. హోరేశ = హోరాధిపతియొక్క, ఋక్షదళ = రాశ్యర్థమును, ఆశ్రితైః = పొందియున్న గ్రహములచే, తద్గతః = ఆహోరను పొందియున్న, శశీ = చంద్రుడు, దృష్టః = చూడబడెనేని, శుభకరః = శుభకరుండగును, త్ర్యంశేతత్పతిభిః = ఏరాశియందైనను ఏద్రేక్కాణమందు చంద్రుడుండనో ఆద్రేక్కాణాధిపతిచేత చంద్రుడు చూడబడెనేని, శస్యతే=శుభకరుడగును, సుహృద్భవనగైర్వాః = మిత్రక్షేత్రగత గ్రహములచేతనైనను, వా శబ్దమువలన స్వక్షేత్రగత గ్రహములచేతనైనను, వీక్షితః = చూడబడిన చంద్రుడును, శస్యతే = శుభకరుండగును, ప్రతిరాశి = మేషాదిద్వాదశ రాసులయందు చంద్రుడుండగా, యత్ఫలం=ఏదృష్టిఫలము, ప్రోక్తం=చెప్పబడినదో, తత్=ఆఫలము, ద్వాదశాంశే = మేషాది ద్వాదశాంశలయందున్న చంద్రునికిని, స్మృతం = చెప్పబడెను, శశిని= చంద్రుడు, నవాంశేషు = మేషాదినవాంశలయందున్నవాడైన, సూర్యాద్యైః = సూర్యుడు మొదలుగాగల గ్రహములచేత, అవలోకితే సతి = చూడబడుచుండగా, అతః = ఈముందరి శ్లోకములయందుచెప్పబడెడు 'ఆరక్షకోవధరుచి' రిత్యాదిఫలములు. విజ్ఞేయం= తెలియదగినది.

తా. ఏరాశియందైనను చంద్రుడు సూర్యహోరయందుండి ఇతరరాశులయందు సూర్య హోరయందున్నట్టి గ్రహములచేత జూడబడెనేని శుభప్రదుడగును. అట్లే చంద్రహోర యందు చంద్రుడుండి చంద్రహోరయందున్నట్టిగ్రహములచే జూడబడుచుండు నెడల శుభకరు డగుచున్నాడు. సూర్యహోరయందుండు చంద్రుడు చంద్రహోరయందున్నట్టి గ్రహములచే నైనను చంద్రహోరయందుండు చంద్రుడు సూర్యహోరయందున్నట్టి గ్రహములచేనైనను జూడబడుచుండు నెడల అశుభకరుడగును. ఈరీతిగ జననలగ్నము సూర్యహోరయందుదయిం చునెడల సూర్యహోరయందున్నట్టి గ్రహములచేతను, చంద్రహోరయం దుదయించు నెడల చంద్రహోరయందున్నట్టి గ్రహములచేతను జూడబడుచుండినమాత్రముననే శుభకరమగును. అట్లుగాక సూర్యహోరయందుదయించులగ్నము చంద్రహోరయందున్నట్టి గ్రహములచేతను, చంద్రహోరయందుదయించు లగ్నము సూర్యహోరయందున్నట్టి గ్రహములచేత జూడబడు చుండునెడల అశుభప్రదంబగును. మరియు చంద్రుండు తానుండు ద్రేక్కాణాధిపతిచే జూడబ డుచుండునెడల శుభకరుండగును. ఇచ్చోట "పతిభిః" అని బహువచనముగా జెప్పియుండు టవలన చంద్రుడు తానుండు నవాంశాధిపతిచేనైనను ద్వాదశాంశాధిపతిచేనైనను, త్రిం

శాధిపతిచేనైనను, జూడబడుచుండునెడల శుభకరుడగు ననుటను సూచింపబడియున్నది. ఇట్లే జననలగ్నమును తదుదయ నవాంశ ద్వాదశ త్రింశాధిపతులలో నొక్క గ్రహముచే జూడబడుచుండునెడల శుభకరంబగును. ఇచ్చట గూఢముగా జెప్పబడియుండినను "క్షేత్రాధిప సదృష్టే శశిని నృపస్తత్సుహృద్భిరపి ధనవాన్, ద్రేక్కాణాంశకపై ర్వా ప్రాయస్సౌమ్యై శ్శుభంవాస్త్యేః" అనులఘుజాతకోదాహరణానుసారముగా శుభగ్రహములను ద్రేక్కాణాధిపతులచేతను, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాధిపతులచేతను జూడబడుచుండు చంద్రుడుగాని, లగ్నముగాని శుభప్రదములనియు, పాపగ్రహములగు ద్రేక్కాణాధిపతి, నవాంశాది నాథులచే జూడబడుచుండునెడల నశుభకరమనియు సూచింపబడియున్నది. మరియు మిత్రగ్రహక్షేత్రస్థిత గ్రహములచేనైనను. స్వక్షేత్రస్థిత గ్రహములచేనైనను చంద్రుడు చూడబడుచుండునెడల శుభకరుడగును. ఇట్లనుటచే శత్రుక్షేత్రస్థిత గ్రహవీక్షితుడైనను చంద్రుడుండునెడల నశుభప్రదుడని సూచింపబడియున్నది. ఈ విషయమునగూడ పూర్వమువలె లగ్నమునకును సూచింపబడియున్నది. మరియు మేషాది ద్వాదశ రాశులందుండు చంద్రునకు అంగారకాది గ్రహదృష్టిచే నేయేఫలములు ఈ అధ్యాయ ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్లోకములయందు జెప్పబడియున్నవో, ఆయాఫలములే మేషాది ద్వాదశాంశలయందున్నట్టి చంద్రునకును జెప్పదగినది. నవాంశలగ్నమునకును ఈఫలములే జెప్పదగును మేషాది నవాంశలయందు చంద్రుడుండి సూర్యాదిగ్రహవీక్షితుడగుచుండగా గలుగుఫలములు నీక్రింద జెప్పబడియుండు "ఆరక్షికోవధరుచిః" అనుశ్లోకము మొదలు నాలుగుశ్లోకములందు వివరముగా దెలియునట్లు జెప్పబడియున్నది.

## మేషవృశ్చిక వృషభతులా నవాంశలయందుండు చంద్రుని సూర్యాదిగ్రహములు వీక్షించుచుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. ఆరక్షికో వధరుచిః కుశలో నియుద్ధే
భూపోఽర్థవాన్ కలహకృత్ క్షితిజాంశసంస్థే
మూర్ఖోఽన్యదారనిరత స్సుకవి స్సితాంశే
సత్కావ్యకృత్సుఖపరోఽన్యకళత్రగశ్చ.

టీ. క్షితిజాంశసంస్థే = కుజాంశలైన మేషవృశ్చిక నవాంశలయందున్న చంద్రుడు సూర్యాదులచేత చూడబడుచుండెనేని క్రమముగా, ఆరక్షికః = నగరరక్షకుడును, వధరుచిః = ప్రాణిహింస చేయువాడును, నియుద్ధే = బాహుయుద్ధమందు, కుశలః = నేర్పరియును, భూపః = రాజాగను, అర్థవాన్ = ధనవంతుడును, కలహకృత్ = కలహించువాడును, సితాంశే = శుక్రాంశలైన వృషభ తులా నవాంశలయందున్న చంద్రుడు, రవ్యాదులచేత చూడబడెనేని, క్రమముగా. మూర్ఖః = మూర్ఖుడును. అన్యదారనిరతః = పరదారాసక్తుడును, సుకవిః = మంచికవియును, సత్కావ్యకృత్ = మంచికావ్యకర్తయును, సుఖపరః = సుఖాసక్తుడును, అన్యకళత్రగశ్చ = పరస్త్రీలను పొందెడువాడును. అగుదు.

తా. అంగారకాంశలగు మేషవృశ్చిక నవాంశలందుండు చంద్రుని సూర్యుడు చూచుచుండునెడల జాతకుడు పురరక్షణకు నియమింపబడిన తలారివాడగును అంగారకుడు చూచుచుండునెడల జీవహింసయం దిష్టముగలవాడగును. బుధుడు చూచుచుండునెడల చేతి జగడమున నేర్పరి. బృహస్పతి చూచుచుండునెడల భూపతియగును. శుక్రుడు చూచుచుండునెడల ధనవంతుడగును. శనైశ్చరుడు చూచుచుండునెడల ఒకరికొకరికి పోట్లాటలు గల్పించువాడగును.

శుక్రాంశలగు వృషభతులాంశలయందుండు చంద్రుని సూర్యుడు చూచెనేని జాతకుడు తెలిసి తెలియనివాడగును. అంగారకుడు చూచుచుండునెడల పరాంగనాసక్తుడగును. ఇందులకు "పరదార దర్శనపరం కామన మారేణు" అని కల్యాణవర్మ రచించియున్నాడు.

బుధుడు చూచుచుండునెడల సత్కవియగును. బృహస్పతి చూచుచుండునెడల మంచికావ్యములు రచించువాడగును. ఈ విషయమునకు, "గురుణా కవిప్రదానం నయశాస్త్ర విశారదం" అని సారావళీకారకుడు వచించియున్నాడు.

శుక్రుడు చూచుచుండునెడల సౌఖ్యవంతుడను శనైశ్చరుడు జూచుచుండునెడల పరాంగనా సంభోగుండగును.

## మిథున కన్యా కర్కట నవాంశలయందు చంద్రుడుండి రవ్యాది గ్రహములచే వీక్షితుడగుచుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. బాధేహి రంగచర చోర కవీంద్ర మంత్రి
గేయజ్ఞ శిల్ప నిపుణా శ్శశిని స్థితేంశే
స్వాంశేల్పగాత్ర ధనలుబ్ధ తపస్వి ముఖ్య
స్త్రీపోష్య కృత్యనిరతాశ్చ నిరీక్ష్యమాణే. 6

టీ బాధేంశే = బుధాంశలైన మిథునకన్యా నవాంశలయందు, స్థితే = ఉన్నట్టి, శశిని = చంద్రుడు, నిరీక్ష్యమాణే = సూర్యాదులచేత జూడబడెనేని, (క్రమముగా), రంగచర = ముష్టియుద్ధముచేయువాడును, చోర = దొంగయగును. కవీంద్ర = కవీశ్వరుడును, మంత్రి = ప్రధానియగును. గేయజ్ఞ = గాయకుడగును, శిల్పనిపుణాః = శిల్పపనులు తెలిసినవాడును యగును. స్వాంశే = తన నవాంశయైన కర్కట నవాంశయందున్న చంద్రుడు, సూర్యాదులచే వీక్షితుండయ్యెనేని, (క్రమముగా), అల్పగాత్ర = కృశశరీరుడును, ధనలుబ్ధ = అర్థాభిలాషియగును. తపస్వి = తాపసుడును, ముఖ్య = ప్రధానుడగును. కొందఱు, కుజదృష్టుడయ్యెనేని అల్పధనవంతుడగుననియు, బుధదృష్టుడయ్యెనేని, లుబ్ధ = లోభియగుననియును, గురుదృష్టుడయ్యెనేని, తపస్విముఖ్య = తాపసుడగుననియు, స్త్రీపోష్యః = స్త్రీలవలన పోషింపబడువాడును, కృత్యనిరతః = కార్యాసక్తుడును అగును.

తా. బుధాంశలగు మిథున కన్యా నవాంశలయందుండు చంద్రుడు సూర్యునిచే జూడబడుచుండు నెడల జాతకుడు తగరము తిను వాడైనను నాటకసమూహమున తిరుగువాడైనను అగును. ఇందులకు "రంగచరం విఖ్యాతం జనయతి సూర్యేక్షిత శ్చంద్రః" అని సారావళీ వచనము గానబడుచున్నది.

అంగారకునిచే జూడబడుచుండు నెడల చోరుడగును. ఈవిషయమున "భౌమేక్షితేతి చోరం వివాదకుశలం నరంరౌద్రం" అని సారావళీకర్త వచించియున్నాడు.

బుధునిచే జూడబడుచుండు నెడల కవీశ్వరుడగును. ఇందులకు "బుధదృష్ట శ్శిల్పాచార్యాం కవింశశీ జనయేత్" అను గ్రంథాంతరవచనము గానబడుచున్నది. బృహస్పతిచే జూడబడు చుండు నెడల మంత్రియగును. శుక్రునిచే జూడబడుచుండు నెడల మంత్రియగును. శుక్రునిచే జూడబడుచుండు నెడల సంగీతజ్ఞానము గలవాడగును. శనైశ్చరునిచే జూడబడుచుండు నెడల శిల్పపరిజ్ఞానము గలవాడగును.

స్వనవాంశయగు కర్కాటక నవాంశయందు చంద్రుడుండి సూర్యునిచే జూడబడుచుండు నెడల జాతకుడు చిక్కిన దేహము గలవాడగును. అంగారకునిచే జూడబడుచుండు నెడల ద్రవ్యాసక్తి గలవాడగును. బుధునిచే జూడబడుచుండు నెడల తపముచేయువాడును, కరుణగలవాడును అగును. బృహస్పతిచే జూడబడుచుండు నెడల శ్రేష్ఠుడును అగును. అయినను అంగారక వీక్షణ ముండు నెడల సామాన్య ధనికుడగుననియు, బుధవీక్షణము గలుగు నెడల లోభియగుననియు, బృహస్పతి వీక్షణ్యము గలుగు నెడల తాపసముఖ్యుడగుననియు తాత్పర్యము జెప్పుచున్నారు శుక్రునిచే చూడబడుచుండు నెడల వనితా జనులచే పోషింపబడువాడగును. శనైశ్చరునిచే జూడబడుచుండు నెడల ఎల్లప్పుడును నీచమైన నొక కార్యము చేయుటయందాసక్తిగలవాడు అగును. ఈ విషయమున "సౌరేణాకృత్య కరం వధబంధ వివాద సంతప్తమ్" అని ఇతర గ్రంథకర్తలు వచించియున్నారు.

## సింహ ధనుర్మీన నవాంశస్థిత చంద్రుడు సూర్యాదిగ్రహ వీక్షితుడగుచుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. సక్రోధో నరపతి సమ్మతో నిధీశ స్సింహాంశే ప్రభురసుతోతి హింస్రకర్మా
జైవాంశే ప్రథిత బలో రణోపదేష్టా హాస్యజ్ఞ స్సచివ వికామవృద్ధశీలః.॥

టీ. సింహాంశే = సింహనవాంశయందున్న చంద్రుడు, సూర్యాదులచే జూడబడు నెడల క్రమముగా, సక్రోధః = క్రోధయుక్తుండును. నరపతిసమ్మతః = రాజప్రియుండును, నిధీశః = భూస్థాపిత ధనమున కధిపతియును, ప్రభుః = అప్రతిహతాజ్ఞుండును, అసుతః = పుత్రహీనుండును, అతిహింస్రకర్మా = అత్యంత హింసకుడును అగును. జైవాంశే = గుర్వంశలయిన ధనుర్మీన నవాంశలయందున్న చంద్రుడు, సూర్యాదులచేఁ చూడంబడెనేని, క్రమముగా, ప్రథితబలః = ప్రఖ్యాత బలుండును, రణోపదేష్టా = యుద్ధమందు జయమును పొందు

మార్గములను చెప్పెడువాడును, హాస్యజ్ఞః = హాస్యము తెలిసినవాడును, సచివః = మంత్రియును, విశాఖః = పుంస్త్వహీనుఁడును, వృద్ధశీలః = ధర్మబుద్ధిగలవాడును అగును.

తా. సూర్యాంశయగు సింహనవాంశయందున్న చంద్రుడు సూర్యునిచే వీక్షితుడగుచుండగా జనించిన మానవుడు కోపయుతుడగును. అంగారకునిచే వీక్షితుడగుచుండు నెడల ఘాతుకుడగును. బుధునిచే వీక్షితుడగుచుండు నెడల భూమియందు పాతిబెట్టబడియుండిన ద్రవ్యమున కధిపతియగును, బృహస్పతిచే వీక్షితుడగుచుండు నెడల అనివార్యముగ శాసింపించు రాజగును. శుక్రునిచే వీక్షితుడగుచుండు నెడల కుమారులు లేనివాడగును. శనైశ్చరునిచే జూడబడుచుండు నెడల ఘాతుకముగ చంపదగిన కార్యముల జేయువాడగును.

బృహస్పతి అంశలగు ధనుర్మీన నవాంశలయందున్న చంద్రుడు సూర్యునిచే జూడబడుచుండగా బుట్టినవాడు బలియుడును కీర్తిమహించినవాడు అగును అంగారకునిచే జూడబడుచుండు నెడల యుద్ధమునందు నిపుణతతో జయించుట కనుకూలమగు మార్గములను దెలియ జెప్పువాడు అగును. బుధునిచే జూడబడుచుండు నెడల హాస్యమునెరిగినవాడగును. బృహస్పతిచే జూడబడుచుండు నెడల మంత్రియగును, శుక్రునిచే జూడబడుచుండు నెడల మగతనము లేనివాడగును, శనైశ్చరునిచే జూడబడుచుండు నెడల న్యాయమార్గ ప్రవర్తకుడును అగును.

ఈ విషయము ననుసరించి ఇతర గ్రంథములందు గురుఅంశలయం దున్నట్టి చంద్రుని శుక్రుడు చూచుచుండు నెడల "జనయతి శశిసితేవ స్త్రీణాంభోగ్యే స్వసంయుక్తమ్" అని వచించియుండుటచే యిందు జెప్పబడియుండు విషయమునకు వ్యతిరిక్తముగా నున్నది.

శనైశ్చరుడు జూచుచుండు నెడల అంత్యకాలమున న్యాయమార్గ ప్రవర్తకుడగుననగా బాల్యమునం దతి దుర్మార్గుడనుట గ్రంథాంతరములచే నేర్పడుచున్నది.

## మకర కుంభ నవాంశలయందుండు చంద్రుడు సూర్యాదిగ్రహ వీక్షితుడగుచుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. అల్పాపత్యోదుఃఖిత స్సత్యపిస్వే మానాసక్తః కర్మణిస్వేను రక్తః
దుష్టస్త్రీష్టః క్రోధనశ్చార్కి భాగేచంద్రే భానాతద్వ దింద్వాదిదృష్టే.

టీ. అర్కిభాగే = శన్యంశలైన మకరకుంభ నవాంశలయందున్న, చంద్రే = చంద్రుండు రవ్యాదిగ్రహ దృష్టుండయ్యేనేని, క్రమముగా, అల్పాపత్యః = స్వల్పపుత్రులు గలవాఁడును, సత్యపిస్వే = ధనముగలిగియుండియు, దుఃఖిత = దుఃఖితుడును, మానాసక్తః = గర్వితుండును, స్వేకర్మణి = తనకులాచారములయందు, అనురక్తః = అనురాగముగలవాఁడును, దుష్టస్త్రీష్టః = దుష్టస్త్రీయం దిష్టముగలవాఁడును, క్రోధనః = రోషముగలవాడును అగును. భానాః = సూర్యుఁడు, ఇంద్వాదిదృష్టే = చంద్రుడు మొదలగు గ్రహములచేఁ జూడఁబడినను, తద్వత్ = పైరీతిగనే దృష్టిఫలములను జెప్పవలెను.

తా. శనైశ్చరాంశలగు మకర కుంభ నవాంశలయందు చంద్రుడుండి సూర్యునిచే వీక్షింపబడుచుండగా జనించినవాడు సంతానము స్వల్పముగా గలవాడగును. అంగారకునిచే జూడబడుచుండు నెడల ధనికుడైయుండియు దుఃఖముచే పీడింపబడువాడగును. బుధునిచే జూడబడుచుండు నెడల అభిమానమునం దాసక్తిగలవాడగును. బృహస్పతిచే జూడబడుచుండు నెడల స్వమతాచార కార్య ప్రవర్తకుడగును. శుక్రునిచే జూడబడుచుండు నెడల దుర్మార్గులగు యువతీజనమునం దిష్టముగలవాడగును. శనైశ్చరునిచే జూడబడుచుండు నెడల కోపముగలవాడగును. ఈ విధముగనే జన్మనవాంశ లగ్నమునకును సూర్యాది గ్రహ ఫలితములు జెప్పదగినది. నవాంశలగ్నమునకు గూడ చంద్రదృష్టిఫలము వేరుగా జెప్పబడలేదు, గాన నింతకు పూర్వాధ్యాయమున జననలగ్నమునకు చంద్రదృష్టిఫలములు ఏప్రకారము చెప్పబడియున్నవో యాప్రకారమే యోచింపదగినది. మరియు సూర్యుడు చంద్రాది గ్రహములచేత జూడబడినను పూర్వపురీతిగనే ఫలముల జెప్పవలయుననగా ఏ నవాంశయందుండు చంద్రునకు సూర్యాదిగ్రహ వీక్షణ్యముచే నే ఫలములు జెప్పబడినవో ఆ ఫలములే ఆ నవాంశస్థిత సూర్యునకు చంద్రాదిగ్రహ వీక్షణ్యముండగా జెప్పవలయును ఇందు చంద్రదృష్టిఫలములు వేరుగ జెప్పబడలేదు. అయినను, ఏ నవాంశయందున్న చంద్రునకు సూర్యదృష్టిచే నే ఫలము జెప్పబడియున్నదో ఆఫలమునే ఆ నవాంశయందున్న సూర్యునకు చంద్రదృష్టివలనను గలుగునదియని జెప్పదగినది. తక్కిన అంగారక బుధ గురు శుక్ర శనైశ్చర వీక్షణ్యమువలన గలుగు ఫలములన్నియు పూర్వపురీతిని జెప్పదగినది.

వివరము.— నవాంశలయందుండు సూర్యునకు చంద్రదృష్టివలన గలుగు ఫలములు.

సూర్యుడు కుజాంశలయందుండి చంద్రునిచే జూడబడుచుండగా బుట్టినవాడు కావలి గాచువాడగును.

శుక్రనవాంశలయందుండి చంద్రునిచే జూడబడుచుండు నెడల జాతకుడు తెలిసి తెలియనివాడగును.

బుధాంశలయందుండి చంద్రునిచే జూడబడుచుండు నెడల జాతకుడు యుద్ధమునం దాసక్తిగలవాడగును.

గుర్వంశలయందుండి చంద్రునిచే జూడబడుచుండు నెడల జాతకుడు జనులచే బొగడదగినట్టి బలశాలియగును.

శన్యంశలయందుండి చంద్రునిచే జూడబడుచుండు నెడల జాతకుడు స్వల్ప సంతానము గలవాడగును.

స్వనవాంశయందుండి చంద్రునిచే జూడబడుచుండు నెడల జాతకుడు కోపిష్ఠియగును.

చంద్రనవాంశయందుండి చంద్రునిచే జూడబడుచుండు నెడల జాతకుడు చిక్కిన శరీరముగలవాడగును.

నవాంశస్థితచంద్రుని ఇతరగ్రహములు వీక్షించుటచే జాతకులకుగలుగు స్వభావముల వివరము, (చంద్రుని తదితర గ్రహములును లగ్నమును సూర్యాది సప్త గ్రహములను చూచుటగలదు.)

| వీక్షించు గ్రహములు | సూర్యుడు | చంద్రుడు | అంగారకుడు | బుధుడు | బృహస్పతి | శుక్రుడు | శనైశ్చరుడు |
|---|---|---|---|---|---|---|---|
| మేష నవాంశ | నగర రక్షకుడు | కోపి | జీవహింసచేయువాడు | బాహుయుద్ధము చేయువాడు | భూపతి | ధనవంతుడు | కలహప్రియుడు |
| వృషభ నవాంశ | మూర్ఖుడు | చదువరి | స్త్రీలోలుడు | పండితుడు | కవి | సుఖానుభవుడు | లోలుడు |
| మిథున నవాంశ | జ్ఞతగర భక్షకుడు | దుష్టుడు | చోరుడు | కవి | మంత్రి | పాఠకుడు | శిల్పి |
| కర్కాటక నవాంశ | కృశదేహి | మాతృభాషా పండితుడు | ధనికుడు | తాపసి | శ్రేష్ఠుడు | స్త్రీ ప్రియుడు | వివాద ప్రియుడు |
| సింహ నవాంశ | కోపి | గర్వి | భూపతి ప్రియుడు | నిధీశుడు | క్రూరాజ్ఞ చేయువాడు | అల్పకుమాళ్లుగలవాడు | ఘాతకుడు |
| కన్యా నవాంశ | నాటక ప్రియుడు | లోభి | జూదరి | విద్వాంసుడు | న్యాయవాది | సంగీతమున ప్రియుడు | చిత్రకారుడు |
| తులా నవాంశ | ముక్కోపి | ధనహీనుడు | అన్యకాంతారతుడు | కవి | కవి | సుఖి | అతికామి |
| వృశ్చిక నవాంశ | తలారి | పాపి | హింసించు గుణముగల వాడు | బలాధికుడు | రాజు | భోగవంతుడు | చెరుచు వాడు |
| ధనుర్నవాంశ | కీర్తి బలము గలవాడు | డాంబికుడు | యోధుడు | పరిహాసకుడు | మంత్రి | నపుంసకుడు | వార్థక్యమున మంచివాడు |
| మకర నవాంశ | అల్ప సంతానవంతుడు | సన్యాసి | దుఃఖి | మాని | కులాచార సంపన్నుడు | దుష్టస్త్రీ సంభోగి | కోపి |
| కుంభ నవాంశ | సంతాన హీనుడు | అకాలమున భుజించు వాడు | లేమిడి | క్రోధి | శాస్త్రము తెలిసిన వాడు | నీచసంభోగి | కఠిన ఆజ్ఞ చెప్పువాడు |
| మీన నవాంశ | బలీయుడు | జలాపేక్షకుడు | యుద్ధ ప్రియుడు | హాసపదనుడు | సచివుడు | కామి | బాల్యమున దుష్టుడు |

## నవాంశస్థిత గ్రహములకును నవాంశ లగ్నమునకును దృష్టిఫల విశేషములు.

శ్లో. వర్గోత్తమ స్వ పరగేషు శుభం యదుక్తం
తత్పుష్ట మధ్య లఘుతాఽశుభ ముత్క్రమేణ
వీర్యాన్వితోఽంశకపతి ర్నిరుణద్ధి పూర్వం
రాశీక్షణస్య ఫల మంశఫలం దదాతి. 1

టీ. చంద్రుఁడు వర్గోత్తమ=వర్గోత్తమ నవాంశమందును, స్వ = స్వనవాంశమందును, పరగేషు = పరనవాంశమందును నుండేని, శుభం = గ్రహదృష్టివలనఁ గలుగుశుభము, యత్ = ఏది, ఉక్తం = చెప్పఁబడినదో, తత్ = అది, (క్రమముగా) పుష్ట = మిక్కిలి విశేషముగాను, మధ్య = మధ్యమముగాను లఘుతా = కొంచెముగాను నగును, అశుభం = అశుభఫలము, ఉత్క్రమేణ = ఉక్తవ్యతిరిక్తముగా నగును. అంశకపతిః = చంద్రుఁడున్న నవాంశాధిపతి, వీర్యాన్వితః = బలవంతుఁడైయుండేని, పూర్వం = ముందుఁజెప్పిన, రాశీక్షణస్య = రాశిస్థిత చంద్రునియొక్క, ఫలం = గ్రహదృష్టిఫలమును, నిరుణద్ధి = అడ్డపెట్టుచున్నాఁడు, (కింతు = ఇఁక నేమన), అంశఫలం = నవాంశస్థితుఁడైన చంద్రునియొక్క గ్రహదృష్టిఫలమును, దదాతి = ఇచ్చుచున్నాఁడు.

తా. చంద్రుడు వర్గోత్తమ నవాంశయందుండు నెడల గ్రహదృష్టివలన గలుగు శుభఫలము అధికముగ జరుగును. అశుభఫలము కొద్దిగ జరుగును.

చంద్రుడు స్వనవాంశయందుండునెడల గ్రహదృష్టివలన గలుగు శుభఫలము మధ్యమముగా జరుగును. అశుభఫలము అధికముగాకను తక్కువగాకను మధ్యమముగా జరుగును. చంద్రుడు వర్గోత్తమస్వనవాంశలయందుగాక తక్కినవనవాంశయందుండు నెడల గ్రహదృష్టివలన గలుగు శుభఫలము కొంచెముగా జరుగును. అశుభఫలము అత్యధికముగ జరుగును. ఈ ప్రకారముగా శుభఫలము జరుగునట్టి రీతికి ఉక్త వ్యతిరిక్తముగ అశుభఫలములు, వర్గోత్తమ స్వపర నవాంశలయందు జరుగుచుండును. నవాంశస్థిత సూర్యునకును నవాంశ లగ్నమునకును గ్రహదృష్టిఫల విశేషము నీరీతిగనే నూహింపదగినది. మరియు చంద్రస్థిత నవాంశాధిపతి బలవంతుడగునెడల ఈ అధ్యాయ ప్రథమభాగమున జెప్పబడియుండు ప్రకారము ఆయా రాశిస్థిత చంద్రుని గ్రహములు వీక్షించుటచే జాతకులకు గలుగు ఫలములు జరుగనేరవు. అయినను నవాంశస్థిత చంద్రుని సూర్యాదిగ్రహములు వీక్షించుటచే జాతకులకు గలుగు ఫలములు మాత్రము జరుగును. నవాంశాధిపతి బలహీనుడగునెడల రాశిదృష్టిచే గలుగు ఫలములను నవాంశదృష్టిచే గలుగు ఫలములును జరుగును. హోరా ద్రేక్కాణ ద్వాదశాంశస్థిత చంద్రునితరగ్రహములు వీక్షించుటచే జాతకులకు గలుగు ఫలములు యథోక్తముగ జరుగును. ఈరీతిగ చంద్రలగ్నములకు రెంటికిమాత్ర మూహించదగినది. రాశిస్థిత సూర్యునిగ్రహములు వీక్షిం

చుటచే జాతకులకుగలుగు ఫలములు ఇందు చెప్పబడియుండినందున నవాంశస్థిత సూర్యుడు యితరగ్రహదృష్టుడగుచుండగా జనించినవారికి గలుగు ఫలములే జెప్పదగినది. ఆయా రాశు లయందుండు సూర్యాదిగ్రహములలో నొక్కొక్కగ్రహమును తదితరగ్రహములు జూచు చుండుటచే జాతకులకు గలుగు ఫలములు వేదాంగ విద్వర్యుడగు కల్యాణవర్మ విరచితమగు సారావళియను జాతకగ్రంథమున విశదీకరింపబడి యుండుటచే తద్గ్రంథమూలముగ సులభముగ దెలిసికొననగును.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
దృష్టి ఫలాధ్యాయ నామక
అష్టాదశాధ్యాయము.

శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### భావఫలాధ్యాయము. ఏకోనవింశోధ్యాయము. —19.

**సూర్యుడు లగ్న ద్వితీయములయందుండగా బుట్టినవారి స్వభావములు.**

శ్లో. శూర స్తబ్ధో వికల నయనో నిర్ఘృణోర్కే తనుస్థే
మేషే సస్వ స్తిమిరనయన స్సింహసంస్థే నిశాంధః
నీచేంధో స్వక్ళశిగృహా గతే బుక్బ దాతుః పతంగే
భూరిద్రవ్యో నృపహృత ధనో వక్త్రి రోగీ ద్వితీయే. 1

టీ. అర్కే = సూర్యుడు, తనుస్థే = లగ్నమందుండగాను, శూరః = యుద్ధప్రియుడును, స్తబ్ధః = పనులయం దాలస్యముగలవాడును, వికలనయనః = హీనదృష్టిగలవాడును, నిర్ఘృణః = నిర్దయుడును, జన్మించును. మేషే = మేషము లగ్నమై అందు సూర్యుడుండె నేని, సస్వః = ధనవంతుండును, తిమిరనయనః = చీకటిగ్రమ్ముదు కన్నులు గలవాడును, పుట్టును. సింహసంస్థే = సింహము లగ్నమై అందు సూర్యుడుండెనేని. నిశాంధః = రేచీకటి

వాఁడగును. నీచే=సూర్యునికి నీచస్థానమగు తులలగ్నమై అందు సూర్యుఁడుండెనేని, అంధః= గ్రుడ్డివాఁడును, అస్వః = దరిద్రుండును పుట్టును. శశిగృహగతే = కర్కాటకము లగ్నమై అందు సూర్యుఁడుండెనేని, బుద్బుదాక్షః = పూఁగంటివాఁడు జన్మించును. పతంగే = సూర్యుఁడు, ద్వితీయే = లగ్నమునకు ద్వితీయమందుండెనేని, భూరిద్రవ్యః = బహుధనము గలవాఁడును, నృపహృతధనః = రాజులచేత అపహరింపఁబడిన ద్రవ్యముగలవాఁడును. వక్త్రరోగీ = ముఖరోగము గలవాఁడును జననమొందును.

తా. సూర్యుడు తనుభావమగు లగ్నమందుండగా జనించినవాడు శూరుడును. మందముగాను ఆలస్యముతోడను కార్యములను చక్కబెట్టుకొనువాడును, తక్కువచూపు గల వాడును, దయలేనివాడును అగును.

## మేష సింహ తులా కర్కాటకములు లగ్నములగునెడల గలుగు ఫలములు.

మేషరాశిలగ్నమై అందు సూర్యుడుండునెడల జాతకుడు ధనవంతుడగును. నీరు గ్రమ్మ్రు కన్నులుగలవాడగును. సింహరాశి జననలగ్నమై అందు సూర్యుడుండునెడల జాతకుడు రేజీకటి గలవాడగును. అనగా రాత్రులయందు కండ్లు కొంచెముగూడ దెలియక పగలుమాత్రము కొంచము దెలియునట్టి కండ్లు గలవాడగును, నీచస్థానమగు తులారాశియందు సూర్యుడుండునెడల జాతకుడు గ్రుడ్డివాడును, ధనహీనుడును అగును. కర్కాటకము జన్మలగ్నమై యారాశియందే సూర్యుడుండునెడల ఉబ్బిన కండ్లుగలవాడైనను, పూగన్నులు గలవాడైనను, కుసుపులుగల కండ్లుగలవాడైనను అగును.

జననలగ్నమునకు ద్వితీయభావమున సూర్యుడుండగా జనించినవాడు అధికముగ ధనముగలవాడును, రాజులచేత మోసమున తీసికొనబడిన ధనముగలవాడును, ముఖరోగియు నగును. ఈ విషయమున స్వల్పధనుడగుననియు, ఆ ధనముగూడ రాజులచేత నపహరింపబడుననుచు నూహించి ధనసౌఖ్య హీనుడగునని కొందరు వచించుచున్నారు.

## సూర్యుడు జననలగ్నమునకు తృతీయ చతుర్థ పంచమ షష్ఠస్థానములయందుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. మతివిక్రమవాన్ తృతీయగేర్కే విసుఖః పీడిత మానస శ్చతుర్థే
అసుతో ధనవర్జిత స్త్రికోణేబలవాం శ్చత్రు జితశ్చ శత్రుయాతే. 2

టీ. అర్కే = సూర్యుండు, తృతీయగే = తృతీయమందుండఁగాఁ బుట్టినవాఁడు, మతివిక్రమవాన్ = బుద్ధిశాలియును పరాక్రమశాలి యునగును, చతుర్థే = చతుర్థమందు రవియుండఁగా, విసుఖః = సుఖములేనివాఁడును, పీడితమానసః = మనశ్చింతగలవాఁడు నగును. త్రికోణే = పంచమమందు రవియుండఁగా, అసుతః = పుత్రులులేనివాఁడును, ధనవర్జితః = దరిద్రుడునగును, శత్రుయాతే = షష్ఠస్థానమందు రవియుండఁగా, బలవాన్ = బలిశాలియును, శత్రుజితః = శత్రుపరాజయము గలవాఁడును అగును

తా. సూర్యుడు తృతీయభావమున నుండగా బుట్టినవాడు బుద్ధిశాలియు, శౌర్యము గలవాడును అగును.

కేంద్రస్థానమగు చతుర్థభావమున సూర్యుడుండగా జనించినవాడు సౌఖ్యహీనుడును మనోదుఃఖము గలవాడును అగును.

త్రికోణమును పుత్రభావమునగు పంచమస్థానమున రవియుండగా జనించినవాఁడు పుత్రులు లేనివాడును ధనహీనుడును అగును.

సూర్యుడు లగ్నమునకు షష్ఠమయింట నుండగా జనించినవాడు బలియుండును, శత్రువులచేత జయింపబడువాడును అగును.

ఈవిషయమున కొందరు సత్యాచార్య వచనమగు "షష్ఠేరి రోగశోకఘ్నః." అను దాని ననుసరించి "బలవాన్ష ష్టరిపుక్ష శత్రుయాతే" అని వచించుచున్నారు. ఈ గ్రంథకర్త యగు వరాహమిహిరాచార్యులు పూర్వ శాస్త్రజ్ఞుల మతానుసారముగను ముఖ్యముగా యవనాచార్యుల మతానుసారముగను చెప్పినట్లు నూహింపదగియున్నది.

## సూర్యుడు సప్తమాష్టమ నవమ దశ మైకాదశ ద్వాదశములయం దుండగా జాతకులకు గలుగు ఫలములు.

శ్లో. స్త్రీభిర్గతః పరిభవం మదగే పతంగే
స్వల్పాత్మజో నిధనగే వికలేక్షణ శ్చ
ధర్మే సుతార్థ సుఖభాక్ సుఖశౌర్యభాక్ఖే
లాభే ప్రభూత ధనవాన్ పతితస్తు రిఃఫే. 3

టీ. పతంగే = సూర్యుఁడు, మదగే = సప్తమమందుండఁగాఁ బుట్టినవాఁడు, స్త్రీభిః= స్త్రీలచేత, పరిభవం = అవమానమును, గతః = పొందును, నిధనగే = అష్టమమం దుండెనేని, స్వల్పాత్మజః = స్వల్పపుత్రులు గలవాఁడును, వికలేక్షణశ్చ = దృష్టిహీనుండగును. ధర్మే = నవమమందుండెనేని, సుతార్థసుఖభాక్ = పుత్ర ధన సుఖములు గలవాఁడును. ఖే = దశమమం దుండెనేని, సుఖశౌర్యభాక్ = సుఖమును బలమును గలవాడగును. లాభే = ఏకాదశమం దుండెనేని, ప్రభూతధనవాన్ = మిక్కిలి ధనికుఁడగును రిఃఫే = ద్వాదశమందుండెనేని, పతితః = స్వధర్మ భ్రష్టుఁడగును.

తా. సూర్యుడు లగ్నమునకు సప్తమస్థానమున నుండగా బుట్టినవాడు వనితాజనముచే దిరస్కరింపబడు వాడగును. అష్టమస్థానమున నుండునెడల స్వల్పసంతానము గలవాడును, దృష్టిహీనుడును, అగును. యీ విషయమున ఎల్లప్పుడును మందదృష్టిగలవాడని కొందరును కొంతకాలము చక్కని చూపుగలిగి యుండి మధ్యకాలమున వ్యాధిచేతనైనను, గాయముచేతనైనను దృగ్విహీనత గలుగునని కొందరును అభిప్రాయపడుచున్నారు.— నవమమున నుండు నెడల పుత్ర సంపద ధనాతిశయము గలిగి సౌఖ్యము ననుభవించువాడగును. దశమమునను

డు నెడల సుఖియూ, బలముగలవాడును అగును. ఏకాదశమమున నుండునెడల అధికముగా చేరిక ధనముగలవాడగును. ద్వాదశమున నుండునెడల ధనమును బోగొట్టుకొన్నవాడును, న్యాయప్రవర్తన లేనివాడును, స్వకులమునుండి వెలువరింపబడినవాడును అగును.

## చంద్రచారము.

చంద్రుకు లగ్నాది షష్ఠస్థానములయం దుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. మూకోన్మత్త జడాంధ హీన బధిర ప్రేష్యాశ్శశాంకోదయే
స్వర్క్షాజోచ్చగతే ధనీ బహుసుత స్సస్వః కుటుంబీ ధనే
హింస్రో భ్రాతృగతే సుఖేస తనయే తత్ప్రోక్త భావాన్వితో
నైకారి ర్మృదు కాయవహ్ని మదన స్తీక్ష్ణోలసశ్చారిగే. 4

టీ. శశాంకోదయే = చంద్రుండు లగ్నమందుండఁగాఁ బుట్టినవాఁడు, మూక = మూగవాఁడైనను, ఉన్మత్త = పిచ్చివాఁడైనను, జడ = మూఢుఁడైనను, అంధ = గ్రుడ్డివాఁడైనను, హీన = నీచకృత్యములు సేయువాఁడైనను, బధిర = చెవిటివాఁడైనను, ప్రేష్య = పరిచారకుఁడైనను అగును. స్వర్క్ష = కర్కాటకము లగ్నమై అందు చంద్రుడుండెనేని, ధనీ = ధనికుడగును, అజ = మేషములగ్నమై అందు చంద్రుడుండెనేని, బహుసుతః = అనేక పుత్రులుగలవాఁడగును, ఉచ్చగతే = చంద్రునికి ఉచ్చమైన వృషభములగ్నమై అందు చంద్రుండుండెనేని. సస్వః = ధనసహితుఁడగును, ధనే = లగ్నమునకు ద్వితీయమందు చంద్రుఁడుండెనేని, కుటుంబీ = పుత్రపౌత్రాద్యనేక కుటుంబములు గలవాఁడగును, భ్రాతృగతే = తృతీయమందుఁ చంద్రుండుండెనేని, హింస్రః = ప్రాణిహింసకుఁడగును, సుఖేసతనయే = చతుర్థ పంచమములయందు చంద్రుఁడుండెనేని, తత్ప్రోక్తభావాన్వితః = ఆ చతుర్థ పంచమములకుం జెప్పఁబడిన సుఖపుత్త్రాది భావములతోఁ గూడినవాఁడగును, అరిగే = షష్ఠస్థానమందు చంద్రుఁడుండెనేని, నైకారిః = మిక్కిలి శత్రులుగలవాఁడును, మృదుకాయః = సుకుమార శరీరుండును, మృదువహ్నిః = అల్పమైన దీపనాగ్ని గలవాఁడును, మృదుమదనః = అల్పమైన కామక్రీడలు గలవాఁడును, తీక్ష్ణః = క్రూరస్వభావుఁడును, అలసః = పనులయం దాలస్యము గలవాఁడును అగును.

తా. చంద్రుడు తనుభావ మగు జననలగ్నమున నుండగా జనించినవాడు మూఢుడైనను, పిచ్చిబట్టినవాఁడైనను, చెవిటివాడైనను, గ్రుడ్డివాడైనను, ఇతరుల కార్యములను జేయువాడైనను, అగును

మేష వృషభ కర్కాటక రాసులు జననలగ్నము లగునెడల పై జెప్పబడిన ఫలములు ఉక్త వ్యతిరిక్తముగ జరుగును.

స్వక్షేత్రమగు కర్కాటకము జననలగ్నమై యందు చంద్రుండునెడల జాతకుడు ధనికుడగును, మేషలగ్నమై యందు జంద్రుడుండునెడల పుత్రు లధికముగా గలవాడగును. ఉచ్చక్షేత్రమగు వృషభము జన్మలగ్నమై యందు జంద్రుకుండునెడల ధనవంతుడగును.

ఈ విషయము ననుసరించి "దాక్షిణ్యరూప ధనభోగగుణైః ప్రధాన, శ్చంద్రే కుళీర వృషభా జగతేవిలగ్నే, ఉన్మత్త నీచబధిరో వికలశ్చ మూకశ్శేషే నరోభవతి కృష్ణతనుర్విశేషాత్." అని సారావళీకారుడు వచించియున్నాడు.—

లగ్నమునకు ద్వితీయమున చంద్రుఁడుండునెడల పెండ్లాము, బిడ్డలు, బంధువులు మొదలగువారలను బోషించువాఁడు అగును. తృతీయభావమున చంద్రుఁడుండునెడల, ప్రాణులను హింసించువాడగును. చతుర్థస్థానమునం దుండునెడల చతుర్థభావమునకు జెప్పబడియుండు మాతృ సుఖజాతిగృహ బంధువృద్ధి బలవాహనాదులు గలిగిన వాఁడుగా నగును.

పంచమస్థానమునందు చంద్రుఁడుండునెడల పంచమభావమునకు జెప్పబడియుండు పుత్ర, బుద్ధి, వాగ్విజ్ఞాన, వాగ్విద్యా, సాచివ్య, పాండిత్య, కౌశల్యాదుల గలిగినవాడగును.

ఆరవ యింటియందుండునెడల శత్రువు లనేకముగ గలవాడును, కోమలశరీరుఁడును, సంపూర్ణముగ జీర్ణశక్తి లేనివాఁడును, సంభోగమం దత్యల్పతృప్తుఁడును, కోపస్వభావము గలవాఁడును, కార్యముల నాలస్యముగ చక్కబెట్టుకొనువాఁడును అగును.

## చంద్రుఁడు సప్తమాష్టమ నవమ దశమైకాదశ ద్వాదశ స్థానములందుండగా బుట్టినవారి స్వభావము.

శ్లో. ఈర్ష్యుస్తీవ్రమదో మదే బహుమతి ర్వ్యాధ్యర్దిత శ్చాష్టమే
సౌభాగ్యాత్మజ మిత్ర బంధు ధనభాక్ ధర్మస్థితే శీతగౌ
నిష్పత్తిం సము పైతి ధర్మ ధనధీ శౌర్యై ర్యుతః కర్మగే
ఖ్యాతో భావ గుణాన్వితో భవగతే క్షుద్రోంగ హీనో వ్యయే. 5

టీ. శీతగౌ = చంద్రుఁడు, మదే = సప్తమమందుండెనేని, ఈర్ష్యుః = పరులసంపద నోర్వఁజాలనివాఁడును, తీవ్రమదః=మిక్కిలి కామవికారము గలవాఁడునౌను, అష్టమే=అష్టమమందుండెనేని, బహుమతిః=చపలబుద్ధిగలవాడు, వ్యాధ్యర్దితః= రోగపీడితుఁడునౌను. ధర్మస్థితే = నవమమందుండెనేని, సౌభాగ్య = సర్వజనానురాగము, ఆత్మజ=పుత్రులు, మిత్ర=స్నేహితులు, బంధు = స్వజనులు, ధన = ధనము, భాక్ = పొందినవాఁడగును, కర్మగే = దశమమం దుండెనేని, నిష్పత్తిం = ఫలనిష్పత్తిని, సముపైతి= పొందును, ధర్మధనధీశౌర్యైః= ధర్మధన = బుద్ధి పరాక్రమములతోడ యుతః = కూడినవాఁడగును. భవగతే= ఏకాదశమం దుండెనేని, ఖ్యాతః = ప్రసిద్ధుఁడును, భావగుణాన్వితః = ఏకాదశము లాభభావము గనుక భావగుణయుక్తుఁగా లాభము ఆ లాభముతోఁ గూడినవాఁడగును. వ్యయే = ద్వాదశమందు చంద్రుఁడుండెనేని, క్షుద్రః=హింస్రస్వభావుండును, అంగహీనః=అవయవహీనుండునౌను.

తా. సప్తమస్థానమున చంద్రుఁడుండునెడల ఇతరుల భాగ్యమునకు ఓర్వజాలనివాడును, అధికమగు కామవికారము గలవాఁడును అగును.

కొందరు గ్రంథకర్తలీఫలములు చంద్రుఁడు పూర్ణుఁడగుచుండగా జరుగుననియు, క్షీణుఁడై యుండునెడల "హైన్యరుగర్దిత దేహాః కృష్ణే ధింజాయ తేశశిని" అను వచనాను

గుణ్యముగ జాతకుడు దైన్యాదులుగలవాడగునని యుజెప్పుదురు. అష్టమస్థానమున చంద్రుడుండగా బుట్టినవాడు చపలచిత్తము గలవాడును, రోగాదులచే పీడింపబడువాడును అగును ఈ విషయమునను చంద్రుడు క్షీణుడగునెడల జాతకుడు అల్పాయువు గలవాడగునని కొందరనుచున్నారు భాగ్యభావమగు నవమస్థానమున నిశాకరుడుండగా బుట్టినవాడు శ్రేష్ఠమగు యోగము గలవాడును, సుఖ ధన మతి పుత్ర కళత్ర బంధుసంపన్నుడును అగును. దశమస్థానమున చంద్రుడుండునెడల ప్రయత్నకార్యసిద్ధి నొందువాడును, ధర్మకార్యాసక్తుడును ప్రజ్ఞావంతుడును, ధనికుడును పరాక్రమము గలవాడును అగును. లాభభావమగు నేకాదశస్థానమున చంద్రుడుండునెడల జాతకుడు తద్భావానుగుణ్యమగు దుర్లభ పర్యాదాయ శివదీక్షా ధర్మ లౌకికోప చాయాదులు గలవాడుగ నుండును. ద్వాదశస్థానమున చంద్రుడుండునెడల జాతకుడు లోభియు, అధముడును, హింసకుడును, వికలాంగుడును అగును ఈవిషయమున "ద్వేష్యః పతితః క్షుద్రో నయనరుగార్దితో లసో భవేద్వికలః చంద్రే తథావ్యజాతో ద్వాదశగే నిత్య పరిభూతః." అని సారావళీకారకుడు వచించెను.

## అంగారక చారములు.

### జన్మలగ్నాది ద్వాదశ భావస్థిత అంగారక బుధులచే జాతకులకు గలుగు ఫలములు.

శ్లో. లగ్నే కుజే క్షతతమర్థన గేకదన్నో
ధర్మేఘవాన్ దినకర ప్రతి మోన్యసంస్థే
విద్వాన్ ధనీ ప్రఖల పండిత మంత్ర్య శత్రు
ధర్మజ్ఞ విశ్రుతగుణాః పరతోర్క వద్జ్ఞే. 6

టీ. కుజే = అంగారకుడు, లగ్నే = జన్మలగ్నమందుండెనేని, క్షతతనుః = గాయము దగిలిన శరీరముగలవాడగును, ధనగే = ద్వితీయమందుండెనేని, కదన్నః = కుత్సితాన్నము భుజించువాడగును, ధర్మే=నవమమందుండెనేని, అఘవాన్=పాపవంతుడగును, అన్యసంస్థే= తక్కిన స్థానములయందుండెనేని, దినకర ప్రతిమః= సూర్యునికి చెప్పబడిన ఫలముల నిచ్చును. జ్ఞే = బుధుడు, లగ్నమందుండెనేని, విద్వాన్ = పండితుడగును, ద్వితీయమందుండెనేని, ధనీ = ధనవంతుండగును, తృతీయమందుండెనేని, ప్రబలః = మిక్కిలి దుర్జనుండగును, చతుర్థమందుండెనేని, పండిత = విద్వాంసుడగును, పంచమమందుండెనేని, మంత్రి = రాజమంత్రియగును, షష్ఠమమందుండెనేని, అశత్రు = శత్రురహితుడగును, సప్తమమందుండెనేని ధర్మజ్ఞ = ధర్మసూక్ష్మము నెఱింగినవాడగును, అష్టమమందుండెనేని, విశ్రుతగుణః= విఖ్యాతగుణుండగును, పరతః=నవమ దశమైకాదశ ద్వాదశములయందుండెనేని, అర్కవత్=ఈ స్థానములయందున్న సూర్యునికి, ఏఫలములు చెప్పబడియున్నవో అవి బుధునికిం జెప్పబడినవి.

తా. జననలగ్నమున అంగారకుడుండగా జనించినవాడు గాయములంతగిలిన శరీరము గలవాడగును. మరియు నీవిషయమున "కుశరీరో౽వకేన్ద్రి." అను గ్రంథాంతరవచనము ననుసరించి శరీరాంగములయందు వక్రత్వము గల్గియుండువాడగునని కొందరు వచించుచున్నారు.

లగ్నమునకు ద్వితీయమున అంగారకుడుండునెడల జాతకుడు నీచులచేతను, కులము నుండి బహిష్కరింపబడిన వారిచేతను పెట్టబడిన అన్నమును భుజించువాడగును.

నవమోత్తర తృతీయాది స్థానములయందుండగా సూర్యునకు జెప్పబడిన ఫలములనగా తృతీయమున నుండునెడల బుద్ధిమంతుడును. పరాక్రమశాలియు, శ్రేష్ఠుడును అగును. చతుర్థస్థానమున నుండునెడల సౌఖ్యహీనుడును, పీడింపబడు మనస్సుగలవాడును అగును. పంచమస్థానమున నుండునెడల కుమారులులేనివాడును, ధనహీనుడును. మలినుడును అగును. ఆరవయింటియందుండునెడల బలవంతుడును శత్రువుల జయించువాడును. అగును. సప్తమస్థానమున నుండునెడల వనితాజనతిరస్కారుడును, రోగపీడితుడును, అపమార్గ ప్రవర్తనుడును అగును. అష్టమస్థానమున నుండునెడల స్వల్పసంతానము గలవాడును చూపు తక్కువ గలవాడును అగును. మరియు "నీచకర్మకర్తాచ నిధనస్థే క్షితితనయే." అను గ్రంథాంతర వచనానుగుణ్యముగ నీచకార్యముల చేయుటయందు ముఖ్యమైనవాడు నగునని కొందరనుచున్నారు. నవమమున నుండునెడల పాపియగును. దశమస్థానమున నుండునెడల బలియుడును, సౌఖ్యవంతుడును అగును. ఏకాదశ స్థానమున నుండునెడల సంపదచెడినవాడును, పాపియు నగును. మరియు నయన వికారియు, రౌద్రస్వరూపియునగు ననుచున్నారు.

## బుధచార ఫలములు.

బుధుడు జన్మలగ్నమున నుండునెడల జాతకుడు విద్వాంసుడగును. లగ్నద్వితీయముల నుండునెడల ధనికుడగును. లగ్నతృతీయమున నుండునెడల దుర్మార్గుడును, నీచకార్యములందాసక్తిగలవాడును అగును. లగ్నచతుర్థమున నుండునెడల పండితుడగును. లగ్న పంచమస్థానమున నుండునెడల మంత్రిత్వముచే జీవించువాడగును. లగ్నషష్ఠస్థానమున నుండునెడల శత్రువులు లేనివాడగును. లగ్న సప్తమమున నుండునెడల సమయానుకూలమగు యోచనాశక్తియు న్యాయవిచక్షణయు గలవాడగును. మరియు గ్రంథాంతర వచనముల ననుసరించు సుందరవదనయు ధనవంతురాలును, ప్రజ్ఞావతియు నగు భార్యనుగలవాడగుననియు జెప్పుదురు. లగ్నాష్టమస్థానమున నుండునెడల గొప్ప ఖ్యాతిగలవాడగును. లగ్నమునకు నవమస్థానమున నుండునెడల పుత్రమిత్ర కళత్రాది బాంధవసముదాయమును ధనాధులను గలిగి సౌఖ్యము ననుభవించువాడగును. లగ్నమునకు దశమస్థానమున నుండునెడల సౌఖ్యవంతుడగును. లగ్నమునకు ఏకాదశస్థానమున నుండునెడల ధన మధికముగాగలవాడగును. లగ్నమునకు ద్వాదశస్థానమున నుండునెడల ధనబాలహీనుడై యుండగును. మరియు ఘాతకుడగునందురు.

## గురుచార ఫలములు.

లగ్నాది ద్వాదశ భావస్థిత బృహస్పతివలన గలుగు ఫలములు.

శ్లో. విద్వాన్ సువాక్యః కృపణ స్సుఖీచ ధీమానశత్రుః పితృతోధికశ్చ
నీచ స్తపస్వీ సధన స్సలాభః ఖలశ్చ జీవే క్రమశో విలగ్నాత్. 7

టీ. జీవే = బృహస్పతి, విలగ్నాత్ = జన్మలగ్నము మొదలుకొని ద్వాదశస్థానములయం దుండఁగా, క్రమశః = క్రమముగా, విద్వాన్ = పండితుడును, సువాక్యః = మంచి వాక్పటుత్వము గలవాఁడగును, కృపణః=లోభియును, సుఖీ = సుఖవంతుఁడును. ధీమాన్ = బుద్ధిశాలిగను, అశత్రుః = శత్రువులు లేనివాడును, పితృతోధికః = తండ్రికంటె మంచిగుణములు గలవాడును, నీచః = నీచుడును, తపస్వీ = తాపసుండును, సధనః=ధనవంతుడును, సలాభః= లాభయుక్తుండును. ఖలః = నీచుడును అగును.

తా. బృహస్పతి జననలగ్నమున నుండునెడల పండితుండగును. ద్వితీయభావమున నుండునెడల వాక్చాతుర్యము గలవాడగును. తృతీయభావమున నుండునెడల లోభియగును. చతుర్థభావమున నుండునెడల సుఖియగును. పంచమభావమున నుండునెడల ప్రజ్ఞావంతుడగును. షష్టమభావమం దుండునెడల శత్రువులు లేనివాడగును. సప్తమభావమం దుండునెడల తండ్రికన్నను మేలైనవాడును కీర్తికెక్కినవాడును నగును, మరియు వాక్చాతురత సుందరశరీరకాంతి ఔదార్యము మొదలగునవి గలవాడగును. అష్టమభావమం దుండునెడల నీచకార్యాతురు డగును. నవమభావమునం దుండునెడల తపస్సుసేయువాడగును, మరియు విద్వాంసుడును, సౌందర్యనాయకుడును, ప్రధానుడును అగునని నూహింపదగియున్నది. దశమభావమునం దుండునెడల ధనయుతుడగును, మరియు సుఖ ధర్మ జనవాహన యశస్సులను గలిగినవాడగును. ఏకాదశభావమున నుండునెడల తద్భావకారక మగు లాభముతో గూడినవాడగును. ద్వాదశభావమున నుండునెడల దుర్మార్గుడును కులమునుండి వెలువరింపబడినవాడును అగును.

## శుక్రచార ఫలములు.

లగ్నాది ద్వాదశ భావములందుండు శుక్రునిచే జాతకునకుగలుగు ఫలములు.

శ్లో. స్మర నిపుణ స్సుఖితశ్చ విలగ్నే ప్రియకలహోస్తగతే సురతేప్సుః
తనయగతే సుఖితో భృగుపుత్రే గురువదతోన్యగృహే సధనోంత్యే.

టీ. భృగుపుత్రే = శుక్రుఁడు, విలగ్నే = జన్మలగ్నమందుండెనేని, స్మరనిపుణః = కామతంత్రకుశలుండును, సుఖితః = సుఖవంతుడును, అస్తగతే = సప్తమమందుండెనేని, ప్రియకలహః = కలహప్రియుండును, సురతేప్సుః = కామక్రీడాభిలాషియును, తనయగతే= పంచమమందుండెనేని, సుఖితః=సుఖవంతుడును, అతోన్యగృహే, ఈ చెప్పిన స్థానత్రయ

ము గాక తక్కిన స్థానములయందు శుక్రుడుండెనేని, గురువత్ = బృహస్పతికిం జెప్పఁబడిన ఫలములే చెప్పఁదగినవి. అంత్యే = ఏస్థానమందయిన మీనమందు శుక్రుండుండెనేని, సధనః = ధనసహితుఁడగును, స్థానోక్తఫలముగాదు కొందఱు, అంత్యే = ద్వాదశస్థానమందు శుక్రుండుండెనేని, సధనః = ధనసహితుండగు నని చెప్పుదురు. (కొందఱు గురువదతో ద్యుమగే ద్రవిణీస్యాత్ అని పఠింతురు.)

తా. శుక్రుడు జననలగ్నమునం దుండునెడల మదనానురాగ జనకంబులగు పుష్ప గంధ తాంబూలాభ్యంజన, గాన, సాహిత్య, సరస, సల్లాప, కవిత్వ, సంతోషాదులయం దతి ప్రీతిగలవాడును కామక్రీడలయం దతి శీలత జూపువాడును నగును. ద్వితీయమున నుండు నెడల వాక్చాతుర్యముగలవాడగును. తృతీయమున నుండునెడల లోభియు నికృష్టుడును నగును. చతుర్థమున నుండునెడల సౌఖ్యము ననుభవించువాడగును. పంచమమున నుండునెడల సుఖియగును. షష్ఠమమున నుండునెడల శత్రువులం లేనివాడగును. సప్తమమున నుండునెడల కలహప్రియుడును సంభోగాసక్తుండును అగును. అష్టమమున నుండునెడల నీచకార్యములు చేయువాడగును. నవమమున నుండునెడల తపముచే రూఢుండును కనికరము గలవాడును అగును. దశమమున నుండునెడల ధనముగలవాడగును. ఏకాదశమున నుండునెడల లాభయుక్తుడగును. ద్వాదశమున నుండునెడల దుర్మార్గుడును కులభ్రష్టుడును అగును.

—శనిచార ఫలములు.—

## లగ్నాది ద్వాదశభావస్థిత శనైశ్చరునిచే జాతకునకు గలుగు ఫలములు.

శ్లో. అదృష్టార్థో రోగీ మదనవశగోత్యంతమలినః
శిశుత్వే పీడార్తస్సవితృసుతలగ్నే త్వలసవాక్
గురుస్వోచ్చస్థే నృపతిసదృశో గ్రామపురపః
సువిద్వాం శ్చార్వంగో దినకరసమోన్యత్ర కథితః. 9

టీ. సవితృసుతలగ్నే = శనైశ్చరుఁడు లగ్నమందుండెనేని, అదృష్టార్థః = నిత్యదరిద్రుడును, రోగీ = వ్యాధిగలవాఁడును, మదనవశగః = మన్మథపరతంత్రుఁడును, అత్యంతమలినః = మిక్కిలి మలినుఁడును, శిశుత్వే = బాల్యమందు, పీడార్తః = వ్యాధ్యాదిపీడితుండును. అత్యలసవాక్ = మిక్కిలి అవ్యక్తభాషియునగును, తులాధనుర్మకర కుంభ మీనములలో నొకటి లగ్నమయ్యేనేని విశేషఫలమును జెప్పుచున్నాడు. గురుస్వోచ్చస్థే = ఈధనుర్మీన మకర కుంభ ములలో నొకటి లగ్నమై అందు శనియుండెనేని, నృపతిసదృశః = రాజతుల్యుఁడగును. గ్రామపురపః = గ్రామములకును పట్టణములకును అధిపతియు, సువిద్వాన్ = మంచి పండితుఁడును, చార్వంగః = సుందరాంగుడును అగును. అన్యత్ర = ద్వితీయాది స్థానములయందున్న శనైశ్చరుఁడు, దినకరసమః = ఈ స్థానములయందున్న సూర్యుం డేఫలముల నిచ్చునని, కథితః = చెప్పఁబడెను.

**తా.** శనైశ్చరుడు జననలగ్నమున నుండునెడల జాతకుడు దరిద్రుడును, రోగియు మదన పీడితుడును, దోషయుక్తుడును, బాల్యమునందు రోగముచే పీడింపబడువాడును, మందుడును, సోమరియునగును. ఈఫలములు స్వక్షేత్రములగు మకరకుంభములును, గురుక్షేత్రములగు ధనుర్మీనములును, శనైశ్చరుని ఉచ్చస్థానమగు తులారాశియుగాక తక్కిన రాశులు జననలగ్నము లగునపుడు మాత్రమే జరుగును.

తులా మకర కుంభ ధనుర్మీన రాశులలో నేదైన నొకరాశి జన్మలగ్న మగునపుడు యందు శనైశ్చరుడుండు నెడల జాతకుడు రాజసమానుడును, గ్రామాధికారైనను, పట్టణనాయకుడైనను అగును. మరియు మంచి విద్వాంసుడును, సుందరావయవములు గలవాడును అగును. ఈవిషయమునకు సారావళీ కారకుడు "స్వోచ్చస్వకీయ భవనే క్షితిపాలతుల్యో లగ్నేర్కజే భవతి దేశపురాధినాథః శేషేషు దుఃఖగద పీడిత ఏకబాల్యే దారిద్ర్య కామ వశగో మలినో౽లసశ్చ" అని వచించి యుండుటచేతను. గ్రంథాంతర వచనములన్ను సారావళి ననుసరించియే యుండుటవలన గురుక్షేత్ర స్థితుడై శనైశ్చరుడుండి యాక్షేత్రములు లగ్నము లగునపుడు యిందు చెప్పబడిన ఫలములు గలుగ జాలవని నూహింపవలసి యున్నది.

ద్వితీయాది భావములయందు శనైశ్చరుడుండు నెడల తద్భావములయందు సూర్యుడుండగా జాతకున కేఫలములుగలుగునో యాఫలములు జరుగుననగా, శనైశ్చరుడు ద్వితీయమున నుండునెడల రాజులచేత నుపహరింపబడిన ఐశ్వర్యమును, సుఖరోగియును తృతీయమున నుండు నెడల పరాక్రమశాలియును చతుర్థమున నుండు నెడల, అసౌఖ్యము, మనశ్చింత గలవాడునగును. పంచమమున నుండునెడల కుమారులులేనివాడును, అదృష్టార్థుడును, షష్ఠమమునను నుండునెడల, బలవంతుడును సప్తమమున నుండునెడల వనితాజనములచే తిరస్కరింపబడువాడును, అష్టమమున నుండునెడల స్వల్పసంతానము గలవాడును, నవమమునను నుండునెడల ధనాఢ్యుడై పుత్రాది సంపదలతో సుఖముగా నుండువాడును, దశమమున నుండునెడల బలాన్వితుండును, ఏకాదశమునను నుండు నెడల ధనాధిపుడును, ద్వాదశమున నుండునెడల, కులభ్రష్టుడును ధనహీనుడును అగును.

## తన్వాది భావస్థిత సర్వగ్రహ ఫలవిశేషములు.

శ్లో. సుహృ దరి పరకీయ స్వర్క్ష తుంగ స్థితానాం
ఫల మను పరిచింత్యం లగ్న దేహాది భావైః
సముపచయ విపత్తీ సౌమ్య పాపేషు సత్యః
కథయతి విపరీతం రిఃఫషష్ఠాష్టమేషు.    10

**టీ.** లగ్న దేహాది భావైః=లగ్నమును దేహముగా కల్పించి, సుహృదరి పరకీయ స్వర్క్ష తుంగస్థితానాం = మిత్రక్షేత్ర శత్రుక్షేత్ర పరక్షేత్ర స్వక్షేత్ర స్వోచ్చముల యందున్న

గ్రహములయొక్క, ఫలం=ఫలము, అనుపరిచింత్యం = పర్యాలోచింపఁ దగినది, సత్యః=సత్యా చార్యుడు, సౌమ్యపాపగ్రహేషు=శుభాశుభ గ్రహములయందు, సముపచయవిపత్తీ=తన్వాది భావముల వృద్ధిహానులను, కథయతి=చెప్పును. మరియు, రిఃఫషష్ఠాష్టమేషు=ద్వాదశ షష్ఠాష్టమ ములు, విపరీతం=ఈచెప్పఁబడినదానికి వ్యత్యాసముగా, కథయతి=సత్యాచార్యుండు చెప్పెను.

తా. ఈ గ్రంథమున ప్రథమాధ్యాయమగు సంజ్ఞాధ్యాయమున ద్వాదశ రాశులకు జెప్పబడియుండు "హోరాదయ స్తను కుటుంబసహోత్థబంధు పుత్రారి పత్నీ మరణాని శుభాస్ప గాయాః" అను శ్లోకమూలకముగ నేర్పడు తన్వాది భావములను గల్పించుకొని తద్భావస్థిత గ్రహముల కాభావస్థానముల, మిత్రశత్రు, పరస్వక్షేత్ర స్వోచ్చాద్యాది భేదము లెరింగి తదను గుణ్యముగ ఫలితములు బాగుగ రూలోచించి చెప్పవలయును. మిత్రాదిక్షేత్రములు నీచాదిక్షే త్రముల కుపలక్షణముగాన నీచక్షేత్ర మూలత్రికోణముల గ్రహింపదగినది. అనగా శుభగ్ర హమైనను అశుభగ్రహమైనను నీచ, శత్రు, పాప, క్షేత్రములలో నెద్దానియందైన నుండు నెడల తత్క్షేత్రాను గుణ్యాభావ ఫలములు జరుగనేరవు పరక్షేత్రమునందుండు నెడల తద్భా వఫలములు మధ్యమముగ జరుగును. స్వక్షేత్ర మూలత్రికోణ స్వోచ్చ, మిత్రక్షేత్రముల యందుండు నెడల తదనుగుణ్యములగు భావ ఫలములన్నియు జరుగును.

ఈవిషయమునకు "నీచర్క్ష రిపుగేహస్థో గ్రహోభావ వినాశకృత్ ఉదాసీన గృహే మధ్యోమిత్రర్క్షః స్వత్రికోణగః స్వోచ్చగశ్చ గ్రహోవశ్యం భావవృద్ధి కరఃస్మృతః" అని గార్గివచనము గానబడుచున్నది. అయినను సారావళీ కారకుడు "పాపావిఘ్నంతి మూర్త్యాదీ న్భావాన్ పుష్ణంతి శోభనాః, విపరీతం రిపూగంధ్రిర్వ్యయేషు సదసత్ఫలం" అని వచించియుం డుటచే తన్వాది భావములయందు పాపగ్రహము యుండునెడల ఆభావములను నశింపజేయు ను, శుభగ్రహము లుండునెడల ఆభావములను వృద్ధిజేయును, షష్ఠాష్టమ వ్యయభావముల యందు పాపగ్రహము లుండునెడల భావఫలములు అభివృద్ధిగ జరుగును. సౌమ్యగ్రహము లుండునెడల తద్భావఫలములకు హానిగల్గును అనుభావము ఏర్పడుచున్నది సత్యాచార్యుల వారు "సౌమ్యాః పుష్టింపాపా స్తద్ధానిం సంశ్రితాగ్రహాః కుర్యుః, మూర్త్యాదిషు నిధనేంత్యే షష్ఠేచవిపర్యయాత్ఫలదాః" అని వచించి యుండుటచేతను బృహజ్జాతక కారకునియభిప్రా యమునకు వ్యతిరిక్తముగ నేర్పడుచున్నది గాన పర్యాలోచింపదగినది.

## —◇— ఉచ్చాది స్థానస్థిత గ్రహఫలముల పరిమాణము. —◇—

శ్లో. ఉచ్చత్రికోణ స్వ సుహృచ్ఛత్రు నీచగృహా స్తగైః
శుభ సంపూర్ణ పాదోన దళ పాదాల్ప నిష్ఫలమ్. 11

టీ. ఉచ్చత్రికోణస్వసుహృచ్ఛత్రునీచగృహా స్తగైః - ఉచ్చ = ఉచ్చస్థానమందును, త్రికోణ = మూలత్రికోణమందును, స్వ = స్వక్షేత్రమందును, సుహృత్ = మిత్రక్షేత్ర మందును, శత్రు = శత్రుక్షేత్రమందు, నీచగృహ = నీచక్షేత్రమందున్నట్టియు, అస్త

గ్రైః = అస్తమించి యున్నట్టి గ్రహములచేత, శుభం = శుభఫలము (క్రమముగా), సంపూర్ణ పాదోన దళ పాదాల్ప నిష్ఫలం - సంపూర్ణ = పూర్ణముగాను, పాదోన = ముప్పాతిక భాగముగాను, దళ = అర్ధభాగముగాను. పాద = పాతికపాలుగాను, అల్ప = పాతికకంటే తక్కువగాను, నిష్ఫలం = శూన్యముగాను నీయఁబడును.

తా. ఉచ్చాదిస్థానస్థితి గ్రహఫలముల పరిమాణము గ్రహములు ఉచ్చస్థానమునందుండు నెడల ఆగ్రహస్థితభావానుగుణ్యమగు శుభఫలము సంపూర్తిగ జరుగును. మూలత్రికోణమున నుండునెడల తద్భావానుగుణ్యమగు శుభఫలము ముప్పాతిక భాగముజరుగును. స్వక్షేత్ర మునందుండునెడల తద్భావానుగుణ్యమగు శుభఫలము అర్ధభాగము జరుగును మిత్రక్షేత్ర మునందుండునెడల ఆభావమునసుసరించిన శుభఫలము పాతికపాలుజరుగును. శత్రుక్షేత్రము నందుండునెడల ఆభావమునకు జెప్పబడియుండు శుభఫలము పరకభాగము జరుగును. నీచక్షేత్రమునందుండునెడలను అస్తంగతదోషముండినను ఏఫలమును కొంచెముగూడజరుగ జాలదు. అశుభఫలములు ఉక్తవ్యతిరిక్తముగ నూహింపవలెననగా గ్రహము అస్తంగతదోషయుక్త మైనను, నీచస్థానమునందుండనెడలను తద్భావానుగుణ్యమగు అశుభఫలము సంపూర్ణముగ జరుగును శత్రుక్షేత్రమునందుండునెడల తద్భావానుగుణ్యమగు అశుభఫలము ముప్పాతిక భాగము జరుగును, మిత్రక్షేత్రమునందుండునెడల ఆభావమునసుసరించిన అశుభఫలము అర్ధ భాగముజరుగును స్వక్షేత్రమునందునెడల అశుభఫలము పాతికభాగము జరుగును. మూల త్రికోణమునందుండునెడల ఆభావానుగుణ్యమగు అశుభఫలము పరకభాగము మాత్రము జరుగును ఉచ్చస్థానమునందుండునెడల తద్భావానుగుణ్యమగు అశుభఫలమేమాత్రమును జరుగదు ఈవిధమున జననకాలంబున గ్రహస్థితస్థానభేదంబును గ్రహస్థితియు గ్రహబలా బలమును యోచించి ఫలములజెప్పదగినది. మరియు "తత్కాలం బలయుక్తోభవతి యది దశా ధిపస్తస్య శుభమశుభం వాపి ఫలంవక్తవ్యం నిత్యమేవ పరిపూర్ణం" అని చెప్పబడియుండు టచే దశాదికాలములయందు శుభాశుభఫలములను బలివద్గ్రహములు అధికముగా నిచ్చునని నూహింపదగియున్నది. గాన గ్రహబలాబలములను యోచించి భావఫలముల జెప్పదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

భావఫలాధ్యాయ నామక

ఏకోనవింశోధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ఆశ్రయయోగాధ్యాయము. వింశోధ్యాయము.—20.



### స్వక్షేత్రాశ్రితగ్రహములయొక్కయు, మిత్రక్షేత్రాశ్రితగ్రహములయొక్కయు, ఫలములు.

గ్రహములు స్వక్షేత్రాశ్రితములగుచుండగా జాతకునకు గలుగుఫలములు.

శ్లో. కులసమ కులముఖ్య బంధుపూజ్యా
ధని సుఖి భోగి నృపా స్స్వభైకవృద్ధ్యా
పరవిభవ సుహృ త్స్వబంధు పోష్యా
గణప బలేశ నృపాశ్చ మిత్రభేషు. 1

టీ. స్వభైకవృద్ధ్యా=స్వక్షేత్రగందున్న గ్రహములయొక్క యేకో త్తరవృద్ధిచేత పుట్టినజాతకుడు క్రమముగా, కులసమ కులముఖ్యబంధుపూజ్యాః=కులసమ స్వకులస్థులతో సమానుండగును, కులముఖ్యః=స్వకులముఖ్యుండగును, బంధుపూజ్యః=బంధుపూజ్యుండగును, ధని=ధనవంతుడగును, సుఖి = సుఖవంతుడగును, భోగి=భోగముగలవాఁడగును, నృపాః=నృపాలుఁడగును, మిత్రభేషు=మిత్రక్షేత్రములయందు క్రమముగా, పరవిభవపోష్య=పరాధీనజీవనుఁడును, సుహృత్పోష్య=స్నేహితులచేత పోషింపఁదగినవాఁడును, స్వపోష్య=జ్ఞాతలచే పోషింపఁదగినవాడును, బంధుపోష్యాః = బంధువులచేతపోషింపఁదగినవాడును, గణప = సమాజాధిపతియును, బలేశ = సేనాధిపతియును, నృపాశ్చ=రాజునుఅగును.

తా. జననకాలమున ఒకగ్రహము స్వక్షేత్రమునందుండు నెడల జాతకుడు స్వజాతివారితో సమానుడగును. రెండు గ్రహములుండు నెడల కులపెద్దయగును మూడు గ్రహములుండు నెడల బంధువులచే పూజింపబడువాడగును. నాలుగు గ్రహములుండు నెడల ధనికుడగును ఐదు గ్రహములుండు నెడల సౌఖ్యముగలవాడగును. ఆరు గ్రహము లుండు నెడల అనుభవశాలియైనను సుఖవాసియైనను అగును, ఏడు గ్రహములుండు నెడల నరపాలుడగును.

## గ్రహములుమిత్రక్షేత్రాశ్రితములగుచుండగా జాతకునకు కలుగు ఫలములు.

జననకాలమున ఒకగ్రహము మిత్రక్షేత్రమున నుండునెడల జాతకుడు ఇతరుల ధనముచే జీవనముచేయు వాడగును. రెండు గ్రహములుండునెడల మిత్రులచే పోషింపబడు వాడగును. మూడు గ్రహములుండునెడల దాయాదులచే పోషింపబడువాడగును. నాలుగు గ్రహములుండునెడల బంధువర్గముచే గాపాడబడువాడగును. అయిదు గ్రహములుండునెడల సమాజమునకైనను, జాతికైనను అధిపతియగును. ఆరు గ్రహములుండునెడల సేనాధిపతి యగును. ఏడు గ్రహములుండునెడల రాజగును.

### ఉచ్ఛస్థానస్థిత గ్రహము మిత్ర గ్రహముచే జూడబడుచుండగా కలుగుఫలములును.

శ్లో. జనయతి నృప మేకోప్యుచ్ఛగో మిత్ర దృష్టః
ప్రచురధనసమేతం మిత్రయోగాచ్చ సిద్ధం
విధన విసుఖ మూఢ వ్యాధితా బంధ తప్తా
వధదురిత సమేతా శ్శత్రు నీచర్క్ష గేషు. 2

టీ. ఏకోపి= ఒకగ్రహమైనను, ఉచ్చగతః= ఉచ్ఛస్థానమందున్నదై, మిత్రదృష్టః= మిత్రగ్రహముచేత చూడఁబడెనేని, నృపం = రాజును, జనయతి = పుట్టించును. ఆఉచ్ఛగత మైన ఒకగ్రహము, మిత్రయోగాత్ = మిత్రగ్రహముతోఁగూడుటవలన, ప్రచుర ధన సమేతం=సంపూర్ణధనసమేతునిని, సిద్ధం=సర్వజనపూజ్యునిని, జనయతి = పుట్టించును. సిద్ధం= నిశ్చయమనికొందఱు, శత్రునీచర్క్షగేషు = శత్రు క్షేత్రమందుగాని నీచక్షేత్రమందుగాని, 1 గ్రహముండెనేని, పుట్టినవాఁడు. విధన = దరిద్రుఁడగును, 2 ఉండెనేని, విసుఖ = సుఖ హీనుండగును, 3 ఉండెనేని, మూఢ = మూర్ఖుండగును, 4 ఉండెనేని, వ్యాధిత = వ్యాధి పీడితుండగును, 5 ఉండెనేని, బంధతప్త= బంధనప్రాప్తిచేత పరితప్తుండగును, బంధుతప్తుండ గునని కొందఱు, 6 ఉండెనేని, వధసమేత = ప్రాణిహింసతోఁగూడిన వాఁడగును, 7 ఉండె నేని, దురితసమేత = పాపములతోఁగూడిన వాఁడగును.

తా. నీచ, శత్రుస్థానస్థితి గ్రహఫలములును, ఉచ్ఛస్థానమున గ్రహముండి మిత్రదృ ష్టిగల్గియుండునెడల తత్కాలమున జనించినవాడు రాజగును మరియు ఉచ్ఛస్థానమునం దుండు గ్రహము మిత్రగ్రహయుక్తుడై యుండునెడల జాతకుడు ధనాధికుడును, సర్వజన మాన్యుడుగు అగును.

### నీచ, శత్రుక్షేత్ర స్థిత గ్రహ ఫలములు.

శత్రుక్షేత్రమునకైనను, నీచక్షేత్రమునకైనను, ఒకగ్రహముండగా జనించినవాడు శృంగారనాయక సచివుడైనను ధనహీనుడైనను అగును రెండు గ్రహములుండునెడల కు

హీనుడగును. మూడు గ్రహములందు నెడల అవివేకము గలవాడగును, నాలుగు గ్రహములందు నెడల శోకముచే పీడింపబడువాడగును. ఐదు గ్రహములందు నెడల చెఱసాలయందుంచబడి తపించువాడైనను, సర్వదా చిక్కులుగల వ్యవహారములయందు అల్లాడువాడైనను అగును. ఆరు గ్రహములందు నెడల జీవహింసజేయువాడగును, ఏడు గ్రహములందు నెడల పాపియగును నీచస్థానములయం దేక కాలమునం దెప్పుడును సప్తగ్రహములుండవు అయినను యింతకుపూర్వము జెప్పినట్లు పూర్వశాస్త్రానుసమ్మతముగ నిందును ఏడు గ్రహములు నీచమందుండగా గలుగుఫలమట్టిదని జెప్పబడెను.

## కుంభలగ్నజాతకునకు గలుగు నశుభ ఫలము.

శ్లో. న కుంభలగ్నం శుభ మాహ సత్యో
న భాగభేదా ద్యవనా వదంతి
కస్యాఽంశభేదో న తథాస్తి రాశే
రతిప్రసంగ స్త్వితి విష్ణుగుప్తః. 3

టీ. సత్యః = సత్యాచార్యుండు, కుంభలగ్నం = కుంభలగ్నమును, నశుభం = శుభకరముకాదని, ఆహ = చెప్పెను, యవనాః = యవనులు, భాగభేదాత్ - కుంభద్వాదశ భాగమువలన, నశుభం = అశుభమును, వదంతి = చెప్పుదురు, విష్ణుగుప్తస్తు = విష్ణుగుప్తుడు, కస్యరాశేః = ఏరాశికి, తథా = ఆప్రకారము, అంశభేదః = కుంభద్వాదశాంశము, నాస్తి = లేదు. అతిప్రసంగ ఇతి = అతిప్రసంగమౌనని, ఆహ = చెప్పెను.

తా. "జన్మని చంద్ర శ్రేష్ఠః ప్రవదేద్గోగారి నిధనవర్జ్య స్స్యాత్ హోరావధ వేగిష్టా ద్విపదేష్వివా కుంభవర్జ్యం హి కుంభవిలగ్నే జాతో భవతి నరో దుఃఖశోకసంతప్తః" అను సత్యాచార్యవచనానుగుణ్యముగ కుంభలగ్నజాతకునకు అశుభములు జరుగునని యేర్పడుచున్నది. అయినను "సర్వస్మిన్ లగ్నగతే కుంభద్వాదశాంశకో యదా భవతి రాశౌ న తదా సుఖితః పరాన్నభోజీ భవత్పురుషః" యను నేతువచనము ననుసరించి ఏలగ్నమునందైనను కుంభద్వాదశాంశ మశుభకరంబగునని యేర్పడుచున్నది. ఇందు విమయమై సకలరాశులకును, కుంభద్వాదశాంశ ముండుటచే కుంభద్వాదశాంశ యశుభకరంబని మొత్తమునకు జెప్పుటవలన యింతదనుక సకలరాసులకును జెప్పబడియుండు ఫలములన్నియు నిష్ప్రయోజనములుగ నేర్పడునుగాన కుంభలగ్నజాతకునకే అశుభములు జరుగునుగాని ఇతరలగ్నములయందు కుంభద్వాదశాంశయందు జనించినవానికి అశుభఫలములు జరుగనేరవని విష్ణుగుప్తాచార్యుల వచించియున్నారు.

అందువిష్ణుగుప్తుడు, "కుంభద్వాదశభాగో లగ్నగతో ప్రశస్యతే యవనైః యద్యేవం సర్వేషాంలగ్నగతా నా మిష్టం ఫలం న స్యాత్ ఘటయోగా ద్రాశీనాం న హ్యేతచ్ఛాస్త్ర కారాణాంతస్మాత్కుంభ విలగ్నం జన్మ న్యశుభంన తద్భాగః" అని వచించియుండుటచే కుంభలగ్నజాతకుడు అనిష్టఫలములే యనుభవించునని యేర్పడుచున్నది. మరియు ఇతర రాశులయందు కుంభద్వాదశాంశ ఏమాత్రమును అశుభకరమైనదికాదని యేర్పడుచున్నది.

### దినేశచంద్రహోరలయందున్న గ్రహఫలములు.

శ్లో. యాతేష్వసత్స్వసమభేషు దినేశహోరాం
ఖ్యాతో మహోద్యమబలార్థయుతోఽతితేజాః
చాంద్రీం శుభేషు యుజి మార్దవకాంతిసౌఖ్య
సౌభాగ్యధీమధురవాక్యయుతః ప్రజాతః. 4

టీ. అసత్సు = పాపగ్రహములు, అసమభేషు = బేసిరాసులయందు, దినేశహోరాం = సూర్యహోరను, యాతేషుసత్సు = పొందుచుండఁగా, జాతః = పుట్టినవాఁడు, మహోద్యమబలార్థయుతః - మహోద్యమ = మహోత్సాహముండును, బలార్థయుతః = శౌర్యధనములతోఁ గూడినవాఁడును. అతితేజాః = అధికమైన తేజస్సుగలవాఁడగును, శుభేషు = శుభగ్రహములు, యుజి = సమరాశియందు, చాంద్రీం = చంద్రహోరను, యాతేషుసత్సు = పొందుచుండఁగా, ప్రజాతః = పుట్టినవాఁడు, మార్దవ = మృదుస్వభావముతోడను, కాంతి = కాంతితోడను, సౌఖ్య = సౌఖ్యముతోడను, సౌభాగ్య = సౌభాగ్యముతోడను, ధీ = మంచిబుద్ధితోడను, మధురవాక్య = ఇంపుపలుకులతోడను, యుతః = కూడినవాఁడగును.

తా. బేసిరాసులగు మేష మిధున సింహ తులా ధనుః కుంభముయందలి సూర్యహోరలయందు పాపగ్రహములుండగా జనించినవాఁడు గొప్పకార్యములు జేయుటకై ప్రయత్నము సేయువాడును, శౌర్యధనసంపత్తులుంగల వాడును, ధైర్యబలపరాక్రమములు గలవాడును, ఆతురతగలవాడును అగును. సమరాసులగు వృషభ, కటక, కన్యా, వృశ్చిక, మకర, మీనములయందలి చంద్రహోరలయందు శుభగ్రహములుండగా జనించినవాడు మృదుస్వభావము గలవాఁడును, శరీరకాంతి గలవాడును, సుఖము ననుభవించువాడును, సంపదగలవాడును, సద్గుణముగలవాడును, ఇంపుగా మాటలాడువాఁడును అగును.

### హోరాగతగ్రహఫలము.

శ్లో. తాస్వేవ హోరాస్వపరర్క్షగాసు
జ్ఞేయా నరాః పూర్వగుణేషు మధ్యాః,
వ్యత్యస్తహోరాభవనస్థితేషు
మర్త్యా భవంత్యుక్తగుణైర్విహీనాః.

టీ. తాస్వేవహోరాసు = ఆహోరలే, అపరర్క్షగాసు = ఉక్తేతరరాశి గతములౌచుండఁగా జన్మించినట్టి, నరాః = మనుష్యులు, పూర్వగుణేషు = మున్ను చెప్పఁబడిన మహోద్యమత్వాది గుణములయందు, మధ్యాః = మధ్యములగుదురని, జ్ఞేయాః = తెలియఁదగినవారు, వ్యత్యస్తహోరాభవనస్థితేషు = పూర్వము చెప్పినదానికి వ్యత్యస్తములైన హోరలయందును రాసులయందును గ్రహములుండఁగాఁ బుట్టిన, మర్త్యాః = మనుష్యులు ఉక్తగుణైః = పూర్వోక్తగుణములచేత, విహీనాః = వర్జితులు, భవంతి = అగుదురు.

తా. ఈ క్షేత్రతర రాశుల యందా హోరల యుండే యనగా సమరాశుల యందలి సూర్య హోరలయందు పాపగ్రహము లుండగా జనించినవానికి పూర్వము జెప్పబడియుండు మహో ద్యమాది శుభఫలములును విషమరాశుల యందలి చంద్రహోరలయందు శుభగ్రహములుండ గా జనించినవారికి పూర్వము చెప్పబడియుండు మార్దవాదిగుణములును, మధ్యమముగా జరు గుననియు, తెలయుదగినది.

మరియు, ఇందులకు వ్యత్యస్తముగానగు నెడల ననగా సమరాశుల యందలి చంద్ర హోరలయందు పాపగ్రహము లుండగా జనించినవారికి మహోద్యమాది గుణములును విష మరాశులయందలి సూర్యహోరలయందు శుభగ్రహము లుండగా జనించినవారికి మార్దవాది గుణములును జరుగనేరవనియు దెలియవలసినది. ఇందు గ్రహముల స్థానభేదమును గ్రహబలము ను, దృష్టిబలమును ననుసరించి ఫలముల బాహుళ్యముగ జెప్పదగును.

## ద్రేక్కాణస్థిత చంద్రఫలము.

శ్లో. కల్యాణరూపగుణ మాత్మసుహృద్దృకాణే
చంద్రో ఽన్యగస్తదధినాథగుణం కరోతి
వ్యాళోద్యతాయుధ చతుశ్చరణాండజేషు
తీక్ష్ణో ఽతిహింస్ర గురుతల్పరతాటనాశ్చ. 6

టీ. చంద్రః=చంద్రుడు, ఆత్మసుహృద్దృకాణే = స్వకీయ ద్రేక్కాణమందైనను తనతాత్కాలమిత్ర ద్రేక్కాణమందైన నుండెనేని, పుట్టినవానిని, కల్యాణరూపగుణం=శ్రేష్ఠ మైన రూపగుణములు గలవానినిగా, కరోతి=చేయును, అన్యగః = ఇతరద్రేక్కాణముల యందుండెనేని, తదధినాథగుణం=ఆద్రేక్కాణాధిపతియొక్క గుణమును. కరోతి=చేయుచు న్నాడు, వ్యాళ=సర్పద్రేక్కాణమందు చంద్రుడుండగా బుట్టినవాడు, తీక్ష్ణ=క్రూరుడగు ను, ఉద్యతాయుధ=ఆయుధ సహితద్రేక్కాణమందు చంద్రుడుండగా బుట్టినవాడు = అతిహింస్ర = మిక్కిలి ప్రాణిహింసకుండగును, చతుశ్చరణ = చతుష్పాదద్రేక్కాణమందు చంద్రుడుండగా బుట్టినవాడు, గురుతల్పగత = గురుదారసక్తుడగును, అండజేషు= పక్షి ద్రేక్కాణమందు చంద్రుడుయుండెనేని, అటనాశ్చ = తిరిగెడువాడగును.

తా. చంద్రుడు స్వకీయద్రేక్కాణమున నుండుకాలమున నైనను, తనతాత్కాలిక మిత్రద్రేక్కాణమున ననగా, తత్కాలమున చంద్రస్థిత ద్రేక్కాణాధిపతి, చంద్రునకు మిత్రుడైయుండు నెడల నైనను, జనించినవాడు సుందరుడును, సద్గుణశ్రేష్ఠుడును అగును తాత్కాలిక మిత్రద్రేక్కాణమునగాక నితరద్రేక్కాణములయందు చంద్రుడుండు నెడల ఆయాద్రేక్కాధిపతులకు చెప్పబడియుండు గుణరూపాదులు జాతకునకు గలుగునని తెలి యదగినది.

ఈ విషయమున "జనన కాలమున తాత్కాలిక మిత్రక్షేత్రమందుండు చంద్రుని జాతకునకు శుభగుణ సంపత్తును శరీరకాంతిని శ్రేష్ఠముగ గలుగజేయుననియు, సమగ్రహద్రేక్కాణమున నందునెడల తద్గుణాదులు మధ్యమముగా జరుగుననియు, తాత్కాలికశత్రుద్రేక్కాణమున నందునెడల శైకసంబరచిన సౌందర్యాదులు గలుగనేరవనియును కొందరు అభిప్రాయ పడుచున్నారు.

మరియు నీద్రేక్కాణభేద విభాగములందు సర్ప సాయుధ, చతుష్పాద, పక్షిద్రేక్కాణములయందు చంద్రుడుండునెడల జాతకులు తదనుగుణ్యముగ క్రమముగా తీక్ష్ణాతి హింస్ర గురుతల్పగ తాటపాళ్ళులగుదురు అనగా కర్కాటక ద్వితీయ తృతీయములు వృశ్చిక ప్రథమ ద్వితీయములు, మీనతృతీయములను నివియైయును సర్పద్రేక్కాణములుగాన నిందు చంద్రుడుండు కాలమున బుట్టినవాడు, క్రూరస్వభావము గలవాడగును.

మేష ప్రథమ తృతీయములు, మిథున ద్వితీయము, సింహద్వితీయ తృతీయములు కన్యా ద్వితీయము, ధనుః ప్రథమ తృతీయములను నీ యెనిమిదియు సాయుధ ద్రేక్కాణములుగాన నిందు చంద్రుడుండగా జనించినవాడు అధికముగ జీవహింస చేయువాడగును.

మేష ద్వితీయము, వృషభద్వితీయము, కర్కాటక ప్రథమము, సింహ ప్రథమ ద్వితీయములు, వృశ్చిక తృతీయమును, ధనుః ప్రథమములను నీఏడును చతుష్పాద ద్రేక్కాణములుగాన నిందు చంద్రుడుండగా జనించినవాడు గురుభార్యాసంగమము చేయువాడైనను, తనకన్నను వయసుచెల్లిన స్త్రీలతో సంభోగము జేయువాడైనను అగును.

మిథున ద్వితీయ తృతీయములు, సింహ ప్రథమము తులా ద్వితీయము, కుంభ ప్రథమములగు నీయైదును పక్షిద్రేక్కాణములుగాన నిందు చంద్రుడుండు కాలమున జనించిన వాడు తిరుగునట్టి స్వభావము గలవాడగును ఈ ద్రేక్కాణ విభాగ రూపాదులు యీగ్రంథమునందలి ద్రేక్కాణాధ్యాయము వలన వివరింపబడియున్నవి.

## మేషాది నవాంశలయందు బుట్టినవారి స్వరూపములు.

శ్లో. స్తేనో భోక్తా పండితాఢ్యో నరేంద్రః
క్లీబశ్శూరో విష్టికృ ద్దాసవృత్తిః
పాపో హింస్రోఽభీశ్చ వర్గోత్తమాంశే
ష్వేషా మీశా రాశివద్ద్వాదశాంశైః  7

టీ. మేషలగ్నముగాక తక్కినలగ్నములలో మేషనవాంశయందు బుట్టినవాడు స్తేనః=దొంగయగును, వృషభలగ్నముగాక తక్కిన లగ్నములలో వృషభనవాంశయందు బుట్టినవాడు, భోక్తా=కూడబెట్టక అనుభవించువాడగును, మిథునముగాక తక్కినలగ్నములలో మిథుననవాంశయందు బుట్టినవాడు, పండితః = విద్వాంసుడగును, కర్కాటకముగాక తక్కిన లగ్నములలో కర్కాటకనవాంశయందు బుట్టినవాడు, అఢ్యః=ధనికుండగును, సింహముగాక

తక్కిన లగ్నములలో సింహనవాంశయందుఁ బుట్టినవాఁడు, నరేంద్రః=రాజౌను; కన్యగాక తక్కిన లగ్నములలో కన్యానవాంశయందుఁ బుట్టినవాఁడు, క్లీబః=నపుంసకుండగును, తులగాక తక్కినలగ్నములలో తులానవాంశయందుఁ బుట్టినవాఁడు, శూరః= యుద్ధసమర్థుఁడగును వృశ్చికముగాక తక్కినలగ్నములలో వృశ్చికనవాంశయందుఁ బుట్టినవాఁడు, విష్టికృత్=భారము మోసి బ్రతుకువాఁడగును, ధనస్సుగాక తక్కినలగ్నములలో ధనుర్నవాంశయందుఁ బుట్టినవాఁడు, దాసవృత్తిః=భృత్యవృత్తిగలవాఁడగును, మకరముగాక తక్కిన లగ్నములలో మకరనవాంశయందుఁ బుట్టినవాఁడు, పాపః=పాపవంతుఁడగును, కుంభముగాక తక్కినలగ్నములలో కుంభనవాంశయందుఁ బుట్టినవాఁడు, హింస్రః=చంపెడు వాఁడగును, మీనముగాక తక్కినలగ్నములలో మీననవాంశయందు, బుట్టినవాఁడు, అభీః=నిర్భయుండగును, అధీః=బుద్ధిహీనుఁడగునని కొందఱు, వర్గోత్తమాంశేషు = ఈ మేషాదిరాసులలో మేషాది నవాంశలు వర్గోత్తమాంశలు = అట్టివర్గోత్తమాంశలయందుఁ బుట్టినవారు, ఏషాం=ఈపూర్వోక్తులగు స్వైనభోక్త్య= పండితాదులకు, ఈశాః=ప్రభువులగుదురు, ద్వాదశాంశైః=మేషాదిద్వాదశాంశలచేత, రాశివత్ =మేషాదిరాసులవలెఫలములు చెప్పఁదగినవి.

తా. మేషలగ్నముగాక తక్కిన వృషభాది లగ్నములయందలి మేషనవాంశయందు బుట్టినవాడు దొంగయగును. జననలగ్నము వృషభముగాక తక్కిన లగ్నములయందు వృషభ నవాంశయందు జనించిన మానవుడు ధనమును దాచిపెట్టక అనుభవించు వాడగును. జన్మలగ్నము మిథునముగాక తక్కిన లగ్నములయందలి మిథుననవాంశయందు జనించినవాడు మంచి చదువరియగును. జననలగ్నము కర్కాటకముగాక తక్కిన లగ్నములయందు కర్కాటక నవాంశయందు బుట్టినవాడు గొప్ప ధనవంతుడగును. జన్మలగ్నము సింహము గాక తక్కిన లగ్నములయందు సింహ నవాంశయందు జననము నొందినవాడు కులశ్రేష్ఠుడైనను, రాజైననగును. జననలగ్నము కన్యాలగ్నముగాక యుండి తక్కిన లగ్నములు జన్మలగ్నములగుచుండగా యందలి కన్యానవాంశయందు జనించినవాడు షండుడగును. తులాలగ్నముగాక తక్కిన లగ్నములు జన్మలగ్నములగుచుండగా నందలి తులా నవాంశయందు బుట్టినవాడు యుద్ధము చేయుటయందు సమర్థుడగును. వృశ్చికముగాక తక్కినరాసులు జనన లగ్నములగుచుండగా నందు వృశ్చిక నవాంశమున జనించినవాడు, ఇతరులకు బరువులు మోసి కూలిదెచ్చుకొని జీవనము చేయువాడగును ధనూరాశిగాక తక్కినరాసులు జన్మలగ్నములగు చుండగానందు ధనుర్నవాంశమున జనించినవాడు జ్ఞానియైనను, బానిసీడైనను కిరాతుడైనను చెంబటీడైనను, దానపాత్రుడైనను అగును తక్కువజాతియందు దుద్భవించిన, జ్ఞానియని కొందరు అభిప్రాయపడుచున్నారు మకరరాశిగాక తక్కినరాసులు జననలగ్నములగుచుండగా నందు మకరనవాంశమున జనించినవాడు, పాపియగును కుంభరాశిగాక తక్కినరాసులు లగ్నములగు చుండగా నందు కుంభ నవాంశమున బుట్టినవాడు, దోపిడిగాడును, ప్రాణులను హింసించువాడునగును. మీనరాశిగాక తక్కినరాసులయందు మీననవాంశమున జనించినవాడు, ధైర్య

రహితుడగును. ఈవిషయమున కొందరు, "అధీశ్చ" అనిపఠించి బుద్ధిలేనివాడు అని అందురు గాని "తస్కర భోక్తృ విచక్షణ ధని నృపతి నపుంసకా భయ దరిద్రాః ఖలపాపో గ్రో(తు)క్త్యా ప్తా" మేషాద్యాః శాం నవాంశకాభావాః "అను లఘుజాతక ఉదాహరణోక్తముగ రచించిరి. "అధీశ్చ" యనెడు పాఠాంతరము వరాహమిహిరాచార్యుల సమ్మతముగాదనుట స్థిరమగుచున్నది.

వర్గోత్తమాంశలయందు బుట్టినవారి స్వభావాదులు వర్గోత్తమాంశయనగా జననలగ్న మేరాశియో యారాశియేనవాంశలగ్నమగుట మేషలగ్నమువలన మేషాంశమున బుట్టినవాడుదొంగలకును, వృషభలగ్నమున వృషభాంశమున బుట్టినవాడు ధనము ననుభవించువారికిని, మిథునలగ్నమున మిథునాంశయందు బుట్టినవాడు పండితులకును, కటకలగ్నమున కర్కాటకాంశయందు జనించినవాడు ధనవంతులకును, సింహాలగ్నమున సింహాంశయందుజనించినవాడు రాజులకును, కన్యాలగ్నమున కన్యాంశయందు జనించినవాడు నపుంసకులకును, తులాలగ్నమున తులానవాంశయందు జనించినవాడు యుద్ధవీరులకును, వృశ్చికలగ్నమున వృశ్చిక నవాంశయందు జనించినవాడు కూలివారికిని ధనుర్లగ్నమున ధనుర్నవాంశయందు జనించినవాడు జ్ఞానులకైనను, చెంబడులకైనను కూలివారికైనను, మకరలగ్నమున మకరనవాంశయందు జనించినవాడు పాపులకును, కుంభలగ్నమున కుంభనవాంశమున బుట్టినవాడు ఘాతకులకును, మీనలగ్నమున మీననవాంశయందు జనించినవాడు భయరహితులకును అధిపతులగుదురు

మేషాది ద్వాదశాంశయందు బుట్టినవారి స్వభావాదులు మేషాది ద్వాదశరాసులయందు చంద్రుడుండ జనించినవారికి "రాశిశీలాధ్యాయమున మొదటి పండ్రెండు శ్లోకముల యందు ఏయేఫలములు జెప్పబడియున్నవో ఆయాఫలములే మేషాది ద్వాదశాంశలయందు జనించిన వారికిని జెప్పవలయును.

## గ్రహములు తమతమ త్రింశాంశల యందుండు నెడల జాతకులకు గలుగు ఫలములు

శ్లో. జాయాన్వితో బల విభూషణ సత్వయుక్త
స్తేజోఽతిసాహసయుత శ్చ కుజే స్వభాగే,
రోగీ మృతస్వయువతి ర్విషమోఽన్యదారో
దుఃఖీ పరిచ్ఛదయుతో మలినోఽర్కపుత్రే. ౧

టీ. కుజే=అంగారకుడు, స్వభాగే = తనత్రింశాంశల యందుండగా బుట్టినవాడు జాయాన్వితః = భార్యాసమేతుడును, బలవిభూషణ సత్వయుక్తః = వీర్యవిభూషణశౌర్యములతో గూడిన వాడును, తేజోఽతిసాహసయుతశ్చ = తేజస్సాహసములతో గూడిన వాడును, అగును, అర్కపుత్రే=శనైశ్చరుడు, తనత్రింశాంశయందుండగా బుట్టినవాడు, రోగీ=వ్యాధిగలవాడగును, మృతస్వయువతిః = మృతిబొందిన భార్యగలవాడును, విషమః=

చోరియగుదును, అన్యదారః = పరదారాసక్తుఁడును, దుఃఖీ=దుఃఖవంతుఁడును, పరిచ్ఛదయుతః = గృహపరివారాదులతోఁ గూడినవాఁడును, మలినః=మాలిన్యముగలవాఁడును, అగును.

### కుజశనులు తమతమ త్రింశాంశలయందుండగా బుట్టినవారి స్వభావములు.

తా. అంగారకుడు తన త్రింశాంశయందుండు కాలమున జనించినవాడు భార్యగల వాడును, తీవ్ర్యవిభూషణౌ దార్య యుక్తుడును, ధైర్యసాహసాదులు గలవాడును అగును.

సూర్య పుత్రుడగు శనైశ్చరుడు తనత్రింశాంశయందుండగా జనించినవాడు వ్యాధిగలవాడును, కళత్రవియోగము బొందువాడును, చోరస్వభావము గలవాడును, ఇతరకాంతల వాసింపువాడును చింతాకులమానసుడును పరిజనము గలవాడును, మలసుడును అగును ఈశ్లోకమున "స్వభాగే" అని సామాన్యముగా జెప్పబడియున్నను శుక్రనిఫలముల జెప్పునట్టి శ్లోకమున (10) వ "స్వత్రింశాంశే" అనిచెప్పియుండుటచే ఈ శ్లోకములయందును త్రింశాంశయని యూహింపదగినది

### గురు బుధులు తమతమ త్రింశాంశలయం దుండగా బుట్టినవారి స్వభావములు.

శ్లో. స్వాంశే గురౌ ధన యశస్సుఖ బుద్ధియుక్తా
స్తేజస్వి పూజ్య నిరు గుద్యమ భోగవంతః
మేధా కలా కపట కావ్య వివాద శిల్ప
శాస్త్రార్థ సాహస యుతా శ్శశి జేఽతిమాన్యాః. 9

టీ. గురౌ=బృహస్పతి, స్వాంశే=తనత్రింశాంశ యందుండఁగాఁ బుట్టినవారు, ధనయశస్సుఖబుద్ధియుక్తాః = ధనకీర్తిసౌఖ్య ప్రజ్ఞలతోఁగూడినవారును, తేజస్విపూజ్య నిరుగుద్యమ భోగవంతః-తేజస్వీ = తేజోవంతులును, పూజ్యా=సర్వజనపూజ్యులును, నిరుక్=రోగములేనివారును, ఉద్యమవంతః = ఉత్సాహవంతులును. భోగవంతః, భోగవంతులును, అగుదురు, శశిజే=బుధుఁడు, తనత్రింశాంశయందుండఁగాఁ బుట్టినవారు మేధా=బుద్ధి, కళా=గీతవాద్యాదులు, కపట=దాంభికత్వము. కావ్య=కవనము సెప్పుట, వివాద=వాక్పటుత్వము, శిల్ప=శిల్పకర్మ, శాస్త్రార్థ=ధర్మశాస్త్రార్థ్యర్థానుష్ఠానము, సాహస=అసమీక్ష్యకారిత్వము, ఈగుణములతోడ, యుతాః=కూడినవారును, అతిమాన్యాః = మిక్కిలిసమ్మానింపఁ దగినవారును అగుదురు.

తా. బృహస్పతి తనత్రింశాంశయందుండగా బుట్టినవాడు ధనవంతుడును, కీర్తిగలవాడును యుక్తాయుక్తవిచక్షణ గలవాడును, సుఖియును, ధైర్యవంతుండును, సర్వజనులచే బూజింప బడువాడును, వ్యాధిలేనివాడును, కార్యారంభ శీలుడును భోగియునగును.

చంద్రపుత్రుడగు బుధుడు తనత్రింశాంశ యందుండగా జనించినవాడు. ధీమంతుడును, గాన కళాకౌశలుండును, డంభముగలవాడును, కవియు, వాక్చాతుర్యముగలవాడును. శిల్ప కార్యములయందు నేర్పరియు, ధర్మశాస్త్రముల యర్థజ్ఞానము గలవాడును, తెగువయు దండో పాయమును గలవాడు అగును మరియు అధికముగ గౌరవింప దగినవాడగును.

## శుక్రుడు తన త్రింశాంశయందుండగా బుట్టినవాని యొక్కయు, రవి చంద్రులు కుజాది త్రింశాంశ స్థితులగుచుండగాను, బుట్టినవారియొక్కయు స్వరూపములు.

శ్లో. స్వత్రింశాంశే బహుసుత సుఖారోగ్య భాగ్యార్థరూపః
శుక్రే తీక్ష్ణ స్సులలితవపు స్సుప్రకీర్ణేంద్రియశ్చ,
శూర స్స్తబ్ధో విషమ వధకౌ సద్గుణాఢ్యౌ సుఖజ్ఞౌ
చార్వంగేష్టౌ రవి శశియుతే వ్యారపూర్వాంశకేషు. 10

టీ. శుక్రే=శుక్రుఁడు, స్వత్రింశాంశే = తనత్రింశాంశలో నుండఁగాఁ బుట్టినవాఁడు, బహుసుతసుఖారోగ్య, భాగ్యార్థరూపః = అనేకములైన పుత్రసౌఖ్యారోగ్య సౌభాగ్య ధనసౌందర్యములు గలవాఁడును, తీక్ష్ణః=క్రూరుఁడును, సులలితవపుః= మృదుశరీరుండును, సుప్రకీర్ణేంద్రియశ్చ=అధిక విషయాసక్తుఁడును, అగును ఆరపూర్వాంశకేషు=కుజాదులత్రింశాంశలు, రవిశశియుతేషు = సూర్యచంద్రులతో కూడియుండఁగా, క్రమముగా శౌర్యమంత్వాది ఫలములఁ జెప్ప దగును. కుజత్రింశాంశయందు సూర్యుండుండెనేని, శూరః=రణశూరుండును, చంద్రుఁడుండిన, స్తబ్ధః=అలసుడును అగును, శనిత్రింశాంశలో సూర్యుండుండిన, విషమః=క్రూరుండును. చంద్రుండుండిన, వధకః=హింసకుడును అగును, గురుత్రింశాంశయందు సూర్యుండుండిన, సద్గుణః=ఉత్తమగుణములు గలవాఁడును, చంద్రుఁడుండిన, అఢ్య=అధిపతి అగును. బుధత్రింశాంశలో సూర్యుడుండిన, సుఖీ = సుఖవంతుడును, చంద్రుండుండెనేని, జ్ఞః=తెలిసినవాడు నగును శుక్రత్రింశాంశలో సూర్యుడుండినయెడల, చార్వంగః = సుందరశరీరుడును, చంద్రుండుండెనేని. ఇష్టః=జనప్రియుండును అగును.

తా. శుక్రుడు తన త్రింశాంశయందుండగా జనించినవాడు, పుత్రబాహుళ్యముఁ సుఖాతిశయము, ఆరోగ్యము, సౌభాగ్యము, ధనము, సౌందర్యము మొదలగునవి గలవాడును, క్రూరస్వభావము గలవాఁడును, సుకుమార శరీరుడును, విషయాసక్తుడని ప్రకటింప బడు వాడును. అగును ఈశ్లోకమున "భాగ్యార్థరూపః" అనుచోట, "భార్యార్థరూపః" అనిపఠించి కళత్రమూలకముగ వచ్చిన ధనము గలవాడని కొందరు యర్థము చేయుచున్నారు ఇదియు నాలోచింప దగినది.

## సూర్యచంద్రులు కుజాగ్రహ త్రింశాంశలయం దుండగా బుట్టినవారి స్వభావములు.

అంగారక త్రింశాంశయందు సూర్యుడుండు నెడల జాతకుడు రణశూరుడు చంద్రుడుండు నెడల మందమతియును సోమరియును అగును శుక్రశని త్రింశాంశయందు సూర్యుడుండు నెడ జాతకుడు క్రూరస్వభావము గలవాడును, చంద్రుడుండు నెడల హింసకుడును

అగుదురు గురుత్రింశాంశయందు సూర్యుడుండగా బుట్టినవాడు మంచి గుణములు గలవాడును చంద్రుడుండగా బుట్టినవాడు ధనికుండును అగుదురు బుధత్రింశాంశయందు సూర్యుడుండగా బుట్టినవాడు సౌఖ్యవంతుడును చంద్రుడుండగా బుట్టినవాడు విద్వాంసుడును అగుదురు.

శుక్రత్రింశాంశయందు సూర్యుడుండగా బుట్టినవాడు సుందరమగు అవయవములుగలవాడును చంద్రుడుండగా బుట్టినవాడు జనులందరికి ప్రీతి గల్గించువాడును అగుదురు.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ఆశ్రయయోగాధ్యాయ నామక
వింశోధ్యాయము.



శ్రీరస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

ప్రకీర్ణాధ్యాయము. ఏకవింశోధ్యాయము. —21.



### గ్రహాపరస్పర కారకసంజ్ఞలు.

శ్లో. స్వర్క్ష తుంగమూలత్రికోణగాః కంటకేషు యావంత ఆశ్రితాః
సర్వఏవ తేఽన్యోన్యకారకాః కర్మగస్తు తేషాం విశేషతః. 1

టీ. స్వర్క్ష తుంగ మూలత్రికోణగాః=స్వక్షేత్రస్వోచ్చమూల త్రికోణములను పొందినట్టి, యావంతః=ఎన్నిగ్రహములు, కంటకేషు=కేంద్రములయందు, ఆశ్రితాః=ఆశ్రయించియున్నవో, తేసర్వఏవ = ఆయన్నిగ్రహములును, అన్యోన్యకారకాః = పరస్పరముకారకసంజ్ఞలగుదురు, కర్మగస్తు = దశమమందున్న గ్రహము, తేషాం = అట్టి కారకగ్రహములలో పల, విశేషతః = అధికముగా (కారకత్వమును) పొందును.

తా. ఎన్నిగ్రహములు స్వక్షేత్ర స్వోచ్చ, మూలత్రికోణములను బొందియున్నవో ఆగ్రహములు లగ్నాదికేంద్రస్థానములగు లగ్నచతుర్థ సప్తమ దశమస్థానములందుండు నెడల నొకరికొకరు కారకసంజ్ఞలగుదురవగా స్వక్షేత్రమునసైనను, స్వోచ్చయందైనను, మూ

లత్రికోణమునైనను; యేయొకానట్టిగ్రహము లగ్నాదిగాగల నాలుగుకేంద్రములలోనొక కేంద్రమందుండగా మరియొకగ్రహము స్వక్షేత్ర, స్వోచ్ఛ, మూలత్రికోణములలో నొకస్థానమును బొంది మరియొకకేంద్రస్థానమునందుండు నెడల నీ గ్రహద్వయము నొకరికొకరు కారకసంజ్ఞలగుదురు ఎన్నిగ్రహములు జాతకుని జన్మకాలమున నీలాగేర్పడుచుండునో అన్నిగ్రహములును పరస్పర కారకసంజ్ఞకలవగుచున్నవి. ఈ విషయమున కొందరు శాస్త్రజ్ఞులు ఒకగ్రహము స్వక్షేత్రమును బొంది యొక కేంద్రమునందుకాలమున, మరియొకగ్రహము స్వక్షేత్రమునే బొంది మరియొక కేంద్రమునందున్న మాత్రమునకే నీరెండుగ్రహములు కారకసంజ్ఞలగువనియు, ఇట్లే స్వోచ్ఛ, మూలత్రికోణస్థానములను బొందిన గ్రహములకు జెప్పదగినదని యభిప్రాయపడుచున్నారు. మరికొందరు స్వక్షేత్ర, స్వోచ్ఛమూలత్రికోణములలో నొకస్థానమును బొందిన గ్రహము ఒకకేంద్రమునందుండగా మరియొకగ్రహము స్వక్షేత్రస్వోచ్ఛమూలత్రికోణములలో నెద్దానినైనను బొంది మరియొక కేంద్రమునందున్నెడల నీరెండు గ్రహములు కారకసంజ్ఞకలవగుననియు యభిప్రాయపడుచున్నారు. ఈ కారకగ్రహములలో దశమకేంద్రమును బొందిన గ్రహమే విశేషమగు కారకసంజ్ఞలను బొందుననియు నూహింపదగియున్నది. ఇంకువిషయమై "స్వర్క్షత్రికోణతుంగస్థాః ఖాదికేంద్రేషుసంస్థితాః అన్యోన్యంకారకాస్తేషు కేంద్రేష్వేవహరేర్మతమ్" అని సారావళీ కారకుడు వచించియున్నాడు.

## కారకయోగమునకుదాహరణము.

శ్లో. కర్కటోదయగతే యథోడుపే స్వోచ్ఛగాః కుజయమార్కసూరయః
కారకానిగదితాః పరస్పరం లగ్నగస్య సకలోఽంబరాంబుగః. 2

టీ. ఉడుపే = చంద్రుడు, కర్కటోదయగతే = కర్కటకమందుండగా, కుజయమార్కసూరయః = కుజశనిరవిగురువులు, స్వోచ్ఛగాః = తమయొక్క యుచ్చస్థానముల యందుండునపుడు, పరస్పరం = ఒకరికొకరు, కారకాః = కారకులని, నిగదితాః = చెప్పబడిరి. లగ్నగస్య = లగ్నమందున్న గ్రహమునకు, అంబరాంబుగః = దశమచతుర్థములయందుండు, సకలః = అన్నిగ్రహములకును కారకసంజ్ఞలుచెల్లును.

తా. చంద్రునకు స్వక్షేత్రమగు కర్కాటకము జననలగ్నమై యందు చంద్రుడుండగా శనికుజరవిగురువులు, తమతమ ఉచ్చస్థానములగు తులా మకర మేష కర్కాటకములందుండునెడల నీర్వైదుగురును నొకరికొకరు కారకులగుచున్నారు.

ఈ యోగమున చంద్రునకు స్వక్షేత్రమగుననియు గురువునకు స్వోచ్ఛయునగునట్టిదియగు కర్కాటకము జననలగ్నమై ప్రథమకేంద్రముగా నొప్పుచున్నది. శనైశ్చరునకు స్వోచ్ఛస్థానమగు తులారాశి చతుర్థకేంద్రముగానున్నది. అంగారకునకు స్వోచ్ఛస్థానమగు మకరము సప్తమకేంద్రముగానున్నది. సూర్యునకు స్వోచ్ఛమగు మేషముదశమకేంద్రము

గా జెప్పుచున్నది. ఈ నాల్గింటియందును క్రమముగా శనిశుక్ర అంగారక సూర్యులుం డుటచే తనుస్వక్షేత్రమున చంద్రుడుండుటచే నీనలుగురు కారకులగుచున్నారు.

మరియు "రవితనయో నాకస్థితశ్చ లగ్నే బృహస్పతి హిమాంశూ, మేషేకుశో రవి యుతః పరస్పరం కారకా ఏతే" అని సారావళీకారుడు వచించియుండుటచే కర్కాటకము లగ్నమై అందుగురుచంద్రులు, తులయందుశని, మేషమున సూర్యాంగారకులుండునెడల వీ రు పరస్పరకారకులగుదురని ఏర్పడుచున్నది. గావున నిదియు కారకయోగమునకు మరియొక యుదాహరణముగానున్నది.

## కారకయోగమునకు మరికొన్ని నియమములు.

శ్లో. స్వత్రికోణోచ్చగో హేతు రన్యోస్య యది కర్మగః
సుహృ త్తద్గుణసంపన్నః కారక శ్చాపి స స్మృతః. 3

టీ. స్వత్రికోణోచ్చగః = స్వక్షేత్రమూలత్రికోణ స్వోచ్చస్థానములలో దేనియందైన నున్న గ్రహము. హేతుః = కారకత్వమునకు కారణము, అస్య = ఈ స్వక్షేత్రాదిస్థానములలోని గ్రహమునకు, కర్మగః = దశమ స్థానమందున్న గ్రహముగాని, సుహృత్ = మిత్ర గ్రహముగాని, తద్గుణసంపన్నః = సమయానుసారముగ మిత్రత్వమును పొందియుండుగ్రహమేగాని, సచాపి = అట్టిగ్రహమును, కారకః = కారకగ్రహమని, స్మృతః = చెప్పబడెను.

తా. ఏగ్రహమైనను స్వక్షేత్ర మూలత్రికోణ స్వోచ్చస్థానములలో నెద్దానియందైన నుండునెడల వేరొక కారకసంజ్ఞకుమూలమగుచున్నది. ఇందువలన కేవలము కేంద్రస్థాన స్థితగ్రహముమాత్రము కారకసంజ్ఞకు కారణముగాదని నూహింపదగియున్నది. గనుక నే గ్రహమైనను కేంద్రస్థానములుగాక తక్కిన స్థానమునయందైననుండి స్వోచ్చమూలత్రికో ణములలో నెద్దానినైన బొందియుండునెడల తద్గ్రహమునకు దశమస్థానమునుండు స్వక్షే త్రగతముగ నట్టిగ్రహమైనను నైసర్గికమిత్రగ్రహమైనను, తాత్కాలికమిత్రగ్రహమైనను కారకగ్రహమని చెప్పబడును. ఇందుచే స్వోచ్చమూలత్రికోణ స్వక్షేత్రములను బొందిన గ్రహమునకు స్వోచ్చమూలత్రికోణ స్వక్షేత్రములబొందని గ్రహము ఏవిధముననైనను, మిత్రగ్రహమగుచు దశమస్థానమునందుండునెడల కారకుడగునుగాని స్వోచ్చాదుల బొంద నిగ్రహమునకు, సోచ్చాదులబొందినగ్రహము కారకాఖ్యముగా చేరదని నూహింపదగియు న్నది. మరియు "మేషూరణేచరవిరితి విశేషతో వక్తి చాణక్యః" అనియుండుటచే చాణక్య నివచనమును గుణ్యముగ దశమమునందున్న రవి విశేషకారక సంజ్ఞగలవాడని ఏర్పడుచున్నది.

## కారక సంజ్ఞకుగల ప్రయోజనము.

శ్లో. శుభం వర్గోత్తమే జన్మవేశిస్థానే చ సద్గ్రహే
అశూన్యేషు చ కేంద్రేషు కారకాఖ్య గ్రహేషు చ. 4

టీ. జన్మ = జననము, వర్గోత్తమే = వర్గోత్తమాంశయందైనయెడల, శుభం = శుభమయినది, వేశిస్థానే = (రవియుండురాశికి రెండవరాశి వేశిస్థానము) వేశిస్థానమందు, సద్గ్రహే = శుభగ్రహంబుండగను, కేంద్రేషు = కేంద్రములందును, అశూన్యేషు = శూన్యములు గాక గ్రహయుక్తములైయుండగను, కారకాఖ్య గ్రహేషు చ = కారక గ్రహములును సంభవించి యుండునో వాని జన్మంబు శుభమైనది.

తా. కారకసంజ్ఞకుగల గ్రహయోజనము ఏమానవునిజననము లగ్నమునందలి వర్గోత్తమాంశయందనగా జననలగ్నమేరాశియో ఆరాశియే అంశాలగ్నముగా నేర్పడునెడలను ఏపురుషుని, జన్మరాశి చక్రమునందు చంద్రుడేరాశియందుండునో ఆరాశియందే అంశాచక్రమునయందును, చంద్రుడుండునెడలను అట్టివాని జననము శుభమైనదగును. వేశిస్థానమనగా సూర్యుడున్న రాశికి రెండవ స్థానమునందు, శుభగ్రహములగు బుధ, గురు, శుక్రులలో నొకరైనను నుండుకాలము ఎవనిజననకాలముగ నేర్పడుచున్నదో అట్టిది శుభప్రదమైనదగును. కేంద్రస్థానములగు లగ్నచతుర్థ, సప్తమ, దశమములు నాల్గింటియందును గ్రహశూన్యము గాకుండు కాలమున ఏమానవుని జననమేర్పడుచున్నదో, అట్టిదియు శుభమైనదగును. ఈ విషయమునకు "ఏకస్మిన్నపి కేంద్రే యది సౌమ్యస్సగ్రహోస్తి యాత్రాయాం జన్మన్యథవా కర్మణి నతచ్ఛుభంప్రాహురాచార్యాః" అను గ్రంథాంతరవచనములబట్టి కేంద్రములయందు శుభగ్రహములుండునెడల శుభమనియు అశుభగ్రహములుండునెడల అంత శుభముగాదనియు నూహింపదగియున్నది. మరియు నేపురుషుని జననకాలమున కారక గ్రహములు సంభవించుచున్నవో యట్టి జననము మంగళప్రదమైనదని తెలియదగినది. మరియు "నీచకులేసంభూతః కారకవిహగైః ప్రధానతాంయాతిక్షితి పతినుళసమత్థో భవతి నరేంద్రోవసందేహః" అను గ్రంథాంతరవచనాను గుణ్యముగ, ఏమానవునిజన్మకాలమున నైనను గ్రహములన్నియు కారకములగుచుండునెడల అట్టివాడు నీచకులమున బుట్టినవాడైనను మంత్రిగాని, తత్సమానుడు గాని యగునుననియు, రాజకులమున బుట్టినవాడైనయెడల రాజగుటకు సంశయములేదని నూహింపదగియున్నది.

జాతకునికిగలుగు యోగములు కన్నిటికిని కారకబలమే ప్రధానముగాన కారకభేదాదుల సంపూర్తిగ నెరిగి ఫలనిర్దేశము జేయదగినదని శాస్త్రకారుల యభిప్రాయము గానున్నది.

ఈ కారకవిశేషములు చాల వివరములుగా సారావళీగ్రంథమున జెప్పబడియున్నవి.

## యౌవనకాలమున సుఖప్రదమగు యోగవివరము.

శ్లో. మధ్యే వయస స్సుఖప్రదాః కేంద్రస్థా గురు జన్మలగ్నపాః
పృష్ఠోభయకోదయర్క్షగా స్త్వంతాంతః ప్రథమేషు పాకదాః. 5

టీ గురుజన్మలగ్నపాః = బృహస్పతి, జన్మాధిపతి, లగ్నాధిపతులలోనొకడు, కేంద్రస్థాః = కేంద్రమందుండిన, మధ్యేవయసః = యౌవనమందు, సుఖప్రదాః = సుఖమునిచ్చును. పృష్ఠోభయకోదయర్క్షగాః = పృష్ఠోదయ ఉభయోదయశీర్షోదయ రాసులలోని గ్రహములు, అంతే = కడపటను, అంతః = మధ్యమందును, ప్రథమేషు = మొదలును, పాకదాః = ఫలవంతమగును.

తా. బృహస్పతి, జన్మాధిపతి, లగ్నాధిపతి, (వీరిలోనొకడు) కేంద్రస్థానమునను‌ండిన యెడల జాతకుని మధ్యవయస్సున అనగా యౌవనమున సుఖముగలుగును. ఈ శ్లోకమున బహువచన ప్రయోగముండుటచే పైచెప్పినమూవురును కేంద్రస్థానములయందుండిరేని జాతకుని యౌవనకాలమున అత్యధిక సౌఖ్యముగలుగునని నూహింపదగియున్నది. మరియు నిందువిషయమై "లగ్నాధిపోలగ్నపతిశ్చ యేషాం చతుష్టయేస్యాద్బలవాన్ గురుర్వా, చతుష్టయాత్ రాడిషు ; సంగతస్స్యాచ్చతుర్వయః కాలఫలప్రదస్స్యాత్" అనియవనేశ్వరుడును, "చంద్రాధ్యాసితరాశేర్నాథో లగ్నాధిపోపివాయస్య, కేంద్రేసురగురు మంత్రవయసోమధ్యే సుఖం తస్య" అని సారావళీ కారకుడగు కల్యాణవర్మయు వచించియున్నారు.

[జన్మాధిపతి:— జననకాలమున నేరాశియందు జంద్రుండుండునో యారాశ్యధిపతియేజన్మాధిపతి యనబడును.

లగ్నాధిపతి:— జననలగ్నము ఏరాశియగుచున్నదో నారాశ్యధిపతియే లగ్నాధిపతి యనబడును.]

## దశానాథుని ఫలపాకకాలవివరము.

దశాప్రవేశకాలమునందా దశానాథుడు పృష్ఠోదయములగు మేష వృషభ కటక ధనుర్మకర రాసులయందొక రాశియందుండు నెడల ఆ దశాసంబంధమగు శుభాశుభఫలములు దశాంత్యమునగలుగుననియు, ఉభయోదయమగు మీనరాశియందుండు నెడల తద్దశాసంబంధమగు శుభాశుభఫలములు దశామధ్యమున జరుగుననియు, శీర్షోదయములగు మిథునసింహకన్యాతులా వృశ్చికములలో నొకరాశియందుండు నెడల తద్దశాఫలములు దశాప్రథమమునగలుగుననియును దెలియదగినది. ఈవిషయమునకు, "ఆద్యంత మధ్య ఫలదాశ్శిరః పృష్ఠోభయోదయాః దశాప్రవేశసమయే తిష్ఠన్ వాభ్యోదశాపతిః" అనిగార్గియు, "ఆదావదస్తానుఫల దశ్శీర్షోదయరాశి సహితోవిహగః, ఉభయోగయేచ మధ్యేస్యాంత్యే పృష్ఠోదయేచనీచర్క్షే. అని సారావళీ కారకుడును వచించియున్నారు. గాన ఒక్కొక్కదశను 3 భాగములుచేసి పూర్వోక్త ప్రకారము ఫలముల జెప్పదగినది.

## అష్టకవర్గఫలకాల వివరము.

శ్లో. దినకరరుధిరౌ ప్రవేశకాలే గురుభృగుజౌ భవనస్య మధ్యయాతౌ
రవిసుతశశినౌ వినిర్గమస్థౌ శశితనయః ఫలదస్తుసార్వకాలమ్. 6

టీ. దినకరరుధిరౌ = రవికుజులు, ప్రవేశకాలే = ప్రవేశకాలమందును, గురుభృగుజౌ = గురుశుక్రులు, భవనస్య = ఆరాశియొక్క, మధ్యయాతౌ = మధ్యమందును, రవిసుతశశినౌ=శనిచంద్రులు, వినిర్గమస్థౌ=కడపటియందును, శశితనయస్తు=బుధుఁడు, సార్వకాలం ఆరాశియం దెన్నిదినములుండునో అన్నిదినములును, ఫలదః = ఫలమునిచ్చువాఁడగును.

తా. రవికుజులు ప్రవేశకాలమునందును, గురుశుక్రులు మధ్యకాలమునందును, శనిచంద్రులు అంత్యమునందును, బుధుడు సార్వకాలమును ఫలమునిత్తురనగా చారవశమున సూర్యాంగారకులు ఏరాశియందుందురో తదనుగుణ్యమగు అష్టకవర్గఫలము శుభమైనను, అశుభమైనను, వారారాశియొక్క ప్రథమ తృతీయాంశమున నున్నప్పుడు గలుగజేయుదురనియు। గురుశుక్రులు చారవశమున తాముండు రాశియొక్క మధ్య తృతీయాంశమున నుండునప్పుడు గలుగజేయుదురనియు శనిచంద్రులు చారవశమున తాముండునట్టి రాశియొక్క అంత్యతృతీయాంశమున నున్నప్పుడు గలుగజేయుదురనియు, బుధుడు చారవశమున నేరాశియం దెంతకాలముండునో అన్నిదినములును తదనుగుణ్యమగు అష్టకవర్గఫలమును గలుగజేయుననియును దెలియదగినది. ఇందుకు "రవిరుధిరౌభవనం ప్రవిశంతౌ గురుభృగుజౌ గృహమధ్యసమేతౌ శనిశశినౌఖలు నిర్గమకాలే శశిశనయ్శ ఫలదస్తుసదైవ" అని సారావళీ వచనము గానబడుచున్నది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ప్రకీర్ణాధ్యాయ నామక
ఏకవింశోధ్యాయము.

శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్ర టీకా తాత్పర్య సహితము.

### అరిష్టాధ్యాయము. ద్వావింశోధ్యాయము. —22.



**పుత్ర కళత్ర సంభవా సంభవముల నెఱుంగువిధము.**

శ్లో. లగ్నాత్పుత్ర కళత్రభే శుభపతి ప్రాప్తేథవా ఽఽలోకితే
చంద్రాద్వాయది సంపదస్తి హితయో ర్జ్ఞేయోఽన్యథాఽసంభవః
పాథోనోదయగే రవౌర విసుతో మీనస్థితో దారహా
పుత్రస్థానగత శ్చపుత్రమరణం పుత్రోఽవనేర్యచ్ఛతి.

టీ. లగ్నాత్ = జన్మలగ్నము మొదలుగాని, చంద్రాద్వా = చంద్రుడున్న రాశి మొదలుగాని, పుత్రకళత్రభే = పుత్రకళత్ర రాసులు, శుభపతిప్రాప్తే = శుభగ్రహముచేత పొందఁబడియుండినను, అథవాలేక, ఆలోకితే = చూడబడినను, తయోః = ఆపుత్రకళత్రములయొక్క, సంపత్ = సమృద్ధి, అస్తి = కలుగును, అన్యథా = అట్లుగాకుండిన, అసంభవః = (పుత్రకళత్రఅభావము, జ్ఞేయః = తెలియఁదగినది, గేరవాపాథోనోదయ = జన్మలగ్నమైన కన్యాలో రవియుండఁగా, రవిసుతః = శని, మీనస్థితః = మీనమందుండెనేని, దారహా = భార్యమృతిచెందును,) అవనేః పుత్రః = కుజుండు, పుత్రస్థానగతః = పుత్రస్థానమందుండినయెడల, పుత్రమరణం = పుత్రమరణమును, యచ్ఛతి = ఇచ్చును.

తా. జన్మలగ్నరాశ్యాదిగా పంచమస్థానమైనను, జననకాలమునందు చంద్రస్థిత రాశ్యాదిగా పంచమస్థానమైనను, సౌమ్యగ్రహయుతమైనగాని, దృష్టమైగాని యుండునెడలను, ఆపంచమస్థానమేరాశియగుచున్నదో ఆరాశినాథుని యుతమైగాని, దృష్టమైగాని యుండునెడలను, పుత్రసంపత్ కలుగునని చెప్పదగినది. అట్లుగాదేని పుత్రులు కలుగరనియు దెలియదగినది.

జననలగ్నమునకైనను, తత్కాలమున చంద్రస్థిత రాశికైనను సప్తమస్థానము సౌమ్యగ్రహయుక్తమైగాని దృష్టమైగాని యుండునెడలను, ఆసప్తమ రాశ్యధిపతి యుతమైగాని దృష్టమైగాని యుండునెడలను కళత్రసంపద కలుగుననియు అట్లుగాదేని వివాహముగాదనియును దెలియదగినది. ఇచ్చట పుత్రకళత్ర భావములు ఉదాహరణమునకై చెప్పబడినవిగాని తన్వాదిగాగల ద్వాదశభావములకును ఈరీతిగనే లగ్నచంద్రులననుసరించి ఆయాభావానుగుణ్యమగు శుభాశుభఫలములు చెప్పదగినవి. ఈవిషయమునకు "మూర్తించ హోరాం శశిభంచ వింద్యాత్" అనియవనేశ్వరుడు వచించియున్నాడు. కన్యారాశి జననలగ్నమైయందు సూర్యుడును, కళత్రస్థానమగు మీనరాశియందు శనైశ్చరుడును యుండగా బుట్టినవాని భార్య, తానుజీవించి యుండగనే మృతినొందును, ఆకన్యాలగ్నమునందే సూర్యుడును, పుత్రస్థానమగు మకర రాశియందు అంగారకుడును నుండునెడల తానుజీవించియుండు కాలముననే పుత్రమరణము గలుగును.

### కళత్ర మరణయోగత్రయము.

శ్లో. ఉగ్రగ్రహైః సితచతురస్ర సంస్థితై
ర్మధ్యస్థితే భృగుతనయే ఽథవోగ్రయోః
సౌమ్యగ్రహై రసహిత సన్నిరీక్షితే
జాయావధో దహన నిపాత పాశజః.

టీ. సితచతురస్రసంస్థితైః = శుక్రునిచతుర్థాష్టమములయందున్న, ఉగ్రగ్రహైః = ఉగ్రగ్రహములచేత, దహనజః = అగ్నివలన, జాయావధః = భార్యామరణము (గల్గును),

అథవా=అట్లుకాదేని, భృగుతనయే = శుక్రుడు, ఉగ్రయోః = పాపగ్రహములయొక్క, మధ్యస్థితే=మధ్యమందుండగా (బుట్టినవానికి) నిపాతజః=ఉన్నతస్థానమునుండి పడుటవలననైనను, భృగుతనయే=శుక్రుడు, సౌమ్యగ్రహైర సహితసన్నిరీక్షితే= శుభగ్రహసంయోగవీక్షణములు లేకయుండగా (బుట్టినవానికి), పాశజః=బంధనయుక్తముగను భార్యామరణము సంప్రాప్తమగును.

తా. కళత్ర కారకుడగు శుక్రునకు చతుర్థాష్టమములయందు క్రూరగ్రహములగు సూర్యాంగారక శనైశ్చరులుండగా జనించినవాని భార్య తానుజీవించియుండు కాలముననే అగ్నివలన మరణము గలుగును.

అట్లుగాని యెడల కళత్రకారకుడగు శుక్రుడు పాపగ్రహములగు, రవికుజశనులలో, రవి, కుజలమధ్యగాని, రవిశనుల మధ్యగాని, కుజశనుల మధ్యగాని నుండునెడల తత్కాలమున జనించిన వానికి, ఎత్తైనచోటనుండి క్రిందపడుటచే భార్యామరణము సంభవించును. (శుక్రునకు రెండు పండ్రెండు స్థానములయందు పాపగ్రహము లుండునెడల నీయోగము జరుగుచున్నది.) శుక్రుడు శుభగ్రహములతో గూడకయు, శుభగ్రహములచే జూడబడకయు నుండునెడల, తత్కాలమున జనించినవాని భార్యకు, తనజీవిత కాలముననే బంధనముచే ప్రాణవియోగము గలుగును. ఈయోగములు రెండని కొందరందురుగాని "చతుర్థాష్టముగైశ్శుక్రా త్సౌరారార్కైః స్మృతాశనాత్ తేపాంద్వయోస్తు మధ్యస్థేతథా శుక్రే నిపాతజః, శుక్రేసద్యోగ దృగ్హీనే పాశాద్భార్యావధోభవేత్" అని గార్గి వచించియున్నారుగాన, మూడుయోగములనియే స్థిరపరుప దగియున్నది.

## ఏకనయన దంపతులయొక్కయు వికలాంగయగు భార్యగలవానియొక్కయు జననయోగము.

శ్లో. లగ్నాద్వ్యయారిగతయో శ్శశితిగ్మరశ్మ్యోః
పత్న్యాస హైకనయనస్య వదంతి జన్మ
ద్యూనస్థయో ర్నవమ పంచమ సంస్థయో ర్వా
శుక్రార్కయో ర్వికలదార ముశంతి జాతమ్. 3

టీ. శశితిగ్మరశ్మ్యోః = చంద్రసూర్యులు, లగ్నాత్ = లగ్నమునకు, వ్యయారిగతయోః=ద్వాదశ షష్ఠస్థానములందుండగా, పత్న్యాసహ= భార్యతోగూడ, ఏకనయనస్య= ఒంటికంటి వానియొక్క, జన్మ=జన్మమును, వదంతి=చెప్పుచున్నారు, శుక్రార్కయోః = శుక్రసూర్యులు, ద్యూనస్థయోః = సప్తమ మందుండగా, జాతం=పుట్టినవానిని, వికలదారం= అంగహీనురాలైన భార్యగల వానినిగా, ఉశంతి=చెప్పుదురు, నవమపంచమ సంస్థయోర్వా= నవమ మందైనను పంచమ మందైనను, శుక్రసూర్యులు గూడియుండగా బుట్టినవానికి అంగహీనయైన భార్య లభ్యమగునని చెప్పుదురు.

తా. జననలగ్నమునకు ద్వాదశషష్ఠస్థానములయందు సూర్యచంద్రులుండగా, జనించినవాడు ఒంటికంటి వాడగును, వానిభార్యయు ఒంటికన్ను గలదియగును.

శుక్రసూర్యులిద్దరును సప్తమస్థానముననుండగా జనించినవాడు అంగహీనురాలగు భార్యగలవాడగును. మరియు, జన్మలగ్నమునకు నవమస్థానమునందైనను, పంచమస్థానమునందైనను, శుక్రసూర్యులుండునెడల జాతకుడు వికలాంగయగు భార్యగలవాడగుననియు దెలియదగినది. పైజెప్పినస్థానములలో నొక్కస్థానముననుగాక శుక్రసూర్యులిరువురును రెండు స్థానములయందుండినను తత్కాలమున జనించినవాని భార్యకు అంగహీనము గలుగునని కొందరియభిప్రాయము.

## వంధ్యానాధ, పుత్రకళత్రహీనుల జననవివరము.

శ్లో. కోణోదయే భృగుతనయేఽస్తచక్రసంధౌ
వంధ్యాపతి ర్యది న సుతర్క్ష మిష్టయుక్తం
పాపగ్రహై ర్వ్యయ మద లగ్నరాశి సంస్థైః
క్షీణే శశి న్యసుత కళత్రజన్మ ధీస్థే. 4

టీ. కోణోదయే = శనైశ్చరుండు లగ్నగతుండై యుండఁగ, భృగుతనయే = శుక్రుండు, అస్తచక్రసంధౌ = చక్రసంధులందుండగను సుతర్క్షం = పుత్రస్థానము, ఇష్టయుక్తం న యది = శుభగ్రహములతోఁ గూడక యుండగను. వంధ్యాపతిః = గొడ్డురాలికి మగండగును, క్షీణే శశిని = క్షీణచంద్రుండు, ధీస్థే = పంచమమందుండఁగా, వ్యయమదలగ్నరాశిసంస్థైః = ద్వాదశ సప్తమలగ్నములయందున్న, పాపగ్రహైః = పాపగ్రహములచేత, అసుతకళత్రజన్మ = పుత్రకళత్రహీనుని జన్మంబగును.

తా. శనైశ్చరుడు జన్మలగ్నమునందుండి శుక్రుడు, చక్రసంధులగు కర్కాటక, వృశ్చిక, మీనరాసుల యంత్య నవాంశమగు మీనగురు నవాంశమును బొంది జననలగ్నమునకు సప్తమస్థానముననుండగా, పంచమస్థానము శుభయుక్తముగాకుండునెడల జాతకుని భార్యగొడ్డురాలగును. ఈయోగము (1) వృషభరాశి జననలగ్నమగునెడలను, (2) కన్యారాశి జన్మలగ్నమగునెడలను, (3) మకరరాశి జననలగ్నమగునెడలను గలుగుచున్నది. ఇందు కేవలము వంధ్యానాథుడని మాత్రము చెప్పుటచేత అపుత్రకుడుగాడనియు, నందుచే నితరస్త్రీయందు సంతానముగలుగుననియును నూహింపదగియున్నది. క్షీణచంద్రుడు పంచమమున నుండగా ద్వాదశ సప్తమ, లగ్నములయందుండు పాపగ్రహములచే పుత్రకళత్రహీనుని జననముగలుగుననగా జననలగ్నమునకు పంచమస్థానమున క్షీణచంద్రుండుండి జననలగ్నమునందైనను, ద్వాదశమునందైనను, సప్తమస్థానమునందైనను, లగ్నద్వాదశములకు రెంటియందైనను, సప్తమ ద్వాదశములను రెంటియందైనను, లగ్నసప్తమములు రెంటియందైనను, లేకలగ్నసప్త

మ ద్వాదశములును మూటియందైనను, పాపగ్రహములుండు నెడల తత్కాలమున జనించిన వాడు, పుత్రులు లేనివాడును భార్యలేనివాడును అగునని దెలియదగినది.

### పరస్త్రీరతుడగువాని జననయోగము.

శ్లో. అసితకుజయో ర్వర్గేఽ స్తస్థే సితే తదవేక్షితే
పరయువతిగ స్తాఽవచే త్సేందూ స్త్రియా సహ పుంశ్చలః
భృగుజశశినో ర స్తేఽభార్యో నరో విసుతోఽపి వా
పరిణతతనూ నృస్త్ర్యో ర్దృష్టే శుభైః ప్రమదాపతీ. 5

టీ. అసితకుజయోః = శనికుజులయొక్క, వర్గే = వర్గమందున్న, సితే = శుక్రుడు, అస్తస్థే = లగ్నమునకు సప్తమస్థానగతుడును, తదవీక్షితే = ఆశనికుజులలో నొకనిచేత చూడబడినవాడువగుచుండగా పుట్టినవాడు, పరయువతిగః = పరస్త్రీల బొందువాడగును, తౌ = ఆశనికుజులు, సేందూచేత్ = చంద్రునితోగూడి ఏకరాశిగతులై యుండిరేని, స్త్రీయాసహ = తనభార్యతోగూడ, పుంశ్చలః = వ్యభిచారియగును, భృగుజశశినోః = శుక్రచంద్రులకు, అస్తే = సప్తమమందు, తౌచేత్ = ఆశనికుజులుండిరేని, నరః = పురుషుడు, అభార్యః = భార్యలేనివాడును, విసుతోఽపివా = పుత్రహీనుండునగును. నృస్త్ర్యోః = ఒకపురుషగ్రహంబును ఒక స్త్రీగ్రహంబును ఏకరాశిగతములై యుండగా (ఆగ్రహములకు) అస్తే = సప్తమమందున్న శనికుజులు, శుభైః = శుభగ్రహములచే, దృష్టౌచేత్ = చూడబడిరేని, పరిణతతనూ = ముసలితనమున, ప్రమదాపతీ = భార్యాభర్తలగుదురు.

తా. శన్యంగారకుల వర్గములందుండు శుక్రుడు జననలగ్నమునకు సప్తమస్థానగతుడై ఆశనైశ్చర అంగారకులలో నొకనిచే జూడబడుచుండగా జనించినవాడు అన్యాంగనారతుడగును.

### భార్యా సహ పుంశ్చలుని జననయోగము.

శనికుజులు చంద్రసహితముగ నేకరాశిగతులై యుండగా శన్యంగారకులవర్గమునగల శుక్రుడు జననలగ్నమునకు సప్తమస్థానమందుండి శన్యంగారకులలో నొకనిచే జూడబడుచుండి తత్కాలమున జనించినవాడు, తనభార్యతో సహా వ్యభిచారము చేయువాడగును. అనగా తాను పరభార్యలయందును తనభార్య పరపురుషులతోడను సంగమము జేయువారగుదురని యూహింపదగును

### భార్యాపుత్రులు లేని వాని జననయోగము.

ఏస్థానమునందైనను, ఏకరాశిగతులగు శుక్రచంద్రులకు సప్తమస్థానమున శన్యంగారకులుండు కాలమున బుట్టినవాడు భార్యలేనివాడును, కుమారులులేనివాడును, అగును. ఇందు "విసుతోఽపివాయనుచోట" "వా" శబ్దముచకారార్థముగాన వికల్పార్థముగాదు.

### వృద్ధవయసున భార్యగలవాని జననయోగము

ఒకపురుషగ్రహమును ఒకస్త్రీగ్రహమును, ఏకరాశిస్థితులై యుండి ఆరాశికి సప్త

మస్థానమునందున్న శనైశ్చర అంగారకులు శుభగ్రహములచే జూడబడుచుండునెడల త త్కాలమున జనించినవాడు వృద్ధుడై భార్యాసమేతుడగుననగా యౌవనకాలమున సంగమము లేకయుండి తః వృద్ధదశయందు వృద్ధురాలగు భార్యచేయుపచరించుకొను వాడగునని భట్టోత్ప లుడు వ్యాఖ్యానముజేసియున్నాడు. అయినను మరికొందరు "పరిణతతనుర్నౄ తా దృష్టా శుభైః ప్రమదాపతిః" అనిపఠించి ఏకరాశిస్థితులగు శుక్రచంద్రులకు సప్తమస్థానమునందున్న శన్యంగారకులు శుభగ్రహావీక్షితులుగాక నశుభగ్రహావీక్షితు లగుచుండునెడల తత్కాలము న జనించినవాడు, వయసుచెల్లినవాడైన పిదప భార్యగల్గినవాడగునని జెప్పుచున్నారు

మరికొన్ని అరిష్టయోగముల వివరము.

శ్లో. వంశచ్ఛేత్తా ఖ మద సుఖగై శ్చంద్ర దైత్యేజ్య పాపై
శ్శిల్పీ త్ర్యంశే శశిసుతయుతే కేంద్రసంస్థార్కిదృష్టే
ధాస్యాం జాతో దితిసుతగురౌ రిఃఫగే సౌరభాగే
నీచోఽర్కేందోర్మదనగతయో ర్దృష్టయో స్సూర్యజేన. 6

టీ. ఖమదసుఖగైః=దశమసప్తమ చతుర్థస్థానములందుండు, చంద్రదైత్యేజ్యపాపైః= చంద్రశుక్ర పాపగ్రహములచేత, వంశచ్ఛేత్తా = వంశచ్ఛేదకుండగును, శశిసుతయుతే = బుధునితోఁగూడిన, త్ర్యంశే = ద్రేక్కాణసంబంధ రాశి, కేంద్రసంస్థార్కిదృష్టే = లగ్న కేంద్రమందున్న శనైశ్చరునిచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినవాఁడు, శిల్పీ = చిత్రకర్మల ందు సమర్థుడగును. దితిసుతగురౌ = శుక్రుఁడు, రిఃఫగే = లగ్నమునకు ద్వాదశస్థానగతుం డై, సౌరిభాగే = శనినవాంశయందుండఁగా, దాస్యాం = దాసియందు, జాతః = పుట్టినవాఁ డగును. అర్కేందోః = సూర్యచంద్రులు, మదనగతయోః = సప్తమస్థానగతులై, సూ ర్యజేన = శనిచేత, దృష్టయోః = చూడఁబడినపుడుఁ బుట్టినవాఁడు, నీచః=అధమకృత్యములు చేయువాఁడగును.

తా. దశమసప్తమ చతుర్థస్థానములందున్న చంద్రశుక్ర పాపగ్రహములచేత వంశ చ్ఛేదకుడగుననగా జననలగ్నమునకు దశమస్థానమున చంద్రుండును, సప్తమమున శుక్రుడు ను, చతుర్థస్థానమున పాపగ్రహములును యుండగా జనించినవానివంశము నభివృద్ధి గాకయుం డురీతిని వానికి గలుగు సంతానమునకు నాశనముగలుగునని తెలియదగినది.

బుధునితోగూడిన ద్రేక్కాణము ఏరాశిసంబంధమైనదో యారాశిలగ్న కేంద్రస్థితు డగు శనైశ్చరునిచే జూడబడుచుండునెడల జాతకుడు వడ్రంగియైనను చిత్రములు వ్రాయు టచే జీవించువాడైనను, అగును. జననలగ్నమునకు ద్వాదశస్థానమునందుగల శనైశ్చర నవాం శయందు శుక్రుడుండునెడల జాతకుడు దాసియందు బుట్టినవాడగును.

సూర్యచంద్రులిరువురును, జననలగ్నమునకు సప్తమస్థానమునుండి శనైశ్చరునిచే జూడబడుచుండునెడల జాతకుడు నీచకార్యప్రవర్తకుడగును.

## రోగి జననయోగములు.

శ్లో. పాపాలోకితయో స్సితావనిజయో రస్తస్థయో ర్వృద్ధిరు
క్చంద్రే కర్కటవృశ్చికాంశకగతే పాపై ర్యుతే గుహ్యరుక్
శ్విత్రీ రిఃఫ ధనస్థయో రశుభయో శ్చంద్రోదయేఽస్తే రవౌ
చంద్రే ఖేఽవనిజేఽస్తగే చ వికలో ఘు ద్యర్కజో వేశిగః. 7

టీ. సితావనిజయోః = శుక్రకుజులు, అస్తస్థయోః = లగ్నమునకుసప్తమమందున్నవారలై, పాపాలోకితయోః=పాపగ్రహముచే, చూడఁబడుచుండఁగ, (పుట్టినవాఁడు), వృద్ధిరుక్ = వృద్ధియనెడు వ్యాధిగలవాఁడగును, చంద్రే = చంద్రుఁడు, కర్కటవృశ్చికాంశకగతే = కర్కటనవాంశయందుఁగాని వృశ్చికనవాంశయందుఁగాని యున్నవాఁడై, పాపైః = పాపగ్రహములతోడ, యుతే = కూడునపుడు (పుట్టినవాఁడు) గుహ్యరుక్ = గుహ్యప్రదేశమందు వ్యాధిగలవాఁడౌను, అశుభయోః = పాపులు, రిఃఫధనస్థయోః = ద్వాదశద్వితీయముల యందును, చంద్రోదయే = చంద్రుఁడు లగ్నమందును, రవౌ = సూర్యుఁడు, అస్తే = సప్తమమందు నుండగను, పుట్టినవాఁడు, శ్విత్రీ = తెల్లకుష్ఠువ్యాధి గలవాఁడగును, చంద్రే = చంద్రుఁడు, ఖే=దశమమందుండఁగను, అవనిజే = కుజుఁడు, అస్తగేచ = సప్తమమందుండగను, అర్కజః = శనైశ్చరుడు, వేశిగోయది = సూర్యునికి రెండవరాశియందుండగను పుట్టినవాఁడు, వికలః = అంగహీనుఁడగును.

తా. జననలగ్నమునకు సప్తమస్థానమున శుక్రాంగారకులుండి ఒకపాపగ్రహముచే జూడబడుచుండునెడల జాతకుడు గడ్డవలెబుట్టెడు రోగవిశేషము (దద్దురోగము)చే పీడింపబడువాడగును (వృద్ధిరుక్ కుబదులు 'అర్ధదృక్' అనిపఠించి సగముచూపుగలవాడగునని కొందరందురు) ఏరాశియందైనను కర్కాటకనవాంశయందైనను, వృశ్చికనవాంశయందైనను, చంద్రుఁడుండి పాపగ్రహయుక్తుడగుచుండగా బుట్టినవాఁడు, గుహ్యప్రదేశమున వ్యాధిగలవాడగును.

అశుభగ్రహములగు శన్యంగారకులు ద్వాదశద్వితీయములయందుండి చంద్రుడు జన్మలగ్నమునను, సూర్యుడు సప్తమముననుండునెడల జాతకుడు, తెల్లకుష్ఠువ్యాధిగలవాడగును.

చంద్రుడు జననలగ్నమునకు దశమమునను, అంగారకుడు సప్తమమునను, శనైశ్చరుడు సూర్యునికి రెండవస్థానముననుండునెడల తత్కాలమునజనించినవాడు, అంగహీనుడై కలవరములతోఁగూడిన వాడగునని దెలియదగినది.

## మరికొన్ని అనిష్టయోగములు.

శ్లో. అంతి శ్శశి న్యశుభ యో ర్మృగగే పతంగే
శ్వాస క్షయ ప్లీహక విద్రధి గుల్మ భాజః
శోషీ పరస్పర గృహాంశగయో రవీంద్వోః
క్షేత్రేఽథవా యుగపదేక గయోః కృశో వా. 8

టీ. శశిని = చంద్రుఁడు, అశుభయోః = పాపులయొక్క, అంతః = మధ్యమందును, పతంగే = సూర్యుడు, మృగగే = మకరమందునుండఁగను, పుట్టినవారు, శ్వాసక్షయప్లీహక విద్రధిగుల్మభాజః - శ్వాస = శ్వాసవ్యాధి, క్షయ = క్షయవ్యాధి, ప్లీహక = కడుపున నెడమ భాగమున నుండెడు మాంసఖండ సంబంధమైన ప్లీహకవ్యాధి, విద్రధి = కడుపులోపల బల్ల, గుల్మ = గుల్మవ్యాధి, వీనిలోనొకవ్యాధిని, భాజః = అనుభవించు వారలగుదురు, రవీంద్వోః = సూర్యచంద్రులు, పరస్పరగృహాంశగయోః = ఒకనిక్షేత్రమందొకఁడుగానైనను, ఒకనియంశమందొకఁడుగానైననుండఁగా, అథవా = ఏరాశియందైన సింహాంశయందు చంద్రుండును కర్కాటాంశయందు సూర్యుండునుండఁగాఁ బుట్టినవాఁడు, శోషీ = క్షయరోగము గలవాఁడగును, రవీంద్వోః క్షేత్రే = సూర్యచంద్రక్షేత్రములందు, యుగపత్ = ఒకమారు, ఏకగయోః = సూర్యచంద్రులిద్దరును ఏకరాశిగతులై యుండఁగఁ (బుట్టినవాడు) క్షయరోగియగును లేక, కృశోవా = దుర్బలుండైన నగును.

తా. చంద్రుఁడు శన్యంగారకుల నడుమను, సూర్యుడు మకరమందును నుండగాజనించినవాడు 1 శ్వాసము, 2 క్షయము, 3 ప్లీహము (అనగా కడుపున నెడమ ప్రక్కన నుండు మాంసకోశసంబంధమగు వ్యాధి) 4 విద్రధి (అనగా కడుపున బుట్టెడు బల్ల సంబంధమగు వ్యాధి) 5 గుల్మవ్యాధి అను నీ యైదింటియందు నేదైన నొక రోగముచే బీడింపబడు వాడగును సూర్యచంద్రులు పరస్పర స్థానముల యందైనను అంశముల యందైనను నుండగా జాతకుడు క్షయరోగి యగును. అనగా సూర్యునిక్షేత్రమగు సింహరాశియందు చంద్రుడును, చంద్రక్షేత్రమగు కర్కాటక రాశియందు సూర్యుడును ఉండగానైనను, ఏరాశియందైనను సూర్యాంశమున చంద్రుడును, చంద్రాంశమున సూర్యుడును, ఉండగానైనను, జనించినవాడు క్షయరోగము గలవాడగును.

ఈ విషయమున, సూర్యక్షేత్రమగు సింహరాశియందు సింహాంశమున చంద్రుడును చంద్రక్షేత్రమగు కర్కాటకమున కర్కాటకాంశ యందు సూర్యుడును ఉండదగునని కొందరందురుగాని "పరస్పరగృహే యాతౌ యది వాపి తదంశగౌ, భవేతాం మర్క శీతాంశు, తదా శోషీ ప్రజాయతే" యను గార్గివచనమునకు రెండవమతము విరోధముగా నుండుటవలన గ్రాహ్యముగాదని తెలియదగినది. మరియు, సూర్యచంద్రుల స్వక్షేత్రములగు సింహ కర్కాటకములయందు. సూర్యచంద్రులుండగా బుట్టినవాడు క్షయరోగియైనను దుర్బలుడైనను అగును ఇట్లగుటచే సింహమున సూర్యచంద్రు లుండినను, కర్కాటకమున చంద్రసూర్యు లుండినను నీయోగము తటస్థించునని తెలియదగినది.

## మరికొన్ని అనిష్టయోగములు.

శ్లో. చంద్రే శ్వమధ్య ఝష కర్కి మృగాజ భాగే
కుష్ఠీ సమందరుధిరే తద వేక్షితే వా

యాతైస్త్రికోణ మళి కర్కి వృషైర్మృగేణ
కుష్ఠీచ పాపసహితై రవలోకితై ర్వా. 9

టీ. అశ్వమధ్య = (ధనూరాశియొక్క పంచమాంశమైన సింహనవాంశ యందుగాని ఝషకర్కిమృగాజభాగే = మీనకర్కాటక మకర మేష నవాంశలలో నొకనవాంశ యందుగాని (ఉన్నట్టి) చంద్రే = చంద్రుడు, సమందరుధిరే = శనికుజులలో నొకనితో గూడికాని, తదవేక్షితేవా = ఆశనికుజులలో నొకనిచేత జూడబడియున్న కాలమున (పుట్టినవాడు) కుష్ఠీ=కుష్ఠురోగియగును, అళికర్కివృషైర్మృగేచ = వృశ్చిక కర్కాటక వృషభమకరములలో నొకరాశి, త్రికోణం = లగ్నమునకు పంచమస్థానముగాని నవమస్థానముగాని, యాతైః = పొందియుండి, ఆరాశి, పాపసహితైః = పాపగ్రహముతో గూడినదిగాని, అవలోకితైర్వా = పాపగ్రహముచేత చూడబడినదిగాని యైన కాలమున బుట్టినవాడు కుష్ఠురోగియగును.

తా. ధనూరాశియొక్క మధ్యాంశయు పంచమాంశయునైన సింహనవాంశ యందైనను, ఏరాశియందైననుగల మీన, కర్కాటక, మకర, మేష. నవాంశలలో నొకనవాంశయందైనను నుండు చంద్రుడు శన్యంగారకులలో నొక్కనిగూడినను, లేకవారలలో నొక్కనిచే నైనను జూడబడు చుండినను తత్కాలమున జనించినవాడు కుష్ఠురోగి యగును, ఈ యోగ విషయమునకుగాను "మీనాంశకే మేషమృగాంశకే వా చంద్రస్థితో త్రైవ హి పాపదృష్టః కిలాస కుష్ఠాది వినష్ట దేహా మిష్టేక్షితః కండు వికారి ణంచ" అను యవనేశ్వర వచనాను గుణ్యముగ, చంద్రునకు శుభగ్రహయుక్తమైనను వీక్షణమైనను నుండు నెడల జాతకుడు దురదరోగము గలవాడగునుగాని కుష్ఠురోగి గాడని అభిప్రాయ మేర్పడుచున్నది. జననలగ్నమునకు పంచమస్థానమైనను, నవమస్థానమైనను వృశ్చిక, కర్కాటక, వృషభ మకరములలో నొక రాశియై పాపగ్రహ యుక్తమైనను, వీక్షితమైనను యగునెడల తత్కాలమున జనించినవాడు కుష్ఠురోగియగునని చెప్పదగును.

శ్లో. నిధనారి ధన వ్యయస్థితా రవి చంద్రా రయమా యథా తథా
బలవద్గ్రహదోష కారణై ర్మనుజానాం జనయంత్యనేత్రతామ్. 10

టీ. రవిచంద్రారయమాః=సూర్యచంద్ర కుజ శనులు, యథాతథా=(క్రమనియమము లేక) యెటులైనను, నిధనారి ధనవ్యయస్థితాః = అష్టమషష్ఠద్వితీయ ద్వాదశములయందున్నవారలై, బలవద్గ్రహ దోష కారణైః = ఏగ్రహముబలవత్తరమై యుండునో ఆగ్రహమునకు ఏదోషము చెప్పబడియున్నదో ఆదోష కారణముచేత మనుజానాం=అపుడు బుట్టిన నరులకు, అనేత్రతాం = అంధత్వమును, జనయంతి=కలుగంజేయుదురు.

తా. సూర్య చంద్రాంగారక శనైశ్చరులు, క్రమనిబంధనములేక ఏలాగైనను లగ్నమునకు 8, 6, 2, 12 యిండ్ల యందుండు నెడల ఆనాలుగు గ్రహములలో నేగ్రహము బల

యుతమగు చుండునో ఆగ్రహమునకు వాతపిత్త శ్లేష్మాది వ్యాధులలో నేదిజెప్పబడినదో యారోగముల మూలకముగ సంధత్వము గలుగుచున్నది సూర్యుడు బలయుతుడగు నెడల పిత్తాధిక్యత చేతను, చంద్రుడు బలయుక్తుడగునెడల అధిక వాతశ్లేష్మ వ్యామిశ్రతచేతను అంగారకుడు బలీయుడగునెడల పైత్యాధిక్యత చేతను, శనైశ్చరుడు బలవంతుడగు నెడల వాతప్రకోపము చేతను గ్రుడ్డితనము జాతకునకు గలుగునని నూహింపదగినది.

శ్లో. నవ మాయ తృతీయ ధీ యుతా నచ సౌమ్యై రశుభాని రీక్షితాః
నియమా చ్ఛ్రవణోప ఘాతదా రద వైకృత్య కరా శ్చసప్తమే. 11

టీ నవమాయ తృతీయధీయుతాః=నవమైకాదశ తృతీయపంచమములతోఁ గూడియున్న, అశుభాః = పాపగ్రహములు, సౌమ్యైః = శుభగ్రహములచేత, ననిరీక్షితాః = చూడఁబడకుండిరేని, నియమాత్=నిశ్చయముగా, శ్రవణోపఘాతదాః = చెవులకుబాధావమును కలుగజేయుదురు, సప్తమే=లగ్నమునకు సప్తమమందున్న పాపగ్రహములు శుభగ్రహములచేత చూడఁబడకుండిరేని, రదవైకృత్యకరాః = దంతవ్యాధిని గలుగజేయుదురు.

తా. జనన లగ్నమునకు 9, 11, 3, 5, ఇండ్లయందుండు పాపగ్రహములు శుభగ్రహ వీక్షితముగాక యుండునెడల ఆపాపగ్రహములలో బలయుత గ్రహమునకు జెప్పబడిన వాతపిత్త శ్లేష్మాది దోషకారణముచే నిశ్చయముగ జెవుల కుపద్రవము గలుగును ఇందు అశుభగ్రహములని గూఢముగా జెప్పియున్నను పూర్వ శ్లోకమున జెప్పియుండు ప్రకారము సూర్య, చంద్రాంగారక శనైశ్చరులనే స్థిరపరుప దగియున్నది. మరియు పూర్వశ్లోకమున నా రవి చంద్రకుజశనుల కేవాతాదిదోషములు జెప్పబడియున్నవో అవియేనీరోగమునను నూహింపదగినది. జనన లగ్నమునకు సప్తమస్థానము నందుండు పాపగ్రహములు శుభగ్రహములచే జూడబడకుండునెడల జాతకునకు దంతరోగము గలుగును.

శ్లో. ఉదయ త్యుడుపే సురాస్యగే సపిశాచో శుభయో స్త్రికోణయోః
సోపప్లవమండలే రవా వుదయస్థే నయనా పవర్జితః. 12

టీ అసురాస్యగే=రాహుగ్రస్తుడైన, ఉడుపే=చంద్రుండు, ఉదయతి= లగ్నమందుండఁగను, అశుభయోః = పాపగ్రహములు, త్రికోణయోః = పంచమనవమముల యందుండగను, పుట్టినవాఁడు, సపిశాచః=పిశాచగ్రస్థుఁడగును, సోపప్లవమండలే=రాహుగ్రస్తమండలుడగు, రవౌ=సూర్యుండు, ఉదయస్థే = లగ్నగతుండుకాగా, అశుభయోః=పాపులు, త్రికోణయోః = పంచమనవమములయందుండిరేని, (అపుడు పుట్టినవాఁడు) నయనాపవర్జితః = గ్రుడ్డివాఁడగును.

తా. జనన లగ్నమున రాహుగ్రస్తుడగు చంద్రుడును త్రికోణములగు పంచమ, నవమములయందు శన్యంగారకులు నుండగా జనించినవాడు పిశాచగ్రస్తుడగును, అనగా రాహుగ్రస్తమగు చంద్రగ్రహణ కాలమున జననమై చంద్రుడు లగ్నమునను, పాపగ్రహములగు

శనికుజులు, 5, 9, ఇండ్లయందుండు నెడల నీరోగము తటస్థించును ఇట్లే రాహుగ్రస్త సూర్యగ్రహణ కాలమున జననమై ఆసూర్యుడు జననలగ్నమునందును, శన్యంగారకులు పంచమ నవమముల యందును నుండు నెడల జాతకుడు గ్రుడ్డివాడగునని తెలియదగినది.

శ్లో. సంస్పృష్టః పవనేన మందగయుతే ద్యూనే విలగ్నే గురౌ
సోన్మాదో వనిజే స్థితే స్తభవనే జీవే విలగ్నాశ్రితే
తద్వత్సూర్య సుతోదయే వనిసుతే ధర్మాత్మజ ద్యూనగే
జాతో వాస సహస్ర రశ్మితనయె క్షీణేవ్యయేశీతగౌ. 13

టీ. ద్యూనే = సప్తమస్థానము, మందగయుతే = శనియుక్తమై యుండఁగను, విలగ్నే=జన్మలగ్నమందు, గురౌ=బృహస్పతి యుండగను, జన్మించినవాఁడు, పవనేన=వాతరోగముచేత, సంస్పృష్టః = వ్యాప్తుడౌను, అవనిజే=కుజుఁడు, అస్తభవనే = సప్తమమందుండఁగా, జీవే=బృహస్పతి, విలగ్నాశ్రితే=జన్మలగ్నమందుండగా జనించినవాఁడు, సోన్మాదః= చిత్త విభ్రమము గలవాఁడగును, సూర్యసుతోదయే = శనైశ్చరుడు లగ్నగతుండై యుండఁగా అవనిసుతే=కుజుడు, ధర్మాత్మజద్యూనగే = నవమపంచమ సప్తమములలో నొకస్థానమందుండెనేని, తద్వత్=ఆప్రకారమే బుద్ధిభ్రంశము గలవాఁడగును, క్షీణేశీతగౌ = క్షీణ చంద్రుడు, సహస్రరశ్మితనయే = శనితోఁ గూడినవాఁడై, వ్యయే=ద్వాదశమందుండఁగా, జాతోవా = పుట్టినవాఁడైనను, మతిభ్రమము గలవాఁడగును.

తా. జనన లగ్నమున బృహస్పతియు, నేడవయింట శనైశ్చరుడు నుండగా జనించినవాడు, వాతరోగముచే నధికముగ బీడింప బడువాడగును, జనన లగ్నమున బృహస్పతియు సప్తమ స్థానమున నంగారకుడును నుండు నెడల జాతకుడు మతిభ్రమ గలవాడగును మరియు శనైశ్చరుడు జనన లగ్నమునందుండి అంగారకుడు నవమ, పంచమ, సప్తమ స్థానములలోనొకస్థానమున నుండు నెడలను జాతకుడు పూర్వరోగము రీతిగనే చిత్తచాంచల్యము గలవాడగును మరియు క్షీణచంద్రుడు, సూర్య పుత్రుడగు శనైశ్చరయుతుడై జనన లగ్నమునకు ద్వాదశ స్థానమున నుండు నెడలను జాతకుడు చిత్తవిభ్రమము గలవాడగును.

శ్లో. రాశ్యంశ పోష్ణకర శీతకరా ఽమరేజ్యై
ర్నీచాధి పాంశకగతై రరిభాగగైర్వా
ఏభ్యోల్ప మధ్య బహుభిః క్రమశః ప్రసూతా
జ్ఞేయాః స్వ్య రభ్యుపగమ క్రయ గర్భదాసాః. 14

టీ. రాశ్యంశపోష్ణ కరశీతకరా మరేజ్యైః—రాశ్యంశప = ఏనవాంశయందు చంద్రుండుండునో ఆనవాంశ — రాశ్యంశయనంబడును — రాశ్యంశపతియు, ఉష్ణకర=సూర్యుడును శీతకర=చంద్రుడును, అమరేజ్యః= బృహస్పతియు, నీచాధిపాంశకగతైః = నీచరాశ్యధిపతు

ల నవాంశల యందుండఁగా నైనను, అరిభాగగైర్వా = శత్రునవాంశల యందుండఁగానైనను, ప్రసూతాః = పుట్టినవారు, దాసాః= దాసులగుదురు, ఏభ్యః=ఈచంద్రాధిష్ఠితరాశ్యధిపతి సూర్యచంద్రగురువుల వలన, అల్పమధ్యబహుభిః = అల్ప=ఒకగ్రహముచేతను, మధ్య=రెండుగ్రహముల చేతను, బహుభిః = అధికగ్రహములచేతను, క్రమశః = క్రమముగా, అభ్యుపగమ క్రయగర్భదాసాః – అభ్యుపగమ = తాను తనజీవనార్థమై దాసత్వమును అంగీకరించిన వాఁడును, క్రయ=అమ్ముంచుకొని దాసత్వమును పొందినవాఁడును, గర్భదాసాః=దాసపుత్రుండును అగును.

తా జనన కాలమున నేనవాంశయందు చంద్రుఁడుండునో యానవాంశాధిపతియు సూర్యుడు, చంద్రుడు, బృహస్పతియు, వీరునల్గురును. తమ తమ నీచరాశ్యధిపతులనవాంశలయందైనను, యుండుకాలమున జనించినవారు దాసులగుదురు మరియు పై జెప్పబడిన నాలుగు గ్రహములలో ఒకగ్రహము తన నీచరాశ్యధిపతి నవాంశయందైనను, శత్రునవాంశయందైనను నుండునెడల జాతకుడు, తన జీవనార్థమునకుగాను దాసత్వమును అంగీకరించిన వాడగుననియు, రెండుగ్రహములు తమతమ నీచనవాంశ యందైనను, శత్రునవాంశయందైనను నుండగా జనించినవాడు తన్నువిక్రయించుకొని దాసుడైయుండువాడగుననియు, మూడులేక నాలుగు గ్రహములు తమతమ నీచ, శత్రునవాంశలయందుండు నెడల వంశపరంపరగ దాసవృత్తిచేజీవించు వాడగుననియు దెలియదగినది ("రాశ్యంశ"—జనన కాలమున చంద్రుడుండు నవాంశరాశి)

శ్లో. వికృతదశనః పాపైర్దృష్టే వృషాజహయోదయే
ఖలతి రశుభక్షేత్రే లగ్నే హయే వృషభేఽపి వా
నవమసుతగే పాపైర్దృష్టే రవావదృఢేక్షణో,
దినకరసుతే నైకవ్యాధిః కుజే వికలః పుమాన్. 15

టీ. వృషాజహయోదయే = వృషభ మేష ధనుస్సులలో నొకటిలగ్నమై, పాపైః=పాపగ్రహములచేత దృష్టే=చూడఁబడుచుండఁగ (పుట్టినవాఁడు) వికృతదశనః = వక్రదంతములు గలవాఁడగును, అశుభక్షేత్రే = పాపగ్రహక్షేత్రములుగాని (మేష సింహవృశ్చిక మకరకుంభములలో నొకటి) హయే=ధనుస్సుగాని, వృషభేపివా = వృషభముగాని, లగ్నే=జన్మలగ్నమై, పాపగ్రహముచేత చూడఁబడుచుండిన, ఖలతిః = బట్టతలగలవాఁడగును, నవమసుతగే= నవమమందైనను పంచమమందైననున్న, రవౌ=సూర్యుడు, పాపైర్దృష్టే=పాపగ్రహములచేత చూడఁబడుచుండఁగ (జనించినవాఁడు) అదృఢేక్షణః = నేత్రదార్ఢ్యము లేనివాడగును, దినకరసుతే = శనైశ్చరుండు లగ్నమునకు నవమపంచమములయందుండి పాపగ్రహములచేత చూడఁబడుచుండఁగా (పుట్టినవాఁడు) నైకవ్యాధిః= అనేకరోగములు గలవాఁడగును, కుజే= అంగారకుఁడు నవమ పంచమములయందుండి పాపగ్రహవీక్షణముండగా పుట్టిన, పుమాన్= మనుష్యుండు, వికలః = అంగహీనుండగును.

తా. జనన లగ్నము వృషభ, మేష, ధనూరాశుల యందొకటియై యుండి పాపగ్రహవీక్షితమగుచుండు నెడల తత్కాలమున జనించినవాడు వికారముగల దంతములు గలవాడగును. జననలగ్నము పాపగ్రహక్షేత్రములగు మేషసింహ, వృశ్చిక, మకర, కుంభములలో నొక్కటి యైనను, ధనూరాశియైనను, లేక వృషభ రాశియైన నగుచు, పాపగ్రహములచే జూడబడుచుండు నెడల తత్కాలమున జనించినవాడు, బట్టతలగలవాడగును మఱియు నీవిషయమున, ఏపాపగ్రహ క్షేత్రము జననలగ్నమగుచున్నదో ఆపాపగ్రహముచేతనే జూడబడుచుండు నెడల ననగా మేష, వృశ్చికములలో నొకటిలగ్నమగు చుండగా నాలగ్నము అంగారకునిచే జూడబడు చుండు నెడలను, శుభగ్రహ వీక్షణ్యము గలుగుచుండినను, జాతకులు వృద్ధవయస్కులైన బట్టతలగల వారగుచున్నారని కొందరు అభిప్రాయ పడుచున్నారు. జనన లగ్నమునకు పంచమ నవమ స్థానములలో నొకదానియందు సూర్యుడుండి పాపగ్రహములచే జూడబడుచుండగా జనించినవాడు, దృఢమగు చూపులేని వాడగును. జనన లగ్నమునకు పంచమ, నవమస్థానములయం దొకదానియందు శనైశ్చరుడుండి పాపగ్రహములచే జూడబడుచుండు నెడల తత్కాలమున జనించినవాడ అనేక రోగములచే బీడింపబడు వాడగును. జననలగ్నమునకు పంచమనవమములలో నొకస్థానమునందు అంగారకుడుండి పాపగ్రహములచే జూడబడుచుండు నెడల తత్కాలమున జనించినవాడు వికలాంగుడగునని దెలియదగినది.

శ్లో. వ్యయ సుత ధన ధర్మగై రసౌమ్యై
ర్భవనసమాన నిబంధనం వికల్ప్యం
భుజగ నిగళ పాశ భృద్దృకాణై
ర్బలవదసౌమ్యనిరీక్షితైశ్చ తద్వత్. 16

టీ. వ్యయసుతధన ధర్మగైః = ద్వాదశ పంచమ ద్వితీయ నవమములయందు, అసౌమ్యైః = పాపగ్రహములచేత, భవన సమాననిబంధనం = లగ్నరాశికి సమానమైన నిబంధన, వికల్ప్యం = వికల్పింపందగును, బలవదసౌమ్య నీరీక్షితైః = బలయుక్తమైన పాపగ్రహము చేతఁ జూడఁబడిన, భుజగనిగళ పాశభృద్దృకాణైః = భుజగద్రేక్కాణము నిగళద్రేక్కాణము, (ఈరెండు ద్రేక్కాణములచేతి) తద్వత్ = పూర్వోక్తప్రకారముగ భవనసమానబంధనము చెప్పఁదగినది.

తా. జనన లగ్నమునకు 12, 5, 2, 9 స్థానములయందు యథాసంభవముగా పాపగ్రహములుండు నెడల లగ్నరాశి సమానముగు బంధనము జాతకులు బొందుచున్నారు, అనగా మేషవృషభ ధనూరాసులలో నొకటి జన్మలగ్నమగుచు, తదాది, ద్వాదశ, పంచమ, ద్వితీయ నవమములయందు యథాసంభవముగా పాపగ్రహము లుండు నెడల జాతకుడు త్రాళ్లచే గట్టబడువాడగుననియు, మిథున కన్యాతులా కుంభములలో నొక రాశి జననలగ్నమగుచు పూర్వము జెప్పబడిన స్థానములయందు యథాసంభవముగా పాపగ్రహము లుండగా జనించినవాడు, శృంఖలములచే బంధింపబడు వాడగుననియు, కర్కాటక, మకరమీనరా

ములలో నొకటి జననలగ్నమగుచు, పాపగ్రహములుపూర్వోక్తముగ నుండగా జనించిన మానవుడు పాశాలో నైనను, దుర్గమస్థానముల యందైనను బంధింపబడు వాడగుననియు, వృశ్చికము జన్మలగ్నమగుచుండి పాపగ్రహములు పైజెప్పబడిన స్థానములందుండు నెడల జాతకుడు సంకెలమాలికలయందు బంధింపబడు వాడగుననియు, సింహము జననలగ్నమగుచు నాలగ్నమునకు 12, 5, 2, 9 యిండ్లయందు పాపగ్రహములుండగా జనించినవాడు, గుహాంతరాళముల యందు బంధింప బడువాడగుననియును దెలియదగినది మరియు బలీయులగు పాపగ్రహములచేత జూడబడిన భుజగ, నిగళద్రేక్కాణములలో నొక్కదానియందు జననమగు నెడల నాజాతకుడు నభవన సమాన బంధనమును బొందుచున్నాడు అనగా జననకాలము ఏద్రేక్కాణమగుచున్నదో నాద్రేక్కాణము, భుజగద్రేక్కాణమైనను, నిగళ ద్రేక్కాణమైనను, అగుచు నాద్రేక్కాణము ప్రథమ, పంచమ, నవమములచేత నేరాశియగుచున్నదో యారాశి బలయుతములగు పాపగ్రహములచే జూడబడుచుండు నెడల, తత్కాలమున జనించిన వాడును, భవనసమాన నిబంధనమును పూర్వోక్తప్రకారము బొందుచున్నాడనియు నూహింపదగి యున్నది.

[కర్కాటకరాశి ప్రథమద్రేక్కాణము, వృశ్చికప్రథమ ద్వితీయద్రేక్కాణములు, మీనరాశియొక్క అంత్య ద్రేక్కాణమునునవి భుజగద్రేక్కాణము లనబడును.]

మకరరాశి ప్రథమద్రేక్కాణము నిగళద్రేక్కాణ మనబడును.

శ్లో. పరుషవచనోఽపస్మారార్తః క్షయీ చ నిశాపతౌ
సరవితనయే వక్రాలోకం గతే పరివేషగే
రవి యమ కుజైః స్సౌమ్యాదృష్టైర్నభస్స్థల మాశ్రితై
ర్భృతకమనుజాః పూర్వోద్దిష్టై ర్వరాఽధమ మధ్యమాః. 17

టీ. నిశాపతౌ=చంద్రుడు, సరవితనయే=శనితోఁగూడినవాడై, వక్రాలోకంగతే=అంగారకునిచేఁ జూడఁబడినవాడై, పరివేషగే=పరివేషమధ్యముననుండఁగ బుట్టినవాడు, పరుషవచనః=కఠినభాషియు, అపస్మారార్తః=అపస్మారరోగముచే పీడింపబడువాఁడును, క్షయీచ=క్షయరోగియు అగును, సౌమ్యాదృష్టైః=శుభగ్రహముచే చూడఁబడక, నభస్స్థలమాశ్రితైః=దశమస్థానమందున్నట్టి, రవియమకుజైః = రవిశనికుజులచేత, భృతకమనుజాః = సేవకులు జనింతురు, వారలు, పూర్వోద్దిష్టైః = పూర్వోక్త రవి శని కుజులచేత, వరాధమమధ్యమాః=శ్రేష్ఠాధమ మధ్యములగుదురు.

తా. చంద్రుడుశనైశ్చరయుతుడై అంగారకునిచేత జూడబడుచు, పరివేషమధ్యగతుడై యుండు కాలమున బుట్టినవాడు, కఠినముగను, నిష్ఠురముగను మాటలాడువాడును, దుఃఖాదులచేగలిగెడి మనోవికారతగలవాడును, క్షయరోగముచే బీడింపబడువాడును అగును, అ

నగా చంద్రుడు శనైశ్చరునితోఁగూడియుండగా బుట్టినవాడు నిష్ఠురమును, కఠినమును మాటలాడువాడగుననియు, చంద్రుడు శనైశ్చరయుతుడై కుజునిచే జూడబడుచుండగా జనించినవాడు, దుఃఖాదులచే గలుగు మనోవికారతగలవాడగుననియు, చంద్రుడు శనైశ్చరయుతుడై అంగారకవీక్షితుడగుచు, పరివేషగతుండై యుండగా జనించినవాడు, క్షయరోగియగుననియు దెలియదగినది.

జననలగ్నమునకు దశమస్థానమునందుండు సూర్యాంగారకశనైశ్చరులు శుభగ్రహములచే జూడబడకయుండు కాలమున జనించినవారు క్రమముగా వర్గాభృత్యులగుదురనగా దశమస్థానము నొకపాపగ్రహముండి శుభగ్రహవీక్షితుడుగానియెడల జాతకుడు గౌరవమును, అధికారమును, ఆదాయాధిక్యమునుగల భృతిసేయువాడగుననియు, దశమస్థానస్థిత రెండు పాపగ్రహములు శుభగ్రహ దృష్టములుగాకయుండునెడల జాతకుడు మధ్యమమగు కూలివృత్తిచే జీవించువాడగుననియు, దశమస్థానమునందుండు మూడుపాపగ్రహములు శుభగ్రహములచే జూడబడకయుండు కాలమున జనించినవాడు అధమమగు కూలిపనిచేయువాడగుననియు దెలియదగినది. మరియు నీవిషయమున దశమస్థానమునందున్నట్టి సూర్యాదిపాపగ్రహములు మూడును, శుభగ్రహ వీక్షితులుగా గాకయుండి చంద్రుని జూచునెడలను జాతకుడు భృతిజేయువాడగుననియు నూహించుచున్నారు.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
నరిష్టాధ్యాయ నామక
ద్వావింశోఽధ్యాయము.



శ్రీ రస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### స్త్రీజాతకాధ్యాయము. త్రయోవింశోధ్యాయము.—23.



స్త్రీజాతకఫల వివరము.

శ్లో. యద్యత్ఫలం నరభవేఽక్షమమంగనానాం
తత్తద్వదేత్పతిషు వా సకలం విధేయం
తాసాం తు భర్తృమరణం నిధనే వపుస్తు
లగ్నేందుగం సుభగతాఽస్తమయే పతిశ్చ. 1

టీ. నరభవే = పురుషజన్మమందుచెప్పిన, యద్యత్ఫలం = ఏయేఫలము, అంగనానాం = స్త్రీలకు, అక్షమం = అయుక్తమైనదో, తత్తత్ = ఆయాఫలమును, పతిషు = ఆస్త్రీలభర్తలయందు, వదేత్ = చెప్పవలెను. అథవా = అటుగాకపోయినను, సకలం = సకలమైన (స్త్రీజాతకఫలము), పతిషు=ఆస్త్రీలభర్తలయందు, విధేయం = చెప్పదగినది. తాసాం = ఆస్త్రీలకు, నిధనే (జన్మలగ్నమునకు) అష్టమస్థానమందు, భర్తృమరణం = పతిమరణమును జెప్పఁదగినది = వపుస్తు = స్త్రీలశరీరము, లగ్నేందుగం = లగ్నచంద్రులవలన ముందువలెనే జెప్పఁదగినది. సుభగతా = సౌభాగ్యంబును, పతిశ్చ = మగఁడెట్టివాఁడగునో అదియును, అస్తమయే = సప్తమస్థానమునుబట్టి వక్ష్యమాణప్రకారముగాఁ జెప్పదగును.

తా. పూర్వాధ్యాయములయందు పురుషుల జన్మకాలము ననుసరించిచెప్పబడిన ఫలములన్నియు పురుషులకు జరుగునని తెలియునట్టుల స్త్రీలకును తత్తత్ ఫలములు స్త్రీలజన్మకాలము ననుసరించి తెలియదగినవి. గాని అందుస్త్రీలకు యోగ్యములుగాని యోగములు పొందలగునవి స్త్రీజాతకమునందు గానబడునెడల, నట్టియోగఫలితముల నాస్త్రీలభర్తలకుం జెప్పదగినవి. సుఖదుఃఖాదుల ననుసరించిన యోగాదులను భార్యాభర్తల కిరువురికిని జెప్పదగినది, అట్లుగానియెడల సకలస్త్రీ జాతకఫలముల నాస్త్రీలభర్తలయందు జెప్పదగినవి.

మరియు స్త్రీలజన్మలగ్నమున కష్టమస్థానమునను సరించి భర్తృమరణమును దెలియదగినది. జననలగ్నము ననుసరించియు, జననకాలమున చంద్రస్థితిననుసరించియు శరీరస్థితిని దెలియదగినది. భర్తృసౌఖ్యము, సౌభాగ్యము మొదలగునవి జన్మలగ్నమునకు సప్తమస్థానమున నుసరించి దెలియదగినది. ఈవిషయమునకు, "వైధవ్యంనిధనే చింత్యం శరీరంజన్మలగ్నతః, సప్తమేపతి సౌభాగ్యం పంచమేప్రసవస్తథా" అని సారావళీకారకుడు వచించియున్నాడు. ఇందువలన జన్మలగ్నమునకు పంచమస్థానముననుసరించి సంతానమును జెప్పదగినదనియు నూహింపదగియున్నది.

పూర్వోక్తశ్లోకోక్త " వపుస్తులగ్నేందుగ " మ్మనువచన వివరము.

శ్లో. యుగ్మేషు లగ్నశశినోః ప్రకృతిస్థితా స్త్రీ
సచ్ఛీల భూషణ యుతా శుభదృష్టయో శ్చ
ఓజస్థయో శ్చ పురుషాకృతిశీలయుక్తా
పాపా చ పాపయుతవీక్షితయో ర్గుణోనా. 2

టీ. లగ్నశశినోః = లగ్నచంద్రులు, యుగ్మేషు = సమరాసులయందుండగాబుట్టిన స్త్రీ, ప్రకృతిస్థితా = స్త్రీస్వభావము గలదిగనుండును. శుభదృష్టయోశ్చ=ఆలగ్న చంద్రులకు శుభగ్రహవీక్షణముండిన, సచ్ఛీలభూషణయుతా—సచ్ఛీల = సత్స్వభావముతోడను, భూషణ = ఆభరణములతోడను, యుతా = కూడినదగును. ఓజస్థయోస్తు= బేసిరాసులయందు (లగ్నచంద్రులుండగాఁబుట్టిన స్త్రీ) పురుషాకృతిశీలయుక్తా = పురుషస్వరూప స్వభావములుగలదగును. పాపయుతవీక్షితయోః = (ఆలగ్నచంద్రులు) పాపగ్రహములతోఁగూడియుండినను పాపగ్రహములచ్చేత చూడఁబడినను, జనించినస్త్రీ, పాపా = పాపాచారిణియు, గుణోనా = గుణహీనురాలును అగును

తా. జననలగ్నమును, జననకాలమున చంద్రుడును, సమరాసులగు వృషభ, కర్కాటక, కన్యా, వృశ్చిక, మకర, మీనరాసులయందుండునెడల తత్కాలమున జనించినస్త్రీ, స్త్రీస్వభావముగలదిగానుండును. ఆలగ్నచంద్రులు శుభగ్రహములచే జూడబడుచుండునెడల సత్స్వభావము, రూపము, ఆభరణములుఁగలదగుచున్నది. మరియు సద్గుణములు గలదియగుచున్నదని కొందరియభిప్రాయము మరియు రూపవతియై, సత్స్వభావమనెడు భూషణముతో గూడినయువతి యగునని కొందరు అభిప్రాయపడుచున్నారు.

బేసిరాసులగు, మేష, మిథున, సింహ, తులా, ధనస్సుకుంభరాసులయందు జన్మలగ్న చంద్రస్థితిములేర్పడుసట్టి స్త్రీ, పురుషాకృతియు, పురుషస్వభావములును గలస్త్రీయగును. ఈవిషయమున "పురుషాకృతిశీలయుతా దుశ్శీలా దుఃఖితా విషమరాశౌ" యనుగ్రంథాంతర వచనాను గుణ్యముగ దుస్స్వభావము, దుఃఖమునుగల స్త్రీయగుననియు కొందరూహించుచున్నారు. లగ్నచంద్రులలో నొకటి ఓజరాశియై మరొకటి సమరాశియందున నుండగా

జనించిన స్త్రీ, కొన్ని పురుషాకృతి స్వభావములును, కొన్ని స్త్రీయాకృతి స్వభావములును గల దగునని యూహింపవగినది. అలగ్నచంద్రులు పాపగ్రహములతో గూడియైనను, పాపగ్రహములచే జూడబడియైనను నుండగా జనించిన స్త్రీ పాపప్రవర్తనగలదియు, గుణహీనురాలును అగును. మరియు లగ్నచంద్రులలో నొకటి పాపగ్రహయుతమై మరొక్కటి పాపగ్రహముచే వీక్షింపబడినను పూర్వోక్తఫలమునే జెప్పదగినది. అయిన లగ్నచంద్రులలో నొక్కటి మాత్రము పాపగ్రహయుత వీక్షణ్యములుగలిగియుండునెడల తత్కాలమున జనించిన స్త్రీ కొన్ని సత్స్వభావములను, కొన్ని దుస్స్వభావములను గలదియగును. మరియు లగ్నచంద్రులు శుభాశుభగ్రహయుతములై గాని, శుభాశుభగ్రహములచే వీక్షింపబడిగానియుండగా జనించిన స్త్రీ మిశ్రగుణములు గలదగును.

కుజక్షేత్రములందుగల కుజాదిత్రింశాంశలయందు లగ్నచంద్రులలో నొక్కటియుండగా బుట్టిన స్త్రీస్వభావములు.

శ్లో. కన్యైవ దుష్టా వ్రజతీహ దాస్యం
సాధ్వీ సమాయా కుచరిత్రయుక్తా
భూమ్యాత్మజర్క్షే క్రమశోంఽశకేషు
వక్రార్కిజీవేందుజ భార్గవానామ్. ౩

టీ. భూమ్యాత్మజర్క్షే = కుజక్షేత్రములలో నొకరాశిలగ్నగతమైకాని, చంద్రాధిష్ఠితమైకాని యుండగ, వక్రార్కిజీవేందుజ భార్గవానాం = కుజ శని గురు బుధ శుక్రులయొక్క అంశకేషు = త్రింశాంశలయందు, క్రమశః = వరుసగా (నీఫలములు చెప్పదగును. (కుజ) కన్యైవదుష్టాభవతి = పెండ్లిగాకముందే పురుషసంపర్కముచేయును. (శని) దాస్యంవ్రజతి = దాసీభావమునుపొందును, (గురు) సాధ్వీ = పతివ్రతయగును, (బుధ) సమాయా = మాయయగును. (శుక్ర) కుచరిత్రయుక్తా = దురాచారవంతురాలగును.

తా. అంగారక క్షేత్రములగు మేష, వృశ్చికరాసులయందొక్కటి లగ్నమైగాని, చంద్రాధిష్ఠితమైగాని యుండి యందలి యంగారకాది త్రింశాంశలయందు జనించిన స్త్రీ క్రమముగ కన్యైవదుష్టాదిగుణములు గలదగుననగా, జననలగ్నమైనను, చంద్రస్థితిలగ్నమైనను, అంగారకక్షేత్రమున అంగారక త్రింశాంశయందుండునెడల జాతకురాలు వివాహముగాక ముందే పురుషసంగమము జేయునదియగును. అంగారకక్షేత్రమునందలి శనిత్రింశాంశయందుండగా జనించిన స్త్రీ దాసీభావమునుబొందినదగును. అంగారకక్షేత్రమునందలి గురుత్రింశాంశయందుండగా బుట్టిన యువతి పతివ్రతయగును. అంగారకక్షేత్రమునందలి బుధత్రింశాంశయందుండగా జననమైన స్త్రీ మాయలాడియగును. అంగారకక్షేత్రమునందలి శుక్రత్రింశాంశయందుండగా బుట్టిన స్త్రీ దుర్మార్గ ప్రవర్తనగలదగుననియు దెలియదగినది.

## లగ్నచంద్రులు శుక్ర, బుధక్షేత్రములలో కుజాది త్రింశాంశలయందుండగా జాతకురాండ్రకు కలుగు స్వభావములు.

శ్లో. దుష్టా పునర్భూస్సుగుణా కలాజ్ఞా ఖ్యాతా గుణైశ్చ సురపూజితర్క్షే
స్యాత్కాపటీ క్లీబసమా సతీ చ బౌధే గుణాఢ్యా ప్రవికీర్ణకామా.

టీ. అసురపూజితర్క్షే = శుక్రక్షేత్రములలో నొకరాశిలగ్నమైకాని చంద్రాధిష్ఠితమై యుండిన, (కుజ) దుష్టా=చెడ్డదగును. (శని) పునర్భూః=రెండు పర్యాయములు పెండ్లియాడును.(గురు)సుగుణా=మంచిగుణములుగలదగును. (బుధ) కలాజ్ఞా=గీతాదికళల నెఱింగినదగును. (శుక్ర) గుణైః=ఉత్తమ గుణములచేత, ఖ్యాతా=ప్రతిష్ఠగలదగును. బౌధే=బుధక్షేత్రములలో నొకరాశి లగ్నమైకాని చంద్రాధిష్ఠితమైకానియుండఁగా, (కుజ) కాపటీ=కపటముగలది, (శని) క్లీబసమా=నపుంసక సమానురాలు, (గురు) సతీచ = పతివ్రత, (బుధ)గుణాఢ్యా = ఉత్తమగుణములుగలది,(శుక్ర) ప్రవికీర్ణకామా=అనేక పురుషులయందు కోర్కెకలది అగును.

తా. శుక్రక్షేత్రములగు వృషభ, తులారాసులలో నొక్కటి జననలగ్నమైగాని, చంద్రాధిష్ఠితమైగాని యుండి యందలి అంగారక త్రింశాంశయందు జనించిన స్త్రీ దుర్మార్గురాలగును. శనైశ్చరత్రింశాంశయందు జనించిన యువతి పెండ్లియయిన తరువాత మరియొకనిని పెండ్లియాడునదియగును, మరియు పాపగ్రహాన్వితమైయుండునెడల మరల మరొక్కనినైనను యిరువురినైనను వివాహమాడును. గురుత్రింశాంశయందు జనించిన స్త్రీ మంచిగుణములు గలదియగును బుధత్రింశాంశయందు బుట్టిన స్త్రీ గీతాదికళల నెరిగి యుక్తాయుక్త విచక్షణజ్ఞానము గలదియగును, శుక్రత్రింశాంశయందుబుట్టిన స్త్రీ సుగుణములచేత ప్రఖ్యాతిగలదియగునని దెలియదగినది.

బుధక్షేత్రములగు మిధున, కన్యారాసులయం దొక్కటి జననలగ్నమైగాని, చంద్రాధిష్ఠితమైగానియుండి యందలికుజత్రింశాంశయందు బుట్టినయువతి కాపట్యప్రవర్తనగలదియగును. శనిత్రింశాంశయందు బుట్టినయువతి మాచకమ్మయనగా స్త్రీస్వరూపము లేర్పడకయుండునదియు, పురుషసంయోగమునకు అనర్హురాలుగను నుండునదియునగును. గురు త్రింశాంశయందుజనించిన స్త్రీ పతివ్రతయగును. బుధత్రింశాంశయందు జనించిన స్త్రీ సద్గుణగణములుగలిగి కీర్తివహించునదియగును. శుక్రత్రింశాంశయందు బుట్టినయువతి కామోద్రేకాధిక్యతగలిగి పలుపురుషుల కామించునదియగును.

## చంద్ర, రవి, గురు, శనిక్షేత్రములలో నొకటిలగ్నమైనను చంద్రాధిష్ఠితమైన నగుచుండగా యందలి యంగారకాది త్రింశాంశలయందు జనించిన స్త్రీస్వభావములు.

శ్లో. స్వచ్ఛందా పతిఘాతినీ బహుగుణా శిల్పిన్యసాధ్వీందుభే
నాచారా కులటార్కభే నృపవధూః పుంశ్చేష్టితాఽగమ్యగా

జైవే నైకగుణాఽల్పరత్యతిగుణా విజ్ఞానయుక్తా సతీ
దాసీ నీచరతాఽర్కిభే పతిరతా దుష్టాఽప్రజా స్వాంశకైః.౮

టీ. ఇందుభే = కర్కాటలగ్నము చంద్రాధిష్ఠితమైయుండగా కుజత్రింశాంశయందుఁ బుట్టినస్త్రీ, స్వాంశకైః = కుజాది తమతమ త్రింశములచేత, (కుజ) స్వచ్ఛందా = స్వతంత్రచారిణి, (శని) పతిఘాతినీ = మగనిం జంపునట్టిది, (గురు) బహుగుణా = అనేకసుగుణములు గలది, (బుధ) శిల్పినీ = శిల్పకర్మము సేయునట్టిది, (శుక్ర) అసాధ్వీ = వ్యభిచారిణి అగును అర్కభే = సింహము లగ్నమయి కాని (చంద్రాధిష్ఠితమయి కాని) యుండిన, (కుజ) వాచాలా = పురుషాచారముగలది (శని) కులటా = వ్యభిచారిణి, (గురు) నృపవధూః = రాజభార్య, (బుధ) పుంశ్చేష్టితా = పురుషస్వభావముగలది, (శుక్ర) అగమ్యగా = దుర్లభుడగు పురుషుని బొందునది జీవే = ధనుర్మీన ములలో (నొకటి లగ్నమునకాని చంద్రాధిష్ఠితమైకాని యుండిన) (కుజ) నైకగుణా = బహుగుణములుగలది, (నైకగతా = బహుపురుషగామిని) (శని) అల్పరతిః = అల్పమయినరతిగలది, (గురు) అతిగుణా = బహుగుణవతి, (బుధ) విజ్ఞానయుక్తా = బహుశాస్త్రజ్ఞానవతి, (శుక్ర) అసతీ = భార్యాత్వమునకు తగనిది యగును. అర్కిభే = శనిక్షేత్రములుగాని, చంద్రాధిష్ఠితమైగాని యుండినయెడల, (కుజ) దాసీ = దాసియగును, (శని) నీచరతా = నీచపురుషగామిని, (గురు) పతిరతా = పతిభక్తిగలది, (బుధ) దుష్టా = దుర్మార్గురాలు, శుక్ర) అప్రజా = గొడ్రాలు అగును.

తా. చంద్రక్షేత్రమగు కర్కాటకరాశి జననలగ్నమైనను చంద్రాధిష్ఠితమైనను నగుచుండగా నందలి అంగారక త్రింశాంశయందు బుట్టినస్త్రీ తనకు పెనిమిటియుండినను కొంచెమైనను లక్ష్యము సేయక యథేచ్ఛగా ప్రవర్తించునట్టిదియగును. శనిత్రింశాంశయందు బుట్టినస్త్రీ తనమగని ప్రాణమునకే అపాయము గలిగించునట్టిది యగును. గురుత్రింశాంశయందు బుట్టినయువతి అనేకములగు సుగుణములుగలది యగును

ఈవిషయమున "బహుగుణా" యనుచోట "బహుసుతా" యని పఠించి పెక్కండ్రు పుత్రులుగలదియగునని కొందరు వచించుచున్నారు గాని గ్రంథాంతరవచనము గూడ "జీవేబహుగుణా ప్రోక్తాః" అనియున్నది. బుధత్రింశాంశయందు బుట్టినయువతి, చిత్రరువ్వులు వ్రాయుటయందును, శిల్పకార్యములయందును నైపుణ్యముగలదియగును. శుక్రత్రింశాంశయందు జనించినస్త్రీ పతివ్రతగానిదియును, పరపురుషులకు సహాయము జేయునదియునగును. రవిక్షేత్రమగు సింహరాశి జననలగ్నమైనను, చంద్రాధిష్ఠితమైనను అగుచుండగా నందలి, అంగారక త్రింశాంశయందు బుట్టినయువతి పురుషాచారముగలది యగును ఈవిషయమున "వాచాట" యనిపఠించి అధికముగ మాటలాడునట్టిది యగునని కొందరు వచించుచున్నారు. శనిత్రింశాంశయందు జనించినయువతి జారిణియగును. గురుత్రింశాంశయందు బుట్టినయువతి రాజభార్యయగును. ఈవిషయమున, ధనసుఖ గౌరవములుగలవాని భార్యయగునని కొందరు అర్థశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

బుధత్రింశాంశలయందు బుట్టిన యువతి పురుషస్వభావము గలదియగును, మరియు గ్రంథాంతర వచనానుగుణ్యముగ, పురుషులవలె కామక్రీడారహస్య విషయముల బహిరంగముగ మాటలాడునదియగునని కొందరూహించుచున్నారు. శుక్రత్రింశాంశయందు జనించిన యువతి పొందదగని పురుషులకు పరిచర్యజేయుచు వారిచే మదనేచ్ఛా పరితృప్తురాలగులగునది యగును. గురుక్షేత్రములగు ధనుర్మీనరాసులయందొకటి జననలగ్నమైనను, చంద్రాధిష్ఠితమైన నగుచుండగానందలి కుజత్రింశాంశయందు జనించిన స్త్రీ బహుగుణములుగలదియగును. ఈవిషయమున "నైకగుణా" యనుచోట "నైకగతా" యనిపఠించి పెక్కుండ్రు పురుషులను కామించునది యని కొందరు అర్థము చేయుచున్నారు.

శనైశ్చర త్రింశాంశయందు బుట్టిన స్త్రీ అల్పరతిగలదియగును. గురు త్రింశాంశయందు బుట్టినయువతి మిక్కిలి గుణవతియగును.

ఈవిషయమున గురుదేవతారాధనాది కార్యములయందును, భర్తసేవయందును, యుక్తాయుక్తమెరిగి ప్రవర్తించునదియునగునని కొందరి అభిప్రాయము. బుధత్రింశాంశయందు జనించినయువతి శాస్త్రజ్ఞానముకలది. అనగా శాస్త్రములపఠించు శక్తిగలదియు, గ్రంథరచనాసామర్థ్యము, జ్ఞానమార్గప్రదర్శకత్వము మొదలగునవి గలదియగును. శుక్రత్రింశాంశయందు బుట్టినయువతి వాచాలముగలదియు వ్యభిచారిణియు నగును.

మరియు ఒకనినిబెండ్లియాడి మరొక్కనికి సంసారము జేయుచు కాలము గడుపునది యగును. మరియు క్రూరకార్యములచేయుటవలన పట్టుబడి కఠినమగు రాజదండనములోనగు యువతియగునని యనుభవజ్ఞులు కొందరు వచించుచున్నారు శనిక్షేత్రములగు మకర, కుంభ రాసులయందొక్కటి జన్మలగ్నమైనను,జననకాలమున చంద్రాధిష్ఠితమైన నగుచుండగా నందలి అంగారకత్రింశాంశయందు బుట్టినయువతి దాసియగును. శనైశ్చర త్రింశాంశయందు జనించిన స్త్రీ నీచరతి సల్పునది యనగా మ్లేచ్ఛులు, చండాలురు మొదలగువారియందు మనస్సుదగిలి వారితో కామక్రీడయందు తృప్తిపడునదియగును. మరియు నీచకార్యములయందాసక్తిగలదగును, గురుత్రింశాంశయందు జనించినయువతి పతివ్రతయగును. బుధత్రింశాంశయందు బుట్టిన స్త్రీ దుర్మార్గురాలగును. శుక్రత్రింశాంశయందు బుట్టినయువతి గొడ్రాలగును. మరియు పరపురుషాసక్తిగలదియు, చంచలమానసయునగునని కొందరందురు.

## త్రింశాంశ ఫలముల ఉపసంహారము.

శ్లో. శశిలగ్న సమాయుక్తైః ఫలం త్రింశాంశకైరిదం
బలాబలవికల్పేన తయో రుక్తం విచింతయేత్. 6

టీ. శశిలగ్న సమాయుక్తైః = చంద్రలగ్నములతో గూడిన, త్రింశాంశకైః=త్రింశాంశలచేత, ఉక్తం=చెప్పబడిన, ఇదంఫలం= ఈఫలమును, తయోః=ఆచంద్ర లగ్నముల యొక్క, బలాబలవికల్పేన= ప్రబలదుర్బలవికల్పముల వలన, విచింతయేత్ = విచారింపవలెను.

తా॥ పూర్వశ్లోకమున జెప్పబడిన త్రింశాంశ ఫలములన్నియు ఏరాశియందే గ్రహసంబంధమగు త్రింశాంశయందు చంద్రుడుండునో యాత్రింశాంశను అనుసరించియు, ఏ రాశి జనన లగ్నమగుచు నందలి ఏగ్రహసంబంధమగు త్రింశాంశయందు జననకాల మేర్పడుచున్నదో యాత్రింశాంశ ననుసరించియు ఫలముల చెప్పవలయునని యున్నదిగదా. అందు లగ్నత్రింశాంశ ఒకరాశియందు ఒకగ్రహసంబంధమై యుండి, చంద్రస్థితరాశి మరియొకరాశి యయి అందు మరియొక్క గ్రహ సంబంధమగు త్రింశాంశయందు జననకాల మేర్పడునెడల, ఆచంద్రలగ్నములలో నేది బలవంతమైనదో యందలి త్రింశాంశకు జెప్పబడియుండు ఫలముల జాతకురాలికి జెప్పదగినదిగాని బలహీనమైయుండు దానిసంబంధమగు త్రింశాంశకు జెప్పబడియుండు ఫలముల జెప్పదగినది కాదని నూహింపదగియున్నది.

**చర్మమయలింగ ధారిణులైన స్త్రీలచే దనకామో
ద్రేకము నుపశమింప జేసికొను స్త్రీజన్మయోగములు.**

శ్లో॥ దృక్సంస్థా వసితసితౌ పరస్పరాంశే
శౌక్రే వా యది ఘటరాశి సంభవో ఽంశః
స్త్రీభిః స్త్రీమదన విషానలం ప్రదీప్తం
సంశాంతిం నయతి నరాకృతి స్థితాభిః. 7

టీ॥ అసితసితౌ = శనిశుక్రులు, పరస్పరాంశే = ఏరాశియందైన శనినవాంశయందు శుక్రుండును శుక్రనవాంశయందు శనైశ్చరుండును (ఉన్నవారై) దృక్సంస్థా=ఒకరినొకరు చూచుచుండినను, శౌక్రే వా = శుక్రక్షేత్రములలో నొకరాశిజన్మలగ్నమై, ఘటరాశిసంభవాంశో యది = ఆలగ్ననవాంశ కుంభనవాంశయైనను ప్రదీప్తం = ప్రజ్వలించుచున్న, మదనవిషానలం = విషతుల్యమ మన్మథాగ్నిని, నరాకృతిస్థితాభిః = (చర్మమయ లింగమును గట్టుకొని) పురుషాకృతులై యున్న, స్త్రీభిః= స్త్రీలచేత, సంశాంతిం=శమనమును, నయతి= పొందించుకొనును.

తా॥ జననకాలమున ఏరాశియందైనను యుండు, శని శుక్రులలో శని నవాంశయందు శుక్రుడును, శుక్రనవాంశయందు శనియును యుండుటయైనను, ఏరాశులయందైనను, శుక్రనవాంశయందు శనైశ్చరుడును, శనినవాంశయందు శుక్రుండును నుండి పరస్పర వీక్షితులగుచుండుటయైనను దటస్థించినచో నొకయోగము.

శుక్రక్షేత్రములగు వృషభ తులారాసులయం దొక్కటి జనన లగ్నమగుచు, అందు జననకాలయుక్త నవాంశ కుంభనవాంశ యగునెడల తత్కాలమున జననము తటస్థించునెడల మరియొక యోగము ఈ రెండుయోగములయందెందైనను జనించిన స్త్రీ విషతుల్యమగు మదనాగ్నిచే గలుగు మంటను, చర్మమయ లింగమును గట్టుకొని పురుషాకృతులై యుండు స్త్రీలచేత నుపశమనము గావించుకొనును. అనగా, తనకిష్టమైనట్లు తలచిన పురుషు

లతో సంగమముజేసియు దృప్తినొందక చర్మమయలింగమును గట్టుకొనియుండు మరియొక స్త్రీతో రమించి దనకామోద్రేకమును బోగొట్టుకొనును, ఈవిషయమునకు, "శుక్రాసితౌ యది పరస్పర భాగసంస్థౌ శౌక్రేచదృష్టి పథగా వుదయే ఘటాంశే స్త్రీణాంతదా తీవ్రమదనాగ్నిమదః ప్రవృద్ధ స్త్రీభిశ్చ సంచ పురుషాకృతి భిర్లభంతే" అని సారావళీ కారకుడు వచించి యున్నాడు. ఈ శ్లోకమున "మదనవిషానలం" అనుచోట మదవిషయానలం అని కొందరు పఠించుచున్నారు.

## సప్తమస్థానము ననుసరించి భర్తవిషయము దెలియు నగుననుటకు వివరము.

శ్లో. శూన్యే కాపురుషోఽబలేఽస్తభవనే సౌమ్యగ్రహాఽవీక్షితే
క్లీబోఽస్తేబుధ మందయో శ్చరగృహే నిత్యం ప్రవాసాన్వితః
ఉత్సృష్టా తరణౌ కుజే తు విధవా బాల్యేఽస్తరాశిస్థితే
కన్యై వాఽశుభవీక్షితేఽర్కతనయే ద్యూనే జరాంగచ్ఛతి. 8

టీ. అస్తభవనే = (లగ్నమునకుఁగాని చంద్రునికిఁగాని) సప్తమరాశి, శూన్యే=గ్రహములులేక, అబలే = బలహీనమై, సౌమ్యగ్రహావీక్షితే = శుభులచేత చూడబడకయుండఁగా (బుట్టిన స్త్రీయొక్క మగడు) కాపురుషః = కుత్సితపురుషుడగును. అస్తే= (లగ్నమునకుగాని చంద్రునికిగాని) సప్తమరాశియందు, బుధమందయోః = బుధశనులలో నొకండుండఁగా పుట్టినదానిభర్త, క్లీబః = నపుంసకుడగును, అస్తే=సప్తమరాశి, శరగృహే=చరరాశియైనయెడల, నిత్యం=ఎప్పుడును, ప్రవాసాన్వితః = పరదేశము దిరుగువాఁడగును, తరణౌ= రవి, అస్తరాశిస్థితే= సప్తమమందుండఁగా (బుట్టిన స్త్రీ) పతినా=భర్తచేత, ఉత్సృష్టా=విడువఁబడును కుజే=కుజుడు (సప్తమమందుండి) అశుభవీక్షితేతు=పాపగ్రహములచేత చూడఁబడుచుండగ బుట్టినకాంత, బాల్యే=చిన్నపుడే, విధవా=విధవయగును. అర్కతనయే=శనైశ్చరుండు, ద్యూనే=సప్తమమందుండి, అశుభవీక్షితే = పాపగ్రహ దృష్టియున్నపుడు జన్మించినకన్యక, కన్యైవ=వివాహములేకనే, జరాం=వృద్ధత్వమును, గచ్ఛతి=పొందును.

తా. ఈ అధ్యాయ ప్రథమశ్లోకమున 'అస్తమయే పతిశ్చ' అని చెప్పబడి యుండుటకు యిందు వివరము దెల్పబడుచున్నది

జననలగ్నంబునకైనను, జననకాలంబున చంద్రస్థిత రాశికైనను, సప్తమస్థానముగ్రహవర్జితమై, బలహీనమై, శుభగ్రహ వీక్షితముగాక యుండునెడల తత్కాలమున జనించిన యువతియొక్క పెనిమిటి నికృష్టుడగును. జనన లగ్నమునకైనను జననకాలమున చంద్రస్థిత రాశికైనను సప్తమస్థానమునందు బుధుడైనను శనైశ్చరుడైనను నుండునెడల తత్కాలమున జనించిన స్త్రీయొక్క భర్త నపుంసకుడగును. మరియు నాసప్తమ స్థానము చరరాశులగు మేష, కర్కాటక తులా మకరములలో నొక్కరాశి యగునెడల తత్కాలమున జనించిన

యువతి యొక్క పురుషుడు, సదా పరదేశము దిరుగువాడగును. ఈవిషయమున నిట్లు చెప్పుట చేతను "చరరాశౌతు మదనే ప్రవాసీ తత్పతిర్భవేత్, స్థిరే గృహస్థితో నిత్యం, ద్విస్వభావే కదాచన" అను గ్రంథాంతర వచన ముండుటవలనను, స్త్రీజనన లగ్నమునకైనను, జననకాలమున చంద్రస్థితరాశికైనను సప్తమస్థానము స్థిరరాసులగు వృషభ, సింహ, వృశ్చిక, కుంభ రాసులలో నొక్కటియగుచుండునెడల ఆ స్త్రీయొక్క భర్త ఎల్లప్పుడు నింటనందుననియు, నాసప్తమ స్థానము ద్విస్వభావ రాశులగు మిధున, కన్యా, ధనుర్మీనములలో నొకటి యగు నెడల ఆయువతిపతి కొంతకాలము యింటనుండువాడును, తక్కినకాలము పరదేశవాసి యునగునని నూహింపదగియున్నది. మరియు, సూర్యుడు సప్తమస్థానమునందుండగా జనించినయువతి తనభర్తచే విడువబడిన దగును. ఈవిషయమున భార్యరోగపీడితయై సంభోగాదుల కుపయోగపడకుండగా తనభర్త వేరొక యువతిని పెండ్లియాడునని కొందరనుచున్నారు.

ఆసప్తమస్థానమున, అంగారకుడుండి పాపగ్రహములచే జూడబడుచుండగా జనించిన యువతి బాల్యమునందే వైధవ్యమును బొందును. ఆసప్తమస్థానమునందు శనైశ్చరుడుండి పాపగ్రహములచే జూడబడుచుండగా బుట్టినస్త్రీ వివాహముగాకయే ముసలది యగును ఇచ్చట పాపగ్రహములచే జూడబడుచుండగా అని చెప్పియుండుటవలన, శుభగ్రహ వీక్షణ్యముండు నెడల కాలాతీతమై తల్లిదండ్రులు కౌశన్య వివాహమును గురించిన ప్రయాసయధికమై యట్టుపైని వివాహ మగునని నూహింపదగియున్నది. ఈ శ్లోకమున జెప్పబడిన ఫలములన్నియు, జనన లగ్నముయొక్కయు జనన కాలమున చంద్రలగ్నము యొక్కయు, బలాబలముల ననుసరించి చెప్పదగి యున్నది.

## సప్తమ స్థానమునందనేక గ్రహము లుండగా జనించిన స్త్రీలకు గలుగు ఫలములు.

శ్లో. ఆగ్నేయై ర్విధవా ఽస్తరాశి సహితై ర్మిశ్రైః పునర్భూ ర్భవే
త్క్రూరే హీనబలే ఽస్తగే స్వపతినా సౌమ్యేక్షితే ప్రోజ్ఝితా
అన్యోన్యాంశ గయో స్సితా వనిజయో రన్యప్రసక్తాంగనా
ద్యూనే వా యది శీతరశ్మి సహితౌ భర్తు స్తదా ఽనుజ్ఞయా. 9

టీ. ఆగ్నేయైః = క్రూరగ్రహములు, అస్తరాశిసహితైః = సప్తమ మందుండగ జన్మించనకాంత, విధవా = వితంతువగును, మిశ్రైః = శుభాశుభ గ్రహములు సప్తమస్థానమందుండు నపుపు జనించినస్త్రీ, పునర్భూః = ద్వితీయభర్తను పెండ్లియాడును, హీనబలే = బలరహితమైన క్రూరే = పాపగ్రహము, అస్తగే = సప్తమ స్థానమందుండి, సౌమ్యేక్షితే = శుభగ్రహ వీక్షణముండునపుడు జన్మించిన కామిని, స్వపతినా = తనమగనిచేత, ప్రోజ్ఝితా = విడువబడును, సితావనిజయోః = శుక్రాంగారకులు, అన్యోన్యాంశగయోః = ఏయింటనైన శుక్రనవాంశలో కుజుడును కుజనవాంశలో శుక్రుడును ఉండగ బుట్టిన, అంగనా = కాంత, అన్యప్రసక్తా =

పరపురుష సంగతు రాలగును, ద్యూనే=సప్తమమందు, శీతరశ్మిసహితౌవా = (శుక్రాంగారకులు)చంద్రసహితులై యుండిరని, తదా=ఆయువతి, భర్తు=మగనియొక్క, అనుజ్ఞయా= ఆనతిచేత, అన్య ప్రసక్తా=పరపురుషాను రాగిణి అగును.

తా. స్త్రీలజన్మరాశికి సప్తమస్థానమునందు, పాపగ్రహములుండగా జనించిన స్త్రీవిధవయగును. ఆసప్తమస్థానమున పాపగ్రహములును, సౌమ్యగ్రహములును కలసియుండగా బుట్టిన స్త్రీ ప్రథమమున వివాహమాడిన పురుషునివదలి మరియొక్కని బెండ్లియాడును ఈ విషయమున, శుభగ్రహములతో ఎన్నిబలీయములగు క్రూరగ్రహములు జేరియున్నవో యంతమంది పురుషులతో కాపురము సేయుచుండునది యగునని కొందరియభిప్రాయము.

సప్తమస్థానమున బలహీనములగు పాపగ్రహములుండి శుభగ్రహములచే జూడబడుచుండగా జనించినయువతి, తనభర్తచే విడువబడినదగును. శుక్రాంగారకులు తమఅన్యోన్యాంశలయందనగా ఏరాశియందైనను, శుక్రనవాంశయందు అంగారకుడును, అంగారకనవాంశయందు శుక్రుడునునుండగా బుట్టినయువతి, తనయిష్టప్రకారము పరపురుష సంగమముచేయునదియగును.

సప్తమస్థానమునందుండు శుక్రాంగారకులు చంద్రసహితులైయుండునెడల తత్కాలమునజనించిన స్త్రీ తనపురుషుని యాజ్ఞచే పరపురుషుని గూడునదియగును.

మాతృసహిత వ్యభిచారిణులయొక్కయు, వ్యాధియోనిగల
స్త్రీలయొక్కయు, సుభగలగు స్త్రీలయొక్కయు జననయోగములు.

శ్లో. సౌరారర్క్షే లగ్నగే సేందుశుక్రే
మాత్రా సార్థం బంధకీ పాపదృష్టే
కౌజేఽస్తేంశే సౌరిణా వ్యాధియోని
శ్చారుశ్రోణి వల్లభా సద్గ్రహాంశే. 10

టీ. సౌరార్క్షే =శనికుజక్షేత్రము నొకటి, లగ్నగే=లగ్నమై, సేందుశుక్రే=చంద్రశుక్రులతోఁగూడినదై, పాపదృష్టే= పాపులచూపు కూడియుండఁగ జన్మించినకామిని, మాత్రాసార్థం = తల్లితోఁగూడ, బంధకీ = వ్యభిచారిణియగును, అస్తే = సప్తమస్థానమందుండు, కౌజేంశే = కుజనవాంశ, సౌరిణా = శనిచేత, (చూడబడుచుండఁగ), జన్మించినకన్య, వ్యాధియోనిః = రోగపీడితభగయగును, సద్గ్రహాంశే = శుభగ్రహాంబులును శుభనవాంశయందునైయుండి, చారుశ్రోణీ = అందమగు పిరాదులుగలదియు, వల్లభా= మగనికిష్టురాలును అగును.

తా. శనైశ్చరక్షేత్రములగు మకరకుంభములలో నొక్కటియైనను, అంగారకక్షేత్రములగు మేషవృశ్చికములలో నొక్కటియైనను జననలగ్నమగుచు, అందుచంద్రశుక్రులుండి పాపగ్రహములచే జూడబడుచుండగా జనించినయువతి, తనతల్లితో సహా వ్యభిచారిణియగును. ఈవిషయమునకు, "శశ్యంగారకభేలగ్నే శుక్రేందూబలవర్జితౌ, వ్యభిచారోద్భవానారీ జ్ఞా

యతే వ్యభిచారిణీ" అను గ్రంథాంతర వచనానుగుణ్యముగ, మకరకుంభ, మేషవృశ్చిక రాశులలో నొక్కటి జన్మలగ్నమగుచు, శుక్రచంద్రులు బలహీనులగుచుండు నెడలను, తల్లియు గూతురు వ్యభిచారయుతులై ఒకరి కొకరు సహాయముగనుందురు. అనికొందరు వచించుచున్నారు.

## వ్యాధియోనిగల స్త్రీల జననయోగములు.

జననలగ్నమునకు సప్తమస్థానమునందు అంగారకనవాంశ శనైశ్చరునిచే జూడబడుచుండగా జనించినయువతి వ్యాధిచేపీడింపబడు భగముగలదియగును. సుభగయగుస్త్రీజనన యోగము జననలగ్నమునకు సప్తమరాశియందు శుభగ్రహములును శుభాంశయునైయుండు నెడల తత్కాలమున జనించినయువతీ సుభగయై భర్తకుసంప్రీతిగొలుపునది యగును.

## జననరాశికిసప్తమరాశియందలి నవాంశాదుల ననుసరించి భర్తస్వభావాదులు నెరుంగువివరము.

శ్లో. వృద్ధో మూర్ఖ స్సూర్యజర్క్షే౽౦శకే వా
స్త్రీలోల స్స్యాత్ క్రోధన శ్చావనేయే
శౌక్రే కాంతో౽తీవ సౌభాగ్యయుక్తో
విద్వాన్ భర్తా నైపుణజ్ఞ శ్చ బౌధే. 11

టీ. సూర్యజర్క్షే = శనిక్షేత్రములలో నొకరాశిగాని, అంశకే వా = ఆనవాంశగాని, సప్తమమందుండఁగా జన్మించినస్త్రీయొక్క, భర్తా = మగడు, వృద్ధః = ముసలివాఁడును, మూర్ఖః = మూర్ఖుఁడును, అవనేయే = కుజక్షేత్రములలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమమందుండఁగాఁబుట్టినదాని మగండు, స్త్రీలోలః = స్త్రీలోలుడును, క్రోధనః = కోపియునగును, శౌక్రే = శుక్రస్థానములలో నొకరాశిగాని అనవాంశగాని సప్తమమందుండఁగా జన్మించినదానిభర్త, కాంతః = సుందరుండును, అతీవ = మిక్కిలి, సౌభాగ్యయుక్తః = అదృష్టవంతుఁడును అగును. బౌధే = బుధక్షేత్రములలోనుండగ బుట్టినదానిమగడు, విద్వాన్ = పండితుడు, నైపుణజ్ఞః = సమర్థుడును అగును.

తా. జననరాశికి సప్తమస్థానము శనైశ్చరుక్షేత్రములగు మకర, కుంభములలో నొకరాశియగుచుండగానైనను, మకర కుంభనవాంశలయం దొక్కనవాంశయైన నగుచుండగానైనను జనించినస్త్రీ యొక్కభర్త ముసలివాఁడును, మూర్ఖుడును, అగును.

జననరాశికి సప్తమస్థానము, అంగారకక్షేత్రములగు, మేష, వృశ్చికములలో నొకరాశియగుచుండగానైనను, సప్తమస్థానమునందు అంగారకాంశలగు మేషవృశ్చికాంశలలో నొక్కదానియందేర్పడు నెడలను జాతకురాలిభర్త స్త్రీలోలుడును, బహుకోపియు, క్రూరచిత్తముగలవాడును అగును.

జననరాశికి సప్తమస్థానము, శుక్రక్షేత్రములగు వృషభ తులారాశులలో నొక్కటి యగుచుండగానైనను, సప్తమస్థానమున శుక్రాంశలగు, వృషభతులాంశలలో నొక్క అంశయగుచుండగానైన జనించినయువతి, యొక్క పెనిమిటి సౌందర్యవంతుడై, సౌభాగ్యముతో గూడినవాడగును. జననరాశి సప్తమస్థానము బుధక్షేత్రములగు మిధునకన్యారాశులలో నొక్కటి యగుచుండగానైనను, సప్తమస్థానమున బుధాంశలగు మిథునకన్యాంశలలో నొక్కయంశయగుచుండగానైన జనించిన కన్యయొక్క పురుషుడు విద్వాంసుడును, నిపుణతగలవాడును అగును.

### చంద్ర, గురు, రవిక్షేత్రములలో సప్తమమందుండగా బుట్టినదాని మగని స్వభావములు.

శ్లో. మదనవశగతో మృదుశ్చ చాంద్రే
త్రిదశగురోర్గుణవాన్ జితేంద్రియశ్చ
అతిమృదు రతికర్మకృచ్చ సౌర్యే
భవతి గృహేఽస్తమయస్థితేంశకే వా. 12

టీ. చాంద్రే గృహే = చంద్రక్షేత్రమైన కర్కటరాశిగాని, అంశకే వా = అనవాంశముగాని, అస్తమయస్థితే = (లగ్నమునకు) సప్తమమందుండగ బుట్టినదానిభర్త, మదనవశగతః = కామాతురుడును, మృదుశ్చ = మెత్తనిచిత్తముగలవాడునౌను. త్రిదశగురోర్గృహేంశకే వా = గురుక్షేత్రముగాని అనవాంశగాని సప్తమగతమైయుండగ బుట్టినదానిపెనిమిటి, గుణవాన్ = మంచిగుణములుగలవాడును, జితేంద్రియశ్చ = జితేంద్రియుడును అగును. సౌర్యే = సూర్యక్షేత్రముగాని అనవాంశగాని (సప్తమమందుండగా) బుట్టినదానిమగడు, అతిమృదుః = అధికమృదుస్వభావుండును, అతికర్మకృచ్చ = అనేకకర్మములు సేయువాడు, భవతి = అగును. కొందరు 'రతికర్మకృత్' అని పఠించి కామాసక్తుడగునని యందురు.

తా. జననరాశికి సప్తమస్థానము చంద్రక్షేత్రమగు కర్కాటకరాశియగుచుండగానైనను, సప్తమస్థానమునచంద్రాంశయగు కర్కాటకాంశ యేర్పడుచుండగానైనను జనించిన యువతియొక్క భర్త కామోద్రేకమధికముగ గలవాడును అగును. ఆసప్తమస్థానము గురుక్షేత్రములగు ధనుర్మీనరాశులలో నొక్కటియగుచుండగానైనను, సప్తస్థానమునందు గుర్వంశలగు ధనుర్మీనాంశలలో నొక్కయంశయేర్పడు చుండగానైనను, జనించినయువతియొక్క పురుషుడు, సుగుణవంతుడును, జితేంద్రియుడును అగును. ఆసప్తమస్థానము రవిక్షేత్రమగు సింహరాశి యగుచుండగానైనను, ఆసప్తమస్థానమునందు రవ్యంశయగు సింహాంశ యేర్పడుచుండగానైనను, జనించిన దానిభర్తమిగుల మృదుస్వభావముగలవాడును, అనేక వ్యాపారములు సేయువాడును, అగును.

ఈ విషయమునందు "అతికర్మకృత్" అనుచోట "రతికర్మకృత్" అని పఠించి కామాసక్తుడగునని కొందరువచించుచున్నారు. పై రెండు శ్లోకములయందు జెప్పబడిన రాశినవాంశల

లో, రాశియొక్క గ్రహ సంబంధమగునెడల రాశ్యధిపతి బలియుండగునెడల రాశిననుసరించిన ఫలమును, నవాంశాధిపతి బలవంతుడగునెడల నవాంశననుసరించిన ఫలమును బాగుగ యోచించి చెప్పదగినది.

### చంద్రశుక్ర బుధులలో కొందరు జననలగ్నమునం దుండగా జనించిన స్త్రీ స్వభావములు

శ్లో. ఈర్ష్యాన్వితా సుఖపరా శశి శుక్ర లగ్నే
జ్ఞేందోః కళాసు నిపుణా సుఖితా గుణాఢ్యా
శుక్రజ్ఞయో స్తు రుచిరా సుభగా కళాజ్ఞా
త్రిష్వ ప్యనేక వసు సౌఖ్య గుణా శుభేషు  13

టీ. శశిశుక్రలగ్నే = చంద్రశుక్రులున్న లగ్నమున బుట్టినస్త్రీ, ఈర్ష్యాన్వితా= మాత్సర్యముగలదియు, సుఖపరా=సుఖాసక్తురాలు అగును జ్ఞేందోః = బుధచంద్రులుజన్మ లగ్నమందుండిరేని, కళాసు=గీతవాద్య విద్యాదికములందు, నిపుణా= నేర్పరియును, సుఖితా= సుఖించునట్టిదియు, గుణాఢ్యా = గుణవతియునౌను, శుక్రజ్ఞయోస్తు=శుక్రబుధులు జన్మలగ్నమందుండినచో, రుచిరా=కాంతి గలదేహము కలదియును, సుభగా= సౌభాగ్యవతియును, కళాజ్ఞా = గీతవాద్యాది కళానిపుణతయు అగును. శుభేషు = శుభగ్రహములగు, త్రిష్వపి= బుధ శుక్ర చంద్రులు ముగ్గురుగాని, బుధ గురు శుక్రులు ముగ్గురుగాని జన్మలగ్నము నుండిరేని, అనేక=బహువిధములగు, వసుసౌఖ్యగుణా = ధనసుఖ సుగుణములు గలదగును.

### సౌమ్యగ్రహద్వయము లగ్నముననుండగా గలుగుఫలములు.

తా. జనన లగ్నమున చంద్రశుక్రులుండగా జనించిన యువతి మాత్సర్యముగలదియు, సుఖాసక్తురాలును అగును. జననలగ్నమున బుధచంద్రులుండగా బుట్టిన స్త్రీగీతవాద్యాది కళలయందు నేర్పుగలదియు, సుఖము ననుభవించునదియు, సుగుణవతియునగును. జనన లగ్నమున శుక్ర బుధులుండగా బుట్టిన యువతి సుందరియు, సౌభాగ్యవతియు, గీతవాద్యాది కళాకుశలత్వము గలదియు నగును.

### శుభగ్రహత్రయము లగ్నమున నుండగా గలుగు ఫలములు

జననలగ్నమున బుధశుక్ర చంద్రులైనను, బుధ గురు శుక్రులైన నుండగా జనించిన యువతి ధనవంతురాలై సుగుణములు గలిగి, సౌఖ్యముననుభవించు చుండునదియగును. ఈ విషయమున గ్రంథాంతరమున "పాపేషు విపరీతా" అను వచనముండుటచే పాపగ్రహము లుండు నెడల బహువిధ కష్టములను భరింపగలదియగునని నూహింప దగియున్నది.

### "తాసాంతుభర్తృ మరణంనిధనే" అనుదాని వివరము.

శ్లో. కూరేఽష్టమే విధవతా నిధనేశ్వరోఽంశే
యస్య స్థిత్తో వయసి తస్య సమే ప్రదిష్టా

సత్స్వర్థగేషు మరణం స్వయమేవ తస్యాః
కన్యాఽలి గోహరిషు చాల్పసుతత్వ మిందౌ. 14

టీ. క్రూరే = పాపగ్రహము, అష్టమే = స్త్రీజన్మలగ్నమునకు, అష్టమమందుండెనేని ఆ స్త్రీకి, విధవతా = వైధవ్యము, ప్రదిష్టా = చెప్పబడెను. నిధనేశ్వరః = అష్టమాధిపతి, యస్య = ఏగ్రహముయొక్క, అంశే = నవాంశయందు, స్థితః = ఉండునో, తస్య = ఆగ్రహముయొక్క, వయసి = (దశాంతర్దశ) కాలమందు వైధవ్యము, సత్సు = శుభగ్రహములు అర్థగేషు = ద్వితీయమందుండి (పాపగ్రహము అష్టమమందుండగా బుట్టిన), తస్యాః = ఆ స్త్రీకి, (భర్తకంటెముందు) స్వయమేవ = తనకే, మరణం = మృతికలుగును, ఇందౌ = చంద్రుడు, కన్యాళిగోహరిషు = కన్యావృశ్చిక వృషభ సింహములయందుండగ బుట్టిన స్త్రీకి, అల్పసుతత్వం = స్వల్ప పుత్ర సంతతి కలుగునని చెప్పదగినది.

తా. ఈఅధ్యాయ ప్రథమ శ్లోకమున "తాసాంతు భర్తృమరణం నిధనే" అనిచెప్పి అష్టమ స్థానము ననుసరించి పతిమరణము దెలియదగినది అని గూఢార్థముగా వచించియుండు దానిని యిచట వివరింపబడియున్నది జననలగ్నమునకు అష్టమస్థానమున పాపగ్రహముండగా జనించిన స్త్రీ విధవయగును.

## ఇందులకు కాలవివరము.

జనన లగ్నమున పాపగ్రహముండగా, అష్టమస్థానాధిపతి ఏగ్రహనవాంశ యందుండునో ఆగ్రహదశాంతర్దశా కాలమునందు వైధవ్యము గలుగునని చెప్పదగినది. అనగా వివాహానంతరము అష్టమస్థానాధిపతి దశాకాలము ప్రాప్తించునెడల నాదశయందును, జననకాలమున అష్టమ స్థానస్థిత పాపగ్రహాంతర్దశయందును వైధవ్యము జెప్పదగినది మరియు, అష్టమస్థానస్థిత గ్రహ దశయందును, అష్టమస్థానాధిపతి అంతర్దశయందును యోచింపదగియున్నది.

ఈ శ్లోకమున "వయసి" అనియుండుటచే "ఏకంద్వౌ, నవవింశతి ర్ధృతికృతే" త్యాద్యుక్తగ్రహ వయస్సనందని కొందరందురుగాని, భట్టోత్పలు డీవిషయమునకు సమ్మతించలేదు.

## పతికంటె ముందుగ మరణము నొందు స్త్రీజనన యోగము.

జనన లగ్నమునకు ద్వితీయస్థానమున శుభగ్రహములుండి అష్టమస్థానమున పాపగ్రహముండునెడల తత్కాలమున బుట్టిన స్త్రీ తనపతికంటె తానుముందుగ మరణము నొందునని తెలియదగినది.

## స్వల్పపుత్రులు గలుగు యోగము.

జనన కాలమున చంద్రుడు. కన్యా, వృశ్చిక, వృషభ, సింహ రాసులలో నొక్కరాశియందుండగా జనించిన యువతికి స్వల్పపుత్రులు గలుగుదురని తెలియవలెనది

ఈవిషయమునకు "పుత్రభవనే శుభయుతే నిరీక్షితేవా" అని గ్రంథాంతరమున జెప్పబడి యుండుటచే, పుత్రస్థానమున శుభగ్రహముండిననైనను, లేక పుత్రస్థానము శు

ఆగ్రహములచే జూడబడు చుండిననైనను మాత్రమే స్వల్పపుత్రులైనను గలుగుదురని చెప్పుటకు వీలగునని కొందరూహించు చున్నారు.

### { పురుషస్వభావ చేష్టలుగల స్త్రీయొక్కయు బ్రహ్మ జ్ఞానాభిజ్ఞురాలగు స్త్రీయొక్కయు జననయోగములు. }

శ్లో. సౌరే మధ్యబలే బలేన రహితైః శీతాంశుశుక్రేందుజైః
శేషైః వీర్యసమన్వితైః పురుషిణీ యద్యోజరాశ్యుద్గమః
జీవారాస్ఫుజిదైందవేషు బలిషు ప్రాగ్లగ్న రాశౌ సమే
విఖ్యాతా భువి నైకశాస్త్రనిపుణా స్త్రీ బ్రహ్మవాదిన్యపి. 15

టీ. సౌరే = శనైశ్చరుండు, మధ్యబలే = మధ్యబలుడై యుండునప్పుడు, శీతాంశుశుక్రేందుజైః = చంద్రశుక్రబుధులు, బలేనరహితైః = బలహీనులై యుండఁగా, శేషైః = తక్కిన రవికుజగురువులు, వీర్యసమన్వితైః=బలవంతులై యుండగ, ఓజరాశ్యుద్గమోయది=విషమరాసులలో నొకటి జన్మలగ్నమయ్యెనేని, అపుడుబుట్టిన, స్త్రీ=కాంత, పురుషిణీ=పురుషస్వభావచేష్టలు గలదగును, జీవారాస్ఫుజిదైందవేషు=గురు కుజ శుక్ర బుధులు ఏరాసులయందైన, బలిషు=బలవంతులై యుండగ, ప్రాగ్లగ్నరాశౌ = స్త్రీజన్మలగ్నరాశి, సమే=సమరాశియైనయెడల, భువి=భూమియందు, విఖ్యాతా = ప్రసిద్ధురాలును, నైకశాస్త్రనిపుణా = అనేకశాస్త్రములందు సమర్థురాలును, బ్రహ్మవాదిన్యపి = బ్రహ్మజ్ఞానము గలదియునగును.

తా. బేసి రాసులగు, మేష, మిథున, సింహ, తులా, ధనుఃకుంభముల యందొక్కటి జననలగ్నమగుచు శనైశ్చరుడు మధ్యమబలుడై యనగా అత్యంత బలీయుడుగాకను, బలహీనుడుగాకను నుండి చంద్రశుక్రబుధులు బలహీనులగుచు, తక్కిన గ్రహములగు సూర్యాంగారక బృహస్పతులు బలయుతులగుచుండు కాలమునబుట్టిన యువతి పురుషస్వభావ చేష్టలుగలదియగును. గుర్వంగారక శుక్రబుధులు ఏరాసులయందైనను బలీయులగు చుండగా జనన లగ్నము సమరాసులగు వృషభ, కర్కాటక, కన్యా,వృశ్చిక, మకర, మీనరాసులలో నొక్కటి యగునెడల తత్కాలమున జనించిన యువతి, ప్రపంచమున కీర్తివహించినదియు, అనేక శాస్త్రార్థ జ్ఞానమున సమర్థత్వముగలదియు బ్రహ్మజ్ఞానము గలదియు నగును.

ఇందులకు, "బలభిర్బుధగురు శుక్రైశ్శశాంక సహితైర్విలగ్న గైస్సమభే, స్త్రీబ్రహ్మవాదినీస్యాదనేక శాస్త్రార్థ కుశలాచ" అనిసారావళీ కారకుడు వచించి యుండుటచే సమరాసులలో నొక్కటి జన్మలగ్నమగుచు ఏరాసుల యందైనను చంద్రబుధ గురుశుక్రులు బలీయులై యుండగా జనించినస్త్రీబహు శాస్త్రములయందు సమర్థురాలును, బ్రహ్మజ్ఞానము గలదియునగునని నూహింపదగి యున్నది మరియు గ్రంథాంతరములయందు "కుజవతువాదినీ" అని చెప్పబడి యుండుటచే వరాహ మిహిరాచార్యుల యోగము ప్రకార ముండునెడల శాస్త్రార్థవాదమునం దతి సమర్థురాలగుననియు నూహింపదగి యున్నది.

### ప్రవ్రజ్యనాశ్రయించు స్త్రీజనన యోగము.

శ్లో. పాపేఽస్తే నవమగతగ్రహస్య తుల్యాం
ప్రవ్రజ్యాం యువతి రుపైత్యసంశయేన
ఉద్వాహే వరణవిధౌ ప్రదానకాలే
చింతాయా మపి సకలం విధేయ మేతత్. 16

టీ. పాపే=పాపగ్రహము, అస్తే=సప్తమ మందుండఁగా, నవమగతగ్రహస్య = నవమ మందున్న గ్రహమునకు, తుల్యాం=సమమైన, ప్రవ్రజ్యాం=ప్రవ్రజ్యను, యువతి=కాంత అసంశయేన = సందేహముగ, ఉపైతి=పొందును. ఏతత్సకలం = ఈ స్త్రీజాతకమందుఁ జెప్పఁబడిన సకలయోగములును, ఉద్వాహే = వివాహమందును, వరణవిధౌ = కన్యావరణకాల మందును, ప్రదానకాలే = కన్యాదానకాలమందును, చింతాయాం = ప్రశ్నకాలమందును, విధేయం = చెప్పదగినది.

తా. జనన లగ్నమునకు సప్తమస్థానమున పాపగ్రహముండి, మరియొక పాపగ్రహము నవమస్థానము నందుండునెడల ఆనవమస్థాన స్థితగ్రహమునకు సమానమగు ప్రవ్రజ్యను జాతకురాలు బొందునని జెప్పదగినది. ఇట్టివిషయములయందు సప్తమస్థాన స్థితగ్రహఫలము ను జాతకురాలికి జెప్పదగదు ఈ స్త్రీ జాతకాధ్యాయమున జెప్పబడిన యోగములన్నియు, జన్మకాలము నందును, వివాహకాలము నందును, కన్యావరణ కాలమునందును, కన్యాదానకాలమునందును, ప్రశ్నకాలమునందును యోచించి ఫలముల జెప్పదగినది.

మరియు, గ్రంథాంతరమున "వివాహే ప్రథమార్తవే" అనియుండుటచే ప్రథమర్తు దర్శనకాలమునను పైయోగముల యోచింపదగినది. మరియు సారావళీ కారుడు "యత్ప్రో క్తంపుంసాం తత్పతిష్వపి" అనివచించియుండుటచే స్త్రీకేఫలములే యోగముల ననుసరించ జెప్పబడెనవో ఆఫలములే ఆస్త్రీలభర్తలకును జెప్పదగినదని నూహింపదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
స్త్రీ జాతకాధ్యాయ నామక
త్రయోవింశోధ్యాయము.



శ్రీ రస్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### నైర్యాణికాధ్యాయము. చతుర్వింశోధ్యాయము.—24.



#### అష్టమస్థానగ్రహ వీక్షాదులవలన మరణప్రకారములు.

శ్లో. మృత్యుర్మృత్యుగృహేక్షణేన బలిభిస్తద్ధాతుకోపోద్భవ
స్తత్సంయుక్తభగాత్రజో బహుభవో వీర్యాన్వితైర్భూరిభిః
అగ్న్యంబ్వాయుధజో జ్వరామయకృతస్తృట్క్షుత్కృతశ్చాష్టమే
సూర్యాద్యైర్నిధనే చరాదిషు పరస్వాధ్వప్రదేశేష్వపి. 1

టీ. బలిభిః = బలీయులగు గ్రహములచేత, మృత్యుగ్రహేక్షణేన = జన్మలగ్నమునకు అష్టమరాశిగ్రహావర్జితమై చూడబడుటవలన, మృత్యుః = మరణము, తద్ధాతుకోపోద్భవః = (ఆగ్రహమునకుం జెప్పియున్న) ధాతుప్రకోపమువలన సంభవించును, తత్సంయుక్తభగాత్రజః = ఆ అష్టమస్థానగతమైనరాశి, యందును యిటులే, వీర్యాన్వితైః = బలయుక్తములైన, భూరిభిః = పెక్కుగ్రహములచేత, బహుభవః = అనేకధాతుదోషజనితమయిన మరణము సంభవించును, అష్టమే = అష్టమమందున్న, సూర్యాద్యైః = రవ్యాదులచేత, అగ్న్యాదులవలన మరణముకలుగును, అదియెట్లనిన, లగ్నమునకు అష్టమమందు రవియుండెనేని అగ్నివలనను చంద్రుండుండెనేని, అంబు=ఉదకమువలనను, కుజుండుండెనేని, ఆయుధజః=ఆయుధమువలనను, (బుధుండుండెనేని), జ్వర = జ్వరమువలనను, గురుండుండెనేని, ఆమయకృతః = తెలియఁబడని దీర్ఘవ్యాధివలనను, (శుక్రుండుండెనేని), తృట్ = దప్పివలనను, శనియుండెనేని, క్షుత్కృతః = ఆకలివలనను, మరణముగలుగును, ఈగ్రహములు బలయుక్తములైయుండెనేని శుభకర్మముచేతను, బలహీనములై యుండెనేని అశుభకర్మముచేతను, మధ్యబలములై యుండెనేని మధ్యమకర్మముచేతను మరణము గలుగును. నిధనే=అష్టమరాశి, చరాదిషు=చరస్థిరద్విస్స్వభావము లగుచుండగా, పరస్వాధ్వప్రదేశేషు=అనగా జన్మలగ్నమునకు అష్టమరాశి చరమయ్యెనేని పరదేశమందును, స్థిరమయ్యెనేని స్వదేశమందును, ద్విస్స్వభావమయ్యెనేని మార్గప్రదేశమందును మృతిగలుగును.

తా. జననలగ్నమునకు అష్టమస్థానమునందు గ్రహములులేకుండి, బలవంతములగు గ్రహములచే నాయష్టమస్థానము జూడబడుచుండు నెడల నాయాగ్రహమునకు జెప్పబడిన ధాతుప్రకోపమువలన జాతకునకు మరణముగలుగునని జెప్పదగినది. అనగా సూర్యునకు పైత్యము, చంద్రునకు వాతశ్లేష్మములు, అంగారకునకు పిత్తవికారము బుధునకు వాతపిత్తశ్లేష్మాదులు, గురువునకు శ్లేష్మము, శుక్రునకు వాతశ్లేష్మము, శనైశ్చరునకు వాతపిత్తశ్లేష్మము, ఈరీతి పూర్వమే జెప్పబడియుండుటచేత ఏగ్రహవీక్షణ్యము గలుగుచున్నదో ఆగ్రహసంబంధమగు ధాతువువలన నేర్పడు వ్యాధివలన జాతకునకు మరణము గలుగునని జెప్పదగినది. మరియు, నాయష్టమస్థానముగ నేర్పడు రాశి కాలపురుషుని యొక్క యే యంగముగా నేర్పడుచుండునో ఆయంగమునందు పూర్వము జెప్పినరీతిగ వీక్షించునట్టి గ్రహమునకు జెప్పబడిన ధాతుప్రకోపజనిత వ్యాధిచే జాతకునకు మరణము గలుగునని జెప్పదగినది

ఇందులకు "యేబలయుక్తో నిధనంపశ్యతి తద్ధాతుకోపకోమృత్యుః, తత్సంయుక్త స్తనుజో బహుభిర్బలిభిర్బహు ప్రకారస్స్యాత్" అనిసారావళీ వచనమును, "తద్ధాతుకామస్మరణం ప్రయాతి గంధ్రస్థితానామిహ ఖేచరాణాం రోగోద్భవే వా మరణస్య హేతౌ" అని గ్రంధాంతరవచనమును గానబడుచున్నది. బలయుతములగు అనేక గ్రహములచేత అనేకధాతుదోషజనితమగు మరణము జాతకునకు గలుగుచున్నది. అనగా అష్టమస్థానమున సూర్యుడుండు నెడల అగ్నివలనను, చంద్రుడుండు నెడల నుదకమువలనను, అంగారకుడుండు నెడల నాయుధములవలనను, బుధుడుండు నెడల జ్వరమువలనను, బృహస్పతియుండు నెడల తెలియబడని దీర్ఘవ్యాధిచేతను, శుక్రుడుండు నెడల దప్పివలనను శనైశ్చరుడుండు నెడల, ఆకలివలననైనను, వ్రణముల వల్లనైనను, జాతకునకు మరణముగలుగునని దెలియదగినది. అష్టమస్థానస్థితగ్రహమైనను, అష్టమస్థానమును వీక్షించుగ్రహమైనను, బలయుతమగు నెడల శుభకర్మలచేతను, బలహీనమగు నెడల అశుభకర్మలచేతను. మధ్యమబలయుతమగు నెడల శుభాశుభమిశ్రకర్మలచేతను మరణము సంభవించునని దెలియదగినది.

మరియు నీవిషయమున, గ్రహబలాధికత ననుసరించి, యాయాగ్రహమునకు జెప్పబడియుండు అగ్న్యాదులవలన మరణము జెప్పదగినదనగా గ్రహముబలయుతమగు నెడల తప్పక మరణముగలుగుననియు, మధ్యమబలవంతమగు నెడల మరణముగలుగు నంతటి తొందరజేసి తగ్గుననియు, బలహీనమగు నెడల తత్సంబంధమగు బాధకొంచెముగ గలిగి శమించుననియును కొందరూహించుచున్నారు.

## మరణదేశము నెరుగు క్రమము.

జననలగ్నమునకు అష్టమరాశి చరరాశియగు నెడల పరదేశమునందును, స్థిరరాశియగు నెడల స్వదేశమునందును, ద్విస్వభావరాశియగు నెడల మార్గప్రదేశమునందును మరణముగలుగునని దెలియదగినది ఇందులకు "పరదేశపథి స్వకేచరాద్యైర్ద్వ్యైః" అని సారావళీకారకుడు వచించియున్నాడు.

## రాతిదెబ్బలు మొదలగు వానివలన గలుగు మరణయోగములు.

శ్లో. శైలాగ్రాభిహతస్య సూర్యకుజయోర్మృత్యుః ఖబంధుస్థయోః
కూపే మందశశాంకభూమితనయైర్బంధ్వస్తకర్మస్థితైః
కన్యాయాంస్వజనాద్ధిమోష్ణకరయోః పాపగ్రహైర్దృష్టయోః
స్యాతాంయద్యుభయోదయేఽర్కశశినౌ తోయే తదా మజ్జతి. 2

టీ. సూర్యకుజయోః = రవికుజులు, ఖబంధుస్థయోః = ఏకకాలంబునదశమమందుగాని చతుర్థమందుగానియుండగా పుట్టినవానికి, శైలాగ్రాభిహతస్య = కొండపైన రాతిదెబ్బ తగులుటచేతను మరణముగలుగును. మందశశాంకభూమితనయైః = శనిచంద్రకుజులు, బంధ్వస్తకర్మస్థితైః = చతుర్థసప్తమదశమములయందుండిన, కూపే = బావియందుపడిచచ్చును, పాపగ్రహైః = పాపగ్రహములచేత, దృష్టయోః = చూడబడుచున్న, హిమోష్ణకరయోః = చంద్రసూర్యులు, కన్యాయాం = కన్యారాశిలోనుండగ బుట్టినవాడు, స్వజనాత్ = తన బంధువులవలన, చంపబడును. ఉభయోదయే = ద్విస్వభావరాశిలగ్నమై ఆలగ్నమందు, అర్కశశినౌ = సూర్యచంద్రులు, స్యాతాంయది = ఉండిరేని, తదా = అప్పుడుపుట్టినవాడు, తోయే = ఉదకమందు, మజ్జతి = మునిగిపోవును.

తా. జననలగ్నమునకు చతుర్థస్థానమునందైనను, దశమమునందైనను, సూర్యాంగారకులిద్దరును గూడియుండగా జనించినవాడు, పర్వతాగ్రమున రాతిదెబ్బచే మృతిబొందునని తెలియదగినది. ఈవిషయమున "సూర్యకుజయోః ఖబంధుస్థయోః" అన్నప్పుడు సూర్యుడు దశమమునను, అంగారకుడు చతుర్థమునను నుండునెడల నీయోగముగలుగునని కొందరనుచున్నారు. జననలగ్నమునకు చతుర్థ, సప్తమ, దశమములయందు క్రమముగా శనైశ్చరచంద్రాంగారకులుండునెడల ననగా, చతుర్థమున శనైశ్చరుడును, సప్తమమున చంద్రుడును, దశమమున అంగారకుడునుండగా బుట్టినవాడు బావియందు పడుటవలన మరణమునుబొందును.

చంద్రసూర్యులిరువురును కన్యారాశియందుండి పాపగ్రహములచే జూడబడుచుండగా జనించినవాడు తనబంధువులచే జంపబడును. జననలగ్నము ద్విస్వభావరాశియై అందు సూర్యచంద్రులుండగా బుట్టినవాడు, నీటియందు మునిగిపోవునని తెలియదగినది. ఈకడపటి యోగములు రెండుకలసిన యోగముసంభవించునెడల అనగా ద్విస్వభావరాశియగు కన్యారాశి జననలగ్నమగుచు, అందుసూర్యచంద్రులుండి, పాపగ్రహములచే జూడబడుచుండునెడల తత్కాలమున జనించినవాడు, స్వబంధువులచే బలాత్కారముగ నీటియందుముంపబడుటచే ప్రాణములను విడుచునని కొందరును, బంధువులచే జంపబడి ఆశవము నీటియందు పారవేయబడునని కొందరును ఊహించుచున్నారు

### మఱికొన్ని మరణయోగముల వివరము.

శ్లో. మందే కర్కటకే జలోదరకృతో మృత్యుర్మృగాంకే మృగే
శస్త్రాఽగ్నిప్రభవ శ్శశి న్యశుభయోర్మధ్యే కుజర్క్షే స్థితే
కన్యాయాం రుధిరోత్థ శోషజనిత స్తద్వత్ స్థితే శీతగౌ
సౌరర్క్షే యది తద్వదేవ హిమగౌ రజ్జ్వగ్ని పాతైః కృతః. 3

టీ. మందే = శనైశ్చరుడు, కర్కటకే = కర్కాటకమందును, మృగాంకే = చంద్రుడు, మృగే = మకరమందునుండగా పుట్టినవానికి, జలోదరకృతః = జలమధ్యమున మృత్యుః = మరణముగలుగును, శశిని = చంద్రుడు, అశుభయోర్మధ్యే = రెండు పాపగ్రహములమధ్యను, కుజర్క్షే = మేషవృశ్చికములలో నొకదానియందు, స్థితే = ఉండగ (పుట్టినవానికి), శస్త్రాగ్నిప్రభవః = ఆయుధ అగ్ని వీటిలో నొకదానివలన మృతికలుగును, శీతగౌ = చంద్రుడు, కన్యాయాం = కన్యారాశియందు, తద్వత్ స్థితే = ఆరీతినేయుండగా పుట్టినవానికి, రుధిరోత్థ శోషజనితః = దుష్టరక్తముగాని క్షయవ్యాధిచేతగాని మృత్యువుసంభవించును, హిమగౌ = చంద్రుడు, సౌరర్క్షే = మకరకుంభములలో నొకదానియందు, తద్వదేవ = ఆరీతిగానే పాపద్వయ మధ్యగతుడై యుండగ జనించినవానికి, రజ్జ్వగ్నిపాతైః = పగ్గముత్రాడుచేనైనను అగ్నిచేతగాని, పడుటచేతగాని, కృతః = చేయబడిన, మృత్యుః = మరణము, కలుగును.

(1) తా. శనైశ్చరుడు కర్కాటకరాశియందును, చంద్రుడు మకరరాశియందును నుండగా జనించినవానికి ఉదకమధ్యమున మరణముగలుగును. ఈవిషయమున జలోదరమనెడువ్యాధిచే పీడింపబడిమరణమును బొందునని కొందరి యభిప్రాయము.

(2) చంద్రుడు, అంగారకక్షేత్రములగు మేష వృశ్చికములలో నొకరాశియందుండి పాపగ్రహముల నడుమనుండునెడల జాతకుడు, శస్త్రాదులచేనైనను, అగ్నిచేనైనను మరణమును బొందును.

(3) చంద్రుడు, బుధక్షేత్రమగు కన్యారాశియందుండి పాపగ్రహమధ్యస్థుడగుచుండగా జనించినవాడు దుష్టరక్తముచేతనైనను, క్షయవ్యాధిచేతనైనను, మరణమునొందును.

(4) చంద్రుడు, శనైశ్చరక్షేత్రములగు మకరకుంభములలో నొకరాశియందు పాపగ్రహద్వయమధ్యముడైయుండగా జనించినవాడు, త్రాళ్లచేగాని ,(స్వతంత్రించియైనను, యితరులవల్లనైనను) అగ్నియందుపడుటచేగాని మరణించును. మరియు, కాలుటచేనైనను, ఎత్తునుండి క్రిందపడుటచేనైనను మరణించునని యూహింపదగియున్నది.

### మఱికొన్ని మరణయోగములు.

శ్లో. బంధాద్ధీనవమస్థయో రశుభయో స్సౌమ్యగ్రహాదృష్టయో
ర్ద్రేక్కాణైశ్చ ససర్పపాశనిగళై శ్ఛిద్రస్థితై ర్బంధతః

కన్యాయా మశుభాన్వితేఽస్తమయగే చంద్రే స్థితే మేషగే
సూర్యే లగ్నగతేచ విద్ధి మరణం స్త్రీహేతుకం మందిరే. 4

టీ. సౌమ్యగ్రహాదృష్టయోః = శుభగ్రహములచేత చూడబడక, అశుభయోః = పాపగ్రహములు, ధీనవమస్థయోః = పంచమమందొకడును, నవమమందొకడును యుండగ పుట్టినవాడును, బంధాత్ = ఉరిపోసికొనినమృతి. ఛిద్రస్థితైః = జన్మలగ్నమునకు అష్టమమందు ఉదయించిన, ససర్పపాశనిగళైః = సర్పపాశనిగళాఖ్యములైన, ద్రేక్కాణైః = ద్రేక్కాణములచేత, బంధతః = బంధనమువలన మృతిబొందును, అశుభాన్వితే = పాపగ్రహయుక్తుడైన, చంద్రే = చంద్రుడు, అస్తమయగే = సప్తమగతుడై, కన్యాయాం = కన్యయందుండగ, సితే = శుక్రుడు, మేషగే = మేషమందుండగను, సూర్యే = సూర్యుడు, లగ్నగతేచ = లగ్నమందుండగను, పుట్టినవానికి, మందిరే = గృహమందు, స్త్రీహేతుకం = స్త్రీనిమిత్తమగు, మరణం = మరణమును, విద్ధి = తెలియుము.

తా. జననకాలమున శుభగ్రహములచే జూడబడక యుండు పాపగ్రహద్వయమున నొకగ్రహము జననలగ్నమునకు పంచమస్థానమునను మరియొకగ్రహము నవమస్థానమునను నుండగా జనించినవాడు బంధనమువలన మృతిబొందును. జననలగ్నమునకు అష్టమరాశియందు, దయించు సర్పపాశనిగళ ద్రేక్కాణములచే జాతకునకు బంధనముగలిగి మరణము సంభవించును. [కర్కాటకాంత్యమును, మీనాంత్యమును సర్పపాశద్రేక్కాణములు] మకరప్రథమముని గళ ద్రేక్కాణము జననలగ్నము మీనరాశి యగుచు అందు సూర్యుడును, సప్తమస్థానమగు కన్యారాశియందు, పాపగ్రహయుతుడగు చంద్రుడును, మేషరాశియందు శుక్రుడునుండగా జనించినవానికి యింటియందు స్త్రీమూలకముగ మరణము సంభవించును. ఇందులకు, "మీనోదయే దినకరే చంద్రేపాపాన్వితేఽస్తగే మేషే స్త్రీ హేతుకంతు మరణంస్వమందిరే స్యాద్వదంత్వేకే" అని సారావళీకారకుడు వచించియున్నాడు ఇదువలన స్వగృహమునందే మరణము సంభవించునటుల స్పష్టమగుచున్నది.

శ్లో. శూలోద్భిన్నతను స్సుఖే వనిసుతే సూర్యే పివా ఖే యమే
సప్రక్షీణహిమాంశుభిశ్చ యుగప త్పాపై స్త్రికోణాద్యగైః
బంధుస్థే చ రవౌ వియ త్యవనిజే క్షీణేందు సంవీక్షితే
కాష్ఠై ర్నాభిహతః ప్రయాతి మరణం సూర్యాత్మజే నేక్షితే. 5

టీ. సుఖే = చతుర్థమున, అవనిసుతే = అంగారకుడైనను, సూర్యేపివా = రవియైననుండగను, ఖే = దశమమున, యమే = శనియుండినను, జాతకుడు, శూలోద్భిన్నతనుః = శూలముచేత పొడువబడిన శరీరముగలవాడై చచ్చును, సప్రక్షీణహిమాంశుభిః = క్షీణచంద్రసహితములైన, పాపైః = పాపగ్రహములు, యుగపత్ = ఏకకాలమున, త్రికోణాద్యగైః = త్రికోణాదుల యందే యుండి యితరస్థానములు శూన్యములై యుండగా బుట్టినవాడును, శూలము

చే చచ్చును, బంధుస్థే=చతుర్థమందున్న, రవౌ=సూర్యుడును, వియతి=దశమమందున్న, అవని సుతే=కుజుడును, క్షీణేందుసంవీక్షితే = క్షీణచంద్రునిచేత చూడఁబడుచుండగాఁ బుట్టిన వాఁడును శూలభిన్నశరీరుండై మృతినొందును సూర్యాత్మజేన=శనిచేత, ఈక్షితే=చూడబడు చుండగా పుట్టినవాడు, కాష్ఠేన=కట్టెచేత. అభిహతః = కొట్టబడినవాడై, మరణం= చావును, ప్రయాతి = పొందును.

తా. జనన లగ్నమునకు చతుర్థస్థానమున అంగారకుడైనను, సూర్యుడైనసుండి దశమ స్థానమున శనైశ్చరుడుండగా జనించినవాడును క్షీణచంద్ర సహితములగు పాపగ్రహములు ఏక కాలమున నవమ పంచమ, జన్మలగ్నముల యందుండగా జనించిన వాడును జననలగ్న మునకు చతుర్థస్థానమున సూర్యుడును, దశమస్థానమున అంగారకుడును నుండి క్షీణచంద్రు నిచే జూడబడుచుండగా బుట్టినవాడును, శూలముచేత వ్రక్కలింపబడిన శరీరముగల వారై మరణించుదురు. పై జెప్పబడిన మూడవయోగమునగల సూర్యాంగారకులు శనైశ్చరునిచే జూ డబడు చుండిరేని జాతకుడు కట్టెలుచే కొట్టబడినవాడై మరణించును, ఈవిషయమునకు "హిబుకేర్క వియతి కుజే క్షీణేందుయుతే క్షేన సందృష్టే, కాష్ఠేనాభిహత స్సన్మ్రియ తే జాతోనసందేహః" అనిసారావళీ కారకుడు వచించి యున్నాడు క్షీణచంద్రయుక్తుడగు శనైశ్చరునిచే జూడబడుచుండవలెననుట చాలమంది గ్రంథకర్తల యభిప్రాయముగా నున్నది.

శ్లో. రంధ్రాస్పదాంగ హిబుకైర్ల గుడాహతాంగః
    ప్రక్షీణచంద్ర రుధిరార్కి దినేశ యుక్తైః
    త్రై రేవ కర్మ నవ మోదయపుత్ర సంస్థై
    ర్ధూమాగ్ని బంధన శరీరని కుట్టనాంతః. 6

టీ. ప్రక్షీణచంద్రరుధి రార్కి దినేశయుక్తైః=క్షీణచంద్ర కుజ శని రవి యుక్తము లైన, రంధ్రాస్పదాంగ హిబుకైః=అష్టమ దశమలగ్న చతుర్థములచేత, జనించినవాడు, లగు డాహతాంగః=దుడ్డుకోలచేత కొట్టబడిచచ్చును, కర్మనవమోదయ పుత్రసంస్థై =దశమ నవమ లగ్నపంచమ ములయందున్న, త్రైరేవ=ఆగ్రహముల చేతనే, ధూమాగ్ని బంధన శరీరనికుట్ట నాంతః = పొగ అగ్ని బంధనము అంకుశాదులచేతగాని అంత్యము సంభవించును.

తా. క్షీణచంద్ర, కుజ, శని, రవి, యుక్తములగు, అష్టమ, దశమలగ్న, చతుర్థము ల చేతననగా జనన లగ్నమున శనైశ్చరుడును, చతుర్థమున సూర్యుడును, అష్టమమున క్షీణచం ద్రుడును, దశమమున నంగారకుడును నుండగా జనించినవాడు, దుడ్డుకోలచే కొట్టబడి మ రణించునని తెలియదగినది. దశమ నవమ, లగ్న, పంచమములయందుండు ఆగ్రహములచే తననగా జనన లగ్నమున శనైశ్చరుడును, పంచమస్థానమున సూర్యుడును, నవమమున అంగా రకుడును, దశమమున క్షీణచంద్రుడును నుండగా జనించినవాడు, పొగచేతనైనను, అగ్ని చేతనైనను, బంధనముచేతనైనను, అంకుశాదులచేతనైనను మరణించును.

శ్లో. బంధ్వస్తకర్మసహితైః కుజసూర్యమందై
ర్నిర్యాణమాయుధశిఖక్షితిపాలకోపాత్
సౌరేందుభూమితనయైః స్వసుఖాస్పదస్థై
ర్జ్ఞేయః క్షతక్రిమికృతశ్చ శరీరపాతః. 7

టీ. బంధ్వస్తకర్మసహితైః కుజసూర్యమందైః = చతుర్థమున కుజుడు సప్తమందునర విదశమమందుశని = ఉండగా బుట్టినవానికి ఆయుధశిఖిక్షితిపాలకోపాత్ = ఆయుధము, నిప్పు, రాజుకోపము, వీనిలో నొక్కదానివలన, నిర్యాణం = చావుకలుగును, సౌరేందుభూమితనయైః స్వసుఖాస్పదస్థైః = ద్వితీయమందు శని, చతుర్థమున చంద్రుడు, దశమమున కుజుడు, ఉండగా పుట్టినవానికి, క్షతక్రిమికృతః = వ్రణమున బుట్టినపురుగులచేత, శరీరపాతః, మరణము, జ్ఞేయః = తెలియదగినది.

తా. జనన లగ్నమునకు, చతుర్థమున అంగారకుడును, సప్తమమున సూర్యుడును, దశమమున శనైశ్చరుడును, నుండగా బుట్టినవానికి ఆయుధముచే నైనను, అగ్నిచేనైనను, రాజదండనాదులచే నైనను మరణము గలుగును, జనన లగ్నమునకు రెండవయింట శనైశ్చరుడును, నాల్గవయింట చంద్రుడును, పదియవయింట అంగారకుడును నుండగా జనించిన వానికి తీవ్రవ్రణములు గలిగి యందుబుట్టిన పురుగులు తొల్చుటచే శరీరముచెడి ప్రాణము పోవును

శ్లో. ఖస్థేఽర్కేఽవనిజే రసాతలగతే యానప్రపాతాద్వధో
యంత్రోత్పీడనజః కుజేఽస్తమయగే సౌరేందినాభ్యుద్గమే
విణ్మధ్యే రుధిరార్కిశీతకిరణై ర్ఝూకాజసౌరర్క్షగై
ర్యాతైర్వా గళితేందుసూర్యరుధిరై ర్వ్యోమాస్తబంధ్వాహ్వయాన్. ౮

టీ. అర్కే = సూర్యుడు, ఖస్థే = దశమమందుండగా, అవనిజే = కుజుడు, రసాతలగతే = చతుర్థమందుండగాను, జనించినవానికి, యానప్రపాతాత్ = వాహనముమీద నుండిపడుటవలన, వధః = మృతికలుగును, కుజే = అంగారకుడు, అస్తమయగే = సప్తమగతుడైయుండగా సౌరేంద్వినాభ్యుద్గమే = శనిచంద్రసూర్యులు లగ్నమందుండగాను, పుట్టినవానికి, యంత్రోత్పీడనజః = యంత్రపీడితుడై మరణముచెందును రుధిరార్కిశీతకిరణైః ఝూకాజసౌరర్క్షగైః = తులయందు కుజుడు, మేషమందుశని, మకరమందుగాని కుంభమందుగాని చంద్రుడు, ఉండగా జన్మించినవాడు, విణ్మధ్యే = అమేధ్యమధ్యమున చచ్చును, యాతైర్వా గళితేందుసూర్యరుధిరైః వ్యోమాస్తబంధ్వాహ్వయాన్ = దశమమున క్షీణచంద్రుడు, సప్తమమందు సూర్యుడు, నాలవయింట కుజుడు ఉండగా బుట్టినవాడును, విణ్మధ్యే = అమేధ్యమధ్య మందుచచ్చును.

తా. జనన లగ్నమునకు దశమమున సూర్యుడును, చతుర్థమున అంగారకుడును నుండగా జనించినవాడు వాహనము మీదినుండి పడుటవలన మరణించును అంగారకుడు జనన

లగ్నమునకు సప్తమస్థానమున నుండి లగ్నమున శనైశ్చర, చంద్రసూర్యు లుండగా జనించిన వాడు శస్త్రములపీడచే గలిగిన బాధవలన మరణించును. ఇందు "సౌరేంద్వినాభ్యుద్గమే" అనుచోట "క్షీణేంద్వినాభ్యుద్గమే" అనికొందరు పఠించుచున్నారు. ఇందులకు, "సప్తమభవనే భౌమేక్షీణేందు దివాకరార్కి భిర్లగ్నే మరణంజాతస్య వధేద్యం తోత్రిదశ భవమవశ్యం" అని సారావళీ కారకుడు వచించియున్నాడు తులా మేష మకర కుంభముల బొందియున్న అంగారక శనైశ్చర చంద్రులచేత ననగా తులారాశియందు అంగారకుడును, మేషమున శనైశ్చరుడును, మకర కుంభములలో నొకరాశియందు చంద్రుడును నుండగా జనించినవాడును దశమ, సప్తమ, చతుర్థ స్థానములను బొందిన క్షీణచంద్ర సూర్యాంగారకులచేత ననగా జనన లగ్నమునకు దశమస్థానమున క్షీణచంద్రుడును, సప్తమస్థానమున సూర్యుడును, చతుర్థస్థానమున అంగారకుడును నుండగా బుట్టినవాడును అమేధ్యమునబడి మృతినొందువారగుదురు.

శ్లో. వీర్యాన్వితవక్రవీక్షితే క్షీణేందౌ నిధనస్థితేఽర్కజే
గుహ్యోద్భవరోగపీడయా మృత్యుస్స్యాత్క్రిమిశస్త్రదాహజః.

టీ. క్షీణేందౌ = క్షీణచంద్రుడు, వీర్యాన్వితవక్రవీక్షితే = బలయుక్తుడైన కుజునిచేత చూడబడుచుండినను, అర్కజే = శనైశ్చరుడు, నిధనస్థితే = అష్టమమందుండగను జన్మించినవానికి, గుహ్యోద్భవ రోగపీడయా = మర్మస్థానమందు పుట్టిన భగంధరాదిరోగములచేత, క్రిమిశస్త్రదాహజః = గుహ్యప్రదేశమందు బుట్టిన మూలవ్యాధి భగంధరాధి వ్యాధులలో నొకదాని వలన పురుగులు పట్టినైనను శస్త్రముచే నైనను వలనగాని, నిప్పులో కాలుట వలనగాని, మృత్యుస్స్యాత్ = మరణము గలుగును.

తా. జనన కాలమున క్షీణచంద్రుడు, బలయుతుడగు అంగారకునిచే జూడబడుచుండి శనైశ్చరుడు జనన లగ్నమునకు అష్టమస్థానమున నుండగా జనించినవానికి గుహ్యప్రదేశము నందలి గలుగు భయంకరమగు మూలము, భగంధరము మొదలగు వ్యాధులుగలిగియందు పురుగులుపడి యాబాధచే నైనను, శస్త్ర చికిత్సాదులచే నైనను, అగ్నిచే గాల్పబడుట వలన నైనను, మరణము గలుగును.

శ్లో. అస్తేరవౌ సరుధిరే నిధనేఽర్కపుత్రే
క్షీణే రసాతలగతే హిమగౌ ఖగాంతః
లగ్నాత్మజాష్టమతపస్స్వినభౌమమంద
చంద్రైస్తు శైలశిఖరాశనికుడ్యపాతైః. 10

టీ. సరుధిరే = కుజునితోకలసిన, రవౌ = సూర్యుడు, అస్తే = సప్తమమందును, అర్కపుత్రే = శని, నిధనే = అష్టమమునను, క్షీణేహిమగౌ = క్షీణచంద్రుడు, రసాతలగతే = చతుర్థమందును నుండునపుడు పుట్టువాడు, ఖగాంతః = పక్షివలన మరణించును, లగ్నాత్మజాష్టమ

తపస్వీన భౌమమంద చంద్రైః = లగ్నరవిపంచమ కుజుడు, అష్టమశని, నవమ చంద్రుడు ఇట్లుండగా జన్మించినవానికి, శైలశిఖరాశనికుడ్య పాతైః = కొండకొసనుండి పడుటవలనగాని పిడుగుపడుట వలనగాని (గోడతనమీద పడుటవలనగాని) గోడమీదనుండి పడుటవలన గాని మరణము గలుగును.

తా. జనన కాలమున, అంగారకునితో గూడిన సూర్యుడు, జనన లగ్నమునకు సప్తమస్థానమునను, శనైశ్చరుడు అష్టమమునను, క్షీణచంద్రుడు, చతుర్థస్థానమునను యుండగా జనించినవాడు పక్షికృతమగు మరణమును బొందును జనన లగ్నమున సూర్యుడు, పంచమమున అంగారకుడు అష్టమమున శనైశ్చరుడు నవమమున చంద్రుడును నుండగా జనించినవాడు కొండమీదనుండి క్రింద పడుటచే నైనను, పిడుగుతనమీద పడుటవలన నైనను, గోడతనపై బడుట వలన నైనను మరణించును ఈ విషయమునకు "లగ్నచ్ఛిద్రత్రికోణేషు రవ్యర్క్యార్యరని శాకరైః మృత్యుస్స్యాచ్ఛైల పాతేన శస్త్రకుడ్యాది పాశజః" అనిసారావళీ కారకుడు వచించియున్నాడు.

### అష్టమస్థానము గ్రహసంయోగవీక్షణ రహితమగుచుండగా జనించినవానికి మరణకారణవివరము.

శ్లో. ద్వావింశః కథితస్తు కారణం
ద్రేక్కాణో నిధనస్య సూరిభిః
తస్యాధిపతి ర్భవోపి వా
నిర్యాణంస్వగుణైః ప్రయచ్ఛతి. 11

టీ. సూరిభిః = పండితులచేత, ద్వావింశో ద్రేక్కాణః = ఇరువదిరెండవద్రేక్కాణము, నిధనస్య = మరణమునకు, కారణం = నిమిత్తమని, కథితః = చెప్పబడెను, అదిఏమెట్లనిన, తస్యాధిపతిః = ఆద్వావింశ ద్రేక్కాణాధిపతిగాని, భవః = ఆద్వావింశద్రేక్కాణము ఏనేరాశిసంబంధించియుండునో ఆరాశ్యధిపతి అనగా అష్టమరాశ్యధిపతిగాని, స్వగుణైః = ద్రేక్కాణోక్తఫల హేతువులచేత, నిర్యాణం=మరణమును, ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాడు.

తా. పై జెప్పబడిన 10 శ్లోకములయందు గనబరుపబడినయోగములలో నొక్కటియు గాకయు, అష్టమస్థానము గ్రహయుతముగాకయు, ఏగ్రహముచేతను జూడబడకయు నుండునెడల, జన్మద్రేక్కాణమునకు నిరువదిరెండవ ద్రేక్కాణము జాతకునిమరణమునకు కారణమనిజెప్పబడినది. మరియు, నాయిరువదిరెండవ ద్రేక్కాణము, దానిసంబంధమగురాశియనగా నష్టమరాశి, ఈ రెంటి యధిపతులలో నెవ్వరుబలాధికులోవారికి, నీయధ్యాయప్రథమశ్లోకమున జెప్పబడిన యగ్నిజ్వాలాదులలో నేదియేర్పడుచున్నదో నాహేతువువల్ల జాతకునకు మరణముగలుగుచున్నది.

## ఇరువదిరెండవ ద్రేక్కాణము వివరము.

జననకాలము లగ్నమున ప్రథమద్రేక్కాణమందగుచో, అష్టమస్థానమున ప్రథమద్రేక్కాణము ఇరువదిరెండవ ద్రేక్కాణము, లగ్నమున ద్వితీయద్రేక్కాణమునందు జననమగుచో అష్టమమున ద్వితీయద్రేక్కాణము యిరువదిరెండవ ద్రేక్కాణము. జన్మలగ్న తృతీయ ద్రేక్కాణమునందు జననకాలమేర్పడుచో అష్టమస్థానమునందు తృతీయద్రేక్కాణము యిరువదిరెండవ ద్రేక్కాణము.

ఉదాహరణము:— వృషభలగ్నమున ప్రథమద్రేక్కాణమున జననమగుచో, ధనూరాశియందు ప్రథమద్రేక్కాణము యిరువదిరెండవ ద్రేక్కాణమగుచున్నది. ఇట్లేయన్ని రాశులకును నూహింపదగినది.

## మరణభూమిలక్షణము దెలియువిధము.

శ్లో. హోరా నవాంశకపయుక్త సమానభూమౌ
యోగేక్షణాదిభి రతః పరికల్ప్య మేతత్
మోహ స్తు మృత్యు సమయేనుదితాంశ తుల్యః
స్వేశేక్షితే ద్విగుణిత స్త్రిగుణశ్శుభైశ్చ. 12

టీ. హోరానవాంశకపయుక్త సమానభూమౌ, హోరానవాంశకప = జన్మలగ్నోదయ నవాంశాధిపతితో, యుక్త = కూడినరాశికి, సమాన = సంచారయోగ్యమైన, భూమౌ = భూమియందు మరణముగలుగును, యోగేక్షణాదిభిః = లగ్ననవాంశాధిపతి యేరాశియందుండునో ఆరాశియందు మఱియొక గ్రహముండెనేని ఆగ్రహసంచారభూమియందును అనవాంశాధిపతియున్న రాశిని ఏగ్రహము చూచుచుండునో ఆగ్రహసంచారభూమియందు ఏగ్రహనవాంశయందుండునో ఆగ్రహసంచార భూమియందును మరణముకలుగును. ఏతత్ = ఈమరణస్థానము, పరికల్ప్య = కల్పింపదగినది. అనుదితాంశతుల్యః = జన్మలగ్నశేషనవాంశలుగూడితే యెంతకాలమగునో అంతకాలము, మృత్యుసమయే = మరణకాలమందు, మోహః = స్మారకములేకుండును, స్వేశేక్షితే = ఆలగ్నరాశ్యధిపతి చూపుకలిగియుండెనేని, ద్విగుణితః = రెండింతలకాలము స్మృతిదప్పియుండును, శుభైః = శుభగ్రహములచేత జూడబడుచుండిన, త్రిగుణః = మూడింతలకాలము స్మృతిదప్పియుండును.

తా. జననలగ్ననవాంశాధికి సంచారయోగమగు ప్రదేశమున జాతకుని మరణమనిచెప్పబడినది. అనగా, లగ్ననవాంశాధిపతియుండు రాశిమేషమగుచో, మేకలు, గొఱ్ఱెలు మొదలగునవి తిరుగులాడునేలయందును, వృషభమగుచో వృషభములు, గోవులు మొదలగునవి సంచారముచేయు ప్రదేశమునందును, మిథునమగుచో యింటియందును, కర్కాటకమగుచో బావి, చెరువు, గుంట, మొదలగువానియందును, సింహమగుచో విపినమునందును, కన్యయగుచో సమీపప్రదేశమునందును, తులారాశియగుచో అంగడివీధులయందును

వృశ్చికమగునెడల చెరువులు, పుట్టలగువారియందును, ధనూరాశియగునెడల అశ్వములు సంచరించు చోటులయందును, మకరమగునెడల జలప్రాయ ప్రదేశమునందును, కుంభమగునెడల యింటియందును, మీనమగునెడల నుదకమునను జాతకునకు మరణము గలుగుననియు వచింపదగినది.

మరియు, లగ్న నవాంశాధిపతియుండు రాశియందుమరియొక గ్రహముండునెడల తద్గ్రహసంచార సమానమగు భూమియందును, ఆనవాంశాధిపతియుండు రాశినివీక్షించుచుండునట్టి గ్రహసంచారభూమియందును, లగ్నోదయ నవాంశరాశ్యధిపతికి సంబంధమగు భూమియందును, అమరణమును జెప్పదగినది. ఈరీతిగననేకచోట్లు ఏకకాలమున నూహింపదగినట్లు గ్రహస్థితియేర్పడునెడల, అందు ఏగ్రహము బలయుక్తమగుచున్నదో తద్గ్రహసంచారభూమియేమరణభూమియని నిశ్చయింపదగినది.

గ్రహమునకేది స్వక్షేత్రమో యాసంబంధముగల భూమియనియు, రెండురాసులకు గ్రహమధిపతియగునెడల స్వత్రికోణరాశి యేది యగుచున్నదో, తత్సంబంధముగల భూమియనియు నూహింపదగియున్నది.

ఇంటులకు వివరము

| గ్రహములు. | స్వత్రికోణము. | మరణ ప్రదేశము. |
|---|---|---|
| సూర్యుడు | సింహరాశి | అరణ్య ప్రదేశము |
| చంద్రుడు | కర్కాటకము | జలసమీప ప్రదేశము |
| అంగారకుడు | మేషము | మేకలు, గొఱ్ఱెలు సంచరించునట్టి ప్రదేశము |
| బుధుడు | కన్యారాశి | జలసమీపప్రదేశము |
| బృహస్పతి | ధనూరాశి | అశ్వసంచార ప్రదేశము |
| శుక్రుడు | తులారాశి | పణ్యశాలాది ప్రదేశము |
| శనైశ్చరుడు | కుంభరాశి | స్వగృహప్రదేశము |

కొందరు పైకనుబరచిన ప్రకారము జెప్పక, "దేవాంబ్వగ్ని విహారకోశ" యను శ్లోకోక్తముగ.

| | |
|---|---|
| సూర్యునకు | దేవస్థాన, పూజాగృహములు |
| చంద్రునకు | స్నానశాల, జలసమీప ప్రదేశము |
| అంగారకునకు | అగ్నిసమీపము, పాకశాల |
| బుధునకు | క్రీడాగృహము |
| బృహస్పతికి | కోశాగారము |
| శుక్రునకు | శయనగృహము |
| శనైశ్చరునకు | ధూపరాగ ప్రదేశము |

అనివచించుచున్నారు.

ఈవిధముకూడ సమ్మతమని నూహింపదగియున్నది.

## మరణసమయమున స్మృతిదప్పియుండు కాలపరిమితివివరము.

జననలగ్నమునందు శేషించియుండు నవాంశలుఁగూడినయెడల నెంతకాలమగుచున్నదో, యంతకాలము, మరణకాలమున నొడలు దెలియక యుండునని దెలియదగినది. ఆలగ్నము,తదధిపతిచే జూడబడుచుండునెడల లగ్నమునందు శేషించియుండునంత కాలమునకు రెండంతలకాలము మరణకాలమున స్మృతిదప్పియుండును. మరియు, నాలగ్నముశుభగ్రహములచే జూడబడుచుండునెడల జననకాలమున లగ్నమునందు శేషించియుండు కాలమునకు మూడింతలకాలము మరణకాలమున నొడలుదెలియక యుండునని దెలియదగినది. ఇందువలన, జననలగ్నము, లగ్నాధిపతిచేతను, శుభగ్రహములచేతను జూడబడుచుండునెడల జననలగ్నమున శేషించియుండుకాలమున కారింతలకాలము మరణకాలమునదేహము దెలియకయుండునని యూహింపదగియున్నది.

ఈవిషయమున సారావళీకారకుడు "ఉదితాంశసమోమోహ" మనివచించియున్నాడు.

## శవపరిణామ వివరము.

శ్లో. దహన జల విమిశ్రై ర్భస్మ సంక్లేదశోషై
ర్నిధనభవన సంస్థైర్వ్యాళవర్గై ర్వ్యడంతః
ఇతి శవపరిణామ శ్చింతనీయో యథోక్తః
పృథువిరచిత శాస్త్రా ద్గత్యనూకాదిచింత్యం. 13

టీ. దహనజలవిమిశ్రై ర్భస్మసంక్లేదశోషైః=ద్రేక్కాణము అగ్నిద్రేక్కాణమయ్యెనేని మృతునిశరీరముదహింపబడుననియు, జలద్రేక్కాణమైన జలమధ్యమందు వేయబడుననియు=మిశ్రద్రేక్కాణమయ్యెనేని దహింపబడక జలమందును వేయబడక యెండిపోవును,నిధనభవన సంస్థైర్వ్యాళవర్గై ర్వ్యడంతః=అష్టమరాశ్యుక్తమగు,ఆ 22 వ ద్రేక్కాణము సర్పద్రేక్కాణమయ్యెనేని మృతశరీరము కుక్క నక్క మొదలైనజంతువులచేతభక్షింపఁబడి విస్తారూపమై పరిణమించును, శవపరిణామః=మృతశరీరముగతిని, చింతనీయః=విచారింపదగినది, పృథువిరచితశాస్త్రాత్ = వ్యాప్తిజేయబడిన శాస్త్రమువలన, గత్యనూకాది— గతి, మృతునికి గలుగుగతియు, అనూక = పూర్వజన్మస్థితియు, ఆది=ఇవి మొదలుగాగలవిషయము, చింత్యం=విచారింపదగినది.

తా. పూర్వముజెప్పబడిన ప్రకారము, అష్టమరాశియందలి ద్రేక్కాణమునననుసరించి అనగా, జననలగ్నద్రేక్కాణమునకు నిరువదిరెండవ ద్రేక్కాణమునననుసరించి శరీరపరిణామము నాలోచింపదగియున్నది. మరియు, నాద్రేక్కాణమునననుసరించియే శవపరిణామము గూడ నాలోచింపదగినది. అగ్ని, జల, మిశ్రద్రేక్కాణముల వలన, భస్మసంక్లేద శోషాదులుగల్గుననగా పాపగ్రహద్రేక్కాణము, అగ్నిద్రేక్కాణమనియు, శుభగ్రహద్రేక్కాణము, జలద్రేక్కాణమనియు, పాపగ్రహయుతమగు శుభద్రేక్కాణమును, శుభగ్రహయుతమగు పాప

ద్రేక్కాణమును, మిశ్రద్రేక్కాణము లనబడును గాన, ఇరువదిరెండవ ద్రేక్కాణము అగ్ని ద్రేక్కాణమగునెడల జాతకుడు మరణించినతరువాత వానిశరీరము దహింపబడుననియు, జలద్రేక్కాణమగునెడల జాతకునిశరీరమును రణానంతరమున నుదకమధ్యమున బడవేయబడుననియు, మిశ్రద్రేక్కాణమగునెడల, జాతకునిమరణానంతరమున వాశరీరము దహింపబడకయు, జలమున వేయబడకయు, నొక్కచోబడియుండుననియును, దెలియదగినది. మరియు వాయిరువదిరెండవ ద్రేక్కాణము వ్యాళద్రేక్కాణమగునెడల జాతకుని మృతశరీరము, కుక్కలు, నక్కలు, మొదలగు జంతువులచే దినబడుచు నొకచోటునుండి మరియొకచోటికి నీడ్వబడుచు, నానాభీభత్సమైపోవును.

[సర్పద్రేక్కాణములు:—కర్కాటక ప్రథమ తృతీయములు, వృశ్చిక ప్రథమద్వితీయములు, మీనతృతీయము, అనునివి సర్పద్రేక్కాణములు.]

ఈవిషయమునకై "శశిగ్చ హోరాద్వాపరగః కీటస్యచ మీనపశ్చిమోపగతః నిధనేయస్యభవంతి ద్రేక్కాణాస్తస్యచ మృతస్యభుంజంతి వాయసాద్యాః ప్రాణిసమూహోనచాస్తి సందేహః పాపగ్రహదృక్కాణో యస్యాష్టమరాశి సంస్థితో భవతి దహనంప్రాప్నోతినరో మృతమాత్రో నిశ్చయాత్ప్రవదేత్ ఏవంసౌమ్యదృక్కాణో జలమధ్యేక్షిప్యతే నరోత్రమృతః సౌమ్యదృకాణః పాపైః పాపదృకాణోపి సౌమ్యయుతః యస్యాష్టమభవనగతశ్శోషం ప్రాప్నోతిసోపిమృతః" అని మునివర్యులనేకులు వచించియున్నారు. మరియు సారావళీకారకునిచే ఒక్కొక్కద్రేక్కాణమునకు వేర్వేరుగ ఫలితములను వివరముగా వచింపబడియున్నది. ఇదియుగాక మరణించినవానికి గలిగెడిగతి, పూర్వజన్మస్థితి మొదలగు విషయములు విపులముగా రచింపబడిన శాస్త్రములవలన, చక్కగ విచారింపదగినది

పుట్టినప్రాణి యేలోకమునుండి వచ్చి యిచ్చట జన్మించెననుటను
దెలియు వివరము.

శ్లో. గురు రుడుపతి శుక్రౌ సూర్య భౌమౌ యమ జ్ఞౌ
విబుధ పితృ తిరశ్చో నారకీయాంశ్చ కుర్యుః
దినకర శశి వీర్యాధిష్ఠితా త్ర్యంశనాథా
త్ప్రవరస మనికృష్టా స్తుంగ హీనా దమూకే. 14

టీ. గురుః = బృహస్పతి, ఉడుపతిశుక్రౌ = చంద్రశుక్రులు, సూర్యభౌమౌ = రవికుజులు, యమజ్ఞౌ = శనిబుధులు, వీరలుక్రమముగా, విబుధపితృతిరశ్చో నారకీయాంశ్చ = దేవపితృతిర్యక్ నరకలోకములు సంబంధులైన వారినిగను, కుర్యుః = చేయుదురు, అదియెట్లనిన, దినకరశశివీర్యాధిష్ఠితాత్ త్ర్యంశనాథాత్ = సూర్యచంద్రులలో నెవడుబలవంతుడైయుండునో వానితో గూడిన ద్రేక్కాణాధిపతి యేగ్రహమో ఆగ్రహమువకు చెప్పిన లోకమునుండివచ్చి జనించెనని చెప్పవలయును, ప్రవరసమనికృష్టాస్తుంగహ్రాసాదనూకే = (అ

గా) ఆయాలోకమునకు జెప్పబడిన గ్రహము ఉచ్చరాశిగతమైయుండెనేని శ్రేష్ఠుండై యుం
డెననియు నీచరాశిగతమై యుండెనేని హీనుండయి యుండెననియును ఉచ్చరాశిని విడచి
నీచరాశిని పొందక యుండెనేని మధ్యముండయి యుండెననియును తెలియవలెను, అనూ
కము = పూర్వజన్మము.

తా. జనన కాలమున సూర్యచంద్రులలో బలవంతుడైన వానితోడ గూడినద్రేక్కా
ణమున కధిపతి యేగ్రహమో ఆగ్రహమునకు జెప్పిన లోకమునుండి యిచటికివచ్చి జనించె
నని యూహింపదగినది. అందు నాద్రేక్కాణాధిపతి బృహస్పతియగు నెడల దేవలోకమునుండి
వచ్చెననియు, చంద్రశుక్రులలో నొక గ్రహమగు నెడల పితృలోకమునుండి వచ్చెననియు,
రవ్యంగారకులలో నొకగ్రహమగు నెడల తిర్యగ్లోకమునుండి వచ్చెననియు, శనైశ్చర, బు
ధులలో నొకగ్రహమగు నెడల నరకలోకమునుండి యిచటికివచ్చి జనించెనని జెప్పదగినది, మ
రియు, నాగ్రహము ఉచ్చరాశిస్థితుడగు నెడల జాతకుడు పూర్వ జన్మమున శ్రేష్ఠుడైయుండె
ననియు, నీచరాశి గతుడైయుండు నెడల జాతకుడు పూర్వ జన్మమున నీచుడైయుండె నని
యు, ఉచ్చనీచ రాసులకు మధ్యమమున నుండు నెడల జాతకుడు ప్రవరుడు గాకను, నికృష్టు
డు గాకను మధ్యముడై యుండెననియును, నూహింపదగి యున్నది.

## మరణించిన వానికి గలుగబోయెడి గతిని దెలియు వివరము.

శ్లో. గతిరపి రిపు రంధ్ర త్ర్యంశపోఽస్తస్థితోవా
గురు రథ రిపు కేంద్ర చ్ఛిద్రగ స్స్వోచ్చసంస్థః
వుదయతి భవనేఽంత్యే సౌమ్యభాగేచ మోక్షో
భవతి యది బలేన ప్రోజ్ఝిత స్తత్ర శేషాః. 15

టీ. గతిరపిరిపురంధ్రత్ర్యంశపః = జనన కాలమునందు 6-7-8 స్థానములు గ్రహవ
ర్జితములై యుండెనేని షష్టాష్టమభావములయందు ఏద్రేక్కాణములుండునో లేకయీద్రే
క్కాణాధిపతులలో నెవడు బలవంతుండైయుండునో వానికి చెప్పిన లోకమునకు పుట్టినవా
డు పోవుననిభావము. అస్తస్థితోవా = జన్మలగ్నమునకు 7-స్థానములో నొక్క స్థానమున
గ్రహముండెనేని ఆగ్రహమునకు జెప్పబడియున్న లోకమునకుపోవును. (అస్తస్థితోవా అని=
సప్తమస్థానము మాత్రమే చెప్పబడియున్నను, వాశబ్దమువలన షష్టాష్టమంబులును గ్రహింప
తగును) రిపుకేంద్రచ్ఛిద్రదః = షష్ఠకేంద్రాష్టమములను పొందియున్న, గురుః=బృహ
స్పతి, స్వోచ్చసంస్థః = తనఉచ్చస్థానమునందు కాలమున పుట్టినవానికి, మోక్షోభవతి=
మోక్షముగలుగును, ఉదయతి భవనేంత్యే = మీనరాశిలగ్నమై, సౌమ్యభాగే = శుభగ్రహ
నవాంశయందు గురువుండి, శేషాః = తక్కినగ్రహములు, బలేనప్రోజ్ఝితాయది = బలహీన
ములై యుండునేని, తత్ర=అట్టి కాలమున బుట్టినవానికి, మోక్షోభవతి= మోక్షముగలుగును.

తా. జనన కాలమున లగ్నమునకు, 6-7-8 స్థానములు గ్రహములు లేకుండయుండిన యెడల షష్టాష్టమ భావములందు నేద్రేక్కాణము లుండునో వారెందు ద్రేక్కాణాధిపతులలో బలవంతమగు గ్రహమునకు జెప్పబడియుండు లోకమునకు, (14వ శ్లోకమునజెప్పబడిన ప్రకార మేర్పడులోకమునకు) జాతకుడు బోవునని వచింపదగినది. మరియును షష్ట, సప్తమాష్టమ స్థానములలో నొకస్థానమున గ్రహముండు నెడల నాగ్రహమునకు జెప్పబడిన లోకమునకు బోవునని జెప్పదగినది మరియునందు రెండుస్థానముల యందైనను, మూడుస్థానముల యందైనను గ్రహములుండు నెడల నందు బలాధిక గ్రహమునకు జెప్పబడిన లోకమునకు బోవునని జెప్పదగినది. ఈశ్లోకమున "అస్తస్థితో వా" అని సప్తమస్థాన స్థితగ్రహమని చెప్పుచు "వా" శబ్దమును జేర్చియుండుటచే షష్టాష్టమ స్థానములను రెంటినిగూడ గ్రహింపదగి యున్నది. ఈవిషయమునకు "సురపితృ తిర్యఙ్నరకాన్ గురురుడు పసితావస్వగ్రహీజ్య యమా రిపురంధ్రిత్ర్యంశక పాహయంతి చాస్తారి నిధనస్థాః" అని లఘు జాతకమున వచింప బడియున్నది, షష్టమమునుగాని, కేంద్రములనుగాని, అష్టమమునుగాని బొందియున్నట్టి బృహస్పతి తనయుచ్చస్థానమగు కర్కాటక రాశియందుండగా జనించినవానికి మోక్షముగలుగుచున్నది మరియు, మీనరాశి జనన లగ్నమై, శుభగ్రహ నవాంశయందు బృహస్పతియుండి తక్కిన గ్రహములు బలహీనములై యుండు నెడల తత్కాలమున బుట్టినవానికిని మోక్షము గలుగు చున్నది. ఇంగులకు, "షష్ఠాష్టమకంటక గో జీవశ్చే ద్భవతి మీనలగ్నేవా, శేషై రబలైర్జన్మని మరణేవా మోక్షగతిమాహుః" అని లఘుజాతక గ్రంథమున వచింపబడి యున్నది. జననకాలమున లగ్న ద్రేక్కాణమునకు నిరువదిరెండవ ద్రేక్కాణము, తదధిపతి, అష్టమస్థానము, తదధిపతి, కేంద్రస్థానములు, షష్టస్థానము, బృహస్పతిఅను వారియొక్క బలముల చక్కగా నూహించి ఫలితముల జెప్పదగినది.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

నై ర్యా ణి కా ధ్యా య నా మ క

చతుర్వింశోధ్యాయము.



శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్ర టీకా తాత్పర్య సహితము.

### నష్టజాతకాధ్యాయము. పంచవింశోధ్యాయము.—25.



**జనన కాలమెరుగని వానికి ప్రశ్నకాలముచే జన్మకాలము నెరుగు విధులు అయన నిర్ణయము.**

శ్లో. ఆధానజన్మా పరిబోధకాలే
సంపృచ్ఛతో జన్మ వదేద్విలగ్నాత్
పూర్వాపరార్ధే భవ నస్యవింద్యా
ద్భానా వుదగ్దక్షిణగే ప్రసూతిమ్. 1

టీ. ఆధాన జన్మాపరిబోధకాలే = ఆధాన జన్మకాలములు తెలియకయున్న సమయమున, సంపృచ్ఛతః = ప్రశ్నచేసినవానికి, విలగ్నాత్ = ప్రశ్న లగ్నమునుబట్టి, జన్మ = జన్మకాలమును, వదేత్ = చెప్పవలయును, పూర్వాపరార్ధేభవనస్యవింద్యా ద్భానా వుదగ్దక్షిణగే ప్రసూతిం = లగ్నప్రథమ హోరయందు ప్రశ్నచేసె నేని సూర్యుండు ఉత్తరాయణమైన మకరాది షట్కమందుండగా జన్మమనియు, లగ్నద్వితీయ హోరయందు ప్రశ్నచేసె నేని సూర్యుడు దక్షిణాయనమైన కర్కాటాదిరాశిషట్కమందుండగా జననమనియును తెలియవలెను.

తా. ఆధాన కాలమును, జనన కాలమును దెలియకుండునప్పుడు, ప్రశ్నలగ్నమును బట్టి ప్రశ్నజేసినవానికి జన్మకాలమును, జెప్పదగినది. పృచ్ఛకుడు లగ్నప్రథమ హోరయందు ప్రశ్నజేయునెడల, "ఉత్తరాయణమున" అనగా సూర్యుడు, మకర, కుంభ, మీన. మేష, వృషభ, మిథున రాసులయందుండు కాలమున జననమనియు, లగ్నద్వితీయ హోరయందు ప్రశ్నజేయునెడల "దక్షిణాయనమున" అనగా సూర్యుడు, కర్కాటక, సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనూ రాసుల యందుండు కాలమున జనన మనియు దెలియదగినది.

## సంవత్సర ఋతువులు దెలియు విధము.

శ్లో. లగ్నత్రికోణేషు గురుస్త్రిభాగై
ర్వికల్ప్య వర్షాణివయోఽనుమానాత్
గ్రీష్మోఽర్క లగ్నేకథితాస్తు శేషై
రన్యాయనర్తౌ వృతురర్కచారాత్. 2

టీ. త్రిభాగైః = ప్రశ్నలగ్న ద్రేక్కాణములచేత, లగ్నత్రికోణేషు = లగ్నత్రికోణమందు, గురుః=బృహస్పతి యుండెనని తెలియఁదగినది. వయోఽనుమానాత్ = ప్రశ్నచేసిన వానికి ఇన్ని సంవత్సరముల వయస్సుండునని ఊహించి, వర్షా = సంవత్సరములను, వికల్ప్య=కల్పించి చెప్పవలెను, గ్రీష్మోఽర్క లగ్నే = ప్రశ్నలగ్నమున సూర్యుఁడుండెనేని గ్రీష్మఋతువునందు జననమని చెప్పదగును,కథితాస్తు శేషైః=ప్రశ్నలగ్నమందు ఇతరులుండిరేని= ద్రేక్కాణైః శశి రాదయశ్శశిమజ్ఞ గ్వాదిషూద్యత్స్వా = చంద్రాదులుఁ జెప్పియున్న ఋతువులయందు జననమని చెప్పదగును అన్యాయనర్తౌ = ఒకఅయనమందు మఱియొక ఋతువువచ్చెనేని, అర్కచారాత్ =సూర్యచారమువలన, ఋతుః = ఋతువు తెలియవలెను.

తా. పృచ్ఛకుఁడు ప్రశ్న జేసిన లగ్న ద్రేక్కాణముల వలన లగ్న పంచమ నవమరాశులయందు జనన కాలమున గురుస్థితియని యెరుంగదగినది అనగా లగ్న ప్రథమ ద్రేక్కాణమున ప్రశ్న జేసిన యెడల ప్రశ్నలగ్న రాశియందే గురువుండు కాలము జననమనియు, లగ్న ద్వితీయ ద్రేక్కాణమున ప్రశ్న జేసిన యెడల ప్రశ్నలగ్నమునకు పంచమ రాశియందు గురువుండు కాలమున జననమనియు లగ్న తృతీయ ద్రేక్కాణమున ప్రశ్న జేసిన యెడల ప్రశ్నలగ్నమునకు నవమస్థానమున గురువుండు కాలమున జననమనియు, నూహింపదగిన. ప్రశ్నకాలము, లగ్న ప్రథమ ద్రేక్కాణమునందగు నెడల లగ్న రాశి కెన్నవ రాశియందు గురువుండునో యన్ని సంవత్సరములు ప్రశ్న జేసిన వానికైనవనియు, ద్వితీయ ద్రేక్కాణమునందగు నెడల ప్రశ్నలగ్న పంచమరాశ్యాదిగా నెన్నవ రాశియందు గురువుండునో యన్ని సంవత్సరములు పృచ్ఛకునకైనవనియు, తృతీయ ద్రేక్కాణము నందగు నెడల ప్రశ్నలగ్న రాశికి నవమరాశ్యాదిగా ఎన్నవ రాశియందు గురువుండునో యన్ని సంవత్సరములు ప్రశ్న జేసిన వానికైనవనియు కొందరు వచించుచున్నారు అయిన నిది సమ్మతమైనదిగా తోచుటలేదు "ద్రేక్కాణ లగ్నే క్రమశస్తురాశౌ గురుర్విలగ్నాది త్రికోణగోథవేత్, సముద్భవే తత్భగణక్రమేణ స్యాచ్చార భాదబ్దగతిం ప్రగణ్యాత్" అనుయవనేశుని వచనానుగుణ్యముగ గురుస్థితి జెప్పబడియున్నది అయినను ప్రశ్నలగ్నమునందలి ద్వాదశ భాగ క్రమమున ప్రతిరాశియందును గురుసంచార కాలమూహింప దగియున్నది. ఇట్లు యోచించు కాలమున కేవలము పంచాంగము నాధారముగగొని యందలి గురుసంచారమును స్థిరపరుప గూడదు గురుసంచార విషయము దప్పుగానుండు నెడల ఫలములు జెప్పినప్రకారముజరుగకుండును గాన గురుసంచా

రసిద్ధాంతమును స్ఫుటీకరించుకొనిగురుస్థితిని దెలియ దగినది. పృచ్ఛకుడు లగ్నప్రథమద్వాదశాంశయందు ప్రశ్నించిన యెడల గురువు లగ్నరాశి గతుడైన కాలమున జననమనియు, ద్వితీయ ద్వాదశాంశయందు ప్రశ్నించినయెడల లగ్నమునకు ద్వితీయరాశియందు గురువుండగా జనన మనియు, లగ్నతృతీయ ద్వాదశాంశయందు ప్రశ్నించిన యెడల ప్రశ్నలగ్నమునకు తృతీయ రాశియందు బృహస్పతి యుండుకాలమున జననమనియు, ఇట్లే,

| చతుర్థ | ద్వాదశాంశ యగునెడల | -ప్రశ్నలగ్నమునకు | 4-వ | రాశియందు |
|---|---|---|---|---|
| పంచమ | ,, | ,, | 5-వ | ,, |
| షష్ఠమ | ,, | ,, | 6-వ | ,, |
| సప్తమ | ,, | ,, | 7-వ | ,, |
| అష్టమ | ,, | ,, | 8-వ | ,, |
| నవమ | ,, | ,, | 9-వ | ,, |
| దశమ | ,, | ,, | 10 వ | ,, |
| ఏకాదశ | ,, | ,, | 11-వ | ,, |
| ద్వాదశ | ,, | ,, | 12-వ | ,, |

యందును బృహస్పతి యుండుకాలమున జననమని యూహింపదగినది. ఈవిధములుగా గురుస్థితి నెరింగి పృచ్ఛకుని యాకారమునుజూచి వానివయస్సును రమారమిగ నూహించి ఒక్కొక్క రాశియందు నొక్కొక్క సంవత్సర కాలము వంతున ద్వాదశరాశుల యందును పండ్రెండేండ్ల కాలము సంచారముచేయు బృహస్పతి స్థితిననుసరించియు పృచ్ఛకుని వయస్సును స్థిరపరుప వలయును, ఉదాహరణము.

మిథున రాశియందు గురువుండగా వృషభరాశియందు తృతీయ ద్వాదశాంశయందు ప్రశ్న జేసినయెడల, కర్కాటకరాశియందు గురువుండు కాలమున జననమని యు, పృచ్ఛకుని యాకారమును జూచుటచే సుమారు 30 వత్సరములకు పైబడినవాడును, 40 వత్సరములకు లోబడినవాడని తోచునెడల, కర్కాటకమున రెండుసారులు బృహస్పతి యుండుకాలము లెటస్థించుటకు 12+12=24 వత్సరములను ప్రస్తుతము మిథునమున నుండుటచే మూడవ సంచారమున కర్కాటకమునుండి మిథునము వరకు 11 రాశులగుటచే 24+11=35 గనుక 35 వత్సరములు పూర్తియయి 36 వసంత్సరము జరుగుచుండవలెనని నూహింపదగినది ఇట్లు నూహించుటకు వీలుగానియెడలను గురు భగణసంచయము గలిగినను, పురుషలక్షణోక్త ప్రకారము గురుభగణమూహించుటకై పృచ్ఛకునిచే బృహస్పర్శ చేయించదగినది.

## పురుషలక్షణమున బృహస్పర్శ వివరము.

పాదౌసగుల్ఫౌ ప్రథమం ప్రదిష్టం జంఘే ద్వితీయంతు సజానుచక్రే, మేఢ్రోరుయుష్కంచ తతస్తృతీయం, నాభిం కటించేతి చతుర్థ మాహుః, ఉదరం కథయంతి పంచమం హృదయం, షష్ఠ మథస్తనాన్వితం అథసప్తమ మంసజత్రుణీ, కథయంతి త్వష్టమ మోష్ఠ

కంధరే, నవమం నయనేచ సభ్రూణీ సలలాటుం దశమం శిరస్తథా, అశుభే ష్వ శుభం దశా ఫలం చరణాద్యేషు శుభేషు శోభనమ్ అని బుధవలక్షణమున జెప్పబడియున్నది. ఈలక్షణ ముప్రకార మూహించుటకై పృచ్ఛకుని బృహస్పర్శ చేయుచుండగా.

| | | | | |
|---|---|---|---|---|
| పాదములు, గుల్ఫము, చీలమండలు, వీటిలో నొక్కటి తాకినయెడల | | | 1 | గురుభగణం |
| పిక్కలు మోకాళ్లు | ,, | ,, | 2 | ,, |
| శిశ్నము, వృషణములు తొడలు | ,, | ,, | 3 | ,, |
| నాభి కటిప్రదేశము | ,, | ,, | 4 | ,, |
| కడుపు | ,, | ,, | 5 | ,, |
| రొమ్ము స్తనములు, | ,, | ,, | 6 | ,, |
| భుజముల శిరములు | ,, | ,, | 7 | ,, |
| ఓష్ఠ కంధరములు | ,, | ,, | 8 | ,, |
| నేత్రములు కనుబొమ్మలు | ,, | ,, | 9 | ,, |
| లలాటము శిరస్సు | ,, | ,, | 10 | ,, |

ను గతించినవని యూహించి సంవత్సరనిశ్చయముగావించవలెను. ఇట్లుగమనించుటచే గురుభగణమునకు 12-వత్సరముల ప్రకారము, 10 గురుభగణములకు 10 × 12=120వత్సరములవరకు జెప్పదగును గాని, అందులకు పైబడినవాని విషయమును గమనించుటకై ప్రశ్నించిన యెడల సంవత్సర నిశ్చయమునకే యుపాయమును లేక యున్నదని జ్యోతిలక్ష్మ యభిప్రాయముగా నున్నది.

## ఋతునిర్ణయము.

ప్రశ్నలగ్నమున సూర్యుడుండు నెడల గ్రీష్మఋతువున జననమని చెప్పదగినది. తక్కిన గ్రహములలో నేయేగ్రహము లగ్నమునందుండునో యాగ్రహమునకు జెప్పబడిన ఋతువునందు జననమని చెప్పదగినది. ఇందులకు వివరము "ద్రేక్కాణై శ్శిశిరాదయ శ్శశిబుజ్జ్ఞాద్యాదిషూద్యత్స్వా" అనిచంద్రాదులకు జెప్పబడిన ఋతువులయందు జననమని చెప్పదగినది గనుక, ప్రశ్నలగ్నమున శనైశ్చరుడున్నను, శనైశ్చరద్రేక్కాణముగా నున్నను శిశిరఋతువనియు శుక్రుడున్నను, శుక్రద్రేక్కాణముగ నున్నను వసంతఋతువనియు అంగారకుడున్నను అంగారక ద్రేక్కాణముగా నున్నను గ్రీష్మఋతువనియు, బుధుడున్నను బుధద్రేక్కాణముగా నున్నను శరదృతువనియు గురువున్నను గురుద్రేక్కాణముగా నున్నను హేమంత ఋతువనియు, నూహింపదగినది. ప్రశ్నలగ్నమునం దనేకగ్రహములుండు నెడల నందు బలవద్గ్రహమునకు జెప్పబడియుండు ఋతువును స్థిరపరుప వలయును, ప్రశ్నలగ్నమున నే గ్రహమును లేకుండు నెడల తత్కాలద్రేక్కాణమే గ్రహసంబంధమో యాగ్రహ సంబంధమగు ఋతువని జెప్పదగినది ఒక అయనమున మరియొక ఋతువు వచ్చిన యెడల సౌర మాసములన ఋతువుల నూహించి జెప్పదగినది.

రవి మేష, వృషభము లందుండు నెడల వసంత ఋతువు
మిథున, కటకము లందుండు నెడల గ్రీష్మఋతువు
సింహ, కన్యా రాశులందుండు నెడల వర్షఋతువు
తులా, వృశ్చికములందుండు నెడల శరదృతువు
ధను, ర్మకరముల యందుండు నెడల హేమంత ఋతువు
కుంభ మీనరాశులయం దుండు నెడల శిశిరఋతువు
అని యేర్పడి యుండుటచే యాప్రకార మూహింప దగియున్నది.

ఇట్లు గణించు నప్పుడు కొన్ని సమయములయందు, ఒక అయనమున మరియొక ఋతువు వచ్చుటయుగలదుగాన అట్లు ఏర్పడి నపుడు, సౌరమాసము ననుసరించి ఋతువు చెప్పదగినది శిశిరఋతువని ఏర్పడు నెడల సూర్యుడు, మకరకుంభ రాశుల యందు సంచరించు కాలమున జననమనియు, వర్షఋతువగు నెడల సింహ కన్యారాశులయందు సూర్యుడుసంచరించు కాలమనియు పైపట్టికయందు గనపరుపబడినప్రకారము చెప్పదగినది.

## అయనము వ్యత్యస్తమగు నెడల గ్రహపరివర్తనచే ఋతుపరిజ్ఞాన ప్రకారము, మాస, తిథి నిర్ణయ క్రమ వివరము.

శ్లో. చంద్రజ్ఞ జీవాః పరివర్తనీయా
శ్శుక్రార మందై రయనే విలోమే
ద్రేక్కాణభాగే ప్రథమే తు పూర్వో
మాసోను పాతా చ్చ తిథి ర్వికల్ప్యః. 3

టీ. అయనే = అయనము, విలోమే = వ్యత్యస్త మగుచుండిన, చంద్రజ్ఞజీవాః = చంద్రబుధగురువులు, శుక్రారమందైః = శుక్ర కుజశనులచేత, పరివర్తనీయాః = మార్చుటకుదగినవారగుదురు, ద్రేక్కాణభాగే = ద్రేక్కాణభాగములు 10 టియందు, ప్రథమే = మొదటి ౫. భాగములలో ప్రశ్నించెనేని, పూర్వోమాసః = వచ్చినఋతువులో మొదటి మాసమనియు, ప్రశ్నలగ్న ద్రేక్కాణభాగములు 10 టిలో ఉత్తరార్థమందున్న ౫ భాగములయందు ప్రశ్నచేసెనేని వచ్చిన ఋతువులో రెండవ మాసమనియును చెప్పదగినది, అనుపాతాత్ = త్రైరాశికము వలన, తిథిః = జన్మతిథి, వికల్ప్యః = కల్పింపదగినది.

తా. అయనమువ్యత్యస్తమగు చుండు నెడల చంద్ర బుధ గురులు, శుక్ర కుజ శనుల చే వ్యత్యయముగానుంచదగిన వారగుదురు. అనగా గ్రహయోనిభేదా ధ్యాయమునందు గ్రహముల ఋతువిభాగముప్రకారము ఊహింపుచు, ఉత్తరాయనమున, దక్షిణాయన సంబంధమగు ఋతువు లేర్పడు నెడల పరివర్తనక్రమముగ లెక్కగొని ఆక్రమమున, ఆ అయనమున నేఋతువుగా నుండవలెనో వద్దానినే నిర్ణయింపదగినది.

ఇందు శుక్రఋతువగునెడల చంద్రఋతువనియు, అంగారకఋతువగునెడల బుధఋతువనియు, శనైశ్చరుని ఋతువగునెడల, బృహస్పతి ఋతువనియును, తెలియదగినది. అంగారకసూర్యులకు గ్రీష్మఋతువగుచుండుటచే వారిద్దరకును బుధుడే పరివర్తనీయుడగుచున్నాడు. ఇందువలన ఉత్తరాయణమున వర్షఋతువని యేర్పడునెడల వసంతఋతువున జననమనియు దక్షిణాయనమున వసంతఋతువని యేర్పడునెడల వర్షఋతువున జననమనియు, తెలియదగినది. ఉత్తరాయణమున హేమంతఋతువని యేర్పడునెడల శిశిరఋతువునందు జననమనియు, దక్షిణాయనమున శిశిరఋతువుగ నేర్పడునెడల హేమంతఋతువున జననమనియు, తెలియదగినది. ఉత్తరాయణమున శరదృతువని తెలియునెడల, గ్రీష్మఋతువున జననమనియు దక్షిణాయనమున గ్రీష్మఋతువు నేర్పడునెడల శరదృతువున జననమనియును తెలియదగినది.

## మాసక్రమ నిర్ణయము.

ప్రశ్నలగ్న ద్రేక్కాణభాగములగు 10 టియందు మొదటివైదుభాగములయందు బ్రశ్న చేయబడునెడల పైకనుబరుపబడిన ప్రకారము యేర్పడినఋతువున ప్రథమమాసమున జననమనియు, వెనుకటి యైదుభాగములయందు బ్రశ్న చేయబడునెడల ద్వితీయమాసమున జననమనియు జెప్పదగినది.

## తిథి నిర్ణయము.

ఒకద్రేక్కాణమునకు 10 భాగములు, ఆభాగములను లిప్తలు చేయగ 10 × 60=600 లిప్తలగుచున్నవి. ఈ 600 లిప్తలయందు, 300 లిప్తలు ఒకమాసమునకు అగుచున్నవి. 300 లిప్తలగుటచే ఒకతిథికి 10 లిప్తలగుచున్నవిగాన త్రైరాశికమువలన చెల్లిన లిప్తలను తీసికొని తిథినిర్ణయముగావింపదగినది.

## చాంద్రమాస తిథి నెరుంగు క్రమము.

శ్లో. అత్రాపి హోరా పటవో ద్విజేంద్రా
సూర్యాంశతుల్యాం తిథిముద్దిశంతి
రాత్రి ద్యుసంజ్ఞేషు విలోమజన్మ
భాగైశ్చ వేలాః క్రమశో వికల్ప్యాః. 4

టీ. అత్రాపి = ఈ తిథిజ్ఞానమందును, హోరాపటవః = హోరాశాస్త్ర కుశలులైన, ద్విజేంద్రాః = బ్రాహ్మణోత్తములు, సూర్యాంశతుల్యాం = స్ఫుటసూర్యభాగ సమానమైన, తిథిం = తిథిని, ఉద్దిశంతి = చెప్పుదురు. రాత్రిద్యుసంజ్ఞేషువిలోమజన్మ = రాత్రిసంజ్ఞములైన మేష వృషభ మిథున కర్కాటక ధను ర్మకరములలో నొకటి ప్రశ్నలగ్నం బయ్యెనేని పగలు జననమనియు, దివాసంజ్ఞములైన సింహ కన్యా తులా వృశ్చిక కుంభమీనములలో నొకటి ప్రశ్నలగ్నమయ్యెనేని రాత్రి జననమనియు నెఱుంగదగును. భాగైశ్చవేలాః క్రమశో వికల్ప్యాః = జన్మకాల గడియలను క్రమముగ వికల్పముచేసి చెప్పవలయును.

టీ. ఈ చాంద్రమాసతిథి నిర్ణయమునందు హోరాశాస్త్రజ్ఞులగు మునిపుంగవులు స్ఫుటసూర్యభాగ సమానమగు తిథినిచెప్పుదురు, అనగా పృచ్ఛకుడుప్రశ్న చేయు కాలమున సూర్యుడుండు రాశియందు ఎన్నిభాగములు చెల్లియుండునో అన్ని తిథులు జననమాసమున శుక్లప్రతిపదాదిగ చెల్లియుండునవనియు, ప్రశ్నా కాలమున సూర్యుడు తాను సంచరించు లగ్నమున ఎన్నవభాగమునందుండునో యున్నవతిథియందు జననమనియు, నూహించి చెప్పదగినది. ఈవిషయమునకు "పృచ్ఛాకాలే రవిర్యావంతో౽ంశాన్సుతేన సంభుక్తాః రాశేస్తాస్తిథయస్స్యుః శుక్లాదావర్కమాసస్య" అని మణిత్థుడు వచించియున్నాడు, మరియు.

మకరమాసమని దెలియబడునెడల మాఘమాసమనియు

| | | |
|---|---|---|
| కుంభ | ,, | ఫాల్గుణమాసమనియు |
| మీన | ,, | చైత్రమాసమనియు |
| మేష | ,, | వైశాఖమాసమనియు |
| వృషభము | ,, | జ్యేష్ఠమాసమనియు |
| మిధునము | ,, | ఆషాఢమాసమనియు |
| కర్కాటకము | ,, | శ్రావణమాసమనియు |
| సింహ | ,, | భాద్రపదమాసమనియు |
| కన్యా | ,, | ఆశ్వయుజమాసమనియు |
| తులా | ,, | కార్తీకమాసమనియు |
| వృశ్చిక | ,, | మార్గశిరమాసమనియు |
| ధనుర్మాసమని | ,, | పుష్యమాసమనియు |

యీరీతిగా నూహింపదగినదని శాస్త్రజ్ఞుల అభిప్రాయముగా నున్నవి.

## దివారాత్రుల నిర్ణయము

టీ. సంజ్ఞాధ్యాయమున చెప్పబడియుండురీతిగా దివారాత్రులయందు బలముగలిగిన రాసుల భేదములెరింగి, రాత్రిబలరాసులగు, మేష, వృషభ, మిధున, కర్కాటక, ధనుర్మకరములలో నొకటి ప్రశ్నలగ్నమగునెడల పగలుకాలమున జననమనియు, దివాబలరాసులగు, సింహ, కన్యా, తులా, వృశ్చిక కుంభ మీనములలో నొకటి ప్రశ్నలగ్నమగునెడల రాత్రికాలమున జననమనియును నూహించి చెప్పదగినది

## సమయనిర్ణయము.

ప్రశ్నకాలమున రవిగతలిప్తలను, గుణించి రాత్రికాలమునందు జనించినట్లు యేర్పడియుండునెడల దివాప్రమాణ ఘడియలచేత రవిగతలిప్తలనుగుణించి, రాత్రిప్రమాణఘడియలచేత భాగించునెడల, రాత్రిజననకాల ఘడియలేర్పడును, పగటికాలమున జనించినట్లు యేర్పడియుండునెడల రాత్రిప్రమాణఘడియలచే రవిగతలిప్తలనుగుణించి, దివాప్రమాణఘడియలచే భాగింపగా దివాజననకాల ఘడియ లేర్పడును.

ఈవిషయమున, కొందరు, రాత్రియందైనను పగటియందైనను, ప్రశ్నకాలమునకు ఎన్నిఘడియలు చెల్లియుండునో యన్నిఘడియలకు జననమయియుండునగుననియు, రాత్రిజననమనియేర్పడునెడల ప్రశ్నకాలమునుండి భుక్తముగావలసియుండు నన్నిఘడియలకు జన్మమనియు, పగటికాలమందనియేర్పడు నెడల, ప్రశ్నకాలమునకు, చెల్లియుండు నన్నిఘడియాలకు జననమని మరికొందరును వచించుచున్నారుగాని వెనుకటిరెండు పద్ధతులను సరియైనవిగావు అని శాస్త్రజ్ఞులనేకుల యభిప్రాయముగానున్నది.

—— మతాంతర మాసజ్ఞానోపాయ వివరము. ——

శ్లో. కేచి చ్ఛశాంకా ధ్యుషితా న్నవాంశా
చ్ఛుక్లాంతసంజ్ఞం కథయంతి మాసమ్
లగ్నత్రికోణోత్తమ వీర్యయుక్తం
సంప్రోచ్యతేంగాలభనాదిభి ర్వా. 5

టీ. కేచిత్ = కొందఱాచార్యులు, శశాంకాధ్యుషితాత్ = చంద్రాధిష్ఠితమైన, నవాంశాత్ = నవాంశవలన, శుక్లాంతిసంజ్ఞం = శుక్లాంతసంజ్ఞకమైన, మాసం = మాసమును, కథయంతి = చెప్పుదురు. లగ్నత్రికోణోత్తమవీర్యయుక్తం తత్ప్రోచ్యతే = ప్రశ్నలగ్న నవమపంచములలో ఏరాశి ఉత్తమ బలయుక్తమైయుండునో ఆరాశియందు చంద్రుడుండగా పుట్టెనని చెప్పతగినది. అంగాలభనాదిభిర్వా = కాలాంగానియను శ్లోకమందు జెప్పబడిన కాలపురుషుని అంగములలో నే రాశియుండెడు అంగమును పృచ్ఛకుడు స్పృశించునో ఆరాశియందు చంద్రుడుండగా బుట్టెననియుం జెప్పవచ్చును.

తా. కొందరు హోరాశాస్త్రకర్తలు చంద్రాధిష్ఠితమగు నవాంశమున శుక్లాంతసంజ్ఞకమగు మాసమును జెప్పుదురు. అట్లు చెప్పుటవలన ప్రశ్నకాలమున ఏరాశి నవాంశయందు జంద్రుడుండునో యానవాంశను మూడుభాగములుగ జేసి చంద్ర-వాంశ ప్రాప్తనక్షత్రము నెరింగి ఆనక్షత్రము ఏమాసమందలి శుక్లపక్ష పూర్ణిమయందు వచ్చునో యామాసమున జననమని నూహింపదగియున్నది.— శుక్లాంతసంజ్ఞమగు మాసములేని నక్షత్రమునకు గురుచారోక్త విధానముచేత శుక్లాంతసంజ్ఞికమగు మాసము కల్పింపదగినది. ఈవిషయమునకై "నక్షత్రేణ సహోదయ మస్తంవాయే న యాతి సురమంత్రీ తత్సంజ్ఞం వక్తవ్యం వర్షంమాసః క్రమేణైవ వర్షాణి కార్తికాదీన్యాగ్నేయాద్భద్వయాని గురూణ్యాని క్రమశస్త్రిధంతు, పంచమము ముంత్యమంత్యంచ యద్వర్షమ్" అను గ్రంథాంతరవచనము గానబడుచున్నది. ప్రశ్నకాలమునందు చంద్రుడు వృషభరాశి నవాంశయందు 7-వ నవాంశములకు లోపుగ నుండునెడల ఆనవాంశగత నక్షత్రములు కృత్తికా రోహిణు లగుచుండుటచేతను కార్తీక శుద్ధపూర్ణిమ కృత్తికా నక్షత్రయుక్తమగునవి గనుకను, కార్తీకమాసమునందు జననమని చెప్పదగినది. వృషభరాశి నవాంశయం దేడునవాంశలకు మీదను మిథునరాశియందు 6 నవాం

శలకు లోపుగను యుండునెడల ఆనవాంశరాశిగత నక్షత్రములు మృగశిర్షార్ద్ర అగుచుండుట వలనను, మార్గశిర శుద్ధపూర్ణిమ మృగశిరా నక్షత్రయుక్త మగుటవలనను, మార్గశిరమాసమున జననమని నూహింపదగినది మిథునవాంశయందు 6 నవాంశలకుమీదను కర్కాటక నవాంశయందు అయిదునవాంశలకు లోపుగను, నుండునెడల ఆనవాంశగత నక్షత్రములు పునర్వసు పుష్యమి లగుచుండుటచేతను పుష్య శుద్ధ పూర్ణిమ పుష్యమీ నక్షత్రయుక్త మగుచుండుటవలనను, పుష్యమాసమున జననమని చెప్పదగినది ఈరీతిగనే నవాంశగత నక్షత్రములు ఆశ్లేష మఘానక్షత్రము లగునెడలను మాఘశుద్ధ పూర్ణిమ మఘానక్షత్రయుక్త మగుటవల్లను మాఘమాసమున జననమని చెప్పదగినది. పూర్వఫల్గుని, ఉత్తర, హస్త యీ మూడు నక్షత్రములు నవాంశగత నక్షత్రములై యేర్పడునెడల ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ పూర్వఫల్గునీ ఉత్తర హస్త నక్షత్రములలో నొక నక్షత్రయుక్తమగుటచే ఫాల్గుణమాసమున జననమని చెప్పదగినది. నవాంశగతనక్షత్రములు చిత్తా స్వాతులగునెడల చైత్రశుద్ధ పూర్ణిమ చిత్తా స్వాతీ నక్షత్రములలో నొక్క నక్షత్రయుక్తమగుటచే చైత్రమాసమున జననమని వచింపదగినది. నవాంశగతనక్షత్రములు విశాఖ, అనూరాధ లగునెడల వైశాఖమాస పూర్ణిమ విశాఖా అనూరాధలలో నొక్క నక్షత్రయుతమగుటచే వైశాఖమాసమున జననమని నూహింపదగినది. నవాంశగత నక్షత్రములు జ్యేష్ఠ మూల లగునెడల జ్యేష్ఠమాస పూర్ణిమ జ్యేష్ఠ మూలా నక్షత్రములలో నొక్క నక్షత్రయుక్తమగుచుండుటచే జ్యేష్ఠమాసమున జననమని వచింపదగినది నవాంశగత నక్షత్రములు పూర్వాషాఢో త్తరాషాఢలగునెడల ఆషాఢ శుద్ధ పూర్ణిమ పూర్వాషాఢో త్తరాషాఢ నక్షత్రములలో నొక్కనక్షత్రయుక్తమగుటచే ఆషాఢమాసమున జననమని వచింపదగినది. నవాంశగత నక్షత్రములు శ్రవణధనిష్ఠలగునెడల శ్రావణ శుద్ధ పూర్ణిమనాడు చంద్రుడు శ్రవణ ధనిష్ఠా నక్షత్రములలో నొక్కనక్షత్రమున యుండుటచేత శ్రావణమాసమున జననమని వచింపదగినది. నవాంశగత నక్షత్రములు శతభిష పూర్వాభాద్రో త్తరాభాద్ర లగునెడల భాద్రపదమాస పూర్ణిమనాడు చంద్రుడు, శతభిష పూర్వాభాద్రో త్తరాభాద్ర నక్షత్రములలో నొక్క నక్షత్రయుతుడై యుండుటచేత భాద్రపదమాసమున జననమని వచింపదగినది. నవాంశగత నక్షత్రములు రేవత్యశ్వినీ భరణులగునెడల ఆశ్వయుజమాస పూర్ణిమనాడు చంద్రుడు రేవత్యశ్వినీ భరణీనక్షత్రములలో నొక్క నక్షత్రయుక్తమగుచుండుటవలన ఆశ్వయుజమాసమున జననమని వచింపదగినది యీ విషయమున పైగ్రంథాంతరమున "త్రిభరితు పంచమ ముపాంత్య మంత్యంచయద్వర్షం" అని చెప్పబడియుండుటచే కార్తీకమాసము మొదలు 5-వ మాసమగు, ఫాల్గుణ మాసమునకును, 11-వ మాసగు భాద్రపదంబునకును, 12-వ మాసము నాశ్వయుజమునకును, మూడేసి నక్షత్రములు చేర్పదగినవనియు, తక్కిన 9 మాసములకును రెండేసినక్షత్రములు చేర్పదగినవనియు జెప్పబడియున్నది. ఇందులకుగాను, "యద్రాశిసంస్థే శీతాంశుః ప్రశ్నకాలే నవాంశకే స్థితస్తద్రాశిః పూర్ణో యస్మిన్ భవతి చంద్రమాః జన్మమాసస్స నిర్దిష్టః పురుషస్యతు పృచ్ఛతః కృష్ణపక్షాంతిమోమాసో జ్ఞేయో త్రతు విపశ్చితా" యని యవనేశ్వరుడు వచించియున్నాడు.

### జన్మకాలమున చంద్రుడుండు నక్షత్రము నెరుంగుక్రమము.

ప్రశ్నలగ్న పంచమ నవమములలో నేరాశి మిక్కిలి బలయుక్తముగానున్నదో యారాశియందు చంద్రుడుండగా జననమని యెరుంగదగినది. మరియు పృచ్ఛకుని యంగ స్పర్శజేయుమనగా నేయంగముము తాకునో యాయంగమునకు కాలాంగాని వరాంగమను శ్లోక మున నేరాశి చెప్పబడియున్నదో యారాశియందు జంద్రుడుండగా జననమని వచింప దగి నది. మరియు ప్రశ్నకాలమున నేజంతువులు కనబడుటగాని యరచుటగాని తటస్థించు చున్నదో యాజంతువులు నేరాశి సంబంధములగుచున్నవో, యారాశియందు జంద్రుడుండ గానైనను జననమని వచింపదగినది.

### ప్రకారాంతమున జన్మరాశి నెరుంగువిధము.

శ్లో. యావ ద్గత శ్శీతకరో విలగ్నా
చ్చంద్రా ద్వదే త్తావతి జన్మరాశిమ్
మీనోదయే మీనయుగం ప్రదిష్టం
భక్ష్యాహృతాకా రరుతైశ్చచింత్యమ్. 6

టీ శీతకరః = చంద్రుడు, విలగ్నాత్ = ప్రశ్నలగ్నము మొదలు, యావద్గతః = ఎన్నవరాశియందుండునో, చంద్రాత్ = ఆచంద్రుడున్న రాశి మొదలుకొని, తావతి = అన్న వరాశియందు, జన్మరాశిం = జన్మరాశిని, వదేత్ = చెప్పవలెను. మీనోదయే మీనయుగం ప్రదిష్టం = మీనము ప్రశ్నలగ్నమైన మీనమందు చంద్రుడుండగా జననమని చెప్పవల యును.భక్ష్యాహృతా కారరుతైశ్చచింత్యం=ప్రశ్నకాలమందు ఏరాశిసంబంధమైనభక్ష్యద్రవ్య ము తేబడునో ఆరాశియందు చంద్రుడుండగా జననమనియు, జంతువు ప్రశ్నకాలమున కానబడునో ఆ యాకారముగల రాశియందు చంద్రుడుండగా జననమనియు ఏరాశి సమాన జంతుధ్వని ప్రశ్నకాలమందు వినబడునో ఆరాశియందు చంద్రుడుండగా జననమనియు విచారింపవలయును.

తా. ప్రశ్నాకాలమున ప్రశ్నలగ్నము మొదలు చంద్రుడుండు రాశివరకు ఎన్ని రా శులగుచున్నవో ఆ చంద్రుడున్న రాశి మొదలు యెన్నవరాశి యొద్దియో యారాశియే జన్మ రాశియని నూహింపదగినది. మీనము లగ్నమగునెడల మీనమేషములందు చంద్రుడుండగా జననంబని చెప్పదగినది. ఇట్లు యనేకవిధములవలన రాశులు వేర్వేరుగా నేర్పడునెడల ప్రశ్న కాలమున పృచ్ఛకునివలనగాని యితరులచేగాని ఏరాశి సంబంధమగు భక్ష్యము తేబడునో యారాశియందు చంద్రుడుండు కాలమున జననమని నూహింపదగినది. మరియు నేయాకారము గల జంతువు ప్రశ్నాకాలమున గానబడునో యా యాకారముగల రాశియందు జంద్రుడుం డగా జననమనియు జెప్పదగినది. మరియు ప్రశ్నాకాలమున ఏరాశి సంబంధమగు జంతుధ్వని వినబడుచున్నదో యారాశియందు జంద్రుడుండగా జననమని నూహింపదగినది.— అనగా,

ప్రశ్నకాలమున మేషాదుల దిర్శనముగాని తధ్వని శ్రవణముగాని గల్గునెడల మేషలగ్నమున చంద్రుడుండగాననియు, వృషభ మహిషాది మృగదర్శన తధ్వని శ్రవణములలో నేది తటస్థించినను, వృషభరాశియందు జంద్రుడుండగాననియు, జననరాశి జ్ఞానోపాయముల నెరుంగదగినది. యీవిషయమున కొందరు, పృచ్ఛకుడు ప్రశ్నకాలమున నేరాశి తుల్యవర్ణమగు వస్తువును హస్తమున గల్గియుండునో తద్రాశియందు జంద్రుడుండగా జననమనియు, జెప్పుదురు.

## జన్మలగ్న జ్ఞానోపాయ క్రమము.

శ్లో. హోరానవాంశ ప్రతిమం విలగ్నం
లగ్నాద్రవి ర్యావతి చ దృకాణే
తస్మా ద్వదే త్తావతి వా విలగ్నం
ప్రష్టుః ప్రసూతా వితి శాస్త్ర మాహ. 7

టీ. హోరానవాంశ ప్రతిమంవిలగ్నం = ప్రశ్నలగ్నమున ఏరాశి సంబంధమైన నవాంశ ఉదయించునో ఆరాశియే జన్మలగ్నమగుననియు, లగ్నాత్ = ప్రశ్నలగ్నము మొదలుకొని, రవిః = సూర్యుడు, యావతిదృకాణే = ఎన్నవ ద్రేక్కాణమునందుండునో, తస్మాత్ = అదిమొదలుకొని, తావతి = అన్నవరాశియందు, ప్రష్టుః = పృచ్ఛకునియొక్క, ప్రసూతౌ = జననము, విలగ్నం = లగ్నమును, వదేత్ = చెప్పవలయును.

తా. ప్రశ్నలగ్నమున నేరాశిసంబంధమగు నవాంశ యుదయించుచున్నదో యారాశియే జననలగ్నమని నూహింపదగినది. మరియు, ప్రశ్నకాలమున సూర్యుడు ప్రశ్నలగ్నము మొదలు ఎన్నవ ద్రేక్కాణమునందుండునో కనుగాని ప్రశ్నలగ్నాదిగా యన్నవరాశి యెద్దియో యారాశియే జననలగ్నమని నూహింపదగియున్నది. ఈ విషయమునకై "పృచ్ఛా లగ్న నవాంశస్య యోరాశి స్సంఖ్యయా సమః, తస్మిన్ లగ్నగతే రాశౌ వక్తవ్యం జన్మ పృచ్ఛతః యావత్సం ఖ్యాగతేలగ్నా ద్ద్రేక్కాణే దిన కృత్తతః తావత్సం ఖ్యాగతే రాశౌ ప్రష్టుర్జన్మ వినిర్దిశేత్" అని పరాశరులువచించియున్నారు. ద్రేక్కాణసంఖ్య 12కు అధికమగునెడల తత్సంఖ్యను 12 చే భాగింపగా శేషమెన్నియగునో ప్రశ్నలగ్నాదిగా యన్నవరాశి యెద్దియో యదియే ప్రశ్నలగ్నముగా నూహింపదగినది.

## ప్రకారాంతముగ జననలగ్నమును దెలియువిధము.

శ్లో. జన్మాదిశే ల్లగ్నగతే సవిగ్యే
ఛాయాంగుళ ఘ్నే రహితే వశిష్టమ్
ఆసీన సుప్తోత్థిత తిష్ఠతాం భం
జాయాసుఖాజ్ఞోదయగం ప్రదిష్టమ్. 8

టీ. లగ్నగతే=ప్రశ్నలగ్నమందున్న గ్రహమును తాత్కాలిక గ్రహముగాఁ బెట్టుకొని ఛాయాంగుళఘ్నే=ఛాయాంగుళసంఖ్యలచేత గ్రహలిప్తలను గుణించి, అర్కహృతే=పండ్రెండింటుపాలుగొనఁగా, అవశిష్టం=మిగిలినసంఖ్యలకు, మేషాదిగా, జన్మం= జన్మలగ్నమని, ఆదిశేత్ = చెప్పవలెను. సవీర్యే = ప్రశ్నలగ్నమున పెక్కుగ్రహములుండిన వానిలో నేగ్రహము బలాధికమైయుండునో దానిని తత్కాలగ్రహముగా బెట్టుకొని గణించియు, జన్మలగ్నమును చెప్పవలయును. ఆసీనసుప్తోత్థితతిష్ఠతాంభం జాయామఖాజ్ఞో దయగం ప్రదిష్టం = పృచ్ఛకుడుకూర్చుండి ప్రశ్నించిన ప్రశ్నలగ్నమునకు సప్తమరాశి జన్మలగ్నము, పరుండి ప్రశ్నించిన ప్రశ్నలగ్నమునకు నాల్గవరాశి జన్మలగ్నము, నడుచుచు ప్రశ్నచేసిన ప్రశ్నలగ్నమునకు పదవరాశి జన్మలగ్నము, నిలుచుండి ప్రశ్నఅడిగిన ప్రశ్నలగ్నమే జననలగ్నము అని చెప్పవలయును.

తా. ప్రశ్నలగ్నమునం దొకగ్రహముమాత్ర ముండునెడల నాగ్రహమును, అనేకగ్రహములుండునెడల యందు బలవద్గ్రహమును తాత్కాలిక గ్రహముగ నిర్ణయించుకొని లిప్తలుచేసి పృగువకు (మన్నని) భూమియం దు, స్థాపింపబడిన ద్వాదశాంగుళ శంకువునకు యేర్పడియుండు, తత్కాలిక ఛాయాంగుళ సంఖ్యచేత నాగ్రహలిప్తలను గుణించి పండ్రెండింట భాగింపగా శేషమెన్ని యగుచున్నదో మేషాదిగ యన్నవరాశి యందు జననమని యూహింప దగినది. మరియు, పృచ్ఛకుడు, కూర్చుండి ప్రశ్నించినచో ప్రశ్నలగ్నమునకు సప్తమరాశియు, పండుకొని ప్రశ్నజేసినయెడల ప్రశ్నలగ్నమునకు నాల్గవరాశియు, నడచుచు ప్రశ్నజేసిన యెడల ప్రశ్నలగ్నమునకు పదియవరాశియు, నిలుచుండి ప్రశ్నించినయెడల ప్రశ్నజేసినరాశియు జననలగ్నమగునని చెప్పదగినది. ఈవిషయమునకు, "ఉత్తిష్ఠతోవిలగ్నాత్పృష్టు స్సుప్తస్యబంధులగ్నాచ్చ ఉపవిష్టస్యాస్తమయే వ్రజతో మేషూరణేజన్మ" అను గ్రంథాంతర వచనముగానబడుచున్నది.

ప్రకారాంతముగ నష్టజాతక జ్ఞానోపాయమునకై
తాత్కాలిక లగ్నమును లిప్తలుగావించి చేయదగిన
రాశి గుణకార గ్రహ గుణకార క్రమము.

శ్లో. గోసింహౌ జతుమాష్టమౌ క్రియతులే కన్యామృగౌ చక్రమా
త్సంవర్గ్యా దశకాష్ట సప్తవిషయై శ్శేషా స్స్వసంఖ్యాగుణాః
జీవారాస్ఫుజిదైందవాః ప్రథమ వచ్ఛేషా గ్రహా స్సౌమ్యవ
ద్రాశీనాం నియతో విధి ర్గ్రహయుతైః కార్యాచ తద్వర్గణా. 9

టీ. గోసింహౌ = వృషభసింహములు, దశక=పదింటను, జతుమాష్టమౌ = మిథునవృశ్చికములు, అష్ట=ఎనిమిదింటను, క్రియతులే=మేషతులలు, సప్త=ఏడింటను, కన్యామృగౌ=

కన్యామకరములు, విషమయోః=అయిదింటను, క్రమాత్ = క్రమముగా, సంవర్గ్యాః= గుణింపదగినవి, శేషాః=తక్కిన రాసులు, స్వసంఖ్యాగుణాః = తమతమ రాశిసంఖ్యలచేత గుణింపఁదగినవి, రాశీనాం=రాసులకు,విధిః=ఈగుణకారవిధి, నియతః=నియతమైనది. జీవారాస్ఫుజిద్రౌందవాః = గురుకుజ శుక్రబుధులు, ప్రథమవత్ = మొదటివలెనే (దశకాష్టసప్త విషయసంఖ్యలచేత) గుణింపదగినవారు, శేషాగ్రహాః = తక్కిన రవిచంద్రశనులు. సౌమ్యవత్ =బుధునివలె (ఐదుచేత) గుణింపఁదగినవారగుదురు. గ్రహాయుతే= ప్రశ్నలగ్నము గ్రహాయుక్తమైయుండెనేని, తద్వర్గణాచ = ఆగ్రహగుణకారము, కార్యా=చేయదగినది.

## రాశిగుణకారము.

తా. ప్రశ్నలగ్నమును లిప్తలుచేసి యీక్రిందచెప్పబడిన క్రమమున ప్రథమమున రాశి గుణకారముచే గుణింపవలయును. వృషభసింహములు 10 టను, మిధున వృశ్చికములు 8 టను, మేషతులలు 7 టను, కన్యామకరములు 5 టను గుణింపదగినవి. తక్కినరాసులు తమతమ రాశిసంఖ్యలచేననగా నాల్గవరాశియగు కర్కాటకము 4 టను. నవమరాశియగు ధనుస్సు 9 టను, ఏకాదశ రాశియగు కుంభము 11 టను, ద్వాదశయగు మీనము 12 టను గుణింపదగినవి.

| మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృ | ధ | మ | కుం | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7 | 10 | 8 | 4 | 10 | 5 | 7 | 8 | 9 | 5 | 11 | 12 |

ప్రశ్నలగ్నమున గ్రహముండునెడల గ్రహగుణకారము చేయదగినది.

## గ్రహ గుణకారము.

గుర్వంగారక శుక్రబుధులు ప్రథమమువలె క్రమముగా దశకాష్ట సప్తవిషయ సంఖ్యలచేత గుణింపదగుదురనగా గురువు 10 టను, అంగారకుడు 8 టను, శుక్రుడు 7 టను బుధుడు 5 టను గుణింపదగిన వారలగుదురు, తక్కినగ్రహములగు సూర్యచంద్ర శనైశ్చరులు, బుధునివలె 5 టి చేత గుణింపదగిన వారలగుదురు.

| ర | చం | అం | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|
| 5 | 5 | 8 | 5 | 10 | 7 | 5 |

ప్రశ్నలగ్నమున ఒకగ్రహము మాత్రముండునెడల ఆగ్రహ గుణకారము మాత్రము చేయదగినది ఒకటికన్నను అధికముగా నుండునెడల ఎన్నిగ్రహము లుండునో అన్ని గ్రహముల గుణకారములచేత గుణింప వలయునని యూహింపదగియున్నది.

## నక్షత్రమును దెలియుక్రమము.

శ్లో. సప్తాహతం త్రిఘనభాజితశేష మృక్షం
దత్వాఽథవా నవ విశోధ్య నవాఽథవాఽస్మాత్

ఏవం కళత్ర సహజాత్మజ శత్రుభేభ్యః
ప్రష్టుర్వదే దుదయరాశివశేన తేషామ్. 10

టీ. ఏడింటగుణించి ఆసంఖ్యయందు, నవదత్వా=తొమ్మిదికూడినదైనను, అథవా=అటుగాక, అస్మాత్=ఈసంఖ్యనుండి, నవవిశోధ్య తొమ్మిదితీసివేసినదైనను, నవా = కూడుటతీయుటలేకయైనను, త్రిఘన=27 ట, భాజితశేషం=పాలుగొన్నశేషము, ఋక్షం=అశ్విన్యాదిగా పృచ్ఛకుని నక్షత్రమగునని చెప్పవలెను ఏవం = ఈప్రకారముగ, కళత్రసహజాత్మజశత్రు= భార్యాతోబుట్టువు పుత్రశత్రువిషయమై, భేభ్యః=తత్తద్భావముల వలన, తేషాం వారలకు, ప్రష్టుః = పృచ్ఛకునియొక్క, ఉదయరాశివశేన = ప్రశ్నలగ్నవశముననే, ఋక్షం=నక్షత్రమును, వదేత్=చెప్పవలెను.

తా. పూర్వశ్లోకమునజెప్పినప్రకారము ప్రశ్నలగ్నలిప్తలును, రాశిగుణకారగ్రహగుణకారములుచేయగా నేర్పడిన లిప్తాసంఖ్యను, ఏడింట గుణించినైనవకదానవిశోధనములు చేయవలయును, అనగా, 9 గూడనైనను గూడవలెను, లేక 9 త్రోయనైనను త్రోయవలెను, కొన్నిసమయముల కూడుటయును, త్రోయుటయు అక్కరలేదు యీవిషయమునకై కొందరు శాస్త్రకర్తలు, ప్రశ్నలగ్నము చరరాశియగు నెడల 9 కూడవలయుననియు, స్థిరరాశియగునెడల, కూడుటగాని త్రోయుటగాని అక్కరలేదనియు, ద్విస్వభావరాశియగునెడల 9 త్రోయవలయుననియు, అభిప్రాయపడుచున్నారు. చింతామణీ వ్యాఖ్యానకారకుండగు భట్టోత్పలుడు, "ప్రశ్నలగ్నమున ప్రథమద్రేక్కాణమగునెడల, 9 కూడవలయుననియు, ద్వితీయ ద్రేక్కాణమగునెడల, కూడుటగాని త్రోయుటగాని అక్కరలేదనియు, తృతీయద్రేక్కాణమగునెడల 9 త్రోయవలయుననియు తనవ్యాఖ్యానమున వివరించియున్నాడు నవకదాన విశోధనానంతరమున ఆసంఖ్యను నక్షత్రసంఖ్యయగు, 27 చేత భాగింపగా శేషించినసంఖ్య అశ్విన్యాదిగా ప్రశ్నింపబడిననక్షత్రమగునని నూహింపదగినది. భార్యాభ్రాతృపుత్రశత్రువిషయమున నష్టజాతక ప్రశ్నజేయబడునెడల వారివారికి ఆయాభావములవలన నీప్రశ్నలగ్నము ననుసరించియే నక్షత్రము నూహించి చెప్పదగినది. అనగా పృచ్ఛకుడు తనభార్యనక్షత్రమునెరుగ ప్రశ్నించునెడల, ప్రశ్నలగ్నమునకు 6 రాసులుగూడిలిప్తలుచేసి ప్రశ్నలగ్నరాశిగుణకముచేత గుణించి, ప్రశ్నలగ్నమునందు గ్రహముండునెడల తద్గ్రహగుణకముచే గుణించి యాసంఖ్యను 7 ట గుణించి పూర్వమువలె నవకదానవిశోధనజేసి 27 ట భాగింపగా శేషించిన సంఖ్య అశ్విన్యాదిగా పృచ్ఛకుని భార్య జనన నక్షత్రమగునని జెప్పదగినది. భ్రాతృనక్షత్రమును జెప్పుడని ప్రశ్నజేయునెడల ప్రశ్నలగ్నముతో 2 రాసులుగూడి లిప్తలుచేసి లగ్నరాశి గుణకారముచే గుణించి లగ్నమున గ్రహముండునెడల గ్రహగుణకారముచే గుణించి సప్తాహతముజేసి నవకదాన విశోధనాదులు గావించి నక్షత్రసంఖ్యచే భాగించిన శేషము అశ్విన్యాదిగా పృచ్ఛకుని భ్రాతృనక్షత్రమగును.

యీప్రకారముగనే పుత్రునినక్షత్రము నడిగిన ప్రశ్నలగ్నమునకు 4 రాసులను చేర్చియు, శత్రునక్షత్రమడిగిన ప్రశ్నలగ్నమునకు 5 రాసులుచేర్చియు లిప్తలుచేసి పూర్వప్రకారము రాశి గుణకార గ్రహగుణకార సప్తాహత, నవక దాన విశోధన త్రిఘనభాజితశేషమును గను గొని నక్షత్రము నూహింపదగినది మిత్రునినక్షత్రమును గురించి ప్రశ్న జేయబడిన యెడల ప్రశ్నలగ్నమునకు 8 రాసులుగూడి పూర్వోక్తప్రకారము భాజితశేషమును గనుగొనినక్షత్రము తెలుగదగినది నక్షత్రమును మాత్రముగాక నష్టజాతకము సంతయు నిందు మూలముగ నూహించి చెప్పదగును.

### సంవత్సర, ఋతు, మాసాదుల నెరుగువిధము.

శ్లో. వర్షర్తు మాస తిథయో ద్యునిశం హ్యుడూని
వేలోదయర్క్ష నవ భాగవికల్పనాత్స్యుః
భూయో దశాది గుణితాః స్వవికల్ప భక్తా
వర్షాదయో నవకదానవిశోధనాభ్యామ్. 11

టీ. వర్షర్తుమాసతిథయః = సంవత్సర ఋతుమాసతిథులు, ద్యునిశం= పగలు రాత్రులు, ఉడూని = నక్షత్రములు, వేలా = గడియలు, ఉదయర్క్ష = జన్మలగ్నము, నవ = ఈ తొమ్మిదియును, భాగవికల్పనాత్ = తమతమ భాగవికల్పనవలన, స్యుః= అగును, భూయః= మఱల, దశాదిగుణితాః = 10, 8, 7, 5, సంఖ్యలచేత గుణించి, నవకదానవిశోధనాభ్యాం = నవకదాన విశోధనలుచేసి, స్వవికల్పభక్తాః = తమతమ సంఖ్యలచేత, పాలుగొనగా, మిగిలినవి. వర్షాదయః = సంవత్సర ఋతుమాసాదులగును.

తా. ప్రశ్నలగ్నం లిప్తలను రాశి గుణకార గ్రహ గుణకారము చేసినతరువాత మరల వేర్వేరుగా 10 టు, 8 టు, 7 టు, 5 టు, గుణించి ప్రతిదానియందును నవకదాన విశోధనలుచేసి క్రమముగ వర్షాదిసంఖ్యలచే భాగ్గొనగా శేషము సంవత్సర ఋతు మాసాదులగును.

### రాశి గ్రహ గుణకారానంతరము 4 రీతుల గుణించిన సంఖ్యలలో నేసంఖ్యను నేమిచేయవలయు ననుటకు వివరము.

శ్లో. విజ్ఞేయా దశకేష్వబ్దా ఋతు మాసాస్తథైవ చ
అష్టకేష్వపి మాసార్థం తిథయశ్చ తథాస్మృతాః. 12

టీ. దశకేషు = పూర్వోక్తప్రకారముగా నాలుగు స్థానములందుంచిన సంఖ్యలలో, పదింటగుణించిన సంఖ్యయందు నవకదానముగాని నవకవిశోధనముగాని చేసినపిదప (అసంఖ్యను), అబ్దాః = పృచ్ఛకుని వర్తమాన వర్షసంఖ్యయగును, ఆ పదింటగుణించిన సంఖ్యనే ఋతుసంఖ్యయైన 6 టపాలుగొనగా నెన్ని మిగులునో శిశిరాదిగా అన్నవఋతువును ఆ సంఖ్యనే ఋతుమాస సంఖ్యావికల్పమైన 2 టపాలుగొనగా 1 మిగిలిన ఋతువునందు మొం

దటి పెలయనియు, శేషము లేకుండిన రెండవమాసమనియు, దశసంఖ్యా గణితసంఖ్యవలన, వర్ష ఋతుమాసములు), విజ్ఞేయాః = తెలియందగినవి తథైవ = అప్రకారమే, అష్టశేషు = 8 తో గుణించిన సంఖ్యయందు నవకదానముగాని నవకవిశోధనముగాని చేసినపిమ్మట (అసంఖ్యను), మాసార్ధం = పక్షవికల్పమైన రెండింట పాలుగొనగా 1 మిగిలెనేని శుక్లపక్షము మిగత లేకుండిన కృష్ణపక్షముఅని చెప్పదగినది. తథా = అ 8 ట గుణించిన సంఖ్యనే, తిథివికల్పమైన 15 ట పాలుగొనగా ఎన్ని మిగులునో అన్నవతిథియని చెప్పదగినది.

తా. ప్రశ్నలగ్న లిప్తలను రాశి గుణకార క్రమాణ గుణకారానంతరమున 10 ట గుణించిన సంఖ్యయందు నవకదాన విశోధనములు చేసినతరువాత నా సంఖ్యను పరమాయుః ప్రమాణ వత్సరసంఖ్యయగు 120 చేత భాగింపగా శేషము పృచ్ఛకుని అప్పటి సంవత్సర సంఖ్యయగును. ఆ 10 ట గుణించిన సంఖ్యనే వర్ష సంఖ్యయగు 60 ట భాగించిన శేషము ప్రభవాదిగ లెక్కపెట్టగ నేసంవత్సరమగునో యా వత్సరమున జననమని నూహింపదగియున్న దని కొందరి యభిప్రాయము. ఆ పదింట గుణించినసంఖ్యనే నవకదాన విశోధనా నంతరమున ఋతువికల్పమగు 6 ట భాగింపగా శేషించిన సంఖ్య జన్మఋతుసంఖ్య యని దెలియదగినది. అసంఖ్యనే ఋతుమాస వికల్పమగు 2 ట భాగింపగా 1 మిగులునెడల నాఋతువు నీ ప్రథమమాసమనియు, శేషము లేకుండునెడల ద్వితీయమాసమనియు నూహింపదగినది ఈ రీతిగ 10 ట గుణింపబడినసంఖ్యవలన (1) సంవత్సరము. (2) ఋతువు, (3) మాసములుఅని దెలియదగినవి. ఇట్లే 8 ట గుణింపగ నేర్పడిన సంఖ్యయందు నవకదానమునైనను, నవకవిశోధనమునైనను చేసినపిదప నాసంఖ్యను పక్షవికల్పమగు రెండింట భాగింపగా 1 మిగిలినయెడల శుక్లపక్షమనియు, శేషము లేకుండునెడల కృష్ణపక్షమనియు నూహింపదగినది. ఆ యెనిమిదింట గుణించిన సంఖ్యను తిథిసంఖ్యావికల్పమగు 15 ట భాగ్గొనగా శేషసంఖ్య ప్రతిపదాదిగా యున్నవతిథియగునని జెప్పదగినది. 8 ట గుణింపబడిన సంఖ్యచే పక్షతిథులని తెలియదగినవి.

శ్లో. దివా రాత్రి ప్రసూతించ నక్షత్రానయనం తథా
సప్తకే ష్వపి వర్గేషు నిత్యమే వోపలక్షయేత్. 13

టీ. సప్తకేష్వపి వర్గేషు = ఏడింట గుణింపబడి నవక దానముగాని నవకవిశోధనముగాని చేయబడియున్న సంఖ్యను, దివా రాత్రి ప్రసూతించ = దివారాత్రివికల్పమైన 2 ట భాగింపగా నొకటి శేషించెనేని పగలుజననమనియు శేషము లేకుండిన రాత్రిజననమని చెప్పదగినది, తథా = అప్రకారమే (ఏడింట గుణించిన సంఖ్యను నవకదాన విశోధనా నంతరమందు, నక్షత్రానయనం = నక్షత్రవికల్పమైన 27 ట భాగింపగా ఎన్ని మిగులునో అశ్విన్యాదిగా నక్షత్రమందు జననమని చెప్పదగినది, ఇట్లు, నిత్యమేవ = ఎప్పుడును, ఉపలక్షయేత్ = చూడవలెను

తా. ఏడింట గుణించి సంఖ్యయందు. నవకదాన విశోధనలు జేసినతరువాత అసంఖ్యను 2 ట భాగింపగా, 1 మిగులునెడల పగలు జననమనియు, శేషము లేకుండునెడల రాత్రి జననమనియు, నూహింప దగినది అసంఖ్యనే నక్షత్రసంఖ్యా వికల్పమగు 27 ట భాగింపగా.

శేషసంఖ్య, అశ్విన్యాదిగా నేనక్షత్రమగునో యానక్షత్రమే జన్మనక్షత్రమని యూహించి చెప్పదగినది. ఏడింట గుణించగ నేర్పడినసంఖ్యవలన అహోరాత్రి నక్షత్రములు తెలియదగినది.

శ్లో. వేలా మథ విలగ్నంచ హోరా మంశక మేవ చ
పంచ కేషు విజానీయా న్నష్టజాతక సిద్ధయే. 14

టీ. పంచకేషు = అయిదింట గుణించిన సంఖ్యయందు నవకదాన విశోధనములుచేసి నపిదప, ఆసంఖ్యను, వేళాం=ఏదినమందు పగలుజననమని యేర్పడ నో ఆదినప్రమాణ ఘటికలచేత పాలుగొనగా నెన్నిమిగులునో అన్నిగడియలకు పగలు జననమనియు రాత్రిజననమని యేర్పడెనేని రాత్రిప్రమాణముచేత పాలుగొనగా ఎన్ని మిగులునో అన్నిగడియలకు రాత్రిజననమనియు చెప్పవలెను. విలగ్నంచ = ఆసంఖ్యనే రాశివికల్పమైన 12 చే పాలుగొనగా నెన్నిమిగులునో మేషాదిగా అన్నవరాశి జన్మలగ్నమని చెప్పదగును, హోరాం = హోరను, అంశక మేవచ=ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలను తాత్కాలిక గ్రహములను ఈరీతిగనే నిర్ణయించి దశాంతర్దశాష్టక వర్గాది ఫలనిర్దేశమును, నష్టజాతకసిద్ధయే= నష్టజాతక సంపాదనకొరకు, విజానీయాత్ = తెలిసికొనవలెను.

తా. అయిదింట గుణించిన సంఖ్యయందు నవకదాన విశోధనలను గావించిన తరువాత నాసంఖ్యను ఏదినమున జననమనియేర్పడినదో, యాదిన అహోరాత్రముల ప్రమాణముల దెలిసికొని బగలు జననమని యేర్పడునెడల అహఃప్రమాణ ఘటికలచేతను రాత్రి జననమని యేర్పడునెడల రాత్రిప్రమాణ ఘటికలచేతను బాల్గొనగా శేషము ఎన్నిమిగులునో యన్నిఘడియలకు యాకాలమున జననమని యూహించి చెప్పదగినది. ఆసంఖ్యనే 12 చే భాగింపగా నెన్నిమిగులునో మేషాదిగా అన్నవరాశి జననలగ్నమని నూహింపదగియున్నది. మరియు హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలను, తాత్కాలిక గ్రహంబులను యీవిధానముచేతనే నిర్ణయించి దశాంతర్దశాష్టక వర్గాది ఫలనిర్దేశముల జేయదగినది. ప్రకారాంతముగ నష్టజాతకమును గణించునట్టి పైగనుపరచిన విధమునే కల్యాణవర్మ తన సారావళీ గ్రంథమున 51 వ అధ్యాయమున 13, 14, 15 శ్లోకములయందు చాలవరకు విశదీకరించెను.

—ప్రకారాంతముగ నక్షత్రముల నెరుగు క్రమము.—

శ్లో. సంస్కారనామమాత్రా ద్విగుణా శ్ఛాయాంగులై స్సమాయుక్తాః
శేషం త్రినవక భక్తా న్నక్షత్రం తద్ధనిష్ఠాది. 15

టీ. సంస్కారనామమాత్రాః = నామధేయముయొక్క మాత్రలయొక్క (హల్లుఅర్ధమాత్రకము అచ్చు యేకమాత్రకము) ఈసంఖ్యను, ద్విగుణాః = రెంటగుణించి, ఛాయాంగులైః = తత్కాలమందు ద్వాదశాంగుళ శంకువులో కనబడిన ఛాయాంగుళములతోడ, సమాయుక్తాః=కూడి, త్రినవకభక్తాత్=27 చే భాగింపగా, శేషం=మిగిలినవాటిని, తత్=అది, ధనిష్ఠాది=ధనిష్ఠాదిగా, నక్షత్రం=ఆనక్షత్రమున జననమని చెప్పదగినది.

తా. తల్లిదండ్రాదులచే విధ్యుక్త ప్రకారముగ బెట్టబడిన నామధేయము యొక్క మాత్రలను రెండింట గుణించి తత్కాలమున ద్వాదశాంగుళ శంకువున గనబడినట్టి ఛాయాంగుళికములతోడగూడి నక్షత్రసంఖ్యా వికల్పమగు 27 చే భాగింపగ శేషము ఎన్ని మిగులునో ధనిష్ఠాదిగా యన్నవనక్షత్రమున జననమని యూహింపదగినది.

—— మరియొకరీతిని నక్షత్రము నెరుగువిధము. ——

శ్లో. ద్విత్రి చతుర్దశ దశ తిథి సప్తత్రిగుణా నవాఽష్ట చైంద్రాద్యాః
పంచదశఘ్నా స్తద్దిఙ్ముఖాన్వితం భం ధనిష్ఠాది. 16

టీ. (పృచ్ఛకుడు తూర్పుతిరిగి అడిగిన) ద్వి=రెండును, (ఆగ్నేయాభిముఖుండై అడిగిన) త్రి=మూడును, (దక్షిణాభిముఖుడై అడిగిన) చతుర్దశ = 14 ను, (నైరృత్యభిముఖుడై అడిగిన) దశ=10 యును, (పశ్చిమాభిముఖుడై అడిగనేని) తిథి=15 ను, (వాయవ్యాభిముఖుడై అడిగనేని) సప్తత్రిగుణ 27ను, (ఉత్తరాభిముఖుడైనయెడల) నవ=9 దియును, (ఈశాన్యదిక్కునుండి అడిగనేని) అష్ట = 8 యును, ఐంద్రాద్యైః = తూర్పు మొదలైన దిక్కులలో ఏదిఙ్ముఖుండై ప్రశ్న చేయునో ఆదిక్కునకు చెప్పినసంఖ్యను పెట్టుకొని, పంచదశఘ్నాః= 15 చే గుణించి, పృచ్ఛకుడు ఏదిఙ్ముఖుండై ప్రశ్న అడుగునో, తద్దిఙ్ముఖాన్వితం, వాడుగాక ఆదిఙ్ముఖులై యెందఱుందురో అన్ని సంఖ్యలు మొదట 15 చే గుణించిన సంఖ్యతో గూడ 27 చే భాగ్గాన గా, శేషం=మిగిలినవి, ధనిష్ఠాది=ధనిష్ఠ మొదలుకొని,భం=అన్నవనక్షత్రమందు జననమని చెప్పవలెను.

తా. తూర్పునకు 2, ఆగ్నేయమునకు 3, దక్షిణమునకు, 14, నైరుతిదిక్కునకు 10, పశ్చిమమునకు 15, వాయవ్యమునకు 27. ఉత్తరమునకు 9, ఈశాన్యమునకు 8, యీవిధముగ నాయాదిక్కునకు నాయాసంఖ్యగా నుంచుకొని, పృచ్ఛకుడు, ఏదిక్కునకభిముఖుడై యడుగునదియు గమనించి, ఆ దిక్కులకు జెప్పియుండు సంఖ్యను 15, చే గుణించి, ఆకాలమున ఆదిఙ్ముఖులై యితరులెందరుందురో అన్ని సంఖ్యలను, ప్రథమమున 15 చే గుణించి యేర్పడియుండు సంఖ్యతో గూడి నక్షత్రసంఖ్యావికల్పమగు 27, చే భాగ్గానగా శేషసంఖ్యను ధనిష్ఠాదిగా లెక్కగొనగా నేర్పడు నక్షత్రమే జన్మనక్షత్రమని యూహింపదగినది.

—— నష్టజాతక ప్రకరణ ఉపసంహారము. ——

శ్లో. ఇతి నష్టజాతక మిదం బహుప్రకారం మయా వినిర్దిష్టం
గ్రాహ్య మతః సచ్ఛిష్యైః పరీక్ష్య యత్నా ద్యథా భవతి. 17

టీ. ఇతి = ఈప్రకారము, మయా=నాచేత, ఇదం=ఈనష్టజాతకము, బహుప్రకారం= అనేకవిధములైన ప్రమాణములతో, వినిర్దిష్టం = చెప్పబడెను. అతః = ఈ కారణమువలన, సచ్ఛిష్యైః = బుద్ధిమంతులగుశిష్యులచేత, యత్నాత్ = ప్రయత్నముకలన, పరీక్ష్య = పరీక్షించి, యథాభవతి = ఏప్రకారము అనుభవము నకువచ్చునో ఆప్రకారముగా, గ్రాహ్యం = గ్రహింపదగినది.

తా. ఈవిధమున వరాహమిహిరాచార్యుడనెడు నాచేత నీ నష్టజాతక మనేకవిధములగు పరాశరవసిష్ఠాది మహామునులచే జెప్పబడిన శాస్త్రములను పర్యాలోచించి యనేకప్రకారములగునట్లు చెప్పబడెను. ఇందుకారణమున బుద్ధిమంతులగు శిష్యులచే ప్రయత్నముచే పరీక్షించి యేప్రకార మనుభవమునకు వచ్చునో యాప్రకారముగ గ్రహించవలెను.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

నష్టజాతకాధ్యాయనామక

పంచవింశోధ్యాయము.



శ్రీరస్తు

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ద్రేక్కాణాధ్యాయము. షడ్వింశోధ్యాయము:—26.



### మేష ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. కట్యాం సితవస్త్రవేష్టితః కృష్ణశ్శక్త ఇవాభిరక్షితుం
రౌద్రః పరశుం సముద్యతం ధత్తే రక్తవిలోచనః పుమాన్.

టీ. కట్యాం = మొలయందు, సితవస్త్రవేష్టితః = తెల్లనివస్త్రమును గట్టుకొన్నవాడును, కృష్ణః = నీలవర్ణుడును, అభిరక్షితుం = ఎదురుగానుండి రక్షించుటకు, శక్తఇవ = సమర్థునివలెనున్నవాడును, రౌద్రః = భయంకరుడును, రక్తలోచనః = ఎఱ్ఱనికన్నులుగలవాడునునైన, పుమాన్ = పురుషుండు, (పురుషస్వరూపమై), సముద్యతం = ఎత్తబడిన, పరశుం = గండ్రగొడ్డలిని, ధత్తే = ధరించుచుండును. (ఇది మేషప్రథమద్రేక్కాణ స్వరూపము.)

తా. ఈద్రేక్కాణము మొలయందు తెల్లని వస్త్రము గట్టికొనినవాడును, నీలవర్ణశరీరముగలవాడును, ఎదురుగనుండి రక్షించుటకు సమర్థతగలవాడును, భయంకర స్వరూపము గలవాడును, ఎఱ్ఱని కన్నులుగలవాడును నైన పురుషునిగా బురుషస్వరూపస్థి

యెత్తబడినట్టి పరశువును ధరించియుండును. ఇది ఆయుధసహితమై యంగారకసక్తమగు పురుషద్రేక్కాణము.

## మేష ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. రక్తాంబరా భూషణభక్ష్యచిత్తా కుంభాకృతి ర్వాజిముఖీ తృషార్తా
ఏకేన పాదేనచ మేషమధ్యే ద్రేక్కాణరూపం యవనోపదిష్టమ్. 2

టీ. రక్తాంబరా = ఎఱ్ఱనిచీరకలదియు, భూషణభక్ష్యచిత్తా = అలంకార భక్ష్యములయందు మనస్సుగలదియు, కుంభాకృతిః = ఘటోదరియు, వాజిముఖీ = గుఱ్ఱపుముఖముగలదియు, తృషార్తా = దప్పిచేతపీడింపబడినదియు, ఏకేనపాదేన = ఒంటికాలితోగనబడు నదియునైనస్త్రీ, మేషమధ్యే = మేషమధ్యమందున్న, ద్రేక్కాణరూపం = ద్రేక్కాణ స్వరూపమని, యవనోపదిష్టం = యవనేశ్వరాదులచే జెప్పబడెను.

తా. ఈద్రేక్కాణము, ఎఱ్ఱనిచీరనుగట్టికొనినదియు, ఆభరణములయందును భక్ష్యములయందును కోరికగలదియు, కుండవంటి యాకారముగల కడుపుగలదియు, అశ్వముఖమును బోలినముఖముగలదియు, పిపాసాశ్రమాకులత్వంబుచే బీడింపబడినదియు, ఒకపాదముతో గనపడునదియునైన స్త్రీరూపముగలదియని యవనేశ్వరాదులచే జెప్పబడినది. మరియు, నిది చతుష్పదోన్ముఖ ద్రేక్కాణమగుటచే దీనిని చతుష్పదద్రేక్కాణమని కొందరు వ్యాఖ్యానముచేసియున్నారు గాన నిది చతుష్పదమును, అర్కాసక్తమును, మృగముఖమునునగు, స్త్రీ ద్రేక్కాణము. ఇది మేషద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

## మేష తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. క్రూరఃకలాజ్ఞః కపిలః క్రియార్థీ భగ్నవ్రతోఽభ్యుద్యతదండహస్తః
రక్తాని వస్త్రాణి బిభర్తి చండో మేషే తృతీయః కథిత స్త్రిభాగః. 3

టీ. మేషే = మేషమందలి, తృతీయః = మూడవదైన, త్రిభాగః = ద్రేక్కాణము, క్రూరః = విషమస్వభావుడును, కలాజ్ఞః = చతుష్షష్టి కళాభిజ్ఞుడును, కపిలః = పింగళవర్ణుడును, క్రియార్థీ = కార్యములయందాసక్తిగలవాడును, భగ్నవ్రతః = నియమములకు తప్పువాడును, అభ్యుద్యతదండహస్తః = ఎదురుగానెత్తబడిన దండము చేతియందు గలవాడును నైన, చండః = మిక్కిలికోపముగలపురుషుడై, రక్తాని = ఎఱ్ఱనైన, వస్త్రాణి = వస్త్రములను, బిభర్తి = ధరించుచుండును (అని), కథితః = చెప్పబడెను.

తా. మేషతృతీయద్రేక్కాణము, క్రూరుడును, అరువదినాలుగు కళలయందును చతురతగలవాడును, చిత్రవర్ణముగలవాడును, పనులయందాసక్తిగలవాడును, నియమములను బూర్తిగ కాపాడుకొననివాడును, ఎదురుగనెత్తబడిన దండమును హస్తమునగలవాడును, మిక్కిలికోపముగలవాడును, పురుషుడునైన ఎఱ్ఱనివస్త్రములను ధరించుచుండువాడగునని చెప్పబడినది ఇది సాయుధమగు బృహస్పతిసక్త పురుషద్రేక్కాణము.

## వృషభ ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. కుంచితలూనకచా ఘటదేహా దగ్ధపటా తృషితాఽశనచిత్తా
ఆభరణా న్యపి వాంఛతి నారీ రూప మిదం వృషభే ప్రథమస్య. 4

టీ. కుంచితలూనకచా = ముణుచుకొని తెగిన వెంట్రుకలుగలదియు, ఘటదేహా = కుండవంటి దేహముగలదియు, దగ్ధపటా = కాలినచీరగలదియు, తృషితా = దప్పిగొన్నదియు, అశనచిత్తా = భోజనమందు మనస్సుగలదియునైన, నారీ = స్త్రీ, (స్త్రీరూపమై) ఆభరణాన్యపి = భూషణములను, వాంఛతి = కోరుచుండును, ఇదం = ఇది, వృషభే = వృషభరాశియందలి, ప్రథమస్య = మొదటిద్రేక్కాణముయొక్క, రూపం = స్వరూపము.

తా. వృషభప్రథమ ద్రేక్కాణము, ముడుచుకొని తెగిన వెంట్రుకలుగలదియు, కుండవంటి కడుపుగలదియు, కాలినవస్త్రమును గట్టినదియు, దప్పిగొన్నదియు, భోజనమందు ప్రీతిగలమనస్సుగలదియు, ఆభరణములను కోరుచుండువాడుది. ఇదియే, వృషభప్రథమద్రేక్కాణస్వరూపము. ఇది అగ్నిసహితమై శుక్రసక్తమగు స్త్రీద్రేక్కాణము

## వృషభ ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. క్షేత్ర ధాన్య గృహ ధేను కలాజ్ఞో లాంగలే స శకటే కుశలశ్చ
స్కంధ ముద్వహతి గోపతితుల్యం క్షుత్పరోఽజవదనోమలవాసాః. 5

టీ. క్షేత్ర = వరిమళ్ళు, ధాన్య = ధాన్యములును, గృహ = ఇండ్లు, ధేను = ఆవులు, కలా = గీతవాద్యాది చతుష్షష్ఠికళలు, జ్ఞః = ఎఱింగినవాడును, సశకటే = బండితోగూడిన, లాంగలే = నాగేటియందు, (శకటకర్మయందును హాలకర్మలయందును), కుశలః = సమర్థుడును, క్షుత్పరః = ఆకలిగలవాడును, అజవదనః = మేకమూతి గలవాడును, మలవాసాః = మలినవస్త్రిండును (పురుషుడై), గోపతితుల్యం = వృషభసమానమైన, స్కంధం = మూపురమును, ఉద్వహతి = వహించుచుండును.

తా. ఇది వరిమళ్లు, ధాన్యము, ఇండ్లు, ఆవులుగలవాడును, గీతవాద్యాదిచతుష్షష్ఠికళలనెఱింగినవాడును, సేద్యముచేయుటయందును చేయించుటయందును నేర్పరియగువాడును, బహువిధములగు శకటములు సంబంధించిన పనులయందును, నాగలిసంబంధమునగల పనులయందును కుశలుడును, ఆకలియధికముగ గలవాడును, మేకముఖమునుబోలిన ముఖమును, వృషభస్కంధమునుబోలిన మూపురమునుగలిగి, మలినవస్త్రధారణుడై యుండును. ఇదిచతుష్పదమును, బుధసక్తమునైన పురుషద్రేక్కాణము.

## వృషభ తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. ద్విపసమకాయః పాండురదంష్ట్రః శరభసమాంఘ్రిః పింగళమూర్తిః
అవిమృగలోభవ్యాకులచిత్తో వృషభవనస్య ప్రాంతగతోఽయమ్. 6

టీ. ద్విపసమకాయః=ఏనుగవలె గొప్ప శరీరముగలవాడును, పాండురదంష్ట్రః=తెల్లని కోరలు గలవాడును, శరభసమాంఘ్రిః=శరభమృగ పాదములుగలవాడును, పింగళమూర్తిః = కపిలవర్ణమైన శరీరముగలవాడును, అవి= మేకలు, మృగ=అరణ్యమృగములు, (వీటియందు) వ్యాకుల = వ్యాకులమైన, చిత్తః = మనస్సుగలవాడును, అయం = ఇట్టిపురుషుడు, వృషభవనస్య = వృషభరాశియొక్క, ప్రాంతగతః=తృతీయ ద్రేక్కాణము అగును.

తా. ఏనుగు శరీరమువలె గొప్పశరీరముగలవాడును, తెల్లగానుండు కోరపండ్లుగలవాడును, శరభమనెడి మృగముయొక్క పాదములను బోలినపాదములుగలవాడును, కపిలవర్ణమగు శరీరముగలవాడును, మేకలు, అరణ్యమృగములు, వీనియందలి ఆశచేత పలువోట్లను వ్యాకులమనస్కుడై తిరుగువాడునగునట్టి పురుషుడు వృషభతృతీయ ద్రేక్కాణమును బొందినవాడు (వృ 3 ద్రేక్కాణమున జనించినవాడు) యిందు "అజ మృగలోభవ్యాకులచిత్తో" అనుచోట "అళిమృగలోమా వ్యాకులచిత్తో" అని కొందరు పఠించి, తుమ్మెదరెక్కలవలె నల్లనై మృగముల రోమములవంటి వెంట్రుకలుగలవాడని వచించుదురు. ఇది చతుష్పదమును, శనియుక్తమునైన పురుష ద్రేక్కాణము.

## —మిథున ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.—

శ్లో. సూచ్యాశ్రయం సమభివాంఛతి కర్మనారీ
రూపాన్వితాభరణకార్యకృతాదరాచ
హీనప్రజోచ్ఛ్రిత భుజర్తుమతీ త్రిభాగ
మాద్యం తృతీయ భవనస్య వదంతితజ్ఞాః. 7

టీ. రూపాన్వితా = సౌందర్యయుక్తురాలును, ఆభరణ కార్యకృతాదరాచ = భూషణక్రియలందు అభిలాషగలదియు, హీనప్రజా = సంతానహీనురాలును, ఉచ్ఛ్రితభుజా = ఎగు భుజములుగలదియు, ఋతుమతీ = రజస్వలయును, నారీ=స్త్రీ, (స్త్రీస్వరూపమై) సూచ్యాశ్రయం = సూదిని ఆశ్రయించిన, కర్మ=కుట్టుపనిని, సమభివాంఛతి = కోరుచుండును, ఈప్రకారము, తద్జ్ఞాః = పండితులు, తృతీయభవనస్య = మిథునరాశియొక్క, ఆద్యం= మొదటిదైన, త్రిభాగం = ద్రేక్కాణమును, వదంతి = చెప్పుదురు.

తా. సౌందర్య యుక్తురాలును, భూషణక్రియలయందు అభిలాషగలదియును, సంతానహీనురాలును, ఎగుభుజములు గలదియు, ఋతుమతియు, నగు స్త్రీరూపమై సూదిచే జేయుబడు కుట్టుపనియందు (అనగా, రవికెలు, చొక్కాలు మొదలగునవి కుట్టుటయందు) శ్రద్ధ కనబరచుచు, ఆపనులయందే సదాకోరికగలిగి యుండును. ఈశ్లోకమున "ఉచ్ఛ్రితభుజర్తుమతీ" అనుచోట "ఉచ్ఛ్రితభుజాతసతీ"యని కొందరు పఠించి,ఎగుబుజములను గలిగిన పతివ్రతయగు నట్టిదియని వ్యాఖ్యానము జేయుదురు యీప్రకారముండునది మిథునరాశి యొక్క ప్రథమద్రేక్కాణమని పెద్దలువచించుదురు. ఇదిబుధసక్తముగు, స్త్రీద్రేక్కాణము.

## మిథున ద్వితీయ ద్రేక్కాణస్వరూపము.

శ్లో. ఉద్యానసంస్థః కవచీధనుష్మాన్ శూరోऽస్త్రధారీ గరుడాననశ్చ
క్రీడాత్మజాలంకరణార్థచింతాం కరోతి మధ్యే మిథునస్య రాశేః. 8

టీ. మిథునస్య రాశేః=మిథునరాశియొక్క, మధ్యే=మధ్యమద్రేక్కాణము, ఉద్యానసంస్థః=ఉద్యానవనమందుండువాడును, కవచీ=కవచము గలవాడును, ధనుష్మాన్=విల్లుగలవాడును, శూరః=యుద్ధప్రియుండును, అస్త్రధారీ=అస్త్రములను ధరించినవాడును, (పాఠాంతరము శస్త్రాస్త్రధారీ) గరుడాననశ్చ=గరుడముఖము గలవాడునునైన (పురుషుడై) క్రీడాత్మజాలంకరణార్థచింతాం= రతిపుత్ర, భూషణ, ధన, విచారములను, కరోతి=చేయుచుండును.

తా. మిథునరాశియొక్క మధ్యద్రేక్కాణము, ఉద్యానవనమునందుండువాడును, కవచమును ధరించినవాడును, విల్లుగలవాడును, యుద్ధమునందాసక్తి గలవాడును, అస్త్రముల ధరించినవాడును, గరుత్మంతుని ముఖమును బోలిన ముఖముగలవాడునైన పురుషస్వరూపమై కామక్రీడలయందును, పుత్రులయందును, ఆభరణములయందును,కోరికగలిగి ధనవిషయమున విచారము చేయుచుండును. ఇది ఆయుధసహితమును, శుక్రసక్త పురుషస్వరూపమునగు ఖగద్రేక్కాణము.

## మిథున తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. భూషితో వరుణవద్బహురత్నో బద్ధతూణకవచస్సధనుష్కః
నృత్తవాదితకలాసు చ విద్వాన్ కావ్యకృన్మిథునరాశ్యవసానే. 9

టీ. మిథునరాశ్యవసానే = మిథునతృతీయ ద్రేక్కాణము, భూషితః = అలంకరింపబడినవాడును, వరుణవత్ = సముద్రునివలె, బహురత్నః = అనేకమణులుగలవాడును, బద్ధతూణకవచః = కట్టబడిన అంబులపొదియును కవచమును గలవాడును, సధనుష్కః=విల్లుతోగూడినవాడును, నృత్తవాదితకలాసుచ = నాట్యవాద్యములయందును చతుష్షష్టి కళలయందును, విద్వాన్ = ఎఱుకగలవాడును, కావ్యకృత్ = కవిత్వముచేయువాడునునైన పురుషుడైయుండును, (ఇది ఆయుధసహిత శనిసక్త పురుషద్రేక్కాణము.

తా. మిథున తృతీయద్రేక్కాణము, భూషణములచేత నలంకరింపబడినవాడును, సముద్రునివలె యనేక మణులుగలవాడును, అంబులపొదియును, కవచమును ధరించినవాడును, విల్లునుధరించిన వాడును, నృత్తగీత వాద్యాది చతుష్షష్టి కళలయందు సమర్థుడును, కవిత్వము చెప్పువాడునునగు పురుషస్వరూపమైయుండును. ఇది ఆయుధసహితమును శనిసంయుక్తమునగు పురుషద్రేక్కాణము.

## కర్కాటక ప్రథమ ద్రేక్కాణస్వరూపము.

శ్లో. పత్రమూలఫలభృద్ద్విపకాయః కాననే మలయగశ్శరభాంఘ్రిః
క్రోడతుల్యవదనో హయకంఠః కర్కటే ప్రథమరూపముశంతి.

టీ. పత్రమూలఫలభృత్ = ఆకులను, గడ్డలను, ఫలములను భరించువాడును, ద్విపకాయః = గజసమాన శరీరుడును, కాననే=అడవియందు, మలయగః = చందనవృక్షములను బొంది యుండువాడును, శరభాంఘ్రిః = శరభమృగపాదములవంటి పాదములుగలవాడును, క్రోడతుల్యవదనః = పందికిసమమైన మొగముగలవాడును, హయకంఠః = గుఱ్ఱపు మెడవంటి మెడగలవాడునునైన (పురుషుండు) కర్కటే=కర్కటరాశియందు, ప్రథమరూపం=ప్రథమద్రేక్కాణ స్వరూపమును, ఉశంతి = చెప్పుదురు.

తా. ఆకులను, గడ్డలను, ఫలములను, భరించువాడును, ఏనుగుశరీరమును బోలినశరీరముగలవాడును, అడవులయందు జందనవృక్షములను బొందినవాడును, శరభమనెడి మృగముయొక్క పాదములబోలిన పాదములు గలవాడును, పంది మొగమువంటి ముఖముగలవాడును, గుఱ్ఱపు మెడవంటి మెడగలవాడును, అగు పురుష రూపమే, కర్కాటక ప్రథమద్రేక్కాణ స్వరూపమని చెప్పుదురు. ఇదిచతుష్పదమును, చంద్రసక్తమునగు నరద్రేక్కాణము.

## కర్కాటకమధ్య ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. పద్మార్చితా మూర్ధనిభోగియుక్తా స్త్రీకర్కశారణ్యగతా విరౌతి
శాఖాంపలాశస్య సమాశ్రితాచ మధ్యేస్థితాకర్కటకస్యరాశేః

టీ. కర్కటకస్యరాశేః = కర్కటరాశియొక్క, మధ్యేస్థితా = మధ్యమందున్న ద్రేక్కాణము, మూర్ధని=శిరస్సునందు, పద్మార్చితా = కమలములచేత పూజింప బడినట్టియు, భోగియుక్తా = సర్పములతో గూడినట్టియు, కర్కశ = కఠినురాలైనట్టి, స్త్రీ= స్త్రీస్వరూపమై, అరణ్యగతా = వనమును పొందినదై, పలాశస్య=మోదుగచెట్టుయొక్క, శాఖాం=కొమ్మను, సమాశ్రితా = ఆశ్రయించి, విరౌతి = అరచుచుండును.

తా. కర్కాటక మధ్యద్రేక్కాణము (ద్వితీయద్రేక్కాణము) శిరస్సునందు కమలముచే బూజింపబడినట్టియు, సర్పములతో గూడినట్టియు, కఠినమనస్కయగు స్త్రీరూపమై అడవియందలి మోదుగచెట్టు కొమ్మనుపట్టుకొని అరచుచుండును. ఇది భౌమసక్తసుగు స్త్రీద్రేక్కాణము

## కర్కాటక తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. భార్యాభరణార్థ మర్ణవే నౌస్థో గచ్ఛతి సర్పవేష్టితః
(౩)
హైమైశ్చయుతో విభూషణై శ్చిపిటాస్యో ఽంత్యగతశ్చ కర్కటే.

టీ. కర్కటే = కర్కటమందు, అంత్యగతః = తృతీయద్రేక్కాణము, సర్పవేష్టితః= సర్పములచేత చుట్టబడినట్టియు, హైమైః = స్వర్ణనిర్మితములైన, విభూషణైః = ఆభరణములతో, యుతః = కూడుకొన్నట్టియు, చిపిటాస్యః = అటుకులు నోటియందు కలిగినట్టి, పురుషుడై, భార్యాభరణార్థం, భార్యా = భార్యయొక్క, ఆభరణార్థం = భూషణముల కొఱకు, అర్ణవే = సముద్రమందు, నౌస్థః = ఓడనెక్కినవాడై, గచ్ఛతి = పోవుచుండును.

తా. కర్కాటక అంత్యద్రేక్కాణము (తృతీయద్రేక్కాణము,) సర్పములచేత జుట్టబడినట్టియు, స్వర్ణనిర్మితములగు భూషణములతోడ గూడికొన్నట్టియు, అటుకలు నోటియందుగలిగినట్టియు పురుషుడై కళత్రము కొరకును, ఆభరణములకొరకును సముద్రయానము చేయుచుండును. ఇది సర్పసహితమును, గురుపక్షమునగు నరద్రేక్కాణము.

## సింహప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. శాల్మలే రుపరి గృధ్రజంబుకౌ శ్వా నరశ్చ మలినాంబరాన్వితః
రౌతి మాతృపితృ విప్రయోజిత స్సింహరూప మిద మాద్య ముచ్యతే.

టీ. శాల్మలేః = బూరుగ చెట్టుయొక్క, ఉపరి = మీదను, గృధ్రజంబుకౌ = గద్ద నక్కలైయుండును, శ్వా = కుక్కయయ్యును, మలినాంబరాన్వితః = మలిన వస్త్రము కలవాడును, మాతృపితృవిప్రయోజితః = తల్లిదండ్రులచేత విడువబడినవాడును నైన, నరః = మనుష్యుడై, రౌతి = అరచుచుండును, ఇదం = ఇది, ఆద్యం = మొదటిదైన, సింహరూపం = సింహద్రేక్కాణ స్వరూపమని, ఉచ్యతే = చెప్పబడును.

తా. బూరుగచెట్టుమీది గృధ్ర జంబుకముల బోలినవాడును, కుక్కయు, మలినవస్త్రయుక్తుడును, తల్లిదండ్రులచేతను, బ్రాహ్మణులచేతను విడువబడిన మనుష్యుడై యరచుచుండు నరరూపమే, సింహప్రథమద్రేక్కాణ స్వరూపమని చెప్పబడుచున్నది. ఇది నరరూపమును, చతుష్పదమును, అర్కపక్షమును నైన పక్షిద్రేక్కాణము.

## సింహ మధ్య ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. హయాకృతిః పాండురమాల్యశేఖరో బిభర్తి కృష్ణాజినకంబళం నరః
దురాసద స్సింహ ఇవాత్తకార్ముకో నతాగ్రనాసో మృగరాజ మధ్యమః.

టీ. మృగరాజ మధ్యమః = సింహరాశియొక్క మధ్యమ ద్రేక్కాణము, హయాకృతిః = అశ్వాకారుడును, పాండురమాల్యశేఖరః = తెల్లని పుష్పమాలికలను ధరించినవాడును, సింహఇవ = సింహమువలె, దురాసదః = దుస్సాధ్యుడును, ఆత్తకార్ముకః = ధనుర్ధరుండును, నతాగ్రనాసః = వంగిన కొనముక్కు గలవాడును నైన, నరః = మనుష్యుడై, కృష్ణాజినకంబళం = కృష్ణాజిన కంబళములను, బిభర్తి = ధరించుచుండును.

తా. సింహరాశియొక్క మధ్యద్రేక్కాణము (ద్వితీయద్రేక్కాణము) గుఱ్ఱమువంటి ఆకారముగలవాడును, తెల్లని పుష్పమాలికలశిరమున ధరించిన వాడును, సింహమువలె దుస్సాధ్యుడును, ధనుస్సును ధరించినవాడును, వంగినట్టికొనముక్కుగలవాడును, నైనమనుష్యుడై జింకచర్మములను, కంబళములను ధరించుచుండును. ఇది ఆయుధసహితమును, గురుక్షేత్రమును నగు నరద్రేక్కాణము.

—సింహ తృతీయ ద్రేక్కాణ స్వరూపము.—

శ్లో. ఋక్షాననో వానరతుల్యచేష్టో బిభర్తి దండం ఫల మామిషం చ
కూర్చీ మనుష్యః కుటిలైశ్చ కేశై ర్మృగేశ్వరస్యాంత్యగత స్త్రిభాగః.

టీ. మృగేశ్వరస్య = సింహామురొక్క, అంత్యగతః = కడపటిదైన, త్రిభాగః=ద్రేక్కాణము, ఋక్షాననః = ఎలుగుబంటి ముఖముండును, వానరతుల్యచేష్టః = కోతిచేష్టలుగలవాడను, కూర్చి = నిడుపైనగడ్డము మీసములుగలవాడును, కుటిలైః=వక్రములైన, కేశైః=తలవెండ్రుకలతో గూడినవాడునైన, మనుష్యః=పురుషుఁడై, దండం=ఆయుధమును, ఫలం=పండును, ఆమిషంచ = మాంసమును, బిభర్తి = ధరించుచుండును.

తా. సింహరాశియొక్క అంత్యద్రేక్కాణము ఎలుగుబంటి ముఖమును బోలిన ముఖముగలవాడును, కోతిచేష్టలు గలవాడును, నిడుపైన గడ్డమును మీసములును గలవాడును, వక్రములగు వెంట్రుకలుగలవాడును, నైనపురుషుఁడై, ఆయుధమును, ఫలమును, మాంసమును, ధరించుచుండును. ఇదిచతుష్పదమును, ఆయుధసహితమును, ఘోరసక్తమునైన నరద్రేక్కాణము.

—కన్యా ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.—

శ్లో. పుష్పప్రపూర్ణేన ఘటేన కన్యా మలప్రదిగ్ధాంబర సంవృతాంగీ
వస్త్రార్థసంయోగ మభీప్సమానా గురోః కులం వాంఛతి కన్యకాద్యః.

టీ. కన్యకాద్యః=కన్యాప్రథమ ద్రేక్కాణము, పుష్పప్రపూర్ణేన=పుష్పములచే నిండియున్న, ఘటేన=కుండతోడ, (ఉపలక్షితా = కూడుకొన్నదియు,) మలప్రదిగ్ధాంబర సంవృతాంగీ = మలినవస్త్రమును గట్టుకొన్నదియు, వస్త్రార్థసంయోగం = వస్త్రధనసంప్రాప్తిని, అభీప్సమానా = కోరుచున్నదియునైన, కన్యా=కన్యకయై, గురోః=గురువుయొక్క, కులం=గృహమును, వాంఛతి = కోరుచుండును.

తా. కన్యాప్రథమ ద్రేక్కాణము, పుష్పములచే నిండింపఁబడియుండు కుండనుగలిగినదియు, మలిన వస్త్రమును గట్టుకొనినదియు, వస్త్రధన సంప్రాప్తమును గోరుచుండునదియునగు కన్యకయై గురుగృహమును గోరుచుండును. ఇది బుధపక్షగు స్త్రీద్రేక్కాణము.

—కన్యా ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.—

శ్లో. పురుషః ప్రగృహీతలేఖని శ్శ్యామో వస్త్రశిరా వ్యయాయకృత్
విపులంచ బిభర్తి కార్ముకం రోమవ్యాప్తతనుశ్చ మధ్యమః. 17

టీ. మధ్యమః = కన్యారాశియొక్క మధ్యమద్రేక్కాణము, ప్రగృహీతలేఖనిః=గ్రహింపబడిన లేఖినిగలవాడును, శ్యామః = శ్యామవర్ణుడును, వస్త్రశిరాః= వస్త్రయుక్తమగు శిరస్సుగలవాడును, వ్యయాయకృత్ = లాభనష్టముల గణించువాడును, రోమవ్యాప్తతనుశ్చ = రోమములు నిండినశరీరము గలవాడునైన, పురుషః=పురుషుఁడై, విపులం=దీర్ఘమైన, కార్ముకం=విల్లును, బిభర్తి=ధరించుచుండును.

తా. కన్యా మధ్యమ ద్రేక్కాణము. (ద్వితీయద్రేక్కాణము) అక్షరముల వ్రాయుట మొదలగు కార్యములను చేయువాడును, శ్యామలవర్ణుడును, తలపాగ ధరించినవాడును, ఆదాయ వ్యయములు గణించువాడును, రోమములచే వ్యాపింపబడిన శరీరముగల పురుషుడై పెద్దదగు వింటిని ధరించినవాడై యుండును. ఇది ఆయుధ సహితమును, శనిసక్తమునునగు, పురుష ద్రేక్కాణము.

## కన్యా తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. గౌరీసుధౌతాగ్రదుకూలగుప్తా సముచ్ఛ్రితా కుంభ కటచ్ఛహస్తా
దేవాలయం స్త్రీ ప్రయతా ప్రవృత్తా వదంతి కన్యాంత్యగతస్త్రీభాగః

టీ. కన్యాంత్యగతస్త్రీభాగః = కన్యాతృతీయ ద్రేక్కాణము, గౌరీ = తెల్లనిరంగుగలదియు, సుధౌతాగ్రదుకూలగుప్తా = శుభ్రమైనకొంగు పట్టుచీరతో కప్పబడినదియు, సముచ్ఛ్రితా = మిక్కిలిపొడవైనదియు, కుంభకటచ్ఛహస్తా = కడవ, గరిటె, ఇవి హస్తమందు గలదియు, ప్రయతా = నియతురాలై, దేవాలయం = దేవాలయమునుగూర్చి, ప్రవృత్తా = పోవుచున్నట్టిదియునైన, స్త్రీ = స్త్రీయని, వదంతి = ఋషులు చెప్పుదురు.

తా. కన్యాంత్య ద్రేక్కాణము (తృతీయ ద్రేక్కాణము), గౌరవర్ణము గలదియు, నిర్మలమగు కొంగుగల పట్టుచీరచేత గప్పబడినదియు, మిక్కిలి పెద్దదియగు కుంభమును, పొడుగైన గరిటెయును హస్తమునబట్టుకొనినదియు, నియతురాలై దేవాలయమునుగూర్చి పోవునట్టిదియగు స్త్రీయని మునులు చెప్పుదురు. ఇది శుక్రసక్తమగు స్త్రీద్రేక్కాణము.

## తులా ప్రథమ ద్రేక్కాణ స్వరూపము

శ్లో. వీథ్యంతరాపణగతః పురుషస్తులావా
నున్మాన మానకుశలః ప్రతిమానహస్తః
భాండం విచింతయతి తస్య చ మూల్య మేత
ద్రూపం వదంతి యవనాః ప్రథమం తులాయాః. 1౪

టీ. వీథ్యంతరాపణగతః = వీథినడిమి యంగడియందుండువాడును, తులావాన్ = త్రాసుగలవాడును, ఉన్మాన = త్రాసు మొదలైన వానియందును, మాన = మానిక మొదలైనవానితో కొలుచుటయందును, కుశలః = నేర్పుగలవాడును, ప్రతిమానహస్తః = స్వర్ణాదిద్రవ్య పరీక్షకై యుండు సాధనము హస్తమందుగలవాడునైన, పురుషః = పురుషుడై, భాండం = మూలధనమును, తస్య = ఆమూలద్రవ్యమునకు, మూల్యం = కొనదగిన వస్తువుయొక్క క్రయమును, విచింతయతి = చింతించుచుండును, ఏతత్ = ఇది, తులాగాః = తులారాశియొక్క; ప్రథమరూపం = మొదటి ద్రేక్కాణస్వరూపమని, యవనాః = యవనులు, వదంతి = చెప్పుదురు.

తా. వీథియందలి నడియంగడి యందుండువాడును, త్రాసును గలవాడును, తూచుటయందును, మానికలు మొదలగువాటిచే కొలుచుటయందును నేర్పరితనము గలవాడును, స్వ

ర్ణాది లోహములచేఁ జేయఁబడిన ద్రవ్యపాత్ర్యములను పరీక్షసేయునట్టి సాధకమును హస్తము నగలవాఁడునునైన, పురుషుఁడై, మూలధనమును, అమూలధనమునకుఁ గొనదగిన వస్తువుల క్రయముల చింతించుచుండును. ఇది తులా ప్రథమ ద్రేక్కాణ స్వరూపమని యవనులు వచించుచున్నారు. ఇది శుక్రసహిత నరద్రేక్కాణము.

## తులాద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. కలశం పరిగృహ్య వినిష్పతితుం సమభీప్సతి గృధ్రముఖః పురుషః
క్షుధిత తృషితశ్చ కళత్రసుతా న్మనసైవ తులాధరమధ్యగతః. 20

టీ. తులాధర మధ్యగతః=తులాద్వితీయ ద్రేక్కాణము, గృధ్రముఖః = గద్దముఖము వంటి ముఖముగల, పురుషః=పురుషుఁడై, వినిష్పతితం = క్రిందపడిన, కలశం=కడవను, పరిగృహ్య=పట్టుకొని, క్షుధితః = ఆకలిగొన్న వాఁడును, తృషితశ్చ = దప్పిగొన్న వాఁడునునై, కళత్రసుతాన్ = ఆలుబిడ్డలను, మనసైవ = మనస్సుచేతనే, సమభీప్సతి = కోరుచుండును,

తా. తులారాశియొక్క మధ్యద్రేక్కాణము (ద్వితీయ ద్రేక్కాణము) గద్దముఖమును బోలిన ముఖము గలపురుషుఁడై క్రిందపడిన కుండను పట్టుకొని, ఆకలిగొన్న వాఁడును, దప్పిగొనిన వాఁడునునై, మనస్సున కళత్రపుత్ర సంబంధముగ చింతించుచుండును. ఇది నరరూపముగు శనిసక్తమునునైన పక్షిద్రేక్కాణము.

## తులా తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. విభీషయం స్తిష్ఠతి రత్నచిత్రితో
వనే మృగాన్ కాంచనతూణవర్మభృత్
ఫలామిషం వానరరూపభృ న్నర
స్తులావసానే యవనై రుదాహృతః. 21

టీ. రత్నచిత్రితః = రత్నములచేత అలంకృతుఁడును, కాంచనతూణవర్మభృత్ = బంగారు అంబులపొదిని బంగారు మైజోడును, ఫలామిషం=ఫలమాంసము ను ధరించినవాఁడును, వానరరూపభృత్=కోతిస్వరూపముకలవాఁడునునైన, నరః=పురుషుఁడై, వనే=అడవియందు, మృగాన్=మృగములను, విభీషయన్ = బెదరించుచు, తిష్ఠతి=ఉండును. (ఇట్లని) యవనైః= యవనులచేత, తులావసానే = తులాంత్య ద్రేక్కాణము, ఉదాహృతః = చెప్పఁబడెను.

తా. రత్నములచేత నలంకారము చేయఁబడినవాఁడును, బంగారుతోఁ జేయఁబడిన అంబులపొదిని, బంగారుకవచమును ఫలమాంసములను ధరించినవాఁడును, కోతివంటి యాకారముగలవాఁడును, నైనపురుషుఁడై అడవియందు మృగములను బెదరించుచు తిరుగుచుండును. ఈశ్లోకమున "ఫలామిషం వానరరూపభృత్" అనుచోట "ధనుర్ధరః కిన్నరరూపభృత్" అని కొందరు పఠించి, విల్లుదాల్చినవాఁడును, కిన్నరరూపమును ధరించినవాఁడునని చెప్పుచున్నారు. ఈ విధ

ముగా చెప్పబడినది. తులాంత్యద్రేక్కాణము (తృతీయద్రేక్కాణము) యొక్క స్వరూపమని యవనులచే జెప్పబడినది. ఇది వానరరూప చతుష్పదమును బుధసక్తమునగు నరద్రేక్కాణము.

### వృశ్చిక ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. వస్త్రైర్విహీనాऽऽభరణైశ్చ నారీ మహాసముద్రాత్సముపైతి కూలమ్
స్థానచ్యుతా సర్పనిబద్ధపాదా మనోరమా వృశ్చికరాశిపూర్వః. 22

టీ. వృశ్చికరాశిపూర్వః = వృశ్చిక ప్రథమద్రేక్కాణము వస్త్రైః = వస్త్రములచే తను, ఆభరణైశ్చ = భూషణములచేతను, విహీనా = విడువబడినదియు, స్థానచ్యుతా = స్థానభ్రష్టురాలై, సర్పనిబద్ధపాదా = పాములచేత కట్టబడిన కాళ్లుగలిగి, మనోరమా = సౌందర్యవతియునై, నారీ = స్త్రీయై, మహాసముద్రాత్ = అపారసముద్రమునమండి, కూలం = దరినిగూర్చి, సముపైతి = వచ్చుచుండును

తా. వృశ్చిక ప్రథమద్రేక్కాణము, వస్త్రములను, భూషణములను విడిచిపెట్టి స్థానభ్రంశురాలయి, పాములచేగట్టబడిన కాళ్లుగలదై సుందరవతియగు స్త్రీయైనదై సముద్రమునుండి గట్టునకు వచ్చుచుండును. ఇది సర్పయుక్తమును, కుజసక్తమునునైన స్త్రీద్రేక్కాణము.

### వృశ్చిక ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. స్థానసుఖాన్యభివాంఛతి నారీ భర్తృకృతే భుజగావృతదేహా
కచ్ఛపకుంభసమానశరీరా వృశ్చికమధ్యమరూపముశంతి. 23

టీ. భుజగావృతదేహా = పాములచేత చుట్టబడిన శరీరముగలిగి, కచ్ఛపకుంభ సమానశరీరా = తాబేటితోను కుండతోను సమానమైన శరీరముగలిగి, నారీ = స్త్రీయై, భర్తృకృతే = మగనికొఱకు, స్థాన = స్థానమును, సుఖాని = సుఖములను, అభివాంఛతి = కోరుచుండును, (ఇట్లని) వృశ్చికమధ్యమరూపం = వృశ్చికద్వితీయ ద్రేక్కాణ స్వరూపమును, ఉశంతి = చెప్పుదురు.

తా. సర్పములచే జుట్టబడినట్టి శరీరముగలదై తాబేలువంటిదియు, కుండనుబోలినట్టిదియునగు యాకారముగల శరీరముగల స్త్రీయై పెనిమిటికొరకును, సుఖముకొరకును, అనుభవించుటకు దగిన స్థానముకొరకును చింతించుచుండును.

ఈవిధమగు వృశ్చికమధ్యమ ద్రేక్కాణము, (ద్వితీయద్రేక్కాణము) యొక్క స్వరూపమని చెప్పబడినది. ఇదిసర్పయుక్తమును, గురుసక్తమునగు స్త్రీద్రేక్కాణము.

### వృశ్చిక తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. పృథులచిపిటకూర్మతుల్యవక్త్రః శ్వమృగవరాహసృగాలభీతికారీ
అవతి చ మలయాకరప్రదేశం మృగపతిరంత్యగతశ్చ వృశ్చికస్య. 24

టీ. వృశ్చికస్య = వృశ్చికరాశియొక్క, అంత్యగతః = తృతీయద్రేక్కాణము, పృథులచిపిటకూర్మతుల్యవక్త్రః = విస్తీర్ణమై చెవులు గూడి తాబేలువంటి ముఖముగలిగినట్టి యు,

శ్వమృగవరాహస్సృగాలభీతికారీ, తుక్క, జింక, పంది, నక్క, వీనికి భయమును చేయునట్టి, మృగపతిః = సింహమయినదై, మలయాంతరప్రదేశం = శ్రీగంధ వృక్షముయొక్క, ఉత్పత్తి స్థానమును, అవతి = కాపాడుచుండును.

తా. వృశ్చికాంత్య ద్రేక్కాణము (తృతీయద్రేక్కాణము) విస్తీర్ణమగు చెమటతో గూడి కచ్ఛపాకారమును బోలినముఖము గలిగినట్టిదియు, కుక్క, లేడి, పంది, నక్క, అనువానికి భయమునుగలిగించునట్టిదియు, సింహాకారమును దాల్చినదియునై శ్రీగంధవృక్షముయొక్క ఉత్పత్తిస్థానమును రక్షించుచుండును. ఇది కూర్మముఖమును, చతుష్పదమును, చంద్రసక్తమును, సింహాకారమునునైన పురుషద్రేక్కాణము

## ధనుః ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. మనుష్యవక్త్రోశ్వసమానకాయో ధనుర్విగృహ్యాయత మాశ్రమస్థః
క్రతూపయోజ్యాని తపస్వినశ్చ రరక్షపూర్వో ధనుషస్త్రిభాగః. 25

టీ. ధనుషః=ధనుస్సుయొక్క, పూర్వః = మొదటిదగు, త్రిభాగః = ద్రేక్కాణము, మనుష్యవక్త్రః= పురుషముఖుడును, అశ్వసమానకాయః=అశ్వతుల్య శరీరుడునునయి, ఆయతం= దీర్ఘమైన, ధనుః = విల్లును, విగృహ్య = పట్టుకొని, ఆశ్రమస్థః = తపోవనమందున్నవాడై, క్రతూపయోజ్యాని=యజ్ఞోపకరములైనవాటిని, తపస్వినశ్చ= తాపసులను, రరక్ష=రక్షించును.

తా. ధనూరాశియొక్క ప్రథమ ద్రేక్కాణము పురుషముఖము గలవాడును, అశ్వశరీరమువంటి శరీరముగలవాడును నైన పురుషుడై పొడవగు విల్లును ధరించి తపోవనమునందుండువాడై యజ్ఞోపకరణములగు స్రుక్స్రువాదులను, తాపసులను రక్షించుచుండును. ఇది యశ్వశరీరమును, చతుష్పదమును, గురుసక్తమునగు పురుషద్రేక్కాణము.

## ధనుర్ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము:

శ్లో. మనోరమా చంపక హేమవర్ణా భద్రాసనే తిష్ఠతి మధ్యరూపా
సముద్రరత్నాని విఘట్టయంతీ మధ్యత్రిభాగో ధనుషః ప్రదిష్టః. 26

టీ. ధనుషః=ధనుస్సుయొక్క, మధ్యత్రిభాగః =ద్వితీయద్రేక్కాణము, మనోరమా= సంతోషకారిణియు, చంపకహేమవర్ణా=సంపెగపువ్వు, బంగారముల రంగులవంటి కాంతి గలిగినదియు, మధ్యరూపా = సామాన్య సౌందర్యము గలిగినట్టిదియు నగు స్త్రీయై, సముద్రరత్నాని = సముద్రమందున్న మణులను, విఘట్టయంతి = ఒరిపిడిపెట్టుచు, భద్రాసనే=సింహాసనమందు, తిష్ఠతి = కూర్చుండును. అని, ప్రదిష్టః= మునులచేత చెప్పబడెను

తా. ధనూరాశియొక్క మధ్యద్రేక్కాణము (ద్వితీయద్రేక్కాణము) మనస్సునకాహ్లాదము గావించునదియు, సంపెంగ పువ్వుయొక్కయు, బంగారముయొక్కయు, కాంతివంటి కాంతిగలిగినదియు, మిక్కిలి శ్రేష్ఠమును, మిక్కిలి హీనమునుగాని అనగా మధ్యమమైన సౌందర్యముగలదియు నగు స్త్రీయైనదై సముద్రమందున్న మణులను ఒరిపిడి పెట్టుచు

సింహాసనమున కూర్చుండియుండునని ఋషులచేత జెప్పబడినది. ఈశ్లోకమున "కథయన్తి" యనుచోట "విభూషయంతీ" యని కొందరు పఠించి రత్నముల నలంకరించుకొనినదని వ్యాఖ్యానము జేయుదురు. ఇది కుజసక్తమగు స్త్రీద్రేక్కాణము.

## ధనుస్తృతీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. కూర్చీ నరో హాటకచంపకాభో వరాసనే దండధరో నిషణ్ణః
కౌశేయకాన్యుద్వహతేఽజినంచ తృతీయరూపం నవమస్యరాశేః.

టీ. కూర్చీ=పెద్దగడ్డము మీసములుగలవాడును, హాటకచంపకాభః = బంగారమును, సంపంగికాంతులను బోలినవాడును, వరాసనే=ఉత్తమసింహాసనమందు, నిషణ్ణః = కూర్చున్నవాడును, దండధరః=దండాయుధమును ధరించినవాడునునైన, నరః=పురుషుఁడై, కౌశేయకాని=పట్టువస్త్రములను, అజినంచ=మృగచర్మమును, ఉద్వహతే=ధరించుకొనియుండును. నవమస్యరాశేః=తొమ్మిదవరాశియైన ధనస్సుయొక్క, తృతీయరూపం=తృతీయద్రేక్కాణస్వరూపము.

తా. పెంచబడిన మీసములు, గడ్డముగలవాడును, సింహాసనమున గూరుచున్నవాడును, దండాయుధదారియు, పట్టువస్త్రములను, మృగచర్మమును ధరించికొనియుండు పురుషుఁడై యుండునది ధనూరాశియొక్క తృతీయ ద్రేక్కాణ స్వరూపము. ఇది ఆయుధ సహితమును, అర్కసక్తమును నైన నరద్రేక్కాణము.

## మకర ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. రోమచితో మకరోపమదంష్ట్రః సూకరకాయసమానశరీరః
యోక్త్రికజాలకబంధనధారీ రౌద్రముఖో మకరప్రథమస్తు. 28

టీ. మకర ప్రథమస్తు=మకర ప్రథమ ద్రేక్కాణమైన, రోమచితః= వికృతి రోమములుకలవాఁడును, మకరోపమదంష్ట్రః = మొసలి కోరలవంటి కోరలు గలవాఁడును, సూకరకాయ సమానశరీరః = పందిశరీరము వంటి శరీరముగలవాఁడును, యోక్త్రిక జాలకబంధనధారీ=ఎద్దులను గట్టెడుమోకు, వల, సంకెళ్లు, వీనిని, ధరించినవాఁడును, రౌద్రముఖః=క్రోధముఖుఁడునైన, పురుషుఁడునైయుండును.

తా. మకరరాశియొక్క ప్రథమ ద్రేక్కాణము రోమము లధికముగా వ్యాపించిన శరీరము గలవాఁడును, మొసలికోరలవంటి కోరపండ్లు గలవాఁడును, వరాహశరీరమును బోలిన శరీరముగలవాఁడును, ఎద్దులఁగట్టునట్టి మోకు మొదలగుత్రాళ్లు, వల, సంకెలలు అనువాటిని ధరించినవాఁడును, వికృత ముఖమునుగల పురుషుఁడై యుండును. ఇది నిగళసహితమును, చతుష్పదమును శనిసక్తమునగు పురుష ద్రేక్కాణము

## మకర ద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. కలాస్వభిజ్ఞాఽబ్జదళాయతాక్షీ శ్యామా విచిత్రాణిచ మార్గమాణా
విభూషణాలంకృతలోహకర్ణా యోషా ప్రదిష్టా మకరస్య మధ్యే. 29

టీ. మకరస్యమధ్యే = మకరద్వితీయ ద్రేక్కాణము, కళాసు = గీతవాద్యాదులందు, అభిజ్ఞా = నేర్పుగలిగినట్టిదియు, అబ్జదళాయతాక్షీ = తామరరేకులవలె గొప్పకన్నులు గలిగినట్టిదియు, శ్యామా = శ్యామలవర్ణమైనట్టిదియు, విచిత్రాణి = విచిత్రవస్తువులను, మార్గమాణా = వెదకుచున్నట్టిదియు, విభూషణాలంకృత లోహకర్ణా = లోహాభరణములచేత అలంకరింపబడిన చెవులుగలిగిన, రూపా = స్త్రీయని, ప్రదిష్టా = చెప్పబడెను

తా. మకర ద్వితీయ ద్రేక్కాణము గీతవాద్యాది చతుష్షష్టికళల యందు నేర్పుగలిగినట్టిదియు, తామర రేకులనుబోలి వెడల్పగునట్టి కన్నులు గలిగినట్టిదియు, శ్యామవర్ణ శరీరముగలదియు, నానావిధములగు విచిత్రవస్తువుల వెదకుచున్నట్టిదియు, లోహములచేత చేయబడిన భూషణములచే నలంకరింపబడిన చెవులు గలిగినట్టి స్త్రీరూపమని చెప్పబడినది. ఇది శుక్రసక్తమగు స్త్రీ ద్రేక్కాణము.

## మకర తృతీయ ద్రేక్కాణ స్వరూపము

శ్లో. కిన్నరోపమతను స్సకంబళ స్తూణచాపకవచై స్సమన్వితః
కుంభ ముద్వహతి రత్నచిత్రితం స్కంధగం మకరరాశిపశ్చిమః. 30

టీ. మకరరాశిపశ్చిమః = మకరతృతీయ ద్రేక్కాణము, కిన్నరోపమతనుః = కిన్నరులతో సమానమైన శరీరముగలవాడును, సకంబళః = కంబళయుక్తుడును, తూణచాపకవచైః = అంబులపొది, విల్లు, మైజోడు, సమన్వితః = కూడుకొన్న పురుషుడై, రత్నచిత్రితం = రత్నఖచితమై, స్కంధగం = భుజముమీదనున్న, కుంభం = కడవను, ఉద్వహతి = ధరించుచుండును.

తా. మకర తృతీయద్రేక్కాణము కిన్నరులతో సమానమైన శరీరముగలవాడును, కంబళయుక్తుడును, అంబులపొది, విల్లు, కవచము, అను వానిని ధరించినవాడునునైన పురుషుడై రత్నఖచితమగు కుండను భుజముమీద ధరించియుండును. ఇది ఆయుధసహితమై బుధసక్తమగు పురుష ద్రేక్కాణము.

## కుంభ ప్రథమ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. స్నేహమద్య జలభోజనాగమ వ్యాకులీకృతమనా స్సకంబళః
కోశకారవసనోజినాన్వితో గృధ్రతుల్యవదనో ఘటాదిగః. 31

టీ. ఘటాదిగః = కుంభప్రథమ ద్రేక్కాణము, స్నేహ = ఘృతతైలాదులు, మద్య = కల్లు, జల = నీళ్లు, భోజన = భోజనము, వీనియొక్క, ఆగమ = ప్రాప్తిచే, వ్యాకులీకృత = కలతపెట్టబడిన, మనాః = మనస్సుగలవాడును, సకంబళః = కంబళయుక్తుడును, కోశకారవసః = పట్టువస్త్రము గలవాడును, అజినాన్వితః = జింక చర్మముతో గూడినవాడును, గృధ్రతుల్యవదనః = గద్దమొగమువంటి ముఖముగలవాడునునైన పురుషుడై యుండును.

తా. కుంభ ప్రథమ ద్రేక్కాణము ఘృతతైలాదులు, కల్లు, ఉదకము, భోజనము, అనునవి ప్రాప్తించుటవలన కలత పెట్టబడిన మనస్సుగలవాడును, కంబళియుక్తుడును, కాశేయ

వస్త్రమును ధరించినవాడును, కృష్ణాజినమున గప్పుకొన్నవాడును, గద్దవెంగమువంటి ముఖము గలవాడును నైన పురుషుడైయుండును. ఇది శనిసక్త పురుష ద్రేక్కాణము.

## కుంభ ద్వితీయ దేక్కాణ స్వరూపము.

శ్లో. దగ్ధే శకటే సశాల్మలే లోహా న్యాహరతేం గనా వనే
మలినేన పటేన సంవృతా భాండై ర్మూర్ధగతైశ్చ మధ్యమః. 32

టీ. మధ్యమః=కుంభద్వితీయ ద్రేక్కాణము, వనే=అరణ్యమందు, మలినేన=మాసిన, పటేన=చీరచేత, సంవృతా=చుట్టబడినట్టియు, మూర్ధగతైః=శిరస్సుమీదనున్న, భాండైః = భాండములతోడ, (ఉపలక్షితా=కూడుకొన్నట్టి,) అంగనా = స్త్రీయై, దగ్ధే=కాలినట్టియు, సశాల్మలే=బూరుగచెట్లతో గూడినట్టి, శకటే=బండియందు,లోహాని=లోహములను, అహరతే= గ్రహించుచుండును.

తా. కుంభరాశియొక్క మధ్యద్రేక్కాణము (ద్వితీయద్రేక్కాణము) అరణ్యమున మాసిన వలువగట్టికొని శిరస్సున కుండ నొకదానిని యుంచుకొనియుండు యంగనయై కాలినట్టిదియు, బూరుగచెట్లతో గూడినట్టి బండియందు లోహములను గ్రహించునట్టిదియని చెప్ప బడెను. ఇది అగ్నియుక్తమును బుధసక్తమును నగు స్త్రీద్రేక్కాణము.

## కుంభ తృతీయ దేక్కాణ స్వరూపము.

శ్లో. శ్యామ స్సరోమశ్రవణః కిరీటీ త్వక్పత్రనిర్యాసఫలై ర్బిభర్తి
భాండాని లోహావ్యతిమిశ్రితాని సంచారయ త్యంత్యగతో ఘటస్య.

టీ. ఘటస్య=కుంభరాశియొక్క, అంత్యగతః=తృతీయద్రేక్కాణము, శ్యామః = శ్యామవర్ణుడును, సరోమశ్రవణః = చెవులందు వెండ్రుకలుగలవాడును, కిరీటీ = కిరీటము గలవాడునునైన, పురుషుడై, త్వక్పత్రనిర్యాసఫలైః=తోలు, ఆకులు, బంక, పండ్లు, వీనితో గూడ, లోహావ్యతిమిశ్రితాని=లోహమిశ్రితములైన, భాండాని = భాండములను, బిభర్తి = ధరించుచుండును. (అట్టి పాత్రములనే), సంచారయతి = మోసికొని తిరుగుచుండును.

తా. కుంభరాశియొక్క తృతీయద్రేక్కాణము శ్యామలవర్ణుడును, చెవులయందు వెండ్రుకలు గలవాడును, కిరీటముగలిగిన పురుషుడై చర్మము, ఆకులు, బంక, పండ్లు, వీనితో గూడ లోహమిశ్రితములగు భాండములను ధరించి తిరుగుచుండును. ఇది శుక్రసహితమగు పురుష ద్రేక్కాణము.

## మీనప్రథమ దేక్కాణ స్వరూపము.

శ్లో. స్రుగ్భాండముక్తామణి శంఖమిశ్రై ర్వ్యాక్షిప్తహస్త స్సవిభూషణశ్చ
భార్యావిభూషార్థ మపాంనిధానం నావాప్లవత్యాదిగతో ఝషస్య. 34

టీ. ఝషస్య = మీనముయొక్క, ఆదిగతః = ప్రథమద్రేక్కాణము, స్రుగ్భాండః= యజ్ఞోపకరణ పాత్రములు, ముక్తా=ముత్యములు, మణి=రత్నములు, శంఖ = శంఖములు,

మిత్రైః = కలిసినవారిచేత, వ్యాత్తహస్తః = వ్యగ్రహస్తుడును, సవిభూషణశ్చ = ఆభరణయుక్తుడును, భార్యా = పెండ్లముయొక్క, విభూషార్థం = సొమ్ములకొఱకు, అపాంనిధానం = సముద్రమందు, నావా = ఓడచేత, ప్లవతి = పోవుచుండును.

తా. మీనరాశియొక్క ప్రథమ ద్రేక్కాణము యజ్ఞోపకరణ పాత్రములను రత్నములను శంఖములను, బట్టుకొనిన వాడును, ఆభరణములు ధరించిన వాడునునై పురుషుడై భార్యకు గావలసిన సొమ్ములకొఱకై సముద్రమునందు నోడప్రయాణము చేయుచుండును. ఇది గురుసక్తమగు పురుషద్రేక్కాణము.

## మీనద్వితీయ ద్రేక్కాణ స్వరూపము.

శ్లో. అత్యుచ్ఛ్రిత ధ్వజపతాక ముపైతి పోతం
కూలం ప్రయాతి జలధేః పరివారయుక్తా
వర్ణేన చంపకముషా ప్రమదా త్రిభాగో
మీనస్య చైష కథితో మునిభిర్ద్వితీయః. 35

టీ. మీనస్య = మీనముయొక్క, ద్వితీయః = రెండవదియగు, త్రిభాగః = ద్రేక్కాణము, పరివారయుక్తా = సేవకులతోఁ గూడినట్టియు, చంపకముషా = సంపంగిపువ్వుల కాంతినపహరించుచున్న, వర్ణేన = దేహకాంతితో గూడుకొన్నట్టి, ప్రమదా = స్త్రీయైనదై, అత్యుచ్ఛ్రిత = మిక్కిలి ఉన్నతములైన, ధ్వజ = టెక్కెములును, పతాకం = వస్త్రసహితములైన టెక్కెములును గలగిన, పోతం = ఓడను, ఉపైతి = ఎక్కును, జలధేః = సముద్రముయొక్క, కూలం = దరినిగూర్చి, ప్రయాతి = పోవుచుండును, ఏషః = ఇది, మునిభిః = ఋషులచేత, కథితః = చెప్పఁబడెను, (అధ్వజపతాకం = మార్గజనితమైన టెక్కెములు గలిగిన, అనియుఁ జెప్పుదురు.)

తా. మీనరాశియొక్క ద్వితీయ ద్రేక్కాణము సఖీజన పరివృతయు, చంపకపుష్ప కాంతి నపహరింపగల శరీరకాంతి గలదియునగు, స్త్రీరూపమై మిక్కిలి ఉన్నతములును, వస్త్రసహితములునగు టెక్కెములను గలిగిన ఓడనునెక్కి సముద్రతీరమునుగూర్చి పోవుచుండును. అని ఋషులచేత చెప్పబడినది. ఇది చంద్రసక్తమగు స్త్రీద్రేక్కాణము.

## మీన తృతీయద్రేక్కాణ స్వరూపము.

శ్లో. శ్వభ్రాంతికే సర్ప వివేష్టితాంగో
వస్త్రైర్విహీనః పురుషస్త్వటవ్యామ్
చోరానలవ్యాకులితాంతరాత్మా
విక్రోశతేఽంత్యోపగతో ఝషస్య. 36

టీ. ఝషస్య = మీనముయొక్క, అంత్యోపగతః = తృతీయద్రేక్కాణము, శ్వభ్రాంతికే = నేలబొఱ్ఱసమీపమున, సర్పవివేష్టితాంగః = పాములచేత చుట్టబడిన అంగము

ము గలవాఁడును, వస్త్రవిహీనః = దిగంబరుడును, అటవ్యాం = అడవియందు, చోరశిఖిం గలచేతను, నిప్పుచేతను, వికల్పముగాచేయబడిన, మనస్సుగలవాడును నైన, పురుషః = పురుషుడై, విక్రోశతే=ఏడ్చుచుండును, (ఇదిసర్పయుక్తకుజసక్త పురుష ద్రేక్కాణము.)

౩. మీనరాశియొక్క అంత్యద్రేక్కాణము (తృతీయద్రేక్కాణము) నేలయందు గల బొరియలసమీపమున పాములచే జుట్టబడినట్టి శరీరావయవములు గలవాడును దిగంబరుడును, అడవియందు దొంగలచేతను, అగ్నిచేతను, వ్యాకులపడు మనసుగల పురుషుడును నై యేడ్చుచుండును ఇదిసర్పయుక్తమును, కుజసక్తమునునైన పురుషద్రేక్కాణము.

## ద్రేక్కాణ స్వరూప ప్రయోజనము.

ద్రేక్కాణ స్వరూపప్రయోజనము ననుసరించి "ద్రేక్కాణాకారచేష్టాం గుణసదృశఫలంతి యోజయేద్వృద్ధిహేతో ర్ద్రేక్కాణే సౌమ్యరూపే శుభమఫలయుతే రత్నభాండాన్వితే చ సౌమ్యైర్దృష్టే జయస్స్యాత్ ప్రహరణసదృశేపాప దృష్టేచభంగ స్సర్పోహో వాథ ఒ బంధస్సభుజగనిగడే పాపముక్తిపి పాపః" అని సూత్రవిషయమునందు చెప్పబడియున్నది. మరియు చిన్న గ్రంథములందు యీవిషయము విశేషముగ విశదీకరింపబడి యున్నది ఇదియుగాక, "అంశకాద్జ్ఞాయ తే ద్రవ్యం ద్రేక్కాణైస్తస్కరాస్తృతాః రాశిభ్యః కాల దిగ్దేశా వయోజాతిశ్చ లగ్నపాత్" అనిషట్పంచాశిక యందు చెప్పబడియున్నదిగాన చోర రూపస్థానాది పరిజ్ఞానమునకును, వస్తు నిర్దేశమునకు నిదిసాధనమై యున్నది ద్రేక్కాణనిర్దేశము జేసిన వెనుక, ద్రేక్కాణము బలయుక్తముగనుండి స్వాధిపతిచే జూడబడినమాత్రమునసే తత్ఫలము సంపూర్ణముగ జరుగునుగాని బలయుక్తము గాకను, అధినాథునిచే జూడబడకయు నుండునెడల ఫలవ్యతిరిక్తమగును యీవిషయమునకు "ఇతరితో యంస్యగుణస్వభావో ద్రేక్కాణ జాణంగుణవిద్భిక ల్పైః, ద్రేక్కాణకే వీర్యవతి స్వదృష్టే ద్రేక్కాణకల్పంతు ఫలం విదధ్యాత్" అని సారావళీ కారకుడు వచించియున్నాడుగాన బలమును గూర్చించి ఫలితములజెప్ప దగినదని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

| రాసులు. | ద్రేక్కాణములు. | స్వరూపము. |
|---|---|---|
| మేషము | ప్రథమము | ఆయుధ సహితకుజసక్త పురుష ద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | చతుష్పద, అర్కసక్త మృగముఖ స్త్రీ ద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సాయుధ గురుసక్త పురుష ద్రేక్కాణము. |
| వృషభము | ప్రథమము | అగ్ని సహిత శుక్రసక్త, స్త్రీ ద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | చతుష్పదబుధసక్త పురుష ద్రేక్కాణము. |
| ,, | తృతీయము | చతుష్పద శనియుక్త పురుష ద్రేక్కాణము. |
| మిథునము | ప్రథమము | బుధసక్త స్త్రీ ద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | సాయుధ శుక్రసక్తపురుషస్వరూపముగ ద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సాయుధశనిసంయుక్త పురుష ద్రేక్కాణము. |

| రాశులు. | ద్రేక్కాణములు. | స్వరూపము. |
| --- | --- | --- |
| కర్కాటకము | ప్రథమము | చతుష్పదచంద్రసక్త నరద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | భౌమసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సర్పసహిత గురుసక్త నరద్రేక్కాణము. |
| సింహము | ప్రథమము | నరరూప చతుష్పద అర్కసక్తఖగద్రేక్కాణము |
| ,, | ద్వితీయము | సాయుధ గురుసక్త నరద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సాయుధ చతుష్పద భౌమసక్త నరద్రేక్కాణము. |
| కన్య | ప్రథమము | బుధసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | సాయుధశనిసక్త పురుషద్రేక్కాణము. |
| ,, | తృతీయము | శుక్రసక్త స్త్రీద్రేక్కాణము. |
| తులా | ప్రథమము | శుక్రసహిత నరద్రేక్కాణము |
| ,, | ద్వితీయము | నరరూప శనిసక్త ఖగద్రేక్కాణము. |
| ,, | తృతీయము | వానరాకార చతుష్పద బుధసక్త నరద్రేక్కాణము. |
| వృశ్చికము | ప్రథమము | సర్పయుక్త కుజసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | సర్పయుక్త గురుసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | తృతీయము | కూర్మముఖ చతుష్పద చంద్రసక్త సింహాకారపురుష ద్రేక్కాణము. |
| ధనస్సు | ప్రథమము | అశ్వ శరీర చతుష్పద గురుసక్తపురుష ద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | కుజసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సాయుధ అర్కసక్త నరద్రేక్కాణము. |
| మకరము | ప్రథమము | చతుష్పద, నిగళ సహితశని సక్తపురుష ద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | శుక్రసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సాయుధ బుధసక్త పురుషద్రేక్కాణము. |
| కుంభము | ప్రథమము | శనిసక్త పురుషద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | అగ్నియుక్త బుధసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | తృతీయము | శుక్రసహిత పురుషద్రేక్కాణము. |
| మీనము | ప్రథమము | గురుసక్త పురుషద్రేక్కాణము. |
| ,, | ద్వితీయము | చంద్రసక్త స్త్రీద్రేక్కాణము. |
| ,, | తృతీయము | సర్పయుక్త కుజసక్త పురుషద్రేక్కాణము. |

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు

ద్రేక్కాణాధ్యాయనామక

షడ్వింశోధ్యాయము.



శ్రీ ర స్తు.

# బృహజ్జాతకము

## ఆంధ్రటీకా తాత్పర్య సహితము.

### ఉపసంహారాధ్యాయము. సప్తవింశోఽధ్యాయము —27.



అధ్యాయముల వివరము.

శ్లో. రాశిప్రభేదో గ్రహయోనిభేదో వియోనిజన్మాఽథనిషేకకాలః
జన్మాఽథ సద్యోమరణం తథాయుర్దశావిపాకోఽష్టక వర్గ సంజ్ఞః 1

టీ. రాశిప్రభేదః=రాశిభేదాధ్యాయము 1, గ్రహయోనిభేదః = గ్రహయోని భేదాధ్యాయము 2, వియోనిజన్మ=వియోనిజన్మాధ్యాయము 3, అథ=పిమ్మట, నిషేకకాలః= నిషేకకాలాధ్యాయము 4, జన్మ=జన్మాధ్యాయము 5, అథ=అనంతరమందు,సద్యోమరణం=బాలారిష్టాధ్యాయము 6, తథా=అట్లు, ఆయుః=ఆయుర్దాయాధ్యాయము 7, దశావిపాకః=దశావిపాకాధ్యాయము 8, అష్టకవర్గసంజ్ఞః = అష్టకవర్గాధ్యాయము 9.

తా. రాశిభేదాధ్యాయము లేక సంజ్ఞాధ్యాయము 1, గ్రహయోనిభేదాధ్యాయము2, వియోని జన్మాధ్యాయము3, నిషేక కాలాధ్యాయము4, జన్మాధ్యాయము5, బాలారిష్టాధ్యాయము6 ఆయుర్దాయాధ్యాయము7, దశావిపాకాధ్యాయము 8, అష్టక వర్గాధ్యాయము9.

శ్లో. కర్మాజీవో రాజయోగాః ఖయోగా
శ్చాంద్రా యోగా ద్విగ్రహాద్యాశ్చ యోగాః
ప్రవ్రజ్యాఽథో రాశిశీలాని దృష్టి
ర్భావ స్తస్మా దాశ్రయోఽథ ప్రకీర్ణః. 2

టీ. కర్మాజీవః=కర్మాజీవాధ్యాయము 10, రాజయోగాః = రాజయోగాధ్యాయము 11, ఖయోగాః = నాభసయోగాధ్యాయము 12, చాంద్రాయోగాః = చంద్రయోగాధ్యాయము 13, ద్విగ్రహాద్యాశ్చయోగాః = ద్విగ్రహాత్రిగ్రహయోగాధ్యాయము 14, ప్రవ్రజ్యా = ప్రవ్రజ్యాయోగాధ్యాయము 15, అథ=తర్వాత రాశిశీలాని = రాశిశీలాధ్యాయము 16, దృష్టిః=దృష్టిఫలాధ్యాయము 17, భావః = భావఫలాధ్యాయము 18, తస్మాదథ=దానితర్వాత, ఆశ్రయః = ఆశ్రయాధ్యాయము 19, ప్రకీర్ణ = ప్రకీర్ణాధ్యాయము 20.

తా. కర్మజీవాధ్యాయము 10, రాజయోగాధ్యాయము 11, ఖయోగములేక నాభసయోగాధ్యాయము 12, చంద్రయోగాధ్యాయము 13, ద్విగ్రహంత్రిగహయోగాధ్యాయము 14, ప్రవ్రజ్యాయోగాధ్యాయము 15, రాశిశీలాధ్యాయము 16, దృష్టిఫలాధ్యాయము 17, భావఫలాధ్యాయము 18, ఆశ్రయాధ్యాయము 19, ప్రకీర్ణాధ్యాయము 20.

శ్లో. నేష్టా యోగా జాతకం కామినీనాం నిర్యాణం స్యా న్నష్టజన్మద్రుకాణః
అధ్యాయానాం వింశతిః పంచయుక్తా జన్మ న్యేత ద్యాత్రికం చాభిధాస్యే.

టీ. నేష్టాయోగాః = అనిష్టయోగాధ్యాయము 21, కామినీనాంజాతకం = స్త్రీజాతకాధ్యాయము 22, నిర్యాణాధ్యాయము 23, నష్టజన్మ = నష్టజాతకాధ్యాయము 24, ద్రుకాణః = ద్రేక్కాణాధ్యాయము 25, ఈప్రకారముగా, జన్మని = జాతకవిషయమై, పంచయుక్తా = ఆయిదుతోగూడిన, అధ్యాయానాం = అధ్యాయములయొక్క, వింశతిః=ఇరువది, అనగా 25 అధ్యాయములు (ఉక్తా=చెప్పబడెను) యాత్రికం=యాత్రాగ్రంథమందు జెప్పబడిన అధ్యాయ సంగ్రహమును, అభిధాస్యే = చెప్పుచున్నాను.

తా. అనిష్ట యోగాధ్యాయము 22, స్త్రీజాతకాధ్యాయము 23, నిర్యాణాధ్యాయము 24, నష్టజాతకాధ్యాయము 25, ద్రేక్కాణాధ్యాయము 26, యీప్రకారముగ జాతకవిషయమును ఈ బృహజ్జాతకమున జెప్పబడినది.

శ్లో. ప్రశ్నా స్తిథి ర్భం దివసః క్షణశ్చ చంద్రో విలగ్నం త్వథ లగ్న భేదః
శుద్ధిర్గ్రహాణామథవా పవాదో విమిశ్రకాఖ్యంతను వేపనం చ. 4

శ్లో. అతఃపరంగుహ్యక పూజనం స్యాత్స్వప్న స్తత స్స్నానవిధిః ప్రదిష్టః
యజ్ఞో గ్రహాణా మథనిర్గ మశ్చక్రమాచ్ఛ దిష్ట శ్శకునోపదేశః. 5

శ్లో. వివాహకాలః కరణం గ్రహాణాం ప్రోక్తం పృథ క్త ద్విపులాచ శాఖా
స్కంధై స్త్రిభిర్జ్యోతిషసంగ్రహోయం మయాకృతో దైవవిదాంహితాయ.

యీపై శ్లోకములు మూడును ఏతద్గ్రంథోప యుక్తములుగాక పోవుటచేసి అర్థతాత్పర్యములు వ్రాయబడలేదు.

—పూర్వశాస్త్రముల ననుసరించి సంగ్రహించిన విధము.—

శ్లో. పృథు విరచిత మన్యై శ్శాస్త్ర మేత త్సమస్తం
తదను లఘు మయేదం తత్ప్రదిష్టార్థ మేవ
కృత మిహహి సమర్థం ధీవిషాణామలత్వే
మమ యది న స దుక్తం సజ్జనైః క్షమ్యతాం తత్. 7

టీ. ఏతత్సమస్తం = ఈశాస్త్రమంతయు, అన్యైః = ఇతరులచేత, పృథు=బహుళముగ, విరచితం = రచింపబడెను, తదను=తర్వాత, తత్ప్రదిష్టార్థమేవ=పూర్వులగు యితరులు

చెప్పిన అర్థమునను సరించి సంగ్రహముగా, ధీ=బుద్ధియనెడు, విషాణ=కొమ్ముయొక్క, అమలత్వే = నిర్మలీకరణ విషయమందు, సమర్థం=సమర్థమైన, ఇదం=ఈ (బృహజ్జాతకమనెడు) శాస్త్రము, మయా=నాచేత, కృతంహి = చేయబడెనుగదా, ఇహ=దీనియందు (మయా=నాచేత)నసదుక్తంయది, బాగుగాచెప్పబడకుండిన, తత్=అది, సజ్జనైః= సత్పురుషులచేత, క్షమ్యతాం = క్షమింపబడుగాక.

తా. ఈహోరాశాస్త్రము పరాశరాది మహామునులచే జాలవిరివిగా జెప్పబడియుండె నుతదనంతరమున ఆయర్థము గలుగునట్లుగానే సంక్షేపించి బుద్ధియనెడికొమ్ముయొక్క నిర్మలీకరణ విషయమందు సమర్థమైన నీబృహజ్జాతకమనెడు శాస్త్రమునాచేత చేయబడెను. ఈ బృహజ్జాతక గ్రంథమున నాచేత లెస్సగాజెప్పబడకుండ ఏదేనిలోపము లుండునెడల శాస్త్రజ్ఞులగు పండితులు క్షమించి మన్నింతురుగాక.

శ్లో. గ్రంథస్య యత్ప్రచరతో౽స్య వినాశమేతి
లేఖ్యాద్బహుశ్రుత ముఖాధిగ మక్రమేణ
యద్వా మయా కు కృత మల్ప మిహాకృతం వా
కార్యం తదత్ర విదుషా పరిహృత్య రాగమ్. 8

టీ. అస్యగ్రంథస్య=ఈగ్రంథము,ప్రచరతస్సతః=వ్యాప్తిపొందుచుండునపుడు,లేఖ్యాత్ = లేఖకదోషములవలన, యత్=ఏది, వినాశం=నాశమును, ఏతి=పొందునో, ఇహ=ఈశాస్త్రమందు, మయా=నాచేత, యత్=ఏది, కుకృతంవా = దోషయుక్తముగా చేయబడియుండునో, యత్=ఏది, అల్పం=అసంపూర్ణముగా జేయబడియుండునో, యత్=ఏది, అకృతం=చేయబడక యుండునో, తత్=అదియంతయు = అత్ర=ఈవిషయమై, రాగం=మాత్సర్యమును, పరిహృత్య=విడిచి, విదుషా=పండితులచేత, బహుశ్రుతముఖాధిగమక్రమేణ=నానాశాస్త్రవేత్తలగు పూర్వపండితులవలన దెలిసికొన్న విధమున, కార్యం=చేయదగినది.

తా. లేఖక దోషములచేత విడువబడినను దీనియందులెస్సగా జెప్పబడకయున్నను సంపూర్ణముగ జెప్పబడకయున్నను అట్టిదానిని వ్యాజ్జనశ్రేష్ఠులు సంపూర్తి గావింప బ్రార్థించుచున్నాను. బృహజ్జాతక మనెడిగ్రంథము ప్రచారముగలదగుచుండగాలేఖక దోషములవలన నేవిషయములు చెడిపోవునో ఏవిషయము అసంపూర్ణముగా విడువబడునో అట్టివిషయములందంతయు నీవిషయమై మాత్సర్యమును వదలి పండితునిచేత బహుశాస్త్రవేత్తలగు పూర్వపండితుల వలన దెలిసికొనిన క్రమముదప్పక బాగుగ సంపూర్ణము జేయబడినది.

శ్లో. ఆదిత్య దాసతనయ స్తదవాప్త బోధః
కాపిత్థకే సవితృ లబ్ధ వర ప్రసాదః
ఆవంతికో ముని మతా న్యవలోక్య సమ్య
గ్ఘోరాం వరాహమిహిరో రుచిరాం చకార. 9

టీ. ఆదిత్యదాసతనయః = ఆదిత్యదాసుడను వానిపుత్రుడును, తదవాప్తబోధం = ఆయాదిత్యదాసుని వలన పొందబడినజ్ఞానముగలవాడును, కాపిత్థకే = కాపిత్థమనెడు గ్రామమందు, సవితృలబ్ధవర ప్రసాదః = సూర్యునివలన పొందబడిన వరప్రసాదముగలవాడును, అవంతికః = అవంతికాదేశనివాసియునైన, వరాహమిహిరః = వరాహమిహిరాచార్యుడు, మునిమతాని = ఋషిప్రోక్తములైన శాస్త్రములను, అవలోక్య = చూచి, సమ్యక్ = సమగ్రముగ, రుచిరాం = మనోహరమైన, హోరాం = ఈజాతక శాస్త్రమును, చకార = చేసెను.

తా. గ్రంథకర్త స్వపితృనామధేయ ప్రకటన పూర్వకముగ సూర్యవర ప్రసాదము వలన దనకుగలిగిన సకలశాస్త్ర ప్రవీణతాది విషయముల దెలియజేయు క్రమము ఆదిత్యదాసు డనెడు బ్రాహ్మణశ్రేష్ఠుని పుత్రుడును తండ్రియగు నాయాదిత్య దాసునివలననే బొందబడినట్టి జ్ఞానముగలవాడును కాపిత్థమనెడు గ్రామమున సూర్యునివలన బొందబడిన వర ప్రసాదము గలవాడును అవంతికా దేశనివాసియునగు వరాహమిహిరాచార్యులు ఋషిప్రోక్తములగు శాస్త్రములనుజూచి తత్ప్రకారమును సంక్షేపించి పాఠకులకు సులభముగా దెలియదగి యుండుటచేత మనోహరమైన ఈ హోరాశాస్త్రమును చేసెను.

మంగళము.

శ్లో. దినకర ముని గురుచరణ ప్రణిపాతకృత ప్రసాదమతి నేదమ్
శాస్త్ర ముపసంగృహీతం నమోస్తుపూర్వ ప్రణేతృభ్యః. 11

టీ. దినకర = సూర్యునియొక్కయు, ముని = (వసిష్ఠపరాశరాదుల) మునులయొక్కయు, గురు = తండ్రియైన ఆదిత్యదాసునియొక్కయు, చరణ = పాదములయొక్క, ప్రణిపాత = నమస్కారముచేత, కృత = చేయబడిన, ప్రసాద, నైర్మల్యముగల, మతినా = బుద్ధిగలిగిన, మయా = నాచేత, ఇదం శాస్త్రం = ఈశాస్త్రము, ఉపసంగృహీతం = లెస్సగాసంగ్రహింపబడెను, పూర్వ ప్రణేతృభ్యః = పూర్వశాస్త్రకారులకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక,

తా. తనకు వరప్రసాదము గావించిన సూర్యునియొక్కయు వసిష్ఠ పరాశరాదులయొక్కయు తండ్రియగు నాదిత్యదాసునియొక్కయు పాదములకు నమస్కారముచేయుటచేత నైర్మల్యమగు బుద్ధిగలిగినందుచేత ఈ హోరాశాస్త్రము లెస్సగా సంగ్రహింపబడెను. పూర్వ శాస్త్రకారులగు వసిష్ఠపరాశర మాండవ్యాది ఋషుల పాదములకు నమస్కారము చేయుటచే వరాహమిహిరాచార్యుల బుద్ధినైర్మల్యత గాంచెనని నాతనిచేతనే చెప్పబడి యుండుటచే హోరాశాస్త్రము నెఱుంగ దలంచిన వారందరు పూర్వశాస్త్రకారకులగు నా వసిష్ఠ పరాశర మాండవ్యాదులకు నమస్కారము గావింతురుగాత.

ఇది బృహజ్జాతకాంధ్ర టీకా తాత్పర్యమునందు
ఉపసంహారాధ్యాయ నామక
సప్తవింశోధ్యాయము సంపూర్ణము.



**మంత్రతంత్రములు:**— మంత్రరత్నాకరములు, మళయాళమంత్రములు, సమ్మోహన శాస్త్రము, సకలమంత్రోపాసనక్రమము వగైరా.

**వేదాంతములు:**— సీతారామాంజనేయ సంవాదము, శుష్కవేదాంత తమోభాస్కరము, బ్రహ్మవిద్య, కైవల్యనవనీతము, భగవద్గీత, ముముక్షుజనకల్పము, భంవాసేన్ దాసు తత్వములు, వేమనపద్యములు, శివగీత, సుజ్ఞానరత్నావళి వగైరా.

**ఉపనిషత్తులు:**— కొలది రకములు.

**సంస్కృతకావ్యములు, నాటకములు:**— నీతిశాస్త్రములు, భర్తృహరి సుభాషితము, రఘువంశము ఇంకా ఇతరములు.

**వ్యాకరణము, అలంకారము:**— శబ్దమంజరి వగైరా.

**నిఘంటువులు, అమరము:**- ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రపదపారిజాతము, గురుబాలప్రభోధిక వగైరా.

**ఆంధ్రగ్రంధములు:**— అపూర్వ సంఘసంస్కరణము, భారతము, భాగవతము, రామాయణము, గుప్తభావప్రదీపిక, చాటుపద్య మణిమంజరి, శృంగారకంఠాబరణము, శృంగార రసాలవాలము, శృంగార సావిత్రి వ॥.

**శతకములు:**— కవిచౌడప్ప శతకము, కన్యకాంబతారావళి, కాళగుణాదర్శనము అను శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము, పెద్దచ్చు శతకములు, టీకా తాత్పర్య శతకములు వగైరా.

**కథలు, వచనములు:**— నిజమైన కాశీమజలీ కథలు, కాశీరామేశ్వర యాత్రాదర్పణము, తెనాలిరామలింగని వింత కథలు, నలుగురు పకీర్ల కథలు, మదనకామరాజు కథలు మొదలగు చాలారకములు గలవు.

**నవలలు:**— అనురాగవిపాకము, సుశీలా మైనావతి, రాజమ్మండ్రి, బెజవాడ, చెన్నపట్నము వగైరాలు ఎన్నోవందల నవలలు గలవు.

**జీవిత చరిత్రములు:** — ఆసియాఖండ విజ్ఞాన రహస్యములు, దేశనాయకుల చరిత్రలు వగైరా.

**ఆనందమయములు:**— పడకటింటి రహస్యాలు, సతీపతి కుతూహల రహస్యములు వగైరా.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.

డ్రామాలు:- బలిజేపల్లి, పానుగంటి, రామనారాయణ, చక్రావధానులు, కోలాచల, చిలకమర్తి, ద్రోణంరాజు, చెన్నపట్నం, కాకినాడ, బెజవాడ, రాజమండ్రి వగైరా ప్రాంతముల ఎన్నో వందల డ్రామాలుకలవు.

కీర్తనలు:- అధ్యాత్మరామాయణము, కబీరుదాసు, భగవన్నామ, రామదాసు, హరిభజన, హరినామ వగైరా కీర్తనలు.

హరికథలు:- అనసూయ, చంద్రహాస, సావిత్రి, పెద్దదాసు, రుక్మాంగద వగైరాలు.

నాటకములు:- ధర్మాంగద, మైరావణ, నంతవేలూరు, ప్రహ్లాదలు, వీరభద్ర, రామ నాటకములు వగైరాలు.

పదములు:- కుశలాయకం, గంగావివాహము, వైకుంఠమహాత్మ్యం, శారదరామాయణము మొదలగునవి.

జంగంకథలు:- కాంభోజ, కామమ్మ, బొబ్బిలి, బాలనాగమ్మ, కుమ్మరి గుండయ్య వగైరా.

యక్షగానములు:- కపటవేశ్యా నాటకము, రుక్మాంగద, గరుడాచలము వగైరా.

పాటలు:- ఊర్మిళాదేవి. తులసిగోవిందము. పడవపాట, మేలుకొలుపులు. విచిత్ర విడికథ నవాలు. లడ్డూ. పకోడి సంవాదం చెన్నపట్నం. బెజవాడ, రాజమండ్రి. మొదలగునవి.

ద్విపదలు:- బాలభాగవతము. నలచరిత్ర. వగైరాలు.

సంగీతములు:- గాయనగాయనీయ పారిజాతము. సంగీతసర్వార్థ సారసంగ్రహము, గానవిద్యావినోదిని. గట్టుపల్లివారివి మొదలగునవి.

వైద్య గ్రంథములు:- బాహటము. చింతామణి. ప్రసిద్ధఆంగ్లేయఔషధయోగములు, వైద్యనిఘంటువులు. శుశ్రుతశారీరస్థానం చెన్నపట్నం, రాజమండ్రి. బెజవాడ తదితర ప్రాంతముల వైద్య గ్రంథములు చాలకలవు.

జ్యోతిషగ్రంథములు:- కాలచక్రం, బృహజ్జాతకం, చెన్నపట్నం, బెజవాడ. రాజమండ్రి. కాకినాడ తదితర ప్రాంతముల వగైరా ఎన్నో కలవు.

ఆట్టలు, పాకశాస్త్రములు, ఫార్సులు. వర్తక మర్మములు మొదలగునవి.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ. బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురామయ్యగారి సందు;
బుర్జుపేట. విశాఖపట్నము.

